AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.










శాంతా వసంతా ట్రస్ట్, హైదరాబాద్ వారి సౌజన్యంతో

## ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట

## సిద్ధిపేట జిల్లా, తెలంగాణ

# కమనీయం తెలుగు రామాయణం

## జాతీయ సదస్సు

20,21 నవంబర్ 2023



**ఔచిత్యమ్ అంతర్జాల తెలుగు పరిశోధన మాసపత్రిక ప్రత్యేక సంచిక**

(UGC-CARE Listed Journal | ISSN: 2583-4797)

December - 2023 (Volume-4, Issue-15) Special Issue : డిసెంబర్-2023 (సంపుటి-4, సంచిక-15) ప్రత్యేకసంచిక

## నిర్వహణ

## కె.వి.రాఘవాచార్య స్మారక సాహిత్య పీఠం & మల్లినాథసూరి తెలుగుశాఖ

## ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట

AUCHITHYAM
UGC-CARE Listed Journal, ISSN: 2583-4797
(UGC-CARE Journal under GROUP 1 in Arts and Humanities Discipline)
Link to UGC-CARE list: CLICK HERE

# జాతీయ సదస్సు ప్రత్యేక సంచిక

# "కమనీయం తెలుగు రామాయణం"

ఔచిత్యమ్ - అంతర్జాల తెలుగు పరిశోధన మాసపత్రిక ప్రత్యేక సంచిక




## మల్లినాథసూరి తెలుగుశాఖ

ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయం ప్రతిపత్తి)

సిద్ధిపేట, తెలంగాణ.



**సంపాదకులు**

**డా. రాజిరెడ్డి మహేందర్ రెడ్డి**

సహాయాచార్యులు, తెలుగుశాఖ.

**సంపత్ కుమార్ బానోజి**

తెలుగు ఉపన్యాసకులు

AUCHITHYAM
UGC-CARE Listed Journal, ISSN: 2583-4797
(UGC-CARE Journal under GROUP 1 in Arts and Humanities Discipline)
Link to UGC-CARE list: CLICK HERE

కమనీయం తెలుగురామాయణం – జాతీయసదస్సుప్రత్యేకసంచిక

December-2023 (Volume-4, Issue-15)– Special Issue: డిశంబర్-2023 (సంపుటి-4 సంచిక-15)– ప్రత్యేకసంచిక

# Table of Contents - విషయసూచిక

ఔచిత్యమ్
WWW.AUCHITHYAM.COM

AUCHITHYAM
UGC-CARE Listed Journal, ISSN: 2583-4797
(UGC-CARE Journal under GROUP 1 in Arts and Humanities Discipline)
Link to UGC-CARE list: CLICK HERE




AUCHITHYAM

ISSN: 2583-4797

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_editorial.php

# "కమనీయం తెలుగు రామాయణం"

***జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక***

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

## <u>సంపాదకీయం</u>

**"రామ రామయన్న రారాదు పాపమ్ము**
**రామరామయన్న రాదు భయము**
**రామరామయన్న రాబోదు మృత్యువు**
**రామనామమమృత రాశి యగును"**

తెలంగాణరాష్ట్రము ఉమ్మడి మెదక్ జిల్లాలో 1956లో ఏర్పడ్డ **ప్రభుత్వ డిగ్రీకళాశాల** (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, తెలుగువిభాగానికి ఘనమైన చరిత్ర ఉంది. శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తి గారి నుండి డా. నందిని సిధారెడ్డి వరకు ఎందఱో మహనీయులు తెలుగు విభాగానికి అధ్యక్షులుగా ఉండి విద్యార్థుల్లో మంచి లక్షణాలు పెంపొందించడానికి వివిధ అంశాలపైన సదస్సులు, కార్యశాలలు నిర్వహించడం జరిగింది. తెలుగు విభాగానికి అనుబంధంగా విలువైన గ్రంథాలతో **"శ్రీ KV రాఘావాచార్య స్మారక సాహిత్యపీఠం- పరిశోధన కేంద్రం"** ఉంది. తెలుగువిభాగం ఆధ్వర్యంలో "**శాంతా-వసంతా ట్రస్ట్**" హైదరాబాద్ వారి ఆర్థికసహకారంతో **2023, నవంబర్ 20 & 21** తేదీలలో "**కమనీయం తెలుగు రామాయణం**" రెండురోజుల జాతీయసదస్సు నిర్వహింపబడింది.

రామాయణం రసవత్కావ్యం. ఆదర్శజీవనవిధానానికి, సక్రమధర్మాచరణకు నిలువెత్తు నిదర్శనం. అన్నదమ్ముల ఆత్మీయత, ఆదర్శదాంపత్యజీవనం, ఇచ్చిన మాటకు కట్టుబడడం, శరణు కోరిన వారిని రక్షించడం, దుష్టశిక్షణ-శిష్టరక్షణ, కరుణరసభావన... ఇలా సకలగుణసంపన్న, సల్లక్షణవారాశి రామాయణం. వాల్మీకివిరచిత సంస్కృతరామాయణానికి ప్రపంచవ్యాప్తంగా అనేకభాషల్లో అనువాదాలున్నాయి. తెలుగునాట 12వ శతాబ్దిలో గోనబుద్ధారెడ్డి 'రంగనాథరామాయణం' మొదలుకొని నేటి వరకు వందలాది తెలుగు రామాయణాలు వచ్చాయి. కథలో మార్పు లేకున్నా కథనంతో నిత్యనూతనమై అందరినీ అలరిస్తుంది రామాయణం. తెలుగు సాహిత్యంలో పద్యము నుండి మినీకవిత వరకు అన్ని ప్రక్రియల్లో రామాయణం వెలువడింది. జానపద- గేయాల్లో, కోలాటం పాటల్లో, స్త్రీల పాటల్లో రామాయణ సంబంధిత కథాంశాలు విరివిగా కనిపిస్తాయి.

ఉదాత్తమైన ఆదర్శజీవనానికి మార్గంవేసిన వాల్మీకి రామాయణ ఇతిహాసాన్ని కవులు ఎవరికి తోచినట్టు వారు ఎవరికి నచ్చిన ప్రక్రియలో వారు అనువాదం చేశారు. తెలుగులో రాసిన కవులు యథాతథంగా కాకుండా, భక్తితోనో, కవితానురక్తితోనో రామాయణానికి వినూత్నకల్పనలను జోడించి రాశారు. సమాజాన్ని మిక్కిలి ప్రభావితం చేసే చలనచిత్ర రంగంలో కూడా మూకీ చిత్రాల కాలం నుండి నేటి అధునాతన సాంకేతిక నైపుణ్యాలతో కూడిన చిత్రాల వరకు రామాయణ సంబంధ సినిమాలు వస్తూనే ఉన్నాయి. ఆధునికకాలపు చలనచిత్ర కల్పనలు ప్రేక్షకాదరణకోసం అవాల్మీకాలను మరింత ప్రచారం చేశాయి. రామాయణ కావ్యానికి వన్నెతెచ్చేందుకు చేసిన ఈ నవ్యకల్పనలు వాస్తవాలన్నంతగా ప్రజల్లో ప్రచారం అయ్యాయి.

వాల్మీకి రామాయణాన్ని అనువాదం చేసే సందర్భంలో చేర్చబడ్డ కల్పనలు, ప్రక్షిప్తాల వలన రామాయణ అంతరార్థం పక్కదారి పట్టి కల్పవృక్షంగా ఆదరించబడిన రామాయణం కొందరికి విషవృక్షం అయింది. తెలుగురామాయణాలలో అవాల్మీకాలు, ప్రక్షిప్తాలు, వాటి వెనుక ఉన్న కారణాలు, వాస్తవంగా రామాయణంలో అందించబడిన విలువలు ఇత్యాది అంశాల గురించి చర్చ జరిపి సమాజంలో మానవీయవిలువలు సన్నగిల్లుతున్న వర్తమానసందర్భంలో నేటి తరానికి రామాయణం నేర్పించిన ధర్మాచరణ మార్గాన్ని, మానవీయవిలువలను అందజేసే ఉద్దేశ్యంతో "**కమనీయం తెలుగు రామాయణం**" సదస్సును ఏర్పాటు చేయడం జరిగింది. సదస్సు నిమిత్తం పరిశోధకులు, అధ్యాపకుల నుండి వచ్చిన వ్యాసాలన్నీ పరిశీలించి, ప్రచురణయోగ్యమైన వ్యాసాలను "**ఔచిత్యమ్**"- అంతర్జాల తెలుగు పరిశోధనమాసపత్రిక" యాజమాన్యం అంతర్జాలప్రత్యేకసంచికగా వెలువరిస్తు-న్నందుకు వారికి శతనమస్సులు.

ఈ వ్యాసాలన్నీ రామాయణసంబంధాలే అయినా విభిన్నాలు. భారత, భాగవతాది ఇతిహాస, పురాణాల నుండి కావ్యాల్లో, కీర్తనలలో అంతర్భాగంగా వచ్చిన రామాయణ విశేషాలు తెలుపబడ్డాయి. జానపదము, కావ్యము, ప్రబంధము, వచనము, యక్షగానము, వ్యాకరణము, రవ్వలు ఇలా అన్ని ప్రక్రియల్లో వెలువడ్డ రామాయణవిశేషాలు ఉన్నాయి. తెలుగురామాయణలలోని అలంకార, వర్ణనావైచిత్రితో పాటు ఇతివృత్త సంబంధ అలంకరణల గురించి కొత్త విషయాలు తెలిపారు. రామసక్కదనం, సీతమ్మచెర వంటి పలుకుబళ్ళు, సామెతలతో జనతాత్వికతలో రామాయణ సంబంధ విశేషాలు తెలుపబడ్డాయి.

కావ్య అవతరికల్లో, శ్రీకారపద్యాల్లో, సినిమాపాటల్లో వచ్చిన రామాయణవిశేషాల గురించి, రామాయణంలో పాత్రలు, మనస్తత్వాలు నేటి తరానికి అవి అందించే ఆదర్శాల చర్చలు ఉన్నాయి. తెలుగురామాయణాల్లో చేర్చబడ్డ అవాల్మీకాంశాలు, వాటి వెనుక ఉన్న కారణాలను విశ్లేషించడం జరిగింది. తెలుగువారికి జ్ఞానపీఠ్ పురస్కారాన్ని అందించిన విశ్వనాథ వారి శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో జీవుని వేదన నుండి రమ్యరమణీయ దృశ్యవర్ణనల గురించి విపులమైన విశేషాలు ఉన్నాయి. వాల్మీకి రచనాకాలం నుండి నేటి వరకు రామాయణము సమకాలీనత, సార్వకాలీనత గురించిన సమగ్రసమాచారం ఈ వ్యాసాల్లో కనిపిస్తుంది.

ఈ సంచిక కోసం పరిశోధనపత్రాలు పంపినవారిలో విద్యార్థులు, పరిశోధకులు, అధ్యాపకులు, బోధనేతరరంగాలకు చెందిన వారు ఉన్నారు. వారందరికీ నమస్సులు. తీపివంటకాలు ఎన్నున్నా మూలపదార్థమైన పంచదార ఒకటే అయినట్టు రామాయణ ఇతివృత్తము ప్రధానాంశముగా వెలువడ్డ ఈ వ్యాసాలన్నీ నేటి తరానికి ఆచరణీయమైన ఆదర్శజీవనవిలువలను అందిస్తాయని ఆశిస్తున్నాము.

**శ్రీరామ శరణం మమ.**

**ప్రత్యేకసంచిక సంపాదకులు**

**డా. రాజిరెడ్డి మహేందర్ రెడ్డి & సంపత్ కుమార్ బానోజి**

మల్లినాథ సూరి తెలుగు శాఖ,

ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట.

# కృతజ్ఞతలు

ఈ సదస్సు నిర్వహణకు సహకరించిన కళాశాల ప్రిన్సిపల్ **ఆచార్య. సి.హెచ్. ప్రసాద్** గారికి, మల్లినాథసూరి తెలుగుశాఖాధిపతి **డా. ఎస్. మహేందర్** గారికి, కళాశాల **బోధన, బోధనేతర సిబ్బందికి** కృతజ్ఞతలు. ఇక సదస్సు నిర్వహణకు ప్రోత్సహించి అండగా నిలచిన **గరిపల్లి అశోక్** గారికి, ఆర్థిక సహకారాన్ని అందించిన "**శాంతా వసంతా ట్రస్ట్, హైదరాబాద్**" వారికి, మేము చేసే కార్యక్రమాలన్నింటికీ తమ సహాయసహకారాలందించే **డా. కె.వి. రమణాచారి** గారికి, సకాలంలో తమ **పరిశోధన పత్రాలను సమర్పించిన వ్యాసకర్తలకు**, సహృదయముతో సలహాలు, సూచనలు చేస్తూ, సకాలంలో సంచికను ప్రకటించిన **"ఔచిత్యమ్" యూజీసీ-కేర్ లిస్టెడ్ జర్నల్** ప్రధానసలహాదారు **డా. రాంభట్ల వేంకటరాయశర్మ** గారికి, ప్రధానసంపాదకులు 'శతావధాని' **డా. రాంభట్ల పార్వతీశ్వరశర్మ** గారికి, "ఔచిత్యమ్" **పత్రికాసంపాదకవర్గానికి** ప్రత్యేకకృతజ్ఞతలు.

- *ప్రత్యేకసంచిక సంపాదకులు*

**డా. రాజిరెడ్డి మహేందర్ రెడ్డి & సంపత్ కుమార్ బానోజి**

మల్లినాథ సూరి తెలుగు శాఖ,

ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట.



AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_01.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)

# 1. శ్రీమదాంధ్రమహాభారతం: రామకథ

**డా. కె.యన్.వి.వి.యస్. నారాయణమూర్తి**
అసోసియేట్ ప్రొఫెసర్, తెలుగుశాఖ,
బి.జే.ఆర్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, నారాయణగూడ,
హైదరాబాద్ - 500029, తెలంగాణ.
సెల్: +91 9866542365. Email: knvvsmurthy@gmail.com

**వ్యాససంగ్రహం:**

*భారతంలో రామాయణం ఉండడంతో, నేటికాలపు ఆధునికతరానికి రెండింటిలో పూర్వాపరాలు తెలియని పరిస్థితి ఏర్పడే ప్రమాదం పొంచి ఉంది. వేదధర్మంలోని అనేక అంశాలను వ్యాసులవారు భారతంలో పొందుపరిచారు. భారతం పంచమవేదంగా కీర్తి పొందింది. వేదసమమైన రామాయణగాథను సైతం వ్యాసులవారు భారతంలోని సందర్భావసరాన్ని గ్రహించి అరణ్యపర్వంలో పొందుపరిచారు. కవిత్రయం భారతాంధ్రీకరణలో ఆ మార్గాన్నే అనుసరించారు. అయితే అరణ్యపర్వరచన చేసిన ఎఱ్ఱన కొంత స్వతంత్రత చూపడం విశేషం. ఎఱ్ఱన అరణ్యపర్వ రచనలోని ప్రత్యేక అంశాలను అందించడం ఈ వ్యాసంలోని అంశం.*

**Keywords:** శ్రీరామాయణం, శ్రీమదాంధ్ర మహాభారతం, అరణ్య పర్వం, ఎఱ్ఱన, కవిత్రయం, అవాల్మీకాంశాలు.

## 1. ఉపోద్ఘాతం:

శ్రీమదాంధ్రమహాభారత నిర్మాణం, కవిత్రయ సృష్టి. పురుషోత్తమాంబుజభవ శ్రీ కంధరులైన నన్నయతిక్కన ఎఱ్ఱనలను రాఘవపాండవీయంలో పింగళి సూరన రామాయణ భారతాలను శబ్దార్థగౌరవసమృద్ధి మరియు విశుద్ధితో ఆంధ్రీకరించిన మహాత్ములుగా, కావ్యపీఠిక పద్యం 4 లో ప్రస్తుతించి ఉన్నాడు.

**"నన్నయ్య రాఘవాభ్యుదయం అనే పేరుతో రామాయణాన్ని ఆంధ్రీకరించాడని ఒక లక్షణ గ్రంథంవల్ల తెలుస్తుందని రావూరి దొరసామి శర్మ వివరించినా"** (రామకథ, పుట.36) ఆ వివరాలు అలభ్యం. నన్నయ్య భారత భాగంలో అరణ్య పర్వంలో మూడుచోట్ల రామాయణ కథా స్మరణ ఘట్టాలున్నాయి. మొదట అరణ్య పర్వ

ద్వితీయాశ్వాసంలో సకలతీర్థకీర్తనంలో నారదుడు ధర్మజునకు ''**...పురు, పురూరవులట్లు భగీరథ రఘుపతు-లయట్లు కృతకృత్యుడవై - ధారుణి రక్షింపుము**'' (ఆ.మ.భా - అర. ప. ఆ. పుట. 64) అని వివరించే ఘట్టం ఉంది. రెండవ సందర్భంగా, అరణ్య పర్వ తృతీయాశ్వాసంలో, రోమశుడు ధర్మరాజుకు ఋష్యశృంగ చరిత్రాన్ని వివరించే ఘట్టంతో, ఇక మూడవ సందర్భంగా మళ్ళీ మూడవ ఆశ్వాసంలోనే భీముడు సౌగంధికాపుష్ప నిమిత్తమై పోవుచుండగా మార్గంలో కనిపించిన హనుమకు, రామగాథను ఒక దృష్టాంతం లాగా వివరిస్తాడు. అలాగే ఆశ్వాసాంత గద్యలో సైతం రామాయణగాధా ప్రస్తావన చోటు చేసుకున్నది.

ఇక తిక్కన సోమయాజి విరచిత నిర్వచనోత్తరరామాయణం జగత్ప్రసిద్ధం.

ఎఱ్ఱన ప్రబంధ పరమేశ్వరుడు భారతారణ్య శేష రచనతోపాటుగా రామాయణ రచన చేసినట్లు లాక్షణికుల గ్రంథాలలో (కూచిమంచి తిమ్మకవి-సర్వ లక్షణ సార సంగ్రహం) ఉన్న వివరాలను వేటూరి వారు వివరించిన సందర్భాన్ని వేలూరి శివరామశాస్త్రి గారు హరివంశ పీఠిక చెప్పారు.

అదే విధంగా ఎఱ్ఱన రామాయణ రచన చేసిన విషయాన్ని ముదిగొండ శివప్రసాద్ గారు సైతం స్పష్టంచేశారు.

కవిత్రయంలో కవనంలో అగ్రేసర గౌరవం పొందిన ఎఱ్ఱన రామగాథపైన ప్రీతితో, తన మొత్తం అరణ్య పర్వ శేష రచనలో పదహారు వందల గద్య పద్యాలు వినియోగించగా అందులో ఇరవై శాతానికి దాదాపుగా రామకథ కోసం కేటాయించడం ఒక విశేషం.ప్రస్తుత వ్యాసం 'భారతంలో రామాయణం' ఎఱ్ఱన రచనను విశేషంగా పరిశీలించడం అనే లక్ష్యం కలది.

## 2. ప్రస్తావన :

'భ' అనగా కాంతి. కాంతిని ఆరాధించువారు, ఆరాధనలో రమించువారు భారతీయులు. వైదిక ఋషులు, అమూల్య ఋక్కులతో ఛందస్సులతో వేదాన్ని అందిస్తే, వేదోప బృంహణంగా, వెలసిన రామకథ ఆదికావ్యమై అపురూపమైన పాత్ర పోషణతో, సుందర వర్ణనలతో అద్భుత కథా సంవిధానంతో భూమిమీద ఎంతవరకు నదులూ, కొండలు ఉంటాయో అంతవరకు లోకంలో సజీవమై ఉంటుంది అని మహర్షి వాల్మీకి భావన. కాలక్రమేణా రామగాథపై ప్రేమతో పలువురు కథకులు, కవులు, వాల్మీకి కథనానికి తమకు తోచిన మార్పు, చేర్పులు చేసి రామభక్తిని చాటుకున్నారు. ఈ క్రమంలో ఎఱ్ఱన కూడా తక్కువేమీ కాదు.

**"కనియెన్ గోమల నీలమేఘ సుభగా కారున్ జటావల్కలా**
**జిన ధారున్ సితభూతి భూషితుని రాజీవాక్షు గల్యాణ కీ**
**ర్తును గాకుత్థ ప్రదీపకుని సీతాలక్ష్మణోపేతు స**
**న్మని లోకార్చితు సత్కృపా భరణ రామున్ రాజ చూడామణిన్**" (ఆ. మ. భా - అర. ప. ఆ. పుట. 309)

ఎఱ్ఱన రాముని భస్మధారిగా వర్ణించడం గమనిస్తే నాటి సాంఘిక, రాజకీయ పరిస్థితులు, అవసరాలను కూడా మనం అంచనా వేయవచ్చు.

### 3. రచనావైశిష్ట్యం :

సంస్కృత భారతంలో ఏడువందల ఇరవై ఏడు శ్లోకాలలో ఉన్న రామకథను ఎఱ్ఱన మూడు వందల పదమూడు గద్య పద్యాలలో ఆంధ్రీకరించాడు.

ఇందులో రామకథ శ్రీరామ జననంతో ఆరంభమైంది. అలాగే రావణాదుల జనన క్రమం, వారి పరాక్రమాదులు, వారి నణచుటకై చతుర్ముఖాదులు చేసిన యత్నాలు వివరంగా ప్రారంభంలోనే వర్ణించబడ్డాయి. ఈ రావణ జనన వృత్తాంతం, కొంత వాల్మీకి రామాయణంతో విభేదిస్తుంది. వాల్మీకి రామాయణంలో పులస్త్యుని పుత్రుడైన విశ్రవసువుకు భరద్వాజుని పుత్రిక 'దేవవర్ణిని' వలన వైశ్రవణుడు (కుబేరుడు), సుమాలి పుత్రికలైన కైకసి, పుష్పోత్కట పాకల వలన రావణ, కుంభకర్ణ, శూర్పణఖలు జన్మించారు.

పులస్త్యుని పుత్రుడైన వైశ్రవణుడు తండ్రిని విడిచి బ్రహ్మను గూర్చి తపస్సు చేసి 'నల కూబరుడను' పుత్రుని, లోకపాలకత్వం, లంకాధిపత్యం, ధనేశ్వరత్వం, ఈశ్వర సఖ్యం అనే వాటిని వరాలుగా పొందాడు. ఆగ్రహించిన పులస్త్యుడు తన శరీరంలో అర్ధభాగాన్ని విశ్రవసువుగా చేసి వైశ్రవణునకు హాని చేయమన్నాడు. దానితో వైశ్రవణుడు విశ్రవసుని సమీపించి అతనికి పుత్రునిగ ఉందునని సమ్మతపరచి పుష్పోత్కట, మాలిని, పాక అను సుందర స్త్రీలను పరిచారికలుగా అతనికై నియోగించగా, వారిలో పుష్పోత్కటకు రావణ కుంభకర్ణులు, మాలినికి విభీషణుడు, పాకకు ఖర శూర్పణఖలు జన్మించినట్లు వర్ణించాడు.

ఎఱ్ఱన రామకథలో బ్రహ్మ 'దుందుభి' అను గంధర్వ స్త్రీని పిలిచి నీవు కుబ్జ రూపంలో 'మంధర' అను పేర భూలోకంలో జన్మించి నీ నేర్పు విధంబున దేవకార్యంబులు నిర్వహింపుమని' చెప్పినట్లు వర్ణించాడు. పుత్ర కామేష్ఠి, శివధనుర్భంగాలు ఇందులో లేవు. కేవలం '**రామునకు విదేహ రాజ నందనయైన సీత ప్రియాంగన యయ్యె**' అని మాత్రము ఉంది. కైక కోపగృహంలో ధూళి ధూసరితాంగయై అలుక వహింపక, సర్వాభరణ భూషితాంగయై దశరథుని చేరి "**ధరణీశ తొల్లి నాకుం...**" (ఆ.మ.భా - అర. ప. ఆ. పుట.299) అని అడగగా ఈ సంగతి తెలిసి రాముడు దశరథాదులను చూడకుండానే అడవులకు వెళ్ళిపోతాడు.

ఇక కథాకథన విధానంలో కామ్యకవనంలో బ్రాహ్మణ బృందంతో ఉన్న ధర్మరాజు వద్దకు మార్కండేయుడు రాగా, అనుజ సహితుడై నమస్కరించి, సైంధవుడు పాంచాలికి చేయ యత్నించిన దుర్వ్యవసాయం, వానిని 'బరిభవించుటకు' తాము పడిన 'ఆయాసము' వివరించగా, ఆ మునివరుడు, ధర్మరాజును సంబోధించి రఘురాముడు పూర్వము ఇంతకన్నా ఎక్కువగా బాధపడినవాడు. జానకి, రావణునిచే అపహరించబడగా

వానరులచే సహాయము పొంది, వారధిని నిర్మించి, దివ్య బాణములతో దశగ్రీవుని చంపి **'అకిల్బిష రాజ్య విభూతిని పొందినవాడు'** కదా అని చెప్పగా విని ధర్మజుడు: ''**రాముండెవ్వని వంశంబున వాడు, రావణుండెవ్వని తనయుండేమి నిమిత్తంబు సీతాపహరణంబు సేసె, రామ రావణులకు సంగ్రామం బెట్లు వర్తిల్లెం జెప్పవేయని రామాయణ కథా శ్రవణ కుతూహలియై**'' (ఆ.మ.భా-అర. ప. ఆ. పుట. 267) అడగగా, మార్కండేయుడు, ధర్మజునకు రామకథను వివరిస్తాడు. ఇది ఆరంభం. రెండు పద్యాలలో రామ జననం చెప్పి, ఆ పై రావణ జననాన్ని ఎఱ్ఱన వర్ణించాడు. ఇతర రామాయణాలలో వలె ఇందులో రాముడు విష్ణ్వంశ సంభూతుడు గాక ప్రశస్త చరితుడైన దశరథునికి కౌసల్య యందు రాముడుదయించినట్లు మాత్రమే వర్ణితం. ఇది యథా వాల్మీకం. రాముని ఒక ఉత్తమ మానవునిగా వాల్మీకి చిత్రించాడే కాని సాక్షాత్తు విష్ణువని యెక్కడా వాచ్యం చేయలేదు. అక్కడక్కడా రాముడు విష్ణువు అవతారమని చెప్పినా అవి సకృత్తుగా ఉండి ప్రక్షిప్తాలని పండితులభిప్రాయపడినారు. రాజ్యం పోయి, భార్యపోయి, అడవుల పాలై, శత్రువులు దాపురించి నానాబాధలు పడి ఎంత కష్టం వచ్చినా రాముడు తాను పరమేశ్వరుడు అనే భావాన్ని చూపి కష్టాన్ని నిగ్రహించలేదు. వాల్మీకి మహర్షి ఆ విధంగా వ్రాస్తే రామాయణం మరో అధ్యాత్మ రామాయణమయ్యేది.

### 4. అవాల్మీకాంశాలు :

అయితే వాల్మీకి రామాయణంలో లేని చాలా అంశాలను ఎఱ్ఱన్న ఇందులో నిక్షేపించాడు.

1. రావణ కుంభకర్ణాదుల పూర్వజన్మ వృత్తాంతం
2. మంథర కారణ జన్మురాలు అని చెప్పడం
3. వాలి సుగ్రీవులు యుద్ధం చేస్తుండగా హనుమంతుడు సుగ్రీవుని హారాలంకృతుని చేయడం
4. త్రిజటా స్వప్న వృత్తాంతంలో అవింధ్యుడనే రాక్షసుని వృత్తాంతం
5. రామ పరాక్రమం పిదప ఇంద్రజిత్తు తండ్రిని ఊరడిరచడం
6. యుద్ధరంగ వ్యూహ నిర్మాణం
7. వారధి నిర్మాణ సమయంలో ఓడల ప్రస్తావన -మొదలైనవి

భారతాంతర్గత రామాయణ కథలో రావణ విభీషణ జన్మ వృత్తాంతాలతో పాటు వారు తపస్సు చేసి అందులో రావణుడు తన శిరసులను అగ్నిలో వేల్చి బ్రహ్మను మెప్పించి వరాలను పొందడం వర్ణితం. ఆ వరంతో గర్వోన్నతుడై జగద్రావణం చేసి రావణుండనే పేర ప్రఖ్యాతి పొందినవాడు రావణుడు. ఆ రావణుని సంహరించడానికి బ్రహ్మ దుందుభి అనే గంధర్వ కామినిని పిలిచి కుబ్జరూపంలో మంథర అనే పేరుతో భూలోకంలో జన్మించుమని ఆజ్ఞాపించడం యఱ్ఱనోపజ్ఞకం.

రాముని పట్టాభిషేక వార్త విన్న వాల్మీకి రామాయణ 'కైక' ఆనందించి, అందులో విద్దూర మేమున్నదని అనుకొనగా, ఎఱ్ఱన 'కైక' తనకు తానుగా వరాలను ఇమ్మని వేడుకొన్నది. ఈ కథలో మంథర ప్రమేయమే లేదు. కోపగృహాది వ్యవహారాలిందు లేవు.

వాల్మీకి రామాయణ సీతాపహరణ ఘట్టంలో రావణుని ఉద్దేశ్యం సీతా సౌందర్య పిపాస. భారతాంతర్గత రామకథలో సీతాపహరణంలో రావణుని ఉద్దేశ్యం: "**ప్రియా విరహ దుర్మనస్కుండై యతడు చెడిపోవునని**" (ఆ.మ.భా-అర. ప. ఆ. పుట.554) లంకలోని సీతకు రామాదుల వార్త ఆంజనేయుని ఆగమనం వరకు తెలియదు. ఎఱ్ఱన మాత్రం అవింధ్యుడను ఒక వృద్ధ రాక్షసుని చేత రామ హితాన్వేషి త్రిజటతో, రాముని యోగక్షేమాలను సీతకు తెలియజేస్తాడు. ఈ అవింధ్యుడు రెండు సార్లు ఎఱ్ఱన రామకథలో దర్శన మిస్తాడు. రావణ వధానంతరం అవింధ్యుడు విభీషణ సహితుడై 'జానకి నుచితయానంబున నునిచికొని రామదేవు పాలికిందెచ్చి' స్వీకరింపుమని కోరుతాడు.

వాల్మీకీయంలో సముద్రునిపై రోషావిష్టుడైన రాముని, శరధిరాజు శరణు వేడి వారధి నిర్మించు కొనమని తెలుపుతాడు. కాని ఎఱ్ఱన 'సముద్రుడు' : "**వినుము నా వాక్యంబు జనులెల్ల నెఱుగ నీకిత్తడి నే దెరువిత్తునేని..**' '(ఆ.మ. భా-అర. ప. ఆ. పుట. 588) అని తనకు రానున్న కష్టాల్ని వివరిస్తాడు.

యుద్ధరంగంలో రామునికి మాతలి రథము తెచ్చి సహాయపడడం తప్ప ఇంకెవరో ప్రత్యక్ష సహాయం చేసినట్లు లేదు కానీ ఎఱ్ఱన మాత్రం శ్వేతుడను గుహ్యకుడు (నాగ ప్రసిద్ధుడు) దివ్య జలాలను తీసుకవచ్చి అదృశ్య యుద్ధం చేస్తున్న ఇంద్రజిత్తు రామునికి కనిపించునట్లు చేసినాడని వివరించాడు.

సీత అగ్ని ప్రవేశం చేసినట్లు రాయకపోవడం ఎఱ్ఱన రచనలోని మరో విశేషం.

"**నాదగు బుద్ధి నీదు చరణ స్మరణ మొనర్చుగాని యొండేదియు నెన్నడుం దలంపు**" (ఆ.మ.భా-అర. ప. ఆ. పుట.613 )రాదనుచు జానకి మాటలకు వత్తాసుగా 'పృథివ్యాది భూతంబులు', దిక్కులు వినునట్లు "**తమ తమ నామంబులు ఎరింగిం**చి" (ఆ.మ.భా-అర. ప. ఆ. పుట. 614) జానకీదేవి ఉత్తమురాలని రామునికి విన్నవించిరి. బ్రహ్మ కూడా ప్రత్యక్షమై 'రాఘవు చేత సత్కృతుండై' నలకూబర శాపకారణం చేత 'దశగ్రీవునకు బరస్త్రీలయందు బలాత్కారంబు చెల్లదు' అని వివరించడం ఎఱ్ఱన స్వోపజ్ఞకం.

వాల్మీకి మహర్షి మూలంలో రావణుడు ఇంద్రజిత్తును పిలిచి రామ లక్ష్మణులను సంహరించి రమ్మని చెప్పడం, కుమారుని పరాక్రమాన్ని వర్ణించడం చేయగా ఎఱ్ఱన్న మాత్రం ఇంద్రజిత్తు వస్తూనే తండ్రిని ఊరడిరచడంగా వర్ణించడం విశేషం. కుంభకర్ణుని లక్ష్మణుడు సంహరించడం కూడా మరొక విశేషం.

ఇక వర్ణనా విశేషాలలో కల్పనాశక్తిని ప్రత్యక్షం చేయగల గుణాలుగా ఊహా వైచిత్ర్యం, అపూర్వ భావ విచిత్రం, సందర్భానుసరణ సన్నివేశ కల్పన ఎఱ్ఱన రామాయణ కథలో ఉన్నాయి. రామలక్ష్మణులు చూసిన పంపా

సరోవరాన్ని ఎఱ్ఱన్న ఇట్లు వర్ణించాడు. ''**కమనీయ కమలినీ కహ్లార దళ కేసరాన్విత జలముల నర్ఘ్య విధియు...**'' (ఆ.మ.భా-అర. ప. ఆ. పుట. 564) పంపా సరోవరంపై, అతిథి సేవానురక్త అయిన స్త్రీ గుణాన్ని ఆరోపించడం ఒక వ్యంగ్యం. ఇక్కడ సీతాస్వరూపాన్ని పాఠకుడి మనసులో నిలపడం ఇందుకు ప్రయోజనం. సంస్కృతభారతంలో రేఖా మాత్రంగా ఉన్న ఈ సరోవర వర్ణన ఇక్కడ ఇంత విపులంగా చేయడం కూడా ఎఱ్ఱన్న స్వోపజ్ఞకమే. 'మూలానుసరణంగా శ్రీరాముని ప్రయాణం వర్ణింపబడినా, అమూలకమైన ఋతు వర్ణనం కూడా ఉంది. ఇదే విధంగా మూలాతిక్రమణంగా హనుమదాదుల మధువన విహార వర్ణన ఉంది. ఇంకా అంగద రాయబారంలో దౌత్యం, పలుచోట్ల యుద్ధ వర్ణన, రామ సుగ్రీవుల మంత్రాలోచన, కుమారుని యువ రాజ్యాభిషిక్తుని చేయాలని దశరథుడు అభిలషించినప్పుడు శ్రీరామ గుణాదికాల వర్ణనంలో నాయకాభ్యుదయం - ఈ రీతిని అష్టాదశ వర్ణనలందలి పెక్కు వర్ణనలు 'వాక్యం రసాత్మకం కావ్యం' అనేటట్లుగా "**హృదయంగమంగా కావించబడినవని**'' (తెలుగుసాహిత్యంలోరామకథ, పుట. 214) పండా శమంతకమణి గారు అభిప్రాయపడ్డారు.

ఎఱ్ఱన్న రామకథలో గమనించవలసిన మరో అంశం రామునికై నిజంగా పరితపించి ప్రాణాలర్పించిన వారిలో దశరథునకు కాక జటాయువుకు శ్రేష్ఠత్వాన్ని ఆపాదించడం. ఎఱ్ఱన్న జటాయువు దశరథునకు మిత్రుడని, 'అరుణ తనయుడని' వివరించాడు.

ఎఱ్ఱన రచనా చిత్రాలలో 'జానకీ విలాపము' కూడ ఒకటి. 'దేవతలార యో ధరణి దేవతలార' అని పిలిచి, మూడు లోకాలలో వెలుగొందే రాముని కులాంగన జానకిని నన్ను మోహావేశంతో ఒక రాక్షసుడు 'అనర్గళమై' తీసుకొని పోతున్నాడు. ''**కృపం - గావరే పుణ్యమున్ యశము గైకొనరే యిదె మీకు మ్రొక్కెదన్''** (ఆ.మ.భా-అర.ప. ఆ. పుట. 558)అని మొర పెట్టుకోవడం కరుణాత్మకంగా ఉంది.

''**అద్దేవి వీడ్కొల్పిన నేను లంకాపురదాహంబు సేసి యిట దేవరకింతయు విన్నవింప వచ్చితి**'' (ఆ.మ.భా-అర. ప. ఆ. పుట. 78) అంటూ ఒక చిన్న వాక్యంతో సుందరకాండ కథను ఎఱ్ఱన దాటేశాడు. సుందరకాండలో హనుమంతుని వన ధ్వంసం, రాక్షసులతోడి యుద్ధం, రావణ సందర్శనం మొదలైనవేవీ ఇందు లేవు.

నాగపాశబద్ధులైన రామలక్ష్మణులను విభీషణుడు బ్రహ్మాస్త్ర ప్రయోగంచే బంధమోక్షణం చేయడం ఎఱ్ఱన రామాయణ గాథ కాగా, గరుడుని ఆగమనం చేత బంధముక్తి కావడం వాల్మీకి ఋషి ప్రోక్తం. కుంభ కర్ణుని రాముడు వధించినట్లు వాల్మీకీయం కాగా లక్ష్మణుడు వధించినట్లు ఎఱ్ఱన కథ.

రావణుని సన్యాసి వేష వర్ణనను గమనిస్తే, ''**కమనీయంబగు జన్నిదంబు శిఖయున్ గౌపీనమున్ ధాతువ...**'' (ఆ.మ.భా-అర. ప. ఆ.పుట.556) ఎఱ్ఱన ధారాశుద్ధి, కథాగమన వేగం చూపు దృష్టి మనకు అవగతమవుతాయి. అట్లే దండకవన సీతతో రావణుడు : ''**ఎక్కడి రాఘవు దక్కట..**'' (ఆ.మ.భా-అర.ప.ఆ. పుట.557) అని సంభాషించే సందర్భంలో ఎఱ్ఱన వాడిన భాషలోని సులభాన్వయ సమాస ధోరణి, మృదుశైలి

అనుభవైక వేద్యం. ''**యాడెద వీరనృత్యము రయంబున బార్థివ సూను లిద్దరం...**'' (ఆ.మ.భా-అర. ప.ఆ.పుట.602) అంటూ ఇంద్రజిత్తు తన పరాక్రమాన్ని తానే వర్ణించుకొంటూ రామలక్ష్మణులను బంధించి తెచ్చెదనన్న ఘట్టంలో ఎఱ్ఱనచే వీరనృత్యం అనే పదబంధం వాడబడిరది. ఈ పదాన్ని గూర్చి వివరిస్తూ ఆరుద్ర గారు. ''**వీరనృత్యం పద్మనాయకయుగంలో ప్రబలిన 'రణముకుడుపుట' ను సూచిస్తున్నదేమో**'' (సమగ్ర ఆంధ్రసాహిత్యం, ఆరుద్ర, పుట. 161) అని అభిప్రాయపడ్డారు. సమకాలీన ఆచారాలతో పాటు జాతీయాలు, పలుకుబళ్ళు కలిగి 'కలవా రెల్లను మడిసిరి, కలిగియు లేడయ్యె కుంభకర్ణుడు' అని రావణుడు వాపోవడం,పైగా అతనితో ఆ రాముడు 'మమ్మెల్లను నేలకుం గోకులం దెచ్చుచున్నవాడు' అని తెలుగులో మొఱపెట్టుకోవడం'గా వర్ణించడం ఎఱ్ఱన్నకే చెల్లింది.

ఎఱ్ఱన రాముడు 'సితభూతి భూషితుడు' భస్మరేఖాంకిత చిహ్నములు కలవాడు. శంభుదాస బిరుదాంచితుడైన కవి పుంగవుడు, సూర్యవంశ రాముని నుదుట భస్మరేఖ లుంచడం శైవ వైష్ణవ అభేదాన్ని చూపడానికే గాని మరొకందుకు కాదు. మారీచుడు రామ పరాక్రమం చవిచూచిన తరువాత ఏమైనాడో మనకు వాల్మీకి రామాయణంలో తెలియదు కాని, ఎఱ్ఱన రామకథలో మాత్రం సముద్రతీర తీర్థ క్షేత్రమైన గోకర్ణంలో తపస్సు చేయడాన్ని వర్ణించాడు. గోకర్ణం ఒక శైవక్షేత్రం కావడం గమనార్హం. సీతాపహరణం జరిగిన తర్వాత 'ప్రియా విరహ దుర్మనస్కుండై' రాముడు దుఃఖించాడని చెప్పడం సమాజంలో రామునికున్న ఏకపత్నీ వ్రత నియమ పాలనా గౌరవాన్ని చాటి చెబుతుంది.

సమాజంలో భారతీయ సనాతన సంప్రదాయ ధర్మమైన అంత్యేష్టిని జటాయువుకు రాముడు చేయడంలో అతనికి ఉన్న జీవకారుణ్య బుద్ధితో పాటు సమాజ సంప్రదాయానుసరణం పట్ల శ్రద్ధను చాటి చెపుతుంది. అతి గౌరవంగా, నిజ జనకునితో సమానంగా 'అగ్ని సంస్కారాది కరణీయంబులు' రామునితో పొందిన ఆ 'కలుగుఱేడు' ధన్యజీవి.

రాజుకు మంత్రి ఉండడం రాజధర్మం. సుగ్రీవునికి 'సచివ చతుష్టయ' ముండడం కూడా అంతే. పరదారాపహరణం రాముని దృష్టిలో క్షమించరాని నేరం. వాలిని నిర్మూలించి, రావణుని నిర్జించినా, లోకంలో ఏకపత్నీ వ్రత ధర్మాన్ని తానాచరించి ఉదాహరణ ప్రాయంగా నిలిచినా, రాముని లక్ష్యం ఒక్కటే. అది సమాజహితం. స్వప్న శాస్త్రం గూర్చి ఎఱ్ఱన రామకథలో త్రిజటా స్వప్న రూపంలో కొంత గ్రహించవచ్చు. దక్షిణదిశలో ప్రయాణమవడం మరణానికి, రాబోయే కీడుకు చిహ్నం అని నాటి ప్రజల నమ్మకం. భేరీ మృదంగ గంభీర నాదాలతో పాటు సింహనాదాల్ని సైతం వినిపించినా లేవని గాఢనిద్ర కుంభకర్ణునిది. 'ఇట్టి చోద్యపు నిద్రలు గలవె ఎవరికైన జగములోన - ఎవ్వరేమైన ఎరుగవు ధన్యుడవు నీవు' అంటాడు దశకంఠుడు తమ్మునితో. ఇది లోక ప్రసిద్ధమైన విషయం.

'ప్రాప్త శ్రీ విశేషోన్నతిన' పుష్పకవిమాన మధిరోహించి అయోధ్య చేరిన రాముని భరతాది బంధు జనాలు అఖిల పరిజనాలు అభినందించగా వశిష్ట వామదేవ ఋషి పుంగవుల ఆశీర్వచనాలు పొంది రాజ్యాభిషేకం పొందినాడు. మిత్రులకు బహుమానాలు ఇవ్వడం లోకాచారం. సుగ్రీవ విభీషణాదులకు, సుహృజ్జనాలకు రాముడు బహుకృతులంద జేయడం ఆ ఆచారాన్ని పాటించడమే.

## 5. ఔచిత్యం - ప్రయోజనం :

''**భార్యా వియోగశ్చ జనాపవాదో.......**'' (షోడశి, గుంటూరుశేషేంద్రశర్మ.పుట. 37) అన్నది ప్రసిద్ధి పొందిన శ్లోకం. మానవునికి రాగూడని ఆపదలలో, అయిదింటిలో అగ్రస్థానంలో ఉన్నది భార్యా వియోగమే. ఆ దుఃఖాన్ని అనుభవించిన వారిలో రాముడు అగ్రేసరుడు. ఎటువంటి పేర్లూ లేకుండా ఆసాంతం కావ్యాన్ని రచించి లోకంలో ప్రసిద్ధుడైన కాళిదాస మహాకవి కృత మేఘదూత మహాకావ్యానికి ప్రేరణ రాముని వేదన.

అటువంటి దుఃఖాన్నే పొందినవాడు ధర్మరాజు. పాండవుల కులసతి ద్రౌపది పడని ఇడుములు లేవు. ద్యూత పరాజితులై భార్యానుజులతో కూడి పదమూడేండ్ల అరణ్యవాస క్లేశం అనుభవించడానికై కానల చేరి కామ్యకవనంలో పర్ణశాల నిర్మించుకొని ఆశ్రమవాస జీవితం గడుపుతున్న ధర్మజుని దుఃఖం ద్విగుణమయ్యేటట్లు, దుర్యోధనుని బావ జయద్రధుడు, ద్రౌపదిని అపహరించడానికి ప్రయత్నించాడు. ఆ ప్రయత్నంలో సఫలీకృతుడై ద్రౌపదిని తీసికొనిపోతుండగా, విషయం తెలిసిన భీమార్జునులు అడ్డుపడి, ద్రౌపదిని రక్షించి, ధర్మజుని అనుమతితో సైంధవుడిని విడిచిపెట్టారు. ఇది కురువంశ శ్రేష్ఠుని గాథ.

తండ్రిగారి ఆజ్ఞకు బద్ధుడై పదునాలుగేండ్ల వనవాసం అనుభవించడానికై ముందుగా చిత్రకూటం, పిదప దండకవనం చేరుకొని, అక్కడ పంచవటిలో పర్ణశాల నిర్మాణం చేసి భార్యానుజులతో ఉన్న రాముని పరాభవించడానికి, 'ప్రియా విరహ దుర్మనుస్కుడై' క్రుంగిపోవాలని రావణుడు జానకిని అపహరించగా, పది నెలలు ఇడుముల పడి, చివరకు కపి వీరుల సాయంతో రావణుని హతమార్చి సీతను రక్షించుకొన్నాడు. ఇది ఇనవంశ శ్రేష్ఠుని గాథ. వనవాస వ్యధ ఇద్దరికీ సమానమే. భార్యా వియోగ వ్యధ కూడా అంతే. ఇది సంఘటపరమైన సామ్యం.

ధర్మజుని ప్రశ్నకు మార్కండేయుడు సమాధానం చెపుతూ, 'ఎంతో దుఃఖం పొందినా నీవు పడే బాధ చాలా చిన్నది. ధర్మరాజా! పూర్వం శ్రీరాముడు కారడవుల్లో ఇడుముల పాలై దుఃఖపడ్డాడు. అతని భార్య జానకి రావణునిచే అపహరింపబడగా, వానరులతో కలిసి, ప్రయాసలకు ఓర్చి సముద్రానికి వారధి నిర్మించి తుదకు దివ్య శరాలతో ఆ దశకంఠుని సంహరించి 'పడిన వ్యధలు - వాని ముందర నీ కష్టాలు స్వల్పం' అని అన్నాడు.

ధర్మజుడు ''**మునీంద్రా! రాముండెవ్వని వంశంబువాడు. రావణుడెవ్వని తనయుండు, ఏమి కారణంబున సీతాపహరణము చేసె**'' (ఆ.మ.భా- అర. ప. ఆ. పుట. 537) అని రామ రావణ సంగ్రామం ఎట్లా ఘటిల్లిందో

చెప్పమని ‘రామాయణ కథాశ్రవణ కుతూహలియై అడిగినాడు.

ప్రతిగా మార్కండేయుడు, ఇక్ష్వాకు వంశంలో జన్మించిన దశరథునికి ముగ్గురు భార్యలు వారికి రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు జన్మించగా అందులో శ్రీరామునికి, విదేహ రాజనందన జానకి భార్య అయ్యింది అని ఆరంభించి రావణ జన్మ వంశాలను సవిస్తరంగా వివరించి తిరిగి రామ యువరాజ పట్టాభిషేక భంగంతో అరణ్యవాస కథను జతపరిచి ప్రధాన కథతో అనుసంధించాడు.

## 6. ముగింపు:

ఇది భారతంలో అరణ్యపర్వంలో షష్టసప్తమాశ్వాసాలలో చోటు చేసుకున్న రామాయణ కథ సందర్భం. సంస్కృత భారతంలో కూడా ఈవిధంగానే ఉంది. తెలుగులో అనువదించడంలో ఎఱ్ఱన మహాకవి నన్నయ తిక్కనల శైలిని కలుపుకొనే యత్నం ఒకటి, నాటికాలంలో జనసామాన్యంలో బహుళ ప్రచారమైన రామాయణ కథాంశాలను (అవింధ్యుడు అను వృద్ధ రాక్షసుని కథల వంటివి) జతపరచడం రెండు, స్వతస్సిద్ధమైన శివభక్తి పారమ్యం మూడు, కలిపి ముప్పేటలుగా అల్లిన సుందర కథ ఈ భారతంలోని రామాయణ కథ.

భారత ద్రౌపదిని జయద్రథుడు అపహరించి పరాభవింపబడగా, రామాయణ జానకిని ‘అపహరించి రావణుడు మరణించినాడు. వ్యధను పొందిన ధర్మజ, శ్రీరామచంద్రులు వారి శత్రువులను నిర్జించడంలో పడిన క్లేశం సమానమే. భారతాంతర్గత సందర్భావసరాన్ని బట్టి, దుఃఖభారమగ్నుడైన ధర్మజునకు ఉదాహరణ కథగా, సామ్యం కల్గిన గాథగా రామాయణ కథ ఉండడం ఎంతో ఔచిత్యవంతంగా ఉంది.

ఆదికవి వాల్మీకి మహర్షి. తత్ కృతము రామాయణం. వేదసమం. పంచమవేదమైన భారతాన్ని నిర్మించుటలో, ఇతర పురాణప్రపంచాన్ని ఆవిష్కరించుటలో వ్యాసుడు యథేచ్ఛగా రామాయణశ్లోక సముదాయాలను వాడుకొన్నట్లు పండితులు నిరూపించారు. సంస్కృతభారతాంతర్గతరామాయణకథ కూడా అట్టిదే అయివుండవచ్చు. సత్యధర్మాలను బోధించే రామకథ, సంహిత. శ్రీరామకథను తమ రచనలలో చేర్చిన కవులు సత్య ధర్మ- తప-శాంతి దయలను లోకంలో వ్యాపింపజేశారు. శ్రీరామకథ విశ్వంలోని సకల మానవాళికి నీతిని ధర్మాన్ని ప్రబోధించే సత్యం.

## 7. ఉపయుక్తగ్రంథసూచి:


1. అచ్యుతరామశాస్త్రి, ఒగేటి. ఎఱ్ఱన అరణ్యపర్వ శేషము. సాహిత్యసభ ప్రచురణ, హైదరాబాదు, 1989.
2. ఆరుద్ర. సమగ్ర ఆంధ్ర సాహిత్యం. సంపుటాలు, ఎమెస్కో ముద్రణ, హైదరాబాదు, 1965.
3. కృష్ణమాచార్యులు, యం. మరియు వెంకటరామయ్య, గోలి. శ్రీమద్రామాయణం, గీతాప్రెస్ ప్రచురణ, హైదరాబాదు, 2004.
4. దొరసామి శర్మ, రావూరి. తెలుగు సాహిత్యము - రామకథ. త్రివేణి ప్రచురణలు,హైదరాబాదు, 1972.

5. మలయవాసిని, కోలవెన్ను. ఆంధ్రవాఙ్మయంరామాయణం, అరుణశ్రీ ప్రింటింగ్ అండ్ బైండింగ్ వర్క్స్, అమలాపురం, 1989.
6. రాధాకృష్ణ శర్మ, చల్లా. రామాయణ వ్యాసాలు. లక్ష్మి నారాయణ ప్రచురణలు, హైదరాబాదు,1992.
7. వెంకటరెడ్డి, కసిరెడ్డి. జాతిజీవనం పై రామాయణప్రభావం. జాతీయసాహిత్య పరిషత్ ప్రచురణ, హైదరాబాదు, 1974.
8. వెంకటావధాని, దివాకర్ల. రామాయణ సుధాలహరి. యువభారతి ప్రచురణలు, హైదరాబాదు, 1976.
9. శమంతకమణి, పండా. తెలుగు సాహిత్యములో రామకథ. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి ప్రచురణ,హైదరాబాదు, 1972.
10. శివప్రసాద్, ముదిగొండ. ఉద్యమ దర్శనం. రస గంగోత్రి ప్రచురణలు, హైదరాబాదు, 1990.

***



AUCHITHYAM

ISSN: 2583-4797

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_02.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

### (ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)

# 2. విశ్వనాథ రాముడు: జీవుని వేదన

**డా. పోగుల విశ్వప్రసాదు**

తెలుగు సహాయాచార్యులు,

ఎస్.ఆర్.ఆర్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వ. ప్ర.), కరీంనగర్,

కరీంనగర్, తెలంగాణ.

సెల్: +91 9866802692. Email: pogulavishwam72@gmail.com

**వ్యాససంగ్రహం:**

*వ్యక్తి సమాజం రెండింటి సమతుల్య కలయిక వ్యవస్థను బలోపేతం చేస్తుంది. వ్యక్తిగత స్వార్థం వ్యవస్థను బలహీనం చేస్తుంది. వ్యవస్థ ధర్మమే ఆచరణీయం. భారతీయ చింతన ఎల్లప్పుడూ వ్యవస్థ ద్వారా వ్యక్తికి రక్షణ నిచ్చేది. సమష్టిదృష్టి గల వ్యవస్థను దర్శించే కవులకు ఇబ్బందులు ఉంటాయి. వాటిని సమర్థవంతంగా ఎదుర్కొనే వారే మహాకవులు. అచ్చమైన కవికి స్పష్టంగా చెప్పలేని, ఆధారము లేని ఏదో ఒక ఉద్వేగం హృదయంలో ఎప్పుడూ ఉంటుంది. ఇది ఒక దిగులు లాంటిది. ఈ ఉద్వేగం, దిగులు కవిని మరింత ద్రవింపజేసే గుణాలు. ఇవి కావ్యాత్మను ఆవిష్కరించడంలో ప్రధాన పాత్ర వహిస్తాయి. కాబట్టి కవి, గాయకుడు ఇలా అనేక రకాలుగా ఆత్మ బహిర్గతం అవుతుంది. ఈ వెలుపలి రూపం ఏదైనా లోపలి ఆంతరంగికస్వరూపం మాత్రం జీవుని వేదనయే. విశ్వనాథ రామాయణాన్ని కల్పవృక్షంగా భావించాడు. కల్పవృక్షం సార్వకాలిన దృష్టి కలది. పురాతన భారతీయసంస్కృతి వారసత్వాలు విశ్వనాథ రచనల్లో సమకాలీన దృష్టితో కనిపిస్తాయి. ఇక్కడి ధార్మిక చింతనకు విఘాతం కలిగించే సందర్భం విశ్వనాథ రచనల్లో ఖండనకు గురవుతుంది. కేవలం భారతీయుల రాజకీయదాస్యమే కాక మానసిక, సాంస్కృతిక దాస్యాలు విశ్వనాథకు ఎక్కువ ఆవేదనను కలిగించాయి. వైదికకాలం నుండి వస్తున్న మహోన్నతజాతీయశక్తి అస్తిత్వాన్నికోల్పోతుండడం విశ్వనాథని దుఃఖితుడిని చేసింది. జాతి తన ఆత్మని దర్శించి ప్రకాశవంతం కావాలనేది విశ్వనాథ కల్పవృక్షంలోని తాత్త్వికదృష్టి. ఇది జీవునివేదనగా విశ్వనాథ సమస్తసాహిత్యంలో కనిపిస్తుంది. కల్పవృక్షంలో ఈ వేదనతో కూడిన దిగులు నెలకొన్న ఘట్టాలను, అందుకుకారణాలను సోదహారణంగా పరిశీలించడం ఈ వ్యాసం ముఖ్యోద్దేశ్యం. ప్రతిపాత్రలో, దైవీప్రకృతులు, రాక్షసప్రకృతిలో కూడా ఈ వేదనను విశ్వనాథ సృష్టించాడు. రామాయణం మొత్తంలో ఏ పాత్రను కూడా దుష్టపాత్రగా చిత్రించక అన్నిటిపై సానుకూల, సానుభూతిని పాఠకులలో కలిగించేందుకు విశ్వనాథలోని పురాతనభారతీయసాంస్కృతిక వారసత్వాలకి కలుగుతున్న విఘాతాలను అడ్డుకొనే జీవునివేదనే కారణమని ఈ వ్యాసం చర్చిస్తుంది.*

**Keywords:** జీవునివేదన, రామాయణకల్పవృక్షం, కావ్యాత్మ, జాతీయత, సంప్రదాయం, సామాజికశ్రేయస్సు, ఆధ్యాత్మికత, స్వధర్మం, సార్వకాలీనం జ్ఞానపీఠపురస్కారం.

## 1. ఉపోద్ఘాతం:

చెప్పదలచుకున్న విషయానికి, వస్తువుకి రచయిత కల్పించే విలక్షణమైన ఆకృతి అభివ్యక్తి. ఇది రసవ్యంజకంగా ఉన్నప్పుడే మంచి రచన అవుతుంది. ఈ అభివ్యక్తి ద్వారా కావ్య పరమార్థం గ్రహించాలి. విశ్వనాథ రచనల్లో ఈ పరమార్థం రెండు రకాలుగా ఉంటుంది సామాజికత, ఆధ్యాత్మికత. ఈ సామాజికత అనే అంశాన్ని విశ్వనాథ దేశీయతగా భావించారు. జీవితం గురించి విచారణ చేసే జాతికి అనుభవాలు, ప్రశ్నలు, సమాధానాలు ఎప్పుడు కొత్తగా కనిపిస్తాయి. అక్కడి వాతావరణం, ప్రకృతి, మానవ సంబంధాలు ఇవన్నీ కొత్త కొత్త ఊహల్ని ఆలోచన కలిగిస్తాయి. ఈ ఆలోచన ద్వారా సంపాదించిన జ్ఞానం ఒక ప్రత్యేకమైన దృష్టిని ఏర్పరచుకుంటుంది.

ప్రపంచీకరణ నేపథ్యంలో దేశీయత చర్చ తక్షణ అవసరంగా మారింది. దేశీయ, విదేశీయ భావజాలాల మధ్య సంఘర్షణ సాంప్రదాయాన్ని, సమాజాన్ని తీవ్ర ఒత్తిడికి గురి చేస్తున్నాయి. సంప్రదాయ ఆలోచనలు గల కవికి ఇవి వేదనను కలిగిస్తాయి. ఈ వేదన రచనగా మారుతుంది. దూరదృష్టి గల రచయిత ఈ విషయాన్ని ముందుగానే పసిగడతాడు. తన సమకాలీన సమాజంలో జరుగుతున్న మార్పుల్ని ఆధారంగా భవిష్యత్తు పై ఒక స్పష్టమైన అవగాహన ఏర్పరచుకుంటాడు. ఇది సాంప్రదాయానికి విరుద్ధంగా ఉంటే అది అతని రచనల్లో వేదన రూపంలో బయటకు వస్తుంది. విశ్వనాథ రచనల్లో ఇదే గమనార్హం. రామాయణ కల్పవృక్షంలోని కవి వేదనను భిన్నమైన సందర్భాల ద్వారా సంఘటనల ద్వారా రాముని పాత్ర ఆధారం గా నిరూపించడమే ఈ వ్యాసం యొక్క ఉద్దేశం

## 2. పరిచయం:

"**నా కవిత్వం అంతా నా జీవితంలోని అనుభవాలమయం. ఈ భావాలు ఈ అనుభవాలు నీ మనస్సుపై వేసిన ముద్రలో నుండి నీ మాటలు దొర్లుకొని వస్తాయి నీవు కవివైతే ఈ శబ్దము వ్యంజకమై కావ్యత్వాన్ని పొందుతుంది**". (విశ్వనాథ శారద1 పు.18_19) అంటారు విశ్వనాథ. విశ్వనాథ (1895-1976) సంధికాలంలో పుట్టినారు 19వ శతాబ్దం చివరలో దేశంలో ప్రపంచంలో సాంఘిక,ఆర్థిక,రాజకీయరంగాలలో విపరీతమైన మార్పులు వచ్చాయి. ప్రపంచాన్ని బ్రిటిష్ సామ్రాజ్యమే పాలిస్తుంది కనుక అక్కడ వచ్చిన మార్పులు వలసదేశాలపై అనివార్యంగా పడ్డాయి. గ్రామీణజీవితానికి, నాగరికతకు, సంస్కృతి-సాంప్రదాయాలకు, సౌందర్యవాతావరణానికి ఆ కాలం చివరి గడప. బస్తీ నాగరికత తోసుకొస్తుంది విశ్వనాథ తండ్రి బందరులో కాపురం పెట్టి విశ్వనాథకు ఇంగ్లీష్ చెప్పించారు. చిన్నతనంలోనే విశ్వనాథ తన స్వస్థాన వేష భాషల నుండి వేరు చేయబడుతూ దాని తీవ్రతను అనుకోకుండానే అనుభవించారు. అజ్ఞాత చైతన్యం, అననుకూల అనుభవ తీవ్రత ఉండడంవల్ల ఇంగ్లీష్ చదివినా స్వస్థానవేషభాషల చదువును ప్రదీప్తం చేసింది. ఆధునికనాగరికత వ్యాప్తివలన కలిగే దుష్పరిణామాలను చూసేందుకే ప్రోత్సహించింది. దీనికి జాతీయోద్యమం కూడా అనుకూలించింది. దీనినే విశ్వనాథ "**నిజానికి శిల్పము కాని సాహిత్యం కానీ జాతీయమై ఉండవలయును. విజాతీయమై ఉండరాదు. వ్రాసినవానికి ముక్తి, చదివిన వారికి**

**రక్తి, ముక్తి. ఎంత సముద్రము మీద ఎగిరినను పక్షి రాత్రి గూటికి చేరును. ఇది జాతీయత, ఇది సంప్రదాయం**" (మహతి. పు.12. నేను-నా సాహిత్య రచనలు) అని తన సాహితీ లక్ష్యాన్ని తెలిపినారు

విశ్వనాథ 1895 సెప్టెంబర్ 10 తేదీన కృష్ణాజిల్లా నందమూరులో పార్వతి శోభనాద్రి దంపతులకు జేష్ఠ పుత్రుడిగా జన్మించాడు. ప్రసిద్ధశతావధానులు తిరుపతివేంకటకవులలో ఒకరైన చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి వీరికి గురువు. విశ్వనాథ వ్యక్తిత్వాన్ని మలిచిన ఆధ్యాత్మిక గురువు కుర్తాళంలో సిద్దేశ్వర పీఠాధిపత్యం వహించిన కానుకొలను త్రివిక్రమరావు. వీరిద్వారా విశ్వనాథ వేదాంతరహస్యాలను గ్రహించారు. స్వాతంత్రోద్యమకాలంలో సహాయ-నిరాకరణం పిలుపునందుకొని విశ్వనాథ కళాశాలనుండి బయటకు వచ్చారు. తర్వాత పట్టభద్రులైనారు. అధ్యాపక-వృత్తి చేపట్టి సుమారు రెండుదశాబ్దాలు (1938_1958) ఎందరో శిష్యులను రూపొందించారు. పదవి విరమణ చేసిన తర్వాత కరీంనగర్ ప్రిన్సిపాల్గా (1959_61) పనిచేశారు. నవలలు, నాటకాలు, కావ్యాలు, విమర్శ గ్రంధాలు ఇలా అనేక ప్రక్రియలలో విస్తృతంగా సాహిత్యాన్ని సృజించారు వేయిపడగలు, చెలియలికట్ట, వీరవల్లడు, మాబాబు, లాంటి నవలలు ఆంధ్రపౌరుషం, వరలక్ష్మీత్రిశతి లాంటి కావ్యాలు, త్రిశూలం లాంటి నాటకాలు, నన్నయ ప్రసన్న కలితార్థయుక్తి లాంటి విమర్శగ్రంధాలు అనేకంగా రాశారు. అనేక బిరుదులు, గౌరవాలు పొందారు. రామాయణ కల్పవృక్షం (1932-1962) కు జ్ఞానపీఠపురస్కారం (1971) వచ్చింది.

విద్యార్థి దశలో మిత్రులతో కలిసి మెలిసి, దేశసంచారం చేసిన నిత్య జాగరుకుడైన విశ్వనాథ హృదయం తీవ్రంగా స్పందించేది. ఆ స్పందనలోంచి ఆవేశంలోంచి కవిత్వం పుట్టింది. సంక్షుభిత జీవన మధనంలోంచి పుట్టిన గొప్ప రచనలు విశ్వనాథవి. విస్తృత సాహిత్య అధ్యయనం, విలక్షణమైన ఆలోచన, తీక్షణమైన ప్రాపంచిక దృష్టి, వైభోగం, దారిద్రం విశ్వనాథ సొంతం. విశ్వనాథ రచనలు ఈ అవగాహనతో అధ్యయనం చేయాలి. "**నేనే స్వయముగా ఎన్ని అడవులు తిరిగాను,ఎన్ని కొండలు ఎక్కాను చెప్పలేను ఆ నా సొంత అనుభవాలు ఆయా గ్రంధాలలో ఉన్న విషయాలు రామాయణంలో వ్రాశాను**" (మహతి.12) అంటారు.

ఒకవైపు జాతీయ పునరుజ్జీవన ఉద్యమం స్వాతంత్ర ఉద్యమం మరొకవైపు కాల్పనికో ద్యమం వీటి ప్రేరణ పొంది సంప్రదాయాన్ని ప్రేమించి, నవ్యతను కోరి, గొప్ప సంగమస్థానంగా నిలిచిపోయారు. ఆంధ్రవాఙ్మయంలో తనదైన ముద్రను భద్రపరుచుకున్నారు. సామాజికశ్రేయస్సును లక్ష్యంగా చేసుకొని రచనలు చేసిన విశ్వనాథ సాహిత్యమంతటా లోకహిత నిష్ఠ కనిపిస్తుంది ఈ లోకహితనిష్ఠనే జీవునివేదనగా భావించవచ్చు. సాహిత్యం భౌతిక భావ, ఆధ్యాత్మికభావజాలాలతో పుడుతుంది అనుకుంటే విశ్వనాథ సమకాలీనులలో ఈ మూడు వరసగా శ్రీశ్రీ, చలం, విశ్వనాథలో గమనించవచ్చు. ఈ మూడుపాయలూ జీవునివేదన ద్వారానే ప్రవహించడం గమనార్హం. విశ్వనాథ ప్రతిపాదించిన ఈ జీవుని వేదనకు ధూళిపాళ శ్రీరామమూర్తి, తుమ్మపూడి కోటేశ్వరావు, జి.వి. సుబ్రహ్మణ్యం, కోవెల సంపత్ కుమారాచార్య, సుప్రసననాచార్య మొదలగువారు ప్రాచుర్యం కలిగించారు.

## 3. జీవుని వేదన - నేపథ్యం:

విశ్వనాథ కావ్యాత్మను 5 సూత్రాలుగా చూడవచ్చు.

1. "**విజాతీయ నాగరికత వ్యామోహంలో పడి స్వ జాతి ధర్మాన్ని, జీవ లక్షణాన్ని విస్మరించకూడదు.**
2. **వ్యక్తి స్వేచ్ఛ పేరిట వ్యవస్థ ధర్మాన్ని అతిక్రమించి అవ్యవస్థకు దారి తీయకూడదు.**
3. **ధర్మాధర్మాలకు సంఘర్షణ సంభవించినప్పుడు వ్యక్తిలోని వివేకం, విచక్షణ జ్ఞానం జాగరూకం కావాలి.**
4. **మనిషిలో కృతజ్ఞతా భావం అంతరించిపోరాదు.**
5. **మానవ జీవితంలోని ఆత్మీయమైన అనుబంధాలు ఎంతో విలువైనవి**" (విశ్వనాథదర్శనం, పు. 39)

జీవన విధానంలోని సహజమైన మానవీయమైన కరుణ ఆయన రచనలన్నిటికీ మూల ద్రవ్యం. ఆయన రచనలన్నింటికీ మూలాధారంగా అడుగున కారుణ్యం చూపిస్తాడు. అందుకే వారి రచనల్లో ఎక్కువ భాగం దుఃఖంతోనే పూర్తవుతాయి. "**మా తండ్రి ఉండగా నేను యువరాజును పుట్టు భోగిని తర్వాత కష్టదశ. ఈ కనబడే భోగం, మేడ అంతా ఆ జీవుడిని అంటుకోవడం లేదు. అందువల్ల వాడికి దుఃఖమేమిటో, కష్టమేమిటో తెలిసినంత సుఖం గురించి తెలియదు**" (విశ్వనాథ శారద పు. 13) అని అంటారు. "**ఎప్పుడు మేను దాల్చితినో ఈ తను సంగత లక్షణంబులు తప్పవు**" (సుందర. పు. 322) అని ఒక పాత్రచే అనిపిస్తాడు. మనసుపై వేసిన ముద్ర, ఈ తను సంగత లక్షణములు విశ్వనాథను ఆంతరంగికంగా వేదనకు గురిచేసాయిఅందుకే.

***"వ్రాసిన రామచంద్రుకథ వ్రాసితివనిపించుకో వృధా/యాసము గాక కట్టుకథలైహికమా/ పరమాయటంచు తా/ చేసిన తండ్రి ఆజ్ఞయును జీవునివేదన రెండు నేకమై/ నా సకలోహ వైభవసనాథము నాధకధను రచించెదన్"*** *(బాల. అవతారిక పు.7)* అంటూ తన రచనకు కారణాన్ని, నేపథ్యాన్ని, అవసరాన్ని తెలిపారు తండ్రి ఆజ్ఞ, జీవుని వేదనలతో కవిత రూప తపస్సు చేసి రామాయణం అని నిర్మించారు.

ప్రధానంగా కావ్యావిర్భావానికి మౌలిక హేతువుగా ప్రతిపాదించిన అంశము జీవుని వేదన.ఈ జీవుని వేదన ఆంతరికము. కవికి సహజంగా ఉంటుంది. ప్రత్యేకమైన వ్యక్తులకే కాక ప్రతిజీవికి వేదన ఉంటుంది. ఆ జీవుని వేదన వల్లనే కవి అయినాడు. ఈ జీవునివేదన సాహిత్య అనుభవం కోసం ఎదురుచూస్తుంది. ఈ అనుభవం సామాజిక, వ్యక్తిగత అవసరాల దృష్ట్యా విశాల ప్రయోజనాలను ఆశించి, లోకరక్షణ కోసం వివిధ రీతులుగా కనిపిస్తుంది. కళానుభవం పరిపూర్ణం కావాలంటే 5 రకాలుగా వ్యూహాలు ఉంటాయని ఆచార్య జీవి ఎస్ అన్నారు. "**సాహిత్య** ***అనుభవం కోసం పంచజివహాలు అర్రులు చాస్తుంటాయి. వాస్తవ, కాల్పనిక, వైజ్ఞానిక, జీవచైతన్య, ఆధ్యాత్మిక అనుభూతుల కొరకై సమాజం తన కామనను వ్యక్తం చేయటమే వీటి ప్రవృత్తి. ఇలా ఆస్వాదించే కళా అనుభవమే పరిపూర్ణం సమగ్రం***" (విశ్వనాథ సాహిత్య వ్యక్తిత్వం పు 4) విశ్వనాథ వారు రామాయణం ద్వారా ఈ కార్యానికి పూనుకున్నారు. ఆయన జీవునివేదన సమగ్ర కళానుభూతి కోసం సమాజ జీవచైతన్యం వ్యక్తం చేస్తుంది.

## 4. జీవుని వేదన - నిర్వచనం:

ఈ జీవుని వేదనను విశ్వనాథ వారు ప్రతిపాదించగా దీన్ని ప్రాచుర్యంలోకి తెచ్చిన వారు శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి. జయంతి పత్రికలో రాసిన వ్యాసాలలో దీని గురించి చర్చించారు.

1. జీవుని యొక్క అంతఃకరణము ఇంద్రియ ముఖమున బహిర్ వ్యాపారము అంత ప్రణవమైనప్పుడు జీవుడు పొందు అనుభూతి యది. (ఫిబ్రవరి 60 పు. 14)
2. ఈ వేదన సుఖము కాదు, దుఃఖము కాదు వాటి కంటే విలక్షణమైనది, సుఖము అనుటకు గాని,దుఖం అనుటకు గాని వీలు లేదు,కాబట్టి పర్యుత్సుకత్వ మని కాళిదాసు చెప్పినారు. ఈ పర్యుత్సు కత్వం సుఖమునకు విరుద్ధమైనది. అందుచేత దుఃఖము వంటి స్వభావం కలది. దుఃఖం కాదు అనగా నిరపేక్షమైన దుఃఖానుభవము స్వరూపము గాగలది. (ఫిబ్రవరి 60. పు. 19)
3. మనకు ఏమాత్రమును సంబంధము లేని వారి కష్టములను చూసి మనము పొందు శో కము కరుణ అనబడును. (డిసెంబర్ 59, పు. 7)
4. నిరవధికసుఖస్వరూపమైన యా పరమేశ్వరుని బొందవలెనని తనకు తెలియక నిత్యం ఆరాటపడుతున్నారు. ఈ ఆరాటమే ఈ పరమేశ్వర విరహానుభవమే జీవునివేదన. (ఏప్రిల్ 60 పు.30) అంటూ జీవుని వేదన ను నిర్వచించారు.

మానవుడు తనను తాను తవ్వుకుంటూ సుఖస్వరూపుడైన పరమేశ్వరుని ఎలాగోలా చేరాలని ప్రయత్నిస్తున్నాడు. ఈ ఆరాటమే అనుభవమే జీవునివేదనగా కనిపిస్తుంది. అయితే ఇది ఒక వ్యక్తికి, ఒక కావ్యానికి మాత్రం పరిమితం కాదని గమనించాలి. ఈ వేదన విశ్వ చైతన్యాన్ని లయబద్ధం చేసేందుకే ప్రయత్నిస్తుంది. ఈ సంవిధానానికి ఎక్కడ అడ్డంకులు ఏర్పడినా ఏ రూపంలోనైనా విఘాతాలు వచ్చినా తీవ్రంగా స్పందిస్తుంది "***అనేక విధములుగా గతిశీలుని చేయుటలో కదులుతూ కదిలించు నా అంతరంగికమగు మౌలిక శక్తి జీవని వేదన***" (ఆ.తె. సా.వి.సాం.రీ. పు.256) అంటారు కోవెల సంపత్ కుమారాచార్య. ఈ జీవునివేదన లౌకికమైనది కాదు. సంసార బాధలకు పరిమితం కాదు, సామాజిక స్పందనలతో కూడి ఉన్నది. ఆదికవి నుండి ఆధునిక కవుల వరకు అచ్చమైన కవులు అందరిలో ఈ అంతర్వేదనా తాపం ఉంటుంది. వాల్మీకి శో కము లాంటిదే విశ్వనాథ జీవునివేద.

## 5. జీవుని వేదన-విశ్లేషణ:

జీవునివేదన సామాజికవేదన తాత్వికదర్శనానికి మధ్య ఉన్నది. (విశ్వనాథ సాహితీ సమాలోచనం పు.218) జీవునిలో అంతరంగంగా ఆధ్యాత్మిక వేదన ఉంది బహిరంగంగా సామాజికవేదన ఉంది. జాతి జీవనం ఆధ్యాత్మిక చైతన్యంతో ముందుకు నడిచినప్పుడే మానవ వికాసం సంపూర్ణమవుతుందని అది భారతీయ సంస్కృతిని కాపాడడం వల్ల సాధ్యమవుతుందని సాంప్రదాయాభిజ్ఞుల అభిప్రాయం.

విశ్వనాథ ఒకసారి "***ఒంటరిగాడను అయిపోయి ఈ ఇల్లు పిల్లల చదువు సంసారము సుందరకాండము రాయటం బుద్ధి క్లిష్టమైపోయింది***" (విశ్వనాథ ఉత్తరాలు విమర్శిని-2 పు. 140) అని వాపోతారు. కాబట్టి సమిష్టి అయిన వ్యవస్థ ధర్మంలో నిలబెట్టుటకు వ్యక్తిత్యాగం చేయవలసింది అని విశ్వనాథ సాహిత్య సందేశంలో ఈ జీవిని వేదన ఎల్లెడలా కనిపిస్తుంది. అవతారికలో విశ్వనాథ వారు "***నేను మన సన్యాసిని/ నేనిది ఇమ్ముంచును అడగను ఎవ్వరినెప్పుడున్ / దానిది ఏది ప్రాప్తం అయినవలదంచు చెప్ప నంతియ గాక***" (బాల. అవతారిక ప. 44) అని తన వ్యక్తిత్వాన్ని జీవుని వేదనతో జోడిస్తారు. మనిషిలోని ఆర్తి పరమేశ్వర అనుగ్రహంవైపు పయనిస్తూ లోకానికి క్రమంగా దూరంగా తననుతాను జరుపుకుంటుంది. లోకంనుండి వియోగం చెందడం జీవునివేదన బహిరంగపరచడమే. కల్ప వృక్షంలో ఇలాంటి వియోగాలు అనేకంగా వర్ణించబడ్డాయి. ఈ కావ్యంలో ప్రతి పాత్ర మరణ సమయంలో ఆవేదన పొందినట్లు వర్ణించబడింది. దీని కోసమే ప్రతి జీవి లోనూ ఆధ్యాత్మిక వినియోగం ఉంటుంది. అది కాక ప్రతి వానిలో ఆవేదన, తీవ్రత ఉంటాయి అది వానిని ఉన్నత ఆశయాల వైపు ప్రయాణం చేయిస్తుంది. దేనికోసమో అన్వేషణ చేయిస్తుంది. మనిషి దేనికో ఆవేదన పడుతుంటాడు. ఈ ఆవేదంలో మానవత్వం ఉంటుంది. ఇది మనిషిని మంచివాడిగా మారుస్తూ దైవత్వం వైపు ప్రయాణింప చేస్తుంది. లక్ష సాధన వైపు ప్రయాణం ఆవేదనకు సరైన ముగింపు. అలాంటి జీవితం నిరర్ధకం కాదు. విశ్వనాథ నిరాశ వాది కాదు. అంతే కాదు మానవుడు సూక్ష్మమతి అంటూ. "ఏ నొక పెద్ద పర్వతమ నెవ్వడు నెత్తగలేదు" అనే పద్యంలో కరుణతో పాటు సూక్ష్మమతిగా ఉన్నప్పుడే చైతన్యశీలుడు మానవత్వం నుండి దైవత్వానికి పయనిస్తాడని దీనికి వాహికగా జీవునివేదన మనిషిని క్రమంగా భౌతిక భావ ఆధ్యాత్మికదారుల గుండా వియోగిని చేస్తూ పరిపూర్ణ జీవితాన్నిస్తుందని తన రచనలన్నింటిలో గాఢంగా వివరించారు. రామాయణకల్పవృక్షంలో ప్రతిపాత్ర జీవునివేదనలో తపించిపోయేదే.

## 6. రాముడు- జీవుని వేదన:

శ్రీరాముడు జీవునివేదన ఎన్ని చోట్ల ఎన్ని రకాలుగా అనుభవించాడనేది చర్చనీయాంశం. తల్లిదండ్రులతో, భార్యతో, సోదరులతో, గురువులతో, సేవకులతో, శత్రువులతో, పెద్దలతో పుర ప్రముఖులతో, ప్రజలతో ఇలా తనకు తారసపడి పరిచయమైన ప్రతి వ్యక్తి పట్ల తన వైఖరిని,తనకు దూరమవుతున్న వారి పట్ల దుఃఖం, తనకు సాయం చేసిన వారి పట్ల కృతజ్ఞత,తనను గౌరవించిన వారి పట్ల ఆదరణ, ప్రేమించిన వారి పట్ల గౌరవం, ఆరాధించిన వారి పట్ల వాత్సల్యం, శత్రువుల పట్ల సహనం ఇలా ప్రతి దగ్గర తనకు తాను పొంగిపోతూ,కరిగిపోతూ జన్మాంతరాల వేదనను కనబరుస్తాడు

తండ్రి వనవాసం పంపే సమయంలో రామునిమాటలు తండ్రి శాసించాలి, తనయుడు పాటించాలి అంటూ కండ్లు మూసి తెరిచే లోపల 14 సంవత్సరములు పూర్తి చేసుకొని వస్తానంటాడు,నాకు తండ్రియే దైవము, తండ్రి మాట జవదాటే సమస్య ఉత్పన్నం కాదు అంటాడు. తన పితృ వాక్య దీక్షను "***ఇది పురా దేవసములైన ఋషుల చేత/***

***చేయబడినది నేనట్లే చేయువాడ ని ది సనాతన ధర్మంబు, యిద్ది చేయ లలిత మర్యాదలకు నెల్ల లక్షమిది*** (అయోధ్య పు 58) తండ్రి మాట పాటించని కొడుకు ఉన్నా లేకపోయినా ఒకటే అంటాడు. పుత్రి పుత్రునిగా జనకుని మాటను నిర్వర్తించు తన ధర్మ నిర్వహణము నకు అనుమతి ఇవ్వాల్సిందని వేడుకొంటూ తల్లి అనుమతి పొంది ఆశీస్సులు కూడా గ్రహిస్తాడు. ఇదంతా సీతతో చెప్తూ పిత్రాజ్ఞ పాలనలోని విశేషాలను "***తండ్రి మాట ఆరాధించు తనయునకు/ నల త్రిలోకి గతంబు భయం బు లేదు/ దాన మాన యజ్ఞములు రక్షణములు పితృ సమారాధన బోల్కి పెట్టలేవు***" (అయోధ్య. పు. 80) అని తండ్రి పై నిశ్చయాత్మని ప్రకటిస్తాడు. తండ్రి బతికున్నచో ఆయన మాట కాదనవచ్చా అని "***ఒగి జనకుండె తా బ్రతికి యుండిన నాయన మాట కాదనం దగదు మె తండ్రి లేడనుచు తత్వచనంబు నిరాదరింపగా నగుదుమె***" (అయోధ్య. పు. 313) "**నే న క్షరాల చేసేద? మానక మన తండ్రి య న్న మాటను**" (అయోధ్య. పు. 313) అని నిశ్చయముగా పలికి జగతికి ఆదర్శమూర్తి అయినాడు. కైకేయి రాముడిని అరణ్యవాసం చేయాల్సిందేనని ఇందులో తన తప్పేమీ లేదని దశరథుడు తనకిచ్చిన వరాలివి అనగా రాముడు "***నీ ఉపకారములు మరువ నే మరి యో జననీ...***" అనే పద్యం రాముని తో కైక చేసిన ప్రసంగం దుఃఖంతో మొదలుపెట్టి క్రమముగా దుఃఖము తగ్గి ఉద్విగ్నత మొదలైంది. రాముని వనవాసమునకు పంపుట దశరథున కు దుఃఖ కారణమని ఆమెకు తెలుసు. కాబట్టి ఇది ఆమెకు దుఃఖమే. వనవాసఫలము రాక్షస సంహారం సంతోషకరమైనప్పటికీ ఉపవాసము దుఃఖ కరమైనది ఇది ఆమె దుఃఖం అలాంటి తన ధ్యేయమును సాధించిన తీరు స్వభావము గలది కాబట్టి వరం అడిగి తీర్చాలని పట్టుబట్టింది. కానీ కైకేయిని అందరూ దూషించారు కానీ ఆమె ఇంగితమును తెలుసుకోలేక-పోయారు అని రాముని ఉద్దేశం. కైకేయీ సహాయము అందుకే మరువలేనిది.

అరణ్యవాసంలో సీతను విరాధుడు ఎత్తుకెళ్తున్నప్పుడు "**నా వైదేహి కనుగొంటివే ఇంకా..**" అని విలపిస్తూ తాను స్వార్థబుద్ధితో తన సుఖము కొరకు సీతను అడవులకు తెచ్చి కష్టాలపాలు చేసినానని దుఃఖిస్తూ "***పితృ వియోగాలని దుఃఖ పెట్టు బిట్టు/ గాని జానకి దుఃఖము కరణి కాదు***" (అరణ్య పు. 8) అని భార్య లేని లోటుకు విల పిస్తాడు. రావణాసురుడు సీతమ్మనుఅపహరించిన పిమ్మట తన శక్తిని హరించ బడినట్లు సర్వస్వం కోల్పోయినట్లు సామాన్యుడివలె భీరువులా దుఃఖించాడు. అడవిలో చెట్టును పుట్టను గాలిస్తాడు. కిష్కిందలో సీత ఆభరణాలు చూసినాక ఆనందంలో "***భూసుత స్త్రీ జగత్తునకు భూషణ్ మాయను భూషణావళుల్ / భా సురబుల్ కనుంగోనెదు భాగ్యము కంటెను భాగ్య మున్నదే***" (కిష్కింద. ప. 32) అని పొంగిపోతాడు. శూర్పణఖ ప్రేమను నిరాకరిస్తున్న సమయంలో సీతమ్మ శూర్పణఖ ప్రేమను గుర్తించి ఆదరించమంటుంది రాముడితో. "**ఈమె మానవి కామిన్ నిను నేను చూసినట్టు ల కనుచున్నది దోస మెందుకు స్వామి**" అంటుంది అప్పుడు సీతారాముడు "***ఆమె ఎరిగిన కామంబు నది ఎరుంగ/ నీమె ఎరి గిన వేదాంత మిది ఎరుగ/ మనుజుడను నేను మానవ ధర్మం బెరుగు దు/ నిల నధర్మంబు చాయ సహించుటె రుగ***" (అరణ్య 188) కామాదులకన్నా, వేదాంతం కన్నా, ఆధ్యాత్మిక విచారం కన్నా

మనుషులకి కావలసింది సరిగ్గా నిర్వర్తింపగలిగిన నాడే మిగతా అంశాల ప్రసక్తి. తాటకిని చంపినందుకుతానెంత బాధపడినాడో వివరిస్తూ రాముడు తన తల్లికి చెప్పిన మాటలు "***ఇలపై రాజ బిడ్డ బ్రతుకే ఇది, వానికి మృత్యుతత్వముల్ తెలియగా తేలికైన పని తెల్లముగా తాటక వధ విలగతిని గ్రహించితిని వెక్కసమై, చని జీవితం ఎంతగా గిలగిల తన్నుకొన్నది కేవలం అప్పుడు చూడవలెను***" (బాల. 339) అని చెప్తాడు రాక్షసులందరినీ చంపినప్పుడు కూడా "***ఈ చంపుటయో కసాయి పని మేలు అన్నట్లుగా ఉన్నది***" (అరణ్య. 14) అంటూ బాధపడకుండా ఉండలేక పోతాడు.

యుద్ధరంగంలో లక్ష్మణుడు మూర్ఛగ్రస్తుడై చావు బ్రతుకుల మధ్య ఉన్నప్పుడు "***ఇతడు చనిపోవలేదని నీవు చెప్పుమా/ ఇతనిని బ్రతికించు నంచును నీవు చెప్పుమా /ఇతను బ్రతుకకు ఉన్నచో బ్రతుక నేను/ నాకు రాజ్యము వలదు జానకియు వలదు***" (యుద్ధ. 253) ప్రియ సోదరుడు తన కష్టకాలంలో తోడైనాడు తనకు పంచప్రాణాలు అందుకే జీవునివేదన. లక్ష్మణుడు దక్కకుండా సీత వద్దు యుద్ధం వద్దు అని విలపిస్తాడు తమ్ముడు పునరుజీవీతుడు అయినాక "***అన్నా నీవును జన్న నాకికను రాజ్యం బేల***" (యుద్ధ. పు. 250) అని తమ్ముడి పట్ల తన ప్రేమను వ్యక్త పరుస్తాడు. జటాయువు మరణించిన సమయంలో "***పితృకల్పుండవు నీకు అర్ఘ్యమిదిగో ప్రేతాత్ముడై కొమ్ము***" (అరణ్య పు. 66) అంటాడు జటాయువు బతికి ఉన్నప్పుడు గౌరవంగా అర్ఘ్య పాద్యాలు చేస్తాడు. తన హృదయంలో పొంగి వచ్చిన భక్తితో మృదువుగా మాట్లాడాడు. చివరికి "***రాముడే ఖగలోకనాధునకు పుత్రస్థానం తండ్రికిన్***" (అరణ్య. పు. 295) అని ఆయనకు తండ్రిగా భావించి ఉత్తర క్రియలు చేస్తాడు.

మానవుని జీవితము వేదనామయము. ఈ వేదనలు అనేక విధములు. బ్రతుకంతా బాధలమయం దుఃఖమయం. సుఖి అనే వాడు ఎవడు లేడు. ఎవరి దుఃఖం వారిది. రాముడీ దుఃఖతత్వాన్ని చిన్నప్పటినుండి గాఢంగా అనుభవించాడు. లోకంలోని జీవులందరూ ఇట్లాంటి దుఃఖము చేత బాధపడుతున్నారని ఆవేదన. ఈ దుఃఖం అనుభవించాల్సిందే అంటూ తల్లితో "***అమ్మ దేహమును విచిత్రమవు దుఃఖా రామమనిపించు దే/హం ఉన్నంతవరకు నీ జీవి పొందనగు బాధ సహ్యతల్*** చెప్ప న ***/ఒక్కొక్క జీవి ఒక్కొక్క విధంబై పొందు దుఃఖము రా/జ్యము రాణియో కనకంబో ఋ షిభార్యారత్నము చెప్పగన్***" (బాల. పు. 338) జీవితం పట్ల స్పష్టమైన అవగాహనతో రాముడు అన్న మాటలు. అలాగే వాలి వధ అనంతరము విలపిస్తున్న తారను ఓ దారుస్తూ "***ఎవరు నెవరు నే తెచ్చినది ఏమీ లేదు/ నెండ్లుగా పూండ్లు గా ఏడ్చి ఏడ్చి యతివ/చచ్చినన్ దుఃఖ మేటికి జన్మ మంది/ నప్పుడు దుఃఖింపవలయు కంబుజాక్షి***" (కిష్కింద. పు.127) పరమజీవితసత్యాన్ని చెప్పి ఓదారుస్తారు. ఇదంతా జీవునివేదన.

ఇలా కల్పవృక్షంలోని ప్రతివియోగ సందర్భంలో రాముడు పురాదుక్కం ఏదో అనుభవిస్తుంటాడు. ఆ దుఃఖం స్వంతం అయినప్పటికీ, గానప్పటికీ కూడా తనతో తన కాలంలో జీవిస్తున్న ప్రాణుల పట్ల మమకారం ఏ ప్రాణి దూరమైతున్నప్పటికీ భరింపశక్యంకాని ఆంతరంగికమైన దిగులు రామునిలో స్పష్టంగా కనిపిస్తుంది. రామాయణం

భారతీయ జీవన విధానానికి దిక్సూచి, ఇందులో మానవీయధర్మాలు, సామాజికసంబంధాలు భావితరాలకు ఒక గొప్ప మార్గనిర్దేశం చేస్తాయి. రామాయణం సమకాలీలత తో పాటు సార్వకాలిన లక్షణాలను ఎలా కలిగి ఉంటుంది అనే ప్రశ్నకు జవాబుగా విశ్వనాథ తన కల్పవృక్షంలో వర్తమానకాలంలో విదేశీయసాంస్కృతిక చొరబాటు కారణంగా శిథిలమవుతున్న అనేక మానవ సంబంధాలను, దైవీ గుణాలను, తీవ్రమైన వేదనతో కల్ప వృక్షంలో రామునిపాత్ర ద్వారా పునర్నిర్మించే ప్రయత్నం చేస్తారు. రాముని యొక్క జీవనవేదన విశ్వనాథ జీవునివేదన ఒక్కటే, స్వధర్మాన్ని కోరుకునే ప్రతి వ్యక్తి యొక్క జీవు ని వేదన ఇదే.

## 7. ముగింపు:

వేయి పడగలు ముగింపు లో ధర్మారావు చిన్న అరుంధతి మధ్య సంభాషణ లో చివరకు ఏమి మిగిలినది "నీవు మిగిలితివి, నేను మిగిలితిని" అని ధర్మారావు అంటాడు. సహస్ర ముఖాలుగా వున్న భారత జాతీయ ధర్మాలు, వేగంగా చొచ్చుకొని వస్తున్న విపరీత సాంస్కృతిక దాడులకు అన్ని ధర్మాలు కూలిపోయినా దాంపత్యధర్మం ఒక్కటి ఈ దేశంలో ఎల్లప్పటికే నిలిచి వుంటుందనే విశ్వాసం విశ్వనాథది. విశ్వనాథసాహిత్యం మొత్తంగా ఇదే కనిపిస్తుంది. కుటుంబసంబంధాలు, సామాజిక సంబంధాలు, విలువలతో కూడిన జీవనవిధానం, దేశం పట్ల జాతి పట్లా గొప్ప అభిమానం వీరి రచనలలో కనిపిస్తాయి. కల్పవృక్షం ఆధారంగా దేశంలో శిథిలమౌతున్న ఈ విషయాలను స్పష్టంగా చూపెట్టారు. అలాగే జీవుడికీ దేవుడికీ మధ్య నున్న ఆధ్యాత్మిక సంబంధాలు కల్పవృక్షంలో అనేకం. మానవుడు జీవన సోపానంలో చివరకు చేరుకునే మెట్టు ఇదే.. అందుకే "నా భక్తి రచనలు నావి గాక" అని విశ్వనాథ అన్నాడు.

సమాజంలో విలువలు కనుమరుగు కాకుండా వాటిని కాపాడుకోవాలనే ఆర్తి విశ్వనాథ జీవద్రవ్యం. అంతర్ బహిర్ వేదన కూడా. ఈ జీవుని వేదన సకలోహవైభవ సనాథంగా ఆయన రచనలలో కనిపించింది. సకల భావానా శక్తి ప్రయోగించి తన ఆలోచనాధారను ప్రవహింపజేశారు. అది సహృదయ లోకాన్ని జ్ఞానవంతుల్ని చేసింది. ద్రవింపజేసింది. ఒక రామాయణ కల్పవృక్షంగా జాతి ఆత్మను ప్రకటిస్తూ జీవుని వేదనగా కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంది.

## 8. ఉపయుక్తగ్రంథసూచి:


1. జయంతి మాసపత్రిక- (డిసెంబర్ 1959, ఫిబ్రవరి 1960, ఏప్రిల్ 1960).
2. రామారావు, యస్వీ. (2011). విశ్వనాథ దర్శనం, పసిడి ప్రచురణలు.
3. విమర్శిని-2. (1977). తెలుగు విభాగం, కాకతీయ విశ్వ విద్యాలయం, వరంగల్.
4. సంపత్ కుమారాచార్య, కోవెల. (1981). ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ సాంప్రదాయికరీతి.
5. సంపత్ కుమారాచార్య, కోవెల.(1989). విశ్వనాథ సాహిత్య వ్యక్తిత్వం (సం.). తెలుగు అకాడెమీ, హైదరాబాద్.
6. సత్యనారాయణ, విశ్వనాథ. (1981). విశ్వనాథశారద (ప్రథమభాగము) శ్రీవిశ్వనాథ సత్యనారాయణ స్మారక సమితి, హైదరాబాద్.
7. సత్యనారాయణ, విశ్వనాథ, (2011). శ్రీమద్ రామాయణ కల్పవృక్షం (6 కాండములు), శ్రీ విశ్వనాథ పబ్లికేషన్స్.
8. సుబ్రహ్మణ్యం, జి.వి.(1972). విశ్వనాథ సాహితీసమాలోచనం (సం), యువభారతి, హైదరాబాద్.


***



AUCHITHYAM

ISSN: 2583-4797

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_03.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 3. తెలుగు సినీగీతాలు: సీతారాముల ఆదర్శప్రణయం

**డా. బూర్ల చంద్రశేఖర్**

సహాయాచార్యులు, తెలుగు,

ప్రిన్సిపాల్ (ఎఫ్.ఎ.సి), ప్రభుత్వ డిగ్రీ కళాశాల,

మెట్ పల్లి, తెలంగాణ.

సెల్: +91 9849582926. Email: chandu.dmpboorla2023@gmail.com

**వ్యాససంగ్రహం:**

*సాహిత్య విలువలు కలిగిన సినిమా పాటలను వివిధ కోణాలలో అధ్యయనం చేయవచ్చు. తెలుగు సాహిత్యంలో సినిమా పాటలపై వివిధ విశ్వవిద్యాలయాలలో పైడిపాల, చిట్టిబోయిన కోటేశ్వరరావు, కళా మురళి, మౌలానా లాంటి ఎందరో పరిశోధకులు పరిశోధనలు చేసారు. అలాగే వేటూరి, ఆత్రేయ, ఆరుద్ర, దాశరథి లాంటి వారి పాటలపై ఎన్నో సంకలనాలు వచ్చాయి. 1931 తెలుగు సినిమా ప్రారంభం నుండి నేటి వరకు వచ్చిన పాటలకు సంబంధించిన సమాచారం అంతర్జాలంలో కుడా చాలా దొరుకుతుంది. భారత ఇతిహాసాలైన భారత రామాయణ ఇతివృత్తాలపై ప్రత్యక్షంగా పరోక్షంగా తెలుగులో ఎన్నో సినిమాలొచ్చాయి.సార్వకాలిక ఆదర్శాలను అందించిన రామాయణ ఇతివృత్త ప్రభావం సినిమారంగం మీద విశేషంగా ఉంది. అనేక సినీ గేయరచనల్లో కవులు సీతారాముల దాంపత్యజీవనాన్ని అందంగా అభివ్యక్తీకరించారు. తెలుగు సినిమా పాటలలో ఆదర్శ దంపతులైన సీతారాముల ప్రణయాన్ని తెలిపే పాటలను తీసుకొని పరిశీలించడం, వారి ఉదాత్తమైన ప్రేమ స్వభావం విశ్లేషించడం ఈ వ్యాసం యొక్క ముఖ్య ఉద్దేశం.*

**Keywords:** సినిమాపాటలు, రామాయణం, సీతారాములు, ఆదర్శం, అద్వైతప్రణయం, స్నేహసారం, ధీర లక్షణాలు, ధర్మవీరం, విద్యా- వివాహం. దాంపత్యప్రణయం.

## 1. ఉపోద్ఘాతం:

ధైర్యం ఉన్నవాడే బాధ్యత తీసుకుంటాడు. బాధ్యత తీసుకున్న వాడికే ప్రేమించే అర్హత ఉంటుంది. ఆ బాధ్యత నా ఇల్లువరకే అని గిరిగీసుకోవడం, ఎల్లలు దాటి ఉండడమని రెండు రకాలుగా ఉంటుంది. రాముని ప్రేమ రాజ్య ప్రజలందరికోసం. అతి పెద్ద బాధ్యత తీసుకున్నవాడు అత్యున్నతంగా ఆలోచిస్తాడు. అందర్నీ ప్రేమగా చూసుకునే

బాధ్యత తీసుకుంటాడు. కనుకనే సీతను రాముడు అత్యున్నతంగా ప్రేమించాడు. అలాగే ప్రజలను కూడా ప్రేమించాడు. ఆ ప్రేమ అర్థమైంది గనుకనే సీత రామున్ని ఉన్నతంగా చూడగలిగింది. రాముని ధర్మం అర్థమైంది కనుకనే ఎప్పుడూ అతనికి నీడలా ఉండగలిగింది. భార్యాభర్తల మధ్యగల ఈ అర్థం చేసుకునే గుణమే ప్రేమను ఇనుమడింపజేయగలదని లోకానికి చాటిన మహనీయ జంట సీతారాములు. అందుకే ప్రజల హృదయభిత్తికలపై ''**సీతాసమేత శ్రీరాముడు**''..., ''**శ్రీరాముని ముద్దులరాణి...**'', ''**సీతాసఖీప్రాణనాథ...**'' (శ్రీరామ రాజ్యం-2011) గా, ''**మంగళం జానకీ మానస నివాసునకు...**'' (శ్రీరామదాసు-2006) గా చిత్రించబడ్డారు.

ఇక్కడ మనం రామాయణ కథని ఇతిహాసంగా తీసుకోవచ్చు లేదా వాల్మీకి రాసిన ఒక కాల్పనిక కథగా తీసుకోవచ్చు. ఎలా తీసుకున్న అంత గొప్ప వ్యక్తిత్వం గల సజీవ పాత్రలు, జీవన విధానం, ఆదర్శం మరే కథలోను కనబడవు. ఈ వ్యాసంలో సీతారాములను అలౌకిక పాత్రలుగా కాక ఆదర్శ చారిత్రకవ్యక్తులుగా దృష్టిలో ఉంచుకొని విశ్లేషించదల్చాను.

భారతదేశంలో బహుల ప్రచారంలో ఉన్న వాల్మీకి రామాయణ కథ చాలా ప్రక్రియల్లో మళ్లీ మళ్లీ రాయబడింది. అలాగే సినిమా పాటల్లోను వ్యక్తీకరింపబడింది. దృశ్యకావ్యంలో మహాభారతం కన్నా రామాయణం చిత్రించడం అంటే కొంత కష్టమైన పని. ఎందుకంటే మహాభారత పాత్రల్లో చాలా వైవిధ్యం ఉంటుంది. కానీ రామాయణానికి వచ్చే వరకు ప్రతీపాత్రను చాలా ఉదాత్తంగా, ఉన్నతంగా చిత్రించాల్సి ఉంటుంది. ముఖ్యంగా సీతారాముల పాత్రలను చాలా ఆదర్శంగా చిత్రించాలి. అందులోనూ వారికి రాసే పాటలు కూడా అలాగే ఉండాలి. తెలుగు సినిమా రచయితలు ఆ సాహసాన్ని విజయవంతంగా చేసారనిపిస్తుంది. సినిమా మౌలిక లక్షణమైన జనరంజకాన్ని పాటల్లో కూడా ఉండేలా చేసారు. ఈ సినిమా పాట ప్రక్రియలో వచ్చిన సీతారాముల ప్రణయానికి సంబంధించిన కొన్ని పాటలని ఇక్కడ పరిశీలిద్దాం.

సినిమాల్లో ప్రత్యక్షంగా రామకథను ఆధారంగా చేసుకుని వచ్చిన పాటలూ ఉన్నాయి. అలాగే ఇతర సాంఘీక కథా నేపథ్యంగల సినిమాల్లో సందర్భానుగుణంగా సీతారాముల ప్రణయాన్ని వర్ణించిన పాటలూ ఉన్నాయి. ఈ రెండు రకాల పాటలని ఇక్కడ ఉదహరించుకుందాం.

## 2. అద్వైత ప్రణయం:

భవభూతి 'ఉత్తరరామ చరిత' నాటకంలో సీతారాముల ఆదర్శ ప్రణయాన్ని చిత్రిస్తూ ఇలా అంటాడు,

**''అద్వైతం సుఖదుఃఖయో రనుగతం సర్వాస్వవస్థాసు యత్**
**వి శ్రామో హృదయస్య యత్ర, జరసా యస్మి న్నహార్యో రసః**
**కాలే నావరణాత్యయా త్పరిణతే య త్స్నేహసారే స్థితం**
**భద్రం తస్య సుమానుషస్య కథమప్యేకం హి తత్ ప్రార్థ్యతే"** (ఉత్తరరామచరితనాటకమ్- అంకము.1శ్లో.32)

సుఖదుఃఖాలలో దాంపత్య ధర్మం అద్వైతంగా ఉంటుంది. భార్యాభర్తలు పరస్పర సుఖదుఃఖాలను పంచుకుంటారు. సంపదలు వచ్చినా ఆపదలు వచ్చినా ఈ దాంపత్యధర్మం విడిపోదు. ఒకరికొకరు ఓదార్పు అవుతారు. ముపలితనం పైబడుతున్నా కొద్దీ ప్రేమ పెరుగగుతుంది. ఆ ప్రేమ స్థిరత్వాన్ని పొందుతుంది. ఇదే దాంపత్య ధర్మసారం. అద్వైతంగా ఉన్న భార్యాభర్తల హృదయం మాత్రమే విశ్రాంత స్థితిలో ఉంటుందని అంటాడు కవి. '**మొగుడు వేల్పన పాత మాటది ప్రాణసఖుడు**' అనే ఆధునిక కవి గురజాడ అప్పారావు 'కాసులు' ఖండికలో వాడిన మాటలు భవభూతి వాడిన "స్నేహసారం" అనే పదం దగ్గర గుర్తుకు వస్తాయి. గురజాడ కన్న పన్నెండు వందల సంవత్సరాల క్రితమే భవభూతి భార్యాభర్తల మధ్య ఉండవలసిన స్నేహానురాగ ఆవశ్యకతను తెలిపాడు. ఈ పదంపైన ఆధునిక విమర్శకులు కూడా చాలా చర్చ చేసారు.

**"సీతారామకథ వినుడి... దేవుళ్ళే మెచ్చింది...**

**శివధనువదిగో... ఆ స్పర్శకి ఆలపించే.... ఆజానుబాహుడి ..."** (శ్రీరామ రాజ్యం-2011)

**"ముద్దుల సీతతోడ మురిపాలాడినాడు..."** (శ్రీరామదాసు-2006)

**"మావూరి దేవుడు... సీతమ్మ తెలుపంట ఓమాట ఓసీత..."** (అల్లుడా మజాకా-1995)

**"అడుగడుగున త్యాగము... అనుబంధము ...భార్య మొగనికోసం..."** (శ్రీరామ రాజ్యం-2011)

పై పాటలన్నింటిలో సీతారాములు సుఖదుఃఖాలలో ఏ విధంగా అద్వైతస్థితిలో ఒకరినొకరు అర్థం చేసుకున్నారో కనబడుతుంది. ఇప్పటికీ నవవధూవరులను సీతారాములతోనే పోల్చుతుంటారు.

"**మిథునభోగంలో కూడ సుఖానుభూతి ఉంది. అయితే, అది శరీరకైంకర్యంగా ప్రసరించి క్రమంగా ప్రశాంతి చెందుతుంది. కాయికమైన కర్మమే రతి అయితే, దానికి కలకాలం నిలిచే స్థాయి లేదు. అది అంతకరణ నిష్ఠం కావాలి, అంతఃకరణ నిష్ఠమైన రతి భావసంస్కారరూపమై ఉంటుంది. సుఖదుఃఖాలకు అద్వైతంగా నిలిచేది, సర్వావస్థల యందూ హృదయ విశ్రాంతిని కలిగించేదీ, వార్ధక్యంలో కూడా వన్నెవాసులు వాడిపోకుండా నిలిచేది, జీవితసాహచర్యంలో పరిణతిని సాధించేదీ అయిన సుమానుషధర్మం సంభోగపర్యంతమైన రతిభావం కావటానికి వీల్లేదు. దాన్ని స్నేహంగా గుర్తించాడు భవభూతి.**" (అభినవ లోచనం- డా.జి.వి.సుబ్రహ్మణ్యం, యువభారతి, 1983,పు.13)

పైన తెలిపిన భవభూతి శ్లోకంలో భార్యాభర్తల మధ్య కేవలం శరీరాకర్షణ ప్రేమ కాదని, అంతకు మించిన అర్థంచేసుకునే గుణమే అద్వైతస్థితి అని అంటాడు. అలాగే శరీరం వృద్ధాప్యంలోకి వెళుతున్నకొద్దీ వికాసం చెందేది ప్రణయం అంటాడు. అలాంటి స్థితి మనకు లవకుశ సినిమాలో వచ్చిన పాటల్లో కబడుతుంది.

"**ఆలూమగలా అనురాగాలకు... / పోలిక సీతారాములె యనగా.... వెలసిన ఆదర్శ ప్రేమావతారుడు...**

**నిరతము ధర్మమూ నెరపీ నిలిపీ... నరులకు సురులకు.... తర తరాలకూ..... / వరవడియైన వరయుగపురుషుడు.....**" (లవకుశ-1963)

### 3. ఆదర్శ ప్రణయం:

భార్యాభర్తలలో మొదటగా ప్రణయం జనించినా అది ఆదర్శం కావాలంటే నైష్కర్మ్య సిద్ధాంతం అర్థం కావాలి. నైష్కర్మ్యం అంటే ఏమీ ఆశించకుండా పని చేయడం. ప్రతి కుటుంబంలో భార్యాభర్తలు తల్లిదండ్రులుగా మారిన తరువాత ఎంతో కొంత నైష్కర్మ్యంగానే కుటుంబ బాధ్యతను తీసుకుంటారు. అది కేవలం 'నాది' అనే భావనలో ఒక్క కుటుంబానికే పరిమితమై ఉంటుంది. అదే బాధ్యత ఆ పరిమితత్వాన్ని దాటి ఎంత వరకు వెళుతుందో అంత లోకంలో ఆదర్శనీయులౌతారు వారు. అప్పుడే ''అందరి బంధువు''లౌతారు. లోకం వారిని కీర్తిస్తుంది. ప్రపంచాన్ని తల్లిలా/ తండ్రిలా ప్రేమించేవారే తన భాగస్వామిని అత్యున్నతంగా ప్రేమిస్తారు. ఇది భార్యాభర్తల పరస్పర అవగాహనమీద, అర్థంచేసుకునే సామర్థ్యం మీద ఆధారపడి ఉంటుంది. అదే ఇరువురిలోని శాశ్వత ఆదర్శ ప్రణయానికి కారణమౌతుంది. లోకంలో గొప్పవాళ్ళు దేనినైతే ఆచరిస్తారో దానినే ఇతరులు ప్రమాణంగా తీసుకుంటారు. ఆ ప్రమాణగుణాన్నే ఆదర్శం అనుకోవచ్చు.

**"అందరి బంధువయా భద్రాచల రామయ్య**
**ఆదుకునే ప్రభువయ్యా నా అయోధ్య రామయ్య…**
**తెల్లవారితే చక్రవర్తియై రాజ్యమునేలే రామయ్య**
**తండ్రిమాటకై పదవిని వదిలి అడవులకేగెనయా….,"** (దేవుళ్ళు- 2000)

ఈ పాటలో రాముని ధీర గుణం వర్ణితం. ఒక ధీరుడైన వాడే ఎంత పెద్ద బాధ్యతను అయినా మోయగలడు, ఎంత పెద్ద త్యాగాన్నైనా చేయగలడు. తెల్లవారితే మహారాజ్య పట్టాభిషేకం అనే బాధ్యతను తీసుకుంటా అనుకున్నవాడు. అదే స్థితప్రజ్ఞతతో రాజ్యం త్యజించి అడవుల కేగడానికి కూడా సిద్ధపడ్డాడు. ఇది కేవలం ధీరురాలైన స్త్రీకి మాత్రమే అర్థమవుతుంది. అందుకే సీత రాముని వెంట అడవికి నడిచింది. సహజంగా మనుషులు తమకు ఎన్ని బలహీనతలు ఉన్నా తనకు కాబోయే భాగస్వామికి మాత్రం ఒక్క బలహీనత కూడా ఉండకూడదనుకుంటారు. కానీ ఇక్కడ ఇద్దరికీ బలహీనతలు లేని స్థితి ఉంటేనే ఆ సంసారం అద్భుతంగా ఉంటుందని అనుకోరు. ఇక్కడ సీతారాములు ఇరువురు శారీరకంగా, మానసికంగా దృఢంగా ఉన్నవారు. అందుకే వారి ప్రేమ ఆదర్శమైంది.

భవభూతి శ్లోకంలో '' **… 'సుమానుషం' అనే చక్కని పదాన్ని వాడినారు. మానుషం అంటే మానవ ధర్మం. సుమానుషం అంటే మంచి మానుష ధర్మం. అంటే మానవ ధర్మాలన్నింటిలోను దాంపత్యధర్మం చాలా ఉత్తమ ధర్మమన్న అర్థాన్ని ఈ పదం తెలియజేస్తుంది.**'' (విమర్శక వతంసులు- ఆచార్య ఎస్వీ రామారావు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, 2011, పు.149)

ఒక గృహస్థు ఆదర్శంగా ఉంటేనే ఆ సమాజం ఆదర్శంగా ఉంటుంది. సుమానుష దాంపత్యధర్మం తెలిసినవారు గనుకనే సీతారాములు అలాంటి ఆదర్శమూర్తులగా నిలిచారు.

అందుకే,

**"జగదానంద కారక...జయ జానకీ ప్రాణ నాయకా..." (శ్రీరామ రాజ్యం-2011)**

**"శ్రీరాముని అనురాగం సీతా సతి వైభోగం**
**శ్రీరాముడు రసవేదం శ్రీ జానకి అనువాదం**
**ఏనాడు వీడిపోని బంధము..." ( శ్రీరామ రాజ్యం-2011)**

**"వినుడు వినుడు రామాయణ గాథ వినుడీ మనసారా...**
**ఆలపించినా ఆలకించినా ఆనంద మొలకించే గాథ...**
**శ్రీ రాముని రారాజు సేయగా కోరెను దశరథ భూజాని**
**పౌరులెల్ల ఉప్పొంగి పోయిరా మంగళ వార్తవిని..."** (లవకుశ-1963)

అని సినీకవులు అనగలిగారు. ఇంత గొప్ప ఆదర్శ జంట గురించి కావ్యం రాసిన కవి యొక్క భావనను, రాముని పాత్రచిత్రణ (Characterization) రామాయణ ప్రాశస్త్యం (Prosperity of Epic) గొప్పదనం కొన్ని వాక్యాల్లో చాలా స్పష్టంగా చెప్పాడు ఈ క్రింది పాటలో సినీకవి.

**"సందేహించకుమమ్మా... రఘురాము ప్రేమను సీతమ్మా....**
**ఒకే బాణము ఒకటే మాట - ఒక్క భామకే రాముని ప్రేమ**
**మిన్నే విరిగిపడినా..... వ్రతభంగమ్ము కానీడమ్మా**
**రఘుకులేశుడే ధర్మమువీడి మరోభామతో కూడిన నాడూ**
**నాదు జపము తపము - నా కావ్యమ్మె వృధయగునమ్మా..."** (లవకుశ-1963)

ఇలాంటి ఆదర్శనీయమైన దంపతులుగనుకనే వారి జీవిత చరిత్రను లోకులు ఈ విధంగా వేల తరాలనుంచి ఇలా పాడుకున్నారు.

### 4. స్నేహసార ప్రణయం:

"**దాంపత్యం అనేది స్త్రీపుంసయోగ మంటారు. అది కేవలం తర్కం వల్ల తెలిసేదికాదు. అసిధారావ్రతంలా అనుష్ఠింపదగింది. సంతానం కలగగానే దంపతీసాంగత్యం స్నేహసాహచర్యంగా మారుతుంది. దానినే భవభూతి "స్నేహసార" మన్నాడు**. (అభినవ లోచనం- డా.జి.వి.సుబ్రహ్మణ్యం, యువభారతి, 1983,పు.13)

పై విమర్శలనుబట్టి భవభూతి శ్లోకంలో సార్వకాలీయమైన ప్రబోధాంశం దాగివుందని తెలుస్తుంది. గృహస్థు ఎలా ఉండాలో, ఎలా ఉంటే ఆదర్శంగా ఉంటాడో సూత్రబద్ధం చేసేలా చెప్పాడు భవభూతి. సీతారాములు అదే 'స్నేహసారం' లో జీవించారు కనుక ఆదర్శమైనారు.

"**తాంబుల రాగల ప్రేమాంమృతం తమకించి సేవించు తరుణం**
**శృంగార శ్రీరామా చంద్రోదయం ప్రతీరేయి వైదేహి హృదయం**
**మౌనం కూడా మధురం... సమయం అంతా సఫలం...**
**ఇది రామ ప్రేమలోకం ... ఇలా సాగిపోవు స్నేహం**
**ఇందులోని మోక్షం రవి చంద్రులింక సాక్షం... ఏనాడు విడిపోని బంధం...**
**శ్రీ రామ రామ రఘురామా పిలిచే సమ్మోహన సుస్వరామా**
**సీతాభామా ప్రేమారాధానామా హరికే హరి చందన బంధనమా...**" ( శ్రీరామ రాజ్యం-2011)

నిరపేక్షమగు ప్రేమతత్వాన్ని, రాయప్రోలు, షెల్లి చెప్పిన స్వచ్ఛ ప్రేమతత్త్వాన్ని, అలాగే భార్యాభర్తల అనురాగతత్వాన్ని చాలా చక్కగా ఈ పాటలో తెలుపుతాడు కవి. 'మౌనం కూడా మధురం... సమయం అంతా సఫలం...' ఈ ఒక్క వాక్యం అర్థమైతే ఏ భార్యాభర్తల్లోను కలహాలనేవే ఉండవు. ఇది ప్రయత్నపూర్వకంగా కాదు అతి సహజంగా ఉండే మౌనం. అలాగే భార్యాభర్తల్లో యవ్వనంలోనే ఉండే సాంగత్యమే కాదు, వృద్ధాప్యంలో కూడా అదే సాంగత్య సుఖాన్ని అనుభూతి చెందేలా ఉండాలి. అప్పుడే అది స్నేహసారమవుతుంది. అందుకే ఇది చాలా జాగరుకతతో, ఇంద్రియాలను నిరంతరం గెలుస్తూ అనుష్టించదగిన అసిధారావ్రతం అన్నారు విమర్శకులు. అందుకే పాట చివర్లో ఎన్నడూ విడిపోని బంధం అంటారు కవి. విడి పోవడం అనేది శరీరానికి సంబంధించింది కాదు మనసుకు సంబంధించింది అనేది అర్థం చేసుకుంటే ఆ దాంపత్య స్నేహసార ప్రణయం అర్థమౌతుంది. ఫలితం ఆశించకుండా పని చేసే గుణమే స్నేహం కదా మరి.

అలాగే ఈ క్రింది పాటలో రాముడు, సీత ఒకరి నుండి ఒకరు ఏమాశిస్తున్నారో తెలిపాడు కవి. వారు ఆశిస్తున్నది మణులు మాణిక్యాలుకావు, ధనధాన్యాలు కావు, ఒకరికొకరు అతి సాన్నిహిత్యంలో ఉండడం. మనసు తెలిసికొని మెదలడం. అంటే భౌతిక సుఖాలకన్నా, అలౌకికానుభూతినందించే ప్రణయానందమే వారు కోరుకున్నదని తెలుస్తుంది.

**"సీతే రాముడి కట్నం... ఆ సీతకు రాముడు దైవం**
**అడవులనైనా అయోధ్యనైనా రామయ్యే సీతమ్మకు పేరంటం...**
**సీత అడిగిన వరమొకటే... చిటికెడు పసుపు కుంకుమలే**
**రాముడు అడిగిన నిధి ఒకటే... అది సీతమ్మ సన్నిధే...**
**రామకథలుగా వెలసేది ప్రేమ ఋజువుగా నిలిచేది**
**ఆనాడైనా ఏనాడీనా సీతమ్మ రామయ్యల కళ్యాణం"** (మగ మహారాజు-1983)

## 5. ధీరలక్షణాలు - ప్రణయ గుణం :

" **...నూరామడల సంద్రము దాట, వారధి కట్టి వానరులు...**

**సీతను చూడ సేతువు మీద సేనావాహిని పొంగినది...**" (సంపూర్ణ రామాయణం- ఆరుద్ర-1959)

పై పాటలో సీతను పొందడం కోసం రాముడు ఎంత గొప్ప ధైర్య, సాహసాలు ప్రదర్శించాడో మనకు తెలుస్తుంది. మనం మొదటగానే చెప్పుకున్నట్టు ధీరులు మాత్రమే ప్రేమించగలరు, వారే ఆదర్శులైతారు అనే దానికి నిదర్శనమే సీతారాములు. లోకంలో సహజంగా స్త్రీపురుషులు బాహ్య, అంతరంగ ధీరగుణాలతోనే పరస్పరం ఆకర్శణీయు-లౌతారు. కాని వారికున్న కొన్ని బలహీనతలతోని ఆ ధీర గుణాన్ని కోల్పోతారు. ఆ ధీరగుణాలని జీవిత చరణాంకం వరకు ఎవరైతే నిలుపుకుంటారో వారే ఉత్తములు. స్వయంవరానికి ముందు ఉన్న కథలో సీతాదేవి వీరత్వం కూడా కనిపిస్తుంది. ఎవరూ లేపలేని శివునివిల్లును ఒక సందర్భంలో సీతాదేవి పక్కకు జరుపుతుంది. ఇది జనకుడు చూసి

ఆమెకు సరైన జోడినే తేవాలనుకొని సీతా స్వయంవరం ఏర్పాటు చేస్తాడు. స్వయంవర ఘట్టంలో శ్రీరాముని ధీర, వీర గుణాల ప్రదర్శన మనకు తెలిసిందే. ఈ ఘట్టాన్ని వివిధ సినీకవులు చాలా రసరమ్యంగా వర్ణించారు.

**"వాలుకనుల ఆ జానకినీ... ఓరకనుల ఒకసారి గనీ చేల శివుని విల్లందుకుని... లీల విరిచెనట**

**నీల నీరద శ్యాముడట... కళ్యాణ రాముడట..."** (భక్తశబరి-1958)

**" ...జానకి చెలులతో నిలబడెను... కన్నిక రాఘవుడు చూచెను...**

**కన్నులు నాలుగు కలిసినవి..."** (సంపూర్ణ రామాయణం- ఆరుద్ర-1959)

ఈ పై పాటల్లో సీతారాములు వారివారి గుణవిశేషాలతో ముందుగానే ఒకరినొకరు ఇష్టపడ్డారని తెలుస్తుంది. ఇరువురిలోని ధర్మవీరం, దయావీరం లోకంలోని ప్రజలకు ఆదర్శం కనుకనే సీతారాముల ప్రణయాన్ని ఆదర్శంగా నేటికీ ప్రజలు గ్రహిస్తున్నారు.

**".... శ్రీరామచంద్రమూర్తిని అంతఃపుర గవాక్షం నుండీ సీతాదేవి ఓరకంట చూచినదై**
**చెంగట నున్న చెలికత్తెతో.. ఎంత సొగసుగాడే మనసింతలోనే దోచినాడే..."** (వాగ్దానం-శ్రీశ్రీ-1961)

అనే పాటలో బాహ్య, అంతరంగ ధీరగుణాలను చక్కగా వర్ణించారు కవి. వాల్మీకి రామాయణంలోని ఈ శ్లోకం "ఇయం సీతా మమసుతా సహధర్మచరీతవ..." సీత గొప్ప లక్షణాలను తెలుపుతుంది. జనకుడు తన కుమార్తె ఎంత ధీరురాలో, ఆమె వ్యక్తిత్వం ఎంత బలమైందో తెలుపుతాడు.

**"రామా కనవేమిరా శ్రీ రఘు రామ కనవేమిరా**
**రమణీ లలామ నవ లావణ్య సీమ... ధరాపుత్రి.. సుమ గాత్రి..**
**సీత వంక ఓరకంట చూసినాడు ఒక్క చిటికలో విల్లు ఎక్కు పెట్టినాడు ..."** (స్వాతిముత్యం-1985)

పై పాటలో రాముని బాహ్య ధీరత్వ గుణాన్ని వర్ణిస్తూ అది ఒక ధీరత్వ గుణంతో ఉన్న స్త్రీని ఎలా ఆకర్శిస్తుందో, వారి జీవితాన్ని ఎంత ఆదర్శం చేస్తుందో తెలుపుతాడు కవి. సీతా వర్ణనలో ఆమెకు రామునిపై ఉన్న ప్రణయస్వభావాన్ని చాలా అందంగా చిత్రిస్తాడు కవి. సమ ఉజ్జిలకు మాత్రమై ప్రేమను చివరి వరకు నిలుపుకునే సామర్థ్యం ఉంటుంది. అది సీతారాముల విషయంలో సాధ్యమైంది. లోకులు వారిని ఆదర్శంగా తీసుకొని ఆనందంగా ఇహపరసుఖములు పొందాలనే ప్రబోధం ఈ క్రింది పాటలో కనిపిస్తుంది.

**"రామకథను వినరయ్యా రామకథను వినరయ్యా**

**ఇహపర సుఖముల నొసగే సీతా రామకథను వినరయ్యా"** (లవకుశ-1963)

## 6. సీతారాముల విద్యా - వివాహం ఆదర్శం:

భారతదేశ విద్యావిధాన పటిష్టతే సీతారాముల ఆదర్శదాంపత్య ప్రణయకారకమైందని చెప్పవచ్చు. ఈ విద్యా విధానాన్ని అనుసరించారు కనుకే సీతారాములు మంచి గృహస్థులు అయినారని చెప్పవచ్చు. ఈ భావన

రామాయణం నుంచి మనం గ్రహించవచ్చు. ఇంచుమించు ఆంగ్లేయులు భారతదేశంలోకి వచ్చేనాటికి ఎన్నో వేల గురుకులాలుండేవి. గురుకులం అంటే కేవలం చదువు చెప్పడమే కాదు, సమాజానికి ఉపయోగపడే మంచి గృహస్థు అయ్యేవరకు గురువ శిష్యున్ని పట్టుకునేవాడు. రామ కథలో సీతా స్వయవరఘట్టంలో విశ్వామిత్రుడు రామలక్ష్మణులను తీసుకొని రావడంలో మనకది కనబడుతుంది. గురువు విద్య చెప్పడమే కాదు యోగ్యుడైనటువంటి అతనికే, ఆమెకే వివాహం చేసుకోవడానికి అనుమతించేవాడు. అర్హత సాధించారని శిష్యులకు గురువు యోగ్యతాగుర్తింపు (సర్టిఫికెట్) ఇస్తేనే వివాహం అయ్యేది. వివాహం సామాజిక ధర్మంగా భావించారు కాని వ్యక్తిగత ధర్మంగా కాదు. ఎందుకంటే వారి సంతానం మళ్ళీ సమాజంలోకి వస్తుంది కనుక. దాంపత్యం ఒక క్రతువులాంటిది. సత్ సంతానమే, మంచి పెంపకమే కావాలి గనుక అలా చేసేవారు గురువులు. అలాగే ఇతర జీవుల్లో కామం కేవలం సంతానం కొరకే. మనుషులలో మాత్రం సత్సంతాన లక్ష్యమే కామం పరమావధి. అందుకే గురువులు అర్హతలేనివానికి అత్యున్నత బాధ్యత ఇవ్వలేదు. దంపతులిరువురు కూడా నాకేమీ వద్దు అందరి కోసం పనిచేస్తాను అనుకునే వారు. అదే సంఘం శరణం గచ్ఛామి. ఈ క్రింది పాటల్లో ఈ సాంప్రదాయం మొత్తం కనబడుతుంది.

**"...మదన కోటి సుకుమారుని కనుగొని మిథిలకు మిథిలయె మురిసినదీ**
**ధరణిజ మదిలో మెరసిన మోదము కన్నుల వెన్నెల విరిసినదీ...**
**హరుని విల్లు రఘునాథుడు చేకొని ఎక్కిడ పెళ పెళ విరిగినదీ**
**కళకళలాడే సీతారాముల కన్నులు కరములు కలసినవీ"** (లవకుశ-1963)

రాముని రాకతో మిథిలా ప్రజలు కూడా మిక్కిలి సంతోషించారు అనడంలో అతని నాయకత్వ లక్షణాలు తెలియడమే కాకుండా సీతదేవి ఇష్టానికి కారణం కూడా తెలుస్తుంది. అలాగే గురువు అనుమతించాకే రాముడు స్వయంవరంలో పాల్గొనడం వల్ల గురుకుల విద్యా, గురువు ప్రాముఖ్యం వివాహవ్యవస్థలో ఎంతుందో తెలుస్తుంది. జ్ఞానమున్నవానికే, శౌర్యమున్నవానికే వివాహం చేసుకునే అర్హత ఉంటుంది. అలాంటివాడే సమాజానికి మేలుచేసే సత్ సంతానాన్ని అందిస్తాడనే గొప్ప ఆదర్శభావం ఇందులోని విషయం.

**"నెల మూడు వానలూ కురిసేనురా..... బంగారు పంటలూ పండేనురా...**
**కష్టజీవుల వెతలూ తీరేనురా... బీదాసాదా బ్రతుకు మారెనురా...**
**రామయ్య వంటి కొడుకు రావాలనే.... సీతమ్మ వంటి బిడ్డ కావాలనే ...**
**పేదతనము భుమిమీద ఉండబోదురా... భేదాలకిక మీద తావులెదురా ...**
**న్యాయమ్ము పాలించినడుపువాడురా.... ధర్మమ్ము గిరిగీసి నిలుపు తాడురా...."** (లవకుశ-1963)

పై పాటలో బీదతనంలేదని, పంటలుపండాయాని తెలుపడంలో అంతరార్థం రాజ్యం సుభిక్షంగా ఉందని అర్థం చేసుకోవాలి. ధీర, శౌర్య, జ్ఞానవంతులైన సీతారాములు రాజ్యపరిపాలన చేయడంవల్లనే ప్రజలు సుఖశాంతులతో ఉన్నారని భావం. అందుకే అలాంటి రాముడే, అలాంటి సీతనే వారికి కొడుకుగా, కూతుర్లుగా పుట్టాలని

కోరుకుంటున్నారట ప్రజలు. తమ సంతానం అయోగ్యంగా ఉండాలని ఎవరూ కోరుకోరుకదా.

**"రాముని అవతారం... రవికుల సోముని అవతారం**

**సుజన జనావన ధర్మాకారం దుర్జన హృదయ విదారం..."** (భూకైలాస్ - 1958)

అందుకే సీతారాముల జంటని, వారి చరిత్రనీ సమకాలికులే కాదు ఇప్పటివారు రాబోయే తరాల వారూ ఆదర్శంగా తీసుకుంటారు. గానం చేస్తారు.

## 7. ముగింపు:

**"యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః- స యత్ర్పమాణం కురుతే లోక స్తదనువర్తతే"** (భగవద్గీత, 3-21) అనే గీతాసారాంశం సీతారాముల జీవితంలో స్పష్టం. సీతారాముల ప్రణయసుధారాగం సార్వకాలీనం, నిత్య సమకాలీనం. అందుకే ఇప్పటికీ వారి పెళ్ళిని సంవత్సరానికొకసారి జరుపుకుంటూ ప్రజలు గుర్తుచేసుకుంటారు. వారి జీవితంలో భాగస్వామ్యం చేసుకుంటారు.

**"సీతారాముల కళ్యాణం చూతము రారండి...**
**జానకి దోసిట కెంపుల ప్రోవై ... రాముని దోసిట నీలపురాశై**
**ఆణిముత్యములు తలంబ్రాలుగా... శిరముల మెరిసిన సీతారాముల కళ్యాణం చూతము రారండి..."**

(సీతారాముల కళ్యాణం-సముద్రాల రాఘవాచార్య -1961 )

పై పాట ఇప్పటికీ ప్రతి పెళ్ళిల్లలోను వినబడుతుంది. సామాన్యంగా సినిమా చూసే సహృదయ ప్రేక్షకుడు ఆయా కావ్య పాత్రలలో తన్నుతనూ ఊహించుకుంటాడు, లీనం చెందుతాడు కనుకనే అందులో ఉండే ధర్మాలను, లక్షణాలను నిజజీవితంలో అనుకరించాలని చూస్తాడు. మొదటి నుండి రామాయణ కావ్యం చేస్తుంది అదే.

భార్యకోసం ఎంతో దూరం ప్రయాణించి, సంముద్రంపైన వారధి కట్టి తన ప్రణయాన్ని చాటుకున్న రాముడి గుణాన్ని ఏ స్త్రీ ఇష్టంగా చూడదు?., అలాగే భర్త అత్యున్నత ధర్మాన్ని నిరంతరం అర్థం చేసుకునే అనుకూలవతియైన సీతలోని గుణాన్ని ఏ పురుషుడు ఇష్టంగా చూడడు?. అందుకే నేటికి ప్రజలు సీతారాముల పాత్రల్లో లీనమై తమని తాము ఆ ఆదర్శ దంపతులుగా ఊహించుకుంటారు. దానికి ఉదాహరణే పైన తెలిపిన సముద్రాల రాఘవాచార్య గారి సినిమా పాట నేటికీ చిరంజీవిలా ఉండడమే.

చివరగా ఒక్క మాట ఏ ఆదర్శమైనా కేవలం విని కూర్చుంటే, పొగుడ్తూ తిరుగుతుంటే సరిపోదు. దాన్ని ఆచరణలోకి తీసుకువస్తేనే దాని ఫలితాన్ని, అందులోని అమృతానందాన్ని అనుభవిస్తాం.

**"రాముడ్డైనా కృష్ణున్నైనా కీర్తిస్తూ కూర్చుంటామా**

**వాళ్ళేం సాధించారో కొంచెం గుర్తిద్దాం మిత్రమా..."** ( ఒక్కడు-2003)

## 8. ఉపయుక్తగ్రంథసూచి:


1. అప్పన్నశాస్త్రి, బులుసు. (1947). శ్రీభగవద్గీతా. శారదాముద్రణాలయము, భట్నవిల్లి, తూర్పుగోదావరి.
2. రామారావు, ఎస్వీ. (2011). విమర్శక వతంసులు, ఆంధ్రసారస్వతపరిషత్తు, హైదరాబాద్.
3. వీరరాఘవాచార్య, వాధూల. (వ్యాఖ్యా). (1940). భవభూతి ఉత్తరరామచరితనాటకమ్, వావిళ్ల రామశాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు.
4. సుబ్రహ్మణ్యం, జి.వి. (1983). అభినవ లోచనం, యువభారతి, సికింద్రాబాద్.
5. సంపూర్ణ రామాయణం (1959) సినిమా పాటల పుస్తకం. (పాటల రచయిత ఆరుద్ర) పి.డి.ఎఫ్.


**అనుబంధం** : తెలుగువారి పెళ్ళి శుభలేఖలపైన ఈ శ్లోకం తరచూ కనిపించేది. ఈ క్రింది శుభలేఖలు చూస్తే మనకది తెలుస్తుంది. ఈ శ్లోకంలోని కొంత భావానుకరణే 'సీతారాముల కళ్యాణం' (1961) సినిమా కొరకు సముద్రాల రాఘవాచార్య రాసిన '' శ్రీ సీతారాముల కళ్యాణం చూతమురారండి...'' పాట.

''జానక్యాః కమలామలాఞ్జలిపుటే యాః పద్మరాగాయితాః
న్యస్తా రాఘవమస్తకే చ విలసత్కున్దప్రసూనాయితాః
స్రస్తాశ్శ్యామలకాయకాన్తికలితా యా ఇన్ద్రనీలాయితాః
ముక్తాస్తాశ్శుభదా భవన్తు భవతాం శ్రీరామవైవాహికాః...''

(https://telugupadyam.blogspot.com/2012/04/blog-post.html?m=1)

***

**గమనిక:** ఈ పత్రికలోని వ్యాసాలలో అభిప్రాయాలు రచయితల వ్యక్తిగతమైనవి.
వాటికి సంపాదకులు గానీ, పబ్లిషర్స్ గానీ ఎలాంటి బాధ్యత వహించరు.




AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_04.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)

# 4. 'అనుమాండ్ల భూమయ్య' రామకథా కావ్యాలు: సూక్ష్మాంశశోధనలు

**డా. తత్వాది ప్రమోద కుమార్**

అసోసియేట్ ప్రొఫెసర్,
ఎస్ ఆర్ ఆర్ ప్రభుత్వ ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాల, కరీంనగర్,
కరీంనగర్, తెలంగాణ.
సెల్: +91 9441024607. Email: thatwadi@gmail.com

**వ్యాససంగ్రహం:**

*వాల్మీకి మహర్షి రామాయణ మహాకావ్యంలో పేర్కొన్న ఘట్టాలను పాత్రలను ఆధారంగా చేసుకొని, తెలుగు కవులు రచయితలు రామ సంబంధ రచనలు విస్తృతంగా రచించినారు. అలా తెలుగులో రామ కథా సంబంధమైన శతకాలు కావ్యాలు, కథలు, నవలలు కోకొల్లలుగా వెలువడినాయి. రామాయణ కావ్యం లోని పాత్రలను ఆధారంగా చేసుకుని ఆచార్య అనుమాండ్ల భూమయ్య జ్వలిత కౌసల్య, త్రిజట, కబంధమూక్షము అనే చిరుకావ్యాలను రచించినారు. వాల్మీకి మహర్షి ప్రవచించిన రామాయణ కావ్య పరమార్థాన్ని సూక్ష్మాంశాలుగా శోధించి తెలుసుకొని వాటిని ఈ కావ్యాల ద్వారా పాఠకులకు అందించినారు. ఈ కావ్యాలలో ఆయా పాత్రల మనో విశ్లేషణ కథాక్రమాన్ని నడిపించిన తీరు పద్య రచనలు పద ప్రయోగాలు భూమయ్య చూపిన నేర్పు కథలో చేసిన మార్పులు సామాజిక ప్రయోజనాలను పాఠకులకు అందించినతీరును తెలియజేయడమే వ్యాసం యొక్క ప్రధాన ఉద్దేశం*

**Keywords:** రామాయణం, వాల్మీకి మహర్షి, అనుమాండ్ల, భూమయ్య, జ్వలితకౌసల్య, త్రిజట, కబంధుడు, ఏకపత్నీ వ్రతం, ఆత్మవివేచన, దానవత్వం, మానవత్వం, దైవత్వం.

## 1. ఉపోద్ఘాతం:

భారతీయ నాగరికతా సంస్కృతులకు వేదాలు ఉపనిషత్తులు రామాయణ మహాభారతాది ఇతిహాసాలు మూలం. వాల్మీకిమహర్షి ముఖతః వెలువడిన రామాయణం అచ్చమైన మర్యాదా మానవ మూర్తిమత్వానికి ప్రతీక. రామాయణ కావ్యంలో రాముడు మొదలుకొని విభీషణుని వరకు అనేకమైన పాత్రలను వాల్మీకిమహర్షి సృజించినాడు. కావ్య ప్రయోజనాలు కథా పరిమితుల దృష్ట్యా కావ్యంలోని అన్ని పాత్రలు పూర్తిస్థాయి పాత్ర చిత్రణకు నోచుకోలేవు. ఆ కారణంగానే కౌసల్య, సుమిత్ర, శాంత, శబరి, అహల్య, మంథర, తాటకి, త్రిజట,

భరతుడు, శత్రుఘ్నుడు, గుహుడు, కబంధుడు, సుబాహు మొదలైన పాత్రలు పూర్తిస్థాయిగా రామాయణంలో పాఠకులకు కనిపించవు. స్వల్పంగా మెరిసిపోయే ఆయా పాత్రల స్వభావాన్ని పాత్రల ఔన్నత్యాన్ని గుర్తించడం సాధారణ పాఠకులకు కష్టసాధ్యం. సాధారణ పాఠకులు కథా గమనాన్ని మాత్రమే అనుసరిస్తారు. విమర్శకులు కావ్య అంతరార్థాన్ని పరికిస్తారు. సహృదయ పాఠకులు/విమర్శకులు అంతరార్థంలోని పరమార్థాన్ని దర్శిస్తారు. "Look between the lines. Read between the words. The most important things are left unsaid and unheard". కావ్యఅంతరార్థాన్ని, అంతరార్థంలోని పరమార్థాన్ని దర్శించిన సహృదయుని ముఖతః విశేషాంశాలు వెల్లడవుతాయి. ఆ సహృదయుడు కవితా రస హృదయుడైతే అవి కావ్యంగా కవిత్వంగా రూపుదిద్దుకుంటాయి. ఎందరో కవి పండితులు వైవిధ్యభరితమైన ఆయా పాత్రలను ప్రధానంగా చేసుకొని ఆయా పాత్రల స్వభావాలను ఆ పాత్రల యొక్క అంతరంగ విశ్లేషణతో కథా కావ్యాలను రచించిన వారు ఉన్నారు. అలాగే కవి పండితులైన ఆచార్య అనుమాండ్ల భూమయ్య చేతిలో జ్వలిత కౌసల్య, త్రిజట, కబంధమూక్షము అనే రామకథా కావ్యాలు రూపుదిద్దుకున్నాయి.

అధ్యాపకుడిగా, విశ్వవిద్యాలయ ఆచార్యుడిగా, విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడిగా, అంతకుమించి పరిశోధకుడిగా, విమర్శకుడిగా పద్యగేయ కవిగా ఆచార్య అనుమాండ్లభూమయ్య కీర్తి ప్రతిష్ఠలైనారు. 1994 మొదలుకొని ఇప్పటివరకు వారు 16 పద్య రచనలు చేసినారు. అందులో జ్వలిత కౌసల్య, త్రిజట, కబంధమోక్షము అనే మూడు రామకథ సంబంధమైన కావ్యాలు.

## 2. కావ్య వస్తువు:

### 2.1 జ్వలిత కౌసల్య:

అవతార మూర్తి శ్రీరామచంద్రుని కన్నతల్లి కౌసల్య. రాజు కావలసిన కన్న కొడుకు వనవాస విషయం తెలిసిన తల్లి కౌసల్య ఆవేదనకు అక్షర రూపమే జ్వలిత కౌసల్య కావ్యం. ఇది 109 పద్యాల కావ్యం.

శ్రీరాముడు తండ్రి ఆజ్ఞ మేరకు పినతల్లి భవనం చేరుకొని, కైకేయి చెప్పిన విధంగా వనవాసానికి సిద్ధమవుతాడు. వనవాస గమనానికై రాముడు తల్లి కౌసల్య అనుమతి తీసుకోవడానికి కౌసల్య భవనానికి చేరుకొనడంతో కథ ప్రారంభమవుతుంది. తల్లి పాదాలకు నమస్కరించి కైకేయ మాటలను ప్రస్తావించి తల్లి అనుమతి కోరినాడు రాముడు. రాముని మాటలు విన్న కౌసల్య హతాశురాలై "**స్వర్గమున నుండి పడిన దేవతయ వోలె నేల పడిపోయినది.**"[1] రాముడు ఆ తల్లి నెత్తి నిలిపినాడు. అలా తనను ఉద్ధరించిన కొడుకును చూసి కౌసల్య ఉద్విగ్న మనస్కయై తన దుఃఖాన్ని వెళ్లకక్కుతుంది.

మీ తండ్రి దశరథుని ఇంట కాలు మోపినది మొదలు తనకు సుఖము లేదని, నిన్ను కన్న తర్వాతనే సుఖానుభూతి పొందినానని, నీపై ప్రేమానురాగాలు చూపిస్తూ తన బాధలన్నీ మర్చిపోయినానని రామునితో చెప్పుకున్నది. రాముడు రాజ్యం చేస్తే చూడాలని తలపుల్లో ఉన్న కారణంతో ఉన్న కౌసల్య రామ వనవాస వార్త భరింపరానిదైంది. తాను పడిన కష్టాలను భర్త చూపిన నిర్లక్ష్యాన్ని, సపత్నులు చేసిన అవమానాలను రాముని ఎదుట వెల్లబోసుకున్నది. తల్లడిల్లుతున్న మాతృమూర్తి హృదయ వేదన తల్లి మాటల ద్వారా గమనించిన రాముడు తన ఎదలో పొంగిపొర్లుతున్న దుఃఖాన్ని స్థిరచిత్తం తో అణచుకున్నాడు. కానీ లక్ష్మణుడు మాత్రం క్రోధావేశుడైనాడు. తండ్రి చేసినది అధర్మమని "**తండ్రి ప్రేమను మూలకు పెట్టి తండ్రిని బంధింతునని**"[2] అనంత క్రోధాన్ని వ్యక్తపరిచినాడు. లక్ష్మణుని ఆవేశపు పలుకులు కౌసల్యకు న్యాయమనిపించినాయి. తండ్రి ఆజ్ఞ వలెనే తల్లి మాట కూడా జవదాటకూడదని అంటూ రాముడు అడవికి వెళ్లడానికి కౌసల్య అనుమతించలేదు. ఒకవేళ రాముడు వెళితే రాముని తో పాటు తాను కూడా వస్తానని కౌసల్య పేర్కొంది. తల్లి కౌసల్య హృదయంలో రగులుతున్న బాధానల జ్వాలలను కౌసల్య మాట వల్ల రామచంద్రుడు గ్రహించినాడు. ఆ బాధానల జ్వాలలకు తండ్రి దశరథుని బహుభార్యాత్వమే మూలమని గ్రహించినాడు. అందువల్ల వెంటనే రాముడుదృఢ హృదయుడై "**గడిచినట్టి కాలమ్మేదొ గడిచిపోయె ఒక్క సీతయే ఈ జన్మకున్న భార్య**"[3] అని ప్రతిజ్ఞ చేసినాడు. రాముని ప్రతిజ్ఞ వల్ల కౌసల్య దుఃఖం పరితాపం తొలిగిపోయింది. ప్రశాంత హృదయ అయిన కౌసల్య రామునికి వనవాస గమనానికై అనుమతినిచ్చింది. "**స్వస్తి రఘురామ! నా తండ్రి! స్వస్తి నీకు**"[4] అని మంగళాశాసనం పలకడంతో కావ్యం ముగుస్తున్నది.

## 2.2 త్రిజట:

త్రిజట సాధారణ రాక్షస వనిత. రావణుని ఆజ్ఞచే అశోకవనంలో ఉన్న సీతాదేవికి కాపలాగా ఉన్న రాక్షస స్త్రీలలో ఒకరు. రావణాది రాక్షసుల వినాశనాన్ని రామచంద్రుని విజయాన్ని త్రిజట ఆ కలలో దర్శిస్తుంది. స్వప్నవృత్తాంతాన్ని తోటి రాక్షస స్త్రీలకు ఎరిగించడం ద్వారా వాల్మీకి మహర్షి భవిష్యత్ కథా సారాన్ని పాఠకులకు సూచనామాత్రంగా తెలియజేసినాడు. ఇది సుందరకాండలోని వృత్తాంతం. ఆచార్య అనుమాండ్ల భూమయ్య త్రిజట వృత్తాంతాన్ని మూలంలో ఉన్నట్లు యథాతథంగా స్వీకరించినారు.

కథాగమనంలో మార్పు చేయలేదు కాని త్రిజట పాత్రకు వన్నెలు దిద్దినారు. జన్మ సంస్కారాన్ని కలిగిన రాక్షసిగా, జన్మ సంస్కార ఫలితంగా ఆత్మ దర్శనం చేసుకున్న ఉత్తమ మనిషిగా, తద్వారా భగవత్ సాక్షాత్కారాన్ని పొందడానికి తపించిన దైవగుణ సంపన్నురాలిగా త్రిజటను భూమయ్య తీర్చిదిద్దినారు.

సీతాన్వేషణలో భాగంగా ఆంజనేయుడు లంకలో కాలు మోపడంతో కావ్యం ప్రారంభమవుతుంది. రావణుడు సీతను హెచ్చరిస్తాడు. సీత గడ్డిపరకను అడ్డుగా ఉంచుకుని సమాధానమిస్తుంది. ఈసమయంలో త్రిజట నిద్రపోతుంది. త్రిజట కన్న కలలో లంకా నగరంతో పాటు రావణాది రాక్షస వీరులందరూ వినాశమైనారు. శ్రీరాముడు పరబ్రహ్మస్వరూపంగా దర్శనం ఇచ్చినాడు. నిద్ర నుంచి మేల్కొన్న త్రిజట స్వప్నవృత్తాంతాన్ని తోటి రాక్షస స్త్రీలకు తెలియజేసింది. పరబ్రహ్మస్వరూపుడైన రామునిలో లీనం కావడమే జన్మకు ఫలితమని, అది ఫలించాలంటే సీతాదేవి అనుగ్రహం పొందాలని త్రిజట భావించింది. తోటి రాక్షస స్త్రీలకు సీతాదేవి పట్ల గౌరవభావాన్ని పెంపొందింప చేసింది. వారితో కలిసి సీతా దేవిని సేవిస్తూ ఆడింది పాడింది. ఆత్మసాక్షాత్కారాన్ని పొందిన త్రిజట పరబ్రహ్మమైన రామునిలో ఐక్యం కావడానికి తపించింది. ఆ తపనతో ఆమెలో మోహశోకాలు నశించినాయి. ఆమెకు సర్వం రామమయంగా తోచింది. రామునికి అంజలింతునని పలికింది. ఆ మాటలను పలికిన త్రిజటను,త్రిజటహృదయంలో నెలకొన్న రామచంద్రుని దర్శించిన ఆంజనేయుడు "**జయము రఘువంశ కీర్తికి జయము జయము**"[5] అంటూ స్వస్తి వాక్యాన్ని పలకడంతో కావ్యం ముగుస్తుంది.

## 2.3 కబంధమోక్షము:

వికృత రూపుడైన కబంధుని కథను వాల్మీకి మహర్షి రామాయణం లో అరణ్యకాండలో ఐదు సర్గల్లో ప్రస్తావించినాడు. ముల్లోకాలలో అందరినీ మించిన అందగాడైన కబంధుడు వికృతపుటాలోచనలతో వికృత శరీరాన్ని ధరించి మునులను, సాధువులను పరిహసిస్తుంటే స్థూలశిరుడు అనే మహర్షి శాపానికి గురవుతాడు. ఫలితంగా శాశ్వత వికృత శరీరుడౌతాడు. కబంధుడు మునిని ప్రాధేయపడి ప్రార్థించగా దశరథాత్మజుడైన రాముడు నీ భుజాలను నరికి నిన్ను దహించినప్పుడు శాప విముక్తి కలుగుతుందని స్థూలశిరుడుశాప విముక్తి మార్గాన్ని తెలిపినాడు.

ఈ స్థితికి ముందుగానే కబంధుడు తపస్సు చేసి బ్రహ్మ దేవుని మెప్పించి దీర్ఘాయువును వరంగా పొందినాడు. ఆ వరగర్వంతో వికృతపుటాలోచనలు వికృతపు శరీరంకలిగిన కబంధుడు తెలివిహీనుడై ఇంద్రుని ఎదిరించినాడు. ఇంద్రుడు కోపించి వజ్రాయుధంతో కబంధుని కాళ్లు చేతులు తొడలు శిరస్సు నరికి వేసి ప్రాణాలతో వదలినాడు.కబంధుని జీవిక కోసం పొడవైన చేతులను మాత్రం ఇంద్రుడు ప్రసాదించినాడు. ఆనాటి నుండి కబంధుడు మరింత వికృతుడై కదలక మెదలక బండ బతుకును ఈడుస్తాడు.

సీతాన్వేషణ విషయమై రామలక్ష్మణులు అరణ్యంలో సంచరిస్తూ కబంధుని నివాస ప్రాంతానికి చేరుకుంటారు. కబంధుని హస్తాల్లో చిక్కుకుంటారు రామలక్ష్మణులు కబంధుని హస్తాలను నరికి వేస్తారు. ముని వచించిన విధంగా శాప విముక్తి ప్రసాదించే రాముడే ఇతడు అని భావించి తనను దహించివేయుమని రామున్ని

ప్రార్థిస్తాడు. కబంధుని ప్రార్థనపై రాముడు కబంధుని అగ్నికి ఆహుతి చేస్తాడు.పాప విముక్తితో నిజరూపం పొందిన కబంధుడు రాముని పట్ల కృతజ్ఞతాపూర్వుడై సుగ్రీవుని గురించి తెలియచేసి, సుగ్రీవుని నివాస మార్గాన్ని వివరిస్తాడు. తన జన్మకు ఉపకారం చేసిన రామునికి ప్రత్యుపకారం చేస్తాడు.

ఆచార్య అనుమాండ్ల భూమయ్య కబంధుని కథను యధా మూలకంగానే అనువదించినారు. కాని కథనంలో కొంత మార్పులు చేసినారు. కథనంతా కబంధుని చేత ఆత్మాశ్రయంగా రామునికి వినిపింప చేసినారు. కబంధుడు నిజరూపం పొందిన తర్వాత రామున్ని విష్ణుపరంగా స్తుతించినట్లు రచించినారు. ఇవి రెండు భూమయ్య చేసిన మార్పులు. కబంధుని చేత కథ చెప్పించడం ద్వారా, పశ్చాత్తాపంతో కుమిలిపోతున్న కబంధుని హృదయావేదనను జీవుని వేదనను భగవంతుని ఎదుట వెల్లబోసుకుని భగవంతుని అనుగ్రహంతో మోక్షాన్ని చేరవచ్చు అనే సూచనను ఈ కావ్యం ద్వారా భూమయ్య వెల్లడించినారు.

## కావ్య నిర్మాణం:

"**అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః యధాస్మైరోచతే విశ్వం తథేదం పరివర్తతే**" (ఆనందవర్ధనుడు) కావ్యప్రపంచానికి సృష్టికర్త కవి తాను ఎంచుకున్న కథా భాగాన్ని అనుసరించి కవికథాక్రమాన్ని, కావ్యనిర్మాణానికి బాటలు ఏర్పరచుకుంటాడు. ఆచార్య అనుమాండ్ల భూమయ్య ఎన్నుకున్న ఈ రామకథలు వాల్మీకి మహర్షి రచించిన రామాయణాంతర్భాగ కథలు. ఇవి విస్తృత రామాయణకథలో కీలకమైన సంఘటనలు. ఈ చిన్న సంఘటనలను ఆధారంగా చేసుకుని కావ్య నిర్మాణం చేయడం కవి ప్రతిభకు ఓ పెద్ద పరిక్షే. కాని ఆచార్య అనుమాండ్ల భూమయ్య ఈ కావ్య కథలను ప్రణాళికాబద్ధంగా ఆవిష్కరించి కావ్య నిర్మాణాన్ని ఆకర్షణీయం చేసినారు

త్రిజట మినహా మిగిలిన రెండింటిలోనూ అనగా జ్వలిత కౌసల్య, కబంధ మోక్షంలో కథా గమనాన్ని కొన్ని ప్రకరణాలుగా పేర్కొన్నాడు. ప్రకరణ నామంతో పాఠకునికి కథాగమనం సులభంగా బోధపడుతుంది. కథా వేగం కూడా పెరిగినట్లు అవుతున్నది. బిగువు సడలకుండా కథను ముందుకు నడిపించినారు.

## 3.1 జ్వలిత కౌసల్య:

జ్వలిత కౌసల్యలో ఎనిమిది ప్రకరణాలు ఉన్నాయి. కైకేయి వరంతో కథ ప్రారంభమవుతుంది. వేదనాగ్ని భరితమైన హృదయం జ్వలితకౌసల్యగా మారింది. కౌసల్య హృదయవేదననువిన్న లక్ష్మణుడు భరించలేక పోయినాడు. అనంతక్రోధాగ్ని ప్రకటించినాడు. లక్ష్మణుని ప్రతిస్పందనతో కౌసల్య మాతృహృదయం పొంగి పొరలింది. రాముడు మాతృ ప్రేమను స్వీకరిస్తూనే పితృ వాక్య పరిపాలనకు కట్టుబడి నిలిచినాడు. తల్లిని ఒప్పించినాడు. పుత్రవాత్సల్యం ప్రదర్శించే కౌసల్యకు రాముడు ఏకపత్నీవ్రతంతో ఉంటానని ప్రతిజ్ఞ చేసినాడు. కౌసల్య నోట మంగళాశాసనం పలికిస్తూ కథను మనోహర క్రమంగా తీర్చిదిద్దినారు. కవి కథా గమనంలో కావ్య

నిర్మాణంలో పునరుక్తులు అనవసర బోధనలు లేవు. పాత్రల మనఃప్రవృత్తిని చిత్రించినతీరు పాఠకులకు ఆకర్షణీయం గా నిలుస్తున్నది.

### 3.2 త్రిజట:

త్రిజట కావ్యంలో ప్రకరణ విభజన లేదు. త్రిజట తాను కలలో కాంచిన విషయాన్ని తోటి రాక్షస స్త్రీలకు వివరిస్తుంది. వారిని కూడా సాత్వికమూర్తులుగా మార్చడానికి ప్రయత్నిస్తుంది. ఆత్మోద్ధరణకైపరితపిస్తుంది.ఇది ఏకబిగిన సాగినకథ కథను 131 పద్యాలలో రచించినారు.

త్రిజట స్వప్న వృత్తాంతం వాల్మీకి రామాయణం సుందరకాండలో కేవలం 48 శ్లోకాలలో ప్రస్తావితమైంది. మూల కథలో మార్పు చేయలేదు. త్రిజట పాత్ర హృదయ సంస్కారాన్ని పరిపుష్టం చేయడంలో కవి ప్రతిభను ప్రదర్శించినారు. అంతవరకు జరిగిన రామాయణ కథను ఆరు పద్యాల్లో త్రిజటముఖతః పలికించినారు. ఇది మూలంలో లేదు దీనివల్ల రాక్షస స్త్రీలకు రాముని గూర్చి పరిచయం చేయడంతో పాటు పాఠకులకు పూర్వగాథను గుర్తుచేసినట్లు (Remind) అవుతున్నది. "**ఎరుగ రాక్షస జన్మ**"6 అనే ఆత్మవికిత్సతో ప్రారంభమైన త్రిజట భావపరంపర "**ఇది ఎల్ల రామ మయమైతే నాకు శోకము లేదు మోహము లేదు నాకు**"7 అని ఆత్మ పరిణతి చెందిన వ్యక్తిగా కొనసాగినాయి. సర్వ సృష్టి రామమయంగా భావించిన త్రిజట నోట రామునికి అంజలింతునని పలికించడం అది విన్న ఆంజనేయుడు జయము జయము అని పలికి మంగళప్రదంగా కథను ముగించడం కావ్య నిర్మాణ నైపుణ్యమే.

### 3.3 కబంధమోక్షము:

11 ప్రకరణాలలో కబంధమోక్షము కథ విస్తరించింది కబంధునికి శ్రీరామ దర్శనముతో కావ్యకథ ప్రారంభమవుతుంది. మునిశాపము, బ్రహ్మ వరము, వజ్రఘాతము, పరితాపము, ఇలా చివరివరకు ఒక్కొక్క ప్రకరణలో కబంధుని ఆత్మవృత్తాంతం తో పాటు పశ్చాత్తాప హృదయాన్ని కవి ఆవిష్కరింప చేసినారు.

దేహాభిమానం, వరగర్వం వల్ల తామసుడైపోయిన కబంధుడు రామ దర్శనం వల్ల, రామానుగ్రహం వల్ల సాత్వికుడైనాడు. నిజరూప దారియైన కబంధుడు రాముని శ్రీమహావిష్ణువు పరంగా స్తుతించినాడు. ఇది మూలంలో లేదు. మహాభారతంలోని భీష్మ స్తవం ఆలంబనగా చేసుకుని రచించినారు. ఇది కబంధునిలోని చిత్త సంస్కారాన్ని పరిపూర్ణం చేస్తున్నది. ఆత్మజ్ఞానాన్ని తెలిసిన కబంధుడు "**తొలగె దేహాత్మ భావన ......**" [8] అని పలకడంతో కావ్య కథ ముగుస్తున్నది.

రామాయణ మహాకావ్యంలో సూక్ష్మరేఖాంశాలుగా ఉన్న ఈ మూడుకథలు కథలలోని పాత్రల మనఃప్రవృత్తిని ఆధారంగా చేసుకుని విశ్లేషణ పటిమతో ఆయా పాత్రలను విశేషమూర్తులుగా అనుమాండ్ల

భూమయ్య తీర్చిదిద్దినారు. వాల్మీకి మహర్షి మనోగతాన్ని అర్థం చేసుకొని రామాయణ కథా పరమార్థాన్ని పండితుల పాఠకుల హృదయాలలో వికసింప చేసినారు.

### 4. కావ్య శిల్పము:

ప్రాచీనాధునిక కావ్య శిల్ప విద్యను, కావ్య శిల్ప రహస్యాలను తెలిసిన ఆచార్య అనుమాండ్ల భూమయ్య ఈ రెండింటిని సమన్వయిస్తూ రామకథ కావ్యాలను రచించడం గమనించదగిన విషయం. వస్తువు పాత్ర చిత్రణ, రసము, భాష, ఛందస్సు, అలంకారాలు మొదలైనవి ప్రాచీన కవిత్వంలో ప్రధానం. పాత్రల మనఃప్రవృత్తి, విశ్లేషణ, సరళ భాష, సామాజిక సందేశం మొదలైనవి ఆధునిక సాహిత్యంలో ప్రధానం.

జ్వలిత కౌసల్య, త్రిజట, కబంధమోక్షము ఈ కథావస్తువులన్నీ రామాయణ కావ్యం లోనివి అంటే ప్రసిద్ధమైన కథలే. కవి ఈ పాత్రల అంతరంగాన్ని కొత్త కోణంలో ఆవిష్కరించడమే ఈ కావ్యాలలోని నూతనత్వం.

గారాల ముద్దుబిడ్డకు అన్యాయం జరుగుతుంటే తట్టుకోలేని మాతృమూర్తి ఆవేదనతో పాటు బహు భార్యత్వం వల్ల సపత్నుల మధ్య ఉండే ఈర్ష్యా ద్వేషాలు, ఈసడింపులు, స్వేచ్ఛా విహీనత మొదలైన వాటిని జ్వలిత కౌసల్య లో గుర్తించవచ్చు. మాతృమూర్తి కౌసల్య ఆవేదన రామున్ని మహోన్నతమైనఆదర్శమూర్తిగా తీర్చిదిద్దింది. "**కైక మొదలైన వారు**"[9] బహు భార్యత్వం వల్ల సపత్నుల్లో కలతలు పెరుగుతాయి. పురుషులలో స్వేచ్ఛ తరిగిపోతుంది. అవన్నీ గుర్తించిన రాముడు "**గడచినట్టి కాలమ్మేదొ గడిచిపోయె**"[10] అని పలికినాడు. ఇది రామాయణ కథకు, రాముని మహోన్నత వ్యక్తిత్వానికి, ఆదర్శ మూర్తిమత్వానికి కీలకమైన సంఘటనగా నిలిచింది. రాముడు ఏక పత్నీవ్రతుడు అని రామాయణంలో వాల్మీకి మహర్షి సూటిగా స్పష్టంగా చెప్పలేదు. రాముని ప్రతిజ్ఞ మూలంలో లేదు. రంగనాథ రామాయణం, భాస్కర రామాయణం, మొల్ల రామాయణం, విశ్వనాథ వారి రామాయణ కల్పవృక్షం మొదలైన తెలుగు రామయణాల్లోనూ లోను రాముని ప్రతిజ్ఞ లేదు. ఇది కవి నూతనంగా కల్పించినది. ఈ కల్పన రామునికి, రామాయణ కథకు కొలికి పూసగా గుర్తించాలి. ఇది అంగీకరించ దగిన కల్పన అని బేతవోలు రామబ్రహ్మం పేర్కొన్నారు.[11]

రాక్షసస్త్రీ అయిన త్రిజట మానవత్వం కలిగిన మనిషిగా, దివ్యభావనలతో తపన కలిగిన దైవ మూర్తిగా చిత్రితమైంది. కామమెగసి తన్నుకుని వచ్చిన రావణుని చర్యలను ఈసడించుకుంది. రావణుని ఎదిరించ-లేకపోయినా సీతను బాధించకూడదని సహస్త్రీలకు తెలియజేసింది.

సీతారాముల దివ్యత్వాన్ని గుర్తించింది. అదే అనుసరణీయమని భావించింది. జన్మనేపథ్యం కాకుండా జన్మ సంస్కారం, ఆత్మసంస్కారంతో దానవత్వం నుండి మానవత్వం, మానవత్వం నుండి దైవత్వం వరకు జీవన ప్రయాణం కొనసాగాలని త్రిజట కథ ద్వారా తెలిపినారు.

త్రిజట దానవత్వం నుండి దైవత్వం వరకు ప్రయాణిస్తే, కబంధుడు దైవత్వం నుండి రాక్షసత్వానికి దిగజారి పోయినాడు. అతి సుందరుడైన కబంధుడు బ్రహ్మ వరం చేత దీర్ఘాయువైనాడు. ఎవరికి లభించని అందచందాలు దీర్ఘాయువు అనేవిషయాలు కబంధుని గర్వితున్ని చేసినాయి. ఆ గర్వంతో సుందరుడైన కబంధునిలో వికృతపుట ఆలోచనలు మొదలైనవి. తత్ఫలితంగా వికృత రూపుడైనాడు. వికృత చర్యలతో అంగవిహీనుడై కదలక మెదలకుండిపోయినాడు. దేహాభిమానం బలగర్వం ఉండకూడదు అని, ఇది మనిషిని సాత్విక ప్రవృత్తి నుండి తామస వృత్తిలోకి దిగజార్చుతాయి.

రాముని దర్శనం వరకు కబంధుడు దుర్భరంగా బ్రతుకీడ్చినాడు. తన గూర్చి రామునితో ప్రస్తావిస్తూ "**గుండెలో నొక గర్వము కొండ యయ్యె**"[12] అని మధనపడినాడు. "**గర్వము కలగనే రాదు**"[13] అని తన అహంకారాన్ని గుర్తించినాడు. "**బ్రహ్మ నుండి దీర్ఘాయువు బడసి కూడ… నన్ను నే నుద్ధరించు కొన్నదియె లేదు**"[14] అంటూ మనిషి జీవన పరమార్థాన్ని తెలియచేస్తున్నాడు.

**"అపశ్యం గ్రహణం రామో మన్యేహం సమపైష్యతి**

**ఇమాం బద్ధిం పురస్కృత్య దేహన్యాస కృతశ్రమః"**[15]

రాముడు నిశ్చయంగా తన వద్దకు రాగలరు. అప్పుడు నా దేహాన్ని వదులుతాను. అన్న కబంధుని మాటను భూమికగా చేసుకొని అనుమాండ్ల భూమయ్య 153 పద్యాల కబంధమోక్షము కావ్యాన్ని రచించినారు. ఈ సందర్భంగా పశ్చాత్తాప విషయాలను పెంచి రాసినారు. కబంధుడు దేహ త్యాగం కోసమే రాముని కోసం ఎదురు చూస్తున్నాడు. రామ దర్శనానికై పరితపించినాడు.[16] ఆ నిరీక్షణలో హృదయ ప్రక్షాళన జరిగింది రాముని చేతిలో చావడాన్ని వరంగా భావించినాడు. వాల్మీకి రామాయణంలో కానీ ఇతర రామాయణంలో కానీ కబంధుని రాక్షసుని గానే పేర్కొన్నారు. భూమయ్య కబంధుని పశ్చాత్తాపాన్ని వివరిస్తూ ఆయనను రామభక్తునిగా చిత్రించినారు.ఇది నవ్యమైన, సవ్యమైన కల్పన.

భూమయ్య కావ్యాల్లో కథ, పాత్రలు, పాత్రల మనోగత విశ్లేషణ, కవిత్వం మొదలైనవి మాత్రమే దర్శనమిస్తాయి. అంతేకాని కవి ఎక్కడ ప్రత్యక్షం కాదు. అంటే పడికట్టు పదాలతో డాంబిక శబ్దశక్తితో అనవసరమైన వర్ణనలతో పాండిత్య ప్రకర్షణ ప్రదర్శించడు. తేట తేట తెలుగు పదాలతో పాఠకుల హృదయ సీమలలో వివేచనాశక్తిని, తార్కిక జిజ్ఞాసను కలిగిస్తాడు.

'ఒక్క సీతయె ఈ జన్మకున్న భార్య' అని రాముడు ఏకపత్నీవ్రత ప్రతిజ్ఞ చేయగానే కౌసల్య హృదయం పులకించిపోయింది. "**ఆకసపు గంగ వచ్చి ముందాగినట్లు/భూమి మల్లె పూదోటయై మురిసినట్లు/ తల్లి కౌసల్య ఒకరీతి తనయు జూడ/ సూర్యుడుదయించె శ్రీరాము చూడ్కులందు**"[17] కొడుకు చూపుల్లో సూర్యుడు ఉదయించినాడు. ఇది ఒక కొత్త భావన శ్రీరాముని ప్రతిజ్ఞ ద్వారా భావికాలాల్లో దాంపత్య ధర్మంలో, దాంపత్య

జీవనంలో ఆదర్శనీయమైన కొంగొత్త పరిమళాలు ప్రసరించబోతున్నాయనే విలువైన సూచనను వ్యక్తీకరించినారు.

"**రావణుని మోయు చున్నగార్దభ మదెంత సిగ్గు పదినదొ**"[18] రావణుడు గాడిద నుండి కింద పడిపోయి-నట్లుగా వాల్మీకి రామాయణంలో ఉన్నది. రావణుని సిగ్గుమాలిన చర్యలకు గాడిద కూడాసిగ్గుపడి రావణుని కింద పడవేసినదనే భావాన్ని ఒకవైపు హాస్యస్ఫోరకంగానూ, మరోవైపు కామాంధున్ని గాడిదలు కూడా అసహ్యించుకుంటాయని సామాజిక చైతన్యంగాను స్ఫురించేటట్లు ధ్వనింప చేసినారు. అలతి అలతి పదాలతో పాఠకులకు మరింత దగ్గరగా కావ్యాంతరార్థాన్ని తీసుకొస్తున్నారు

సరళమైన పదాలతో పాటు దేశీయమైన తేటగీతి ఛందస్సును ఉపయోగించడం అనుమాండ్ల భూమయ్య ప్రత్యేకత. తేటగీతి తో పాటు ముత్యాలసరాలు, ద్విపదలు, ఒక్కచో శార్దూల పద్య వృత్తాన్ని కూడా ప్రయోగించినారు. పదాలు పద్య శైలి సరళమైనప్పటికీ పద్య నిర్మాణంలో బిగువు ఏ మాత్రం సడలక పోవడం విశేషం. అర్థగాంభీర్యం, పదసౌకుమార్యంతో పద్య రచన పటిష్ఠంగా కొనసాగింది.

"**ఈమె నోంకార మూర్తిగా నిట్లె చూడ**" [19] ఇచట శ్రీరామున్ని ఓంకార శబ్ద వాచ్యుడిగా భాసింప చేస్తున్నాడు కవి. సీతాదేవి రామ నామాన్ని జపించగా త్రిజట విన్నది. తర్వాత సీతాదేవిని రాముడైనట్లుగా దర్శించింది. వెనువెంటనే భక్తి భావనతో త్రిజట హృదయ గుహలో శ్రీరాముడే అవతరించినాడు. ఆ దివ్యత్వమే తన జీవన్ముక్తికి మార్గమని, శ్రేష్ఠమని త్రిజట భావించింది. ఇలా తాత్విక విషయాలను తేట తేట పదాలతో చిన్న పద్యాలలో ఒదిగించడం కవి ప్రతిభకు నిదర్శనం.

సాధారణంగా కవులు పద్య రచనలు ఏ పద్యానికి పద్య పాదం పద్యగణం పూర్తి అయ్యేటట్లు రచిస్తారు. ఒకవేళ పూర్వ పాదంలో గల పదాల్లోని ఒకటి రెండు అక్షరాలు తర్వాత పాదాల్లోకి వెళితే పద్యగతి కుంటుపడినట్లు అవుతుందని భావిస్తారు. భూమయ్య  పద్య రచనలో అక్కడక్కడ ఈ విధమైన ప్రయోగం కనిపిస్తుంది. కాని పద్యగతిలో, ధారాశుద్ధిలో ఏమాత్రం సమగతి లోపించినట్లు కనిపించకపోవడం ఒక విశేషం. కారణం యతిమైత్రి స్థానాల్లో అక్షరాల కోసం కవి వెంపర్లాడినట్లు కనిపించదు. ఆ స్థానాల్లో అక్షరాలు సహజంగా ఒదిగి పోయినాయి. భూమయ్య  సాధనతో తేటగీతి పద్య చందస్సును కరతలామలకం చేసుకున్నారు ఇలా పద్య రచన చేయడం భూమయ్య  ప్రత్యేకత.

"**తిని తిని అలసినప్పుడేమి య/టంచు ననిపించు నాకపు దపుడు**"[20]

తేటగీతిలో పాదం మొదట సూర్య గణం విరుపు ఉన్నట్లుగా కవులు రచిస్తారు. ఇక్కడ భూమయ్య  చూపిన రచించిన పద్యంలో మొదట సూర్య గణాభాసంగా కనిపిస్తున్నది. కాని పద్యగతి ఏమాత్రం కుంటు పడలేదు. ఇది పై విషయానికి ఉదాహరణగా చెప్పుకోవచ్చు. ఇది భూమయ్య  ప్రత్యేకత.

## 5. సామాజిక సందేశం:

వ్యక్తి యొక్క ఆత్మ సంస్కారం వల్ల, ఆత్మోద్ధరణ వల్ల క్రమక్రమంగా సమాజం, దేశం, సౌశీల్య సంపన్నమై ఉంటుందనే సందేశం ఈ కావ్యాల్లో కనిపిస్తుంది. తండ్రి బహు భార్యత్వం ఫలితంగా మాతృమూర్తి వేదనను రాముడు విన్నాడు. తండ్రి కష్టాలను ఊహించినాడు. తల్లి పడిన వేదన సీతకు ఉండకూడదని ఏకపత్నీవ్రతంగా ఉంటానని ప్రతిజ్ఞ చేసినాడు. శ్రీరాముని ఈ నిర్ణయం యుగయుగాలలో ఆదర్శప్రాయంగా నిలిచింది. ఈ ఆదర్శాన్ని అందరూ పాటించాలని అంతఃసూత్రాన్ని కవి పాఠకులహృదయాల్లో నిలిపినారు.

సమాజ హితకరం కాని బ్రతుకు నిష్ఫలమనే భావాన్ని కబంధునిపశ్చాత్తాప ప్రకటన ద్వారా వివరించినారు. దీర్ఘకాలంగా బతకడమే బ్రతుకు కాదు. ఆత్మవికాసంతో ఆత్మోద్ధరణ జరగాలి. పలువురికి ఉపయోగపడే పనులు చేయాలనే భావన కబంధమోక్షములో ప్రస్ఫుటమవుతున్నది.

సమకాలీన సమాజాన్ని సంస్కృతులను రచనల్లో ప్రతిపాదింప చేయడం కవి యొక్క హృదయ సంస్కారం పై ఆధారపడి ఉంటుంది. భూమయ్య తెలంగాణ బిడ్డ తెలంగాణ తల్లి సంస్కృతిని సంస్కారాన్ని అక్షరీకరించాలను-కున్నారో ఏమో "**ఒక కమలముల ప్రోవుగా నొప్పు సీత**" [21] అని త్రిజట నోట సీతాదేవిని తెలంగాణ నారీ జన నీరాజనాల అందుకుని బ్రతకమ్మగా భాసింప చేసినారు.

## 6. ముగింపు:

కౌసల్య త్రిజట కబంధుడు ఈ పాత్రలన్నీ రామాయణంలో వాల్మీకి మహర్షి ప్రవచించిన కథా ఘట్టాలని భూమయ్య స్వీకరించినారు. వాల్మీకి మహర్షి రేఖామాత్రంగా కౌసల్య మనోబాధను వ్యక్తీకరించినారు. భూమయ్య కౌసల్య పాత్రను ఆ పాత్ర యొక్క మనఃప్రవృత్తిని పాఠకులకు సన్నిహితమయ్యే విధంగా చిత్రించినారు. ఆమె వేదన ఘనమైన సౌశీల్య సంపదకు మూల కారణమైంది. అది రాముని ప్రతిజ్ఞ. ఇది కవి అనల్పమైన కల్పన.

దనుజకాంత అయిన త్రిజట దివ్యత్వాన్ని సాధించే దిశగా ఆత్మ వివేచనతో ఆత్మోద్ధరణకై సాధన చేసినదని కవి రచించుట వారి చిత్త సంస్కారానికి నిదర్శనం.

గర్వ మదాంధతతో ప్రవర్తిస్తే దేవజాతి పురుషుడికైనా అధః పతనం తప్పదు. ఇది కబంధుని వృత్తాంతం. కబంధుని పశ్చాత్తాపాన్ని వాల్మీకి మహర్షి ప్రవచించలేదు. భూమయ్య కబంధుని పశ్చాత్తాపాన్ని కల్పించినారు. తదనంతరం రాముని విష్ణు పరంగా కబంధుని చే స్తుతింప చేయడం రాముని భగవత్ తత్వాన్ని ప్రకటించడమే.

రామాయణ కావ్య ధర్మ సారాన్ని గ్రహించిన అనుమాండ్ల భూమయ్య రామాయణం లోని సూక్ష్మ విషయాలను వెలికి తీసి ఈ రామ కథా కావ్యాలను రచించినారు. వాల్మీకి మహర్షి యొక్క మనోగతాన్ని శ్రీరామావతార పరమార్ధ రహస్యాన్ని ఈ కావ్య కథల ద్వారా తెలుగు పాఠకులకు తెలియజేస్తున్నారు భూమయ్య.

## 7. పాదసూచికలు:

1. జ్వలిత కౌసల్య - కైకేయి వరం 6
2. జ్వలిత కౌసల్య - అనంత క్రోధం 6
3. జ్వలిత కౌసల్య - ఏక పత్నీ వ్రతం 1
4. జ్వలిత కౌసల్య – మంగళాశాసనం 2
5. త్రిజట – 130
6. త్రిజట – 1
7. త్రిజట –127
8. కబంధ మోక్షము – 11
9. జ్వలిత కౌసల్య – పితృ వాక్యం 3
10 జ్వలిత కౌసల్య - ఏక పత్నీ వ్రతం 1
11. భూమయ్య పద్య కావ్యాలు పుట.8
12. కబంధ మోక్షము – 23
13. కబంధ మోక్షము – 24
14. కబంధ మోక్షము –43
15. వాల్మీకి రామాయణము - అరణ్య 71-17
16. కబంధ మోక్షము –74
17. జ్వలిత కౌసల్య - ఏక పత్నీ వ్రతం 3
18, త్రిజట – 87
19. త్రిజట- 98
20. కబంధ మోక్షము –41
21. త్రిజట- 112

## 8. ఉపయుక్తగ్రంథసూచి:


1. భూమయ్య, అనుమాండ్ల. భూమయ్య పద్యకావ్యాలు, అజో విభో కందాళం ఫౌండేషన్, హైదరాబాద్ 2023.
2. రామారావు, చేకూరి. (సం), అంతర్వీక్షణ సార్వభౌమం, మనస్వినీ దేవి ప్రచురణలు, హైదరాబాద్ 2003.
3. లక్ష్మణ రావు, గంద్ర, తెలుగులో రామాయణాలు, తెలుగు అకాడెమీ, హైదరాబాద్, 2012
4. వాల్మీకి, శ్రీ రామాయణం, సుందరకాండం శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి -1973
5. శ్రీరామచంద్రుడు, పుల్లెల. వాల్మీకి, శ్రీరామాయణం, అయోధ్య,అరణ్య,సుందరకాండలు, టి.ఎల్.పి. పబ్లికేషన్, హైదరాబాద్, 2013.
6. సాహితీ వైజయంతి సమ్మానోత్సవ విశేష సంచిక, అజో విభో కందాళం ఫౌండేషన్, హైదరాబాద్, 2021.


***



AUCHITHYAM

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

ISSN: 2583-4797

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_05.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 5. శ్రీమద్రామాయణకల్పవృక్షం శ్రీరాముని లక్షణాలు: మనుజధర్మం

**డా. కె.ఎల్. జ్యోతిర్మయి**

ఆంధ్రోపన్యాసకురాలు,

ఎస్.వి.జె.వి. సంస్కృత కళాశాల, కొవ్వూరు,

తూర్పుగోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్.

సెల్: +91 9494008879. Email: lalithajyothirmayee@gmai.com

**వ్యాససంగ్రహం:**

*మానవునకు ఆచరణీయములుగా చెప్పబడిన వివిధములైన కర్తవ్యాలు, విధులు అన్నీ ధర్మములే. తన జీవితంలో వివిధ దశలలో నిర్వర్తింపవలసిన క్రియా కలాపములు, ఆచరించవలసిన కర్మలన్నీ మానవుడు మృత్యు పర్యంతం నిర్వహించవలెను. బాల్యం, కౌమారం, యౌవ్వనం, వార్ధక్యంలో నిర్వహించవలసిన పుత్ర, శిష్య, వ్యక్తి, సంఘ మొదలైనవన్నీ మానవ ధర్మాలే అనబడతాయి. ఇందులో కొన్ని సామాన్యం కాగా, కొన్ని విశేష ధర్మాలు. ప్రతీ మానవుడు నిర్వర్తించు కొన్ని విశిష్టమైన వ్యాపారములు కూడా ధర్మములే అనబడుచున్నవి. మానవ అవతారం ఎత్తినందుకు గాను మానవ ధర్మాలకు రాముడు కూడా అతీతుడు కాడు. దేహంతో పాటుగా వచ్చిన దేహ సంబంధమైన ధర్మాలను రాముడు నిర్వర్తించాడు. ఆయనకు కూడా తన జీవితంలో జరిగిన మంచి సంఘటనలకి ఆనందించడం, చెడు వాటికి దుఃఖించడం, దిగులు చెందడం, సంయోగ వియోగాలు, సుఖదుఃఖాలు, శత్రుత్వ మిత్రత్వం, వైరాగ్య సంసారం, ఉద్వేగ ఔదా సీన్యాలు, హాస్యం, ఇతరులతో ఉల్లాసమాడుట అన్న మానవ సహజమైన లక్షణాలన్నీ ఉన్నా లేనట్లుగా ప్రవర్తించి ఈయన సామాన్య మానవుడు కాడు అని ఇతరులు అనుకునేటట్లుగా ఉండటం ఆయనలో ఉన్న విశేషం.. విశ్వనాథ వారి రామాయణ కల్పవృక్షంలో శ్రీరాముని మానవ లక్షణాలు, మనుజ ధర్మం ఏ విధంగా ఉన్నాయో కొన్నింటిని చూపిం చే ప్రయత్నం నా ఈ వ్యాసం యొక్క ము ఖ్యోద్దేశ్యం.*

**Keywords:** శ్రీరాముడు,  కరుణస్వభావం ,హాస్యశీలం, కోపస్వభావం . దుఃఖస్వభావం, మనుజధర్మం.

## 1. ఉపోద్ఘాతం:

మానవునిగా జన్మించినందుకు మానవుడు మానవ సహజమైన లక్షణాన్ని కలిగి ఉండాలి.  మానవుని మానవ ధర్మంలో భాగం ఈ మానవ లక్షణాలు లేదా గుణాలు. ఈ గుణాలు మంచి చెడులను అనుసరించి మానవుల్లో ఉత్తమ, మధ్యమ, అధమ అని మూడు రకాలుగా ఉంటుందని నా అభిప్రాయం. ఉత్తమ లక్షణాలు

కలిగిన మానవుడు మంచి ప్రవర్తన కలిగి అందరి మన్ననల్ని పొందుతాడు. వీరు ఇంటా, బయట సుఖంగా, సంతోషంగా ఉంటూ వారి చుట్టూ ఉన్నవారిని కూడా ఆనందంతో ఉండేలా చక్కని ప్రవర్తనతో మెలుగుతూ జగత్తుకు ఆదర్శప్రాయంగా నిలుస్తారు.

మానవునిగా జన్మించినందుకు జన్మతో లభించిన కర్మలు, కర్మ ఫలాలు అనుభవించక తప్పదు అని మన ఆర్ష విజ్ఞానం తెలియపరుస్తుంది. సుఖదుఃఖాలు, కామ క్రోధాలు, ఖేద మోదములు మొదలగునవి దేహధర్మాలు. ఇవన్నీ అనుభవించక తప్పదు. మానవుని జీవితంలో అనేక సంఘటనలు అనేక సందర్భాలలో వాటికి తగినట్లుగా ఉండటం అనేది మానవుని సహజ లక్షణం. ప్రతీ మానవుడు తన జీవితంలో మంచి సంఘటనలకు ఆనందించడం, చెడు వాటికి దుఃఖించడం, దిగులు చెందడం, దైన్యం అనుభవించడం, కృతజ్ఞతానుగుణం, కరుణ స్వభావం, హాస్యశీలం, వైరాగ భావాలు, క్రోధ, దైన, దుఃఖ స్వభావాలు కలిగి ఉండటం అనేవి సర్వ సహజమైన లక్షణాలు.

## 2. శ్రీ రాముని మానవత్వ లక్షణాలు - కొందరి అభిప్రాయాలు:

**"మానవుని యందెట్టి విశిష్ట గుణములుండవలెనని చెప్పబడునో అట్టి ఉత్తమ గుణములన్నియూ మూర్తిభవించినవాడు శ్రీరాముడు. ఆయన దయ, ఔదార్యం, ధైర్యం, సౌమ్య భాషణం, వాత్సల్యం, మితభాషత్వం, క్షమ, కృతజ్ఞత, న్యాయవర్తన, అన్యులను ఆదరించుట, పెద్దల యెడ వినయ వర్తనం, కర్తవ్య నిష్ఠ, క్రమశిక్షణ, అచంచలమైన ఏకపత్నీ వ్రత నిష్ఠ మున్నగు సద్గుణ గణ విరాజితుడై విలసిల్లినాడు."**[1]

**"శ్రీరామచంద్రుని చిత్రించు సందర్భమున అతని దివ్య శరీర సౌందర్యంతో పాటుగా అతని మానసిక సౌందర్యం, మమత, వాత్సల్యం, ప్రేమ, దయ, స్నేహం, క్రోధం, వీర్యం, పరాక్రమం, క్షమా, అహింస, సత్యనిష్ఠ మొదలగునవే కాక పరిస్థితులకు ఎదురు నిలిచి కర్తవ్యం కోసం కఠోరంగా నిలవగల అద్భుత శక్తితో పాటు కష్టాలకు తాత్కాలికంగా చలించి తిరిగి స్థిరంగా నిలబడుటకు కావలసిన ఇంద్రియాలు అదుపులో పెట్టగల ఆత్మ సంయమనాన్ని నిరూపించి వాల్మీకి అతనిలో మానవత్వాన్ని వికసింపజేసి పూర్ణంగా ప్రతిష్ఠించి ఉన్నాడు"**[2]

శ్రీరామునిలో మానవత్వ లక్షణాలకు సంబంధించిన ఈ అభిప్రాయాల్ని కావూరి పాపయ్యశాస్త్రిగారు తమ పరిశోధన గ్రంథంలో ఉటంకించారు. వాటిని ఇక్కడ విశదపరిచాను.[3]

మానవుని లక్షణాలు, మనుజ ధర్మం అనేవి శ్రీరామునిలో ఉన్నవి. విశ్వనాథ వారికి కల్పవృక్షంలో తెలిపిన కొన్నింటిని ఈ వ్యాసంలో తెలిపే ప్రయత్నం చేస్తాను.

## 3. శ్రీరాముని కరుణ స్వభావం:

రాముడు తండ్రి ఆజ్ఞననుసరించి విశ్వామిత్రునితో యాగ రక్షణకు పోవుచు మార్గమధ్యంలో తాటకిని సంహరించవలసి వచ్చింది. గురు ఆజ్ఞానుసారం రాముడు చంపెను. ఆ తర్వాత రాముని మనస్సుకు కసాయి పనిగా అనిపించింది. అయ్యో! క్షత్రియ ధర్మం ఇంత కష్టంగా ఉంటుం దా అంటూ రాముడు ఎంత బాధపడ్డాడో ఈ క్రింది

పద్యంలో మనకు అవగత మౌవుతుంది.

**"ఇలపయి రాచబిడ్డ బ్రదుకేయిది వానికి మృత్యుతత్త్వముల్**
**దెలియంగ దేలికైన పని తెల్లముగా గను దాటకావధా**
**విలగతి నే గ్రహించితిని వెక్కసమై చనిజీవి యెంతగా**
**గిలగిల తన్నుకొన్న యది? కేవలమప్పుడు చూడగావలెన్"**[4]

**"ఇదియును గాక గౌతమ ఋషీంద్రుని భార్య యహల్య యెంత ప**
**డ్డది? యలనామె దుఃఖ వికట జ్వలితాగ్ని మదంతరంబునం**
**దొదిగిన కోటిజన్మల మహోన్నత దుఃఖము ద్రవ్విచూపె; నా**
**సదమల దుఃఖశీల క్షితిజాతను నన్నును నట్లు రమ్మనెన్"**[5]

రాముడు తన తల్లికి తాటకిని చంపినందుకు తాను ఎంత బాధపడ్డాడో అన్న విషయాన్ని ఈ పద్యంలో విశ్వనాథ గారు "యెక్కసమై చనిజీవి యెంతగా గిలగిలతన్నుకున్నదో?" అని చెబుతూ రాముడు తాటక వధ వేళ తాను పడిన బాధను అక్కడితో వదలక మరొక సందర్భంలో తన తమ్ముడైన లక్ష్మణునితో "సమద్యత్తాటకోన్మాద మిప్పటికిన్ నా యెద నొవ్వుపోదుగద" ఈ విధంగా బాధపడటంలో రామునిలో మానవ లక్షణాలు కనిపిస్తాయి. రాముడు చంపినది దుర్మార్గులైన రాక్షసుల్ని. ఇది క్షత్రియ ధర్మం కావచ్చు. ఎంత ధర్మం అయినా ఈ హింసాకాండ అంతా ఆయనకి క్రూరంగా తోచింది. అదే మరొక సందర్భంలో "ఈ చంపుటయో కసాయి పని మేలన్నట్లుగా నున్నదయ్యో!" అని రాముడు బాధపడకుండా ఉండలేకపోయాడు. ఇలా ఈ విధమైన వ్యాధులకు హేతువు ప్రధానంగా ఆయన హృదయంలో ఉన్న కరుణ స్వభావం. ఆయన జీవ లక్షణాల్లో ప్రధాన గుణాలు సౌమ్య స్వభావం, కరుణ స్వభావం. ఇవి రాముడిలో కనిపించే ఉన్నత మానవ లక్షణాలు, ఉత్తమ మానవ ధర్మాలు. ఈ గుణాల వల్ల రాముడు ఆదర్శ పురుషునిగా జగత్తులో నిలిచాడు.

## 4. శ్రీరామచంద్రుని హాస్యం:

మానవుడు ఆనందంగా ఉండటం, హాయిగా నవ్వుకోవడం తన చుట్టూ ఉన్న వారిని ఆనందంగా ఉంచడం అనేవి మనిషికి ఔషధం వంటిది. అటువంటి హాస్యం శ్రీరామునిలో విశ్వనాథ వారు రామాయణ కల్పవృక్షంలో అనేక చోట్ల అనేక సందర్భాలలో చూపించారు. కల్పవృక్షంలో వాక్యాల్ని పరిశీలించినచో కొన్ని కవి శ్రీరామునితో పలికించినవి, కొన్ని కవి పలికినవి, కొన్ని రామాయణంలో మిగిలిన పాత్రలతో రాముడు హాస్యం గురించి చెప్పినవి ఉన్నాయి.

**"తా హాస్యాద్భుతశీలి రాముడు పృషత్కంబుల్ ప్రయోగించుచో**
**హాహాకారము లేచు మంధరను రాయన్ బాయగా నేయుద**
**ద్దాహాకారము లెంతగా బలియునో హాస్యంబు దానంతగా**
**బాహాస్ఫాలనమూర్తి చేయు రఘురాడ్బాలుండు గగోలుగాన"**[6]

రామాయణ కల్పవృక్షంలో బాలకాండలో విశ్వనాథ వారి రాముని యౌవనారంభంలో రాముని మనఃస్థితిని వర్ణిస్తూ రాముని చిలిపి చేష్టలను, హాస్యాన్ని 4, 5 పద్యాలలో ఈ విధంగా వర్ణించారు.

రాముడు హాస్యశీలి. వీలైనప్పుడు వీలైన వారితో హాస్యమాడుట ఆయన సహజ గుణం. అందులోనూ మంధర కనిపిస్తే చాలు ఆయన పరిహాసం ఆడకుండా, ఆటపట్టించకుండా ఉండేవాడు కాదు. ధనుర్విద్యలో దిట్టయైన రాముడు బాణములు వేయడం సాధన చేస్తున్న సమయంలో అటుగా వచ్చిన మంధరను అదే పనిగా ఆట పట్టిస్తూ ఉండేవాడు. మంధర ఎంత ఎక్కువగా కేకలు పెడుతుంటే రాముడు కూడా అంతలా ఆటపట్టించేవాడు. ఆమె భయంతో గడగడలాడుతూ హాహాకారాలు చేస్తుంటే రాముడు మరింత గగ్గోలు పెట్టించి ఆట పట్టించేవాడు. ఇలా రామాయణంలో అనేక చోట్ల అనేక సందర్భాలలో హాస్యశీలం మనకు కనబడుతుంది.

## 5. శ్రీరాముని కోప స్వభావం:

రాముని కోపం ధర్మకోపం. ఆయనకు వచ్చిన కోపం అంతా క్షణికం. అది పాలపొంగు వంటిది. ఇట్టే వచ్చి అట్టే పోతుంది. మానవునికి కోపం ఎక్కువ కాలం ఉండకూడదు. అది పగకు దారి తీస్తుంది. అది మానవులకు దుఃఖ హేతువు. వినాసానికి కారణం అవుతుంది. కల్పవృక్షంలో రాముని కోపానికి సంబంధించి సుగ్రీవుడు అన్నమాట విశ్వనాథ వారు ఈ విధంగా-

"**కోపంబును రావచ్చును**
**కోపంబును వంటి పెట్టికొని యుండుటయున్**
**కాపురుష లక్షణంబగు**"[7]

ఈ పరమ సత్యం శ్రీరాముడెరుగని వాడు కాదు. కోపానికి అవధి ఏర్పరచుకొనుట మర్యాదస్తుల లక్షణం. ఇది విశ్వనాథ వారు అనేక సందర్భాలలో చూపించినప్పటికీ ఒక అంశాన్ని ప్రస్తావిస్తాను.

సుగ్రీవుని కోసం వాలిని సంహరించాడు. వానర రాజ్యానికి మేలు చేశాడు. సుగ్రీవుడు రాజై రాముని సంగతి పట్టించుకొనక పోవడంతో నమ్మకద్రోహానికి పట్టరాని కోపంతో రాముడు

**"రామునకు గోపముంబగచి ముందుకు రానెవడున్ ధరిత్రిలో"**[8] అని పలికి

"**సఖతకు సాక్షిగా నుషర్బుదు జూచి క్షమించితిన్, కాని**
**ముఖమును నద్దమున్నయది పొల్పుగ జూచుకొనంగవచు న యెడలి**
**పృఖరుడు దూషణుండు తమ వాలియా వారిని జాడ వచ్చునున్**"[9]

అని లక్ష్మణునితో చాలా కోపముగా పలికిన మాటలు. అవి విన్న లక్ష్మణుడు తన అన్నగారిలో ఇప్పటివరకు ఎప్పుడూ అంతటి కోపాన్ని తాను చూడలేదని శ్రీరాముని చూసి ఆశ్చర్యచకితుడైనాడు.

## 6. శ్రీరాముని దుఃఖ స్వభావం:

సీతా వియోగంతో శ్రీరాముడు దుఃఖాన్ని రూపు దాల్చాడు. ఆమెకై పలు విధాలుగా దుఃఖించాడు. ఆమె క్షేమం గురించి తెలియక తిరిగి ఆమెను పొందలేనేమో అనే భయంతో ఆశ, నిరాశల మధ్య కొట్టుమిట్టాడుతూ ధైర్యం చెడి, మనస్థైర్యం దెబ్బతిని పరితపించాడు. సీత తనతో ఉన్న రోజులని తలుచుకుంటూ తనకు మళ్ళీ దక్కుతుందో లేదో అనే భయంతో దుఃఖిస్తూ అసలు బ్రతికి ఉందా లేదా ఏ రాక్షసుడైన ఆమెకు అపకారం చేసే ఉంటాడని ఆ భయంలో తన తమ్ముడైన లక్ష్మణునితో ఈ విధంగా

**"అన్న! నిన్ను నొక్కడడిగెదను బ్రదికి**
**యున్నవారు దివికి జన్నవారు**
**స్వప్నమందు నొక్కసారి తోతురె! నాకు**
**జానకియును దండ్రి కాన బడిరి"**[10]

**"నా వలన జచ్చె దాటక,**
**నా వలననె మంధరా మనస్సురిసి పడెన్**
**రావణుని భగిని యట్లైనది**
**స్త్రీవధ దోషంబు నన్ను జెందిన దయ్యా!"**[11]

ఇందులో విశ్వనాథ వారు చక్కని పదజాలంతో మనిషి యొక్క సహజ స్థితిని నిక్షిప్తం చేశారు. సీతావియోగ దుఃఖంలో ఉన్న రాముడు తన వల్ల ఇంతకుముందు రాక్షస స్త్రీలు వధింపబడ్డారు అంటూ పై పద్యంలో తాటకి, మంధర, సూర్పనఖలను తలుచుకుంటూ స్త్రీవధ పాపం అని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. తాను స్త్రీలను చంపి పాపం మూట కొట్టుకున్నాను. ఇదిగో ఇప్పుడు ఇలా ఆ కర్మని అనుభవిస్తున్నాను. అలాగే అప్పుడు కర్తవ్యంగా భావించి సంహరించాను. ఇప్పుడు ఈ దుఃఖానికి ఆ కృత్యాలకు ముడిపెట్టి మాట్లాడుతూ రాముడు దుఃఖ వికాలాత్ముడైన స్థితిలో అన్న మాటలు. మానవుడు విషాద దుఃఖ వికలాత్ముడైనప్పుడు ధర్మాలు అంతగా గుర్తుకు రావు. కాని రాముడు కష్టంలో, దుఃఖంలో, ఆపదలో, చికాకులు అన్నింటిలో ఎన్ని బాధలు పడినా ఎంత ఆవేదన అనుభవించినా ధర్మాన్ని మాత్రం ఎక్కడా విడిచిపెట్టలేదు. శ్రీరాముడు ఉత్తమ మానవ ధర్మాన్ని చూపించి అందరికీ ఆదర్శప్రాయంగా నిలిచాడు.

## 7. శ్రీరాముని మనుజ ధర్మం:

విశ్వనాథ వారి రామాయణ కల్పవృక్షంలో శ్రీరాముడు ధర్మ నిర్వహణలో మొదటగా పేర్కొన్నది ఆయన యొక్క క్షత్రియ ధర్మం. ఇక్ష్వాకుల వంశంలో మొదటి నుండి వస్తున్న క్షత్రియ ధర్మాన్ని తాను కూడా నిర్వహిస్తానని రాముడు పలుమార్లు పలు సందర్భాలలో నిశ్చయంగా పలికినాడు. ఒక సందర్భంలో అరణ్యపర్వంలో విశ్వనాథ వారు కల్పవృక్షంలో తాను మనువు ధర్మం తెలిసిన వాడినని ఈ క్రింది పద్యం తెలుపుచున్నది.

**"క్రమొప్పంగను నాల్గు ధర్మములలో గైపూనగా క్షత్ర ధ**
**ర్మము కోదండము పూని యార్తజన సంరక్షావిధానంబు ధ**
**ర్మము వాగ్దానము దీర్చుటో పరమ ధర్మంబీ త్రయీధర్మము**
**త్తమ మన్మత్ప్రియము...."**

రాముడు ధర్మాన్ని తెలిసినవాడిని స్త్రీ వధ ధర్మం కాదనే సందిగ్ధ స్థితిలో ఉన్నప్పుడు విశ్వామిత్రుడు ధర్మరక్షణ కొరకు స్త్రీ వధ చేయమని ఆజ్ఞాపించెను. ఇలా ధర్మ సందిగ్ధంలో ఉన్న గురువు ఆజ్ఞానుసారం స్త్రీ వధ చేసి ధర్మరక్షణ, ప్రజారక్షణ, గురువు ఆజ్ఞానుసారం తాటకిని వధిస్తానని పలికి తాటకిని వధించెను. ఇందులో రాముని రాజధర్మం మనకు కనిపిస్తుంది.

**'మనుజుడను నేను మనువు ధర్మం బెఱుగుదు**
**యిల నధర్మంబు చాయ సహించు టెఱుగ"**

విశ్వనాథ వారు కల్పవృక్షంలో రాముడు తన మనుజ ధర్మం గురించి అన్న మాటలివి. తనుమానవుడనని, తన ధర్మం మానవ ధర్మం అని ఈ భూమిపై అధర్మం నీడను కూడా తాను సహించనని రాముని మాటల సారాంశం.

రాముడు మానవునిగా నిర్వర్తించవలసిన అనేక కర్మలన్నింటినీ ధర్మానికి బద్ధుడై నిర్వర్తించాడని చెప్పవచ్చు. మానవుడు తన జీవిత పర్యంతం ఎలాంటి నిత్య కర్మలని, కర్తవ్యాన్ని ఆచరించాలో వాటినన్నింటిని తాను ఆచరించి చూపించాడు. ధర్మాచరణకై రాముడు సుఖ, సంపదలని వదులుకున్నాడు. కష్టనష్టాలను ఎదుర్కొన్నాడు. ధర్మాచరణ యొక్క స్వరూపం ఇలా ఉంటుందని తన జీవితంలో అన్ని దశలలో అన్ని సంఘటనలలో నిర్వహించి చూపించినవాడు శ్రీరాముడు. ఆయన పుత్రధర్మం, శిష్య ధర్మం, మిత్ర ధర్మం, భ్రాతృ ధర్మం, భర్తృ ధర్మం, రాజ ధర్మం ఇలా అన్నింటిలో "**ఇది ధర్మం ఇలా చేయాలి**" అంటే ఆ రకంగా దీక్ష కలిగి ఆచరించేవాడు. మానవుడు సంఘంలో ఎలా ఉండాలి, వ్యక్తిగా ఎలా ఉండాలి దేశంలో తన స్థితి ఏ విధంగా ఉండాలి అనేది రాముడు జన్మించి మానవుని యొక్క గృహ, వ్యక్తి, సంఘ ధర్మాలు ఎలా ఉండాలో ముందుగా తాను ఆచరించి లోకానికి చూపించెను. ఇవి శ్రీరాముని పరిపూర్ణ మానవ లక్షణాలు. విశ్వనాథ వారు రామాయణ కల్పవృక్షంలో అనేక సందర్భాలలో అనేక సంఘటనలలో పేర్కొన్నారు.

## 8. ముగింపు:

విష్ణువు దశావతారాల్లో పరిపూర్ణ మనవావతారంగా చెప్పబడే శ్రీరాముడు మూర్తీభవించిన ధర్మస్వరూపుడు. దైవంగా భావింపబడే రాముడు ఏనాడు మానవాతీతుడుగా ప్రవర్తించలేదు. నిజజీవితంలో మనిషి పొందే సుఖ దుఖాలను తాను అనుభవించాడు. కానీ ఎలాంటి క్లిష్టపరిస్థితుల్లో కూడా ధర్మాన్ని విడవలేదు. అందుకే అందరికి ఆదర్శంగా నిలిచాడు. రాముడు నడిచిన బాట మానవాళికి అనుసరణీయమైంది. భారతీయధర్మమే ఆత్మగా,

వాల్మీకిరామాయణాన్ని తెలుగువారికి కల్పవృక్షంగా అందించిన విశ్వనాథ పరిపూర్ణమానవుడిగా రామున్ని చిత్రించిన తీరు మానవులందరినీ ధర్మమార్గంలో పయనించేలా దారివేసిందని చెప్పవచ్చు.

## 9. పాదసూచికలు:

1. The Ramayana - sri S. L. N. Simha page no :53
2. శ్రీమత్ రామాయణ వైభవం. పుట. 582
3. శ్రీమద్రామాయణ కల్పవృక్షం, శ్రీ రాముని మనుజ ధర్మం, పుట. 79, 80
4. శ్రీమద్రామాయణ కల్పవృక్షం, బాల. కళ్యాణ. పుట. 378
5. శ్రీమద్రామాయణ కల్పవృక్షం, బాల. కళ్యాణ. పుట. 379
6. శ్రీమద్రామాయణ కల్పవృక్షం, బాల. అవతార. పుట. 170
7. శ్రీమద్రామాయణ కల్పవృక్షం, కిష్కింద. పుట. 26
8. శ్రీమద్రామాయణ కల్పవృక్షం, కిష్కింద. పుట. 171
9. శ్రీమద్రామాయణ కల్పవృక్షం, కిష్కింద. పుట. 171
10. శ్రీమద్రామాయణ కల్పవృక్షం, కిష్కింద. పుట. 144
11. శ్రీమద్రామాయణ కల్పవృక్షం, కిష్కింద. పుట. 145

## 10. ఉపయుక్తగ్రంథసూచి:


1. గోపాలకృష్ణ శర్మ, మల్లాది, 1978, శ్రీమత్ రామాయణ వైభవం, తెనాలి.
2. పాపయ్య శాస్త్రి, కావూరి, 1996, శ్రీ జానకీ ప్రియ పబ్లికేషన్స్, వరంగల్.
3. వాల్మీకి, 1979. శ్రీమద్రామాయణము, జయలక్ష్మి పబ్లికేషన్స్, హైదరాబాద్.
4. సత్యనారాయణ, విశ్వనాథ, 1992, శ్రీమద్రామాయణ కల్పవృక్షం, విశ్వనాథ పబ్లికేషన్స్, విజయవాడ.
5. సత్యనారాయణ, విశ్వనాథ, 2015, శ్రీమద్రామాయణ కల్పవృక్షం, విశ్వనాథ పబ్లికేషన్స్, విజయవాడ.
6. SimhaS.L.N.1984,The Ramayana, Dhrma Arsha centre, Bambay.


***


AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_06.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 6. రంగనాథరామాయణం: లక్ష్మణపాత్రవైశిష్ట్యం

**డా. ఎం. లక్ష్మయ్య**

తెలుగు అధ్యాపకులు,

సి.ఎస్.ఎస్.ఆర్ & ఎస్.ఆర్.ఆర్.ఎం.డిగ్రీ & పీ.జి. కళాశాల,

కమలాపురం, తెలంగాణ.

సెల్: +91 9492495437. Email: manjurilakshmaiah@gmail.com

**వ్యాససంగ్రహం:**

*తెలుగులో వచ్చిన రామాయణాలలో రంగనాథ రామాయణం మొదటిదని చెప్పవచ్చు. దీనిని రచించిన కవి గోన బుద్ధారెడ్డి. శ్రీరాముడు శివధనస్సునెత్తి సీతను పెళ్లి చేసుకుంటాడు. జనకమహారాజు తన రెండవ కూతురైన ఊర్మిళను లక్ష్మణునికిచ్చి పెళ్లి చేస్తాడు. తర్వాత కొంత కాలానికి దశరథుడు రామునికి పట్టాభిషేకం చేయాలనుకుంటాడు. కాని మంధర మాట విని కైకేయి దశరథునితో తన కుమారుడైన భరతునకి రాజ్యపట్టాభిషేకం చేయమని కోరుతుంది. సీతారాములతో పాటు లక్ష్మణుడు అడవులకు వెళ్తాడు. సీతారాములు లక్ష్మణుడితో కలిసి పంచవటిని చేరుతారు. అక్కడనే సీతారాములకు లక్ష్మణుడు ఒక పర్ణశాలను ఏర్పాటుచేస్తాడు. అక్కడకు శూర్పనఖ వస్తుంది.లక్ష్మణుడు శూర్పనఖకు ముక్కు,చెవులు కోసి పంపిస్తాడు. రావణాసురుడు తన చెల్లెలికి జరిగిన పరాభవానికి బదులుగా సీతను ఎత్తుకెళ్లడానికి మారీచునితో కలిసి పంచవటికి వస్తాడు. లక్ష్మణుడు సీత దగ్గర ఒక గీతను గీసి, అన్న కోసం వెళ్తాడు. లక్ష్మణుడు గీసిన గీతను లక్ష్మణ రేఖ అని అంటారు. కాని సీత రావణుడు వచ్చినప్పుడు ఆ గీతను దాటి బయటకు వస్తుంది, రావణుడు సీతను తీసుకెళ్తాడు. రాజుగా సుగ్రీవుడు సంసార మోహంలో పడి శ్రీరామునికిచ్చిన మాటను మరిచిపోయాడు. అప్పుడు లక్ష్మణుడు సుగ్రీవుని కోసం కిష్కింధకు వెళ్తాడు. రాముడు రావణుని వధించుటకు నేను కచ్చితంగా ఆయనకు సహాయం చేస్తానంటాడు. కాబట్టి తనను మన్నించు మహా! ప్రభూ అంటూ సుగ్రీవుడు లక్ష్మణుని పాదాలపై పడతాడు. తర్వాత లక్ష్మణుడు అతికాయునితో యుద్ధం చేసి గెలుస్తాడు. లక్ష్మణుడు ఇంద్రజిత్తున్ని యుద్ధంలో సంహరిస్తాడు .లక్ష్మణుని చేతిలో ఇంద్రజిత్తు హతుడయ్యాడన్న విషయాన్ని రావణుడు తెలుసుకుంటాడు. రావణుడు లక్ష్మణునితో యుద్ధం చేస్తాడు. ఆ యుద్ధంలో రావణుని శక్తి బాణం లక్ష్మణుని శరీరానికి గుచ్చుకుంటుంది. అప్పుడు లక్ష్మణుడు మూర్ఛపోతాడు. తిరిగి సుషేసుని సలహా ప్రకారం హనుమంతునితో సంజీవనిని తెప్పించి లక్ష్మణున్ని రాముడు బతికిస్తాడు. ఈనాటి సమాజంలో అన్నదమ్ముల మధ్య సంబంధాలు పతనమౌతున్నందున, లక్ష్మణుడు తమ్ముడిగా అన్నకు సేవచేసిన విధానాన్ని, త్యాగాన్ని , వైశిష్ట్యాన్ని గురించి నేటి సమాజానికి తెలియజేసి, సమాజాన్ని మేల్కొల్పడమే ఈ వ్యాసం యొక్క ముఖ్య ఉద్దేశ్యం. ఈ వ్యాసాన్ని చారిత్రక పరిశోధన పద్ధతిలో రాయడం జరిగింది.*

**Keywords:** గోనబుద్ధారెడ్డి,లక్ష్మణుడు,ఊర్మిళాదేవి,లక్ష్మణరేఖ,సీతారాములు,సుగ్రీవుడు,రావణుడు, అతికాయుడు, ఇంద్రజిత్తు, సంజీవని.

## 1. ఉపోద్ఘాతం:

తెలుగులో వచ్చిన రామాయణాలలో రంగనాథ రామాయణం మొదటిదని చెప్పవచ్చు. దీనిని రచించిన కవి గోన బుద్ధారెడ్డి. గోనబుద్ధారెడ్డి తన తండ్రి కోరిక మేరకు రంగనాథ రామాయణాన్ని రాయడం జరిగింది. దానికి రంగనాథ రామాయణం అని తన తండ్రి పేరు పెట్టాడు. రంగనాథ రామాయణం తొలి తెలుగు ద్విపద రామాయణం. ద్విపద అనేది దేశిచంధస్సుకు చెందినది. ద్విపద రెండు పాదాలను మాత్రమే కలిగి ఉంటుంది. అది చిన్న చిన్న పదాలతో, సరళమైన భాషలో ఉంటుంది. ద్విపద పాడుకోవడానికి అనువుగా ఉంటుంది. ఆనాటి ప్రజలందరికి నచ్చే విధంగా గోనబుద్ధారెడ్డి ద్విపదలో రామాయణాన్ని రాశాడు. ద్విపదను తెలుగు ప్రజలకు పరిచయం చేసిన శివకవి పాల్కూరికి సోమనాథుడు. ఈయన బసవపురాణాన్ని ద్విపదలో రాశాడు (తెలుగు సాహిత్య సమీక్ష (మొదటి సంపుటి).

రంగనాథ రామాయణం ముఖ్యంగా రెండు భాగాలుగా కనిపిస్తుంది. గోనబుద్ధారెడ్డి రాసినది పూర్వభాగం, అతని కుమారులు కాచవిభుడు, విఠలనాథుడు రాసినది ఉత్తర భాగం. రంగనాథ రామాయణాన్ని నిశితంగా పరిశీలిస్తే అందులో లక్ష్మణుని త్యాగనిరతి, సేవాభావం ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. అతడు రాజభోగాలను త్యాగం చేసిన త్యాగశీలి. నేటి సమాజంలో పతనమవుతున్న అన్నదమ్ముల అనురాగం, కుటుంబ బాంధవ్యం ఎలా ఉండాలో రంగనాథ రామాయణంలోని లక్ష్మణుడే ఆదర్శమని భావించవచ్చు. లక్ష్మణుడు తమ్ముడిగా అన్నకు సేవచేసిన విధానాన్ని గురించి, వైశిష్ట్యాన్ని గురించి నేటి సమాజానికి తెలియజేయడమే ఈ వ్యాసం యొక్క ముఖ్య ఉద్దేశ్యం.

## 2. లక్ష్మణుని బాల్యం :

దశరథ మహారాజుకు ముగ్గురు భార్యలు కౌసల్య, సుమిత్ర, కైకేయి. వారికి చాలా సంవత్సరాలైనా సంతానం కలగలేదు. అప్పుడు దశరథుడు పుత్ర కామేష్టి యాగం చేస్తాడు. ఆ యాగం ఫలితంగా కౌసల్యకు రాముడు, సుమిత్రకు లక్ష్మణ, శతృఘ్నులు, కైకేయికి భరతుడు జన్మిస్తారు. ఈ రాజకుమారులకు వశిస్టుడు విద్యాబుద్ధులు నేర్పుతాడు. చిన్నప్పటి నుండి లక్ష్మణుడు రామునితోనే కలసిమెలసి ఉండేవాడు. లక్ష్మణ, శతృఘ్నులు కవలలు అయినప్పటికి కలిసుండేవారు కాదు. లక్ష్మణుడు ఎల్లప్పుడూ రాముని వెంటే ఉండేవాడు.

శ్రీరాముడు శివధనస్సునెత్తి సీతను పెళ్లి చేసుకుంటాడు. తర్వాత జనకమహారాజు తన రెండవ కూతురైన ఊర్మిళను లక్ష్మణునికిచ్చి పెళ్ళి చేస్తాడు. తర్వాత కొంత కాలానికి దశరథుడు రామునికి పట్టాభిషేకం చేయాలనుకుంటాడు. కాని మంథర మాట విని కైకేయి దశరథునితో తన కుమారుడైన భరతునకి రాజ్యపట్టాభిషేకం చేయమని కోరుతుంది. ఆ మాటలువిన్న లక్ష్మణుడు కోపంతో భరతుని మీదకు వెలుతాడు.

**''భరతుని మొదటగా బగవారి జంపి - నెరసి యాపురమెల్ల నీఱు గావింతు**
**హరిహర బ్రహ్మాదులడ్డమై రేని - తరమిడి తోలి యుద్ధము సేయువాడ**

**గమనీయకేయూరకంకణాలంకృ - తములు మనోజ్ఞ చందన చర్చితములు**
**నగునాభుజమ్ముల నభిషిక్తుజేసి - పగతుర జంపుదు బాల్పడి యిపుడె"**

(రంగనాథ రామాయణం.అయోధ్యకాండ.పుట సంఖ్య. 97)

అప్పుడు రాముడు లక్ష్మణున్ని శాంతింపజేస్తాడు. తర్వాత రాముడు తండ్రి కోరిక మేరకు 14 సంవత్సరాలు అరణ్యవాసం చేయడానికి తన తల్లిదండ్రుల అనుమతిని తీసుకుంటాడు. సీతారాములతో పాటు లక్ష్మణుడు కూడా అడవులకు వెళ్లాలనుకుంటాడు. కాని రాముడు లక్ష్మణున్ని వనాలకు రాకుండా అయోధ్యలోనే తమ తల్లులైన కౌసల్య, సుమిత్రలకు అండగా ఉండమంటాడు. కాని లక్ష్మణుడు వినడు. మీకు భద్రతగా,తోడు,నీడలాగా ఉంటానని విన్నవించుకుంటాడు. రాముడు సుమిత్ర అనుమతి తీసుకోమంటాడు. అప్పుడు లక్ష్మణుడు తన తల్లి దగ్గరకు వెళ్ళి అనుమతిని కోరుతాడు. ఆమె నీవు శ్రీరామున్ని తండ్రిగా, సీతను తల్లిగా భావించి సేవ చేయమని చెప్పి ఆశీర్వదించి పంపుతుంది. లక్ష్మణుడు ఊర్మిళకు సీతారాములతో పాటు అరణ్యవాసానికి పోతున్న విషయాన్ని చెబుతాడు. ఊర్మిళ తానుకూడా వనవాసానికి వస్తానని చెబుతుంది. లక్ష్మణుడు ఇక్కడే రాజమందిరంలోనే ఉండి తమ తల్లులకు సేవ చేయమని చెబుతాడు. తర్వాత సీతారాములతో కలసి లక్ష్మణుడు అరణ్యవాసానికి వెళ్తాడు.

## 3. ఊర్మిళాదేవి నిద్ర:

లక్ష్మణుడు తన అన్న, వదినలకు తోడుగా అడవుల్లో వారికి దారిని చూపుతు అనేక ఆశ్రమాలను సందర్శించి అక్కడి మునుల ఆశీర్వాదాలను తీసుకుంటారు. నిద్రాదేవి లక్ష్మణుడిని ఆవహిస్తే తాను సీతారాములకు అడవులలో రక్షణగా, సేవకుడిగా ఉండి సేవచేయాలి కాబట్టి నీవు ఊర్మిళాదేవిని ఆవహించమని ఆమె దగ్గరకు పంపుతాడు. లక్ష్మణుడి కోరిక మేరకు నిద్రాదేవి ఊర్మిళను 14 సంవత్సరాలు నిద్రలో ఉండేటట్లు చేస్తుంది. ఈ సన్నివేశాన్ని కవి చక్కగా కల్పించి రాసినట్లు అవగతమవుతుంది.

## 4. లక్ష్మణుడు పంచవటిని చేరుట:

సీతారామలక్ష్మణులు చిత్రకూటమి దగ్గర ఉన్నప్పుడు భరతుడు అక్కడకు వచ్చి వారిని ఇంటికి తీసుకుపోవడానిక వస్తాడు. భరతునిపై లక్ష్మణుడు కోపంతో ఊగిపోయాడు. కాని రాముడు లక్ష్మణున్ని శాంతింపజేశాడు. కాని రాముడు భరతుని మాట వినలేదు. చివరకు భరతుడు రాముని పాదుకలను తీసుకుపోయి సింహాసనంపై రామపాదుకలను పెట్టి రాజ్యపాలన చేయసాగాడు. సీతారాములతో లక్ష్మణుడు పంచవటిని చేరుతాడు. అక్కడ జల,పుష్పాదులు సమృద్ధిగా ఉన్నాయి కాబట్టి నివాసయోగ్యంగా ఉండడం వల్ల సీతారాములకు లక్ష్మణుడు ఒక పర్ణశాలను ఏర్పాటుచేస్తాడు. తర్వాత సీతారాములకు తినడానికి అక్కడ దొరికే పండ్లు, కాయలను కోసుకొచ్చి ఇచ్చేవాడు. రాత్రి సమయాలలో తన అన్న వదినలకు భద్రతగా పర్ణశాలకు కాపలాగ ఉండేవాడు. రాముడు అక్కడనే అత్రి మొదలైన మునులను కలుస్తాడు.

ఒక రోజు పంచవటిలో ఉన్న సీతారామలక్ష్మణుల దగ్గరకు శూర్పనఖ వస్తుంది. రాముని దగ్గరకు వెళ్లి తనను వివాహం చేసుకోమని అర్థిస్తుంది. ఆ సమయంలో లక్ష్మణుడు బయటకు వెళ్లింటాడు.రాముడు ఆమెను లక్ష్మణుని దగ్గరకు పంపుతాడు. తాను దాసుడనని, సేవకుడినని అన్న రాముని అధీనంలో ఉంటున్నానని చెబుతాడు. నాకు భార్యవైతే నువ్వు దాసిగా ఉండాలి కాబట్టి రాముని దగ్గరకే వెళ్లమని చెబుతాడు. ఆమె తిరిగి రాముని దగ్గరకు వస్తుంది. అక్కడ సీతను తిడుతుంది. అప్పుడు రాముని ఆదేశం ప్రకారం లక్ష్మణుడు శూర్పనఖకు ముక్కు,చెవులు కోసి పంపిస్తాడు. ఆమె బాధతో ఏడుస్తూ తన అన్న రావణుని దగ్గరకు వెలుతుంది. ఇది కాదా లక్ష్మణుని సేవాతత్పరతకు నిదర్శనం. ఇంతకన్నా ఏమి కావాలి. ఇతడి కన్నా ఉత్తముడు ఇంకెక్కడా లేడని చెప్పవచ్చు.

## 5. లక్ష్మణ రేఖ:

రావణాసురుడు తన చెల్లెలికి జరిగిన పరాభవానికి బదులుగా సీతను ఎత్తుకెళ్లడానికి మారీచునితో కలసి పంచవటికి వస్తాడు. పర్ణశాల దగ్గరకు చేరి అక్కడ మారీచుడు బంగారు లేడి వేశంలో సీతకు కన్పిస్తాడు. ఆ బంగారు లేడిని చూసిన సీత అది తనకు కావాలని రామునితో చెబుతుంది. రాముడు దానిని పట్టి తేవడానికి దాని వెంట వెలుతాడు. కొద్దిసేపటి తర్వాత హా! లక్ష్మణా హా సీతా అనే ఆర్తనాదం వినిపిస్తుంది. ఆ మాటలు తన రాముడివే అని సీత గుర్తిస్తుంది. లక్ష్మణుడితో మీ అన్నకు ఏదో ఆపద వాటిల్లినట్లుంది. వెంటనే వెళ్లు లక్ష్మణా? అంటుంది. లక్ష్మణుడు ఆ అరుపులు ఏదో మాయ అని, తన రాముడు ఎలాంటి ఆపదనైనా ఎదుర్కొనగలడని చెబుతాడు. కాని సీతమ్మ ఆ మాటలు రామునివే అని వాదిస్తుంది. లక్ష్మణుడు సీతతో వినకూడని మాటలను వింటాడు. చివరకు అన్న కోసం వెలుతూ సీతమ్మ దగ్గర ఒక గీతను గీసి గీస్తాడు. ఎలాంటి సందర్భంలోను ఆ గీత దాటి బయటకు రాకూడదని సీతకు చెప్పి వెళ్తాడు. లక్ష్మణుడు గీసిన గీతను లక్ష్మణ రేఖ అని అంటారు. దీన్ని కవి చక్కగా కల్పించి రాశాడని భావించవచ్చు.

లక్ష్మణుడు రాముని కోసం వెళ్తాడు. చివరకు రాముని దగ్గరకు చేరుకుంటాడు. అంతలో రావణుడు ఒక యోగి రూపంలో బిక్షాటనకు సీత దగ్గరకు వచ్చి ఆమెను లంకకు తీసుకుపోతాడు. ఆ విషయాన్ని జటాయువు చూస్తుంది. రావణుడు జటాయువుకు ఒక రెక్కను ఖండిస్తాడు. అది కిందకు పడిపోతుంది. అప్పుడు జటాయువును రామలక్ష్మణులు చూస్తారు. జటాయువు దగ్గరకు వెళ్తారు. జటాయువు సీతాపహరణ విషయాన్ని రామలక్ష్మణులకు తెలియజేస్తుంది. అప్పుడు రాముడు సీతలేని జీవితం వ్యర్థమని బాధపడతాడు. లక్ష్మణుడు అక్కడ అన్నను ఓదారుస్తాడు.

### 6. లక్ష్మణుడు కిష్కిందకు వెళ్ళుట:

సీతాన్వేషణ కోసం రామలక్ష్మణులు వెలుతూ మార్గం మధ్యలో వానర సేనల దగ్గరకు చేరుకుంటారు. రామలక్ష్మణులు అక్కడ సుగ్రీవున్ని కలుస్తారు. సుగ్రీవునికి సీత విషయాన్ని తెలియజేస్తారు. అప్పుడు సుగ్రీవుడు తనను వానర రాజ్యానికి రాజును చేస్తే వానర సైన్యం మీకు సహాయం చేస్తుందని చెబుతాడు. సుగ్రీవుని కోరిక మేరకు రాముడు వాలిని వధించి వానరరాజుగా సుగ్రీవున్ని ప్రకటిస్తాడు. రాజుగా సుగ్రీవుడు సంసార మోహంలో పడి శ్రీరామునికిచ్చిన మాటను మరిచిపోయాడు. అప్పుడు లక్ష్మణుడు సుగ్రీవుని కోసం కిష్కిందకు వెళ్తాడు.

**"ఆ మహేంద్రకుమారునని గూల్చి నీకు - నీమాడ్కి కపిరాజ్య మిచ్చినయట్టి**
**రామునికార్య మారడివుచ్చి యిట్లు - కామోపభోగసౌఖ్యంబుల బొదలి**
**యుందురే? యందుకై యుగ్రభావమున - సందేహ మేటికి సౌమిత్రి యిటకుఔ**
**వచ్చినాడమ్మేటి వాకిట నుండ - వచ్చునే లోకైకవంద్యుడా ఘనుడు**
**రావింపు సేవింపు రామకార్యంబు - గావింపు భావింపు కడగి నీ ప్రతిన "**

(రంగనాథ రామాయణం.కిష్కింధకాండ.పుట సంఖ్య. 213)

### 7. లక్ష్మణుడు సుగ్రీవున్ని మన్నించుట:

**"సౌమిత్రి రాఘవ స్వామికార్యంబు - నే మఱతునె? యిపు డెల్లవానరుల**
**దెచ్చెద వైదేహి దిక్కుల వెదుక - బుచ్చెద వచ్చెద బొందు మీవెనుక**
**నే శరంబున వాలి యిలమీద వ్రాలె - నేశరంబున గూలె నేడుతాళములు**
**నారంబే చాలు నఖిలదానవుల - నాశంబు నొందింప నాతి సాధింప "**

(రంగనాథ రామాయణం.కిష్కింధకాండ.పుట సంఖ్య. 214)

సుగ్రీవునితో లక్ష్మణుడు వానరేశ్వరా! నీవు మిత్ర సహకారంతో స్వకార్యాన్ని నెరవేర్చుకుని తిరిగి సహాయం చేయలేని కృతఘ్నుడవయ్యావని చెబుతాడు. అప్పుడు సుగ్రీవుడు సావధానుడై ధశరథనందనా! శ్రీరామమూర్తి తన కార్యాన్ని సిద్ధింపజేసిన తేజోమూర్తి. ఆయన సాక్షాత్తు భగవానుడు. రాముడు రావణుని వధించుటకు నేను కచ్చితంగా ఆయనకు సహాయం చేస్తాను. కాబట్టి తనను మన్నించు మహా! ప్రభూ అంటూ సుగ్రీవుడు లక్ష్మణుని పాదాలపై పడి వేడుకుంటాడు. ఆ మాటలు విన్న లక్ష్మణుడు సుగ్రీవున్ని దగ్గరకు తీసుకుని ఆలింగనం చేసుకుంటాడు. సుగ్రీవునితో కలసి లక్ష్మణుడు రామ సన్నిధికి వస్తాడు.

### 8. లక్ష్మణుడు , అతికాయుల యుద్ధం:

అతికాయుడు పెద్దశరీరం కలవాడు. శ్రీరాముడు రాక్షసులతో యుద్ధం చేస్తున్నప్పుడు లక్ష్మణుడు అతికాయునితో యుద్ధాన్ని చేస్తాడు. అతికాయుడు లక్ష్మణున్ని చూసి అవహేళన చేస్తాడు. నీవు చిన్న పిల్లవానివని, నీకు యుద్ధమంటే తెలియదని కాబట్టి నీవు తిరిగి వెళ్ళిపోమని లక్ష్మణున్ని అవమానపరుస్తాడు. తనను లక్ష్మణుడు

ఓడిరచలేదని ప్రగల్భాలు పలుకుతాడు. అప్పుడు లక్ష్మణుడు యుద్ధం చేస్తే ఎవరి శక్తి ఎంతో తెలిసిపోతుంది అనవసర మాటలు ఎందుకని బదులిస్తాడు.

**"నిలునిలు లక్ష్మణ నీవు బాలుడవు - వలదంత నీకంటే వ్రాలినవాడ**
**నావరశరఘట్టనంబు సహింప - నీవసుంధర యొండె? హిమగిరి యొండె**
**రావణుండెత్తిన రజతాద్రి యొండె? - దేవత లున్న ధాత్రీధరరం బొండె?**
**సంజక హరువిల్లు నడచి గర్వమున - రంజిల్లు మీయన్న రాఘవుం డొండె?**
**గాక నన్నునిమొన గదియ శక్యంచె? - నీకు నా ముందట నిలువంగ దరమె?**
**యీవరబాణంబు నిట నిన్నుగట్టి - త్రావెడు నీదుర క్తంబు సౌమిత్రి! "**

(రంగనాథ రామాయణం.కిష్కింధకాండ.పుట సంఖ్య. 409)

యుద్ధంలో లక్ష్మణుని బాణాల తాకిడిని అతికాయుడు తట్టుకోలేకపోతాడు. అతికాయుని శరీరం నిండా గాయాలయ్యాయి. లక్ష్మణుని బాణాలు అతికాయుని శరీరంలోకి వెళ్ళాయి. చివరకు అతికాయుడు మరణించడం జరుగుతుంది. లక్ష్మణుని పరాక్రమం, బలశక్తి, ఈ యుద్ధంలో కనిపిస్తుంది. అతికాయున్ని లక్ష్మణుడు ఎంతో చాకచక్యంగా నెలకొరిగేలా చేశాడు.

## 9. లక్ష్మణుడు ఇంద్రజిత్తుని చంపుట:

శ్రీరాముని కోరిక మేరకు లక్ష్మణుడు సుగ్రీవుడు, విభీషనులను వెంటబెట్టుకొని ఇంద్రజిత్తుని మీదకు యుద్ధానికి బయలుదేరుతాడు. ఇంద్రజిత్తునితో లక్ష్మణునికి ఘోరయుద్ధం జరుగుతుంది. ఈ యుద్ధంలో లక్ష్మణుని వీరత్వం, ధీరత్వం, యుద్ధకౌశలాలు ప్రస్ఫుటంగా కన్పిస్తాయి.

"**యాయోధనంబున నలవుమై వింత - సేయునే యీతం డజేయుడై నేడు**
**బహుదివ్యశస్త్రాస్త్రబలు నింద్రజిత్తు -నహితభయంకరు ననిలోన జంపె**
**నటుగాన నాచేత నని జచ్చు నింక - బటుశౌర్యధనుడైన పఙ్క్తికంధరుడు**
**ఆతనివిభంబు నాతనిబలిమి - యాతనిసుతునితో నట నేడు పొలిసె**
**నిఖిలశస్త్రంబుల నిపుణుడై మెఱసి - యఖిలరక్షసులకు నాధారమైన**
**కొడుకుచావున కెల్లకోర్కులు విడిచి - కడిమిమై నాతోడ గయ్యంబుసేయ**"

(రంగనాథ రామాయణం.యుద్ధకాండ.పుట సంఖ్య. 446)

లక్ష్మణుడు ఇంద్రజిత్తుని అశ్వ,రథ,సారథులను మొదట సంహరిస్తాడు. రాక్షస సేనలను చంపుకుంటు వచ్చి ఇంద్రజిత్తుని బాణాలను కూడా విరిసేచాడు. చివరకు ఇంద్రజిత్తున్ని సంహరించి గొప్ప విజయాన్ని సాధించిన తర్వాత లక్ష్మణుడు రామునిచేత గొప్ప ప్రశంసలనందుకుంటాడు.

లక్ష్మణుడు మూర్ఛపోవుట:

లక్ష్మణునిచేతిలో ఇంద్రజిత్తు హతుడయ్యాడన్న విషయాన్ని రావణుడు తెలుసుకుంటాడు. రావణుడు తన దు:ఖాన్ని మనసులో పెట్టుకొని, సైన్యాన్ని తీసుకుని యుద్ధరంగానికి వస్తాడు. భయంకర అరుపులతో లక్ష్మణుని వైపు

వస్తాడు. ఆ యుద్ధంలో రావణుని శక్తిబాణం లక్ష్మణుని శరీరానికి గుచ్చుకుంటుంది. అప్పుడు లక్ష్మణుడు మూర్ఛపోతాడు.

**"యది వచ్చి భుజమధ్య మాడ లక్ష్మణుని - వదలక తాకిన వసుధపై బడియె**
**నరిగి దశాననుం డంత లక్ష్మణుని - నిరువది చేతుల నెత్తఁజూచుటయు**
**నాతడు విష్ణుని యంశజుడగుట - నేతెఱంగున వాని కెత్తరాదయ్యె**
**నత్తఱి రావణుండంతరంగమున - నెత్తరాకుండిన నేను గైలాస**
**మెత్తి త్రిలోకంబు లెల్లను నెఱుగ - నిత్తఱి నాసత్త్వ మెల్లను దరిగె "** (రంగ.రా.యు.కా.పుట. 409)

రావణుని భాణం దెబ్బకు లక్ష్మణుడు నేలపై తిరిగి పడ్డాడు. లక్ష్మణున్ని ఎత్తడానికి రావణుడు అతని దగ్గకు వస్తాడు. రావణుడు లక్ష్మణుని దగ్గరకు వచ్చి చూస్తాడు. లక్ష్మణుడు బతికున్నాడేమో పైకి లేపాలనుకుంటాడు. లక్ష్మణుడు విష్ణువు అంశ గలవాడు కాబట్టి అతనిని తాకకూడదని రావణుడు దూరంగా వెళ్తాడు. కాని తన మనసులో ఏదో తెలియని సంకోచంతో తిరిగి లక్ష్మణుని దగ్గరకు వస్తాడు. కైలాస పర్వతాన్ని ఎత్తిన ఈ రావణునికి లక్ష్మణున్ని ఎత్తలేనా అని సందేహపడతాడు. లక్ష్మణుని శరీరంలో కదలికలు లేకపోవడం వల్ల అతడు చనిపోయాడని అనుకుంటాడు.

## 10. సంజీవని వల్ల లక్ష్మణుడు మేల్కొనుట:

శ్రీరాముడు తన తమ్ముడైన లక్ష్మణుడు రావణుని బాణానికి మూర్ఛపోయాడనే విషయాన్ని తెలుసుకుని బాధపడతాడు. ఏదైనా సందర్భంలో రామునికి బాధ కలిగితే లక్ష్మణుడు ఒదార్చేవాడు. కాని ఇప్పుడు ఎవరు ఒదార్చుతారని తమ్మున్ని తలచుకుని పదేపదే దు:ఖిస్తాడు. సుషేసుడు సంజీవని వల్ల లక్ష్మణుడు బతుకుతాడని రామునికి చెబుతాడు. సంజీవనిని హనుమంతుడు మాత్రమే తేగలడని రామునికి తెలుపుతాడు. అప్పుడు శ్రీరాముడు సంజీవని కోసం హనుమంతున్ని పంపిస్తాడు. హనుమంతునికి ఏది సంజీవనో తెలియక సంజీవని పర్వతాన్నే ఎత్తుకొని వస్తాడు. సంజీవని వల్ల లక్ష్మణుడు తిరిగి బతుకుతాడు.

## 11. ముగింపు:

రంగనాథ రామాయణంలో శ్రీరామునికి అడుగడుగునా సేవ చేసినవ్యక్తిగా లక్ష్మణుడు కన్పిస్తాడు. అందులో రాములవారు అరణ్యవాసం వెళ్ళినప్పుడు వారికి తోడుగా, భద్రతగా ఉండి తన జీవితాన్ని త్యాగం చేసిన త్యాగధనుడు. సీతారాముల కోసం అడవిలో రాత్రింబగళ్ళు కాపలాగా ఉండి, కంటికి రెప్పలాగా చూసుకుండేవాడుగా మనం గమనించవచ్చు. తనకు నిద్ర రాకూడదని నిద్రాదేవినే 14 సంవత్సరాలు తన దరికి చేరద్దని చెప్పిన పరమోత్కృష్టమైన వ్యక్తి లక్ష్మణుడు. ఇందులో కొన్ని సంఘటనలు రంగనాథ రామాయణానికే పేరు తెచ్చిపెట్టాయని చెప్పవచ్చు. అలాంటి వాటిలో ఊర్మిళాదేవి నిద్ర, లక్ష్మణ రేఖ, లక్ష్మణుడు, అతికాయుల ఘోర యుద్ధ విషయాలు మొదలైనవి. వాల్మీకి

రామాయణంలో లేని లక్ష్మణ రేఖను రంగనాథ రామాయణ కర్త ఎంతో సృజనాత్మకంగా చిత్రించాడని చెప్పవచ్చు. లక్ష్మణుని శక్తేంటో లక్ష్మణరేఖ ద్వారా వెల్లడౌతుంది. లక్ష్మణ, అతికాయుల యుద్ధంలో కవి యొక్క చాకచక్యం, నేర్పరితనం స్పష్టంగా కనిపిస్తుంది. ఈ వ్యాసంలో లక్ష్మణుని సేవానిరతి స్పష్టంగా కనిపిస్తుంది. సీతారాములతో కలసి అడవులకు వెళ్ళినప్పుడు అక్కడ అన్నవదిలకు ప్రతి క్షణం తోడుగా వారి నీడలాగా ఉన్నాడు. అన్నవదినలకు సమయానికి కాయలు, పండ్లు మొదలైన ఆహారపదార్థాలను తెచ్చిపెట్టడంలో లక్ష్మణుని ప్రేమ ఇందులో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. అందుకే అన్నదమ్ములంటే రామ లక్ష్మణులులాగా ఉండాలని పెద్దలంటారు. నేటి సమాజంలో వ్యష్టి కుటుంబాలు ఎక్కువౌతున్నాయి. అందుకు కారణం అన్నదమ్ముల మధ్య సఖ్యత లేకపోవడం.స్వార్థం, అసూయలను పెంచుకోవడం, వీటి వల్ల తల్లిదండ్రులను పంచుకోవడం జరుగుతున్నది. అన్నదమ్ముల మధ్య ఉన్న ప్రేమను, లక్ష్మణుడు వదినను తల్లితో సమానంగా చూసిన విధానం నేటి సమాజానికి ఎంతో ఆదర్శమని తెలుసుకోవచ్చు. ఈ వ్యాసంలో లక్ష్మణుని సేవ, త్యాగం, యుద్ధం చేయడం, మొదలైన విషయాలన్ని పరిశోధనా ఫలాలే అని చెప్పవచ్చు.

## పాదసూచికలు:

1. రంగనాథ రామాయణం.గోనబుద్ధారెడ్డి, కిష్కింధకాండ. పుట సంఖ్య. 213
2. రంగనాథ రామాయణం. గోనబుద్ధారెడ్డి, కిష్కింధకాండ. పుట సంఖ్య. 214
3. రంగనాథ రామాయణం.గోనబుద్ధారెడ్డి, కిష్కింధకాండ. పుట సంఖ్య. 409
4. రంగనాథ రామాయణం. గోనబుద్ధారెడ్డి, యుద్ధకాండ. పుట సంఖ్య. 409
5. రంగనాథ రామాయణం. గోనబుద్ధారెడ్డి,యుద్ధకాండ. పుట సంఖ్య. 446

## ఉపయుక్తగ్రంథసూచి:


1. ఒబయ్య నాయుడు, ఎల్. (2005). రావణ రాజ్యము, రామరాజ్యము, వెటివెల్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, చిత్తూరు.
2. కృష్ణమూర్తి , ఇరివెంటి. (1985). లక్ష్మణుడు ,తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి.
3. ప్రభాకరశాస్త్రి, వేటూరి. (2015). రంగనాథ రామాయణం, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి.
4. బుద్ధారెడ్డి, గోన. (1949). రంగనాథ రామాయణం (ద్విపద కావ్యం) , రాయలు అండ్ కో పబ్లిషర్స్, కడప.
5. నాగయ్య, జి., (2009). తెలుగు సాహిత్య సమీక్ష (మొదటి సంపుటి),నవ్య పరిశోధక ప్రచురణలు, తిరుపతి.
6. రామశర్మ, ఆకుండి. (2002). రామాయణంలో విశిష్టపాత్రలు (వ్యాస సంకలనం), ఆకుండి శారదాంబప్రచురణలు, శ్రీకాకుళం.
7. లక్ష్మణరావు, గంధ్ర, (2012). తెలుగులో రామాయణం, తెలుగు అకాడమి, హైదరాబాద్.
8. సత్యనారాయణ రావు, కాడాలి, (1932) .లక్ష్మణుడు, పాలిపేరరాజు ప్రచురణలు, ఏలూరు.


***



AUCHITHYAM
ISSN: 2583-4797
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_07.php


## "కమనీయం తెలుగు రామాయణం"

### జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 7. కల్పవృక్షం: ఆదర్శమాతృమూర్తి సుమిత్ర పాత్రచిత్రణ


**సుందరి వేణుగోపాల్**

విశ్రాంత బ్యాంకు ఉద్యోగిని,
మాదాపూర్, హైదరాబాద్.
హైదరాబాద్. తెలంగాణ.
సెల్: +91 9479003124. Email: haneeves@gmail.com



**వ్యాససంగ్రహం:**

*రామాయణంలో ప్రతి పాత్రకు ఉన్న ప్రత్యేక వ్యకిత్వము, విశేష గుణాలు కథాగమనములో వాటికున్న ప్రాధాన్యత విస్మరించలేనివి. తమ విలక్షణమైన ప్రవర్తనాశైలితో మన మనసుల మీద చెరగని ముద్ర వేసిన పాత్రలలో ఎన్నదగినది సుమిత్ర. లోకములో తల్లులు సహజంగా తమ బిడ్డల విషయములో చాలా స్వార్థంగా ఉంటారు. వారికి తమ పిల్లల సుఖసంతోషాలు, ఉన్నతి కన్నా ముఖ్యమైనది వేరేదీ ఉండదు. కాని రామాయణంలో చిత్రించిన మాతృమూర్తులందరిలోను, లోక వ్యవహారానికి భిన్నంగా తన బిడ్డలపట్ల ఇసుమంతైనా స్వార్థచింతన లేకుండా, లోకశ్రేయస్సునే కోరుకున్న సహృదయురాలైన మాతృమూర్తి సుమిత్ర. రామాయణంలో సుమిత్ర పాత్ర నన్ను చాలా ఆకర్షించింది; కాని ఆమె గురించిన లభించిన సమాచారం అతి కొంచము మాత్రమే. అంతర్జాలములోను, రామాయణము మీద వివిధ పత్రికలలో వచ్చిన వ్యాసాలను చదివి ఏర్పర్చుకున్న అవగాహనే సుమిత్ర మీది ఈ వ్యాసం. సుమిత్ర శాంతగుణ పేటిక. స్నేహశీలి. గంభీర స్వభావురాలు. ధీర. ఉదాత్తత, వివేకము కలిగిన ఒక మహోన్నత వ్యక్తి. లౌకిక విషయాలలో, ముఖ్యముగా కుటుంబ విలువలను పరిరక్షించే విషయములో, తామరాకు మీద నీటి బొట్టులా మనసా,వాచా,కర్మేణా ప్రవర్తించిన యోగిని. మితభాషణ ఆమెకు పెట్టని ఆభరణము. లోకములో సుఖదుఃఖాలు అశాశ్వతాలు, మాయామోహకారకాలు; పరమపదమే శాశ్వతానంద నిలయమనే జ్ఞానము కల సుమిత్ర ఆ జ్ఞానాన్ని తన ప్రవర్తనలోను, అదే ఆదర్శముగా బిడ్డల పెంపకములోను ఆచరించి, మన జీవితాలను ఎలా ఉన్నతముగా తీర్చిదిద్దుకోవచ్చో తెలియచేసినందున, ఆమె అక్షరాలా మనకు సు"మిత్రే". తన బిడ్డల నడత ఏ విధంగా లోక శ్రేయస్సుకు హేతువు కాగలదో గ్రహించి, వారిని అదే దారిగుండా మార్గదర్శకురాలై నడిపించిన సుమిత్ర వంటి తల్లుల అవసరం నేటి సమాజ శ్రేయస్సుకు ఎంతైనా అవసరము.*



**Keywords:** రామాయణం, సుమిత్ర, కుటుంబ విలువలు, మాతృమూర్తి, భార్య, ఆదర్శం, అన్నతమ్ములు.


## 1. ఉపోద్ఘాతం:

వేల సంవత్సరాలనుంచి అవిచ్ఛన్నముగా సాగుతూవస్తున్న మన సనాతన దర్మపు మనుగడ, మారుతున్న సామాజిక వ్యవస్థ, దిగజారిపోతున్న కుటుంబవిలువలు, దినదినప్రవర్ధమానముగా పెరిగిపోతున్న అనైతిక వర్తన

మూలంగాప్రస్తుతము దారి తెన్నూ తోచక తన ఉనికే ప్రశ్నార్థకంగా మారిన స్థితిలో ఉంది. ఆ ధర్మాన్ని కాపాడి, మళ్ళీ దానికి పూర్వపు ప్రాభవాన్ని కలిగించడములో మనకు కరదీపికలు రామాయణ పాత్రలు. శ్రీ విశ్వనాథ వారు కావ్యానందములో వ్రాకుచ్చినట్టుగా "**లోకచిత్రణం లేకుండా కథ లేదు. అది లేకుండా కథకు రమ్యత లేదు**". (కావ్యానందము పుట. 113)

రామాయణంలో ప్రతి పాత్రకు ఒక ప్రత్యేక వ్యకిత్వము, విశేష గుణాలు ఉన్నాయి. వాటి నిడివి కొంచమే అయినా కథాగమనములో వాటికున్న ప్రాధాన్యత విస్మరించలేనిది. ప్రతి పాత్ర ఎంత చిన్నదైనా, తన విలక్షణమైన శైలితో మన మనసుల మీద చెరగని ముద్ర వేస్తుంది. అటువంటి పాత్రలలో ఎన్నదగినది సుమిత్ర పాత్ర.

ఏ సమాజమైనా వ్యక్తుల నడవడికను బట్టే మనగలుగుతోంది. ఆ వ్యక్తుల నడవడిని వారి కుటుంబపు విలువలు ప్రభావితం చేస్తాయి. కాబట్టి కుటుంబమే సమాజ శ్రేయస్సుకు పునాది. ఆ పునాది గట్టిగా ఉండాలంటే ఆ కుటుంబంలోని సభ్యులు ఎలా ప్రవర్తించాలో, ఎలా ఉండకూడదో అని ఉగ్గుపాలతోనే నేర్పే తల్లే మనకు తొలి గురువు. అటువంటి మాతృమూర్తి రామాయణంలో లక్ష్మణ శత్రుఘ్నుల తల్లి సుమిత్ర రూపములో మనకు కనిపిస్తుంది.

నా వ్యాసరచనకు నేను ఎక్కువగా ఆధారపడినది విశ్వనాథసత్యనారాయణ గారు రచించినశ్రీమద్రామాయణ కల్పవృక్ష కావ్యం. శ్రీ విశ్వనాథవారు లబ్ధప్రతిష్టులు. ఆర్ష ధర్మ సంస్కృతీ పరిరక్షణకు అవిచ్ఛన్న సంప్రదాయార్థిగా నడుం కట్టి, తన తండ్రి అయిన శ్రీ శోభనాద్రి గారికిచ్చిన మాట కోసం శ్రీమద్రామాయణ కల్పవృక్షం కావ్య రచన చేశారు. లౌకిక విషయాసక్తులను త్యజించి పారలౌకిక విషయాన్వేషణ కోసం తపించేవారి పాలిట కల్పవృక్షమే వారి ఈ రచన.

## 2. సుమిత్ర పాత్ర పరిచయం:

వాల్మీకి రామాయణంలో కౌసల్య ప్రస్తావన అశ్వమేధ యాగ ఘట్టము వరకు, సుమిత్ర, కైకేయిల పాత్రలు, పాయస ప్రసాదన వేళవరకు పరిచయం కావు. తనకు పుత్రసంతతి లేనందున దశరథుడు సుమిత్రను రెండో భార్యగా స్వీకరిస్తాడు.ఆమెపరిచయంఅంత వరకే. ఈమె ఏ దేశపు యువరాణి? ఆమె తల్లి తండ్రులు ఎవరు? వంశ చరిత్ర ఎటువంటిది? మొదలైన వివరాలు తెలియవు.అయితే వాల్మీకి రామాయణము తరువాత వచ్చిన కొన్ని గ్రంధాలలో ఈమె కాశి లేదా మగధ దేశపు యువరాణి అని, హైహేయ వంశానికి చెందినదని ఉంది.

కాని విశ్వనాథ వారు దశరథుని గురించి ప్రస్తావిస్తూనే, అతనితో పాటు అతని భార్యలను కూడా మనకు పరిచయం చేస్తారు. దశరథునికి ఎంతోమంది భార్యలున్నా వారిలో ప్రధానమైనవారు కౌసల్య, సుమిత్ర, కైకేయి. కౌసల్య దేవేరి, సుమిత్ర శాంతగుణ పేటిక, కైకేయి రాజుకు ప్రియపత్ని.

**అరయ నెందఱేని కలరాయన కంగన లందు మూగు రిం**
**పారిన ప్రేయసుల్ గుణగణాబ్ధులు, కోసలరాజపుత్రి దే**
**వేరి, సుమిత్ర శాంతగుణ పేటిక, కేకయరాజకన్య హే**
**లారతి డాగు రేకుల తళత్తళ కాటుక రాజుకంటికిన్** (కల్పవృక్షం బాల, ఇష్టిఖండం-6)

ఇద్దరి భార్యల వలన సంతాన ప్రాప్తి కలగనందున దశరథుడు కైకేయ రాజకుమార్తె కైకేయిని మూడవ భార్యగా స్వీకరిస్తాడు. అయినా చాలా కాలము వరకు సంతానలేమితో పడిన దశరథుడు తమ కులగురువైన వశిష్ఠుని ఆదేశము మేరకు, ఋష్యశృంగముని ఆధ్వర్యములో అశ్వమేధ,పుత్రకామేష్టి యాగాలను చేసి, యాగపురుషుడిచ్చిన పాయసాన్ని ముగ్గురు భార్యలకు పంపకంచేస్తాడు. పట్టమహిషి కనుక సగపు పాలును కౌసల్యకు, మిగతా సగములో రెండు వంతులు కైకేయి కంటే పెద్దది కాబట్టిసుమిత్రకు, ఒక వంతు కైకేయికి పంచుతాడు. శ్రీ మహావిష్ణువు దుష్టసంహారణకు తానే రామ, భరత,లక్ష్మణ, శత్రుఘ్నులుగానాలుగు వేదాలకి ప్రతీకగా, నాలుగు రూపాలతో దశరథుని ఇంట అలా ప్రభవించాడు.

సుమిత్ర గుణగణాలు

**"కౌసల్య ముక్తికాంతాసమానాకార నలి సుమిత్ర యుపాసనాస్వరూప**
**విజయరమాకార వినయాంబుధి సుమిత్ర కైకేయి మధుసామగానమూర్తి**
**కౌసల్య నవశరత్కాల మందాకిని సితపుండరీకంబు శ్రీ సుమిత్ర**
**మందారపుష్పంబు మహిళామణి సుమిత్ర కైకేయి నునునల్లకల్వపువ్వు"** (బాల, ఇష్టిఖండం-7)

ఈ పద్యములో విశ్వనాథవారు సుమిత్రను "ఉపాసనాస్వరూప" అని "విజయరమాకారవినయాంబుధి" అనే రెండు విశేష పదాలతో వర్ణించారు, ఆమెలోని ఈ లక్షణాలు లక్ష్మణునికి రాముడిపట్ల గల ఆరాధన, శత్రుఘ్నుడికి భరతుడి యెడల గల వినయ భావములో ప్రతిఫలించాయి. పట్టమహిషి అయిన కౌసల్యకు, చక్రవర్తి ప్రియ భార్య అయిన కైకేయికి ఉన్నప్రాభవం తనకు లేకపోయినా, తనదైనవ్యక్తిత్వపు శోభతోమనలను సమ్మోహనపరిచే రాణిసుమిత్ర. సుమిత్ర అనే పేరుకి సంస్కృతములో మంచి మైత్రి స్వభావము కలది అని అర్థము. అందుకే మితంగా ఉన్న స్థితి నుంచి (లౌకిక మార్గము) అపరిమితమైన స్థితికి (పారలౌకికస్థాయి) ప్రస్థానం సాగించేలా ప్రత్యక్షంగా కొడుకులకు, పరోక్షముగా మనకు దిశానిర్దేశనము చేసి చిరస్మరణీయురాలైనది.

మనదేశంలో అనాదిగా ఉన్న మతము ఉపాసనా మతమేనని, కాలాంతరాన అదే వైదీకమతమని, సనాతన మతమని, హిందూమతమని వేరువేరు పేరులతో ఆచరింపబడినదని ఆర్యోక్తి. కౌసల్యను వెన్నంటి ఉన్నందున ఆమె ఉపాసనకు కౌసల్య ఆలంబన అయింది. ముక్తికాంతగా పేర్కొనబడిన కౌసల్య ఉపాసకురాలు సుమిత్ర కనకనే అట్టి ఉపాసనా రీతి సుమిత్రలో రాశీభూతమైంది.సుమిత్ర ఉపాసనా బలము ఆమె సంతానమైన లక్ష్మణుడికి సంక్రమించి, అతనిని పరంధాముడైన రామునికి ప్రియతముడుని చేసింది.

కౌసల్యకు ఏమి జరిగినా తనకే జరిగినట్టు భావించే సుమిత్ర పుత్రకామేష్టి యాగం గురించి దశరథుడు చెప్పగా కౌసల్యకు తనయుడు కలిగితే, మీ భార్యలందఱకు కూడా అతను కొడుకే అవుతాడు కదా అని చెప్పి సవితి పట్ల, ఆమె కొడుకు పట్ల ఎటువంటి మాత్సర్యము లేకుండా ఎనలేని ఆదరాన్ని చూపుతుంది.

విశ్వనాథ సత్యనారాయణ గారు తమ శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో దశరథ పుత్రులను పురుషార్థాలకి (రాముఁడు ధర్మానికి, లక్ష్మణుడు అర్థానికి, శత్రుఘ్నుడు కామానికి, భరతుడు మోక్షానికి) ప్రతిరూపంగా,అతని రాణులైన కౌసల్య, సుమిత్ర, కైకేయిలను సత్త్వరజస్తమోగుణాలకి ప్రతీకలుగా ధ్వనిరూపంగా సూచించారు. కానిరామాయణాన్ని ఎంత శోధించినా సుమిత్రలో రజోగుణము లేశమాత్రమూ కనిపించదు. అయితే ఆమె సంతానమైనకవలలులక్ష్మణ, శత్రుఘ్నులు రజోగుణ కారకాలైన అర్థకామాలకి ఉదారణలుగా విశ్వనాథవారు ఉటంకించారు.

చతుర్విధ పురుషార్థాలైన ధర్మార్థకామమోక్షములలో అర్థకామాలు కూడా ముక్తిసాధనకు అవసరమైనవి. ఈ రెండూ అవిభాజ్యాలు. ఆనందమయమైన జీవితాన్ని సాగించడానికి రజోగుణమూ ఒక ముఖ్యమైన ఉపకరణమని, రామునితో లక్ష్మణుడు, భరతునితో శత్రుఘ్నుడు కూరిమితో కూడి ఉండిధన్యులైనట్టుగా, అర్థకామాలను ధర్మ సాధనకు, మోక్షప్రాప్తికి సోపానాలుగా గుర్తెరిగిమన జీవితాలనుకూడా వారివలెసార్థకం చేసుకోవాలన్నదే రామాయణ అంతరార్థము.

## 3. ఆదర్శ మాతృమూర్తి:

లోకములో తల్లులు సహజంగా తమ బిడ్డల విషయములో చాలా స్వార్థంగా ఉంటారు. వారికి తమ పిల్లల సుఖసంతోషాలు, ఉన్నతి కన్నా ముఖ్యమైనది వేరేదీ ఉండదు. రామాయణ కావ్యములో మనకు మూడు రకాల తల్లులు కనపడతారు. తన కొడుకు శ్రీరాముడు క్షేమముగా ఉంటే చాలు అనే కోరుకునే తల్లి కౌసల్య మొదటి రకము.ఈమెకు పుత్రవాత్సల్యము మెండైనాఇతరుల చెడును కోరుకునే స్వభావము లేనిది. తన కొడుకు భరతుడు పట్టము కట్టుకుని రాజ్యం ఏలాలని, సవతి కొడుకైన రాముడు అడవుల పాలవ్వాలని కోరుకున్న కైకేయి, రెండో రకముతల్లి. స్వార్థపరురాలైనఈమె తన కొడుకు సుఖం కోసము ఇతరులు ఇడుములపాలైనా పట్టించుకోని నైజము కలది. మరి సుమిత్రో? లోకవ్యవహారానికి భిన్నంగాతన బిడ్డలపట్ల ఇసుమంతైనా స్వార్థచింతన లేకుండా, లోకశ్రేయస్సు నేకోరుకున్న సహృదయురాలైన తల్లి.

## 4. పిల్లల పెంపకంలో విశిష్టత:

ఒకే తల్లి కడుపున పుట్టిన కవలలు కలసి ఉండకుండా విడివిడిగా ఉంటేనే వారి ఉన్నతి సాధ్యమని రామాయణం సుమిత్రానందనుల ద్వారా మనకు తెలియచెప్పుతోంది. రామలక్ష్మణులు ఒక జంటగా, భరత

శత్రుఘ్నులు ఒక జంటగా ఉండి, పురుషార్థాలను ఎలా ఆచరిస్తే అవి లోకశ్రేయస్సుకు ఉపయోగపడతాయో మనకు బోధిస్తారు. లక్ష్మణ శత్రుఘ్నులు తమ జీవితాలను అలా నడిపించడానికి కారకురాలు తల్లైన సుమిత్ర సుశిక్షణే.

సర్వలక్షణశోభితులైన ఇద్దరు కొడుకులున్నా, సుమిత్రది పిల్లలు లేని వారితో పోల్చదగిన స్థితి. బిడ్డలు పుట్టినది మొదలు వాళ్ళ ఆలనా పాలనలో ఆనందము పొందే అవకాశము ఆమెకు లేనే లేదు. లక్ష్మణ శత్రుఘ్నుల అచ్చట్లు, ముచ్చట్లు, ఆటపాటలు, ముద్దు మురిపాలు అన్నిరామభరతులతోనే. అన్నలిద్దరికనుసన్నలలోనేవాళ్ళు మెలగడము. అయినా ఎటువంటి మనోవికారాలకు తావివ్వకుండా వారిని రాముడికి, భరతుడికి సేవ చేయడానికి నియోగించి ప్రశాంతంగా ఉన్నటువంటి తల్లిసుమిత్ర. తన బిడ్డల శ్రేయస్సు కోసం ఏ మార్గం సరియైనదో గ్రహించి, వారిని ఆ దారిగుండా నడిపించిన సుమిత్ర అరుదైన మూడో రకానికి చెందినఅసలైన తల్లి.

### 5. జ్ఞానస్వరూప:

రాముడు సాక్షాత్తు ఆ నారాయణుడి స్వరూపమే అని, లక్ష్మణుడు రాముడిని సేవించడానికే జన్మనెత్తాడని, రామలక్ష్మణుల అనుబంధము జీవాత్మ పరమాత్మల సంబంధమేనని ఆమెకు బాగా తెలుసు.

**"ఇతడును రామభద్రుడు(ను, నెప్పుడు నిద్దఱు కాఱు, వారిలో**
**నితడిట నున్న రాముడు( ను నిచ్చట నున్నటులే"** (అయోధ్య. ప్రస్థానఖండం-80)

లక్ష్మణుడి ఉన్నతి రాముడి శ్రేయస్సులోనే ఉన్నదని, రామ సేవయే అతని ముక్తి మార్గమని గ్రాహ్యము చేసుకున్నఆమె, అన్నగారిని అత్యంత భక్తి శ్రద్ధలతో సేవించడమే పరమోత్తమ ధర్మమని కొడుకుకి ఉగ్గుపాలతోనే అర్థమయ్యేట్టు బోధించింది. తల్లిపోలికనే పుణికిపుచ్చుకున్నలక్ష్మణుడు రామోపాసకుడయ్యి తల్లీకొడుకులకు అభేదమని నిరూపించాడు.

### 6. స్నేహశీలి:

రాముని ముఖతా పట్టాభిషేక వార్త విని పొంగిపోయిన కౌసల్య "**నా బంధుపరివారంతో పాటు సుమిత్ర పరిజనము కూడా సుఖశాంతులతో జీవిస్తారు**" అని అనడంలోనే సుమిత్ర పట్ల ఆమెకున్నఆదరణ, ప్రేమ అర్థమవుతాయి. దీనికి కారణము నిష్కళంకమైన సుమిత్రప్రవర్తన.వనవాసానికి తనతో పాటే రావడానికి సిద్ధపడుతున్నలక్ష్మణుడిని నీవు కూడా నాతో అడవులకు వచ్చేస్తే మన తల్లులను ఎవరు పోషిస్తారు? ఎవరు రక్షిస్తారు? అంటూ వారించబోయిన రాముడితో కౌసల్యపోషణకు ఎవరి అవసరం లేదు, స్వయముగా ఆమె వేయి గ్రామాలకు అధికారిణి, మా అమ్మ సుమిత్ర కూడా ఆమె పోషణలోనే ఉంటుంది. కనక నేను నీతో వస్తానుఅని లక్ష్మణుడు చెప్పడములో కౌసల్య సుమిత్రల మధ్య సాన్నిహిత్యము, వారిరువురి అనుబంధము పట్ల లక్ష్మణుడికి ఉన్న నమ్మకము. ఆ నమ్మకానికి పునాది తల్లిస్నేహపూర్వకమైన నడవడికే.

## 7. సుశిక్షణను గరిపే తల్లి:

**"సుతునివంకను నొక చూపు జూచె(గొడుకు**
**తల్లిచూపును నెడ(ద భద్రము పఱుప**
**నొక్కయనుమతి యొకదైన్యమొకప్రశంస**
**సున్నితంబుగ( దోచే(నా చూపునందు"** (అయోధ్య, ప్రస్థానఖండం-89)

వనవాసానికి అన్న రాముని వెంట వెడుతూ కౌసల్య మందిరములో ఉన్న తల్లి అనుజ్ఞకోసం వచ్చిన లక్ష్మణుడిని చూసి మౌనముగానే తన కనుసంజ్ఞలతోనే అనుమతించిన సుమిత్ర స్థితప్రజ్ఞతకు మనము వందనాలు సమర్పించవలసిందే.

తన పాదాలకు నమస్కరిస్తున్న కొడుకునుప్రశంసిస్తూ, చూపులతోనే వీరతిలకము దిద్ది,"**నాయనా నువ్వు అన్న సేవ కోసమే పుట్టావు కనక ఆ సేవలో క్షణమైనా ఏమరక అప్రమత్తతో ఉండు. అగ్రజుని అనుకరించడమే అనుజులందరికి అనూచాన ధర్మము.ఇక మీదట నువ్వు సుమిత్రానందనుడివి కావు, రామానుజుడువి. సీతారాములను భక్తితో సేవించుకో, భద్రంగా కాపాడుకో**" అని బోధించి, ఇంకా

**"ఎఱుగుము రాము దశరథుడే యని యే నని సీత**
**నెఱుగుము వన మయోధ్య యని యెఱిగి పోయెదవేని పొమ్ము**
**కఱదలేటికి? నీలమేఘ కాంతాపఘనుండైన రాము**
**మఱవకు సౌదామనీ సమశరీర మఱవకు సీత"** (అయోధ్య, ప్రస్థాన ఖండం-277)

"**ఇహ నుంచి రాముడే నీకు తండ్రి, జానకే తల్లి, అడవే అయోధ్య, సుఖంగా వెళ్ళి రా**" అని హితవులు చెప్పి "**పద్నాలుగు సంవత్సరాలు భార్యను వదిలి రామశుశ్రూష కోసం అడవులకు వెడుతున్నావు. ఎంతో ఉత్తమమైన మార్గములో నడుస్తున్నావు. కన్నతండ్రిని, తండ్రి తరువాత తండ్రి వంటి అన్నను సేవించడమేఆర్ష ధర్మము. అటువంటి ధర్మ నిర్వహణకు వెడుతున్ననిన్ను చూసి నేను ఎంతో సంతోషపడుతున్నాను**" అన్నసుమిత్ర ధర్మనిష్ఠ ఎంతో కొనియాడదగినది. ఎంతో మితభాషిణి, ఉపాసనాస్వరూపమైన అయిన ఆమె ఇన్ని మాటలు మాట్లాడింది అంటే ధర్మ పరిరక్షణ, కర్తవ్య పాలన పట్ల ఆమెకున్న పూనికే కారణము.

## 8. సుమిత్ర ఓదార్పు:

వనవాసానికి వెళ్ళిన రాముడి ఎడబాటును తట్టుకోలేక దుఃఖ వివశుడై మూర్ఛపోయిన దశరథుని చూసి ఏడుస్తున్న కౌసల్యతో సుమిత్ర "సత్యముకోసం, ధర్మముకోసం త్యాగము చేయనున్న రాముడు పురుషోత్తముడు. రామభద్రుడు ఈనాడు చేసిన త్యాగము నభూతోనభవిష్యతి. దీనితోనే అతడు శాశ్వతమైన యశస్సును సంపాదించి అందరికి ఆదర్శప్రాయుడవుతాడు. సూర్యచంద్రులిద్దఱూ నీ బిడ్డకు సేవకులుగా ఉంటారు. ధనుర్బాణాలను చేతపట్టి కనురెప్ప వాల్చని లక్ష్మణుడు అన్నావదినలను సేవిస్తుండగా వారికి ఎటువంటి ఆపద వాటిల్లదు. పదునాలుగు ఏండ్లు యిట్టే గడిచిపోతాయి. దివ్యాస్త్రాలనుసముపార్జించిన రాముడు నిశ్చింతగా వనవాసాన్ని పూర్తి చేసి వచ్చి,

లక్ష్మిస్వరూపమైనజానకితో అయోధ్యరాజ్యాన్ని ప్రజారంజకంగా పాలిస్తాడు. కొడుకు, కోడలు నీకు పాదాభివాదము చేస్తుంటే, మురిసిపోతూవారిని నీ పరిష్వంగములోకి తీసుకుంటూ ఆనందిస్తావు. రాముడు మంగళకరమైనవాడు. అశుభాలు అతని దరికి రావు. పదిమందికి చెప్పవలసిన పట్టమహిషి స్థానములోఉన్నావు. దుఃఖాన్ని విడనాడి తెప్పరిల్లు" అంటూ సాంత్వనపరుస్తుంది.

ఎవ్వరినీ నిందించని మనసత్వం సుమిత్రది. ఇంత అరాచకానికి కారకురాలైనకైకేయిని సుమిత్ర ఏమీ అనదు. అందరిలో ధైర్యం నింపే గుణం ఆమెకు ఎక్కువ.రామవియోగమును భరించలేనిదశరథుని దేహత్యాగానంతరము, తన దుఃఖాన్నినిగ్రహించుకుని, కర్తవ్యపరాయణురాలై, ఎంతో సంయమనముతో, పొగిలిపొగిలి విలపిస్తున్న కౌసల్యను ఓదారుస్తూ "**ఈ శరీరాన్ని విడిచిపెట్టినప్పుడే పుణ్యలోక ప్రాప్తి సాధ్యమని పట్టపు రాణివి నీకు మాత్రం తెలియదా? ఎంత ఏడ్చినా మృతుడైన చక్రవర్తి తిరిగి రాగలడా? రాజు, రాజ్యానికి ఉత్తరాధికారులు లేని ఈతరుణములో పట్టపురాణివైన నువ్వు నీ దుఃఖాన్ని ద్రిగమింగుకుని రాజ్యపాలనను చెయ్యకపోతే రాజ్యము ఏమవుతుంది? ప్రజలేమవుతారు?**" అని ప్రజారక్షణవ్రతయైన రాజనీతిపరురాలివలె కర్తవ్య బోధ చేయగలగడంగంభీర అయిన ఆమెకే చెల్లింది. (విశ్వనాథ సత్యనారాయణ గారి శ్రీమద్రామాయణ కల్పవృక్షం అయోధ్య కాండము మునిశాపఖండం 283 నుంచి 287 వరకు)

## 9. ఉదాత్త చరిత:

కైకేయి కోరిన వరాల మూలముగా రాముడిని వనవాసానికి పంపలేనని ఆక్రోశిస్తూ దశరథుడు "ఏ తప్పు చెయ్యని రాముడిని అరణ్యాలకి ఎందుకుపంపావని సుమిత్ర అడిగితే, నేను ఏమి సమాధానము చెప్పాలని" అంటాడు. కౌసల్య తల్లి కాబట్టి ఆమె రాజుని నిలదీసి అడగడము, దానికి ఆయన సంజాయిషీ ఇవ్వడము సహజమే.కానిపినతల్లి అందునా సవతి తల్లి అయినా రాముడిని స్వంతకొడుకుకంటే ఎక్కువగా ప్రేమించే, అభిమానించే సుమిత్రకు సమాధానము చెప్పలేను అని రాజు అన్నాడంటేఅరమరికలు లేని ఆమె ప్రేమ, అధర్మాన్ని సహించలేని ఆమె స్వభావము, రాజుకు ఆమెపట్ల ఉన్న గౌరవాన్ని తెలియచేస్తున్నాయి.

మేనమామ ఇంటినుండి వచ్చిన భరతుడు తన తల్లి కోరిన వరాలు మూలముగానే రాముడు అడవులపాలయ్యాడని తెలుసుకుని, ఎంతో ఆవేదనతో పెదతల్లి అయిన కౌసల్యను సందర్శించడానికి వచ్చినప్పుడు, కౌసల్య కోపంతో భరతుడితో నన్ను కూడా వనవాసము చేయమంటే సుమిత్రతో వెళ్ళిపోతాను అని చెప్పడం ద్వారా సుమిత్ర తనకు ఎంత ఆత్మీయురాలో వాచ్యంగా ప్రకటించింది. రామాయణములో కౌసల్య, సుమిత్ర, కైకేయిల మధ్య ఉన్న సంబంధాన్ని పరిశీలిస్తే, పట్టాభిషేక ప్రకటన వరకు వారి మధ్య ఎటువంటి పొరపొచ్చాలు, సవితి మాత్సర్యాలు ఉన్నట్టుగా కనిపించదు. వాస్తవానికి ఒకే తల్లి కడుపున పుట్టిన అక్కచెల్లెళ్ల కన్నాప్రేమగా ప్రవర్తిస్తారు. పట్టమహిషిని అనే అహంకారంతో కౌసల్య, ముద్దుల చిన్నభార్యను అనే గర్వముతో కైకేయి, పెద్దగా ఊరుపేరు లేని

(ఎందుకంటే మొదట్లోనేచేప్పినట్టుగా ఆమె గురించిన వివరాలు ఇవ్వనందున) సుమిత్రను ఎక్కడా కించపరిచినట్టుగాను, అవమానించినట్టుగాను నిదర్శనాలు కనపడవు. దీనికి కారణము సుమిత్ర తన వినయశీలతతోను, సత్ప్రవర్తన తోను, స్నేహస్వభావముతోను వారి మనసులను గెలుచుకోవడము.

## 10. ముగింపు:

విశ్వనాథవారి సుమిత్ర రజోగుణానికి ప్రతీకైనా, అర్థకామాలకు ప్రతిగా చూపించిన ఆమె కవలలు లక్ష్మణ శత్రుఘ్నుల ఉపాసన, వినయసంపత్తి, రజోగుణము మన హితవును కోరే మిత్ర గుణమే కాని శత్రుగుణము కాదని నిరూపించాయి. రామాయణములో సుమిత్ర పాత్రను పరిశీలించిన తరువాత నా దృష్టిలో, సుమిత్ర మూర్తీభవించిన శాంత గుణం. స్నేహశీలి. త్యాగమయి. మేధావిని. గంభీర. ధీర. ఉదాత్తత, వివేకగుణసంపదను కలిగిన ఒక మహోన్నత వ్యక్తి. లౌకిక విషయాలలోఎటువంటి వ్యామోహాలలోను చిక్కుకోకుండా, మనసా, వాచా, కర్మేణా తామరాకు మీద నీటి బొట్టులా ప్రవర్తించిన యోగిని. మితభాషణ ఆమెకు ఆభరణము. దైవప్రసాదమైన బిడ్డలను ఆ దైవసేవకే వినియోగించిన అకుంఠిత భక్తురాలు. లోకములోసుఖదుఃఖాలు అశాశ్వతాలు, మాయామోహకారకాలు; పరమపదమే శాశ్వతానంద నిలయమనే జ్ఞానము కల సుమిత్ర ఆ జ్ఞానాన్ని తన ప్రవర్తనలోను, బిడ్డల పెంపకములోను ఆచరించి మన జీవితాలను ఎలా ఉన్నతముగా తీర్చిదిద్దుకోవచ్చో తెలియచేసినందున, ఆమె అక్షరాలా మనకు సుమిత్రే". "**ఆమెను ఆదర్శంగా తీసుకుని ఈనాటి తల్లులు తమ పిల్లలకు సద్వర్తనను నేర్పిస్తే, భావితరాలకు అదిశ్రీరామరక్ష**".

## 11. ఉపయుక్తగ్రంథసూచి:


1. అప్పలాచార్యులు, శ్రీభాష్యం.(2020). రామాయణ ప్రవచనాలు, యూట్యూబు వీడియోలు.
2. ఇందిర, గుమ్మలూరి.(2021). కల్పవృక్షంలో కాంతామణులు, REEM Wisdom Pages L.L.P, న్యూఢిల్లీ.
3. కోటేశ్వరరావు శర్మ, చాగంటి. (2018). శ్రీమద్రామాయణము ప్రవచనం,ఎమెస్కోబుక్స్,హైదరాబాద్.
4. ప్రతాప రెడ్డి, సురవరం. (2023). రామాయణ విశేషములు,క్లాసిక్ బుక్స్,విజయవాడ.
5. సత్యనారాయణ, విశ్వనాథ. (2015). శ్రీమద్రామాయణకల్పవృక్షం,బాలకాండము, శ్రీవిశ్వనాథ పబ్లికేషన్స్, విజయవాడ.
6. సత్యనారాయణ, విశ్వనాథ. (2015). శ్రీమద్రామాయణకల్పవృక్షం, అయోధ్యకాండము, శ్రీవిశ్వనాథ పబ్లికేషన్స్, విజయవాడ.
7. సాంబశివరావు, రావెల.(2022). అపురూపమైన ముఖాముఖి,విశ్వనాథ సాహిత్య అకాడెమి, గుంటూరు.
8. సుప్రసన్నాచార్య, కోవెల.(2015). రస రాజధాని 120 ఏండ్ల విశ్వనాథకు సాహిత్య నీరాజనం.


***




AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_07.php

# "కమనీయం తెలుగు రామాయణం"

### జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

## 7. రామాయణకల్పవృక్షం: సీత

**డా. యస్. రమాదేవి.**
సంస్కృత సహ ఆచార్యులు.
ప్రభుత్వ సిటీ కళాశాల, హైదరాబాద్,
హైదరాబాద్, తెలంగాణ.
సెల్: +91 9704689623. Email: suraparajuramadevi@gmail.com

**వ్యాససంగ్రహం:**

*రామాయణం అంటే రామస్య అయనం అన్న అర్థంతో పాటు సీతా విషయకంగా రామాయాః అయనం అని కూడా అర్థం చెప్పుకోవచ్చని, అంతేగాక మహర్షే స్వయంగా సీతాయాః చరితం మహత్ అని అంటూ ఈ కథ సీతారాముల ఇద్దరిదీను అన్న సత్యాన్ని ఆవిష్కరించాడన్నది ఎందరో విద్వజ్జనులు సప్రమాణంగా తెలిపిన వివరం . సీతతో పాటుగా ఎందరో స్త్రీలు రామావతార ప్రయోజనం నెరవేరడంలో తమ బాధ్యతలను అత్యంత సమర్థంగా నిర్వహించడాన్ని చూడగలం రామాయణంలో. దశరథుని ముగ్గురు రాణులు, కూతురు శాంత, సీత ఊర్మిళ మొదలగు రాచబిడ్డలు, అరుంధతి, అనసూయ, అహల్య వంటి మునిపత్నులైన తాపసస్త్రీలు, యోగవిద్యనభ్యసించిన శబరి స్వయంప్రభ, రంభ, మేనక వంటి అప్సరలను, నదీమతల్లులను, వివిధ శక్తులు కలిగిన రాక్షసస్త్రీలను, వానరస్త్రీలను ఇట్లా ఎంతో వైవిధ్యమైన అస్తిత్వం, వ్యక్తిత్వం ఉన్న పాత్రలను చూస్తాం రామాయణంలో. అయితే రామాయణ కల్పవృక్షంలో సీత అన్న నా ఈ వ్యాసంలో ప్రత్యేకించి వాల్మీకి హృదయానికి వ్యాఖ్యానం అనదగ్గ కల్పవృక్షంలో, సీతాయాః చరితం మహత్ అన్న మహర్షి పలుకును విశ్వనాథ సత్యనారాయణ అర్థవంతంగా చేసిన వివరం తెలపడం, ఆదర్శ స్త్రీగా, పవిత్రతకు పాతివ్రత్యానికి మారుపేరుగా నిలిచిన వాల్మీకి సీత, ఈ కల్పవృక్షంలో కూడ రాముడితో పాటు నిలిచి రాక్షససంహారం చేయించి, లోకోపకారం చేసిన వైనం, ఎంతటి విపత్కర పరిస్థితులలోను సడలని ఆమె ధైర్యం నమ్మకం, ఆత్మ విశ్వాసం, చర్చించడం జరిగింది.*

**Keywords:** వాల్మీకిసీత, కల్పవృక్షసీత, సీతాయాశ్చరితం, పరాశక్తిసీత, రాక్షససంహారసీత, అలౌకికప్రేమతత్త్వం, పవిత్రత, పాతివ్రత్యం, వినమ్రత, గృహస్థధర్మం.

### 1. ఉపోద్ఘాతం:

కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ అంటూ ఒక సత్పురుషుడైన నరుణ్ణి తెలుసుకోవలెనన్న కోరికతో ప్రారంభమవుతుంది వాల్మీకి రామాయణం. వాల్మీకి ఆశించిన ప్రయోజనం వేరు, ఆ మేరకు ఆయన తన కావ్యంలో

ఆధ్యాత్మిక రహస్యాలను ప్రయత్నపూర్వకంగా మరుగుపరిచి మరీ రాముణ్ణి సీతను ప్రజల మనుషులుగా చిత్రీకరించాడన్న విషయం మనందరికీ తెలిసినదే. పాలకుల పాలితుల నిర్మలమైన నడవడి మూలంగానే సమాజ స్వస్థత సాధ్యమవుతుందని ప్రతిపాదించడం వాల్మీకి ప్రధాన లక్ష్యం. కాబట్టే స్వచ్ఛమైన ధర్మాచరణ కలిగిన రాముడిని మూర్తీభవించిన ధర్మంగా వర్ణించాడు. సీత కేవలం ఆయన సహధర్మచారిణిగా ,రాముడి ఛాయలాగా ఆయన వెంట ఉంటుంది అన్నట్లు వర్ణిస్తాడు.

## 2. ప్రధానవిషయం:

ధర్మార్థకామపురుషార్థాలను మాత్రమే వాచ్యంగా ప్రతిపాదించి మోక్ష పురుషార్థాన్ని అంతర్లీనంగా చేసిన వాల్మీకి రామాయణంలో ఆధ్యాత్మిక రహస్యాలు తెలిసిన ఎంతో మంది రామాయణాన్ని ఆ ప్రయోజనం కోసం కాకుండ, మోక్ష కారకం చేసే విధంగా ఆ కావ్యాన్ని తిరగరాసారు. ఆత్మానం మానుషం మన్యే - నేను దేవుణ్ణి కాదు, మనిషిని, అన్నా వినకుండా, వాల్మీకి రాముణ్ణి, మహర్షి ఆశయాన్ని అభీష్టాన్ని మరిచి, రామాయణాన్ని మహిమాన్విత గ్రంధంగా నిలబెట్టారు. ఉదా: అధ్యాత్మ రామాయణం మొదలైనవి. సీత విషయంలో కూడ అంతే అయింది. సాక్షాత్తు ఆ విష్ణుమూర్తియే రాముడిగా, దశరథుడి కొడుకుగా, మానవుడిగా పుట్టాడు అన్న విషయం తన రామాయణంలో విశదంచేసినా, రాముడిని మానవసహజమైన గుణాలతో, భావాలతో మాటలతో, రాముడు కూడ మనలాంటి మానవుడే అని మనకు అనిపించే విధంగా ఆ పాత్రను మలచగలిగాడు. వాల్మీకి రాముడు ఆదర్శ పురుషుడు. అయితే సీత విషయంలో ఆ ఆధ్యాత్మిక రహస్యాలను ఆయన సైతం అంత భద్రంగా దాచలేకపోయాడు. ఆయన ఆమె పరాశక్తి అన్న విషయాన్ని ఎంత రహస్యంగా, గోప్యంగా ఉంచాలని చూసినా సీత యొక్క అలౌకిక శక్తిమత్వాన్ని పట్టి ఇచ్చే సందర్భాలు కోకొల్లలు కనిపిస్తాయి వాల్మీకి రామాయణంలో. అందుకే రామకథ కాస్తా, సీత యొక్క "మహచ్చరితమ్" అయింది. (1)

అయితే అధ్యాత్మ రామాయణ బాటననుసరించి వచ్చిన రామాయణాలలో ప్రత్యేకించి ఈ ఆధ్యాత్మిక సంపదను శోభను ఆవిష్కరించిన రచనలు లెక్కకుమించి వచ్చాయి. వీటన్నిటికీ తలమానికమనదగ్గ విశ్వనాథ సత్యనారాయణ గారి రామాయణ కల్పవృక్షం, సీతనుద్దేశించి మహర్షి పలికిన ఈ విశేషణాలన్నింటినీ సిద్ధాంతంలాగా కాకుండ, కావ్యరీతిలో వివరించి, సీత అమోఘమైన దివ్య సౌందర్యాన్ని, ఆమె పరాశక్తి స్వరూపాన్ని అనన్య సామాన్యంగా అత్యంత రమణీయంగా మహోజ్వలంగా వర్ణించింది. ఇటు వాల్మీకి హృదయాన్ననుసరించి మానవరూపంలో మసలే ఆదర్శ స్త్రీగా , అటు అధ్యాత్మ రామాయణాన్నసరించి ఆది పరాశక్తిగా కూడ సీత పాత్ర మలచబడింది కల్పవృక్షంలో. ఆ పరాశక్తి వెలుగు పరుచుకోని అణువు ఈ ప్రపంచంలోనే లేదన్నది ఎంత సత్యమో, ఈ కావ్యంలో కూడ ఆ పరాశక్తి ప్రసక్తి లేని సందర్భం లేదన్నది అంతే సత్యం.

### 3. వాల్మీకి రామాయణంలో సీత:

ముందుగా వాల్మీకి రామాయణంలో సీత గురించి ఒక రెండు మాటలు ----

**"అథ మే కృషతః క్షేత్రం లాంగలాదుత్థితా మయా।**

**క్షేత్రం శోధయతా లబ్ధా నామ్నా సీతేతి విశ్రుత॥"** (2)

అంటూ వాల్మీకి రామాయణంలో జనకుడు తన కూతురు జానకి అయోనిజత్వాన్ని చెప్తాడు రాముడికి కన్యాదానం చేస్తున్నప్పుడు కూడ ఒక మాట అంటాడు-

**"ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ,**
**ప్రతీచ్ఛచైనాం భద్రం తే పాణింగృహ్ణీష్వపాణినా,**
**పతివ్రతా మహాభాగా, ఛాయేవానుగతా సదా"** (3).

జనకాత్మజ గురించి ఆమె తండ్రి అన్న ఈ రెండు మూడు గంభీరమైన మాటలు తప్ప వాచ్యంగా ఆమె గురించిన వివరాలు ఎక్కువ కనపడవు మనకు వాల్మీకి రామాయణంలో. కానీ ఆలోచించి చూస్తే ఇవేమీ సామాన్యమైన మాటలు కావు. మహా భావస్ఫోరకమైన వాక్యాలు. పతివ్రతా, మహాభాగా, సహధర్మచారిణీ వంటి పదాలు అమ్మవారికే అన్వయిస్తాయి. సీత శక్తి స్వరూపిణి. పాతివ్రత్యమంటే ఈశ్వరచైతన్యాన్ని విడవక అంటిపెట్టుకుని ఉండగలశక్తి . అంతేకాక దుష్ట శిక్షణ శిష్టరక్షణ ఈశ్వరలక్షణం కాబట్టి ఆ ధర్మాన్ని తను కూడ పాటించడం . ఇంత అర్థమున్నది రాజర్షి జనకుడు మాట్లాడిన నాలుగు మాటల్లో. అంతేకాదు "దేవమాయేవ నిర్మితా" అంటాడు సీత గురించి వాల్మీకి. ఆమె దేవమాయే కాదు మహావిష్ణుమాయ కూడ . ఆమె ఆయన నిత్యానపాయిని అంటూ వాచ్యం చేసి చిత్రించబడినదీ పరాశక్తి పరమ పవిత్ర రూపం స్వరూపం కల్పవృక్షంలో . ఆ పరాశక్తి రాముణ్ణి ఆవేశించి , తద్వారా ఆమె సాధించిన దుష్టశిక్షణను దర్శించే ప్రయత్నం కూడ ఈ వ్యాసంలో ఒక భాగం.

కల్పవృక్షంలో రాముడు చూసిన సీత: ఇక ఇప్పుడు కల్పవృక్షంలో , రాముడు చూసిన సీత రూపం గురించి ఒక రెండు మాటలు -

**"ఇదమిత్థమని నిర్ణయింపగారాని దేకోర్కియో రూపు గైకొన్నయట్లు**
**జన్మజన్మాంతర సంగతమ్మైన యాశాబలంబవధికి సాగినట్లు**
**ప్రాణముల్ బయటికివచ్చి ముగ్ధాకారమొనయించి దర్శనమిచ్చినట్లు**
**తన సృష్టిలోని యుత్తమభావమానందముగ పొంగి బింబమై పొడిచినట్లు;**

**లలయరుంధతియును నహల్యయును గోస**
**లాత్మజాతయు ముప్వురి యాననముల**
**కన్నను పవిత్రమగుచు శృంగార భావ**
**మొడిసిపట్టిన ముఖచంద్రుడొకడు తోచె** ".(4)

ప్రప్రథమంగా సీతను చూసిన రాముడికి ఆమె ముఖంలో అరుంధతి అహల్య తన తల్లి కౌసల్య, ఈ ముగ్గురి కంటె పవిత్రమైన మూర్తి, శృంగార భావాన్ని మించిన, భావం కనపడిందట. అంత పవిత్రత , ప్రసన్నత ఆ ముఖచంద్రంలో. వయసులో ఉన్న స్త్రీ పట్ల పురుషుడు శృంగార భావాన్ని అధిగమించి మాతృమూర్తి పట్ల కలిగి ఉండే భావన కలిగి అంత పవిత్రతను చూడగలగడం, అందానికంటే పవిత్రతకు పెద్ద పెద్ద పీట వేయడం రాముడిలో మాత్రమే చూడగలం. అట్లాగే అందాన్ని మించిన పవిత్రతకు అద్దం పట్టిన సీత వంటి వారు కూడ అరుదే. అందుకే ఆమె ముఖంలో చంద్రుడు తొంగి చూడడం.

## 4. పరాశక్తి సీత:

వశిష్ఠుడికైతే సీత సాక్షాత్తు విద్యా అధిష్ఠానదేవత, పరాశక్తి. ఒక పక్క జనకుడి వంశీయులకు వివాహసమయంలో ఇక్ష్వాకువంశ క్రమం చెప్పమని దశరథుడు అడిగితే, వశిష్ఠుడు, సీతతో మొదలుపెట్టి చెప్పడం ఒక మహా చమత్కారం . మనకు మహదానంద కారకం. ఆ పద్యం-

**"మిథిలా శృంగాటకములఁ బృథులంబగు విషయమట్లు వినఁబడియెడు**
**శ్రీ మధురాకృతి సీత ధరకు**
**మధుసూనురాణి వచ్చి మన్నించినటుల్**
**మధురాకృతి మా రాముడు**
**మధుసూదనుడౌనొ కాదొ మధుసూదను నం**
**శధురాఖ్యాతుని భార్గవు**
**నధరీకృతతేజుఁ జేయుటది యద్భుతమే** ". (5)

భార్గవరాముడు తన విష్ణుతేజాన్ని రాముడికి ఇచ్చి , రాముడికి సంపూర్ణత్వాన్ని ఇవ్వవలసి వచ్చిందేమో గానీ, సీతకా అవసరమేలేదు. ఆమె ముమ్మూర్తులా ఆ అమ్మలగన్న అమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, మధురాంబ. ఆ మాటే కవి పై పద్యంలో చెప్పినా మరొకసారిసీతా మహాశక్తిమత్వాన్ని ఇంకా విపులంగా వివరిస్తున్నాడు (6).

రథమెక్కి సీత అడవికి వెళ్తున్న దృశ్యాన్ని చిత్రీకరించిన ఈ పద్యాలు, మనం అంత సులభంగా దాటెయ్యలేని పద్యాలు. దుష్టశిక్షణకై బయలుదేరిన పరాశక్తికి సేవచేస్తూ నారాయణుడు, ఆదిశేషువు వెంట వెళ్తున్నట్లు వర్ణించారని పలువురు విద్వజ్జనులు ఈ పద్యాలను విశ్లేషించారు. నిజానికి కొన్ని వందల పద్యాలు వెచ్చించి వర్ణించినా ఇంకా మిగిలిపోయేటంత వ్యక్తిత్వగరిమ సీతది. ఆ పరాశక్తి యొక్క అనంత లీలలను అసాధారణమైన ప్రతిభతో అనన్య సామాన్యంగా న భూతో న భవిష్యతి అన్న విధంగా, ఆధ్యాత్మిక అంశానికి, కావ్యసొగసులద్ది, మన తెలుగు కవి, ఆమెను తెలుగువారి ఆరాధ్య దైవంగాగానూ, మనందరం ఆమె మా అమ్మ అని, ముజ్జగాలను సృష్టించి పాలించి లయంచేసే శక్తి అని భావించగలిగేట్లుగానూ ఆవిష్కరించిన అద్భుతమైన సృష్టి, సీత

కల్పవృక్షంలో. అట్లా దర్శింపచేసిన కవి, కవితో పాటు చదువరులం మనం కూడ , చేసుకున్న పురాకృత సుకృతం అనడంలో ఏమాత్రం అతిశయం లేదు. ఆ చిచ్ఛక్తి రూపాన్ని, సత్యమూ శివమూ సుందరమూ అయిన సచ్చిదానందస్వరూపాన్ని, అమృత స్వరూపిణిని , సీతా రూపంలో దర్శనం చేసుకోగలిగిన హనుమంతుడి మాటల్లో, ఈ రెండు పద్యాల్లో కవి వాచ్యం చేసి చెప్తాడు.

**"మాతృదేవీ సమాజ్ఞాతీర్థ సుస్నాత వినతాతనూజుండు వేల్పుబువ్వ**
**కనుగొన్నయట్లుగా గనుగొంటి జానకీదేవి గవేషణాతీర్థఫలము**
**పరమ యాజ్ఞికులు నిర్భర మహాచ్ఛందోऽవతారంబు గాయత్రి తత్త్వమూర్తిఁ**
**గనుఁగొన్నయట్లుగా గనుగొంటి జానకీదేవి శ్రీరఘురామ ధీపదంబు**
**కవిమహర్షి తపోऽగ్నిచే గ్రాగి గ్రాగి**
**సర్వ తేజః ఫలంబు రసంబు తుదకు**
**జూచినట్లుగ జూచితి క్షోణిజాతఁ**
**జారితార్థ్యంబు జన్మకు సంఘటింప** "; (7)

## 5. మహామాయ-సీత:

సీత మహామాయ అన్న సత్యాన్ని వాచ్యం చేయకుండా వ్యంజింపచేస్తున్న పద్యాలు తక్కువేం లేవు ఈ కల్పవృక్షంలో. ఉదా: లంక నుండి అయోధ్యకు తిరిగివస్తున్న సీత ఒక్కతే తమ ఆ పాత పర్ణశాలలోకి వెళ్ళి తిరిగి వస్తున్న సందర్భంలోది: -

**"లోనికి జన్న పృథ్విజ విలోకనలోకజయప్రగల్భప్ర జ్ఞానిధి,**
**సింహయాన, వికసన్నవ లోచన పుండరీక,**
**రక్షోనివసంబునం దగడు సొచ్చిన శీర్ణతనూప్రబంధసం**
**ధ్యానవవహ్నికా విరచితాకృతి, యాకృతిమత్ప్రతిజ్ఞయున్** ";

**వెలికిని వచ్చు జానకియు పిన్నవయస్సుది, మందయాన, మం**
**జులతరమూర్తి యై యడవిఁజొచ్చిన యంతిపురంబు కన్య, దే**
**హలలిత సౌకుమార్య పరమావధి, రాఘవబాహులగ్న, య**
**ల్లలనయి వీచుగాలిఁ గదలాడెడు క్రొంజివురాకు బోడియున్** ".

నా రాముడు అన్న తన గ్రంథంలో సీత రాముడితో తనమ పెళ్ళికి పూర్వమే విశ్వామిత్ర యాగ సంరక్షణ సమయంలోనే, మారీచుణ్ణి బంగారులేడిగా రప్పించడానికై, రామబాణం చేత చంపబడనీయకుండా దూరంగా విసిరి వేయించింది అని చెప్పడం చూస్తాం-( నా రాముడు- 30).

"మరికొన్ని ఏండ్లకు మాయలేడి కాబోవు మారీచునిట్లు చేయుట శ్రీరామునికి తన పని కాదు. బ్రాహ్మణ కర్మలకు విరోధియైన రావణుని చంపుటయే తన పని. మహా విష్ణువు దైత్యులను వేయివిధముల చంపును. తాను ప్రతిజ్ఞ బూనినాడు సరే. రావణుడు సీతనెత్తికొని పోవలయును. తాను సముద్రమును దాటవలయును. రావణుని

సకుటుంబముగా నాశనము చేయవలయును. ఇది అంతయు సీత పని. ఎట్లు కనిపించుచున్నదనగా సీత శక్తి రామునికన్న గొప్పది. ఆమెకు రాముడు లొంగి ఈ పనిని చేయుచున్నట్లు కనిపించుచున్నది. సీత మహాశక్తి. ఆ శక్తి యావేశించిన కాని విష్ణువు విష్ణువు కాడు". ఇంక ఇంత కంటే స్పష్టమైన ప్రకటన అవసరమా! కల్పవృక్షంలో సీత స్వయంగా రాముడితో తన నోటితో తనే చెప్తుంది-

**"ఆడది యింత సేయుననుటన్నది యున్నదెయంచు నన్ను మా**
**టాడితి, క్రైక కోరిక మహా ప్రభు! నీ వని రాకలేదు, నీ**
**యాడది సీత కోరక మహాసురసంహరణంబు లేద, యా**
**యాడది లేక లేద జగమంచు, నిదంతయు నేన చేసితిన్."**(9)

అధ్యాత్మ రామాయణంలో దాదాపు ఒక ఇరవై శ్లోకాల్లో (మొదటి సర్గ. 32 - 52వరకు) ప్రారంభంలోనే రాముడి సూచన మేరకు హనుమంతుడితో తన యథార్థ స్వరూపాన్ని, పరాశక్తిమత్వాన్ని రామబ్రహ్మ తత్వాన్ని తెలియపరుస్తుంది సీత. బహుశా ఆ భావాలే ఈ పద్యానికి ఆధారం, స్ఫూర్తి , బలం అయుండవచ్చు.

## 6. సీత యొక్క అసాధారణమైన భర్తృ ప్రేమ:

వనవాసంలో రాముణ్ణి జాగ్రత్తగా చూసుకోమని చెప్పిన కౌసల్యతో అంటుంది సీత-

**"నీకొడుకు సాలభుజంబు నేను లతను**
**నీకొడుకు హొన్నవీణియ నేను తీగ**
**నీకొడుకు వార్షుకాభ్రంబు నేను మెరుపు**
**నీకొడుకు సూర్య దేవుండు నేను వెలుగు;**

**అతడు కులాలుడు మెత్తని**
**క్షితిమృత్తును నే,నతండు చివురాకు సమా**
**హితనైగనిగ్యమును నే,**
**నతండు దైవంబు భక్తురాలను నేనున్;**

**పతియు జలంబు నేనును ప్రవాహము, రాఘవుడాకసంబు నే**
**నత మృదుగీతి, నింద్రుడగు నాయన నేను హవిస్సు, నాతడున్**
**శ్రుతియు స్వరంబు నేను, రఘుశూరుడు తారసమూర్తి స్థాయినే,**
**నతనికి నాకునైన యవినాస్థితి దుస్థితి పొందదెప్పుడున్. ;**

**ఈ శరీరమ్ములురలి మే మెప్పుడైన**
**నొక్క ద్రవ్యమ్ముగా నగుటున్న దేమొ**
**యా మహాస్థితి నర్థించి యంబ! నీవు**
**పంపవే సాదుదీవన పాట పాడి".**

భార్యాభర్తల మధ్య ఉండవలసిన ఈ అలౌకిక ప్రేమ తత్వం ఈ అద్వితీయమైన అనురాగం, ఈ అద్వైత బంధం వలన సుసంపన్నమయిన కుటుంబం, ఈ సుసంపన్న కుటుంబం వలన ఏర్పడే సుస్థిరమైన నిర్భయమైన సమాజం గురించి కదా అందరూ కలలు కనేది, సతతం కాంక్షించేది . సవ్యమైన గార్హస్త్య జీవితం అన్ని ఆశ్రమాలకు ఆధారం. ఆ సుస్థిరమైన గార్హస్త్యజీవితవిధానం తుచ తప్పకుండా పాటించడం ఈనాటి అవసరం. ప్రస్తుత సమాజంలోని ఎన్నో రుగ్మతలకు అదే సరైనమందు. (ఇవే మాటలను సీత మళ్ళీ రావణాసురుడితో కూడ చెప్పడంతో గార్హస్త్య ధర్మం యొక్క ప్రాముఖ్యత, వివాహబంధం పట్ల తనకు ఉన్న గౌరవం, తమ భార్యాభర్తల ఇరువురి అలౌకిక అనుబంధం గురించి నొక్కి వక్కాణించినట్లయింది.

తన తపస్సు ఇవ్వచూపి **"నీ పాతివ్రత్యం మహా గొప్పది"** అంటూ ప్రశంస చేసిన అనసూయకు, సీత ఇచ్చిన సవినయ విన్నపం ఈతరం పిల్లల ఎన్నో మానసిక శారీరక బలహీనతలకు సమాధానమని ఎంచి ఆ ముచ్చట గురించి ఓ రెండుమాటలు--

"సీతా, నువ్వు ఇంత చిన్న తనంలోనే పాటిస్తున్న ధర్మం చూస్తుంటే మహా ముచ్చటగా ఉంది తల్లీ, నువ్విట్లా ఎంత అని కష్టపడతావు, నా తపస్సులో కొంత నీకు ఇస్తాను, ఆ పుణ్యఫలంతో, ఈ ఇక్కట్ల అడవిలో నువ్వు నిర్భయంగా నిరాటంకమైన జీవితం గడపగలవు" అంటూ గడ్డం పట్టుకు బతిమాలిన అనసూయ కోరికను సీత సునాయాసంగా తోసిపుచ్చి మహా అనునయంగా వద్దని చెప్పి తప్పించుకుంటుంది. "నా తపస్సు నన్ను చేసుకోనివ్వు, బిడ్డను నన్ను పాడు చేసెడు కడంకను చూపకు", నీ దయాగుణం నాపై ఉంటే చాలు అంటూ. బహుశా లంచానికి సీత లొంగుతుందేమోనని పరీక్ష పెట్టిందేమో అనసూయ మాత. సీత నెగ్గదా ఆ పరీక్ష, ఆమెకు అదొక లెక్కనా, తను ముందు ముందు ఎదుర్కోబోయే వాటి ముందు! ఈ కష్ట సమయంలో ఇటువంటి సహాయానికి లోభపడకుండా సీత ప్రకటించిన మనోధార్ఢ్యం, గట్టి పట్టుదల కదా కావలసింది ఈనాటి పిల్లలకు కూడ. ఏమాత్రం ఒడిదుడుకులకు ఓర్చుకోని, కొంచెం కష్టం వస్తే చాలు చేతులెత్తేసి సహాయం కోసం ఎదురుచూసే ఈ కాలపు యువతరం బలహీనత ఎంత నిర్వీర్యం చేస్తోంది ఇప్పటితరాన్ని. అటువంటి వారిని ఉత్తేజపరిచి వాళ్ళల్లో ఉత్సాహాన్ని బలాన్ని నింపగల సంఘటనలివి.

అలాగే, పొగడ్తలు కూడా. పొగడ్తలకు పొంగని వ్యక్తిత్వం మనం అరుదుగా చూసే విషయం. ఆ వ్యక్తిత్వం కలిగిన సీత విషయకంగా ఓ రెండు మాటలు--

రాజభోగాలన్నీ వదులుకుని పతిని అనుసరించి అడవికి వచ్చిన తన పతిభక్తిని మెచ్చుకున్న అనసూయ మాతతో, ఆ గొప్పతనం తనది కాదనీ ఆమె తనకిచ్చిన మెప్పులు రాముడికే చెందాలని, ఎందుకంటే తనకు తన భర్త పట్ల గౌరవం, ప్రేమ, అనురాగం, భక్తి కలగడానికి కారణం ఆయన సంపూర్ణత్వమేనని, ఆయన రాశీభూతమైన సద్గుణాలకాలవాలమనీ, తనదంతా ఆయన తనపై చూపిన భావాల ప్రతిఫలనమేననీ అంటుంది. ఆ పద్యం-

**"రఘుస్వామి శౌర్యమేమందుఁ దల్లి! / యామహాస్వామి సంపూర్ణుడతని యందు**

**నను పతివ్రత యగుట గుణంబుగాదు / సద్వ్రతయ కాకపోవు టసంభవంబు.**"(10)

ఎంత మంది ఇట్లా నిజాయితీగా ఒప్పుకోగలరు? ఎంత వినమ్రత కదా సీతది! అనవసర పొగడ్తలకు పొంగని, గొప్పతనం ఆపాదించుకోవడం నచ్చని వ్యక్తిత్వం కలిగిఉండడం లోకంలో మహా అరుదు. ఇప్పటికీ ఆదర్శ మహిళగా మనం చెప్పుకుంటున్న సీత- భార్యగా సీత యొక్క మొక్కవోని ధైర్యం, ఆత్మవిశ్వాసం గురించిన అవగాహన అవసరమని, ఇప్పటి ఎన్నో సమస్యలకు పరిష్కారమనీ, తలచి, ఓ రెండు మాటలు- తమ భార్యాభర్తల అవినాభావ సంబంధంపై సీతకెంత నమ్మకమన్న విషయం, స్వయంగా రావణుడితో ఆమె అన్న ఈ ప్రకటనం తెలియపరుస్తోంది-

**"పతియ జలంబు నేనును ప్రవాహము, రాఘవుడాకసంబు నే**
**నత మృదుగీతి, నింద్రుడగు నాయన నేను హవిస్సు, వేదసం**
**తతి యతడే స్వరంబు వసుధాపతి తా రసమూర్తి స్థాయి నే**
**నతనికి నాకునైన యవినాస్థితి దుస్థితి పొందదెప్పుడున్**".

అధముడు అయిన రావణుడు తప్ప, ఏ మాత్రం సిగ్గు అభిమానం ఉన్న మగవాడెవడూ ఇట్లా మొహంమీద కొట్టినవిధంగా చెప్పించుకుని కూడ పరస్త్రీ వ్యామోహితుడవడు. మాయమాటలు చెప్పి, మాట వినకపోతే తనని చంపి తింటామని చెప్పి భయపిస్తున్న రాక్షస స్త్రీలతో, ప్రలయం ముంచుకొచ్చినా, ఏడు సముద్రాలు ఇంకిపోయినా, సూర్యుడు మాడి మసిబొగ్గుగా మిగిలినా, రాముడే తనకు భర్త తప్ప మరెవరూ కాలేరు, మమ్మల్ని ఎవరూ విడదీయలేరు అంటూ తన నమ్మకం, ధైర్యం ,ఆత్మ విశ్వాసం ప్రకటిస్తుంది.(11)

## 7. ముగింపు:

రావణసంహారం జరిగాక సీతను చూసిన విభీషణుడి తన ఒక్క సంబోధనలో సీతా పాతివ్రత్య మహిమను కొనియాడతాడు. ఆమె "త్రిలోకీ పాతివ్రత్య శిఖా దీపాకృతి" అంటూ. సీతాయాః చరితం మహత్ అన్న మహర్షి మాటను అక్షర సత్యం చేస్తూ ఆ దేవి ప్రాభవమంతా కావ్యం పరిధులు దాటి ప్రకటనం చేయబడినా, యుద్ధ కాండ, ఉపసంహరణ ఖండంలో, ఇంకా తారాస్థాయికి చేరిన ఆమె మహిమ వర్ణనతో ఈ అంశానికి, విషయ విస్తరభయం వలన ముగింపు ఇవ్వడం అవసరం- హనుమ చూసిన సీత, "త్రిజగత్ శిరస్థిత మణి ప్రవికల్పిత దీపికాకృతి" అట! అంత దీనస్థితిలోను, మాసిన బట్టలతో, దువ్వెనతో దువ్వక గోళ్ళతో తీసిన పాపిడి గల దూముడితో (12), కూడ ఆమె మూడు లోకాలనూ తన తలపై నిలిపిన రత్నదీపంలా భాసించిందట. "చిదగ్నికుండసంభూతా దేవకార్య సముద్యతా" అన్న లలితానామాలకు అర్థం కల్పవృక్షంలోని సీత. మధురమైన కావ్యఫలాలతో పాటు మోక్షఫలాలను కూడ అందించిన కల్పవృక్షాన్ని పెంచిన ఋషి వంటి విశ్వనాథకు ఎన్నిజోతలూ సరిపోవని తలుస్తూ కొలుస్తూ స్వస్తి.

## 8. పాదసూచికలు:

1. "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాః చరితం మహత్....", వాల్మీకి రామాయణం, బాలకాండ 3. 7
2. వాల్మీకి రామాయణం. బాలకాండ. 13.
3. వాల్మీకి రామాయణం. బాలకాండ. 26-27, 73.
4. రామాయణ కల్పవృక్షం. బాలకాండ. ధనుఃఖండం. 298-299
5. రామాయణ కల్పవృక్షం. కల్యాణఖండం, 5-6
6. రామాయణ కల్పవృక్షం. అయోధ్య. ప్రస్థాన ఖండం, 278-279
7. రామాయణ కల్పవృక్షం. సుందరకాండ. ఉషఃఖండం, 51-52
8. రామాయణ కల్పవృక్షం యుద్ధకాండ. ఉపసంహరణ. 270 - 271
9. రామాయణ కల్పవృక్షం యుద్ధకాండ. ఉపసంహరణ ఖండం, 155.
10. రామాయణ కల్పవృక్షం అయోధ్య. అనసూయ ఖండం, 158.
11. రామాయణ కల్పవృక్షం సుందర కాండ పరరాత్రఖండం, 307.
12. రామాయణ కల్పవృక్షం యుద్ధ కాండ. ఉపసంహరణ, 89.

## 9. ఉపయుక్తగ్రంథసూచి:

**తెలుగు:**

1. ఇందిర, గుమ్మలూరి. కల్పవృక్షంలో కాంతామణులు- Reem publications. 2021
2. మందేశ్వరరావు, వడలి. ఇది కల్పవృక్షం. అజో-విభో ప్రచురణలు.2000
3. వాల్మీకి రామాయణం. గీతా ప్రెస్, గోరఖ్ పూర్ - 2023
4. వ్యాసమహర్షి. అధ్యాత్మ రామాయణం, గీతా ప్రెస్, గోరఖ్ పూర్ -2010
5. సత్యనారాయణ విశ్వనాథ - రామాయణ కల్పవృక్షం. విశ్వనాథ పబ్లికేషన్స్ - 2015
6. శ్రీనివాసరావు యల్లంరాజు - రామాయణ రామణీయకము- 1998

English:

1. Ramadevi Suraparaju Dharma in Action- Valmiki 's vision -Sanskrit Academy publication-2023
2. Srinivasa shastri. Lectures on Ramayana - 1949

***



AUCHITHYAM

ISSN: 2583-4797

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_09.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 9. జనప్రియరామాయణం: 'తార 'పాత్రచిత్రణ

**డా. పైడిపాటి ఉమానాథశర్మ**

ప్రొఫెసర్, డిపార్ట్మెంట్ ఆఫ్ ఆర్ట్స్,

కె.యల్. విశ్వవిద్యాలయం,

వడ్డేశ్వరం, ఆంధ్రప్రదేశ్.

సెల్: +91 9491109984. Email: umanadha@kluniversity.in

**వ్యాసంగ్రహం:**

*రాముడు ఈ సమస్త లోకానికీ ఆదర్శ పురుషుడు. రామాయణం సకల జనుల ప్రవర్తనా విధానాన్ని, కుటుంబ అనుబంధాలను, మానవ సంబంధాలను సీతారాముల కథ ద్వారా ఈ లోకానికి తెలియచెప్పిన జ్ఞాన భాండం. సంస్కృత భాషలో ఆదికవి, మహర్షి వాల్మీకి రాసిన శ్రీమద్రామాయణం తెలుగులో అనేక ప్రక్రియలలో అంటే పద్య, గద్య, వచన, నాటక, పురాణ,వ్యాస,సంగీత,గేయ మొదలైన అనేక ప్రక్రియలలో అనేకులు వారి,వారి అనుభూతులకు అక్షరరూపాన్ని ఇచ్చి భక్తినీ,కవితా పాటవాన్ని ప్రదర్శించారు. తెలుగులో వెలువడిన అనేక రామాయణాలలో సరస్వతీపుత్ర బిరుదాంకితుడైన శ్రీమాన్ పుటపర్తి నారాయణాచార్యులు గేయ ప్రక్రియలో వ్రాసిన రామాయణం "జనప్రియ రామాయణం" విశేషయశస్సుని గడించింది. ప్రబంధకవులలో సంగీత, సాహిత్య దురంధరుడిగా ప్రసిద్ధి బడసిన రామారాజ భూషణుడివలె శ్రీమాన్ పుట్టపర్తివారుకూడా వాగ్గేయకారులే. బహుశా అందువలననే ఏమో వారు రామయణాన్ని గానయోగ్యమైన గేయఫణితిలో రచింప ఉత్సహించారు. ఇందులో కేవలం బాలకాండ,కిష్కింధ కాండలు మాత్రమే ప్రచురింపబడ్డయి.ఈ రెంటిలో "బాలకాండకు" కేంద్ర సాహిత్య అకాడెమి వారి బహుమతి లభించింది. శ్రీమాన్ అయ్యవారు ప్రాచీన నవీనకవితాయుగాల సారధి. శృంగారరచనాసింధువు. భక్తికవితాబంధువు. పదకవితాపారిజాతము. అనువాద రచనా సేతువు. నిరంతర అధ్యయన ,అధ్యాపన శీలురు. దేవుడొక్కడేకాదు.మానవత గల మనిషి కూడా నాకు కావాలని అభిలషించిన మహా మనీషి శ్రీమాన్ పుట్టపర్తి. జనప్రియ రామాయణ కావ్యాన్ని గురించి, కవిగురించి, అందు కిష్కింధకాండలో "తార" పాత్రను కవి ఎంత మహోన్నతంగా తీర్చిదిద్దినారో వివరించటం, విశ్లేషించటమే ఈ పరిశోధనా పత్రం ప్రధాన ఉద్దేశ్యం. వాఙ్మయ లేక విశ్లేషణాత్మక పద్ధతి ద్వారానే ఈ పరిశోధనా వ్యాసరచన సాగింది.*

**Keywords:** శ్రీమద్రామాయణము, జనప్రియరామాయణం, శ్రీమద్రామాయణకల్పవృక్షం, తారాధిపుముఖి, రంగనాథరామాయణం.

## 1. ఉపోద్ఘాతం:

ఈ పవిత్రభరతావనిలో ఎందరెందరో విద్యావంతులు, కవులు, పండితులు, మహోపన్యాసకులు, సంగీత-విద్వాంసులు, నాట్యాచార్యులు, బహిభాషాకోవిదులు.. ఇలా ప్రతిరంగంలో ఒక్కొక్కరిది ఒక్కొక్క ప్రత్యేకమైన

విలక్షణత మనకు సాధారణంగా గోచరిస్తుంది. కానీ ఇన్ని విశిష్టాంశాలు, విలక్షణ వైఖరులు, ప్రత్యేకతలుఒకే వ్యక్తిలో రాశీభూతమై ప్రకాశించటం అనన్య సామాన్యం. అపురూప దర్శనం. ఆ అసాధారణ విజ్ఞానమూర్తియే "సరస్వతిపుత్ర" శ్రీమాన్ పుట్టపర్తి నారాయణచార్య. 14 భాషలలో పదునైన ప్రవేశ ప్రావీణ్యాలను సంతరించుకుని, 8 భాషలలో ఆశుకవితామృతాన్ని దండిగా పారించిన కవితాభగీరథుడు శ్రీమాన్ పుట్టపర్తి. అనంతపురం జిల్లా, చియ్యేడు గ్రామంలో 28-03-1914న శ్రీమాన్ శ్రీనివాసాచార్యులు, లక్ష్మమ్మ దంపతులకు జన్మించిన ఈ కారణ జన్ముడు శివకేశవ అభేదంగా కావ్యరచన సాగించిన "శివాశివచరణచారణ చక్రవర్తి" వీరు.. శివతాండవ కావ్యంలో ఆ సకల శుభంకరుని ఆనంద తాండవ వైభవాన్ని, జనప్రియ రామాయణ కావ్యంలో ఆ అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుని లీలా వైభవాన్ని సమంగా దర్శించి వర్ణించగలిగారు.అరవిందుల వారి శిష్యులు.ఎరుకల భాషకు లిపి కొనుక్కున్న భాషా శాస్త్రవేత్త. "పెనుగొండ లక్ష్మి" కావ్యంతో ప్రారంభమైన వీరి కవితా స్రవంతి బహుముఖంగా సాగింది. హృషీకేశ్ శ్రీశివానంద సరస్వతీస్వామీజీవారిచే "సరస్వతీపుత్ర" బిరుదమునందుకున్నారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలం, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయాలు వీరిని గౌరవ డాక్టరేట్లతో సత్కరించాయి. 1974లో వీరిని భారత్ ప్రభుత్వం "పద్మశ్రీ" బిరుదుతో సత్కరించినది.

వారి, వారి అనుభూతుల మేరకు మహాకవులైన వారు సకల భాషలలోను రామాయణ రచన సాగించారు. తెలుగులో కూడా గోనబుద్ధారెడ్డి మొదలుకుని,త్యాగరాజస్వామి,విశ్వనాథ మొదలైన వారు ఎందరో తెలుగులో రామాయణ రచన సాగించారు. తెలుగులో శ్రీ సూరంపూడి రాధాకృష్ణమూర్తి--శ్రీ వంగివరపు వంకట రంగాచారియర్ శ్రీ పంతుల లక్ష్మీనారాయణరావు మొదలగు అనేకమంది గానయోగ్యంగా, గేయరూపంలో శ్రీమద్రామాయణాన్ని మనముందుంచారు. సంస్కృతభాషలో ఆదికవి వాల్మీకిరామాయణం, వ్రజ భాషలోని తులసీ రామాయణాలను పరిశీలించి, ఆధునిక కవులెవ్వరూ దాదాపు అంటని చతుష్పద,షట్పదులను స్వీకరించి లయ ప్రధానంగా గాన యోగ్యమైన రీతిలో కిష్కింధ, బాలకాండలను "జనప్రియ రామాయణం" అనే పేరుతో రచించిన వాగ్గేయకారుడు పుట్టపర్తి.

## 2. జనప్రియరామాయణం- వైశిష్ట్యం:

ఆచార్యుల వారి బాలకాండలో శ్రీరాముడు సాక్షాత్ శ్రీమన్నారాయణుడే. వీరి రామాయణం చదివే పాఠకులకు స్వామి భగవంతునివలె అనుక్షణం దర్శనమిస్తడు. వాల్మీకిరామాయణంలో చెప్పబడినట్లు శ్రీరాముడు కేవల నరస్వరూపము కాదు. రామకథారచయితలైన వాల్మీకి, తులసీదాస్, కంబన్ మొదలగువారిని కావ్యారంభంలోనే కవి స్మరించిన తీరు స్మరణీయము. రామాయణంలో ప్రతీపాత్ర సార్వకాలికసందేశాన్నిస్తుంది. అటువంటి పాత్రల్లో మంత్రినిగా, ఇల్లాలిగా తారపాత్రను నారాయణాచార్యులు తీర్చిదిద్దిన విధానము చాల గొప్పది.

## 3. కరణేషు మంత్రీ :

యుద్ధానికి రమ్మంటూ సుగ్రీవుడు చేసిన గర్జన విన్న వాలి యుద్ధానికి బయలుదేరతాడు.అట్టి వాలిని వారిస్తూ ఆయన భార్య తార పాత్ర ప్రధానంగా రామాయణంలో ప్రవేశిస్తుంది. కిష్కింధకాండలో తార పాత్ర పోషణలో రచయిత చూపిన ప్రతిభ అనన్య సామాన్యం. శ్రీరామ లక్షణులతో సుగ్రీవునకు హనుమ దారా మైత్రి ఏర్పడుతుంది. అటు తదుపరి తన అన్నగారైన వాలిని సుగ్రీవుడు రెండవసారి యుద్ధానికి రమ్మని సవాలు చేస్తాడు. ఎలాగైన తమ్ముడి అహంకారాన్ని అణచాలని వాలి నిర్ణయించుకుంటాడు. భార్య తార అది గమనిస్తుంది. ఎంతో గొప్పగా ఆలోచిస్తుంది. "సుగ్రీవుడిని యువరాజుగా చేసి, భ్రాతృ ద్వేషాన్ని విడిచిపెట్టవలసినదిగా హితోపదేశము చేస్తుంది. ఒక రాజకీయ చాతురి, మంత్రాంగం నడపగలిగిన నారీరత్నంగా శ్రీమాన్ అయ్యవారు "తార" పాత్రను మలిచారు.

**"అన్నదమ్ములకు అగ్గి రగిల్చిన -కాకుత్సుని చెలికారము గోరుము**

**బలవంతులతో బగలంటిన రాజ్యమ్ములు బ్రదుకులు దక్కెడునే?**3

అని మహా పరాక్రమవంతులైన రామలక్ష్మణుల సహాయసహకారములు ఆ సుగ్రీవుడికి దండిగా వున్నయని, ఆ ధైర్యంతోనే యుద్ధానికి రమ్మని పిలుస్తున్నాడని చెప్పింది. యుద్ధానికి పోవటం మంచిది కాదు. ఆ రాముని స్నేహాన్ని కోరుకో. బలవంతులతో శత్రుత్వం వలన రాజ్యాలు జీవితాలు నాశనం అవుతాయని హెచ్చరించిన రాజకీయ చాతురి, వ్యక్తిత్వం కలిగిన పాత్రగా "తార"పాత్రను చిత్రిస్తాడు కవి.

గోనబుద్ధారెడ్డి వ్రాసిన రంగనాథ రామాయణంలో కూడా తార శ్రీరామునితో యుద్ధం నీ వల్ల కాదని వాలిని హెచ్చరిస్తుంది. నేను మన కుమారుడైన అంగదుడి ద్వారా ఒక మాట విన్నాను. అపహరణకు గురైన భార్యను అన్వేషిస్తూ శ్రీరామ లక్ష్మణులు ఇక్కడికి వచ్చి, సుగ్రీవునితో మైత్రి చేస్తూ నిన్ను చంపుతానని మాటిచ్చాడు రాముడు అని విన్నాను.

"**పనిగొనిసుగ్రీవుబంటుగానేలి,యని నిను చంపెదనని వచ్చినాడు**

**ఆ రాఘవుడు విష్ణుడంబుజోదరుడు వైరంబుగొని గెల్వ వశము గాదతని** "4

అంటూ సుగ్రీవునికి రాజ్యము ఇచ్చేసి రామునితో సంధి చేసుకో కుదరకపోతే మునివృత్తి చేపట్టి ప్రాణాలు కాపాడుకో అంటుంది తార. తెలుగులో ప్రప్రథమ జ్ఞానపీఠాన్ని సాధించిన శ్రీమద్రామాయణకల్పవృక్షం కావ్యంలో కూడా తారా యుద్ధానికి వెళ్ళద్దని వారిస్తుంది. ఆ కోదండోగ్రునికి ఎదురు నిలవటం నీకు సాధ్యమా అంటూ ఇలా ప్రశ్నిస్తుంది.

**"ఏ దైవంబులు వచ్చి సాయపడగా నేనిప్పుడర్థింతునా**
**నా దైవంబులు మూటగట్టుకుని యైనాడా మహాస్వామి పెం**
**పేదెం బౌరుషమాశ్రయించి చనంగానేమౌను శ్రీ రాఘవుం**
**గోదండోగ్రుని ముందు నిల్చుటకు నీకున్ సాధ్యమా చెప్పుమా**"-5

నిత్యమూ భర్త క్షేమాన్ని కోరే భార్య ప్రతి సందర్భంలోను వాస్తవస్థితిని అనునయంగా సాక్షాత్కరింపజేసే ఒక ఉత్తమ మంత్రి వలే తార భర్తకు అకస్మాత్తుగా సుగ్రీవుడికి ధైర్యం రావటం వెనుక గల శ్రీరామ వైభవాన్ని భర్తకు చెప్పింది.

## 4. భర్తే సర్వస్వం:

దైనందిన జీవితంలో భార్యా భర్తలు ఆయా సందర్భాలలో అనేక కోప, తాప యుక్తమైన మాటలతో కొట్లాడుకున్నా, మాట్లాడుకున్నా ప్రాచీన భారతీయ వైవాహిక వ్యవస్థలో భార్యకు భర్తే దేవుడు. సర్వస్వమూ. భర్తపై ఆగ్రహించాలన్నా, అనుగ్రహించాలన్నా,అభిమానించాలన్నా,ఆదరించాలన్నా ఆ దేవుడిపై ఆ దేవతకే సర్వహక్కులూను. తమసా నది తీరములో క్రౌంచ పక్షిని వ్యాధుడు చంపగా చూసాడు వాల్మీకి. శోకమే శ్లోక రూపాని పొంది శ్రీమద్రామాయణంగా అవతరించించిందికదా!.

**"వియుక్తాపతినా తేనా ద్విజేన సహచారిణా**

**తామ్ర శీర్షేణ మత్తేన పత్రిణా సహితేనవై||**6

ఆ నిషాదుడిచే కొట్టబడి, నేలపై పొర్లుతూ రక్తముతో నిండిన ఆ మగ పక్షిని ఆడ క్రౌంచ పక్షి చూసింది. తనపై ఎంతో ప్రేమ గలిగి,ఎప్పుడూ తనతో తిరుగుతూ అందమైన రెక్కలు,ఎర్రని తలగల,కామముచే మదించిన, భర్తతో వియోగము చెందిన ఆ క్రౌంచి అతి దీనముగా ఏడ్వసాగింది. ఆ సన్నివేశాన్ని గుర్తుకు తెస్తూ శ్రీమాన్ పుట్టపర్తి వారు శ్రీరాముని బాణహతికి బలైపోయిన వాలిని గురించి రోధించినది తార. భార్య ఆశలు,సంతోషాలు,సరాగాలు అన్నీ భర్త వున్నంతవరకే అన్న భారతీయ సనాతన సంప్రదాయం తెలిసిన రచయిత వీరు.
అందువలనే తన భర్త "వాలి" మరణించినపుడు తార దుఃఖాన్ని ఇలా వర్ణిస్తారు..

**"ఈయి!హృదీశ!మహా యూధప యూ-ధప నీ తోనే దలగెను నాయా**
**శలు,సంతోషమ్ములు,నాకిక మిగి-లిన దొకటే!దుఃఖ వ్రతమా!**
**వగపెరుగని నా బ్రతుకికక వైధవ్యనిరూపితమై ,యుపగత సుఖమై**
**కృపణంబై,కడి యెడలిన పూలై,యనాధయై,యిటె నశియించున్||**7

--అంటూ విలపిస్తుంది.భర్త మరణంతో సంతోషం ఆవిరై సహగమనం ఒకటే శరణ్యమని భావించినది.నా గుండె లోహపుగుండె.అలా కాకపోతే నీ మరణ వార్త వినగానే గుండె వెంటనే వెయ్యి ముక్కలు అయిపోయేది.నీకే! హాయిగా వెళ్ళిపోయావు.నాకములో వగకత్తెలు నిను గూడి వస్తారు.నేనే కుంకుమకు నోచుకోని అభాగ్యురాలనైనాను అంటూ ఆవేదన చెందినది.కన్న పిల్లలకన్నా కట్టుకున్న భర్తయే ముఖ్యమనుకుంటుంది భారత నారి. వాల్మీకి కిష్కింధ కాండలో తార చేత ఆ మాటనే చెప్పిస్తాడు.

**"పుత్రేణ మమ కిం కార్యం రాజ్యేవాపి కిమాత్మనా**

**కపిసిమ్హే మహాభాగే తస్మిన్ భర్తరి వశ్యతి--**" 8

వానరశ్రేష్ఠుడు,మహానుభావుడు అయిన నా భర్త మరణించిన పిమ్మట నాకు పుత్రునితో ఏమి ప్రయోజనం? రాజ్యముతో ఏమి ప్రయోజనం? నా ప్రాణాలతో ఏమి ప్రయోజనం?

**"వయసును, రూపము, నయమును గల వగ -కత్తెలు,నిను గూడి గ్రుత్తురు,కౌగిట**

**నాకములో, మరి నా కుంకుమ మీ -నాటికి (దీరినదోయి ప్రభూ!**" 9

వాలికి మాయ కప్పేయటంతో ఆ జగన్నాయకుడిని తెలుసుకోలేకపోయాడు. కానీ శ్రీరాముడి దైవత్వాన్ని తెలుకోకలిగిన బుద్ధికుశల తార.ఆ స్వామి శరణాగతతత్వాన్ని,ఆర్తత్రాణపరాయణత్వాన్ని గ్రహించిన జ్ఞాని కాబట్టే సమరం సరిగాదు అని పదే పదే బ్రతిమాలింది.హెచ్చరించినది. కాని కర్మ వాలిని విననీయలేదు. వాలి నిర్జీవ శరీరంపైబడి ఏడుస్తూ "**రాముడే యముడి రూపంలో కాచుకుని వున్నాడయ్య! ఆతనితో సమరం సరిగాదు అని ఎన్ని చెప్పినా వినకుండా కొంపతగలబెట్టావు"**- అనే తార మాటలను శ్రీ విశ్వనాథ కల్పవృక్షంలో ఇలా వర్ణిస్తారు.

## 5. ధర్మజ్ఞత:

అంత శోకంలోనూ ఆమె ధర్మము గుర్తుకు వచ్చినది. కళ్ళెదుటున్న భర్త నిర్జీవశరీరాంపై బడి,"రుమను చెర బట్టి సుగ్రీవుని అరణ్యములకు పంపి భార్యాభర్తలిరువురిని నువ్వు వేరుచేశావు.ఆ మహాపాప కార్య ఫలమే నా పాలిట్ దుఃఖమై ఓ స్వామీ! నిన్ను నాకు దూరము చేసింది.నా నుదుటి కుంకుమ తుడిచివైచినదని విలపించినది.

**"ఆ రవిజుని భార్యను పట్టితి, నా తని దోలితి సాంద్రారణ్యములకు**

**నా ఫలమే యిటులై నీ చావై నా కుంకుమ తుడిచినదీ...**"- 10

పరాయి భార్యను చెర పడితే కలిగే అధోః గతి మరణమే అంటూ రోదించింది.పరాయి భార్య అయిన సీతను చెరపట్టినందుకు భవిష్యత్తులో రావణుడికీ కూడా ఇదే గతి పడుతుందని చెప్పకనే చెప్పింది తార.

ఇతరుల భార్యను అపహరించినవాడు పాపాత్ముడు,చారిత్ర దూషకుడు అంటాడు వాల్మీకి.

**"యావర్తం వహిపశ్యేయం తవ భార్యాపహారిణం**

**తావత్స జీవేత్ పాపాత్మా వాలీ చారిత్ర దూషకః** "--11

శ్రీరాముని సూచనతో ఆకాశము బద్దలయ్యేటట్లు భయంకరమైన ధ్వని చేశాడు సుగ్రీవుడు.అదివిన్న వాలి కోపోద్రిక్తుడయ్యాడు.నీ మాట అంటేనే భయపడే సుగ్రీవుడు ఇంత నిశ్చలంగా చేసిన గర్జన వింటే అతడి వెనకాల ఎవరో వున్నరనేది అర్థమౌతోంది.ఇక్ష్వాకు వంశీయులైన రామలక్ష్మణుల అండ అతడికి పూర్తిగా లభించింది. నా మాట విని రాముడితో వైరం మంచిది కాదు. అలాగే సుగ్రీవుడిని యౌవరాజ్యపట్టాభిషిక్తుడిని చెయ్యి. తమ్ముడిని మించిన బంధువు వేరొకరు లేరు అంటూ హితవచనాలు పలికిన ధర్మజ్ఞాని తార.

### 6. ఆలోచన, పాలనా దక్షత:

వాలి వరం కారణంగానూ, చేసిన పరదారాపహరణ కారణంగానూ చెట్టు చాటు నుండి శ్రీరాముడు వాలిని సమ్హరించాడు. ప్రాణాలు కోల్పోతూ తమ్ముడైన సుగ్రీవుడిని దగ్గరకు పిలిచి రాజ్యపాలనలో నువ్వు "తార" అభిప్రాయాలను పాటించమంటాడు. అది తార యొక్క రాజనీతిచాతుర్యానికి నిలువెత్తు ఉదాహరణ. రాజ్యపాలనంలో "తార" అభిప్రాయములకు ప్రాధాన్యమివ్వమంటూ స్వయంగా వాలి ఇలా అంటాడు.

ఈ సందర్భంలో ఆదికవి వ్రాసిన శ్రీమద్రామాయణంలో ఇలా వుంది.

**"సుషేణ దుహితా చేయ మర్థసూక్ష్మ వినిశ్చయే –ఔత్పాతికేచ వివిధే సర్వతః పరినిష్ఠితా|| 12**
**యధేషా సాధ్వితిబ్రూయాత్ కార్యం తన్ముక్త సంశయం–వహితారామతం కించిదన్యథా పరివర్తతే||13**

ఈ అంశాన్ని అలతిఅలతి పదాలతో పుట్టపర్తి వారు అనుకరించిన తీరు సులభగ్రాహ్యంగా వుంటుంది.

**"తారాధిపముఖి, తార, సుషేణుని–కొమరిత,సూక్ష్మార్థములను గమనించి**
**నిర్ణయమ్ములు సేయుటలో గడు, మెలకువ గలయది, మదిగలది...**
**ఒక్కటనున్నది, యొక్కటలేదని చెప్పగాదు, తచ్ఛిక్షా దక్షత**
**శకునమ్ములమొదలఖిల విద్యలనుపేరుమోసినది యా తార!**
**తారావచనము దప్పిపోయిందిలేదేనాడిది,సత్యము!"** 14

రాముడి యొక్క మాహత్మ్యము, ధర్మనిరతి, సత్యసంధత అన్నింటికీ మించి ఆ కారణజన్ముడి అశేష పరాక్రమవైభవము తెలిసిన జ్ఞాని తార. యముడే రాముడి రూపంలో వచ్చాడయ్యా!యుద్ధానికి వెళ్ళద్దయా! అంటే వినకుండ సమరానికి సై అని కొంపకు నిప్పుపెట్టావు అంటు విలపిస్తుంది విశ్వనాథ వారి తార.

**"రాముండన్న యముండు కాచికొనె భర్తా!పోకుమయ్యా మహా!**
**క్షామంబైనది ధర్మయుద్ధమునకీ సంగ్రామమాపూర్వ సం**
**గ్రామంబుల్ బలె గాదటంచు పలుకంగా నీవు విన్నావుకా**
**దీ మాద్రిం జనుదెంచి కొంపకును నీ నీ నిప్పు ముట్టింపగన్**"-- 15

సుషేణుని కూతురైన తార విషయములను సూక్ష్మంగా గమనించి,పరిశీలించి నిర్ణయాలు తీసుకోవటంలో నేర్పు గలది. సూక్ష్మ విషయగ్రాహి.. ఆమె సల్లక్షణ లక్షిత. ఆమె రాజ్య తంత్రము అద్భుతము. శకునములు మొదలు అన్నివిద్యలలోను ఆరితేఅసరినది. అసలు ఇప్పటి వరకు ఆమె చెప్పినది. తప్పిపోయిన అంశమంటూ లేదు. ఆమె ఆలోచనలను పాటిస్తే రాజ్యమునకు ఎల్లవేళల శుభమే. అపజయమనేది వుండదు సుగ్రీవా! అంటాడు వాలి. వానరమహా సామ్రాజ్యానికి ఆమె ఆలోచనలు పెట్టని కోటలు.

వాలి సంహారం జరిగిపోయింది. ఇచ్చిన మాట మరచి సుగ్రీవుడు సుఖజీవనంలో నిమగ్నమయ్యాడు. కోపించిన లక్షణుడు రాజప్రాసాదం దగ్గరకువెళ్ళి వింటినారిని ఎక్కుపెట్టాడు. అది విన్న సుగ్రీవుడు భయవిహ్వలుడై ఆతనిని శాంతింపజేయమని తారను ప్రార్థించాడు. అప్పుడు ఆమె నిర్వహించిన రాయబారం. మాట్లాడిన మాటలు,

ప్రసంగించిన తీరు తార యొక్క లౌకిక జ్ఞానాన్ని, ధర్మాధర్మ విచక్షణను చాటిచెప్తాయి. "**కామసుఖంబిలజీవులకు నైజము గాదా! నారీ విరహాకుల రాములకిది తెలియదుటే! మనసు గల మగలకు జెల్లవౌ మగువుల కనువేదురలకు జిక్కని దెవడయ్యా!**"16 అంటూ భార్యకు దూరంగా వున్న శ్రీరామునకు తెలియదా అంటూ ప్రశ్నిస్తుంది. ఆ వెంటనే మరల సుగ్రీవునకు మాత్రం మీరు తప్ప ఇంకెవరు దిక్కయ్యా! అంటూ సహాయాన్ని అర్థిస్తూ, జీవన సత్యాన్ని చెప్తుంది. "**దిక్కెవ్వరు రవిజునకు మీరలు దక్కన్, ఎవరిది శాశ్వతమీ భువి ఋతుపరివర్తనులు జీవుల బ్రతుకుల్**"- అని లక్ష్మణుని కోపాన్ని తగ్గిస్తుంది తార. అప్పుడు తారలో లక్ష్మణునకు తన సోదరైన శాంతాదేవి కనిపించిందంటూ పుట్టపర్తి వారు అద్భుత కల్పన చేస్తారు.

## 7. ముగింపు:

ఈ విధంగా శ్రీమాన్ పుట్టపర్తి వారు తన జనప్రియరామాయణంలో "తార" పాత్రను ఒక అద్భుత ధైర్యవంతురాలిగా,వివేకవంతురాలిగా, ధర్మాధర్మ విచక్షణాజ్ఞానిగా, దూరదృష్టి, కుటుంబవిలువలు గల ఒక మహోత్తమ స్త్రీగా చిత్రించారు. అలాగే సమరానికి వచ్చిన సుగ్రీవుని ధైర్యం వెనుక గల ఆశ్రీరాముని పరాక్రమాన్నీంచనావేయటంలోనూ, చివరలో సీతాన్వేషణసమాయత్త కార్యంలో సుగ్రీవుడు తలమునకలై రాజ్యభారాన్ని తారకు అప్పగించడంలోనూ ఆమె దక్షత మనకు తేటతెల్లమౌతుంది. ధైర్యము, పాలన, దూరాలోచన, పరిస్థితిని అంచనావేయటం, సమస్యను ఎదుర్కోవటం వంటి అనేక విషయాలలో ఈ నాటి నారీలోకానికి తార ఆదర్శము అనటంలో ఎలాంటి సందేహంలేదు. అందువలనే ప్రతిభారతీయుడు స్మరించవలసిన పంచమహా-పతివ్రతలలో చేర్చబడింది. తారకుజోతలు సమర్పించుకుంటూ, ఇంతగొప్పగా ఆ పాత్రను మలచిన కవివరేణ్యులకు వందనములిడుతూ ముగిస్తున్నాను.

"**అహల్యా ద్రౌపదీ సీతా(కుంతీ) తారా మండొదరీ తథా**
**పంచకన్యా స్మరేన్నిత్యం మహా పాతక నాశనం**"

## 8. పాదసూచికలు:

1. జనప్రియ రామాయణం-ఆముఖం-పుట 2
2. జనప్రియ రామాయణం-బాలకాండ -పుట 4
3. జనప్రియ రామాయణం-కిష్కింధకాండ-పుట 250
4. రంగనాథ రామాయణము-కిష్కింధకాండ-పుట 2/439
5. శ్రీమద్రామాయణకల్పవృక్షం-కిష్కింధ-గజపుష్పీ-78
6. శ్రీమద్రామాయణం-బాలకాండ-2-11
7. జనప్రియ రామాయణం-కిష్కింధకాండ-పుట 273
8. శ్రీమద్రామాయణం-కిష్కింధ కాండ-19-18

9. జనప్రియ రామాయణం-కిష్కింధకాండ-పుట 310
10. జనప్రియ రామాయణం-కిష్కింధకాండ-పుట 352
11. శ్రీమద్రామాయణం-కిష్కింధ కాండ-10-33
12. శ్రీమద్రామాయణం-కిష్కింధ కాండ-ద్వావింశసర్గ-13
13. శ్రీమద్రామాయణం-కిష్కింధ కాండ-ద్వావింశసర్గ-14
14. జనప్రియ రామాయణం-కిష్కింధకాండ-పుట 376
15. శ్రీమద్రామాయణకల్పవృక్షం-కిష్కింధ-231
16. జనప్రియ రామాయణం-కిష్కింధకాండ-పుట 410

## 9. ఉపయుక్తగ్రంథసూచి:

1. బుద్ధారెడ్డి, గోన.1949. రంగనాథరామాయణం. రాయలు అండ్ కో, కడప.
2. నారాయణచార్యులు, పుట్టపర్తి. 1938. జనప్రియ రామాయణం. యస్.జె.కె.పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్.
3. వాల్మీకి, 1993. శ్రీమద్రామాయణం-కిష్కింధకాండము. ఆర్షవిజ్ఞానట్రస్టు, హైదరాబాదు.
4. సత్యనారాయణ, విశ్వనాథ. 1992. శ్రీమద్రామాయణకల్పవృక్షం. విశ్వనాథ పబ్లికేషన్స్, విజయవాడ.
5. సిమ్మన్న, వెలమల, 2009. తెలుగు సాహిత్య విమర్శ సిద్ధాంతాలు, దళిత సాహిత్య పీఠం, విశాఖపట్నం.

***



AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_10.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 10. మొల్ల రామాయణ సుందరకాండ: సీతాదేవి పాత్రచిత్రణ

**డా. కోట లక్ష్మీ అన్నపూర్ణ**
నివృత్త తెలుగుశాఖ అధ్యక్షురాలు,
కేశవ్ మెమోరియల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ కామర్స్ అండ్ సైన్సెస్, నారాయణగూడ,
హైదరాబాదు, తెలంగాణ.
సెల్: +91 9493841396. Email: kotalakshmiannapurna@gmail.com

**వ్యాససంగ్రహం:**

*రామాయణం మనకు ధర్మాన్ని బోధించింది. చక్కని కుటుంబ జీవన విధానాన్ని చిత్రించింది. ముఖ్యంగా అన్ని వర్గాల వారికి అన్ని తరాల వారికి మంచి సందేశాన్ని అందించింది. రామాయణాన్ని అవగాహన చేసుకుంటే ఎన్నో ప్రయోజనాలను పొందవచ్చు. ధర్మబద్ధమైన జీవితాన్ని గడపవచ్చు. వ్యక్తిత్వ వికాసాన్ని పొందవచ్చు. ఉదాహరణకు హనుమంతుడు సీతాదేవి దగ్గరకు రాముని నుండి సందేశాన్ని తీసుకుని వచ్చిన సందర్భంలో వీరిద్దరూ సంభాషించుకున్న తీరు వారి వాక్చాతుర్యాన్ని స్పష్టం చేస్తున్నది. సీతాదేవి మాటలలో ఆత్మవిశ్వాసం, దృఢ సంకల్పం, పశ్చాత్తాపం, పరిస్థితులను తట్టుకొని నగలిగే నిబ్బరం మనకు వెల్లడి అవుతున్నాయి. నేటి యువతరం ఈ లక్షణాలను ఆదర్శంగా తీసుకోవాలి. విలువలకు కట్టుబడి ఉండాలన్న సందేశాన్ని కూడా మనం దీని నుండి గ్రహించాలి. ఈ ఉద్దేశంతోనే ఈ వ్యాసాన్ని ఎంచుకోవడం జరిగింది. విశ్లేషణాత్మకపద్ధతిలో ఈ వ్యాసరచన చేయబడింది.*

**Keywords:** మొల్ల రామాయణం, సుందరకాండ, సీతాదేవి, హనుమంతుడు, రాముడు

## 1. ఉపోద్ఘాతం:

రామాయణంలోని ధర్మాలు సార్వజనీనమైనవి. సార్వకాలికమైనవి. పంచ మహా పతివ్రతలలో ఒకరైన సీతాదేవి వ్యక్తిత్వం, పాతివ్రత్యం రామాయణంలో అడుగడుగునా వ్యక్తం అవుతుంది. మొల్ల రామాయణంలోని హనుమత్ సందేశం ఘట్టం ఆధారంగా సీతాదేవి పాత్ర చిత్రణను గమనిస్తే "వజ్రాదపి కఠోరాని మృదూని కుసుమానివ" అని చెప్పినట్లు సీతాదేవి ఎంతటి సున్నితమనస్కురాలో అంతటి ధీరవనిత అనే విషయం స్పష్టమవుతుంది. సీతాదేవి హృదయం అవగతం అవుతుంది. ఇందులో సీతాదేవి పలికిన మాటలు సీతాదేవి

ప్రవర్తన సీత వ్యక్తిత్వానికి వన్నె కూర్చడంతో పాటు విజయాన్ని కూడా సమకూర్చి పెట్టాయి. నేటితరం ముఖ్యంగా యువతరం ఈ ఘట్టం నుండి వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడే అంశాలను ఆదర్శ జీవితాన్ని గడిపేందుకు అవసరమైన అంశాలను అనేకం గ్రహించవచ్చు.

## 2. హనుమత్ సందేశ ఘట్టం- సీతాదేవి పాత్రచిత్రణ :

అశోకవనంలో సీతాదేవి దగ్గరకు రావణుడు వచ్చి పరుషంగా మాట్లాడాడు. అప్పుడు సీతాదేవి-

**పతి దైవముగానెప్పుడు**
**మది తలచుచునుండు నట్టిమగువల జెరుపన్**
**బ్రతినగల యట్టి నీతో**
**బ్రతివచనములాడుట కంటె పాపము గలదె** [1]

అని రావణుడితో చెప్పింది తాను మనసా వాచా కర్మణా శ్రీరామునినే స్మరిస్తున్నానన్న విషయం స్పష్టం చేసింది.అంతే కాకుండా రావణుడికి కాలం సమీపించిందని,

**పరదారాపేక్ష కలవారికి అని ఆయువు నశిస్తుందని, నరకం తప్పదని హెచ్చరించింది.**[2]

సీత జాడను తెలుసుకునే ప్రయత్నంలో హనుమంతుడు లంకా నగరానికి చేరుకున్నాడు. సీతాదేవిని చూశాడు. అదే సమయంలో రావణుడు రావడం సీతాదేవితో కఠినంగా మాట్లాడడం చూసాడు. ఆమెయే సీతాదేవి అని నిర్ధారించుకున్నాడు.

**ఉన్నాడు లెస్స రాఘవు**
**డున్నా డిదె కపులగూడి యురుగతి రానై**
**యున్నాడు నిన్ను గొనిపో**
**నున్నాడిది నిజము నమ్ముముర్వీ తనయా**[3]

అని రాముని కుశల వార్తను ఉన్నాడు అనే మాటతో ప్రారంభించి సీతాదేవిలో ధైర్యాన్ని కలిగించాడు సూక్ష్మ రూపంలో ఉండి హనుమంతుడు చెబుతున్న మాటలు విని సీతాదేవి అది కూడా రాక్షసమాయ ఏమో అనుకున్నది. శ్రీరాముడు సీతాదేవిని వెతికేందుకోసమని అంగదుడు మొదలైన వారు కొందరితో తనను దక్షిణ దిశకు పంపించాడని చెప్పాడు. ఋష్యమూక పర్వతం పైన సీతాదేవి నగలను జారవిడచడం, వాటిని సుగ్రీవాదులు దాచడం రాముడికి చూపించడం రాముడు గుర్తించడం వాలివధ, మొదలైనవన్నీ చెప్పాడు. ఇది సీతాదేవితో ముడిపడి ఉన్న విషయం కాబట్టి సీతాదేవిలో కొంత ఆశ చిగురించింది. సీతాదేవి ఇప్పుడు ఎటువంటి పరిస్థితిలో ఉంది? శ్రీరాముని ఎడబాటుతో కలిగే బాధ ఒకవైపు, తన వారెవరూ లేని చోట, తన చోటు కానిచోట తాను ఉండవలసి రావడం అనే బాధ మరొకవైపు బాధిస్తూ ఉండగా తన సొంత చోటుకు ఎప్పుడు చేరుకుంటానా అని ఎదురుచూపులు చూస్తున్న పరిస్థితిలో ఉంది. సాధారణంగా ఒక్కసారిగా తన కష్టాలన్నీ గట్టెక్కాయి అని సంతోషపడిపోవడం, సామాన్యుల లక్షణం. ఇక్కడ సీత యొక్క విలక్షణమైన వ్యక్తిత్వం మనకు కనిపిస్తుంది.

### 3. సందిగ్ధావస్థలో సీతాదేవి:

సీతాదేవి వెంటనే నమ్మి తొందరపడి పోలేదు. శ్రీరాముడు ఎవరు ఏ రీతిగా ఉంటాడు? ఎలాంటి వాడు?అని ప్రశ్నించింది. దీనికి కారణం ఉంది. ఒకప్పుడు తాను మాయలేడిని చూసిభ్రమ పడడం కపటసన్యాసిగా వచ్చిన రావణుడి విషయంలో మోసపోవడం వంటి సంఘటనలు ఆమెలో సందేహం కలగడానికి కారణమయినాయి. తప్పులు ఎప్పుడూ పునరావృతం కాకూడదు. చేసిన తప్పులు దిద్దుకోవడం చేసిన తప్పులు తిరిగి చేయకపోవడం విజ్ఞుల లక్షణం. ఆ విజ్ఞత మనకు సీతాదేవిలోకనిపిస్తుంది. సీతాదేవి ప్రశ్నకు సమాధానంగా హనుమంతుడు శ్రీరాముని రూపురేఖలను వర్ణిస్తూ **నీలమేఘచ్ఛాయ బోలు దేహమువాడు** అని చెబుతూ **వరుస సౌమిత్రి బంగారువన్నెవాడు**[4] అని వివరంగా చెప్పాడు.

శ్రీరాముడు శుభలక్షణాలు కలిగిన వాడు మాత్రమే కాదు సుగుణాలకు ఆలవాలంగా చూపించదగినవాడు అని సుగుణాలను పేర్కొన్నాడు. హనుమంతుడు తన తల్లిదండ్రులను గురించి చెప్పి నేను సుగ్రీవుని మంత్రిని అని పరిచయం చేసుకున్నాడు. శ్రీరాముడు ఇచ్చిన రత్నపుటుంగరాన్ని సీతాదేవికి ఇచ్చాడు. నేను దూతగా వచ్చాను కాబట్టి ఉట్టి చేతులతో వెళ్లడం సబబు కాదు. తిరిగి నీ నుండి కూడా గుర్తుగా శ్రీరాముడికి చిహ్నాన్ని చూపించాలి కాబట్టి మీ శిరోరత్నాన్ని ఇవ్వమని అడిగాడు. అయినప్పటికీ సీతాదేవి తొందర పడలేదు నా భర్త క్షేమ సమాచారాన్ని నాకు అందించావు బాగుంది కానీ నీ నిజస్వరూపం తెలియకుండా నేనునమ్మి శిరోరత్నాన్ని ఇవ్వను అని ఖచ్చితంగా చెప్పింది అప్పుడు హనుమంతుడు ఆకాశమందేంతగా శరీరాన్ని పెంచాడు. సీతాదేవి ఆశ్చర్యపడింది. మళ్లీ హనుమంతుడు సూక్ష్మరూపాన్ని ధరించాడు. అప్పుడు సీతాదేవి తన శిరోరత్నాన్ని హనుమంతుడికి ఇచ్చింది.

### 4. సీతాదేవికి నమ్మకం కుదరడం:

తల్లి అనుగ్రహిస్తే వరాలకు ఏం కొదవ? నీవు నా భర్తకుశల వార్తను నాకు అందించావు. దానికి నేను ఉపకారమేమీ చేయలేనునీవు ఈ భూమండలంలో బ్రహ్మ కల్పముల పాటు వర్ధిల్లు నాయనా అని ఆశీర్వదించింది. తన మనసులోని విషయాన్ని వెల్లడించింది శ్రీరాముడి పాదపద్మాలనుతన మనస్సులో నిలుపుకున్నానని విన్నవించుకున్నది. రావణుడు వచ్చి నాతో కఠినంగా మాట్లాడిన మాటలు నీవు విన్నావు కదా. నా భర్తకు నాపై దయ కలిగిన ఈ విషయాన్ని మనవి చేయమన్నది. దీని వలన తాను త్రికరణ శుద్ధిగా శ్రీరాముడినే నమ్ముకున్నానన్నది. రాముడిలో ఏమాత్రం అనుమానం ఉన్నప్పటికీ అది తొలగించేలా సూచించింది.

పరుషవాక్యాలను భరించాల్సిన స్థితిలో ఉన్నానని అనడం ద్వారా ఆలస్యం చేయకుండా ఆదుకోవలసిన ఆవశ్యకతను చెప్పకనే చెప్పింది. తన పరిస్థితిని కళ్లకు కట్టినట్లు వివరించింది. జడలు కట్టిన తలవెంట్రుకలతో, శిధిలమైన బట్టలతో, దుమ్ముపడ్డ శరీరంతో, నిరాహారిగా, భూమిపై శయనిస్తూ నిద్ర లేకుండా రామజపాన్ని జపిస్తూ

లంకా నగరంలో రాక్షసమూహం నడుమన ఉంటూ శ్రీరాముని గురించి తపస్సు చేస్తూ ఉన్నాను. నాకు ప్రత్యక్షం కమ్మని నా నాథునికి చెప్పు అని వేడుకొన్నది. తన సందేశాన్ని వినిపించిన సీతాదేవి పశ్చాత్తాపపడుతూ ఇలా అన్నది.

## 5. సీతాదేవి పశ్చాత్తాపం :

శ్రీరాముని తండ్రిగాను, నన్ను తల్లిగాను సేవించే నీతి కుశలుడైన లక్ష్మణుని నేను అవివేకంతో అనరాని మాటలు వినరాని మాటలు పలికాను. ఆ మహా పాపానికి నేను ఫలితాన్ని అనుభవిస్తున్నాను ఈ విషయం లక్ష్మణుడికి చెప్పు. ఆ మాటలు మనసులో ఉంచుకోకుండా నా అభిమానాన్ని కాపాడమని నయవినయాలు కలిగినటువంటి లక్ష్మణుడికి చెప్పవయ్యా అన్నది. లక్ష్మణుడి పట్ల ప్రవర్తించిన తీరుకు తానే బాధ పడింది. తెలియక పలికిన మాటలు మనసులో పెట్టుకోవద్దు అని చెప్పింది. తప్పులను ఒప్పుకోవడం ఉత్తముల లక్షణం. సీతాదేవి తన పొరపాటుకు చింతించి ఏమీ అనుకోవద్దు అని నచ్చ చెప్పింది. ఇది సీతాదేవినిజాయతీని సూచించడంతోపాటు లక్ష్మణుడి పట్ల కల వాత్సల్యాన్ని కూడా సూచిస్తున్నది. సీతాదేవికి నమ్మకం కుదరడంతో హనుమంతుడికి సంతోషం కలిగింది ఓ తల్లీ నిన్ను నా వీపు మీద కూర్చోబెట్టుకుని తెల్లవారిలోపుగా రాముని దగ్గరకు చేరుస్తాను అన్నాడు. సీతాదేవి సున్నితంగా తిరస్కరించింది.

## 6. సీతాదేవి దృఢసంకల్పం:

సీతాదేవి వ్యక్తిత్వం వ్యక్తం అయ్యేలా సమాధానం చెప్పింది. నీవు అందుకు సమర్థుడవే నాయనా! నీ సామర్థ్యాన్ని నేను కించపరచట్లేదు. నీ వెంట వస్తే కీర్తి దక్కదు. అని సత్యాన్ని బోధించింది అవకాశం వచ్చింది కదా అని వెళ్ళిపోవడం తగినది కాదు అనే విషయాన్ని చెబుతూ ఆ విధంగా చేస్తే రావణుడి కంటే రాముడే దొంగ అని పండితులు అంటారు కదా అన్నది. ఇది నిజం. రావణుడు మోసగించి రావణుడు మోసగించి తీసుకుని రావడం తప్పు అని అందరూ అంటున్నారు. శ్రీరాముడు ఆపద్ధతిలోని సీతాదేవిని తీసుకుని పోవాల్సిన అవసరం లేదు. అది తగినది కాదు. ఆ విషయాన్ని సీతాదేవి స్పష్టం చేసింది.

**దొంగిలి తెచ్చిన దైత్యుని**
**సంగడులగువానివారిసాహసమొప్పన్**
**సంగరముఖమునజంపక**
**దొంగిలి కొనిపోవ దగునె దొరలకునెందున్**[5]

అంతేకాక దొంగిలించి తెచ్చారు కదా అని మళ్లీ దొంగిలించి తీసుకుని పోవడం దొరలకు తగినది కాదు. వారు సాహసం ఉట్టిపడేలా యుద్ధం చేయాలి వీరోచితంగా నెగ్గి తీసుకుని పోవాలి. అదే సరైన పద్ధతి అని ధీరత్వాన్ని ప్రకటించింది తన భర్త కీర్తికి కళంకం అంటకుండా ఉండాలని కోరుకున్నది. సమయం చిక్కింది కదా అని వెళ్లిపోతే సమస్య తీరిపోతుంది అని భావించలేదు. పైగా రాముడు సామాన్యుడు కాదు. శ్రీరాముడు ముల్లోకాలలోను వీరుడు.

కోదండాన్ని ధరించినవాడు. రావణుడు రాణివాసద్రోహి. అటువంటి వారిని యుద్ధరంగంలో ఓడించి నన్ను తీసుకొని వెళ్లడం ధర్మం అని ధర్మాన్ని బోధించింది. అందునా నేను పరపురుషులను ముట్టుకోను కాబట్టి నీతో రావడం సాధ్యం కాదు అని హనుమంతుడితో చెప్పిన మాటలకు కొనసాగింపుగా వాత్సల్యంతో కొన్ని మాటలు చెప్పింది. నీవు నాకు కుమారుడితో సమానుడవు. శ్రీరాముడికి సేవకుడవు. అందువల్ల నీ వెంట రావడం తప్పు కాదు. ఈ విషయం అంతా రాముడికి చెప్పి ఆలస్యం చేయకుండా రాముడిని రమ్మని చెప్పమన్నది. దానికి బదులుగా హనుమంతుడు రాజులంతా మెచ్చే రీతిలో రాముడు సుగ్రీవ సుషేణ ముఖ్య బల బృందముతో వచ్చి నీచుడైన రావణుడిని యుద్ధంలో వధించి రాజ రీవి ఉట్టిపడేలా నిన్ను నీ నగరానికి తీసుకుని పోతాడు ఇది నిజము. నమ్ముము. అని ధైర్యం చెప్పి హనుమంతుడు ఊ రడించాడు. ఈ సంభాషణ ద్వారా సీతాదేవిలోని మాట నేర్పరి తనం వెల్లడి అవుతున్నది. తనను వీరోచితంగా తీసుకొని వెళ్ళమని కోరిందే కానీ కష్టాలకుభయపడి పారిపోదామని అనుకోలేదు. కష్టాలకు తట్టుకుని అప్పటిదాకా ఎదురుచూస్తాను అని దృఢంగా విశ్వసించి చెప్పింది కానీ సహనాన్ని కోల్పోలేదు. ఈ విధంగా ఉదాత్తంగా చిత్రించబడిన సీతాదేవి పాత్ర ద్వారా గొప్ప సందేశాన్ని మనం గ్రహించాలి.

## 7. ముగింపు:

తెలివిగలవారమనుకున్న వారు కూడా ప్రలోభాలకు లోనై నమ్మకూడని వారిని నమ్మి మోసపోతున్న వారి ఉదంతాలు కోకొల్లలు. తాము ఎంత బలహీన స్థితిలో ఉన్నప్పటికీ ఎదుటివారు ఎవరో ఏమిటో తెలుసుకోకుండా వారిని గురించి విచారించకుండా తొందరపాటుతో తప్పుడు నిర్ణయాలను తీసుకోకూడదని తెలుసుకోవాలి.

పరులతో వ్యవహరించేటప్పుడు హద్దులు మీరకుండా తగిన జాగ్రత్తలు తీసుకుంటూ దూరంగా ఉంటూ హుందాగా వ్యవహరిస్తే సమస్యలు ఉండవు అని గుర్తుపెట్టుకోవాలి. సీతాదేవిహనుమంతుడితో తన గమ్యానికి చేరుకోవడం సులువైన మార్గమే. అప్పుడు యుద్ధంతో పనిలేదు. ఎదురుచూసే అవసరం ఉండదు. భయపడే పని ఉండదు. అలాగని వెళ్లిపోవడం తనతోపాటు తన వారికి కూడా అపకీర్తి వచ్చేందుకు ఆస్కారం ఉంటుంది. అందుకే అడ్డదారులు పనికిరావు. రాజమార్గంలోనే వెళ్లాలి అనే బోధను అర్థం చేసుకోవాలి.

నేడు యువతరం ఎదుర్కొంటున్న అనేక సమస్యలకు పరిష్కారాలు సమాధానాలు మనకు హనుమత్ సందేశ ఘట్టంలో కనిపిస్తాయి. హనుమత్ సందేశం ఈ రకంగా అందరికీ మంచి సందేశాన్ని అందిస్తున్నది. ముఖ్యంగా సీత వ్యక్తిత్వం స్త్రీలకు ఆదర్శంగా నిలుస్తున్నది అనడంలో ఎటువంటి సందేహం లేదు.

## 8. పాదసూచికలు:

1. సుందరాకాండ 59 వ పద్యం
2. సుందరాకాండ 60 వ పద్యం

3. సుందరాకాండ 91 వ పద్యం
4. సుందరాకాండ 102 వ పద్యం
5. సుందరాకాండ 121 వ పద్యం

## 9. ఉపయుక్తగ్రంథసూచి:


1. ఆరుద్ర. సమగ్ర సాహిత్యము. తెలుగు అకాడమీ, హైదరాబాద్, 2003.
2. ఉషశ్రీ, ఉషశ్రీ రామాయణం. తిరుమల తిరుపతి దేవస్థానము, తిరుపతి, 2012
3. కామేశ్వరరావు, ఉప్పలూరి. వాల్మీకి రామాయణము యథా మూలము, శాంతా వసంత ట్రస్ట్ హైదరాబాద్, 2019.
4. లక్ష్మీ కాంతమ్మ, ఊటుకూరి. మొల్ల రామాయణం. పొట్టి శ్రీరాములు విశ్వ విద్యాలయం, హైదరాబాద్, 2008.
5. సిమ్మన్న, వెలమల. విమర్శ సిద్ధాంతాలు.దళిత సాహిత్య పీఠం, విశాఖపట్టణం, 2009.


***


AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_11.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 11. రంగనాథ రామాయణం: విభీషణుడి ధర్మం

**పి. రమేష్**

తెలుగు అధ్యాపకులు,
ప్రభుత్వ డిగ్రీ & పీజీ కళాశాల సిద్దిపేట (స్వయంప్రతిపత్తి),
సిద్దిపేట, తెలంగాణ.
సెల్: +91 7674866788. Email: peddollaramesh701@gmail.com

**వ్యాససంగ్రహం:**

*భారతీయ ఇతిహాసాల్లో రామాయణం ప్రధానమైనది హిందువులు పవిత్రంగా భావించే గ్రంథాలలో రామాయణం ప్రాముఖ్యమైన పాత్రను పోషించింది. ఈ రామాయణంలో ప్రముఖ పాత్రలను పోషించిన రావణాసురుడి సోదరుడు అయిన విభీషణుడి ధర్మం. అతని ధర్మబద్ధమైన ఆలోచనలు గురించి వ్యాసంలో చెప్పాను. దీనిలో భాగంగా వాల్మీకి రామాయణం, రంగనాథరామాయణం, భాస్కరరామాయణం ఆధారంగా వ్యాసప్రక్రియ కొనసాగింది. ధరతి విశ్వమితి ధర్మం. మనుషుల మనుగడకి ప్రపంచానికి పరమార్థమైనది. ధర్మం. నీతి, నిజాయితి, న్యాయము, సత్యము, కరుణ, ప్రేమ మొదలైన సమగ్రస్వరూపమే ధర్మం.*

**Keywords:** విభీషణుడు, ధర్మం, రామాయణం, రంగనాథ రామాయణం, నీతి, సౌశీల్యం.

## 1. ఉపోద్ఘాతం:

మనం ధర్మాన్ని రక్షిస్తే అది మనల్ని రక్షిస్తుంది అని మన సంప్రదాయం అలాగే రామాయణంలో రావణాసురుడి సోదరుడి పాత్ర ద్వారా ఈ విషయం మనకు వెళ్లడవుతుంది. తన అన్న చేసిన చెడ్డ పనులు అన్నింటిని ఖండించి వ్యతిరేకించాడు అధర్మ వర్తనుడు అయిన ఆశ్రమాన్ని వదిలి ధర్మాచరణ పరుడైన రాముని శరణు కోరాడు. సుఖసంపదలను భోగభాగ్యాలను ఇచ్చినప్పటికీ అధర్మాన్ని విడనాడి విభీషణుడు ధర్మాచరణ వైపు అడుగు వేసాడు ఆశ్రమం పొందాడు. ప్రస్తుత సమాజంలో మానవులు మానవులు ధర్మ మార్గాన్ని అనుసరించినట్లయితే విభీషణుడు ఏ విధంగా ధర్మశాలల్లో ఉండి చివరికి మంచిని పొంది సక్రమమైన పరిపాలన

చేశాడో మనుషులకి కూడా ధర్మమార్గంలో పయనించే మనుషులకి కూడా అలాంటి శుభమే జరుగుతుంది అని చెప్పడమే ఈ వ్యాసం యొక్క ముఖ్య ఉద్దేశం.

రాక్షస వంశంలో జన్మించిన విభీషణుడు ధర్మమార్గాన్ని ఎంచుకున్నాడు. తపం ఆచరించి బ్రహ్మ నుంచి శాశ్వత కీర్తిని అర్జిస్తావు అని వరం పొందాడు.రాజు అయినవాడు ప్రజా సంక్షేమం కోసం ఎలా ఉండాలో తన అన్న రావణాసురుడికి తెలియజేశాడు. స్త్రీ వ్యామోహంలో పడితే సర్వం కోల్పోతాము అని హెచ్చరించాడు. తన సోదరుడు రాజు అయినప్పటికీ అధర్మ మార్గాల్లో నడుస్తుంటే తాను మాత్రం ధర్మహితం పలికాడు అతడే విభీషణుడు.

## 2. ధర్మాచరణ పరుడు విభీషణుడు:

విశ్రవసు, కైకసులు అసుర సంధ్యలో కలవటం వలన వారికి రావణాసురుడు,కుంభకర్ణుడు మరియు శూర్పనఖ జన్మించారు. ధర్మ బద్ధంగా నడిచే ఒక్క కొడుకైన ఉండాలని కైకసి భర్తను కోరింది. ఎలాంటి పరిస్థితుల్లో అయినా ధర్మం పక్షాన ఉండే కొడుకు పుడతాడు అని వరం ఇచ్చాడు భర్త విశ్రవసు. అలా పుట్టిన వాడే విభీషణుడు. అందుకే రావణుడి అధర్మాలకు విభీషణుడు చిన్నప్పటినుండే వ్యతిరేకి. రావణుడితోపాటు విభీషణుడు కూడా బ్రహ్మ కోసం ఘోరమైన తపస్సు చేశాడు. రావణుడు నరులు వానరుల చేత తప్ప చావులేని వరాన్ని కోరుకున్నాడు. విభీషణుడు ఎలాంటి పరిస్థితుల్లో అయినా,తన మనస్సు తాను ధర్మం వైపే ఉండాలని కోరుకున్నాడు. ధర్మం విషయంలో విభీషణుడు తోడ పుట్టిన అన్నను ఎదిరించడంలో సిద్ధపడ్డడు. విభీషణుడు లంకలో రాక్షసుల మధ్య పెరిగినప్పటికి అతని ప్రవర్తన శాంతస్వభావం తోటి రాక్షసులకు ఆశ్చర్యం కలిగించేది. విభీషణుడి భార్య సరమ కూతురు త్రిజట వారిద్దరు కూడా లంకలో ఉన్నప్పటికీ ధర్మామార్గాన్ని ఎంచుకున్నారు. విభీషణుడు అంటే రావణుడికి ఎంతో అభిమానం. రావణుడు రాక్షసుడే అయినా విభీషణుడి మాటకు గౌరవం ఇచ్చేవాడు. అశోకవనాన్ని హనుమంతుడు ధ్వంసం చేసినప్పుడు. లంకకు వచ్చిన హనుమకు రావణుడు మరణ దండన ఆదేశించాడు. దూతను చంపడం ధర్మం కాదని, అధర్మమని విభీషణుడు అడ్డుపడ్డాడు. ధర్మం కోసం లంకను విడిచిన విభీషణుడు. విభీషణుడి మీద ఎంత సోదర ప్రేమ ఉన్నప్పటికీ రావణుడు ఒక విషయంలో విభీషణుడి మాటను ఒప్పుకోలేదు. స్త్రీలోల్యత రావణున్ని రావణుని లోపల ఉన్న సోదర ప్రేమను చంపివేసింది సీత అపహరణం జరిగిన తర్వాత శ్రీరాముడు వారిది నిర్మించి లంక వైపు వస్తుండడాన్ని గమనించిన విభీషణుడు సీతమ్మను తిరిగి రామునికి అప్పగించి శరణు కోరమని రావణునికి సలహా ఇస్తాడు కానీ రావణుడు ఎలాగైనా తన బలహస్త్రాలతో రామున్ని సంహరిస్తానని అంటాడు విభీషణుడు సీతమ్మను అప్పగించి రామున్ని శరణకోరకపోతే ఈ లంక నాశనం అవుతుంది అని నా మాట వినమని అభ్యర్థిస్తాడు. స్త్రీలోల్యత భుజబల గర్వంతో ఉన్న రావణుడికి తమ్ముడి మాటలు

చెవికెక్కలేదు తనకు సలహా ఇచ్చిన విభీషణుడిని లంకలో ఉంటే చంపివేస్తానని తన్ని తరిమి వేస్తాడు సోదరులు తన పుట్టి పెరిగినటువంటి సామ్రాజ్యము తనను ఆత్మీయంగా చూసే అటువంటి సోదరులు ఉన్నప్పటికీ అక్కడంతా అధర్మవర్తన నడుస్తుంది. అధర్మ మార్గంలో పరిపాలన జరుగుతుంది అని భావించి విభీషణుడు లంక నగరాన్ని విడిచి, రామున్ని శరణు కోరడానికి వచ్చాడు.

**గటములుప్పొంగ నొక్కట నూర్పులెసఁ గఁ -బటుధూమములతోడి పావకుం డనఁగఁ1**
**బదహతి మేదినీభాగంబు వగుల -నదలుపుచెట్టున నాకస మగల2**
**నద్దిరా ! యితనికోపావేశ మనఁగ -గద్దియమీఁద డిగ్గన డిగ్గనురికి3**
**యడిదం బుజళిపించి యటు వేయఁబూని -యుడిగి విభీషణు నుగ్రతఁ దన్నెఁ4**

రాముడిని పొగిడినందుకు విభీషణుడిని రావణాసురుడు ఎంతగానో అవమానించాడు, జాతి ద్రోహి అని నిందించాడు. అప్పుడు విభీషణుడు ఆలోచించుకున్నాడు. అప్పుడు అతనికి తన ముందు దారులు కనిపించాయి. అవి అన్న పక్కనే ఉండి రోజు అవమానాలు చీదరింపులు, అధర్మమైన ఆలోచనలు వినడం మరణంతో సమానమని అనుకున్నాడు. యుద్ధంలో పాల్గొని రాముని చేత చావటం కంటే, రావణుడిని వదిలి రాముడి దగ్గరకు వెళ్లి శరణు వేడటం ధర్మం అని అనుకున్నాడు విభీషణుడు.

రాజా! నీవు నాకు అగ్రజుడివి. అన్నగారు తండ్రితో సమానుడు. నీవు ధర్మ మార్గాల్లో లేకపోయినా నిన్ను గౌరవించడం నా ధర్మం. నీకు మేలు చేసే మాటలు చెప్పటం నా కర్తవ్యం. అని విభీషణుడు రావణుడితో అన్నాడు. చివరగా విభీషణుడు రాముడిని ఆశ్రయించాలి అని నిర్ణయించుకున్నాడు. లంకను వదిలి వెళుతున్నట్టు అన్న రావణుడికి తెలుపగా రావణుడు విభీషణుడి మాటలను పట్టించుకోలేదు. విభీషణుడికి మాత్రం లంక నగరాన్ని పరిపాలించాలని లేదు. రాముని భక్తుని గానే ఉండాలి అని అనుకున్నాడు. లంకలో ఎదురవుతున్న అవమానాల నుండి విముక్తి పొందాలని అనుకున్నాడు. విభీషణుడు ఆకాశమార్గాన సంచరించి రాముడి దగ్గరకు బయలుదేరాడు

### 3. విభీషణ శరణాగతి:

లంకను విడిచిపెట్టి వచ్చిన విభీషణుడు రాముని శరణు కోరడానికి రాముని సైనిక శిబిరం దగ్గరకు వచ్చాడు ముందుగా సుగ్రీవుడు విభీషణుడిని చూసి విషయాన్ని రాముని దగ్గర ప్రస్తావించి లంకలో పుట్టిన విభీషణుడు రాక్షసుడు అదేగాక రావణుడికి సోదరుడు కాబట్టి శరణు కోరి వచ్చిన విభీషణుడిని ఆదరించడం సరైనది కాదు అని చెప్పాడు. కానీ అక్కడే ఉన్న హనుమంతుడు విభీషణుడు ధర్మవర్తనుడు అతని గురించి నాకు కొంత తెలుసు మీరు అతనికి ఆశ్రయం ఇవ్వవచ్చు అని తన అభిప్రాయాన్ని చెప్పాడు ఇరువురి అభిప్రాయాలను విన్న రాముడు ధర్మ మార్గంలో వెళ్లిన ఎవరైనా వారికి ఆశ్రయం ఇవ్వడం మా సూర్యవంశీయుల యొక్క ప్రధమ లక్షణం అని భావించి సుగ్రీవునితో చెప్పి విభీషణున్ని ఆదరించాడు రాముని ఆశ్రయం పొందిన విభీషణుడు రామున్ని వేనోళ్ళ కీర్తించాడు.

**జయజయ శతకోటిజలజాప్తతేజ -జయజయ సంసారసర్పసుపర్ణ5**
**లలితాగమస్తోత్ర లక్ష్మీకళత్ర- విలసద్దయాపాత్ర విబుధారిజైత్ర6**
**దినకరశశినేత్ర దివ్యచారిత్ర -యనుపమశుభగాత్ర యఖిలైకసూత్ర7**
**వేయునోరులభోగివిభుఁడైన నుతులు- సేయంగనోపునే శ్రీరామ నిన్ను8**

జలజాప్త తేజుడంటే సూర్యవంశజుడు శ్రీరామ చంద్రునికి వందకోట్ల జయ జయమ్ములు, సంసార బాధ్యతలపై మక్కువ కలిగినటువంటి అందమైన పత్రములు కలిగిన సంసార సర్పాన్ని సంపూర్ణంగా కలిగిన శ్రీరామునికి జయ జయం అంటూ సామవేద సంబంధిత స్తోత్ర కారకుడు లక్ష్మీదేవి భార్యగా కలిగిన విష్ణు భగవానుడు గొప్ప దయపాత్రు డైనటువంటి సూర్యచంద్రుల వంటి కన్నులు కలిగిన దివ్య చరిత్ర కలిగిన రామచంద్రునికి జయము జయములు అంటూ విభీషణుడు వేడుకొన్న విధానం రంగనాథ రామాయణ ద్విపదల వల్ల తెలుస్తుంది. రాముని శరణ కోరి వచ్చిన తరువాత, ధర్మ మార్గాన్ని ఆచరించి యుద్ధం చేస్తున్న రామునికి తోడుగా నిలిచాడు విభీషణుడు.. సుగ్రీవుడు రాములక్ష్మణులతో పాటు విభీషణుడికి  ఆశ్రయం ఇచ్చాడు. విభీషణుని వల్ల ప్రమాదకరమని, రావణుడే రహస్యంగా పంపాడేమో అని ఆలోచించలేదు సుగ్రీవుడు. శ్రీరాముడు రావణున్ని వధించాక విభీషణుడికి సోదర భావం ఉప్పొంగిపోయింది. శ్రీరాముని అనుమతితో రావణుడికి అంతక్రియలు జరిపాడు. తరువాత

**గట్టుము వేగ లం కా రాజ్య మునకుఁ -బట్టం బు వానికిఁ బ్రతి విభీషణుని9**
**అని యానతిచ్చి న నతఁడును నతని -నభిషేక మొనరించి యసురుల కెల్లఁ10**
**వననిధిజలములు వనచరు ల్దేర-బ్రభుఁడవు గమ్మ ని పట్టం బుగట్టి11**
**తలపోయ నాచం ద్రతారార్క ముగను -సలలితం బుగ రామచంద్రునికీర్తి12**

రాముడు విభీషణున్ని ధర్మబద్ధంగా  లంక నగరానికి రాజుగా పట్టాభిషేకం చేశాడు. కోరిక లేకపోయినా లంకకు చక్రవర్తి అయ్యాడు. శ్రీరాముని పట్టాభిషేకం చూసి తరించి, లంకకు తిరిగివచ్చి ధర్మబద్ధంగా పరిపాలన కొనసాగించాడు.

## 4. ముగింపు:

రామాయణం ధర్మాచరణ మార్గం .రాముడు మూర్తిభవించిన ధర్మ స్వరూపం. రామాయణంలోని ప్రతిపాత్ర ఆదర్శమైనటువంటి ధర్మాచరణ మార్గాన్ని వెల్లడిస్తుంది. అందులో అత్యంత ప్రధానమైన పాత్రల్లో విభీషణుని పాత్ర ఒకటి.

ఎన్ని కష్టాలు ఎదురైనప్పటికీ ఎలాంటి క్లిష్ట పరిస్థితుల్ని అనుభవించినప్పటికీ ధర్మాన్ని విడిచిపెట్టకుండా నిరంతరం ధర్మ సంరక్షణలో తన జీవితాన్ని గడిపినట్టు అయితే చివరికి తప్పకుండా మంచి ఫలితాలు వస్తాయి మంచి శుభాలు కలుగుతాయనేది విభీషణుడి పాత్ర ద్వారా వెల్లడవుతుంది. ధర్మాన్ని కాపాడితే అది మనల్ని రక్షిస్తుంది అని చెప్పడానికి రామాయణంలోని విభీషణుడి పాత్ర నిలువెత్తు నిదర్శనంగా కనిపిస్తుంది.

## 5.పాదసూచికలు:

1. రంగనాథ రామాయణం యుద్ధ కాండ 283 పేజీ 422 ద్విపద
2. పైదే, 283 పేజీ 422 ద్విపద
3. పైదే, 290 పేజీ 422 ద్విపద
4. పైదే, 283 పేజీ 422 ద్విపద
5. పైదే, 290 పేజీ 540 ద్విపద
6. పైదే, 283 పేజీ 540 ద్విపద
7. పైదే, 290 పేజీ 540 ద్విపద
8. పైదే, 283 పేజీ 540 ద్విపద
9. పైదే, 290 పేజీ 770 ద్విపద
10. పైదే, 283 పేజీ 770 ద్విపద
11. పైదే, 290 పేజీ 770 ద్విపద
12. పైదే, 290 పేజీ 770 ద్విపద

## 6. ఉపయుక్తగ్రంథసూచి:


1. కామేశ్వరరావు, ఉప్పలూరి. (2019). వాల్మీకిరామాయణము యధామూలము, శాంతావసంతట్రస్ట్, హైదరాబాద్.
2. బుద్ధారెడ్డి, గోన. (2014). రంగనాథ రామాయణము. వేటూరి ప్రభాకరాశాస్త్రి వాఙ్మయపీఠము తిరుపతి.
3. లక్ష్మీకాంతమ్మ ఉటుకూరి. (2008) మొల్ల రామాయణము. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్.
4. సుజాత రెడ్డి ముదిగంటి. (2012). తెలుగు సాహిత్య చరిత్ర. ఆంధ్ర సారస్వత పరిషత్, హైదరాబాద్.
5. సూర్య ప్రకాశ దీక్షితులు, పురాణపండ. (2012). ఉషశ్రీ రామాయణం, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి.


***


AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_12.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 12. రామాయణం: గురుశిష్యుల సంబంధాలు

**డా. హెచ్. కిషన్**

అసోసియేట్ ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు,

బి.జె.ఆర్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, నారాయణగూడ,

హైదరాబాద్, తెలంగాణ.

సెల్: +91 9848170041. Email: drkishanh@gmail.com

**వ్యాససంగ్రహం:**

*రామాయణంలో తొలి గురువు వాల్మీకి. తన శిష్యుడైన భరద్వాజుని వెంటబెట్టుకొని తమసా నదికి వెళ్తుండగా బోయవాడు పక్షులను వేటాడే దృశ్యం కనిపించడంతో "మానిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీస్సమాః । యత్ క్రౌంచ మిధు నాదేకమ్ అవధీః కామ మోహితమ్ ॥"అని వాల్మీకి చెప్పిన శ్లోకంతో రామాయణం కథ ఆరంభం అవుతుంది. గురువు చేసే పని తపస్సు. "తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్ । నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మని పుంగవమ్ ॥" అనే శ్లోకమే రామాయణంలో తొలి శ్లోకం. మహర్షి వాల్మీకికి తన శిష్యుడైన కుశలవులకు రామాయణ గాథా బోధించడం, గురు శిష్యుల పరంపరకు ఇది మొదలు. శిష్యులైన కుశలవులు రామాయణ గాథాను గానం చేయగా, అందరూ ఆనందించారు. సనాతన ధర్మం బోధించిన విలువలతో గురువును మన్నించడం మొదటి విధి. శ్రీ గురుభ్యోనమః అన్న తరువాత మాత్రమే గణాధిపతయే నమః అంటూ మిగతా అన్ని కొనసాగుతాయి. రామాయణంలో గురు శిష్య పరంపర విశేషాలను వివరించడమే వ్యాసం యొక్క ఉద్దేశం.*

**Keywords:** వశిష్ఠుడు, దశరథుడు, విశ్వామిత్రుడు, వాల్మీకి, సూర్యభగవానుడు, అగస్త్యుడు, అష్టావక్రుడు.

## 1. ఉపోద్ఘాతం:

తరతరాలుగా వస్తున్న భారతీయసంస్కృతి సంప్రదాయాల్లో గురుశిష్యుల బంధం విశేషమైనది. ప్రధానమైనది కూడా. మొదటి గురువులు జన్మనిచ్చిన తల్లిదండ్రులు. రెండవ గురువు విద్యాబుద్ధులు నేర్పించిన గురువు. ఇందుకు "**మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ**" అనే వేద వాక్యం ప్రమాణం. తరువాత క్రమపరిణామదశలలో బుద్ధి, జ్ఞానం, ఆలోచనవిధానాలు వికసించే సమయానికి గురువే దేవుడు అవుతున్నాడు. "**గుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః గురు స్సాక్షాత్పరబ్రహ్మః తస్మైశ్రీ గురవే నమః**" అనే ధర్మసూత్ర వొరవడిలో మనకు చదువు నేర్పించువాడు, జ్ఞానమును ప్రసాదించిన వాడు బ్రహ్మ, విష్ణు,

మహేశ్వరులతో సమానమైనవాడు, పరబ్రహ్మ స్వరూపుడు అయినా గురువుకు శిరస్సును వంచి నమస్కరించడంతో జీవనంలో వికాసం ఆరంభమవుతుంది.

## 2. రామాయణం - గురుబోధనలు:

భారతీయ సనాతన సంప్రదాయంలో గురుస్థానం చాలా గొప్పది. జ్ఞానాన్ని బోధించి సక్రమమార్గాన్ని చూపించడం గురువిధి. అలాంటి బోధనలు రామాయణంలో చాల సందర్భాల్లో కనిపిస్తాయి.

- రాముడు భరతుడికి బోధించిన రాజనీతి ధర్మాలు - అయోధ్యకాండ.
- అరుంధతి లోపాముద్ర సీతాదేవికి బోధించిన బోధనలు పతివ్రతత్వ బోధనలు. అరణ్యకాండ
- జాంభవంతుడు హనుమంతుడి శక్తి సామర్థ్యాలు, అంగదాధులను బోధించడం. కిష్కిందకాండ
- విభీషణుడు రావణునికి నీతి బోధించడం - యుద్ధకాండ
- దృవవాసుడు లక్ష్మణునికి చేసిన కాలధర్మ బోధ - ఉత్తర రామాయణం
- రాముడి గురువుగా మారి లక్ష్మణునికి బోధించిన విలు విద్య
- భరద్వాజ ఋషి బోధించిన ధర్మాలు.
- తారా వాలీకి చేసిన బోధ.

ఉదా: విశ్వామిత్రుడు రాముడికి దాదాపు 72 రకాల శస్త్రాస్త్రాలను వివిధ ఆయుధాల ప్రయోగ, ఉపసంవరాలను బోధించడంతోపాటుగా అఖండభారతానికి సంబంధించిన భౌగోళికపరిస్థితులు, చారిత్రకాంశాలు, కథలు, నియమావళి, బోధించాడు. ''కౌసల్యా సుప్రజా రామ'' అంటూ గురువైన విశ్వామిత్రుడు శిష్యుడైన రాముడిని మేలుకొల్పడం ఒక చిత్రం. నిజానికి గురువు నిద్రిస్తుండగా శిష్యుడు మేలుకొని ఉండాలి. ఇలా అనేక సందర్భాలలో బోధ చేసేవారు. ఆ బోధ చేసి ఆచరించే వారు. అదే కోణంలో గురుశిష్య బంధంలో గ్రహించవచ్చు. శబరికి జాబాలి మహర్షి గురువు రామలక్ష్మణులకు విశ్వామిత్రుడు గురువు. భరతుడికి రాముడు గురువు. అనేది ప్రధానమైనదిగా గమనించవచ్చు.

## 3. గురు పరంపర:

''**సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమాం! అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరామ్**''!! (101 సుపరిచిత శ్లోకాలు- సూరంపూడి సూర్యనారాయణమూర్తి, పుట.41) అద్వైతమార్గగురువందనపరంపరా శ్లోకం ఇది. మనం ఏ కార్యం మొదలుపెట్టినా ముందుగా గురువుకు నమస్కరించాలి. వారి ఆశీస్సులు పొందాలి. అప్పుడే ఆయా కార్యాలు సఫలీకృతమవుతాయి. అందుచేత సదాశివుని మొదలుకొని, ఆదిశంకరాచార్యులతో సహా సద్గురువు వరకు ఉన్నటువంటి గురువులకు నమస్కారం చేయాలి. ఇక గురు శిష్యుల సంబంధాలు తెలుసుకుందాం.

## 4. గురుశిష్యుల సంబంధాలు:

పూర్వం విద్యార్థులు చదువుకోవడానికి గురుకులాలు ఉండేవి. విద్యార్థులకు కావలసిన బట్టలు భోజనం వివిధ రకాల వస్తువులు మరియు విద్యార్థులకు బోధించే బాధ్యత అంత గురువులే చూసుకోవాలి. శిష్యులు నిరంతరం గురువు సన్నిధానంలో సేవచేసి చాలా క్రమశిక్షణతో వినయంతో పట్టుదలతో విద్యను నేర్చుకునే వాళ్ళు. ఆనాటి గురుకులాలలో ఆనాటి విద్యార్థులు కూడా గురువుల పట్ల కృతజ్ఞత భావంతో ఉండేవారు. విద్యాభ్యాసం నేర్పించిన గురువును మరిచిపోయేవాళ్ళు కాదు. ఈ విధంగా నాడు గురు శిష్యుల సంబంధాలు ఉండేవి. గురువును అనుసరించే శిష్యుడు అభ్యసనం కొనసాగిస్తాడు. గురువును శబ్దార్థ విశ్లేషణలో వేరువేరు అర్థాలతో పిలుస్తారు. అవి:

**ఉపాధ్యాయుడు:** విద్యార్థిని తన దగ్గర కూర్చోబెట్టుకొని తనకు తెలియని విషయాలను, తెలియపరచు-కుంటూ విద్యార్థి పట్ల అనేక శ్రద్ధలు తీసుకొని విద్యను బోధించేవాడే ఉపాధ్యాయుడు. ఎలాంటి స్వార్థం లేకుండా విద్యార్థిని ప్రయోజకుడిని చేసే బాధ్యత కూడా ఉపాధ్యాయుడే తీసుకునేవాడు.

**గురువు:** నాడు గురుకులాలలో విద్యార్థులు గురువును దేవుడి కంటే గొప్పగా గౌరవించేవాళ్ళు. భయం, భక్తి రెండు ఉండేవి. ఎందుకంటే గురువు తన తరగతి గదిలో గాని, గురుకులాలలో గాని, ఆశ్రమాల్లో గాని ఎంతమంది విద్యార్థులున్నా అందరికీ ఒకే భావంతో విద్యను బోధిస్తాడు. ఎలాంటి లాభాపేక్ష ఆశించకుండా బోధించేవాడు గురువు. అందుకే గురువు అనే పదానికి వేరు వేరు అర్థాలు ఉన్నాయి. ''గు'' అంటే చీకటి ''రు'' అంటే పోగొట్టువాడు. విద్యార్థి యొక్క అంతర్గత చీకటిని పోగొట్టి వెలుగును నింపేవాడే గురువు.

**ఆచార్యుడు:** విద్యార్థి సరియైన క్రమశిక్షణతో, పట్టుదలతో ఉండేటట్లు మార్గ నిర్దేశాన్ని, వారి విధి విధానాలను తెలియజేసుకుంటూ ఉన్నతమైన స్థానంలో తీసుకునే విధంగా బోధించేవాడే ఆచార్యుడు.

**బోధకుడు:** విద్యార్థికి ఏది అవసరమో, ఏది అనవసరమో పూర్తిగా తెలుసుకొని తనకు కావల్సిన విద్యను పరిపూర్ణంగా బోధించి ప్రయోజకుడ్ని చేసే బాధ్యతను తీసుకుని బోధించే వాడే బోధకుడు.

**శిక్షకుడు:** విద్యార్థికి చదువుపై అశ్రద్ధ ఉన్నట్లయితే ఆ విద్యార్థి పట్ల జాగ్రత్తలు తీసుకొని వారికి సంపూర్ణంగా విద్యను నేర్చుకునే విధంగా శ్రద్ధ తీసుకొని శిక్షణ ఇచ్చేవాడే నిజమైన శిక్షకుడు.

**పరివ్రాజకుడు:** మోక్షార్థియై అనేక ప్రదేశాలలో తిరుగుతూ బ్రహ్మ జ్ఞానాన్ని ప్రబోధించేవారు. వీరు పరివ్రాజకులుగా లెక్కింపబడ్డారు. (రామాయణ అరణ్యకాండలోని ఆశ్రమాలు - శ్రీరాముని దర్శనాలు – డా. సూర్య ధనంజయ్)

## 5. రామాయణంలో గురుశిష్యులు :

ఇక త్రేతాయుగం కాలంనాటి కథ రామాయణం. అందించిన ఆ మహాకవి మహర్షి వాల్మీకి '**జాతే జగతి వాల్మీకౌ కవిరిత్యభిధా భవత్**' అని ప్రమాణ వాక్యం.

ఆ ఆదికావ్యంలో రామలక్ష్మణులకు బల-అతిబల అనే విద్యలను బోధించిన గురువు విశ్వామిత్ర మహర్షి. రామలక్ష్మణులు దశరథ కుమారులు అనే ఇక్ష్వాకు వంశీయులు. ఇక్ష్వాకు వంశకుల గురువు వశిష్ఠుడు. వీరు వివిధ విద్యలను నేర్పించిన గురుశిష్యుల సంబంధాలను తెలుసుకుందాం.

## 5.1 గురువు - వశిష్ఠుడు :

ఇతను ఇక్ష్వాకు వంశానికి తరతరాలుగా గురువు. వశిష్ఠుడు దశరథ మహారాజు కుమారులు కౌసల్య పుత్రుడు శ్రీరాముడు, కైకేయి పుత్రుడు భరతుడు, సుమిత్ర పుత్రులు లక్ష్మణ, శత్రుఘ్నులను ప్రీతితో నామకరణం చేసి విద్యాబుద్ధులు నేర్పించాడు. వేదాలు, శాస్త్రాలు నేర్పించాడు. రామావతారం ప్రారంభం నుండి చివరి వరకు వశిష్ఠుడు గురు స్థానంలో ఉన్నాడు. (వాల్మీకి రామాయణము (సరళాంధ్ర వచనము) పార్ట్ -1, శ్రీమాన్ ఉత్పల వేంకట రంగాచార్యులు, బాలకాండము, పుట.34) వశిష్ఠుడు ఏనాడు వారి నుండి ఏ విధమైన గురుదక్షిణలు అడగలేదు. వారందరూ విద్యాబుద్ధులతో ఉండాలని కోరుకున్నాడు. వినయ విధేయతలతో ఉండాలని అనుకున్నాడు. సర్వజనహితంగా ఉండాలని ఆశించాడు. సద్గుణాలతో ఉండాలని, మానవుని జీవితం ఎలా వికసించాలో పెద్ద కుమారుడైన శ్రీరాముని ద్వారా లోకాన్నంతటికి తెలియజేయాలనే ఉద్దేశంతో చాటి చెప్పిన గురువు వశిష్ఠుడు కావడం వారి పూర్వజన్మ సుకృతంగా భావించారు. శిష్యుడు అనగా గురువు చేత శాసింపదగినవాడు. ప్రతి విద్యార్థి గురువు పట్ల గౌరవంగా మెదలాలి. గురువు చెప్పింది చాలా భక్తిశ్రద్ధలతో విని చెప్పింది చేయాలి. గురువుపై సంపూర్ణమైన ఆత్మవిశ్వాసంతో కలిగి ఉన్నప్పుడే అతడు గొప్పవాడు అవుతాడు. ఎలాంటి భేదాభిప్రాయాలు లేని గురు శిష్య బంధానికి వశిష్ఠుని గురుత్వం అందరికి ఆదర్శం.

## 5.2 గురువు - దశరథుడు :

దశరథమహారాజు తన నలుగురు కుమారుల చేతను, దేవతలచేతను, బ్రహ్మవలే మిక్కిలి ప్రీతి పాత్రుడైనాడు. వీరు ఎప్పుడు జ్ఞాన సంపన్నులు, సర్వగుణాలు కలిగిన వారు. శ్రీమంతులు, కీర్తిమంతులు, సర్వజ్ఞానులు దీర్ఘ దర్శినులయ్యారో వారి ప్రభావాలకు తండ్రి దశరథుడు లోకాదిప్తుడై గురువు వలె ధనుర్వేదం యుద్ధ విద్యలను దశరథ మహారాజు పర్యవేక్షణలో తన నలుగురు కుమారులు నేర్చుకున్నారు. (వాల్మీకి రామాయణము (సరళాంధ్రవచనము) పార్ట్-1, శ్రీమాన్ ఉత్పల వేంకట రంగాచార్యులు, బాలకాండము, పుట.35)

## 5.3 గురువు - విశ్వామిత్రుడు:

బ్రహ్మర్షి విశ్వామిత్రుడు దశరథ మహారాజును ఒప్పించి పద్నాలుగు, పదిహేను సంవత్సరాల వయస్సు నుండగానే యాగ సంరక్షణ పేరుతో శ్రీరాముడిని, లక్ష్మణులను వెంటబెట్టుకొని అడవికి తీసుకెళ్ళాడు.

సంచార విద్య బోధన పద్ధతితో అనేక ప్రదేశాలకు తీసుకెళ్లి చూపించాడు. వివిధ ఆశ్రమాలకు తీసుకెళ్లి చూపించాడు. వాటి పూర్వవృత్తాంతాలను సంపూర్ణంగా అర్థమయ్యే విధంగా వివరించాడు. తరగతి గదిలో గురువు చెప్పిన పాఠాన్ని శ్రద్ధగా వింటే పాఠ్యాంశంలోనే సారాంశంతో పాటు అందులోనున్న నీతిని గ్రహించి జ్ఞానాన్ని పెంపొందవచ్చు. అలాగే అనేక ప్రదేశాలు తిరుగుతే ఆ ప్రదేశాల గొప్పతనం తెలుసుకోవచ్చునని అందుకే ఒక రాజ్యాన్ని గాని, దేశాన్ని గాని పరిపాలించాలంటే నాయకుడనే వాడు నలు దిక్కులు ఎక్కడ ఏముందో తిరిగి తెలుసుకొని ఉండాలి. అప్పుడు మాత్రమే ఆ దేశాన్ని గాని మరేదైనా రాజ్యాన్ని పాలించడానికి తోడ్పడుతుంది. అక్కడి ధర్మాలు, న్యాయాలు ప్రజల్లో తిరిగి తెలుసుకొని ఉండాలి. అప్పుడే సరియైన పరిపాలనను అందించుతారు. విశ్వామిత్రుడు అనుభవంతో అనేక కోణాలు ఆలోచించి తిప్పాడు. రామునికి సరైన గురువైనాడు. స్త్రీ సంహారం అధర్మమైన తాటకి వంటి దుష్టస్త్రీలను శిక్షించడం తప్పు కాదని వివరించి చెప్పాడు. అహల్య వంటి ఆర్తులను ఆదుకోవడం పర్యటనలోనే సాధ్యమని చూపించి చెప్పాడు. తన అనుభవంతో పూర్వ జీవితంలోని గ్రహించిన తప్పొప్పులను బహిర్గతంగా తన మనసులో దాచకుండా చెప్పాడు. దీనిద్వారా దాపరికం లేని వ్యక్తిత్వ వికాసాన్ని బోధించాడు విశ్వామిత్రుడు. తెలియని ఎన్నో అస్త్ర విద్యలను శ్రీరామునికి బోధించి ఆదర్శ గురువైనాడు. (రాజాజీ రామాయణం, తమిళ మూలం శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాల చారి, అనువాదం: కె. శ్రీనివాసచారి పుట.4)

### 5.4 బల - అతిబల:

అయోధ్య దాటి ఒకటిన్నర ఆమడ దూరం వెళ్లిన తరువాత విశ్వామిత్రుడు రాజకుమారులను చూచి ''రామా'' అని కమ్మని కంఠంతో కమనీయంగా పిలిచాడు. ''ఆలసించక సరయూజలాలను ఆచమనం చెయ్యండి. మీకు బల, అతిబల అనే రెండు విద్యలు వస్తాయని చెప్పాడు. ఈ విద్యల వల్ల మీకు ఆకలి దప్పుల బాధలు ఉండవు. అలసట ఉండదు. జబ్బు చెయ్యదు. ముఖంలో శాంతి తరగదు. నిద్రపోయే సమయంలో కానీ, అజాగ్రత్తగా ఉన్నప్పుడు కానీ రాక్షసులు మిమ్మల్ని ఏమి చేయలేరు. ఈ భూమండలంలో బహుబలంలో మీకు సమానులు మరొకరు ఉండరు. ఈ రెండు విద్యలను మీరు పాటించినోళ్ళు సౌభాగ్యంలో, దాక్షిణ్యంలో, బుద్ధిబలంలో మాట నేర్పులో మీకు సరితూగే వాళ్ళు మరెవ్వరూ ఉండరు. సకల జ్ఞానానికి ఇవి ప్రసునాంబికలు. ఆకలి దప్పులను తొలగించే ఈ రహస్య విద్యలను గ్రహించండి.

సాక్షాత్తు బ్రహ్మ కన్న విద్యలివి. మీకు ఈ విద్యలను పొందే అర్హత పరిపూర్ణంగా ఉంది. అయినా నా తపస్సు కూడా ధారపోసి మీకీ విద్యలను ఇస్తున్నాను. ఇవి మీకు బహు విధాలా ఉపకరిస్తాయి అని బలాతిబలలను గురించి పరిపరి విధాల ప్రశంసించి చెప్పాడు గురువు విశ్వామిత్రుడు. (అనుదిన రామాయణం - డా. ఇలపావులూరి పాండురంగారావు, బాలకాండ, పుట.27)

### 5.6 అస్త్రాలు:

రాముడు తాటకిని చంపిన తర్వాత విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు దివ్యాస్త్రాలను ఉపయోగించే విధానం చెప్తాడు. (దివ్యాస్త్రాలంటే అవి దేవతల అంశ కలిగిన అస్త్రాలు) అందులో కొన్ని దండచక్ర, కాలచక్ర, ఇంద్రచక్ర, శైవశాల, బ్రహ్మశిరాస్త్ర, వాయువ్యాస్త్ర ఇవి మొత్తం దాదాపు 46 అస్త్రాలు వీటిని శ్రీరాముడు తూర్పు దిక్కుకు చూస్తూ నేర్చుకున్నాడు. (రామాయణం - పూర్వగాథా లహరి -పురాణేతిహాస చారిత్రక వ్యక్తుల కథా కథన విశేషమాలిక, విక్టరీ పబ్లిషర్స్, ఎస్వీఎస్, 2009)

### 5.7 గురువు - వాల్మీకి :

వాల్మీకి మహర్షి ఆశ్రమంలో కుశలవులు పుట్టి పెరిగారు. వారికి చిన్నప్పటినుండే విద్యాబుద్ధులు నేర్పించాడు. సంగీతం సాహిత్యం కూడా వచ్చేటట్లు నేర్పించాడు. దానివల్ల వారిలో క్రమశిక్షణ పెరిగింది. తల్లిదండ్రులను గౌరవించాలని అనుకున్నారు. వారి విలువలను లోకానికి చాటి చెప్పారు. అందువల్లనే కుశలవులు ఇద్దరు అన్నదమ్ములు. అయోధ్యలోనున్న తండ్రి దగ్గరికి వెళ్లి మాట్లాడగలిగారు. తల్లిని అడవిలో వదిలిపెట్టిన విషయం తెలుసుకున్నారు. తండ్రితో యుద్ధం చేయడానికి సిద్ధపడ్డారు. తండ్రిపైన పగ ప్రతీకారంను వాల్మీకి మహర్షి బోధించిన విద్య వల్ల అవి అన్ని మర్చిపోయారు. వారి వ్యక్తిత్వంలో మార్పు తీసుకొచ్చాడు. నాటి నుండి నేటి వరకు ఉపాధ్యాయ వృత్తికి మరియు లోకానికి ఆదర్శవంతుడని చెప్పాలి.

### 5.8 గురువు - సూర్య భగవానుడు:

''ఉదయే బ్రహ్మ రూపశ్చ । మధ్యాహేతు మహేశ్వరః । అస్తకాలే స్వయం విష్ణు । త్రిమూర్తిశ్చ దివాకరః'' (101 సుపరిచిత శ్లోకాలు - సూరంపూడి సూర్యనారాయణ మూర్తి, పుట. 28)

సూర్య భగవానుడు ప్రత్యక్ష దైవం. మనకి వెలుగునీ, జ్ఞానాన్నీ, ఆరోగ్యాన్నీ ప్రసాదించే ఏకైక దైవం అని భావం.

''ఉ**దయకాలంలో బ్రహ్మ స్వరూపుడు గానూ, మధ్యాహ్న సమయంలో శివ స్వరూపుడు గానూ, సాయం సంధ్యలో విష్ణుమూర్తిగానూ, త్రిమూర్తి రూపంలో ఉన్న దైవమే సూర్య భగవానుడు**'' ఇతను ఇక్ష్వాకు వంశానికి మూలపురుషుడు. కర్మసాక్షి గలవాడు. గ్రహాధిపతి గలవాడు. సూర్యుడు తన కర్తవ్యాన్ని తాను సక్రమంగా ఆచరించి నిర్వర్తించేవాడు. హనుమంతుడు చిన్నప్పుడే పండు అనుకొని తనను మింగటానికి వచ్చాడు. (ఓ రామ నీ రామమెంతో రుచిరా (వ్యాస సంకలనం) - ఆచార్య టి. మోహన్‌సింగ్, పుటలు. 55, 56) అలా వచ్చి నోరు కాల్చుకున్నాడు. ఇతను చాలా త్యాగశీలి, కృషివలుడు, పట్టుదల గలవాడు అన్నిటికీ మించిన గొప్ప కార్యదీక్ష గలవాడు. ఇవి అన్నియు హనుమంతునిలో ఉన్నాయని గమనించిన సూర్య భగవానుడు ఉదయం నుంచి

అస్తమయం వరకు తనతో ఎగిరే శక్తిశాలి గలవాడైన హనుమంతుడికి అనేక విద్యాబుద్ధులు నేర్పించాడు. బుద్ధిమంతుడుగా మార్చాడు. ఇతరులతో ఎలా మాట్లాడాలో మంచి వక్తగా తీర్చిదిద్దాడు. మంచి పరిపాలనాదక్షుడుగా తయారు చేశాడు. ఒక మంచి కార్యసాధకుడుగా మంచి క్రమశిక్షణతో కూడిన విద్యార్థిగా తీర్చిదిద్దాడు. సూర్యుడు ఇదంతా సూర్య భగవానుడైన గురువర్యులకు మాత్రమే చెల్లుతుంది.

అంతేగాక హనుమంతుడు, సూర్యుడైన గురువుగారితో తూర్పు నుండి పడమరకు శక్తిని తెచ్చుకొని ఎక్కడ ఆగకుండా సముద్రం దాటి లంకకు వెళ్లగలిగాడు. అక్కడ సీత యొక్క యోగక్షేమాలు అడిగి తెలుసుకున్నాడు. శ్రీరామునితో ఆ విషయాలు అన్ని తెలియజేశాడు. ఇదంతా గురువుగారి వల్లనే జరిగింది. బాల్యంలో గురువు దగ్గర నేర్చుకున్న విద్య యొక్క ప్రభావం పెరిగిన తర్వాత విద్యార్థిపై తప్పనిసరిగా వారి భావి జీవితంపై తప్పకుండా ఉంటుంది అనడానికి ఈ గురుశిష్యుల సంబంధమే ఉదాహరణ. వివిధ శాస్త్రాల పరిజ్ఞానంలో ఈతడిని ఓడించగలిగేవాడు ఈ జగత్తులోనే ఉండడు అని అన్నాడు. సూర్యుడు హనుమంతునికి ఎన్నో వ్యాకరణాలు నేర్పించి బుద్ధిశాలిగా తీర్చిదిద్దాడు. గురువు సూర్య భగవానుడు.

### 5.9 గురువు - అగస్త్యుడు:

రామాయణంలో రాక్షసుల బారి నుండి మునులను రక్షించిన మహా సంపన్నుడు. రామునికి అనేక శస్త్రాస్త్ర విద్యలను అనుగ్రహించిన గురువు. సూర్యచంద్రుల మార్గానికి అవరోధం కలిగించిన వింధ్యా పర్వత గర్వాన్ని అణచివేసిన తేజశ్శాలి. సత్పురుషుడు సత్పురుషులకు మేలు చేయడంలో ఆసక్తి కలవాడు. అందరిచే పూజింపబడే వాడు కనుకనే శ్రీరాముడు అగస్త్యుని దర్శించడానికి ముందు లక్ష్మణుడు అగస్త్యుడు శిష్యునితో పలికిన పలుకులు ఉదాత్తమైనవి. ఆశ్రమంలోనికి ప్రవేశించిన శ్రీరాముణ్ణి అగ్ని గృహంలోని అగస్త్యుడు శిష్య సమేతుడై ఎదుర్కోవడం జరిగింది. ఇంకా అగస్త్యుడు శ్రీరామునికి అనేక ధర్మ సూక్తులు కూడా వివరించిన గురువు. (రాజాజీ రామాయణం, తమిళ మూలం శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాల చారి, అనువాదం : కె. శ్రీనివాసచారి పుట.21)

### 5.10 అష్టావక్రుడు :

ఇతను గొప్ప ఋషులలో ఒకరు. తల్లి కడుపులో ఉండగానే ఎన్నో శాస్త్రాలను అలవోకగా నేర్చుకున్న మహాజ్ఞాని. జనక మహారాజుకు యాజ్ఞవల్కుడికి ఈయన గురువు. (మన మహర్షులు అష్టావక్ర మహర్షి తెలుగు వికీపీడియా)

## 6. నేడు గురుశిష్యుల సంబంధాలు :

రామాయణంలో నేటి కాలంలో ప్రపంచీకరణ ప్రభావం ఉంది. అందుకనే పాఠ్యప్రణాళికలో ప్రతిస్థాయిలోను రామాయణ కథ గురుశిష్యుల సంబంధ రూపంగా బోధించడం చాలా అత్యవసరం. గురుశిష్య సంబంధాలే ఉపనిషత్తులు, వేదాలు, శాస్త్రాలు, రామాయణ భారతాది ఇతిహాసాలు, కావ్య నాటకాలు, ఆధునిక

సాహిత్య గ్రంథాలు బోధించే మానవీయా విలువలతో గురుశిష్య సంబంధం అనే కోణం శ్రేష్టమైనది. నేడు కాలంతోపాటు విద్యా వ్యవస్థలో మార్పులు వచ్చాయి. దీనికి పైన చెప్పినట్లుగా ప్రపంచీకరణ ప్రభావం కూడాను. గురుశిష్యుల సంబంధాన్ని నిలబెట్టుకోవాల్సిన అవసరం తెలుగు బోధించే గురుస్థానం ఉన్న ప్రతి ఒక్కరిదిగా భావించాలి.

## 7. ముగింపు:

గురువును ఆరాధించడం వల్ల శిష్యునికి ఏకాగ్రత లభిస్తుంది. వారిని సేవించడం వల్ల అతడికి సర్వం సిద్ధిస్తుంది. గురుకృప వల్లనే శిష్యులకు సదాచారం, సద్వివేకం, వైరాగ్యం, భక్తి, ముక్తి లభిస్తాయి. ప్రశాంతత, ఓర్పు, క్రమం మొదలగు సద్గుణాలను కలిగిన గురువు శిష్యవత్సలుడై తన కృపను ఎల్లప్పుడూ శిష్యులపై వర్షిస్తూనే ఉంటాడు. బుద్ధి అనే అరణ్యం నుంచి, ఇంద్రియ జ్ఞానం నుంచి మనిష్యుణ్ణి గురువే బయటకు తీసుకుని వెళ్ళగలడని ఉపనిషత్తులన్న దానిలో అతిశయోక్తి లేదు. గురు శిష్యులకు ఎప్పుడైతే బంధుత్వం ఏర్పడుతుందో అప్పుడే గురువు పట్ల శిష్యుడికి ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. గురువు చెప్పింది అర్థం అవుతుంది. ఎప్పుడైతే గురువుపై శిష్యుడు శ్రద్ధ చూపిస్తాడో అప్పుడు గురువు శ్రద్ధ తీసుకొని ఇంకా బాగా చెప్పగలడు. ఈ విషయాలన్నీ రామాయణంలో వివిధ సన్నివేశాల్లో అభివ్యక్తమవుతాయి. విద్యార్థులకు రామాయణ కథ తెలియడంతో పాటు గురుశిష్యుల మధ్యనును అభిమానం దృష్టాంత పూర్వకంగా తెలియాలి. రామాయణంలో ప్రముఖులైన గురువుల పరిచయంతో భారతీయ విద్యా విధానంలో గురువు యొక్క గొప్పతనాన్ని తెలుసుకున్నాం. గురువులను గౌరవించుదాం. వారి ఆశీస్సులతో అన్ని రంగాలలో అభివృద్ధి సాధించుదాం. ముందుకు వెళ్దాం.

## 8. ఉపయుక్తగ్రంథసూచి:


1. ఎస్వీ.ఎన్. విక్టరీపబ్లిషర్స్, రామాయణ పూర్వగాథాలహరి - పురాణేతిహాస చారిత్రక వ్యక్తుల కథనవిశేషమాలిక. విక్టరీ పబ్లికేషన్స్, విజయవాడ, 2009.
2. పాండురంగారావు, ఇలపావులూరి. అనుదినరామాయణం (బాలకాండ). పొట్టిశ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయం, హైదరాబాదు, 1992.
3. మోహన్ సింగ్, టి. ఓరామ నీనామమెంతో రుచిరా (వ్యాససంకలనం). భక్తిసాహిత్యపరిశోధనాకేంద్రము, హైదరాబాదు, 2006.
4. వేంకటరంగాచార్యులు, ఉత్పల. వాల్మీకి రామాయణము - బాలకాండము (సరళాంధ్ర వచనము),. ఠాగూర్ పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు, 1999.
5. శ్రీనివాసాచారి, కె. రాజాజీ రామాయణం (అనువాదం). వ్యాసభారతి ప్రచురణాలయం, హైదరాబాదు, 1993.
6. సూర్యనారాయణమూర్తి, సూరంపూడి. 101 సుపరిచిత శ్లోకాలు. గాయత్రి గ్రాఫిక్స్ పాయింట్, హైదరాబాదు, 2011.
7. సూర్యా ధనంజయ్, అరణ్యకాండలోని ఆశ్రమాలు - శ్రీరాముని దర్శనాలు. శీతల్ పబ్లికేషన్స్, హైదరాబాదు, 2009.


AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_13.php

# "కమనీయం తెలుగు రామాయణం"

### జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

## 13. తెలుగునాట రంగనాథ రామాయణప్రభావం

**డా. గోపవరం పద్మప్రియ**
తెలుగు అధ్యాపకులు,
పి.ఆర్.ఆర్. & వి.యస్. ప్రభుత్వ కళాశాల,
విడవలూరు, శ్రీ పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.
సెల్: +91 9177355538. Email: gpppadma@gmail.com

**వ్యాససంగ్రహం:**

*విలక్షణ రీతిలో రచించబడిన రంగనాథ రామాయణం తెలుగులో తొట్ట తొలి రామాయణం. తెలుగునాట బహుళ ప్రచారంలో ఉన్న రామాయణ సంబంధ గాథలను ఆలంబనగా చేసుకుని, వాల్మీకి రామాయణాన్ని మాతృకగా స్వీకరించి గోన బుద్ధారెడ్డి రంగనాథ రామాయణాన్ని రచించాడు. ఈ విధంగా ప్రజలకు చేరువైన గాథలను తన రామాయణంలో నిక్షిప్తము చేసి తన రచనను బహుళ ప్రచారంలోకి తేవడంలో గోన బుద్ధారెడ్డి సఫలీకృతుడయ్యాడు. ఈ క్రమంలోని రామాయణ సంబంధ జానపద ఐతిహ్యాలకు కావ్య గౌరవం కలిగించాడు. వీరి రామాయణ ప్రభావము తెలుగుప్రజలపై నేటికీ ఉన్నదని ఈ వ్యాసంలో నిరూపించదలచాను. రంగనాథ రామాయణాన్ని, వాల్మీకి రామాయణాన్ని ప్రాథమిక వనరులుగా స్వీకరించి తెలుగులో వెలువడిన రామాయణాలను, తెలుగులో నిర్మించబడిన రామాయణ సంబంధ చలనచిత్రాలను, తెలుగునాట నేటికీ జన వ్యవహారంలో విస్తరించిన రామాయణ సంబంధ అంశాలను ద్వితీయ వనరులుగా స్వీకరించి విశ్లేషణాత్మక, తులనాత్మక పద్ధతులను ఉపయోగించి నేను నా పరిశోధన వ్యాసాన్ని రాయదలచాను. రంగనాథ రామాయణము పైన విశ్వవిద్యాలయాల పరిధిలో ఎన్నో పరిశోధనలు వెలువడ్డాయి. వాటిలో కొన్ని వాల్మీకి రంగనాథ రామాయణం తులనాత్మక పరిశీలన - వి. సూర్యకాంతం, రంగనాథ భాస్కర రామాయణాల తారతమ్య పరిశీలన - ఎన్. వసుంధరాదేవి, రంగనాథ రామాయణంలో జానపద విజ్ఞానాంశాలు ఒక పరిశీలన - బి.ఎన్. శ్రీరాములు, రంగనాథ రామాయణము అనుశీలనము - ఎస్. వెంకమాంబ.*

**Keywords:** గోనబుద్ధారెడ్డి, రంగనాథరామాయణం, అవాల్మీకాంశాలు, ఐతిహ్యాలు, జానపద గేయాలు.

## 1. ఉపోద్ఘాతం:

ప్రాచీన తెలుగు సాహిత్యచరిత్రను పరిశీలిస్తే కవిత్వంలో మార్గకవిత, దేశికవిత అనే విభాగాలున్నట్లు తెలుస్తుంది. సంస్కృతపురాణేతిహాస సంబంధమైన ఇతివృత్తాన్ని అనుకరించడం, సంస్కృతపదభూయిష్ఠ పదజాలాన్ని ప్రయోగించడం, సంస్కృతఛందస్సును అనుకరించడమనేవి మార్గకవితలక్షణాలు. ఇతివృత్తము, భాష,

ఛందస్సు దేశీయాలై ఉండమనేవి దేశి కవిత లక్షణాలు. ఈ రెంటిలో మొదటగా పుట్టింది దేశి కవితే అయినప్పటికీ, కాలక్రమంలో పండిత వర్గం చేత మార్గ కవిత్వానికి ఆదరణ లభించగా, తత్సమ, తద్భవ పదజాలంతో కఠిన శైలిలో కావ్య రచన చేసి ప్రౌఢ కావ్యాలను, ప్రబంధాలను రచించిన కవులు మహాకవులుగా వాసికెక్కారు. ఇలా సాహిత్యంలో దేశి కవిత కన్నా, మార్గ కవిత మిన్నా! అన్న పేరు స్థిరపడింది. ఈ క్రమంలోనే దేశి కవితలో కావ్యాన్ని రచిస్తే పండితులు హర్షించే పరిస్థితి గోనబుద్ధారెడ్డి కాలంలో లేదు. ఒకవేళ మార్గ కవితా మార్గంలో రచన చేస్తే దానిని పండితులు మెచ్చుకున్నా, సాధారణ ప్రజలు ఆదరిస్తారని చెప్పలేము. బహుశా ఈ రెండు కారణాలను అనుసరించే గోనబుద్ధారెడ్డి మార్గ కవితను, దేశి కవితను సమన్వయ పరుస్తూ సంస్కృతేతిహాసమైన రామాయణాన్ని ఇతివృత్తంగా స్వీకరించి, సమయానుకూలంగా సంస్కృత పదాలను, తేట తెలుగు పదాలను ప్రయోగిస్తూ, దేశి ఛందస్సయిన ద్విపదలో రంగనాథ రామాయణాన్ని రచించి అటు పండితులను, ఇటు సాధారణ ప్రజలను తన వైపు తిప్పుకొని ఉంటాడు. ఇక తెలుగునాట ప్రచారంలో ఉన్న రామాయణ సంబంధ ఐతిహ్యాలను తన రామాయణంలో చేర్చి, జానపద ఐతిహ్యాలకు కావ్య గౌరవం కలిగించి, ఇది మా రామాయణమే! అని ప్రజలు భావించేలా అనేకానేక కల్పనలతో కల్పనలవృక్షం లాగా రామాయణాన్ని తీర్చిదిద్దాడు. నేటికీ ఈ రంగనాథ రామాయణంలో గల కల్పిత గాథలే వాస్తవంగా జరిగాయని తెలుగునాట విశ్వసిస్తారంటే అతిశయోక్తి కాదు. ఇలా వాల్మీకి రామాయణాన్ని మరిపించే విధంగా తెలుగునాట రంగనాథ రామాయణం చూపిన ప్రభావాన్ని పరిశీలిద్దాం.

## 2. అహల్య :

వాల్మీకి రామాయణం బాలకాండలో అహల్య శాప వృత్తాంతములో గౌతముడు అహల్యను శపించిన విధము:

**తథా శప్త్వా స వై శక్రమ్ అహల్యమపి శప్తవాన్ ఇహ**
**వర్షసహస్రాణి బహూని త్వం నివత్స్యసి వాయుభక్షా**
**నిరాహారా తప్యంతీ భస్మశాయినీ అదృశ్యా**
**సర్వభూతానామ్ ఆశ్రమేస్మిన్ నివత్స్యసి** (వాల్మీకి రామా, బాల, 49వ సర్గ, 29,30 వ శ్లోకాలు)

వేలకొలది సంవత్సరములు నీవు అన్నపానాదులు లేక వాయుభక్షణముతో తపించుచు ఈ ఆశ్రమునందే పడియుందువు. భస్మశాయినివై ఎవ్వరికీ కనపడకుండా ఉండెదవు అని అంటాడు. ఇక వాల్మీకి రామాయణం బాలకాండము అహల్య శాప విముక్తి ఘట్టములో

**మధ్యేంభసో దురాధర్షాం దీప్తాం సూర్యప్రభా మివ సా హి**
**గౌతమవాక్యేన దుర్నిరీక్ష్యా బభూవ హ**
**త్రయాణామసి లోకానాం యాచద్రామస్య దర్శనమ్**
**శాపస్యాంతముపాగమ్య తేషాం దర్శన మాగతా** (వాల్మీకి రామా, బాల, 49వ సర్గ, 15-16)

శ్రీరాముడు వాయుభక్షణాది కఠోర దీక్షతో కూడి, తపః ప్రభావమున కాంతిమయముగా ఉన్న ఆ మహాత్మురాలిని

(అహల్యాదేవిని) చూచెను. సృష్టికర్త అయిన బ్రహ్మచే ప్రయత్న పూర్వకముగా నిర్మించబడిన ఆమె స్వరూపము దివ్యమై, మాయామయమై ఒప్పుచుండెను. వృక్షములచే, పుష్పములచే కప్పబడిన ఆమె మంచు చేతను, మేఘముల చేతను ఆవరించబడిన పూర్ణ చంద్ర ప్రభ వలె విలసిల్లుచుండెను. ఇంకనూ ఆమె నీళ్లలో ప్రతిబింబించుచున్న సూర్యకాంతుల వలెను, పొగచే కప్పబడిన అగ్ని తేజస్సువలెను తేజరిల్లుచుండెను. గౌతమముని ప్రభావము వలన ఆ అహల్య మానవులకు గాని, కడకు సురాసురులకు గాని దుర్నిరీక్ష్యయై యుండెను. గౌతమ మహర్షి యొక్క శాప వచన ప్రభావముచే ఆమెకు శ్రీరాముని దర్శనమగు వరకును ముల్లోకములకును ఆమె దుర్నిరీక్ష్యయై యుండెను. శ్రీరాముని దర్శనమైనంతనే ఆమెకు శాప విముక్తి కల్గెను, పిమ్మట వారికి కనబడెను. దీనిని బట్టి వాల్మీకి రామాయణంలో అహల్య ఎవరి కంటికి కనబడకుండా దుర్నిరీక్ష్యయై ఉంటుందని అర్థమవుతుంది.

ఇందుకు భిన్నముగా రంగనాథ రామాయణంలో గౌతమ మహర్షి అహల్యను పాషాణమై పడి యుండు మీవు అని అంటాడు.

**కరముగ్రమగు నెండ గాలి పెంధూళి**
**బొరలుచు నెందును బొడ గాన బడక** (రంగనాథ రామాయణం, పుట 49)

అని శపించగా, అహల్యయే శాప విమోచన మార్గము చెప్పమని తన భర్త గౌతమ మహర్షిని ప్రార్థించగా,

**వైకుంఠధాముడవాస్తకాముండు లోక రక్షణ కళాలోల చిత్తుండు**
**రాముడై వచ్చి పురాణపూరుషుడు భూమిపై జన్మించి పొగడు దీపించి**
**చనుదెంచి కౌశికు జన్నంబు గాచి యినకులాధీశ్వరుడీ త్రోవ వచ్చి**
**తొలగి పోవక నిన్ను ద్రొక్కిన జాలు జలజలోచన నీదు శాపంబు దీఱు** (రంగ. రామా, పుట 49)

అని అంటాడు. దీనిని బట్టి లోక రక్షణ నిమిత్తము, శ్రీమహావిష్ణువు అంశతో పురాణ పురుషుడైన శ్రీరామచంద్రునిగా భూమిపై అవతరించి విశ్వామిత్రుని యాగ సంరక్షణ కొరకు బయలుదేరిన సమయంలో ఈ ఆశ్రమాన్ని సందర్శించి రాతిగా నున్న నిన్ను త్రొక్కిన వెంటనే నీ శాపము తొలగుతుంది అని అంటాడు. ఇలా అహల్య రాతి రూపంలో పడి ఉండడం అనే వృత్తాంతము రంగనాథ రామాయణంలో కనిపిస్తుంది. తెలుగునాట రాతిని నాతిగా చేసినవాడు రామచంద్రుడు అని అంటారు. ఇది తెలుగు ప్రజల హృదయాలలో బలంగా నాటుకుని పోయిన అంశము. అంతేకాక తదనంతర కాలంలో రామాయణ రచన చేసిన మొల్లమాంబ సైతం గుహుని నోట-

**సుడిగొని రామపాదములు సోకిన ధూళి వహించి రాయి యే**
**ర్పడ ఒక కాంత యయ్యెనట, పన్నగ నీతని పాదరేణు లి**
**య్యెడ వడి నోడ సోక నిది ఎట్లగునో యని సంశయాత్ముడై**
**కడిగె గుహుండు రామపదకంజయుగంబు శుభంబు పెంపునన్**. (మొల్ల రామా, అయోధ్య. 32)

అని పలికిస్తుంది. నీ పాదము సోకి రాతిగా నున్న అహల్య నాతిగా మారింది. ఇప్పుడు నీ పాదం సోకితే నా లాభం ఏమవుతుందో అని గుగుడు సందేహపడి, ఎందుకైనా మంచిదని ముందుగా రాముని పాదపద్మాలను కడిగి ఆ తర్వాతే తన నావలోకి ఎక్కించుకున్నాడు. దీనిని బట్టి గోన బుద్ధారెడ్డి కల్పనాప్రభావం మొల్ల రామాయణంలో కూడా

కనబడుతుంది. ఇక ఆధునికకాలంలో కూడా ఈ కల్పనను గ్రహించిన బాపు తన సంపూర్ణ రామాయణంలో గుహుడికి, రామయ తండ్రి, ఓ రామయ తండ్రి...... అనే చక్కని పాట పెట్టారు. ఆ పాట రాసింది కొసరాజు. అందులో-

**నీ కాలు దుమ్ము సోకి రాయి ఆడది అయనాదంట**
**నా నావ మీద కాలుపెడితే ఏమవుతాదో తంట**
**దయచూపి ఒక్కమారు కాళ్ళు కడగనీయమంట**
**మూడు మూర్తులా నీవు నారాయణమూర్తి వంట**
**రామయ తండ్రి, ఓ రామయ తండ్రి......**

ఈ పాటను బట్టి రామ పాదధూళి తాకి రాతి నాతి అయిందని తెలుస్తుంది. ఈ విధంగా ఆధునిక కాలంలో చలనచిత్రాలలో కూడా గోనబుద్ధారెడ్డి కల్పనను స్వీకరించడం జరిగింది. ఈ విధంగా సుదీర్ఘకాలం నిలబడిన కల్పన ఇది. అంతేకాక నేటికీ తెలుగు నాట ప్రజల్లో అహల్య రాయిగా మారినదనే తెలుసు.

### 3. మంథర :

వాల్మీకి రామాయణం అయోధ్యకాండలో ఏడవ సర్గ కైకయికి మంథర దుర్బోధ ఘట్టాన్ని అనుసరించి

**జ్ఞాతిదాసీ యతో జాతా కైకేయ్యాస్తు సహోషితా**

**ప్రాసాదం చంద్రసంకాశం ఆరురోహ యదృచ్ఛయా** (వాల్మీకి రామా, అయోధ్య, 7వ సర్గ, 1)

పుట్టింటి నుండి మెట్టినింటికి కైకేయి వచ్చునప్పుడు ఆమె వెంట వచ్చిన అరణపుదాసి మంథర. ఈమె పుట్టుపూర్వోత్తరములు తెలియరావని వాల్మీకములో రూఢముచేసిన శ్లోకం. అయోధ్య నగర మందలి రాజవీధులలో శ్రీరామ పట్టాభిషేక మహోత్సవాన్ని పురస్కరించుకుని కోలాహలం ఏర్పడగా ఆ విషయాన్ని గురించి శ్రీరాముని పెంచిన దాది ద్వారా తెలుసుకున్న మంథర అసూయతో దహించబడుచు కైకే ఈ వద్దకు వెళ్లి ఆమెకు దుర్బోధ చేసినదని వాల్మీకములో ఉన్నది. ఇందుకు భిన్నముగా రంగనాథ రామాయణంలో -

**పనివడి రాముడు బాల్యంబునందు**
**దన కాలువిఱిచిన తప్పు సాధింప**
**నిది నాకుదఱి యని యిచ్ఛజింతించి** (రంగనాథ రామాయణం, పుట 86)

రామలక్ష్మణులు బంతి ఆట ఆడుకుంటున్న సందర్భంలో కైకేయి దాసి మంథర అక్కడికి వచ్చి ఆటకు అడ్డుపడగా శ్రీరాముడు కోపగించుకుని చెండాడుటకు తాను పట్టుకున్న కర్రతో ఆమె కాలిపై కొట్టినట్లు, అప్పుడు ఆమె కాలు విరిగినట్లు వర్ణించబడింది. ఆ బాధతో, కోపముతో మంథర కైక దగ్గరికి వెళ్లి ఈ వృత్తాంతము చెప్పగా, కైక వెంటనే దశరథుని వద్దకు వెళ్లి శ్రీరాముని క్రమశిక్షణలో పెట్టించుటకు విద్యాభ్యాసము ఆవశ్యకమని అందుకు తగిన ఏర్పాట్లు చేపించినట్లు తెలుస్తుంది. బహుశా తర్వాతి కాలంలో రాముని పట్టాభిషేకాన్ని భంగము చేయడానికి కైకేయిని మంథర పురికొల్పటానికి ఒక బలమైన కారణాన్ని చూపడానికి గోనబుద్ధారెడ్డి ఇలాంటి కల్పన చేసి ఉంటాడు. సాధారణంగా ఇంట్లో పిల్లలు ఆటపాటల్లో పడి అల్లర్లు, ఆగడాలు చేస్తున్న విషయాన్ని గుర్తించిన తల్లులు

వారి ఆగడాలను భరించలేమని భర్తలతో తెలిపి, వారిని దారిలో పెట్టడానికి పాఠశాలలో చేర్పించమనడం. మనం గమనించవచ్చు. అనుభవసిద్ధమైనటువంటి అంశాన్ని గోనబుద్ధారెడ్డి శ్రీరాముని బాల్య క్రీడల్లో చొప్పించడం అతని లౌకిక ప్రజ్ఞకు ప్రత్యక్ష నిదర్శనం. ఈ విధమైనటువంటి కల్పన ముందు చెప్పుకున్నట్లుగా కైకేయిని మంథర పురికొల్పటానికి ఒక బలమైన కారణాన్ని చూపడానికి చేసి ఉండవచ్చు. ఈ కల్పన కూడా ప్రజల్లో నేటికీ విస్తరించి ఉంది. యదార్థ దృష్టితో చూసినప్పుడు వాల్మీకి చెప్పినట్లు కేవలం అసూయతో మంథర ఇంతటి క్రౌర్యానికి ఒడిగట్టిందంటే నమ్మశక్యము కాదు. పాత పగ ఏదో మనసులో ఉన్నదనే సందేహము రాకమానదు. అందుకు తగినట్లుగానే సహజసిద్ధమైన మానవ స్వభావానికి దగ్గరగా బుద్ధారెడ్డి కల్పన ఉండడం చేత తెలుగునాట రాముడు బాల్యములో మంథర కాలు విరవగా, ఆ పగను సాధించాలని మంథర చేసిందని ప్రజలు విశ్వసిస్తారు.

### 4. ఊర్మిళాదేవి నిద్ర, లక్ష్మణ దేవర నవ్వు:

వాల్మీకి రామాయణంలో రాముడు, సీత నిద్రలో ఉండగా, లక్ష్మణుడు మేల్కొని వారిని కాపలా కాస్తున్నట్లు ఉంటుంది. అటువంటి లక్ష్మణుని చూచిన గుహుడు, సుమంత్రుడు నీవు కూడా నిద్రించు లక్ష్మణా! అని చెప్పగా, తాను నిద్ర పోకుండా అన్నా వదినలకు రక్షణగా నిలుస్తానని వారికి తెలుపుతాడు. కానీ, రంగనాథ రామాయణంలో, గుహున్ని కలుసుకున్న తరువాత, మా అన్న రాముని కాపాడుటకు 14 సంవత్సరాల పాటు పగలు రాత్రి నిద్రలేకుండా నియమంగా ఉండాలని లక్ష్మణుడు తన మనసులో ప్రతిన పూని, కొంత దూరంలో నిల్చుని ఉన్నాడు. అంతలో నిద్రాదేవి మాయా రూపంలో ప్రత్యక్షమైంది.

**యేను నిద్రాదేవి నేర్పడ దెల్పు మానాడు నింకెట్లు మానాధ్యయంత**
**విధి విధించెను వెంట వెంట వర్తింప విధమిదే నిన్ను నే విడుచుట కింక**
**అనిన నూర్మిళయందు నహరహంబులును జనియుండు మంత నీ సమయంబు దీర్చి**
**వచ్చిన గైకొందు వరుస నిన్నునిన, నిచ్చ నాగౌకంచు నేనిద్రయును**
**అలరుచు నీదేవతానుగ్రహంబు గలిగె నాకనుచు లక్ష్మణదేవుడుండె** (రంగనాథ రామాయణం, పుట 115)

లక్ష్మణా! విధి ప్రకారం నిన్ను నిద్రలోకి జారకుండా చేసి, నీ నిద్రను ఊర్మిలకు కలిగేలా చేస్తాను. ఆమెను ఆవహించి నిరంతరం నిద్రలోకి వెళ్లేలా ఆమె వెంట ఉంటాను. అని నిద్ర దేవి తన అనుగ్రహాన్ని లక్ష్మణుని పై చూపగా లక్ష్మణుడు ఎంతో సంతోషించాడు. ఇది ఊర్మిళాదేవి నిద్రగా జగత్ప్రసిద్ధమైనది. సరిగ్గా పదునాలుగు సంవత్సరాలు దాటాక, శ్రీరామచంద్రుని పట్టాభిషేక సమయంలో బంధుమిత్రుల సమక్షంలో శ్రీరామచంద్రుడు కొలువుదీరి ఉండగా, లక్ష్మణుడు ఫక్కుమని నవ్వగా, దానిని చూసిన వారందరూ తమను చూసే నవ్వాడేమో అని మనసులో అనుమాన పడుతున్న సందర్భంలో, శ్రీరాముడు లక్ష్మణున్ని చూస్తూ-

**దగవు వోడిచిన యాస్థానంబునందు నగు టేమి? నిష్కారణముగ సౌమిత్రి? అనవుడు భయమంది**
**ననవుడు భవమంది యా లక్ష్మణుండు తనకరంబులు మోడ్చి తగ విన్నవించె**
**వనవాసమునకు దేవరగొల్చి వచ్చి వనముల నున్నచో వచ్చె నీ నిద్ర.**
**వచ్చిన బదునాల్గువత్సరంబులును నచ్చుగా జేరకు మన నిద్ర సనియె**

**బదునాలుగేండ్లును బరగ నిండుటయు వదలక యిప్పుడు వచ్చె నా నిద్ర** (రంగ.రామాయణం, పుట 545)

ఎందుకు నవ్వావో వివరంగా చెప్పు లక్ష్మణ అని అనగా, లక్ష్మణుడు కొంత భయపడి నమస్కరించి పదునాలుగు సంవత్సరములు వనవాసం చేస్తున్న సమయంలో నా దరిచేరని ఈ నిద్ర ఇప్పుడు నీ పట్టాభిషేక సమయంలో నన్ను ఆవహిస్తుందని నవ్వాను అని అంటాడు. ఇది లక్ష్మణ దేవర నవ్వుగా జగత్ప్రసిద్ధమైనది.

లక్ష్మణ దేవరనవ్వు, లక్ష్మణనిద్ర ( ఊర్మిళాదేవి నిద్ర ) అనే జానపద కథలను రంగనాథ రామాయణంలో పేర్కొన్న బుద్ధారెడ్డి, ఆ రెంటికీ మూలంగా ఈ నిద్రాదేవి అనుగ్రహ ఘట్టాన్ని కథలో చేర్చాడు. లక్ష్మణుడు - నిద్రాదేవి సంభాషణ ఘట్టం వాల్మీకి రామాయణంలో లేదు. రంగనాథ రామాయణ కర్త గోన బుద్ధారెడ్డి నూతన కల్పన చేసి, జానపదుల మౌఖిక కథకు కావ్యం లో స్థానం కల్పించి కథాగమనానికి నూతన సొగసులద్దాడు. జానపదులలో ప్రచారంలో ఉన్న గాథకు కావ్యగౌరవం దక్కడం చేత ఈ రెండు కల్పనలు వాస్తవాలే అన్నంతగా ప్రజలలో చేరువయ్యాయి.

## 5. లక్ష్మణ రేఖలు :

వాల్మీకి రామాయణంలోని అరణ్యకాండలో 45వ సర్గలో హా సీతా! హా లక్ష్మణా! అను ఆక్రంద వచనములను విని, శ్రీరాముడు ఆపదలో చిక్కుబడినట్లు భావించి, సీతాదేవి కలత చెంది, శ్రీరామునకు సహాయపడుటకై వెళ్ళమని లక్ష్మణుని కోరిన సందర్భంలో అందులకు లక్ష్మణుడు సిద్ధపడకపోవడం వల్ల సీతమ్మ కూడా నీ మాటలు మాట్లాడి విధిలేక లక్ష్మణుడు రాముని కడకు బయలుదేరునట్లు చేయు సందర్భంలో-

**తతస్తు సీతాం అభివాద్య లక్ష్మణః కృతాంజలిః**
**కించిదభిప్రణమ్య చ అన్వీక్షమాణో బహుశశ్చ మైథిలీం**
**జగామ రామస్య సమీపమాత్మవాన్ -** (వాల్మీకి రామాయణం, అరణ్యకాండ, 45వ సర్గ, 40వ శ్లోకం)

సీతాదేవి మొండి వైఖరిని, ఆమె పలికిన తీవ్ర వచనములకును నోచుకొన్న లక్ష్మణుడు సీతమ్మకు నమస్కరించి ఒక ప్రక్కన నిలబడి, ఈమెను ఒంటరిగా ఇక్కడ విడిచి ఎలా వెళ్ళగలను అని తడబాటుపడుతూ పదే పదే ఆమె వైపు చూచుచు ఎట్టకేలకు మనస్సును దృఢపరుచుకుని శ్రీరాముని సమీపమునకు బయలుదేరాను. దీనిని బట్టి వాల్మీకములో లక్ష్మణుడు రాముని గూర్చి వెళ్తున్న సందర్భంలో సీతమ్మకు రక్షగా లక్ష్మణ రేఖలు గీసినట్లు లేదని తెలుస్తుంది. రంగనాథ రామాయణంలో మాత్రం సీతాదేవి మాటలకు నొచ్చుకున్న లక్ష్మణుడు -

**దల్లి యే నిదెపోయి తడయక నీదు వల్లభు గొనివత్తు వగవకు మనుచు**
**బర్ణశాలకు జుట్టు బరు లేదు వ్రాసి వర్ణించి యాబరులన్ వడి దాటకమ్మ**
**ఎవ్వడే నీబరులన్ వెస దాటివచ్చు నవ్వీరవరు తల లవియు నాక్షణమె -** (రంగ రామాయణం, పుట 170)

సీతాదేవి నోటి వెంట కూడని మాటలు విన్న లక్ష్మణుడు ఎంతో బాధపడి, చెవులు మూసుకుని, నలుదిక్కులు చూచి, పాపపు మాటలు పలుకుతున్న జానకితో నీ భర్తను తీసుకొస్తానని, నీవు ఏడవకు అని పలికి,

పర్ణశాల చుట్టూ 7 గీతలు గీసి, ఈ గీతలు దాటకమ్మా! అని ప్రార్థించాడు. ఈ గీతలు దాటి లోనికి వచ్చిన వాడెవడైనా తక్షణం తలపగిలి చస్తాడన్నాడు లక్ష్మణుడు సీతకు మ్రొక్కి, రాముని జాడ కోసం వెళ్ళాడు. ఈ లక్ష్మణ రేఖల ప్రస్తావన తెలుగు రామాయణాల్లో ప్రధానంగా కనిపిస్తుంది. ఈ కల్పనకు ఆద్యుడు గోనబుద్ధారెడ్డే! నేటికీ తెలుగునాట రామాయణంలో లక్ష్మణ రేఖల ప్రసక్తి లేదంటే, నమ్మరు. అంత బలంగా తెలుగు నాట గోనబుద్ధారెడ్డి కల్పన నాటుకుని పోయింది.

## 6. ఉడతా భక్తి :

రంగనాథ రామాయణం యుద్ధకాండలో కనిపించే ప్రశస్తమైన అవాల్మీకాంశాలలో ఒకటి ఉడతా భక్తి.

**పొందుగా లక్ష్మణ పొర్లదే చూడు ముందఱ నొకతరుమూషకం బెలమి**
**నామీద భక్తి యున్నత గతి బూని తా మేను జలముల దడిపి గట్టునకు**
**జని వేగ నిసుకపై జల్లాడి తిరుగ జనుదెంచి కొండలసందున రాల్చి** (రం.రామా, పుట 301)

ఒక ఉడుత రామసేతు నిర్మాణంలో భాగంగా సహాయము చేయదలచి శ్రీరామునకు కనబడే విధంగా సముద్రములో మునిగి తడిసిన శరీరంతో గట్టున ఇసుకలో పొర్లాడి, సేతుకు కట్టపైన ఆ ఇసుకను రాల్చినది. అదేవిధంగా చేస్తూ, పలుమార్లు ఇసుకనురాల్చగా శ్రీరాముడు ఆ చేష్టలను గమనించి లక్ష్మణునికి ఆ ఉడతను చూపి ఆనందించాడు. అప్పుడు శ్రీరాముని ఆనతితో సుగ్రీవుడు ఆ ఉడతను తెచ్చి శ్రీరామునికి అందించగా, శ్రీరాముడు దానిని పలు విధాల పొగిడి కుడి చేతి వేళ్ళతో దువ్వాడు. అప్పుడు దాని వీపుపై మూడు రేఖలు ఏర్పడ్డాయి. ఇది మూల రామాయణంలో లేని గాథ గోనబుద్ధారెడ్డి స్వీయకల్పన. అనాదిగా ఈ కథ ప్రజల్లో ప్రచారంలో ఉంది.

## 7. ముగింపు:

ఇవి కాక సీతాదేవి వేదవతి అని ప్రతిపాదించడం, సులోచన వృత్తాంతము, కాలనేమి కథ, రావణుని ఉదరములో అమృత భాండము ఉండటం వంటి ప్రసిద్ధ ఐతిహ్యాలు రంగనాథ రామాయణంలోనివే! ఆధునిక కాలంలో ఈ రంగనాథ రామాయణానికి పీఠిక వ్రాస్తూ పింగళి లక్ష్మీకాంతం ఆంధ్రపురాణేతిహాసకర్తలలో నింతస్వేచ్ఛగా నూతన గాథాకల్పన చేసినకవి యింకొకడులేడని పేర్కొన్నారు. ఇటువంటి కల్పనలు మాత్రమే కాక రామేశ్వర శివలింగ స్థల పురాణాన్ని సైతం తన రామాయణంలో ఇమిడ్చి తన ప్రత్యేకతను చాటుకున్నాడు గోన బుద్ధారెడ్డి. ఈ విధంగా నాటికే జనవ్యవహారంలో ఉన్న కొన్ని జానపద గాథలను ఎంచుకొని నేర్పుగా రామాయణంలో చేర్చడం వల్ల రంగనాథ రామాయణం అజరామరమైంది. అయితే నేటికీ తెలుగునాట ప్రజలు ఇవన్నీ వాల్మీకి రామాయణంలో ఉన్నవని, అలాగే ఈ కల్పనలు కల్పనలు కాదని నిజంగా జరిగినవే అని విశ్వసిస్తారు.

## 8. ఉపయుక్తగ్రంథసూచి:


1. కృష్ణమాచార్యులు, యం. మరియు వెంకటరామయ్య, గోలి. శ్రీమద్రామాయణం, గీతాప్రెస్ ప్రచురణ, హైదరాబాదు, 2004.
2. పద్మకుమారి, ఎం. రంగనాథ, ఏకోజి రామాయణములు తులనాత్మక పరిశీలన, నవోదయ బుక్ హౌస్, హైదరాబాద్, 1999
3. ప్రభాకరశాస్త్రి, వేటూరి. రంగనాథరామాయణము, శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయపీఠము, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి, 2014
4. బుద్ధారెడ్డి, గోన. రంగనాథ రామాయణము (ద్విపద కావ్యము), రాయలు అండు కో పబ్లిషర్స్, కడప, 1949
5. వెంకమాంబ, సుంకర. రంగనాథ రామాయణము అనుశీలనము, డాక్టర్ సుంకర వెంకమాంబ, బళ్లారి, కర్ణాటక, 2002
6. రామలింగారెడ్డి, కట్టమంచి. పంచమి (రంగనాథ రామాయణాదికా వ్యాసములు), ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు, 1954


***



AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
ISSN: 2583-4797
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_14.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 14. పోతన భాగవతం: రామావతారం

**డా. నండూరి అనంతలక్ష్మి**
తెలుగు సహాయ ఆచార్యులు,
ప్రభుత్వ సిటీ కళాశాల, హైదరాబాదు,
హైదరాబాద్, తెలంగాణ.
సెల్: +91 9603987175. Email: alnanduri64@gmail.com

**వ్యాససంగ్రహం:**

*తపస్స్వాధ్యాయంలో మునిగిన మహర్షి వాల్మీకి హృదయంలో తలెత్తిన సద్గుణాల స్వరూపుడైన వ్యక్తి గురించి తెలుసుకోవాలెనన్న సందేహానికి "మహర్షే త్వం సమర్థోసి జ్ఞాతుమేవం విధమ్ నరమ్" అంటూ సవినయంగా అడిగిన ప్రశ్నకు సమాధానంగా దివ్యఋషి నారదుడు ఇక్ష్వాకువంశ రాజైన రాముడి యొక్క జీవితకథను వివరిస్తాడు.ఆ కథే శ్రీమద్రామాయణంగా వాల్మీకిచే విరచితమైనది.వాల్మీకి 24000 శ్లోకాలలో చెప్పిన శ్రీరామకథను పోతన భాగవతం లోని ద్వితీయ స్కంధంలో 18, నవమ స్కంధంలో 104 గద్య పద్యాలలో చెప్పాడు. "ఆ దశరథునకు సురప్రార్థితుండై పరబ్రహ్మమయుడైన హరి నాల్గు విధంబులైన శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్న నామంబుల నిజాంశ సంభూతుడై జన్మించె.తచ్చరిత్రంబు వాల్మీకి ప్రముఖులైన మునుల చేత వర్ణితంబైనది; యైనను జెప్పెద" అనిఅంటాడు పోతన. వాళ్ళు చెప్పినా కూడా నేను చెబుతాను అనడంలో శ్రీరామకథ మీద పోతనకు ఎంత అభిమానం, అభినివేశం ఉన్నదో, చెప్పాలనే పట్టుదల ఎంత బలంగా ఉన్నదో అర్థమవుతుంది. రామాయణంలోని వివిధ ఘట్టాలను వివరించిన విధానంలోని విశేషాల్ని, వైవిధ్యాల్ని, అలతి పదాలతో విస్తృతార్థాన్ని వివరించిన విధానాన్ని, కవి కనబరచిన అసమాన ప్రతిభను, శ్రీరాముని మూర్తీభవించిన ధర్మాన్ని, దయాగుణాన్ని, ఆదర్శ మానవుడిగా శ్రీరాముడిని దర్శింపజేయడంలో పోతన కనబరచిన నైపుణ్యాన్ని పరిచయం చేయడం ఈవ్యాస ప్రధాన ఉద్దేశం.*

**Keywords:** వాల్మీకి, శ్రీమద్రామాయణం, కాళిదాసు, రఘువంశం, పోతన, శ్రీమదాంధ్రభాగవతం, ఆదర్శజీవితం

## 1. ఉపోద్ఘాతం:

మహేశ్వరధ్యానంలో పోతన "**కించిదున్మీలిత లోచనుడై**" ఉండగా రామభద్రుడు సాక్షాత్కరించి మహాభాగవతాంధ్రీకరణ చేయమని ఆజ్ఞాపించాడు. "**శ్రీరామచంద్రుని సన్నిధానంబు కల్పించుకొని**" పోతన ఆంధ్రమహాభాగవత రచనకు ఉపక్రమించాడు. "**తెలియ వచ్చినంత తేటపరుతు**" అని, "**నే నందఱి మెప్పింతుఁ**

**గృతుల నయ్యెయెడలన్**" అని భాగవతానువాదంలో తన వినమ్రతను, విశ్వాసాన్ని ప్రకటించాడు. రాసేది కృష్ణలీలా విలాసాలు అయినా రాయించేవాడు రామభద్రుడవడం వలన రామకథను రాసే అవకాశం భాగవతంలో కలిగినందుకు మహదానందపడిపోయాడు.తన ముందు కవులెవ్వరూ తన పురాకృత శుభాధిక్యంవల్ల భాగవతాన్ని తెనిగించలేదని,దీనిని తాను **"శ్రీకైవల్యపదంబుఁ జేరుటకు**" రచిస్తున్నానని తెలిపాడు. "**కేళీలోల విలసద్ దృగ్జాల సంభూత నానాకంజాత భవాండ కుంభకున్**" - అంటూ నవమ స్కంధం లోని సూర్య చంద్ర వంశీయులైన రాజుల గాథలను అభివర్ణిస్తున్న సందర్భంలో రామావతార ప్రస్తావన కల్పించాడు పోతన. ఈ రామావతారంలో శ్రీరాముడిని ఆదర్శనీయుడైన మానవుడిగా తీర్చిదిద్దిన వైనం, వాల్మీకి రామాయణం అంతటినీ మహోక్లుప్తంగా, ముఖ్యఘట్టాలను అత్యంత ప్రతిభావంతంగా వివరించిన వైనం ఈ వ్యాసంలో ప్రధాన అంశాలు.

## 2. రామజననం, సీతారాముల వివాహం:

తూర్పు దిక్కునకు నిండు చంద్రుడు ఉదయించినట్లు సాధ్వి అయిన కౌసల్యకు "**మదాంధ రావణ శిరస్సంఘాత సంఛేదన క్రమణోద్దాముడైన శ్రీరామచంద్రుడు**"(3) నారాయణాంశతో జన్మించాడు. ఇనకులాధీశుడు సూర్యుడైనప్పటికీ ఆవంశంలో జన్మించిన రాముడు రామ'చంద్రుడు'గానే , వెన్నెలవంటి చల్లని సుఖసంతోషాలను కలిగించే దేవుడిగానే ప్రజల హృదయాలలో సుస్థిరమైనవాడు అన్న సూచన చేస్తూ, రావణుడి మదాంధాన్ని పారదోలటానికి చంద్రుడంత వెలుగు తప్ప సరిపోదు అన్నట్లు అవతార ప్రారంభంలోనే "**అమరేంద్రాశకు పూర్ణచంద్రుడుదితుండైనట్లు**" అంటూ శ్రీరాముడు షోడశకళాపూర్ణుడని తేటతెల్లపరిచాడు పోతన. విశ్వామిత్రుని యాగరక్షణార్థమై తండ్రి పంపించగా రాముడు తాటకను "అవలీలగా తునుమాడి", ఘోరయుద్ధంలో సుబాహుని సంహరించి, నీచుడైన, కపట మంజుల రోచుడైన మారీచుని తరిమాడు అని చెప్పడంలో బంగారులేడి వృత్తాంతాన్ని ముందుగానే సూచించినట్లైనది. మూడువందలమంది కదలించి తెచ్చిన శివధనుస్సును గున్నఏనుగు చెఱకుగడను విరిచిన విధంగా విరిచి లోకనాయకుడైన శ్రీరాముడు సుగుణాలప్రోవైన సీతను పెండ్లాడాడు.

"**భూతలనాథుడు రాముడు, ప్రీతుండై పెండ్లియాడెఁ బృథుగుణమణిసం**
**ఘాతన్ భాగ్యోపేతన్, సీతన్ ముఖకాంతివిజితసితఖద్యోతన్**"(4)

ఈ పద్యం ఉదహరించకుండా సీతారాముల వివాహఘట్టం ఏ కథకుడూ ముగించలేడు అన్నవిషయం మనందరికీ తెలిసిందే.

## 3. సీతారాముల అరణ్యవాసం:

దశరథుడు కైకకు వశుడై ఆమెకు ఇచ్చిన వరాలకు కట్టుబడి రామచంద్రుణ్ణి అడవికి పంపాడు.సీతాలక్ష్మణ సమేతుడైన రాముడు అయోధ్యను వదలి, అడవిని చేరి నగరాన్ని రాజసంపదలను వదలవలసివచ్చిన బాధ

ఎంతమాత్రమూ లేనివాడై "**తాపసోత్తమ శరణ్యము నుద్ధతబర్హిబర్హలావణ్యము గౌతమీవిమలవాఃకణ పర్యటన ప్రభూత సాద్గుణ్యము నుల్లసత్తరునికుంజవరేణ్యము**"(5) నైన దండకారణ్య సౌందర్యాన్ని చూసి ముగ్ధుడై అక్కడే పర్ణశాలలో నివసింపసాగాడు. తాపసోత్తములకు శరణ్యమైన అని అనడంలో పోతన అరణ్యంలో కూడా రాముడికి తాపసులనుండి విజ్ఞానాన్ని ఆర్జించాలనే కోరిక కలదని తెలియజేసారు.సీతారామలక్ష్మణులు కుటీరంలో ఉండగా "రతిఁగోరి వచ్చిన" శూర్పణఖ ముక్కును లక్ష్మణుడు కోసివేశాడు. ఇచ్చట "రతిఁగోరి" అని పోతన అనడం వలన శూర్పణఖ ముక్కుచెవులు లక్ష్మణుడు కోయడంలో తప్పులేదని చెప్పినట్లైనది. అది విని వచ్చిన పదునాల్గువేల ఖరదూషణాదులను శ్రీరాముడు సంహరించాడు.సీత చక్కదనాన్ని విని మన్మథపరవశుడైన రావణుడు పంపగా బంగారు లేడిగా కపటవేషాన్ని ధరించి వచ్చిన నీచుడైన మారీచుని వధించాడు.ఆ సమయంలో రావణుడు సీతను అపహరించుకొని పోయాడు."అన్యాయముచేసి నిష్కరుణుడై" రావణుడు సీతను అపహరించుకొని వెళ్ళేసమయంలో అడ్డుపడ్డ "రామనరేంద్ర కార్యదత్తాయువుఁ బక్షవేగ పరిహాసిత వాయువు" నైన జటాయువును రావణుడు వధించగా రామచంద్రుడు తన తండ్రి స్నేహితుడైన జటాయువుకు పరలోక క్రియలు చేశాడు.

## 4. సీతాన్వేషణ:

సీతాన్వేషణలో భాగంగా రామలక్ష్మణులు ఋష్యమూకం చేరారు."**లీలన్, గురునయశాలిన్, శీలిన్, సేవితశూలిన్, మాలిన్, వాలిన్,దశాస్యమానోన్మూలిన్**"(6) రాముడు ఒకేఒక్క బాణంతో కూల్చాడు అని చెప్పడంలో వాలిని సంహరించడం శ్రీరాముడికి ఒక లెక్క కాదన్నట్లుగా ధ్వనిస్తుంది.వాలి వధానంతరం సీతమ్మను వెదకడానికి ఆంజనేయుడిని నియోగించాడు రామచంద్రుడు.

రామబంటు ఆంజనేయుడు "సముద్రంపై దాటి, లంకనిరాతంకంబునం ప్రవేశించి,సీతంగని,తిరిగి చనుదెంచుచు నక్షకుమారాదుల వధియించి లంకాదహనంబు సేసి వచ్చి సీతాకథనంబు సెప్పి" న అని వివరించడంలో ఒక్క అంగలో,ఒక్క గుక్కలో కార్యాన్ని నెరవేర్చాడని స్ఫురిస్తున్నది.

## 5. వారధి నిర్మాణం:

సీతాదేవి వృత్తాంతం తెలుసుకున్న శ్రీరాముడు వానరసైన్యంతో లంకకు బయలుదేరి "**భూరివిధరత్నాగారమున్ మీనకుంభీరగ్రాహకఠోరమున్ విపులగంభీరంబు నభ్రభ్రమద్ఘోరాన్యోన్యవిభిన్న భంగ భవనిర్ఘోషచ్ఛటాంభఃకణ ప్రారుద్ధాంబరపారమున్**"(7) అయిన సముద్రం చెంతకు చేరుకున్నాడు.తనకు దారి ఇవ్వమని అడిగినా కూడా మిన్నకుండిన సముద్రునిపై కోపించి దాశరథి విల్లెక్కుపెట్టగా ఆ సముద్రం నత్తగుల్లలతో, నాచుతో, ముత్తెపుచిప్పలతో బీడుగా మారిపోతుంది. అప్పుడా సముద్రుడు వణికిపోయి రూపుగొని, నదులతో కలిసి

వచ్చి శ్రీరాముని శరణుజొచ్చి పలు విధాలా స్తుతించాడు. నీకీర్తి ఇనుమడించేటట్లుగా సముద్రంమీద సేతువు కట్టి,రాక్షసులను తుదముట్టించి, మంగళకరంగా నీ ఇల్లాలిని చేపట్టమని సముద్రుడు ప్రార్థించగా రామచంద్రుడు సముద్రుణ్ణి వెనుకటిలాగే ఉండమని పంపాడు.ఇక్కడ శ్రీరాముడికి జీవజాతులపట్ల ఉన్న దయాగుణం వ్యక్తమవుతుంది. వారధి బంధనం, లంకాప్రవేశం, వీభీషణ శరణాగతి జరిగిపోయాయి.

### 6. రావణ సంహారం:

లంకాపట్టణంలో యుద్ధం ప్రారంభమైంది.

" **ప్రాకారములు ద్రవ్వి పరిఖలు పూడిచి కోటకొమ్మలు నేలఁ గూలఁద్రోచి**
**వప్రంబు లగలించి వాకిళ్ల వెకలించి తలుపులు విఱిచి యంత్రములనెఱిచి**
**ఘనవిటంకంబులు ఖండించి పడవైచి గోపురంబులు నేలఁగూలఁదన్ని**
**మకరతోరణములు మహిఁగూల్చి కేతనంబులు సహించి సోపానములు గదల్చి**
**గృహములెల్ల వ్రచ్చి గృహరాజముల గ్రొచ్చి/ భర్మకుంభచయము పాఱవైచి**
**కరులు కొలనుసొచ్చి కలచినక్రైవడిఁ / కపులు లంకఁజొచ్చి కలచిరపుడు.**" (ఆం.భా.నవమ.290)

ఇచట క్త్వార్థాలను వెంటవెంటనే ఉపయోగించి వానరులు లంకాపట్టణాన్ని ఒక్క ఊపులో విధ్వంసం చేశారన్నట్లుగా మహాకవి పోతన వర్ణించాడు.వానరయోధులచే రాక్షసవీరులందరు నేలకూలగా లక్ష్మణుడు అతికాయుణ్ణి,మేఘనాథుణ్ణి మరియు రామచంద్రుడు కుంభకర్ణుడిని ఖండించారు.తనవారందరూ నేలకూలగా రావణుడు పుష్పక విమానమెక్కి రణరంగానికి రాగా, మాతలి తీసుకువచ్చిన దేవతారథాన్ని సూర్యుడు ఉదయాద్రినెక్కిన విధంగా రామవిభుడు ఎక్కాడు అని పోతన వర్ణించడంలో నిరాశ,నిస్పృహలకు లోనైన శ్రీరాముడికి ఆదిత్యహృదయం వినిపించి, శక్తిని,తేజస్సును,ఉత్సాహాన్ని ఇచ్చిన ఘట్టాన్ని గుర్తు చేస్తుంది. దివ్యరథారూఢుడైన రామచంద్రుడు "నాతో యుద్ధం చేయడమంటే నీచత్వంతో మరుగున ఉండి బంగారు లేడిని పంపడం, కపట బ్రాహ్మణుడివై కారడవి మధ్య ఒక అబలను మోసపుచ్చడం వంటిది కాద"ని అడగదలచినది మొహంమీద రావణుడిని అడిగేశాడు. "**నీవు చేసిన పాపాలకు యముడు అక్కరలేదు, నేను నిన్ను నా బాణాలతో ఖండిస్తాను**" అని శ్రీరాముడు రావణునితో చెప్పడంలో "**రామో విగ్రహవాన్ ధర్మః**" (8)అన్న వాల్మీకి ఉవాచ ఋజువైనట్లైనది. "వైరిదారజన గర్భస్రావణుడైన" రావణునిపైకి ప్రళయాగ్ని సన్నిభమైన బాణాన్ని దాశరథుడు ప్రయోగించగా దశకంఠుడు నేలకొరిగాడు.

రావణుని మరణ వార్త విని యుద్ధభూమికి వచ్చిన మండోదరి రావణుని చూచి విలపిస్తూ "**నిర్జరేంద్రాదుల గెల్చి నీవు కుసుమాస్త్రుని కోలల కోర్వలేక**"(9) అని అనడంలో మనసునధీనం చేసుకోని రావణుడు ఇంద్రుడిని గెలిచాడు కాని ఇంద్రియాలకు మాత్రం వశుడు అని స్ఫురిస్తున్నది.

**"ఎండఁగాయ వెఱచు నినుడు వెన్నెలఁగాయ**
**వెఱచు విధుడు గాలి వీవ వెఱచు**
**లంకమీద నిట్టి లంకాపురికి మాకు**
**నధిప విధవభావ మీరెవరైనా నేడు.**" (ఆం.భా. నవమ.309)

సీతను అపహరించడమే కాదు, పంచభూతాలనే పీడించిన రావణునిగా మనకు తెలుస్తుంది .రాముడు రావణసంహారం చేసిన కారణం ప్రధానంగా అదే అన్నది మనందరికి అవగతం చేయడం కవి ఉద్దేశం.

## 7. సీతారాముల సమాగమం:

విభీషణుడు రామచంద్రుని ఆజ్ఞతో రావణునకు దహన క్రియలు పూర్తి చేశాడు.శ్రీరాముడు సీతా సాధ్విని చూడటానికి అశోకవనానికి వెళ్లాడు. ఇది వాల్మీకంలో లేదు.చిరకాలం సీతావియోగంలో ఉన్న శ్రీరాముని వెంటనే శింశుపాతరు సమీపంలోని సీతమ్మను చూడటానికి పంపించేశాడు పోతున్న. **"భార్య వలన దోషంబు లేకుండుట వహ్నివలనం బ్రకటంబుసేసి**" అని అనడంలో అందరి ఆమోదంతో ఇల్లాలిని స్వీకరించినట్లయినది.

**"శోషితదానవుండు నృపసోముడు రాముడు రాక్షసేంద్ర తా**
**శేషవిభూతిఁ గల్ప సమజీవిని గమ్మని నిల్పె నర్థిసం**
**తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వదరోషణున్ మితా**
**భాషణు నార్యపోషణుఁ గృపాగుణభూషణు నవ్విభీషణున్**" (ఆం.భా.నవమ 314)

శత్రువుని తమ్ముడైనప్పటికీ యోగ్యతలనుబట్టి విభీషణుడుని లంకారాజ్యానికి రాజుగా ప్రతిష్ఠించి శ్రీరాముడు సీతాలక్ష్మణులతో, వానరశ్రేష్ఠులతో నందిగ్రామానికి బయలుదేరాడు.

## 8. శ్రీరాముడి అయోధ్యానగర పయనం:

పుష్పకారూఢుడై అయోధ్యకు బయలుదేరిన రామచంద్రుడు "**తొల్లి వచ్చిన తెరువు జాడలు సీతకు నెఱింగించుచు**" అని అనడంలో అరణ్యవాసాన్ని కూడా రాముడు ఆనందంగా గడిపాడని తెలియుచున్నది. రామచంద్రుని రాకతో ప్రజలందరు పండుగ చేసుకున్నారు. అంతకుముందే ఆ పట్టణంలోని పౌరులు నగరమంతా రకరకాల అలంకరణలు చేసి, తెలంగాణా సాంప్రదాయమైన పట్టువస్త్రాలతో అలంకరణ కావించి, గోడలమీద రామకథలను వ్రాయించి రామచంద్రునికి స్వాగతం పలికారు. ఆనాటికే ప్రజల హృదయాల్లో రాముడి గుణగణాలు, సింహాసనాధీశుడు కాకపోయినా రాజుగా తన బాధ్యతలను ఎంతో సమర్థవంతంగా నిర్వహించి, ప్రజలకు సురక్షితమైన జీవనాన్ని ప్రసాదించిన రాముడి "**ప్రజారంజక ధర్మం ఎంత సుస్థిర స్థానం ఏర్పరచుకుంది అని చెప్పడానికి నిదర్శనంగా ప్రజలు రామకథలను గోడలపై రాయించడం**" అనడంలో తెలియ చేసాడు పోతన. ఇక్కడ రాముడంటే ఆదర్శమానవుడు అన్న వాల్మీకి హృదయాన్ని ఆవిష్కరించడం చూస్తాం. "**వశిష్ఠుడు శ్రీరామచంద్రుని**

**జటాబంధంబు విడిపించి**"(10) అని అనడంలో కులగురువు ఇచ్చిన దీక్షను రాముడు ఎంత సమర్థవంతంగా నిర్వహించివచ్చి, గురుసమక్షంలో, గురువు చేతుల మీదుగానే ఆ దీక్షావిరమణాన్ని సుసంపన్నం చేసుకున్నాడు అన్న సూచన వ్యక్తమవుతుంది. అనంతరం శ్రీరాముడు "**కౌసల్యకుబ్రియంబు**" చేయుటకు రాజసింహాసనము నధిష్ఠించి రాజ్యపాలన చేయుచున్నాడు.

## 9. రాజుగా శ్రీరాముడు:

"**కలుగుటెల్లనుమానెఁ గంధు లేడింటికిఁ జలనంబుమానె భూచక్రమునకు**
**జాగరూకతమానె జలజలోచనునకు దీనభావముమానె దిక్పతులకు**
**మాసి యుండుటమానె మార్తాండవిధులకు,గావిరిమానె దిగ్గగనములకు**
**నుడిగిపోవుటమానె నుర్వీరుహంబుల కడఁగుటమానెఁ ద్రేతాగ్నులకును**
**గడిఁదిప్రేగుమానె గరిగిరికిటినాగ/ కమఠములకుఁబ్రజలకలఁక మానె**
**రామచంద్రవిభుడు రాజేంద్రరత్నంబు/ ధరణిభరణరేఖఁ దాల్చునపుడు**." (ఆం.భా.నవమ 333)

రామచంద్రుని పాలనలో సమస్త జగత్తంతా ఎంత నిశ్చింతగా ఉన్నది! తండ్రిలాగా రామచంద్రుడు కన్నతండ్రులను సైతం మరిపించి ప్రజలను కాపాడటంతో ప్రజలు రామచంద్రప్రభువే తమ తండ్రి అని తమ తండ్రులను మరచారు.

"**పితేవ పరితుష్యతి- సపితా పితరస్తా సాం కేవలంజన్మహేతవః**" (1.5 ప్రథమసర్గ)

అన్న కాళిదాస మాటకు స్ఫూర్తి ఇదే. "**రాజర్షిచరితుండు, నిజధర్మనిరతుండు, ఏకపత్నీవ్రతుండు,సర్వలోక సమ్మతుండు, ధర్మవిరోధము కాకుండా కోరికలనుభవించువాడు**" మొదలైన గుణాలతో రాముడు ఒప్పియున్నాడు. " **రెండు పుట్టంబులఁ దనకునైన,మెలత మంగళసూత్రంబు మినుకుదక్క**" (11)అన్ని ఆభరణాలను,సమస్త సంపదలను బ్రహ్మవేత్తలైన మునులకు దానంచేసి వినయంతో మెలిగాడు. ఇక్కడ జీవితమంతా ఋషి వంటి నిరాడంబర జీవితం గడిపిన రాముడు మనకు దర్శనమిస్తాడు. వాల్మీకి రామాయణంలో రాముడు '**విద్ధి మాం ఋషిభిస్తుల్యం కేవలం ధర్మమాస్థితమ్**' (12)అన్న మాటలకు ప్రతిధ్వని ఈభావం. ఆరామచంద్రుని పాలనలో చాంచల్యమనేది స్త్రీల వాలు చూపుల్లోను, పేదరికం అందగత్తెల నడుముల్లోను,కుటిలత్వం సుందరీమణుల కేశాల్లోను, మాంద్యమనేది ఆడవారి నడకల్లోను, పీడనమనేది స్త్రీల కౌగిళ్లలో మాత్రమే ఉండేదట.

## 10. సీతా వియోగం:

తన రాజ్యంలోని విశేషాలను స్వయంగా తెలుసుకోవడానికి శ్రీరాముడు మారువేషంలో తిరుగుతూ , ఒక్కనాడు ఒకడు భార్యతో పోట్లాడుతూ " పరాయి వాడింట్లో కాపురం చేసిన చంచలురాలిని ఏలుకోవడానికి నేనేమన్నా వెఱ్ఱిరాముడనా" అని కేకవేయడం విన్నాడు.లోకమంతా ఆ విషయమే చెప్పుకుంటోందని చారుల వలన

తెలుసుకున్న శ్రీరాముడు నిద్రపోతున్న సీతమ్మను వాల్మీకి ఆశ్రమంలో విడిచి రావలసిందిగా ఆజ్ఞాపించాడు.వాల్మీకి ఆశ్రమంలో జన్మించిన కుశలవులు వాల్మీకివలన వేదాది విద్యలలో నేర్పరులై ఒకరోజు శ్రీరామచంద్రుని యజ్ఞశాలకు వచ్చి, అక్కడున్న ప్రజలు ఆనందాబుధిలో ఓలలాడునట్లు రామకథాగానం చేశారు.

## 11. సీతమ్మ భూప్రవేశం:

మరుసటిరోజు సీతమ్మను వెంటబెట్టుకొని , కుశలవులను ముందుపెట్టుకొని వాల్మీకి మహర్షి శ్రీరాముని చెంతకు వచ్చాడు. సీతమ్మ పతివ్రత, పరిశుద్ధమైన నడవడిక కలది, పుణ్యాత్మురాలు, దూరం చేసుకోవద్దు అని హితవు పలకగా "**రామచంద్రుడు పుత్రార్థియై విచారింప కుశలవులను వాల్మీకికి నొప్పగించి, రామచంద్ర చరణ ధ్యానంబు సేయుచు నిరాశయై సీత భూవివరంబు సొచ్చె**". శ్రీరాముడు కొడుకులను కావాలనుకున్న భావాన్ని అర్థం చేసుకున్న తల్లి సీతమ్మ బిడ్డలను వాల్మీకికి అప్పగించి, రామపదధ్యానం చేస్తూ , నిరాశయై భూప్రవేశం చేసింది.ఆ తల్లి కష్టాలు ఇంకా తీరలేదని ఒక రామ భక్తునిగా పోతనలోని ఆవేదనే ఆ నిరాశగా వ్యక్తమయింది.

"**ముదితా యేటికిఁ గ్రుంకితీవు మనలో మోహంబు చింతింపవే**
**వదనాంభోజము సూపవే మృదువు నీ వాక్యంబు వన్నింపవే**
**తుది సేయం దగదంచు నీశ్వరుడునై దుఃఖించె భూపాలుడా**
**పద కాదే ప్రియురాలిఁ బాసినయెడన్ భావింప నెవ్వారికిన్**" (ఆం.భా.నవమ.357 )

వంశోద్ధరణ కోసం కుమారులను కావాలనుకున్నాడేకాని తాను భగవంతుడైనా ప్రియురాలి నిర్ణయానికి దుఃఖించాడు దాశరథి.అనంతరం బ్రహ్మచర్యాన్ని అవలంబించి, పదమూడువేల సంవత్సరాలు ఎడతెగకుండా అగ్నిహోత్రాలను ప్రవర్తిల్లచేసి,ఈశ్వరుడైన శ్రీరాముడు తన మొదటి స్థానమైన పరమపదానికి వెళ్లిపోయాడు.

## 12. ముగింపు:

ఆది దేవుడైన ఆ రామచంద్రునుకి సముద్రంపై సేతువు కట్టడం,రాక్షసులను చంపడం ఎంత పని? వానరుల సాయం ఏపాటిది? ఇతర దేవతలకు తన లీలలు చూపాడంతే.ఆ రామచంద్రునితో కలిసిమెలిసి తిరిగిన వారూ, తనివితీరా చూచినవారూ, ప్రేమతో తాకినవారూ అయిన ఆ కోసలదేశ ప్రజలు ఆది యోగులు పొందే సద్గతిని పొందారు.

" **మంతనములు సద్గతులకుఁ**
**బొంతనములు ఘనములైన పుణ్యముల కిదా**
**నీంతనపూర్వమహాఘని**
**కృంతనములు రామానామకృత చింతనముల్**." (ఆం.భా.నవమ.363)

ఇహాన్ని, పరాన్ని కూడా ప్రసాదించే దేవుడు రామచంద్రుడు. అందుకే ఆ శ్రీరామనామ సంస్మరణాలు సద్గతులకు ఏకాంత మార్గాలు.గొప్ప పుణ్యాలకు ఆలవాలాలు.ఇప్పుడూ ఇంతకు ముందు చేసిన పాపాలను పోగొట్టేవి. పోతన దృష్టిలో దశమ స్కంధంలో వర్ణింపబడిన "**నల్లని వాడు పద్మ నయనంబుల వాడు కృపారసంబు పై జల్లెడు వాడు మౌళి పరిసర్పిత పింఛము వాడై**"(13)న శ్రీకృష్ణుడు, "**నల్లనివాడు పద్మనయనంబులవాడు మహాశుగంబులన్ విల్లును దాల్చువాడు**" (14) అయిన శ్రీరాముడు ఒక్కరే.

## 13. పాదసూచికలు:

1.వాల్మీకి. శ్రీమద్రామాయణం.బాలకాండ.ప్రథమసర్గ.5వ శ్లోకం
2.బమ్మెర పోతన.శ్రీమదాంధ్రభాగవతము.నవమ స్కంధము.258వ పద్యం
3.బమ్మెర పోతన.శ్రీమదాంధ్రభాగవతము.నవమ స్కంధము.259వ పద్యం
4.బమ్మెర పోతన.శ్రీమదాంధ్రభాగవతము.నవమ స్కంధము.263వ పద్యం
5.బమ్మెర పోతన.శ్రీమదాంధ్రభాగవతము.నవమ స్కంధము.268వ పద్యం
6.బమ్మెర పోతన.శ్రీమదాంధ్రభాగవతము.నవమ స్కంధము.273వ పద్యం
7.బమ్మెర పోతన.శ్రీమదాంధ్రభాగవతము.నవమ స్కంధము.279వ పద్యం
8.వాల్మీకి. శ్రీమద్రామాయణం.అరణ్యకాండ.37వ సర్గ.13వ శ్లోకం
9.బమ్మెర పోతన.శ్రీమదాంధ్రభాగవతము.నవమ స్కంధము.308వ పద్యం
10.బమ్మెర పోతన.శ్రీమదాంధ్రభాగవతము.నవమ స్కంధము.332వ పద్యం
11.బమ్మెర పోతన.శ్రీమదాంధ్రభాగవతము.నవమ స్కంధము.342వ పద్యం
12.వాల్మీకి. శ్రీమద్రామాయణం.బాలకాండ.ప్రథమసర్గ.24వ శ్లోకం
13.బమ్మెర పోతన.శ్రీమదాంధ్రభాగవతము.దశమ స్కంధము.1011 పద్యం
14.బమ్మెర పోతన.శ్రీమదాంధ్రభాగవతము.నవమ స్కంధము.361వ పద్యం

## 14. ఉపయుక్తగ్రంథసూచి:


1. ఆరుద్ర. సమగ్రాంధ్ర సాహిత్యం(ప్రథమ భాగము), తెలుగు అకాడమి, హైదరాబాదు, 2007.
2. కాళిదాస., రఘువంశం, వేదం వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్, మద్రాసు,1985.
3. నారాయణ రెడ్డి, సింగిరెడ్డి. భక్తి కవితా చతురానన బమ్మెర పోతన (వ్యాసం). యువభారతి,1973.
4. పోతన, బమ్మెర. శ్రీమదాంధ్రభాగవతము. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం,2006.
5. వాల్మీకి, శ్రీమద్రామాయణం. గీతాప్రెస్, గోరఖ్ పూర్, 2003.


***



# AUCHITHYAM

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

ISSN: 2583-4797

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_15.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)

## 15. రవ్వలరామాయణం: రచనావైశిష్ట్యం

**డా. ఆతుకూరి వేంకటేశ్వర్లు (యోగి)**

అసోసియేట్ ప్రొఫెసర్, తెలుగుశాఖ,

ఆంధ్రవిశ్వవిద్యాలయం,

విశాఖపట్టణం, ఆంధ్రప్రదేశ్.

సెల్: +91 8074332611. Email: svyogi2012@gmail.com

**వ్యాససంగ్రహం:**

*'రవ్వలరామాయణం' అనే లఘురూప ఖండికను 'బోజంకి వెంకట రవి' రచించారు. లఘురూప ప్రక్రియలో కూడా రామాయణాన్ని రాసి మెప్పించవచ్చుననాటానికి ఈ రచన నిదర్శనంగా నిలుస్తుంది. దీర్ఘకవిత్వాన్ని ఆస్వాదించటానికి తగినసమయం లేని ఆధునికులకు రామాయణం వంటి విశిష్టరచనలను లఘురూపంలో అందించిన విధానం, ప్రక్రియలోని విశిష్టత, అభివ్యక్తి, అనుభూతి, అనుసంధానాలలో రచయిత ప్రదర్శించిన నేర్పును విశ్లేషించడంఈవ్యాసం ముఖ్యోద్దేశం.*

**Keywords:** లఘురూపప్రక్రియ, రవ్వలు, అనుభూతి, అనుసంధానచాతుర్యం, ఆధునికకాలం, రామాయణం.

## 1. ఉపోద్ఘాతం:

భారతీయుల జీవనస్రవంతిలో అంతర్లీనంగా ప్రవహిస్తున్నది రామకథ. ఆనాటినుండి ఈనాటి వరకు కథ అదే అయినా, కథనంలో మార్పులు పొందుతూ పాఠకుణ్ణి ఆకట్టుకుంటూనే ఉంది రామాయణం. ఆధునిక మానవజీవితం అతివేగంగా ప్రయాణిస్తుంది. దీర్ఘకవిత్వాన్ని ఆస్వాదించే సమయం సగటు మనిషికి ఉండటంలేదు. అటువంటి తరుణంలో మన సాంస్కృతికమూలాలను సజీవంగా రక్షించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఆ రకమైన రక్షణప్రయత్నంలోనే 'రవ్వలరామాయణం' రచన రూపుదిద్దుకుంది. 'రవ్వలు' అనే లఘురూపప్రక్రియలో 'బోజంకివెంకటరవి' రామాయణాన్ని రసవత్తరంగా రచించి సఫలీకృతులయ్యారు. ఈ రచనలోని వైశిష్ట్యాన్ని అవగాహన చేసుకోవటానికి నాలుగు అంశాలను పరిశీలించాలి. అవి ప్రక్రియావైశిష్ట్యం. అభివ్యక్తివైశిష్ట్యం, అనుభూతివైశిష్ట్యం, అనుసంధానవైశిష్ట్యం.

## 2. రవ్వలరామాయణం - ప్రక్రియావైశిష్ట్యం:

ఏదైనా నిత్యనూతనంగా వెలుగొందాలంటే, అందులో వైవిధ్యం ఉండాలి. తెలుగుకవిత్వం నిత్యనూతనంగా ఉండటానికి ఉన్న అనేక కారణాలలో రూపవైవిధ్యం కూడా ఒకటి. నన్నయ నుండి నేటివరకు తెలుగుసాహిత్యంలో అనేకప్రక్రియలు వికసించాయి. పద్యకావ్యాలు, గద్యకావ్యాలు, చంపూకావ్యాలు ప్రాచీనకాలం నుండి ఉండగా, ఆధునికకాలంలో వచనకవిత్వం వచ్చింది. వచనకవిత్వం వచ్చిన తరువాత లఘురూపప్రక్రియలు ఎన్నో వికసించాయి. మినీకవిత, టుమ్రీలు, నానీలు, రెక్కలు, హైకూలు మొదలైనవి. ఈ కోవకు చెందినదే ' రవ్వలు ' అనే లఘురూప ప్రక్రియ.

అల్పాక్షరాలలో అనల్పార్థం స్ఫురించేట్లు రాయటమే 'రవ్వలు'లోని ప్రత్యేకత. ఈ ప్రక్రియ రూపశిల్పి 'విశ్వేశ్వరవర్మభూపతిరాజు'. రవ్వల లక్షణాలను ఆయన మాటల్లోనే "**రవ్వలుసూటిగా ఉంటాయి. సంక్షిప్తంగా ఉంటాయి. భావస్ఫూర్తి కల్గిస్తాయి. పాఠకుని ఆలోచింపచేస్తాయి. చైతన్యపరుస్తాయి. కాలక్షేపం కబురులా కాకుండా చదివిన తృప్తినిస్తాయి. కటిక చీకటి చీల్చడానికి చిన్నరవ్వ చాలన్న భావన కలిగిస్తాయి**". (రవ్వలు-విశ్వేశ్వరవర్మ భూపతిరాజు,పేజీ.35)

సాధారణపద్యాలలో లాగానే ఈ రవ్వల్లో కూడా నాలుగు పాదాలుంటాయి (3+1). మూడు పాదాల తరువాత విరామం ఇచ్చి నాలుగవ పాదాన్ని ఉంచటం జరుగుతుంది. మొదటి మూడు పాదాల్లో విషయం లేదా సందర్భం ఉంటుంది. నాలుగవ పాదమే రవ్వకు ఆయువుపట్టు. నాలుగుపాదాల్లోను దీర్ఘం కానీ రెండు నుండి నాలుగు సమాసాలు లేదా పదాలు ఉండవచ్చు. అంటే తక్కువ పదాలతో ఎక్కువ భావాన్ని స్ఫురింపచేయటం ఇందులోని ప్రత్యేకత.

"**రవ్వలకు వస్తు నియతి ఏదీలేదు. వస్తువు ఏదైనాకావచ్చు. (ఘటిత/ అఘటిత/ వాంఛిత) దేనికైనా ఆధారం మూలం కాబట్టి, మూలంలో స్పర్శ, తడి, సెగ, మెరుపు, ఎరుపు, నలుపు లేదా బతుకును చూపించే తాపత్రయం రవ్వలో కనిపిస్తుంది**" అంటారు రవ్వలను నిశితంగా పరిశీలించిన రజాహుస్సేన్. (రవ్వలు - ఏ. రజాహుస్సేన్, పేజీ.26 ).

'రవ్వలు' ప్రక్రియకు స్పష్టమైన లక్షణాలను ఏర్పరచే ప్రయత్నం చేశారు ఆచార్య దార్లవేంకటేశ్వరరావు. వారు 'రవ్వలు' నాలుగు పాదాల్లో ఉండి సంక్షిప్తంగా, సూటిగా ఉండాలి అని చెపుతూ "**చీకటిలో ఒక చిన్న కాంతిరేఖ కూడా గొప్ప మార్గాన్నేర్పరచేలా ఉన్నట్లు, కవితారూపం చిన్నదే అయినా పెద్ద ఆలోచనకు, మానవ పరివర్తనకు 'రవ్వ'లో ప్రేరణనివ్వాలనేది వీటి ప్రయోజనం**" అని రవ్వల లక్షణాలను విశ్లేషించారు (రవ్వలు -ఆచార్య దార్ల వేంకటేశ్వరరావు, పేజీ.8).

ఇలా 'రవ్వలు' ప్రక్రియ క్రొత్తదే అయినా, పాఠక జనాదరణను పొందుతూ ముందుకు సాగుతుంది.

## 3. రవ్వల రామాయణం - అభివ్యక్తివైశిష్ట్యం :

రచన ఏదైనా అది రసవంతంకావాలంటే 'అభివ్యక్తి' బాగుండాలి. "**చెప్పదలుచుకున్న విషయానికీ, వస్తువుకి రచయిత కల్పించే విలక్షణమైన ఆకృతి అభివ్యక్తి**" అంటారు కామేశ్వరరావు (విశ్వనాథకోవెల - భైరవభట్ల కామేశ్వరరావు, పేజీ.1). అంటే, కవికి అంతరంగంలో కావ్యరచన చేసేటప్పుడు ఒక ఉద్దేశం ఉంటుంది. ఆ ఉద్దేశాన్ని కథావస్తువులో నుండి వ్యక్తం చేయాలి. ఆ వ్యక్తం చేసే విధానం రసస్ఫోరకంగా ఉండాలి. అప్పుడు అది ఉత్తమ రచన. అతడు ఉత్తమ కవి.

'రవ్వల రామాయణం'లో అటువంటి రసస్ఫోరకమైన వ్యక్తీకరణ కనిపిస్తుంది. ఒకస్థాయీ భావాన్ని పాఠకుని హృదయంలో నిలపటానికి తగినంత నిడివి లఘురూప ప్రక్రియలో లేకపోయినప్పటికీ, కవి తనప్రతిభతో రసానుభూతిని కలిగించే ప్రయత్నం చేశాడు. సఫలీకృతుడయ్యాడు. అందుకు నిదర్శనంగా నిలుస్తున్నాయి ఈ 'రవ్వలు'.

> **"భరతునికిపట్టాభిషేకం**
> **రామునికివనవాసం**
> **పదునాలుగేళ్ళపాటు -**
> **- రాజుకిపిడుగుపాటు"** *( రవ్వలరామాయణం, పేజీ 31 )*

నాలుగు పాదాల ఈ రవ్వలోని నాలుగవ పాదంలో దశరథుని హృదయం ఆవిష్కృతమౌతుంది. వనవాసానికి వెళ్ళే రాముని మీదకన్నా, వేదన పడే కన్నతండ్రి దశరథుని మీద జాలి కలుగుతుంది. ఇదీ రచనలోని విశిష్టత.

> **"నాచేతిగోరుముద్దలు**
> **తిన్నచిన్నారిబాలకునికి**
> **అంతశిక్షవిధించకు -**
> **- రాజువిలాపం** *( రవ్వలరామాయణం, పేజీ 31 )*

ఈ రవ్వలో దశరథుని దీనస్థితి కనిపిస్తుంది. కైకేయిని ప్రాధేయపడి అడిగినట్లు, రాజు విలపిస్తున్నట్లు పాఠకుని మనస్సులో ముద్రపడుతుంది. ఇది కవిలోని అభివ్యక్తి నైపుణ్యం వలన కలిగిన ప్రయోజనం.

ఇందులోని వస్తువు రామకథ. కథలోని సందర్భం కైకేయి కోరిక మేరకు రాముణ్ణి దశరథుడు అడవికి పంపించటం. కరుణరసాత్మకమైన సన్నివేశం. ఇలాంటి సన్నివేశంలో విస్తృతమైన వర్ణనకు సాధ్యం కాని ఈ ప్రక్రియలో ఒకటిరెండు రవ్వలలో రసాన్ని పండించాడు కవి. ఇదే అభివ్యక్తి వైశిష్ట్యం. 'వాక్యంరసాత్మకంకావ్యం' అన్న ఆలంకారికుల నిర్వచనం ప్రకారం ఈ ' రవ్వలరామాయణం ' కావ్యగౌరవాన్ని పొందుతుంది.

## 4. రవ్వలరామాయణం - అనుభూతివైశిష్ట్యం :

కవిత్వానికి అనుభూతి అనేది ప్రాణం. మనిషి తన దైనందిన జీవితంలో ఎన్నో అనుభూతుల్ని పొందుతాడు. కవి తనకు కలిగిన అనుభూతుల్ని కావ్యంలో చొప్పించి పాఠకుని హృదయాన్ని తాకేట్లుగా చేస్తాడు. ఆదికవి వాల్మీకి

నుండి ఆధునిక కవి వరకు అనుభూతి ప్రధానంగానే కవిత్వం సాగింది. ఐతే, ఆధునిక కాలంలో వచ్చిన కొన్ని ఉద్యమాలు, ధోరణులు రాజకీయ ప్రాధాన్యతను సంతరించుకొని అనుభూతి విషయాన్ని ప్రక్కకునెట్టాయి.

జీవితం అంటే పార్టీలు, సిద్ధాంతాలు, వాటి మధ్య సంఘర్షణలు కాదు కదా! జీవితం అంటే క్షణక్షణం మనస్సును తాకే అనుభవాలు, వాటి ప్రతిస్పందనలు. జీవితాన్ని రసరమ్యం చేసేది అనుభూతి. ఈ అనుభూతి కవిత్వంలో ఉన్నప్పుడు పాఠకుడు కూడా సహానుభూతిని పొందుతాడు.

అనుభూతిని ఇస్మాయిల్ ఇలా వివరించారు "**అనుభూతి అనే పదాన్ని చాలా అర్థాల్లో వాడుతున్నారు. అనుభవం అని ఒక అర్థం. ఫీలింగ్ అని మరో అర్థం. కాని, అనుభూతి అంటే అవి రెండూ కావు. ఇవి రెండూ కలిసే బిందువు**" (అనుభూతికవిత్వం, ఇస్మాయిల్. పేజీ.1). అంటే విషయి(సబ్జెక్ట్) విషయాల (ఆబ్జెక్ట్) సమ్మేళనం అనుభూతి. రవ్వలరామాయణాన్ని పరిశీలిస్తే ఎన్నో అనుభూతి వ్యక్తీకరణలు కనిపిస్తాయి. దండకారణ్యానికి బయలుదేరిన సీతారాములు నడకను చిన్నరవ్వలో అనుభూతి కలిగిస్తాడు కవి.

**"రాళ్లుపరచిననేల**
**ముళ్లడొంకలదారి**
**దండకారణ్యంలో -**
**- సీతారామలక్ష్మణులనడక"** *(రవ్వలరామాయణం, పేజీ 37)*

ఇలాగే మరొక సందర్భంలో హనుమంతుడు లంకలోకి ప్రవేశించాక గొప్ప అనుభూతిని పొందుతాడు.

**"అందమైనపూలచెట్లు**
**వికసించేపూలపరిమళంతో**
**చల్లగాలివీస్తుంది -**
**అన్వేషణలోహనుమంతుడు**" *(రవ్వల రామాయణం, పేజీ.51)*

రవ్వ చిన్నదే ఐనా అనుభూతినివ్వటంలో పెద్దది. ఒక చిన్న నిప్పురవ్వ గడ్డివామును దహించినట్లు చిన్నరవ్వ హృదయాన్ని ద్రవింప చేయగలదని రచయిత 'బోజంకివెంకటరవి' నిరూపించారు.

## 5. రవ్వలరామాయణం - అనుసంధానవైశిష్ట్యం :

ఆదికవి నన్నయ తన భారతాంధ్రీకరణ విధానాన్ని ప్రకటిస్తూ ***'సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లోనారసి'*** అంటూ కథాసంవిధానానికి ప్రాధాన్యాన్నిస్తానని చెప్పారు. భారత రామాయణాలలాంటి దీర్ఘకావ్యాలను రచించేటప్పుడు ప్రధానకథకు ఉపకథలు పోషకంగా ఉండాలే గాని, ఆటంకాలుగా ఉండకూడదని నన్నయ భావించారు. అందుకే సంవిధానానికి ప్రాధాన్యాన్నిచ్చారు. సంవిధాన చాతుర్యాన్ని ఇక్కడ అనుసంధాన వైశిష్ట్యంగా పేర్కొనటం జరిగింది. "**కథాసంవిధానంలో పఠనీయత, రసావిష్కరణ, శబ్దకౌశలం, క్లుప్తత ప్రాధాన్యతవహిస్తాయి**" అంటారు బుసిరాజు లక్ష్మీదేశాయి (కథా సంవిధానం- సంచిక, పేజీ.1). ఈ అంశాల దృష్ట్యా చూసినా రవ్వలరామాయణంలో కథాసంవిధానం అద్భుతంగా జరిగింది. రామాయణం ప్రసిద్ధ

కథావస్తువే ఐనా, రవ్వల ప్రక్రియ కొత్తది. ఈ ప్రక్రియలో ఈ వస్తువు ఒదిగి పోతుందా లేదా అన్నది ప్రశ్న. ఒదిగిపోతుందని నిరూపించారు రచయిత. ప్రధానకథకు ఆటంకం కలుగకుండా ఉపకథలను క్లుప్తంగా రసభరితంగా ముగించారు. అహల్యాశాప వృత్తాంతం, కబంధుని శాపవిమోచనం వంటి ఉపకథలలో ఈ విషయం తెలుస్తుంది.

"**గౌతమాశ్రమంచేరిక**
**రామపాదానికితగిలింది**
**ఒకరాతిబండ -**
**త్రిలోకసుందరిగామారింది**" *(రవ్వల రామాయణం, పేజీ.25)*

ఇలాంటి ఐదు రవ్వలలో అహల్యా శాపవృత్తాంతం పూర్తయ్యింది. రసాన్ని పండించడంలోను ఆలంకారిక అభివ్యక్తిలోను ఈ రవ్వలు బాగానే మెరిశాయి.

**"సుమంత్రునిరథంపై**
**అడవికిపయనం**
**నీడలాజనం**
**శోకసంద్రమైఅయోధ్య"** *(రవ్వలరామాయణం, పేజీ 32).*

ఈ రవ్వలో నీడలా జనం రాముణ్ణి అనుసరించారని చక్కని ఉపమానాన్ని ప్రయోగించారు. ఇలా కథానుసంధానంలో క్లుప్తతను పాటిస్తూ, ఆలంకారిక అభివ్యక్తిని నెలకొలిపి, పఠనీయత తగ్గకుండా చూసుకున్నారు.

## 6. ముగింపు:

రామాయణం పాతదే అయినా ఎప్పటికప్పుడు కొత్త అనుభూన్ని కలిగిస్తూనే ఉంటుంది. కవిసమ్రాట్ విశ్వనాథని మరళా రామాయణాన్ని మీరెందుకు రాస్తున్నారని అడిగితే 'ఈ ప్రపంచమంతా చేసిన సంసారాన్నే చేస్తూ ఉంది, రోజూ తిన్న అన్నాన్నే తింటూ ఉంది, అలాగే నా భక్తి, నా రచన నాకే తృప్తినిస్తాయి' అని చెప్తూ 'కవిప్రతిభ'లో విశేషం ఉంటుందని అంటారు.

రామాయణం కథ పాతదే ఐనా, బోజంకి వెంకటరవి తన ప్రతిభతో 'రవ్వలరామాయణం' రచించి నూతన ఆవిష్కరణ చేశారు. రామాయణం పద్యరూపంలోనూ, గద్యరూపంలోనూ, గేయరూపంలోనూ, చలనచిత్రరూపం లోనూ నాటినుండి నేటివరకు ఆదరణపొందుతూనే ఉంది. ఇప్పుడు ఈకవి కృషి ఫలితంగా 'రవ్వలు' అనే లఘురూపంలోనూ జనాదరణ పొందుతుంది. లఘురూప ప్రక్రియ కూడా దీర్ఘకథకు అనుకూలమేనని, ఆధునిక సమాజానికి ఈ ప్రక్రియ అవసరం ఎంతైనా ఉందని విజ్ఞులు గ్రహించవచ్చు. 'రసహృదయం ఉంటే రూపం ఏదైనా రాణిస్తుంది' అనేది ఈ వ్యాస సారాంశం.

### 7. ఉపయుక్తగ్రంథసూచి:

1. ఇస్మాయిల్. అనుభూతికవిత్వం. ఈమాట: ఎలక్ట్రానిక్స్మాగజైన్, 1995.
2. కామేశ్వరరావు, భైరవభట్ల. విశ్వనాథకోవెల. ఈమాట: ఎలక్ట్రానిక్మ్యాగజైన్, 2011.
3. రాఘవేంద్రరావు, నూతక్కి. తుషారాలు (సంకలనం). లఘురూపకవితావేదిక, 2023
4. లక్ష్మీదేశాయి, బుసిరాజు. కథ - సంవిధానం. సంచిక: వెబ్పత్రిక, 2018.
5. విశ్వేశ్వరవర్మ, భూపతిరాజు. రవ్వలు. బి.ఏ.వి. వర్మ, 2019
6. వెంకటరమణ, అద్దూరి. పంజరంవిడిచినపిట్టలు. భానుచంద్రభూపతిఅక్షరవాహిని, 2022.
7. వెంకటరవి, బోజంకి. రవ్వలరామాయణం. బోజంకిసాహితీపీఠం, 2022.

***

**గమనిక:** ఈ పత్రికలోని వ్యాసాలలో అభిప్రాయాలు రచయితల వ్యక్తిగతమైనవి.

వాటికి సంపాదకులు గానీ, పబ్లిషర్స్ గానీ ఎలాంటి బాధ్యత వహించరు.




AUCHITHYAM

ISSN: 2583-4797

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_16.php

# "కమనీయం తెలుగు రామాయణం"

### జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

## 16. రంగనాథరామాయణం: సుందరకాండ విశిష్టత

**డా కె.శారద**

సహాయ ఆచార్యులు,

యస్ ఆర్ ఆర్ ప్రభుత్వ ఆర్ట్ అండ్ సైన్స్ కళాశాల (స్వప్ర.),

కరీంనగర్, తెలంగాణ.

సెల్: +91 9994722793. Email: sharada9494@gmail.com

**వ్యాససంగ్రహం:**

*ప్రాచీన సాహిత్యంలో తెలుగు రామాయణముకు ఎంతగానో ప్రాశస్త్యం ఉంది. ప్రజా జీవితాన్ని ప్రభావితం చేసిన గ్రంధాలలో రామాయణం ముఖ్యమైనది. అందులోని అన్ని కాండలలోకెల్లా సుందరకాండకు పారాయణ ప్రాధ్యాన్యం ఎక్కువ. రామాయణంలో సుందరకాండ అనే అంశం మీద దేవరకొండ శేషగిరిరావు గారు విలువైన పరిశోధన చేసారు. తొలి తెలుగు రామాయణంగా గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణం విశేషప్రజాదరణ పొందింది. రంగనాధరామాయణ కావ్యములోని సుందరకాండ విశిష్టతను, అందుగల ప్రత్యేకతలు, వర్ణనలు, హనుమ ప్రదర్శించిన ధైర్యసాహసాలు, సీత మానసికస్థితిని తెలుసుకొని ఊరడిరచిన విధం, రావణునికి హితోపదేశం చేయటం వంటి అంశాలను తెలుసుకోవటం మరియు అప్పగించిన పనిని ఎన్ని ఆటంకాలు ఎదురైనా పూర్తి చేయాలన్న హనుమ స్ఫూర్తిని నేటి తరం అందిపుచుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. తెలుగులో తొలి రామాయణమైన గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణం అధ్యయనం ద్వారా సుందర కాండ ప్రత్యేకత గురించి దాని ద్వారా వర్తమాన సమాజం తెలుసుకోవలసిన విశేషాల గురించి తెలియజేయడమే ఈ వ్యాస ఉద్దేశ్యం.*

**Keywords:** ప్రాచీన సాహిత్యం, ద్విపద, రంగనాధ రామాయణం, వర్ణనలు, హనుమ కార్యదక్షత.

### 1. ఉపోద్ఘాతం:

శ్రీమద్రాయణ భారతభాగవతాలు సంస్కృతవాఙ్మయంలో అతిప్రాచీనకావ్యాలు. రామాయణం ఆదికావ్యం. వాల్మీకి ప్రణీతమైన శ్రీమద్రామాణం సంస్కృతంలో వెలసిన ఉద్గ్రంధం. ఉత్తమ ఆదర్శభావాలు, మానవ స్వభావ చిత్రణ ఈ కావ్యంలో ఉండటం వల్ల రామాయణం జనులందరికి ఆమోదయోగ్యం, అనుసరణీయం అయింది. సంస్కృతంలో ఆధ్యాత్మిక రామాయణం, ఆనందరామాయణం, అద్భుతరామాయణం, మంత్రరామాయణం, యోగ

వాసిష్ఠ రామాయణం, మొదలగునవి ప్రసిద్ధములు. వివిధ పురాణములలో కూడా రామకథలున్నాయి.

## 2. రామాయణ కావ్యములు :

భారతీయభాషలలో హిందీలో తులసీగోస్వామి రామచరితమానస్, బంగాలీలో కృత్తివాస ఓఝ కృత్తివాస రామాయణం, మరాఠీలో సమర్థరామదాసు రామాయణగాథ, తమిళంలో కంబమహాకవి కంబ రామాయణం, కన్నడంలో నాగచంద్రుడు రామచంద్ర పురాణం, మళయాలంలో చేరామన్ రామచరితం. వీటన్నిటికీ వాల్మీకీ రామాయణమే ఆధారం. తెలుగులో వెలసిన రామాయణాలలో గోన బుద్ధారెడ్డి రంగనాథ రామాయణం మొదటిది. భాస్కర రామాయణం బహు కర్తృకం, తిక్కన నిర్వచనోత్తర రామాయణం, మొల్ల మొల్ల రామాయణం, కంకంటి పాపరాజు ఉత్తర రామాయణం, అయ్యలరాజు రామభద్రుడు రామాభ్యుదయం, కట్టా వరదరాజు రామాయణం, విశ్వనాథ సత్యనారాయణ శ్రీమద్రామాయణకల్పవృక్షం, ద్వర్థి, త్ర్యర్థి, చిత్ర, ద్విపద, వచన, ఉత్తర, అచ్చ తెనుగు, శతకం, పాటలు, గేయాలు, బుర్ర కథలు, ఒగ్గు కథలు, ఉయ్యాలపాటలు, కోలాటం, జానపదాలు, సినీమా పాటలుగా రామకథ ప్రసిద్ధం.

## 3. కవి పరిచయం, కావ్య విశేషాలు :

గోన బుద్ధారెడ్డి రంగనాథ రామాయణం తెలుగులో వెలసిన రామాయణాలలో మొదటిది. పాఠ్యగేయాలకు అనువైన విధంగా మధురమైన, మనోహరమైన శైలిలో దేశీయ ఛందస్సులో రాయబడిన ఉత్తమ కావ్యం,వ శతాబ్దమునకు చెందిన ఈ కావ్య కర్త విషయంలో వివాదాలున్నవి. భాస్కర, మొల్ల, గోవింద రామాయణాలు ఆయా కవుల పేర్లతో ప్రసిద్ధం కాగా రంగనాథ రామాయణం బుద్ధారెడ్డి పేరుతో ప్రసిద్ధం కావటం.దీనిని రంగనాథుడు రాసి బుద్ధారెడ్డి పేరు పెట్టాడన్నది కొందరి వాదన.కాని బుద్ధారెడ్డి "**ఆ తత కృతి పేర నతి పుణ్యపేర మాతండ్రి విట్ఠల క్ష్మాపాలు పేర**" ద్విపద రామాయణం రచించి. తండ్రికి అంకితం ఇచ్చితినని గ్రంథంలో చెప్పుకున్నాడు (రంగనాథ రామాయణం బాలకాండ పద్యం4). ఉత్తరకాండ రచించిన బుద్ధారెడ్డి కుమారులు కాచవిభుడు, విఠలభూపతి దీనిని పూర్వ రామాయణం అని చెప్పినారు. తండ్రి ఆజ్ఞ ప్రకారం తాము ఉత్తర కాండ రచించామని ఉత్తర కాండాంతంలో తెలియచేశారు. రంగనాథ రామాయణం ద్విపద కావ్యం.ద్విపద దేశీ ఛందం. రెండు పాదాలు కలిగి పాడుకొనుటకు అనుకూలంగా ఉంటుంది. వాల్మీకీరామాయణానికి అనువాదంగా రాసినా కథలో కొన్ని అవాల్మీకాంశాలున్నాయి. గౌతమాశ్రమంలో ఇంద్రుడు కోడియైకూయటం, హనుమంతుని తోకకు నిప్పుపెట్టుట, అగ్ని సూక్తజపం, ఉడుతభక్తి, నాగపాశ బద్ధులైన రామలక్ష్మణుల వద్దకు నారదుడు రావటం, రావణుని చంపిన తర్వాత రాముడు సేతువు దగ్గర లింగ ప్రతిష్ఠ చేయటం, పట్టాభిషేక సమయంలో విందు ఏర్పాటు, లక్ష్మణదేవర నవ్వు, ఊర్మిలాదేవినిద్ర వంటివి. స్వతంత్రమైన పద్ధతిలో రాసిన ఈ రచన అనేక విశేషాలతో ఉత్తమకావ్యంగా పేరు పొందింది.

రంగనాథరామాయణంలో ఇష్ట దేవతా స్తుతితో ప్రారంభమై ఆరు కాండలున్నాయి. ప్రతి కాండం చివర తన గురించి తన తండ్రిగురించి ఆయన గొప్పదనం గురించి చెప్పినాడు. ఈ కావ్యం సూర్యచంద్రులున్నంత వరకు నిలిచి ఉంటుందని తెలియ చేశాడు. బాలకాండలో రామలక్ష్మణభరతశత్రుఘ్నుల బాల్యం అయోధ్యకాండలో రాముని 12 సం.నుండి 25 సం. వయస్సులో జరిగిన విషయాలు అరణ్య కాండలో దండకారణ్యంలో జరిగిన విషయాలు, కిష్కింధ కాండలో వాలీ సుగ్రీవ హనుమంతాది వానరవీరుల విషయాలు సుందరకాండలో హనుమ లంకానగరమునకు వెళ్లి సీతను కనుగొని రామునికి తెలియ పరచటం లంకాదహనం యుద్ధకాండలో రామరావణ యుద్ధం వంటి విషయాలు వివరించబడినవి.ఉత్తర కాండలో రాముడు అయోధ్యకు తిరిగి వచ్చిన తర్వాత జరిగిన విషయాలు వర్ణితమైనవి.

## 5. సుందరకాండ నామ ఔచిత్యం - విశిష్టత:

ఈ వ్యాసంలో గోన బుద్ధారెడ్డి రంగనాథరామాయణం 'సుందరకాండ'లోని విశేషాలను ప్రత్యేకతలను వర్ణలను పాత్రల గురించిన వివరాలను తెలియపరచటం ఉద్దేశం. సుందరం అనగా అన్వేషణ అని అర్థం.ఆనందము అని కూడా అర్థం. హనుమ ప్రేమ స్వరూపిని ఐన సీతమ్మ కొరకు అన్వేషించి ఆమెను దర్శించి రామునికి ఆనందం పంచాడు. కనుక ఇది సుందరకాండ.గొప్ప సాధకుడైన హనుమ ఇతరులెవ్వరి వల్లా కాని కార్యాన్ని సాధించడం వల్ల ఇది సుందరకాండ. ఎన్నో వేల మంది వానరులున్నా అంగులీయకాన్ని కేవలం హనుమకు మాత్రమే ఇవ్వటం దక్షిణం దిక్కుకు వెళ్లిన వానరులందరు హనుమను లంకకు వెళ్ల గల సమర్థత అతనికి ఉన్నదన్న విషయాన్ని అతనికి తెలిపి ప్రోత్సహించటం మైనాకుడు సముద్రుడు హనుమ పట్ల గౌరవాన్ని చూపెట్టటం సురస సింహిక లంఖిని హనుమ సామర్థ్యాన్ని పరీక్షించి అడ్డు తొలగటం దీనమైన పరిస్థితుల్లో ఉన్న సీతను చూసి బాధను పొందటం సీత ప్రవర్తన రావణునికి హితోపదేశం చేయటం వంటివి హనుమలో గల ధైర్యం సమర్ధత వంటి అంతః సౌందర్యం ఉండటం వల్ల దీనిని సుందరకాండ అని చెప్పవచ్చును.రామాయణం 'ఒక పసందైన విందు భోజనం ఐతే సుందరకాండ ఒక పదార్ధం' అంటారు భావార్ధ రామాయణ కర్త ఏకనాథుడు.

## 6. సుందరకాండలో వర్ణనలు:

హనుమ సముద్రాన్ని దాటి లంకకు చేరటం అశోకవనం సౌందర్యం సీత రావణునికి రాముని గొప్పతనాన్ని వీరత్వాన్ని తెలపటం రావణునికి హితోపదేశం చేయటం వంటివి ఎంతో అద్భుతంగా వర్ణించటం జరిగింది. బుద్ధారెడ్డి సుందరకాండను 1126 ద్విపదలలో పూర్తి చేశాడు.

## 7. మైనాకుని అభ్యర్థన:

సీత జాడ కోసం బయలుదేరిన హనుమకు సముద్రం మధ్యలో ఉన్న మైనాక పర్వతం తన మీద కొద్దిసేపు విశ్రాంతి తీసుకొని వెళ్లవలసిందిగా కోరుతాడు. అప్పుడు హనుమ తాను రామ కార్యార్థమై వెళుతున్నానని అతని అభ్యర్థనను సున్నితంగా తిరస్కరిస్తాడు.

"**వెరవుగాదిపుడు విశ్రమించుటకు**
**జలనిధి నడుమ నెచ్చట నిల్వననుచు**
**జెలుగమున్ను ప్రతిజ్ఞ చేసినాడ**
**నిట రాము కార్యార్థమేగుచున్నాడ**
**నటుగాన నిల్వరాదద్రీశ నాకు**" (రంగనాథ రామాయణం. సుందరకాండ పుట.207)

సువేలాద్రి పర్వతంపై నిలబడిన హనుమకు ఆ పర్వతం సుడిగాలికి కదలిన పడవలాగ ఉన్నది. ఆ పర్వతంపై నుండి లంకా నగరం చూసిన విధం 'దేవలోక కన్య లంకా నగరం అనే అద్దాన్ని చూసినట్టున్నదని' దేవ లోకం కన్నా అందమైనది అని తెలిపాడు.రావణుడు సీతను చూడటానికి వెళ్లే సమయంలో అతడు ధరించిన పూలు సుగంధ పరిమళాలు వస్త్రాలు ఆ భరణాలు వంటివి వర్ణిస్తూ "**పేర్చి ఘన చంద్ర హాస సంకలితుడై**" అని అతన్ని చంద్రునితో పోల్చాడు. ఇంకొకచోట నలువైపుల గంధర్వ. యక్షస్త్రీలు అతన్ని సేవిస్తూ వస్తుండగా **'మెఱుగుల వెనుకొను మేఘంబు పోలే**' అని మెరుపుల వెనుకనున్న మేఘంతో పోల్చాడు. (రం.రా.సుందరకాండ. - 265)

అతని మనస్సులో సీత తలంపులు మాత్రమే ఉన్నాయి.రావణుడు ముందు నడుస్తుండగా రాక్షస స్త్రీలు గంగా జలాన్ని చల్లుతున్నారు. సిద్ధులు అతని గొప్పతనాన్ని కీర్తిస్తున్నారు. కొందరు రాక్షసస్త్రీలు కత్తులు వంటి ఆయుధాలతో వెంటవస్తున్నారు. అతడు నేల మీద నడిచేటపుడు భూమాత వణికింది. అతన్ని చూసిన సీత పులిని గన్న లేడిని బోలె చిత్తమున గలగుచున్నట్లు ఉన్నదని తెలియచేశాడు.

రావణుడు సీత ముందు రాముడి గురించి చాలా హీనంగా మాట్లాడుతాడు. ఒక మానవాధముడు తనను ఏమి చేయలేడని ఇక సీతకు తాను తప్ప వేరే దిక్కెవరూ లేరని అహంకరిస్తాడు.

**"అడవుల ఆకులు నలములు నమిలి**
**యిడుములు పడుతున్న హీన మానవుని**
**పొందేల కోరెదు పొలతి నన్ బొంది**
**పొందనొల్లవె రాజ్యభోగంబులకటా"** (రం.రా.సుందరకాండ.పద్యం 285-286)

అడవుల వెంట తిరుగుతూ కందమూలములు తినే సామాన్య మానవుడైన రామున్ని వదిలి లంకాధిపతి ఐన రావణున్ని చేపట్టి రాజ్య భోగములు అనుభవించుమని ఇంద్రాది దేవతలే తన నగరంలోకి అడుగు పెట్టడానికి సంకోచిస్తారు. అలాంటిది రాముడు ఇక్కడకు రావటం సాధ్యం కాదని అహంకరిస్తాడు.

## 8. రాముడి వీరత్వం:

అప్పుడు సీత రాముడి పరాక్రమాన్ని ధీరత్వాన్ని వీరత్వాన్ని ఈ విధంగా వివరిస్తుంది.

**రావణ ! నీలావు రఘురాములావు**
**నీవు చూచెదుగాని నేనేల చెప్ప**
**ఎండతో బ్రాలేయ మెదిరించినట్లు**
**కొండతో తగరు మార్కొనిన చందమున**
**మద హస్తితో దోమ మార్కొన్నకరణి**
**ఉదధితో గాల్వ మందొడ్డిన పగిది**
**శ్రీతర్వుతో వేము శ్రీశుతో జోగి**
**ధాతతో విప్రుండు ధనికుతో బేద**
**జాతి రత్నముతోడ సరిగాజు పూస**
**భూతలంబున సరిపోల్చినయట్లు**

రావణుడు రామునితో యుద్ధం చేయడం తగరు పర్వతంతో ఢీకొన్నట్టు దోమ ఏనుగును ఎదిరించచినట్టు చిన్న కాలువ సముద్రంతో పోటీ పడినట్టు కల్ప వృక్షాన్ని ఎదిరించిన వేప చెట్టు మాదిరి ధనవంతున్ని ఎదిరించిన పేదవానివలె గాజు ముక్కలు రత్నంతో పోటీ పడినట్లున్నదని ఉపమాలంకార వర్ణన చేసినాడు కవి.

**"సకల లోకములకు స్వామి రాఘవుడు, అఖిల కంటకు డవన్ని లోకముల**
**వేద చోరు డవివేకి నీవు, వేదంబులకెల్ల వేద్యుడతండు**
**కర్మ పూరిత ఘన కాయుండవీవు, నిర్మల యశోనిధి రాఘవుడు"** అని రామరావణుల మధ్యగల బేధాన్ని తెలుపుతుంది సీత.

అశోక వనంలో రాక్షస స్త్రీల మధ్య ఒంటరిగా ఉన్న సీత వారి బారి నుంచి తనను రక్షించేవారు ఎవరు లేకపోవటం రావణుడి బెదిరింపులకు భయపడి తన కేశాలతో ఉరి వేసుకోవడానికి సిద్ధపడుతుంది.అప్పుడు శుభ సూచకంగా ఆమె ఎడమ కన్ను అదురుతుంది.ఆ విషయాన్ని ప్రకృతిలో జరుగుతున్న విషయాలతో పోల్చి చూపుతూ తుమ్మెదలు తామరపై కూర్చున్నప్పుడు తామర పుష్పము కదులుతున్నట్లుగా ఉన్నది అంటాడు.
చెట్టు కొమ్మల మధ్యనుండి రామ నామ శబ్దం వినితల పైకెత్తి చూసి రాక్షస మాయయే కావచ్చునుకున్నది

## 9. విశ్వరూప ప్రదర్శన :

సీత హనుమ సూక్ష్మ రూపాన్ని చూసి విశాలమైన సముద్రాన్ని ఎలా దాటి రాగలిగావని అతని నిజరూపాన్ని చూపుమని కోరుతుంది.

**"నా హనుమంతుడాకాశమెల్ల**
**తన మేను నిండ నుద్దుండుడై పెరిగి**
**మాలతీ మల్లికా మాల్యమై మెడకు**
**నాలోల తర తారహారమై కటిని**
**గల దౌతమయ ఘంటికామ మగుచు**
**దళుకు చుక్కల పిండు తన మేననలమ**" (రం.రా.సుందరకాండ.పద్యం 591-593)

అతడు తన విశ్వరూపాన్ని ఆకాశమంత ఎత్తుకు పెంచాడు.అతని తలలోని వెంట్రుకలకు నక్షత్రాలు అంటుకున్నాయి.అవి మెరుస్తున్నాయి.ఇంకా తల పైకి ఎత్తితే ఆకాశానికి తగులుతుందని తలవంచుకొని నిలబడ్డాడు.ఆ రూపాన్ని చూసి ఉపసంహరించమని హనుమను కోరింది సీత.తర్వాత అతన్ని నమ్మింది. రాముని గురించిన వివరాలను అడిగి తెలుసుకొని సంతోషిస్తుంది.ఆమె ఇచ్చిన చూడామణిని ఆనవాలుగా స్వీకరించి ఆమె సమాచారాన్ని రామునకు తెలుపడానికి అనుమతి పొందుతాడు.తర్వాత హనుమంతుడు అశోకవనాన్ని నాశనం చేసి అడ్డు వచ్చిన రాక్షసులను చంపుతాడు. అక్షకుమారున్ని చంపి ఇంద్రజిత్తు వేసిన బ్రహ్మాస్త్రానికి కట్టుబడి రావణ సభాభవనానికి కొనిపోబడుతాడు.అక్కడ రావణునితో సీతను రామునికి ఇచ్చి శరణుకోరుమని హితవు పలుకుతాడు. రావణుడు కోపించి అతనిని చంపుమని ఆజ్ఞాపిస్తాడు.

## 10. విభీషణుని హితవు:

"**మగువల బ్రాహ్మల మఱి బాలకులను**
**దగదు దూతలు జంప దనుజాధినాథా**
**మదిలోను కోపంబు మట్టు గావింపు**
**తుద దూతలెందు వధ్యులు గారు గాను**
**బొదివి ఈ కోతి జంపుట పాటి గాదు**"

అని విభీషణుడు రావణునికి హితవు పలికినాడు. ఇతడు అశోక వనం నాశనం చేశాడు. కనుక అతనికి తగిన శిక్షకు గాను తోకకు నిప్పు పెట్టడం ఉచితమని తెలుపుతాడు.తనకు కావలసిన వ్యక్తి చెడు మార్గంలో పోతూ ఉంటే మంగళకరమైన మాటలను పలకాలని సుఖసమయాలలో కాదని కామందక నీతి.

## 11. సీత పాతివ్రత్యమహిమ:

రాక్షసులు తోకకు నిప్పు పెట్టి వదలగానే హనుమ ఆకాశానికి ఎగిరి లంకా దహనం చేశాడు.అది చూసి సీత తన పాతివ్రత్య మహిమతో అగ్ని దేవున్ని ప్రార్థన చేస్తుంది . అతన్ని చల్లగా చూడుమని వేడుకుంది.

"**యూరామ విభుడు ధర్మాత్ముడౌనేని**
**వారధి నాకుగా వడిదాటునేని**
**యీ రావణుని రాముడిలు గూల్చునేని**
**వారకనే పతివ్రతనౌదునేని**" (రం.రా.సుందరకాండ.పద్యం)

రాముడు ధర్మాన్ని రక్షించే నాయకుడే ఐతే రామలక్ష్మణులు సముద్రాన్ని దాటే శక్తి గలవారైతే రావణున్ని రాముడు జయించగలవాడైతే రామునికి నేను నిజమైన పత్నినైతే అగ్నిహనుమను ఏమీచేయకుండా ఉండాలని వేడుకుని సఫలమైంది.

"**కమలాప్త కులనాథ కంటి వైదేహి**

**ప్రమదా శిరోమణి ఈ పరమ కళ్యాణి**"

అని సుందరకాండ చివరన ఓ రామా! సీతను నేను చూశాను. స్త్రీలలో శ్రేష్టమైన కళ్యాణి వంటి స్త్రీని చూశానని తెలిపి ఆనందపరశున్ని చేశాడు.

## 12. సుందరకాండలో హనుమ పాత్ర విశిష్టత:

రంగనాథ రామాయణం సుందరకాండలో హనుమంతుడే ప్రధాన పాత్ర.సీతాన్వేషణ కోసం దక్షిణ దిక్కుకు బయలుదేరిన వానర వీరులు హనుమ శక్తి సామర్థ్యాలను గుర్తించి అతనికి తెలిపి సముద్రాన్ని లంఘించి లంకకు వెళ్లమని ప్రోత్సహిస్తారు.అప్పుడు హనుమ "**శ్రీరాము కార్యంబు సేయంగబూని వారధి పిల్ల కాల్వయుంబోలె**" దానిటి (రం. రా. సుందరకాండ. పద్యం 1-2)

సముద్రాన్ని పిల్ల కాలువ దాటినట్టుగా చాలా అవలీలగా దాటడంలో అతని సామర్ధ్యం తెలుస్తుంది. అతని శక్తి సామర్థ్యాలను పరీక్షంచుటకు సురస ఒక రాక్షసరూపం ధరించి అతన్ని మింగడానికి ప్రయత్నించగా సూక్ష్మరూపుడై నోటిలో దూరి బయటకు వచ్చినాడు.సముద్రపు నీటిలో ఉన్న సింహిక నోరు తెరిచి మింగడానికి ప్రయత్నించగా దాని నోటిలో దూరి కడుపు చీల్చుకోని బయటికి వచ్చి ముందుకు సాగుతాడు. లంఖినిని మూర్ఛ పుచ్చుతాడు. ఈ సంఘటనలలో హనుమ బుద్ధి చతురతను ప్రదర్శించాడు.

సీతను రావణుడు నానావిధాలుగా దుర్భాషలాడగా విని కోపగించాడు.సీత దీన స్థితికి బాధపడుతాడు.కాని ఇది సమయంకాదని ఓపికతో శింశుపావృక్షం మీద సూక్ష్మరూపుడై వటపత్రశాయిఐ న విష్ణువు వోలె ఉండిపోతాడు.రావణుడు వెళ్లిన తర్వాత రామనామం జపిస్తూ ఆమెకు నమ్మకం కలిగే విధంగా ప్రవర్తించి తన వివరాలను రాముని విషయాలను సవివరంగా తెలిపి ఆమెకు ప్రాణదానం చేసినాడు. అంగుళీయకాన్ని అందించినాడు.మహా సముద్రాన్ని సూక్ష్మరూపుడైన హనుమ ఎలా దాటాడని ప్రశ్నించిన సీతకు "ఆ హనుమంతుడాకాశమెల్ల తన మేను నిండ నుద్దండుడై పెరిగి" తన విశ్వరూపాన్ని ప్రదర్శించాడు.రాముడు సుగ్రీవాది వానర వీరులతో వచ్చి రావణుని వధించి అయోధ్యకు తీసుకొని వెళతాడని ధైర్యాన్ని నూరిపోస్తాడు.

"**నైన తడవేల అఖిలైకమాత**
**యేను నా వీపున నిడుకొని ప్రీతి**
**నొదవిన కుదుకతో నుదధి లంఘించి**
**యుదయువేళకు బోదు నుర్వీశుకడకు విచ్చేయుము**"

అని ఆమెను తన వెంట రాముని వద్దకు తీసుకొని వెళతానని ఉత్సుకతను ప్రదర్శిస్తాడు.

**"కపివంశ వర్య రాఘవ కార్యదుర్య**
**యుపకార నిరత లోకోన్నత చరిత**
**పవమానసుత నాకు ప్రాణదానంబు**
**చేసితి నీకు దగ చేయలేను అని చెప్పి**
**కాకుత్స్థతిలకంబు కరణ నీవింక**
**నాకల్పముగ నుండు మనుచు**" సీత చేత దీవెనలు పొందుతాడు. (రం.రా.సుందర.పద్యం 524)

ఇక హనుమ తాను వచ్చిన విషయాన్ని రావణునికి తెలపాలని అతని బలాబలాలను తెలుసుకోవాలని అనుకొని అశోక వనాన్ని నాశనం చేయాలని చెట్లను కూల్చి అడ్డువచ్చిన రాక్షసులను చెదరగడుతాడు. రావణుని ఆదేశానుసారం దాడికి వచ్చిన అశ్మవక్షుడు, దీర్ఘజిహ్వుడు దుర్ముఖుడు రక్తరోముడు అంశుమాలి జంబుమాలి వంటి రాక్షసులను చంపి తన బలాన్ని వారికి తెలియచేశాడు. సింహం ఆవేశంతో ఏనుగుపై దాడి చేసినట్టు పులి లేడిని వెంటబడి తరిమినట్టుగా వారిని భయభ్రాంతులకు గురి చేశాడు. అక్షకుమారుడితో తలపడి "**కండ లెల్లెడ రాలి కనుగ్రుడ్లు చెదిరి అంగంబు లెల్ల పగిలి నెత్తురు గక్కి ప్రాణములు విడిచునట్టు చేసినాడు"** (రం.రా. సుందర. 770-771).

ఇంద్రజిత్తు వేసిన బ్రహ్మాస్త్రానికి కట్టుబడి రావణుడి సభాభవనానికి కొనిపోబడుతాడు.దశరథపుత్రుడైన రాముడు విశ్వామిత్రుని యాగాన్ని రక్షించి శివధనస్సును విరిచి సీతను పెళ్లాడి పరశురాముని గర్వాన్ని అణచి ఒక్కబాణంతో వాలిని (తోకతో నిన్ను కట్టి సముద్రంలో ముంచిన) చంపి సుగ్రీవుణ్ణి రాజుగా చేశాడు. అతని మంత్రిని రామదూతను అని తన పరిచయం చేసుకోవటంలో హనుమ లౌక్యం కనపిస్తుంది. చెప్పకనే రావణుని బేల తనాన్ని రామాదివీరుల శక్తి సామర్థ్యాలను వెల్లడించాడు. నీవు చేసిన తప్పు తెలుసుకొని రాముని శరణు కోరుకో అలాకాదని అహంకరిస్తే సుగ్రీవాది వానరవీరులతో రాముడు లంకకు వచ్చి నిన్ను సంహరించి సీతను తీసుకోమి వెళతాడు అని హెచ్చరించాడు.హనుమ ఒక రాయబారిగా మాత్రమే కాక అవసర సమయాలలో శత్రురాజుకైనా నీతిని బోధించే స్థితిలో ఉన్నాడు.

రావణుడు కోపంతో అతన్ని చంపుమని ఆజ్ఞాపించగా విభీషణుడు దూతను చంపుటం ఉచితం కాదని తోకకు నిప్పుపెట్టుమని సలహా ఇస్తాడు.ఆ నిప్పుతోనే లంకానగరాన్ని భస్మం చేసిన కుశాగ్రబుద్ధి హనుమ.తిరిగి వెళ్లేటపుడు మైనాక పర్వతంపై సేదతీరి అనంతరం అంగదాది వానరులను కలుసుకోని తాను వెళ్లిన పని లంకలో ఎదురైన అనుభవాలు సంఘటనలు.సీతను కనుగొన్న విధం అంగుళీయకాన్ని ఇవ్వటం చూడామణిని తీసుకొని రావటం ఇత్యాది విషయాలను వారితో పంచుకొని ఆనందిస్తాడు. మధువనంలో ఫలాలను తిని రాముని దర్శనానికి వెళతాడు.కుల ఇలవేల్పు స్త్రీలలో శ్రేష్ఠమైన కళ్యాణి వంటి సీత మాసిన చీరతో మలినయై ధూళి ధూసరితాంగియై తూలియై వ్రాలి ఉన్నదని (రం.రా. సుందరకాండ. పద్యం 1058) తెలుపుతాడు. అగ్ని సాక్షిగా వివాహమాడిన

రాముడు ఇప్పుడు తనను అనాధగా వదిలి పెట్టాడని వానర వీరులతో వచ్చిరావణుని చంపి తనను తీసుకొని వెళ్లుమని తెలిపిందని చెపుతాడు. కాకాసురవధను గుర్తు చేసిందని తెలుపుతాడు.

హనుమ సుందరకాండలో శక్తివంతుడు పరాక్రమశాలియైన నాయకుడు. తన బుద్ధి కుశలతతో సురస సింహిక లంఖిణి వంటి వారి ఆటంకాలను అధిగమించాడు. కార్యసాధకుడు సమయాన్ని వృధాచేయరాదని మైనాకుని ఆతిథ్యాన్ని సున్నితంగా తిరస్కరించి ముందుకు సాగుతాడు.లంకలో అణువనువు వెదకినా సీత కనిపించకపోయేసరికి కొంత విచారపడినా తిరిగి కార్యోన్ముఖుడై అశోకవనంలో సీతను చూస్తాడు.తన ఉనికి ఇతరులకు తెలియకుండా సూక్ష్మరూపుడై సీతను ఓదార్చి రాముని యోగక్షేమాలను తెలిపి అంగుళీయకాన్ని ఇచ్చి చూడామణిని పొందుతాడు.

రావణుని బలాబలాలను అంచనా వేయడానికి అశోకవనాన్ని నాశనం చేసి అక్షకుమారాది రాక్షసులను చంపి తన శక్తిని చాటుతాడు. ఇంద్రజిత్తు వేసిన బ్రహ్మాస్త్రానికి బద్ధుడై రావణునికి హితోపదేశం చేసిన నీతిమంతుడు. ఎవరు తీసిన గోతిలో వారే పడుతారన్నట్లు రాక్షసులు తన తోకకు పెట్టిన నిప్పుతోనే లంకను కాల్చి తిరుగు ప్రయాణంలో మైనాకుని ఆతిథ్యాన్ని స్వీకరించి అతన్ని సంతృప్తి పరుస్తాడు. వానరవీరులతో కలిసి వచ్చి రాముడికి సీత విషయాలను తెలిపి ఆనందపరుస్తాడు. ఏయో విషయాలను ఎప్పుడు ఎలా ఎవరికి తెలపాలో తెలిసిన బుద్ధికుశలుడు. హనుమ కార్యసఫలత ధైర్యం ప్రయత్నం సమయస్ఫూర్తి బుద్ధికుశలత వంటి ఉత్తమ గుణాల కలబోత.

## 13. ముగింపు:

రంగనాధరామాయణం వాల్మీకి రామాయణాన్ని అనుసరించి తెలుగులో వెలసిన మొదటి ద్విపద రామాయణం. బుద్ధారెడ్డి స్వతంత్రమైన పద్ధతిని అనుసరించి ఆరుకాండలుగా కావ్యాన్ని రచించాడు. వీరి కవిత్వం సరళంగా, సహృదయ జనరంజకంగా, రసవంతంగా, చక్కనైన ఉపమాది అలంకారాలు, వర్ణనలు కలిగి మనోహరంగా ఉన్నది. లంకా నగర వర్ణన రాక్షస సంహారం హనుమ పరాక్రమం సీత దుస్థితి హనుమ ఉపదేశం వంటివి సుందరకాండకు ఒక ప్రత్యేకత ప్రాధాన్యతను తెచ్చినది. దీనిలో హనుమపాత్రకు ఒక విశిష్ఠత ఉంది. కార్యసాధకుడు సుఖదుఃఖాలను లెక్కచేయని విధంగా సుగ్రీవుడు అప్పగించిన పనిని హనుమ సాధించినాడు. అహంకారం అనార్థాలకు దారితీస్తుందని తెలుస్తున్నది. సమయస్ఫూర్తి, సహనం, చతురత అలవరుచుకొని రాణించాలని హనుమ పాత్ర ద్వారా తెలుస్తున్నది.

## 14. ఉపయుక్తగ్రంథసూచి:


1. ప్రతపరెడ్డి, సురవరం. రామాయణ విశేషాలు, ఆంధ్ర రచయితల పరిషత్,హైదరాబాద్,1957.
2. బుద్ధారెడ్డి, గోన. రంగనాధరామాయణం ద్విపద కావ్యం, శ్రీరామ ప్రెస్ చెన్నపురి, 1960.
3. మలయవాసిని, కోలవెన్ను. వివిధ భారతీయ భాషలలో రామాయణం, శ్రీపతి ప్రెస్, కాకినాడ, 1988.
4. వెంకట రామశాస్త్రి, కొంపెల్ల. సుందరకాండము, గొల్లపూడి వీరస్వామి సన్స్ పబ్లిషర్స్, రాజమండ్రి , 2009.
5. వెంగమాంబ, తరిగొండ. వాశిష్ట రామాయణం, తి.తి.దే. ప్రచురణలు, తిరుపతి, 2008 .
6. శ్రీనివాసాచార్యులు. భమ్మకంటి. మొల్ల రామాయణం ఎమెస్కో బుక్స్ విజయవాడ,2008.
7. శేషగిరిరావు, దేవరకొండ. అనేక రామాయణాలలో సుందరకాండ, విజ్ఞాన మంజూష, హైదరాబాదు, 2009.
8. సత్యనారాయణ, విశ్వనాథ. శ్రీమద్రామాయణ కల్పవృక్షం, విశ్వనాథ పబ్లికేషన్స్ విజయవాడ, 2002.


***


AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
ISSN: 2583-4797
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_17.php

# "కమనీయం తెలుగు రామాయణం"

**జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక**

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

## 17. పట్టాభిరామవిలాసం: రచనావైశిష్ట్యం

**వడ్లమూడి యోగీశ్వరరావు**

పరిశోధకవిద్యార్థి,
ప్రాచ్య పరిశోధన సంస్థ, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి,
తిరుపతి, ఆంధ్రప్రదేశ్.
సెల్: +91 9000721241. Email: vadlamudiyogiswar@gmail.com

**వ్యాససంగ్రహం:**

*తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన సంస్థ ఆంధ్రప్రదేశ్ లో ప్రసిద్ధి పొందిన ఏకైక ప్రాచ్యలిఖిత గ్రంథ భాండాగారం. ఎనిమిది దశాబ్దాలుగా పండితులకు నెలవై, పరిశోధనలకు కల్పతరువై, సాహిత్యానికి, సంస్కృతికి అపారమైన సేవ చేస్తుంది. ఈ సంస్థ ఏర్పడిన దగ్గర నుండి తాళపత్రాలను, కాగితపు రాతప్రతులను, అరుదైన గ్రంథాలను వివిధ ప్రాంతాల నుండి సేకరించి, సంరక్షిస్తూ, రాబోయే తరానికి ఉపయోగపడేలా డిజిటలైజేషన్ చేస్తుంది. ఈవ్యాసంలో ప్రధానంగా సంస్థలో కొలువై ఉన్న తాళపత్రాలను, కాగితపు రాతప్రతుల మహామహాపండిత పరిశోధకులు పరిష్కరించి, ముద్రించి, ప్రచురించిన విధానాన్ని తెలియడంతో పాటు సంస్థలో R16. అనే కాగితపు ప్రతి, R106 అనే తాళపత్ర ప్రతిలో ఉన్న పట్టాభిరామవిలాసమనే ప్రబంధానికి సంబంధించిన విషయాలు తెలియజేయడం జరుగుతుంది. అలాగే ఈ ప్రబంధాన్ని రాసిన పండితారాధ్యుల నాగలింగకవి కాల నిర్ణయం గురించి, రామాయణంలోని పట్టాభిషేక ఘట్టాన్నికవి అయిదు ఆశ్వాసాల గల ఈ ప్రబంధంలో చేసిన వర్ణనలు, కవి ఇందులో వాడిన చిత్ర కవిత్వాన్ని, ఛందస్సు, అలంకారాలను, భాషా విశేషాలను తెలియజేయడం వ్యాసముఖ్యోద్దేశం. ఈ వ్యాసం ద్వారా ఇతిహాసంగా ఉన్న రామాయణాన్ని ప్రబంధరీతిలో నాగలింగకవి చూపిన కవితానిర్మాణం గురించి తెలుగుసుకోవచ్చు.*

**Keywords:** తెలుగులో విలాసకావ్యాలు, రామాయణం, ప్రబంధం, పండితారాధ్యుల నాగలింగకవి, సీతాదేవి వర్ణన, చిత్రకవిత్వం, ఛందస్సు, అలంకారాలు.

### 1. ఉపోద్ఘాతం:

భారతీయసంస్కృతి అనాది కాలంనుండి జీవనదిలా ప్రవహిస్తుంది. ఎన్నో పరిణామాలు, ఎన్నో ఆశయాలు, ఆచారవ్యవహారాలు, మతాలు, భాషలు, కళలు, వస్త్రాభారణాలు సాంప్రదాయకపద్ధతులతో

కలిసిపోయి ఉంది. దానికి ముఖ్య కారణం భారతీయ సంస్కృతే అని చెప్పవచ్చు. ఈ విషయాలన్నీ మనకు ప్రాచీనగ్రంథాల ద్వారా తెలుస్తున్నాయి. ఆ ప్రాచీనగ్రంథాలు మనకు అందుబాటులో లేకపోతే ఈ ప్రమాణాలు మనకు లేవనే చెప్పవచ్చు.

భారతీయసంస్కృతి పరిరక్షించడంలో ప్రముఖపాత్ర పోషించే వాటిలో ఎంతో ముఖ్యమైనవి ప్రాచీన గ్రంథాలే. ఆ గ్రంథాలను మన పూర్వికులు మనకోసం ఎంతో కష్టపడి శిలాశాసనాలు, తామ్రశాసనాలు, తాళపత్రాలు, కాగితాలపై రాసి వాటిని సంరక్షించారు. మన ప్రాచీనసంస్కృతిని భావితరాలకు తెలియజేయడానికి నిస్వార్థ మైన కృషిచేసారు.

ఇవాళ లభించే పురాణ, కావ్య, ప్రబంధ, నాటక, శాస్త్ర, వైద్య, వైదిక, వైజ్ఞానిక మొదలైన రంగాలకు సంబంధించిన ఎన్నో గ్రంథాలు మొదట రాతప్రతుల రూపంగానే లభించాయి. ముద్రణకు, ప్రచురణకి ఎలాంటి సౌకార్యాలు లేని ఆ రోజుల్లో నాటి మహానుభావులు ఎన్నో వ్యయప్రయాసాలకు ఓర్చి గురుపరంపరంగానో, వంశ పరంపరంగానో తమకు తెలిసిన విషయాలను తాళపత్రాలల్లో రాశారు. వీటిని కొంతవరకు జ్ఞానం తెలిసిన పండితులు, పరిశోధకులు సేకరించి వివిధ పుస్తక భాండాగారాల్లో, వివిధ సంస్థలలో ఉంచి సంరక్షించారు.

## 2. పట్టాభిరామ విలాసం - ప్రాచీనప్రతులు:

ఆంధ్రప్రదేశ్ లోని శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాంగణంలో ఉన్న ప్రాచ్యపరిశోధనసంస్థలో 16 వేలకు పైగా రాతప్రతులు సంస్కృత, తెలుగు, తమిళ, దేవనాగరి వివిధభాషలతో మిళితమై భిన్నమైన లిపులతో ఉన్నాయి. రాతప్రతుల రూపంలో వాటిని నిశితంగా పరిశీలించి, పరిష్కరించడం ఈసంస్థ చేసే ప్రధానకార్యక్రమం. ప్రాచ్యపరిశోధన సంస్థ పరిశోధనకు ఎప్పుడూ పెద్దపీట వేస్తూ వస్తుంది. ఈ సంస్థలో పనిచేసిన మానవల్లి రామకృష్ణ, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, డి.టి.తాతాచార్య వంటి మహా మేధావులు తమ ప్రతిభా పాటవాలతో అనేక తాళపత్రాలను సేకరించి, వాటిని పరిష్కరించి ముద్రణలోకి తెచ్చారు. వీటిని సంస్థే ప్రచురిస్తుంది. ఈ విధంగానే అనేక గ్రంథాలు వెలుగులోకి వచ్చాయి. ఆ విధంగా తాళపత్రం నుండి పుస్తకరూపంలోకి వచ్చిన ప్రబంధమే "పట్టాభిరామ విలాసం". దీనిని 19వ శతాబ్దానికి చెందినా పండితారాధ్యుల నాగలింగకవి రాశాడు. ప్రాచ్యపరిశోధన సంస్థలో R16 అనే కాగితపు ప్రతి, R106 అనే తాళపత్ర ప్రతిలో ఉన్న పట్టాభిరామవిలాసాన్ని ప్రస్తుతం సంస్థలో ఆచార్యులుగా పనిచేస్తున్న డా. పి.సి.వెంకటేశ్వర్లు గారు పరిష్కరించారు. దీనిని 2012లో జరిగిన నాల్గవ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా సంస్థే ప్రచురించింది. ఇప్పుడు తెలుగులో వచ్చిన విలాస కావ్యాల గురించి, పట్టాభిరామవిలాసాన్ని రాసిన కవి గురించి, ఆయన రచన విశేషాల గురించి తెలుసుకుందాం.

## 3. తెలుగులో విలాసకావ్యాలు:

'విలాసం' అనే పదానికి సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఆది, క్రీడ, వినోదం అనే అర్థాలున్నాయి. అదేవిధంగా చక్కదనం, సౌందర్యం, శృంగార చేష్ట అనే అర్థాలు కూడా వున్నాయి. అదే విధంగా విలాసం అనే పదానికి చిరునామా, మందిరం, ధర అనే అర్థాలు కూడా వున్నాయి. సాహిత్యదృష్టితో చూసినప్పుడు మన ఇష్టదేవతల లీలల్ని, మాహాత్మ్యాలను, గొప్ప వ్యక్తుల సాహసాల్ని, వినోదాల్ని వర్ణించే కావ్యాలను విలాసకావ్యాలు అని పిలుస్తున్నాం. అంతేకాదు. తెలుగు సాహిత్యంలో క్షేత్రమాహాత్మ్య కావ్యాలున్నట్లే కల్యాణ కావ్యాలున్నట్లే, అభ్యుదయకావ్యాలున్నట్లే, విలాసకావ్యాలు కూడా ఎన్నో ఉన్నాయి. తెలుగులో విలాస కావ్య రచన ఒక ప్రక్రియలాగా రూపొందింది. ముఖ్యంగా దక్షిణాంధ్రయుగంలో సాహిత్యగోష్ఠులు జరిగే మందిరాలకు 'విలాసం' అనే పదాన్ని చేర్చి రాజగోపాల విలాసం, ఇందిరా విలాసం వంటి పేర్లతో పిలవడం, నాటక యక్షగాన కావ్యాల చివర విలాసపదాన్ని చేర్చడం. ఎక్కువగా కన్పిస్తుంది. అయితే ఈ విలాస కావ్యసాంప్రదాయం మాత్రం దక్షిణాంధ్రయుగంలో ప్రారంభం కాలేదు. తెలుగుసాహిత్యంలో 'విలాస' పదంతో కన్పించే కావ్యాలు కొన్ని వున్నాయి. నన్నెచోడుని రచనగా చెప్పబడుతున్న వసంత విలాసం, నాచన సోమన రచనగా చెప్పబడుతున్న 'వసంత విలాసం నేడు లభించడం లేదు. మనకు లభిస్తున్న విలనికావ్యాల్లో మొదటిరి శ్రీనాథుని 'హరవిలాసం', ఆ తర్వాత నిశ్శంక కొమ్మన 'శివలీలావిలాసం' వంటివి కన్పిస్తున్నాయి. తెలుగుకవులు తమకునచ్చిన దేవతలు వివిధసందర్భాల్లో ప్రదర్శించిన సాహస, శృంగార, కటాక్ష సంఘటనలను వివరిస్తూ ఈ రచనలు సాగాయి. అయితే విలాస ఇతివృత్తాలను కవులు కావ్యాలుగా. ప్రబంధాలుగా, నాటకాలుగా, యక్షగానాలుగా, ద్విపదలుగా రాసినారు.

## 4. కవి-కాలం :

'పట్టాభిరామవిలాసం'లోని గ్రంథస్థ ఆధారాల్ని బట్టి ఈ ప్రబంధాన్ని పండితారాధ్యుల నాగలింగకవి రాసినట్లు స్పష్టంగా తెలుస్తుంది. ఈ ప్రబంధంలోని ప్రతి ఆశ్వాసం చివరవున్న '***ఇది సరస్వతీ నిరంతరానుకంపు సంపాదిత కవితామాధురీధురీణ కౌశికగోత్రపవిత్ర శ్రీపతిపండితారాధ్య వంశ వయఃపారావార రాకాసుధాకరాయమాన విద్వత్కవికంఠీరవ శంభులింగారాధ్యపౌత్ర వీరనారాధ్య సత్కవిపుత్ర పకల సుకవిజన విధేయ నాగలింగాభిధేయ ప్రణీతంబైన పట్టాభిరామ విలాసం బను మహా ప్రబంధంబునందు ఆశ్వాసము***' అనే గద్యను బట్టి ఈ కవివంశం కొంత తెలుస్తుంది. అంటే నాగలింగకవి శైవ పండితత్రయంలో ఒకరై, ఆంధ్రదేశంలో వీరశైవాన్ని వ్యాప్తిచేయడంలో కంకణబద్ధుడైన శ్రీపతి పండితుని వంశంవాడు. కౌశికగోత్రుడు. వీరి తాత విద్వత్కవి కంఠీరవుడైన శంభులింగారాధ్యుడు, మంచికవి, అందరు కవులు మెచ్చుకొనే వీరనారాధ్యుడు ఈయనకు తండ్రి అంటే నాగలింగకవి తండ్రి, తాతలు కూడా మంచికవులని ఈ ఆశ్వాసాంత గద్యలవల్ల తెలుస్తున్నా. వారు ఏ కావ్యాలు రాసింది తెలియడంలేదు. నాగలింగకవి రాసిన పట్టాభిరామవిలాసంలోని అవతారికలోనే

*సీ॥ నాటకాలంకార నైపుణ్య గణ్యుండు*
*సరస సాహిత్య విశారదుండు*
*సంస్కృతాంధ్ర ద్విభాషా వ్యాకరణవేత్త*
*షడ్విధ ప్రకృతిభాషావణుండు*
*బంధకవిత్వ నిబంధనాభిజ్ఞుండు*
*చిత్రకవిత్వ విశేషశాలి*
*సమధిక యమకాతి చాతురీ ధౌరేయు*
*డచలజిహ్వాన్ని రోష్ఠ్యాది నిపుణు*
*గీ॥ డమిత శాంతుఁడు చతుర కావ్య ప్రణీత*
*పండితారాధ్యవంశ సంభవుడు శంభు*
*లింగ పౌత్రుండు వీరేశలింగ పుత్రు*
*డంగపూజారి శ్రీనాగలింగ సూరి(1-17)* (పట్టాభిరామ విలాసము - పుట.06)

అనే పద్యం వల్ల నాగలింగకవి. సంస్కృతాంధ్రభాషల్లో సాహిత్య విశారదుడని, వ్యాకరణ వేత్తని, బంధ చిత్ర కవిత్వాలు చెప్పడంలో దిట్టని తెలుస్తోంది. ఆ విశేషాలన్నీ వాస్తవాలని పట్టాభిరామవిలాసం తెల్పుతుంది. అయితే నాగలింగకవి భోజరాజచరిత్రం అనే గ్రంథంకూడా రచించినట్లు తెలుస్తున్నా రచన నేడు లభించడంలేదు. అదేవిధంగా నాగలింగకవి తాత తండ్రులు గొప్ప కవులని అవతారికవల్ల తెలుస్తున్నా, వారు ఏ కావ్యం రాసింది మాత్రం స్పష్టంగా తెలియడంలేదు.

ఇక నాగలింగకవి కాలాన్నిగురించి ఏ సాహిత్యగ్రంథాలు పేర్కొనలేదు. ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యంలో నాగలింగకవి గురించి. "**కొండవీడు దగ్గర ఉన్న హౌఋగణేషుపేటలో మానూరువారు కొత్తగా దేవాలయం కట్టించారు. అందులో పట్టాభిరాముణ్ణి ప్రతిష్ఠించారు. ఈ సత్కార్యాన్ని పండితారాధ్యుల నాగలింగం అనే కవి మెచ్చుకున్నాడు. పట్టాభిరామ విలాసం అనే ఐదాశ్వాసాల కావ్యంలో ఆఖరి ఆశ్వాసంలో ఈ దేవాలయ నిర్మాణ ప్రశంస వున్నది. మొదటి నాల్గింటిలో రామచరిత్ర వుంది**"[1] అని చెప్పాడు. కానీ, కాలం వివరాలు ప్రకటించలేదు. నాగలింగకవి మానూరు వంశస్థుడైన వెంకటరాయుడు నిర్మించిన దేవాలయం గురించి వర్ణించాడు కాబట్టి మానూరు సంస్థానచరిత్రను పరిశీలించడం జరిగింది. తూమాటి దొణప్ప గారు "**మానూరి గృహనామకులగు చిలకలూరిపేట, సత్తెనపల్లి జమీందారులు మాధ్వబ్రాహ్మణులు, భారద్వాజస గోత్రులు, ఆపస్తంబ సూత్రులు, యజుశ్శాఖీయులు. మరట్వాడాలోని మానూరి గ్రామము వీరి మొదటి నివాసము. ఇదంబ్రాహ్మ మీదంకాత్రమని శాస్త్రాప సేవనంతోపాటు శస్త్రప సేవనమొనర్చిన వీరు గోలకొండ నవాబుల కొలువులో గొప్ప సరదారులుగా, ఆ పిమ్మట మొగలు పాదుషాల దౌలతులో ముజుందారులుగా, పెరిస్తదారులుగా, దేశపాండ్యాలుగా ప్రసిద్ధులు. పదునాలుగు సముతులుగా, నలువదినాలుగు హవేలీ గ్రామములుగా విభక్తమయిన మూర్తుజానగర (కొండవీడు) సర్కారునకు మానూరివారు మొదట ముజుందారులు. ఆ పిమ్మట నూట ఇరువది గ్రామములతో కూడిన మానూరివారి సంస్థానమునకు జమీందారులు చిలకలూరిపేట పాలకుల నివాసముగా నందివెలుగు, సంబూరు, మూల్పూరులు రాణాగ్రామములుగా నీ సంస్థానము వర్ధిల్లినది. 1779లో అన్నదమ్ముల వంతులక్రింద మొత్తము సంస్థానము చిలకలూరి పేట, సత్తెనపల్లి జమీలపేర పంపకములయినది. 1846 ప్రాంతముల ఇంగ్లీషు కుంఫిణీ సర్కారు పరమయినది**".[2]

దీన్నిబట్టి మానూరి వంశం 1779.1846 మధ్య పాలించినట్లు. తెలుస్తుంది. అయితే నాగలింగకవిని ఈ గ్రంథాన్ని రాయమని కోరింది. అప్పాజీ కొడుకైన వేంకటరాయుడు. ఈ వెంకటరాయుడు కాలానికి సంబంధించిన

వివరాలు తుమాటి దొణప్ప ఇలా చెప్పాడు. "**వెంకటేశము పదునాల్గు సంవత్సరములు పాలించి మరణింపగా వారి పెద్దకుమారులు వెంకట రమణయ్య జమీకి వచ్చిరి. వీరు వృద్ధులైన పిమ్మట తమ పెద్దకొడుకు అప్పాజీరావునకు జమీపాలనము నప్పగించి యుండిరి. అప్పాజీ నాలుగేండ్లుపాలించి 1810లో మరణించగా నాతని కుమారుడయిన వెంకటరావు మైనరయినందున తాతయగు వెంకట రమణయ్య మీదనే జమీ భారము పడినది 1820లో యుక్తవయస్సు వచ్చిన వెంకటరావుగారికి జమీ అప్పగించబడినది**".3 ఈ ఆధారాన్నిబట్టి చూస్తే వెంకట రాయుడు 1820 తర్వాత పరిపాలనకు వచ్చాడు కాబట్టి ఆయన కోరికపై కావ్యాన్ని రాసిన నాగలింగకవి కూడా 19వ శతాబ్దం ప్రథమార్థంలో కావ్యాన్ని రాసినట్లు తెలుస్తుంది. ఈ సంస్థానం 1846లో ఆంగ్లేయుల పరమైంది కాబట్టి పట్టాభిరామ విలాసకావ్యం 1820 – 1846 మధ్యకాలంలో రాయబడింది. నాగలింగకవి కూడా ఆ కాలానికి చెందినవాడని నిర్ణయించవచ్చు.

## 5. పట్టాభిరామవిలాసం- రచనా వైశిష్ట్యం:

'పట్టాభిరామ విలాసం' ప్రబంధమని అవతారికవల్ల, ఆశ్వాసాంత గద్యలవల్ల తెలుస్తుంది. ఈ ప్రబంధాన్ని నాగలింగకవి ప్రాచీన కావ్యసంప్రదాయాన్ని అనుసరించి 'శ్రీ' తో ప్రారంభించాడు. తొలిపద్యం సీతాసమేతుడైన సాకేతపురవర శ్రీరాముని ప్రార్థనతో ప్రారంభ మైంది. నాగలింగకవి శ్రీపతి పండితుడి వారసుడైనప్పటికీ, తాను రాసేది రామకథా సంబంధమైన కావ్యం కాబట్టి శ్రీరామస్తుతితో కావ్యారంభం చేశాడు. ఈ విషయంలో పోతన మనకు గుర్తొస్తాడు. అలాగే నాగలింగకవి ఇష్టదేవతా స్తుతిలో ఒక ప్రత్యేకత కనిపిస్తుంది. రామ, శివ, బ్రహ్మలను స్తుతించే క్రమంలో వారిలో సగమైన సీత, పార్వతీ, సరస్వతులను కూడా ప్రార్థించడం విలక్షణంగా వుంది. శ్రీరామస్తుతి తరువాత సీతను, శివుని తరువాత పార్వతిని, బ్రహ్మ తరువాత సరస్వతిని ప్రార్థించి చివరకు విఘ్నేశ్వరునితో ఆపకుండా శ్రీరాముని భక్తుడైన హనుమంతుని సీసపద్యంలో ప్రార్థించి ఇష్ట దేవతాస్తుతిని ముగించాడు. ఇష్ట దేవతాస్తుతిని 8 పద్యాల్లో ముగించాడు.

నాగలింగకవి సంస్కృతాంధ్రభాషల్లో విద్వాంసుడని అవతారిక వల్ల తెలుస్తుంది. అందుకే ఆయన పూర్వకవిస్తుతిలో ముందుగా సంస్కృత కవులను ప్రార్థించిన తర్వాత తెలుగువారైన నన్నయ, తిక్కన, పోతనా మాత్యులను కీర్తించాడు. అంతటితో సరిపెట్టుకోకుండా నన్నెచోడునిలాగా కుకవినింద చేస్తూ దుష్ట శబ్దార్థ పంచకులైన ధూర్తకవీంద్రులను తిట్టిపోశాడు. ఆ తర్వాత కృతిభర్త తనను కావ్యం ఎందుకు రాయమన్నాడో వివరించాడు. వేంకటరాయునికి అపలు కావ్యం రాయించుకోవాలనే కోరిక లేదట. కానీ ఒకనాడు సభాభవనంలో పండితులంతా చేరి రాజును.

సీ॥ ***మనుచరిత్ర గ్రంథమనువుగా కృతిఁజెంది***
***కృష్ణరాయుండు సత్కీర్తి మించె***
***మామిడి సింగనామాత్యుండు నైషధం***
***బంది యాచంద్రార్క మవని వెలసె***

*సరసతర ఖ్యాతి సాహిణీ మారన్న*
*రామాయణం బంది రహి వహించె*
*వసుచరిత్రం బంది వసుధపై విఖ్యాతి*
*రంజిల్లె తిరుమల రాయచంద్రు*
*గీ॥ డదియుఁ గావున ద్రిభువన విదిత కీర్తి*
*సుస్థిరంబయి వెలయంగ సుకవివర్యు*
*లహహ యని మెచ్చ నొకకృతి నందుమయ్య*
*రమ్యగుణసాంద్ర! వేంకటరాయచంద్ర* (1-16) (పట్టాభిరామ విలాసము - పుట.06)

అని రెచ్చగొట్టారు. దానితో అప్పటికే గొప్పపేరుపొందిన నాగలింగకవిని పిలిపించి-

*గీ॥ తరుతటాకాది సప్తసంతతుల యందు*
*కృతియె సతతంబు శాశ్వత కీర్తినంద*
*జేఁయు గావున నమిత విచిత్రసరణి*
*నదియె మా కొనఁగూర్పుము ముదమెలర్ప* (1-22)(పట్టాభిరామ విలాసము - పుట.07)

అని విచిత్రరీతిలో కావ్యం రాసి ఇవ్వమని కోరాడు. అంతే, వెంటనే నాగలింగకవి కావ్యరచనకు శ్రీకారం చుట్టాడు. ఆరాజు వంశాన్ని ఆశ్వాసమంతా వర్ణించి తర్వాత కథలోకి వెళ్ళాడు. ఆరుద్ర అందుకే ఇలా చెప్పాడు. "పప్త సంతానాల్లో కృతి ఒకటి. అయినా ఇతర సంతానాలు: శాశ్వతంగా ఉండవు గనుక శ్రీమంతులు కృతినే ఆశిస్తారు. కట్టించిన గుళ్ళు పడిపోయినా, చెప్పించిన పుస్తకాలు చెక్కు చెదరవనే నమ్మకంతో చాలామంది కావ్యాలు అంకితం పుచ్చుకున్నారు. కొందరు తాము నిలిపిన ఇతర సంతానాలగురించి ఆ కావ్యాలలో ఒకటి రెండు పద్యాలలో చెప్పించుకున్నారు' గానీ మానూరి వెంకటరాయలు అనే ఆయనలాగా పూర్తిగా ఒక ఆశ్వాసం నిండా తాను చేసిన ప్రతిష్ఠను చెప్పించుకున్నవాళ్లు లేరు"4

## 6. వర్ణనలు:

నాగలింగకవి శైలి గాఢమైంది. అయిదు ఆశ్వాసాల్లో ఆయన. చూపిన శబ్దార్థ ప్రయోగాలు పాఠకుల్ని మంత్రముగ్ధుల్ని చేస్తాయి. సంస్కృతపదాల్ని కావ్యంనిండా గుట్టలు పోసినట్లు అన్పిస్తుంది. అట్లని సుకుమారమైన భావాలను కూడా కఠినమైన పద్యాల్లో చెప్పడు. అలాంటి భావాలను సుతిమెత్తని పూవుల్లాంటి పదాలతో కూరుస్తాడు. ద్వితీయా శ్వాసంలో అహల్యవృత్తాంతాన్ని చెప్తూ అహల్య శాపవిముక్తి ఎలాజరిగిందో చిన్నచిన్నపదాల్లో

*క॥ పాపముల గని పతి వలనన్*
*శాపముఁ గొనియున్న మానిసతి వెతలెల్లన్*
*బాపె రఘువీరుఁ డధిక కృ*
*పా పరుడై నిజ ప్రభావము వలనన్* (2-7) (పట్టాభిరామ విలాసము - పుట.34)

అని చెప్పాడు. అలాగే సీతాస్వయంవరానికి ముందు రాముడు చేసిన శివధనుర్భంగ సన్నివేశాన్ని చాలామంది కవులు వర్ణించారు. నాగలింగకవి. చేసిన శివధనుర్భంగ వర్ణనలో ఆ విల్లు విరిగిన శబ్దాల్నికూడా మన చెవులకు విన్పించెట్లు

*చ॥ పటు భుజవిక్రమస్ఫురణఁ బాటిల మేల్ రఘూద్వహుండు వి*
*స్ఫుటతర యష్టి ముష్టిఁగొని పుష్టిగ పింజిని గూర్చియార్చుచున్*
*బెటపెట విస్వనంబులు గుభిల్లుమనన్ బ్రభవిల్లి యెల్ల ది*
*క్తటముల నిండి మ్రోయ శివకార్ముక భంగ మొనర్చె నంతటన్* (2-10) (పట్టాభిరామవిలాసము-పుట.35)

అనే పద్యంలో చెప్పాడు. నాగలింగకవి పద్యాల్లో ఒక లయ ధ్వనిస్తుంది. అది అల్లసాని పెద్దన 'అటజనికాంచె' పద్యంలో కన్పించే 'అభంగ తరంగ మృదంగ శబ్దాలను పలికినప్పుడు ఎలాంటి లయ కల్గుతుందో అలాంటి లయ అనేక పద్యాల్లో నాగలింగకవి పలికించాడు.

*చ॥ జనకులయాన మానసముజ్ఞానము నూనఁగ బూమమంచుఁ భూ*
*జనకులమెల్ల ముం దెరుగ పాటికి మాటికిఁ జాటిన ట్లహో*
*జనకుని యావలింగాని దొసంగు లెసంగ వేసం గడంగి త*
*జ్జనకసుతానుజుల్ వెనుక సాగఁగ బాగుగనేఁగికానకున్*(2-20)(పట్టాభిరామవిలాసము- పుట.37)

అనే పద్యంలో 'సాటికి మాటికి జాటినట్లు', 'దొపంగు లెసంగ వెపన్'' 'మానసము జ్ఞానము నూనగ' వంటి పదాల్లో ఆ లయ కన్పిస్తుంది. అలాగే అల్లసాని పెద్దన మనుచరిత్రలో అరుణాస్పదపురాన్ని వర్ణిస్తూ అక్కడ పుట్టిన చిగురుకొమ్మైన చేవగలదని చెప్పాడు. అలాంటి భావాన్ని మించిన పద్యం పంచమాశ్వాసంలో వుంది.

*సీ॥ అచటనుండిన పాను నిచయంబు లనయంబు*
*నిరుపమ నవరత్ననికరఖనులు*
*జలజాకరంబు లచట నిచ్చలును సుధా-*
*సారోపమిత నీరపూరితంబు*
*లచటఁ జెన్నలరు నుద్యానంబు లెల్లను*
*సాలసంతానంపు సరుచిరములు*
*సతతంబు నచ్చోటు లతికావితానముల్*
*సంజీవనీకళారంజితంబు*
*గీ॥ లనుచు వినుతింప ఘనములై యతిశయిల్లె*
*నిట్టి ధరణీధరంబుతో నెన యనంగఁ*
*దగిన నగరాజ మిద్ధరాతలమునందు*
*కలుఁగ దెచ్చోట ననుమాట కల్లగాదు* (5-19) పట్టాభిరామ విలాసము - పుట.100)

నాగలింగకవి పదాలతో గారడీ చేయగల సమర్థుడు. ఒక పదంతో పద్యాన్ని ప్రారంభిస్తే ప్రతిపాదాన్ని అదే పదంతో అర్థవంతంగా కొనసాగించగల సమర్థుడు.

*క॥ దుందుభిని మీటె నానక-*
*దుందుభినందనుఁడ నగుచు తొలగక నేముం*
*దుందుభిరాలున నని సుర*
*దుందుభి రవ మెనయఁ జేసిఁ దూఁకొని గోటన్* (2-22)(పట్టాభిరామ విలాసము - పుట.37)

*క॥ వాలిని, శివపదరాజీ*
*వాలిని, లంఘిత మహార్ణవాలిని, నతదే*
*వాలిని, వాలోద్ధురకర*
*వాలిని, వాల్గోల నేలవాలగ నేసెన్* (2-23) (పట్టాభిరామవిలాసము - పుట.38) కరవాలము కలవాడు?

పదప్రయోగంతో అబ్బా అనిపించడమేకాదు, ప్రకృతి వర్ణనలతో పులకింప చేయడం కూడా నాగలింగకవికి వెన్నెతో పెట్టిన విద్య ద్వితీయా శ్వాసంలో రాముడు సీతను లంకనుండి తీసుకొనివస్తూ వినుకొండ సమీపానికి వచ్చాడు. అప్పుడు హనుమంతుడు ఆ కొండ గొప్పదనాన్ని చెప్తున్నప్పుడు కవిచేసిన వర్ణనలోనే సువాసనలు గుభాళిస్తాయి.

ఉ॥ *ఘుమ్మని కమ్మతావి నెపకమ్ముగఁ గ్రమ్మఁగ తెమ్మెరల్*
*నమ్ముగ వీచు నాదు వచనమ్ము మనమ్మున మంచు ని*
*క్కమ్ముగ దెల్పు పల్కులకుఁ గ్రమ్మర సమ్మిదమిమ్ము మీరంగా*
*నమ్మనుజేంద్రచంద్రుఁడపుతల్లిరి తగ్గర డిల్లీ దిగ్గునన్* (2-42) (పట్టాభిరామ విలాసము - పుట.41)

రామాయణంలో సీత ఎలా వుంటుందో తెలియదని లక్ష్మణుడు చెప్పాడు. కాని, నాగలింగకవి మాత్రం సీత సౌందర్యానికి పురప్రజలు ఎలా ముగ్ధులయ్యారో చెప్తూ ఆమెను

సీ॥ *సారంగముల నెంచు సారంగముల నొంచు*
*సుదతి క్రొవ్వెదడాలు, చూపువాలు*
*కాంచనంబు నదలు కాంచనంబు విదల్చు*
*చాన నాసికరు మేని తీరు*
*చంద్ర ఖండము నేలు, చంద్రఖండము బోలు*
*బాలిక పాలకపోలలీల పున్నాగములఁగోరు*
*పున్నాగముల మీరు నలినాక్షి నూగారు నాభితీరు*
గీ॥ *చక్రముల దాయి చేడియ చన్నుదోయి*
*చక్రముల దొంతి యీ యింతి జఘనకాంతి*
*పద్మరాగంబులకు దీని పడతి మోవి*
*పద్మరాగంబులకు మెచ్చు పదము హెచ్చు* (3-49)(పట్టాభిరామ విలాసము - పుట.61)

అంటూ పూర్తిగా వర్ణించాడు. అంతే కాదు ఇంత కుందనపు బొమ్మ అరణ్య వాసం ఎలా చేసిందని ప్రజలు ఎలా ఆశ్చర్యపోయారో కూడా నాగలింగకవి చెప్పాడు.

*ఉ॥ ఈ కమలాక్షి యీ కలికి యీ కలహంస సమానయాన యీ*
*కోకిలవాణి యీ కుసుమకోమలవిగ్రహ యీ కుమారి దా*
*నాకలిఁ గాంచి కారడవి నాకలమెట్లు భుజించెనొక్కొ పె*
*న్గాకలొనర్పు నట్టి బహుకంటక బాధల కెట్టు లోర్చెనో?* (3-53)(పట్టాభిరామవిలాసము - పుట.63)

మనకు సీతాఫలం, రామాఫలం అనే పేర్లు ఎలా వచ్చాయో తెలియదు. ఆధునిక కవి శిష్ట్లా ఉమామహేశ్వర రావు మాత్రం వీటికి పేర్లు ఎలా వచ్చాయో ఐతిహ్యంగా చెప్పాడు. అయితే అంతకుముందే నాగలింగకవి ఆ ప్రాంతంలో సీతారాములు తిరిగే సమయంలో ఆ చెట్లు ఏమి కోరుకున్నాయో అందంగా ఊహించి ఇలా చెప్పాడు.

క॥ *సీతారామముఁ గోరుచు*
*సీతారామంబులనగఁజెన్నలరు గిరిన్*
*సీతారాముల పేరిట*
*సీతారామ ఫల తరులు శృంగారకళన్* (5-13) (పట్టాభిరామ విలాసము - పుట.98)

నాగలింగకవి రాసింది విలాసప్రబంధమైనా అందులో కొన్ని ఆనాటి సమాజానికి సంబంధించిన విషయాలు వున్నాయి. వినుకొండకు ఆ పేరు రావటానికి కారణాన్ని ప్రజలు చెప్పుకొనే ఐతిహ్యాన్ని జోడించి చెప్పాడు. సీత లంకకు తీసుకొనిపోబడిన కుశల వార్త రాముడు ఆ ప్రదేశంలో విన్నాడు కాబట్టి వినుకొండనే పేరు వచ్చిందని

చెప్పడం అందంగా వుంది. అలాగే ఆనాటికి ఆప్రాంతంలో ఆకొండపైవున్న 'మూరియ' అనే దేవత శక్తివంతమైందని ఆమెకు ఇనుమును బంగారంగా. మార్చే శక్తి వుందని నాగలింగకవి ఇలా వర్ణించాడు.

*గీ॥ కరుణసిరుల నొసంగు శృంగారలక్ష్మి*
*పేదలకు నెల్ల ముంగిటి పెన్నిధాన*
*మమిత హేమాంగి యనగఁ జెన్నలరు ముండ్ల*
*మూరియను శక్తిశయ్యద్రి ముఖ్య వసతి* (5-20)(పట్టాభిరామ విలాసము - పుట.100)

*క॥ ఇనుము తనను సోకిన యం*
*తనె పదియార్వన్నెలుగుకు తళుకు పసిడిగా*
*దనరించు పరుసవేదికి*
*ఘన నిలయమనంగ నన్నగంబిల నలరున్* (5-21)(పట్టాభిరామ విలాసము - పుట.101)

ప్రబంధవర్ణనలో పురవర్ణన ముఖ్య మైంది కాబట్టి కవి ఐదవ ఆశ్వాసంలో పట్టాభిరాముని ప్రతిష్ఠ జరిగే హౌబు గణేషు పేటను చక్కగా వర్ణించాడు.

**ఉ॥ పూరెను మల్లికావకుళ పుంజము బెల్లను మంజులంబులై**
**కాచెను దాడిమీ కదళికా క్రము కామ్రముఖ ద్రుమావళుల్**
**వీచెను చందనాచల నవీన సుగంధ మరుత్కి శోరముల్**
**సాచెను మన్మథుండు కరసారస మధ్యగపాళి ధూళిగన్** (5-67)(పట్టాభిరామ విలాసము - పుట.113)

అలాగే వసంతరుతువును వర్ణిస్తూ కోకిలతీరును

*చ॥ మొగములు నిక్కి, చైత్రునికి మ్రొక్కి, మదంబుల పొక్కి, మావి లే*
*జిగురులు మెక్కి, నీలములు చిక్కని కాంతుల నొక్కి, నెమ్మదిన్*
*నగవులుఁ దక్కి, సత్కలరవంబులు విక్కి, వియోగి నీర్యచే*
*నెగురుచుఁద్రొక్కి, చాల పొగరెక్కి జరించు పికంబు లామనిన్* (5-68)(పట్టాభిరామవిలాసము - పుట.113)

అని వర్ణించడం వాచన సోమన కోడికూతను వర్ణించిన పద్యం గుర్తుకు తెస్తుంది.

మాండలికభాషలో కథలు రాయడం మనం ఇటీవల చూస్తున్నాం. పాత్రోచిత భాషను కావ్యాల్లో వాడడం ప్రాచీనకాలంనుండి వుంది. బ్రాహ్మణులు వాడే పదాలను వారి వ్యావహారికంలో కవి ఎలా రాశాడో చూడండి.

*సీ॥ సాకేతపురములో సంతర్పణంబష*
*వస్సావషో నీవు వల్లుభొట్లు*
*వస్సాను యేమేమి వడ్డింతురో అహ*
*చెప్పంగ నలవిగా దప్ప మంచి*
*పెద్ద విస్తళ్లష ముద్దపప్పున దొప్ప*
*లోన నెయ్యంపు త్రొంధళమునష*
*కాకరకాయష కందష చామష*
*బెండకాయాననన్ పెండలమష*

*గీ॥ పలుచగా పండు తియ్యని పాయసమన*
*గారెలునష పూర్ణంబులు బూరెలునష*
*వేపినట్లల్ల తిన్నన్ని హోళగలష*
*పెరుగుఁ బొప్పారు రావోయి పేరుభొట్లు!* (5-119)(పట్టాభిరామ విలాసము - పుట.135)

ఈ విధంగా నాగలింగకవి వర్ణనావైదుష్యం ప్రతి ఆశ్వాసంలోను ప్రతిపద్యంలోను స్పష్టంగా కన్పిస్తుంది. అయితే ఈ కవి కావ్యంలో సామాన్య ప్రజలు ఒక్కరు కూడా కన్పించరు.

### 7. చిత్ర కవిత్వం :

కవిత్వాన్ని మన ఆలంకారికులు ఆశు, చిత్ర, మధుర, విస్తర అనే నాలుగు రకాలుగా వర్గీకరించారు. క్రీ.శ. 1285 ప్రాంతాలలో తెలుగుచోడుల ఆస్థానంలో వున్న పెద్దయామాత్యుడు ఆశు చిత్రకవిత్వాలకు ఆద్యుడిగా చెప్పబడ్డాడు. ఆ తర్వాతకాలంలో చిత్రకవిత్వంలో అసమాన ప్రతిభకనపరచిన కవి గణపవరపు వేంకటకవి. ఈయన రాసిన ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసం గ్రంథంలో రకరకాల చిత్ర కవితారీతుల్ని ప్రవేశపెట్టాడు.

ఈ కావ్యంలోని అనులోమ, విలోమ కవిత్వాలు, అచలజిహ్వాలు, పాదగోపనాలు, పద్యభ్రమకాలు పాఠకుల్ని కవి గుంటూరుజిల్లా నరసరావుపేట మంత్రముగ్ధుల్ని చేస్తాయి. ఈ కవి గుంటూరుజిల్లా తాలూకా, గణపవరం ప్రాంతంవాడని ఆరుద్ర అభిప్రాయం. అదే ప్రాంతంవాడైన నాగలింగకవి పట్టాభిరామ విలాసంపై గణపవరపు వేంకటకవి ప్రభావం పడివుండవచ్చు. విలాసం పేరుతో కావ్యం రాయడం, ఆయన ప్రయోగించిన చిత్రకవితారీతుల్ని తనకావ్యంలో ప్రదర్శించడం వంటివి కారణాలుగా చెప్పవచ్చు. నాగలింగకవి చిత్రకవిత్వాన్ని ప్రతి ఆశ్వాసంలో అక్కడక్కడ చెప్పినా, పంచమాశ్వాసంలో చిత్రకవిత్వం తారాస్థాయికి చేరింది.

**అచలజిహ్వాకందద్వయం**: నిర్వచన, నిరోష్ఠ్య కావ్యాలు రాసిన పండితులు మనకు ఎందరో వున్నారు. నాగలింగకవి నాలుక కదలకుండా చదవగల రెండు కందపద్యాల్ని రాశాడు. అవి రెండూ పంచమాశ్వాసంలోనే వున్నాయి. అవి

క॥ **మాయాపహ కాయభవా**
**పాయభయోభయము వేగఁబాపుమిఁక బహూ**
**పాయక కత గేయక భువిఁ**
**బాయక మముఁగావుమయ్య పాపవిభాగా** (5-96)(పట్టాభిరామ విలాసము - పుట.126)

క॥ **భావ భవావుక భావుక**
**భావాలలో భవ విభావభావైభవ పా**
**పానిప విభవభయాపహ**
**వేవేగమె మమ్ముఁగానే ఖగవాహా!** (5-97) (పట్టాభిరామ విలాసము - పుట.126)

**పాదభ్రమక కందము**: కందంలో మరొక విలక్షణమైంది. పాదభ్రమక కందం. అంటే పద్యంలో ఉండే నాలుగు పాదాలను మొదటినుండి చదివినా, పాదం చివరినుండి వెనకకు చదివినా ఒకే విధమైన పదాలు వస్తాయి.

క॥ **భానుతతశ్రిత తనుభా!**
**మానిత నామా నవీనమానాతని మా**
**దానవ నవ వనవనదా!**
**దీనావనధీనధీనధీ నవనాధీ!** (5-98) (పట్టాభిరామ విలాసము - పుట.126)

**అర్థభ్రమక కందము**: పాదభ్రమక కందం కంటే కొంచెం క్లిష్టమైంది. అంటే కందపద్యంలో ఉన్న నాలుగు పాదాలను రెండు భాగాలుగా విభజించుకొని మొదటి రెండు పాదాలను ఒక భాగంగా, 3,4 పాదాలను మరొకభాగంగా తీసుకోవాలి. అప్పుడు మొదటి రెండు పాదాలను మొదటి నుండి చదివినా, రెండోపాదం చివరినుండి వెనకకు చదివినా ఒకే విధంగా వుంటుంది. అలాగే చివరి రెండు పాదాలను అంటే మూడో పాదం మొదటినుండి చదివినా, నాల్గవ పాదం చివరినుండి వెనకకు చదివినా ఒకే విధంగా వుంటుంది.

క॥ **సారస వననుత దమ శమ**
**ధారక కరధామ శమ దతను నవసరసా**
**ధీర వరదదాస నవన**
**తారక కరతానవన సదాదర వరధీ!** (5-99)(పట్టాభిరామ విలాసము - పుట.126)

**పూర్ణ భ్రమక కందము** :- కందలో ఇంకా క్లిష్టమైంది పూర్ణభ్రమక కంద. అంటే పద్యాన్ని మొదటినుండి చదివినా, నాల్గవ పాదం చివరి అక్షరంనుండి వెనక్కి చదివినా ఒకే విధంగా ఉంటుంది.

క॥ **భూవర సరసావనకర**
**ధీవిరథ వశాను తనుధీయ నవాభా!**
**భావానయ ధీనుత తను**
**శావధరవిధీరక నవసారసరవభూ!** (5-100)(పట్టాభిరామ విలాసము - పుట.127)

## 8. ఛందోలంకారాలు:

ఒక కావ్యంలో కవి ఉపయోగించే ఛందస్సు, ప్రయోగించే అలంకారాలు. వాడే భాష కవి రచనాసామర్థ్యాన్ని, నైపుణ్యాన్ని వివరిస్తాయి. అందువల్ల నన్నయాది కవులు తమ కావ్యాలలో ఏదో ఒక ఛందోవిలక్షణతను, అలంకారదక్షతను ప్రదర్శించారు. నాగలింగ కవి పట్టాభిరామ విలాసంలో ఛందస్సుపరంగా కొత్తకొత్త ప్రయోగాలు చేశాడు. అందరు కవులు ఉపయోగించే జాతులు ఉపజాతులు, వృత్తాలతో పాటు గద్యల్లో రకాలనుకూడా ప్రయోగించాడు.

పట్టాభిరామ విలాసంలో ప్రతి ఆశ్వాసాన్ని ముగించే సందర్భంలో ఏదోఒక విశేష ఛందస్సును వాడి ఆశ్వాసాంత గద్య రాయడం నాగలింగకవి అలవాటు. అందుకే ప్రథమాశ్వాసం చివర మాలినీవృత్తాన్ని, ద్వితీయాశ్వాసం చివర భుజంగప్రయాతాన్ని, తృతీయాశ్వాసం చివర మణిగణ వికరాన్ని, చతుర్థాశ్వాసం చివర ఉత్సాహాన్ని, పంచమాశ్వాసం వివర పంచరామరాన్ని వాడి తన ప్రత్యేకతను చాటుకున్నాడు.

నాగలింగకవి మొదట నాలుగు ఆశ్వాసాల్లో సంప్రదాయమైన ఛందస్సుతో కావ్యాన్ని నడిపినా, చివరిదైన ఐదవ ఆశ్వాసంలో తన కవితా విరాడ్రూపాన్ని ప్రదర్శించాడు. ఐదవ ఆశ్వాసంలో (62వ పద్యం) సుగంధ వృత్తాన్ని స్వీకరించాడు. అదే పద్యాన్ని 84వ పద్యంగా కూడా వాడాడు. దానికి కారణం అర్థంకాదు. అలాగే చతుర్థాశ్వాసంలో 'మధురగతిరగడ'ను వాడాడు. పంచమాశ్వాసంలో సుదీర్ఘదండకాన్ని (95) హనుమస్తోత్రపంచకాన్ని (57 నుండి 6 వరకు), చూర్ణిక (115)ను ఉపయోగించాడు.

## 9. అలంకారాలు :

రసవత్తర కావ్యనిర్మాణ సందర్భంలో కవులు అలంకారాల మీదే ఎక్కువగా ఆధారపడతారు. ముఖ్యంగా చిత్ర. గర్భ కవిత్వాలతో పాఠకుల్ని పరవశింప చేయాలనుకునే కవులకు శబ్దాలంకారాల అవసరం ఎక్కువ. నాగలింగకవి గ్రంథంలో శబ్దాలంకారాలకే అగ్రతాంబూలమైనా అర్థాలంకారాలకు కూడా సముచిత ప్రాధాన్యం లభించింది. ముందుగా శబ్దాలంకారాలను పరిశీలిస్తే వృత్త్యనుప్రాస, దేశామప్రాప. లాటానుప్రాస, అంత్యానుప్రాస అలంకారాలతోపాటు యమకము, ముక్తపదగ్రస్తాలంకారాల్ని కూడా వదలకుండా ఉపయోగించుకున్నాడు. వృత్త్యనుప్రాస. ఛేకానుప్రాస చాలా పద్యాల్లో కన్పిస్తుంది.

**చ॥ జనకులయాన మానసముజ్ఞానము మానఁగఁబూనుమంచు భూ**
**జనకులమెల్ల ముం దెరుఁగ సాటికి మాట జాటిన ట్లహో**
**జనకుని యానతింగొని దొసంగు లెసంగ వెసం గడంగి త**
**జ్జనకసుతానుజుల్ వెనుక సాఁగఁగ బాగుగనేఁగి కానకున్** (2-20)(పట్టాభిరామ విలాసము - పుట.37)

అనే పద్యంలో 'న'కారప్రయోగంవల్ల వృత్త్యనుప్రాస, 'సంగ అక్షరాల జంటల ప్రయోగంవల్ల రేకామప్రాస కన్పిస్తుంది.

అదేవిధంగా సీ॥ **కలిమి నెచ్చెలికి చక్కని కుందనపు పీట**
**సకల దీనులకు మానికపు మూట**
**కడుపడి నడరు చెప్పుడు సంపదల తేట**
**నెరి హుళక్కులనుదాఁ జెరుగు వేట**
**నలదారు సత్య వాక్యములచే ముప్పూట**
**ధర్మముల్ దెలుపు నిద్దంపు బాటం**
**గ్రాలు నిచ్చలును వజ్రాలు గట్టిన కోట**
**మనికిగా మనుచు లేమావి తోట**
గీ॥ **మేటి తేగంబులకును మున్నీటిమోట**
**కొమరు మిగులు విలాసరసములయూట**
**కొండవీటికిఁ జేగంట నుండుచోట**
**నింపుఁ బాటీలు బుగణేశుపేట** (5-36) (పట్టాభిరామ విలాసము - పుట.106)

అనే పద్యంలో అంత్యాను ప్రాస టకారంతో చక్కగా సాగింది. ప్రథమాశ్వాసంలో-

**క॥ గోపాలక గోపాలక**
**గోపాలక కవిత సత్వగుణ మహితశ్రీ**
**గోపాలకుఁడగు వేంకట**
**గోపాలనృపాలుఁరె గురుతరకీర్తిన్** (1-56) (పట్టాభిరామ విలాసము - పుట.16)

అనే పద్యంలో యమకాలంకార ప్రయోగాన్ని చేశాడు. అదే విధంగా

క॥ **మేరుధరాధర ధీరా!**
**ధీరాజర్విబుధ సత్కృతి వ్యాపారా!**
**సారావర గంభీరా !**
**ధీ రావోదార జన్య భీమ కుమారా** ! (1-109) (పట్టాభిరామవిలాసము-పుట.31)

పద్యంలో ముక్తపదగ్రస్తాలంకారాన్ని ప్రయోగించాడు. నాగలింగకవి ఉపయోగించిన అర్థాలంకారాల్లో శ్లేషాలంకారానికే అగ్రతాంబూలం. ఎందుకంటే చిత్ర కవిత్వాన్ని వాడిగా నడిపే క్రమంలో శ్లేషాలంకారానికే ఎక్కువ ప్రాధాన్యమివ్వాలి. దాదాపు 50 పద్యాలవరకు శ్లేషాలంకార చమత్కృతులు కన్పిస్తాయి.

**క॥ సురసాలవాలములు భా**
**సుర సాలవిశాల సాల సురుచిరములునై**
**సుర సాలంబులవలె ప్రాం**
**శుర సాల రసాల వితతి శోభిల్లు గిరిన్** (5-16) (పట్టాభిరామ విలాసము - పుట.99)

పద్యంలో 'సురసాలవాలము' పదానికి మూడు అర్థాలు చూపించాడు. అదేవిధంగా

**క॥ పల్లవ తతి విలసిలె నవి**
**పల్లవ లీలావితామ్రపారప రాజిన్**
**పల్లవ తతి విలసి పని**
**పల్లవ లీలా వితామ్రపాద పూజిన్** (5-66) (పట్టాభిరామ విలాసము - పుట.113)

పద్యంలో 'పల్లవ' శబ్దాన్ని వావార్థకోళితంగా వాడాడు. అలాగే

**సీ॥ శరజాత శరజాత శరజాత రూపాద్రు**
**లెనశుచిత్వ మృదుత్వ ధృతి మహిమల**
**ఘనసార ఘనసార ఘనసార పాపులు**
**సాటి యశోధానసార రుచుల**
**గాంగేయ గాంగేయ గాంగేయ వసనులు**
**సవతు వచశ్శార్య సత్త్వములను**
**గోరాజ గోరాజు గోరాజ గమనులు**
**జత భోగ ధీ మహైశ్వర్యములను**
**గీ॥ జగతి నీ మేటి కవి బుధుల్ సన్నుతింపఁ**
**దనరె నిఖిల దిశాంగనాజన శిరః ప్ర**
**దీప్రమణి మకుటాయితో రుప్రతాప**
**శాలి వేంకటరమణ భూపాల మౌళి (1-50)** (పట్టాభిరామ విలాసము - పుట.15)

అనే పద్యంలో క్రమాలంకారం వుంది. ఇక వినుకొండను, హొలుగదేషు పేటను వర్ణించే క్రమంలో అతిశయోక్తి, ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకాలం కారాలను సమయోచితంగా ప్రయోగించాడు.

## 10. భాషావిశేషాలు:

నాగలింగకవి తన కావ్యంలో సంస్కృత భాషాపదాల్ని ఎక్కువగా ఉపయోగించాడని ముందే చెప్పుకున్నాం. అయితే చివరి ఆశ్వాసంలో కొన్ని పద్యాల్లో ఉర్దు, అరబిక్, పార్సీ పదాలను కూడా ఉపయోగించాడు.

**సీ॥ రాణించుకుతినీ షరా యీ పయింబ లే/ఠీకుదా కాశభట్టి బిగించి**
**లలిఁగుల్కు తల్కు కలాభ త్కులాయిపై/షేషు మిన్నా సరి షేషుఁ గట్టి**
**సిరిమించు నెరిజీరి జరబాజుటంచుల/రంగైన ఛిన్ భాజటంగిఁ దొడిగి**
**మేలైన మకమల్ రుమాలా సురాయీలు/లీలఁగా డాపలి కేలఁబట్టి**
**గీ॥ బలుకు సుంబా హె రంగు దువ్వలువఁ గప్పి**
**తన జమీందారి హోదాకుఁ దగిన హొయలుఁ**
**గలిగి వెలఁదుల వలపింప వెలసి నవల**

**రాయఁడన మించి వేంకటరాయుఁడిపుడు. (5-78)** (పట్టాభిరామ విలాసము - పుట.116)

అనే పద్యంలో అన్యాదేశ్యాలే ఎక్కువ. ఈ పద్యంలో అర్థాలను తర్వాత చూద్దాం. అదే విధంగా-

**సీ॥ మురిపెంపు వజ్రాల సరిఫిణీల్ ధరియించి/నీలంపుటుంగరాల్ వ్రేలఁబూని**
**కలికి ముత్యాల చౌకట్ల పోగులుఁ బెట్టి/పటు హరిన్మణి కనత్కటకములిడి**
**పుష్యరాగంబులు భుజకీర్తులలరించి/లలిఁగడాల వలము లునిచి**
**పద్మరాగంబులు పతకముల్ సవరించి/వైఢూర్యమాలికావళులు నెరపి**
**గీ॥ తన వినిర్మల ధర్మసత్య ప్రజాది**
**ఘనతర గుణంబులిటు బహిర్గతములగుడు**
**మొనయఁగాఁజేయు కరుణాసముద్రుఁడనఁగ**

**వెలసె వెంకటరాయ పృథ్వీ ధవుండు(5-79)** (పట్టాభిరామ విలాసము - పుట.116)

ఈ పద్యంలో కూడా ఆన్యాదేశ్యాలు కుమ్మరించాడు. సరిఫిణీల్ (నగలు), ముత్యాల చౌకట్ల పోగులు (4ముత్యాలు చేర్చి కట్టినపోగులు) వంటివి అన్యాదేశ్యాలు. అదే విధంగా మాండలిక భాషను కూడా చక్కగా ప్రయోగించాడు. నేడు భాషావేత్తలు చెపుర్ని వర్ణమాండలికాల్లో భాగంగా బ్రాహ్మణ మాండలికాల్ని సహజసిద్ధంగా వాడాడు. భోజనానికి వెళ్ళే బ్రాహ్మణుల సంభాషణ

**సీ॥ సాకేతపురములో సంతర్పణంబష**
**వస్సావషో నీవు వల్లుబొట్లు**
**వస్సాను యేమేమి వడ్డింతురో అహ**
**చెప్పంగ నలవిగా చెప్ప మంచి**
**పెద్ద విస్తళ్లష ముద్దపప్పున గొప్ప**
**తోడ నెయ్యంచి త్రొంధళమనస**
**కాకరకాయష కంఠష రామష**
**బెండకాయాననన్ పెండలమష**

**గీ॥ పలుచగా పండు తియ్యని పాయసమష**
**గారెలు పూర్ణంబులు బూరెలునష**
**చోపినట్లల్ల తిన్నన్ని హోళగలప**
**పెరుగుఁ బొస్సారు రావోయి పేరుభొట్లు!** (5-119)(పట్టాభిరామ విలాసము - పుట.135)

అనే పద్యంలో చక్కగా వర్ణించాడు.

## 11. ముగింపు:

రామాయణ కథను ఇతివృత్తంగా తీసుకొని రాయబడిన విశిష్ట విలాస కావ్యం నాగాలింగాకవి పట్టాభిరామ విలాసం. దక్షిణాంధ్ర యుగానికి చివరన, ఆధునిక తెలుగు సాహిత్యయుగానికి మొదట సంధికాలంలో వచ్చిన విశిష్ట రచన ఇది. ఇందలి పద్యరచన ద్వారా కవి వర్ణనాపటిమ, పాండిత్యప్రకర్ష వెల్లడవుతుంది. నాగలింగకవి పట్టాభిరామ విలాసంలో రామభక్తితో పాటు కనిపించే రామాయణ ఇతివృత్తాన్ని ఆలంబనగా చేసుకొని చూపించిన ప్రాచీన సాంప్రదాయ సంవిధాన నైపుణ్యాలు వర్ణనలు , ఛందోలంకారాలను, చిత్రకవిత్వధోరణులు, సమకాలీన సామాజిక స్థితిగతులు ఈ రచనను ప్రత్యేకమైన ప్రౌఢకావ్యంగా తీర్చిదిద్దాయని చెప్పవచ్చు.

## 12. పాదసూచికలు:

1. సమగ్రాంథ సాహిత్యం (మూడవ సంపుటం) – ఆరుద్ర, పుట.391
2. ఆంధ్రసంస్థానములు సాహిత్యపోషణము – తూమాటి దొణప్ప, పుట.581
3. పైదే. పుట.582
4. సమగ్రాంథ సాహిత్యం (మూడవ సంపుటం) – ఆరుద్ర, పుట.391

## ఉపయుక్తగ్రంథసూచి:


1. ఆరుద్ర, సమగ్రాంథ సాహిత్యం. (మూడవ సంపుటం). తెలుగు అకాడెమీ, హైదరాబాద్. 2005.
2. దొణప్ప, తూమాటి. ఆంధ్రసంస్థానములు సాహిత్యపోషణము. ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణ, విశాఖపట్నం, 1969.
3. నాగలింగకవి, పండితారాధ్యుల, పట్టాభిరామవిలాసము, నాల్గవ ప్రపంచతెలుగుమహాసభలప్రచురణ, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన సంస్థ, తిరుపతి, 2012.


***



AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_18.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 18. చిద్విలాసం: చిరుతల రామాయణం

**డా. రాజిరెడ్డి మహేందర్ రెడ్డి**

తెలుగు సహాయాచార్యులు,
ప్రభుత్వ డిగ్రీ కళాశాల(స్వ) సిద్ధిపేట.,
సిద్ధిపేట, సిద్ధిపేట, తెలంగాణ .
సెల్: +91 9959525955. Email: ra.mahi.1947@gmail.com

**వ్యాససంగ్రహం:**

*సంస్కృత సాహిత్యంలో ఆదికావ్యంగా ప్రసిద్ధిచెందిన వాల్మీకి రామాయణాన్ని 12వ శతాబ్దాపు గోనబుద్ధారెడ్డి నుండి నేటి వరకు ఎందరో కవులు తెలుగులో అనువాదం, అనుసృజన చేసారు. తెలుగు సాహిత్య ప్రక్రియలన్నిటిలో రామాయణం వెలువడింది. 20వ శతాబ్దంలో తెలంగాణ ప్రాంతానికి చెందిన కల్వగురు కృష్ణమూర్తి రాసిన చిరుతలరామాయణం యక్షగానానికి జానపదులలో ఎంతో ఆదరణ ఉంది. ఇతర రామయణల్లో లేని అవాల్మీకాలు, గానయోగ్యమైన దరువులు, సులభంగా అర్థమయ్యే వ్యవహారిక భాష మొదలైన అంశాల వల్ల చిరుతల రామాయణం విశేషంగా జనాదరణ పొందింది. అలాంటి చిరుతల రామాయణం యక్షగానం పునరధ్యయనం ద్వారా అందులోని సంవిధాననైపుణ్యాలు, భాషాంశాలు , ప్రదర్శనయోగ్యత, ఆత్మీయ సంబంధాలు, మానవీయవిలువలు వంటి అంశాలతో "చిద్విలాసమైన చిరుతలరామాయణము" విశేషాలను తెలియ జెప్పడమే ఈ వ్యాస ఉద్దేశ్యం.*

**Keywords:** రామాయణం, చిరుతలభజన, కరుణరసం, ఆత్మీయసంబంధాలు, తోబుట్టువులు, ప్రదర్శనయోగ్యత, దరువులు, వ్యవహారికభాష, అవాల్మీకాలు, విశ్వాసాలు.

## 1. ఉపోద్ఘాతం:

వాల్మీకి విరచిత సంస్కృత ఆదికావ్యం రామాయణం తెలుగులో దాదాపు అన్ని ప్రక్రియలలో రాయబడింది. పండితుల నుండి పామరుల వరకు ఎవరికీ నచ్చిన విధంగా వారు రామాయణాన్ని రాశారు, ఆదరించారు, అర్థం చేసుకున్నారు. భజనసంప్రదాయానుగుణంగా యక్షగాన ప్రక్రియలో రాయబడి, సులువైన, గానయోగ్యమైన దరువులతో ప్రదర్శనయోగ్యమై ఆబాలగోపాలాన్ని విశేషంగా ఆకట్టుకున్న కల్వగురు కృష్ణమూర్తి

గారి విశిష్టరచన చిరుతల రామాయణం. తెలుగులో వచ్చిన ఎన్నో రామాయణాల్లో ముఖ్యంగా గ్రామీణులకు, అక్షర జ్ఞానం లేని పామరుల నుండి పండితుల వరకు అందరికి చేరువైన చిరుతల రామాయణం విశేషాలను ఈ వ్యాసంలో తెలుసుకుందాం.

## 2. చిరుతల రామాయణం - నామౌచిత్యం:

"కలౌ స్మరణాన్ ముక్తి:" అనే పరాశరస్మృతి సూక్తి ప్రకారం కలియుగంలో దైవనామస్మరణ ద్వారా ముక్తి పొందవచ్చని భావించడం వల్ల సమాజంలో భగవంతుణ్ణి స్తుతించే అనేక విధాల భజన సంప్రదాయాలు ఏర్పడ్డాయి. చిరుతలు వాయిస్తూ, వాటి శబ్దాలకు అనుగుణంగా రామకథ గానం చేస్తూ, తదనుగుణంగా వృత్తాకారంగా నర్తిస్తూ చేసేది చిరుతలభజన. కథాసందర్భానికి అనుగుణమైన దరువులు, వాటికి తగ్గట్టు నృత్యంలో వేగము మరియు నెమ్మదితనము, ఉచ్చారణలో హెచ్చుతగ్గులు వీటితో సాగే చిరుతలభజన సంప్రదాయం ఒకనాడు తెలుగు గ్రామాలలో ఎంతగానో ప్రచారంలో ఉండేది.

చిరుతలు, చిడతలు అనేవి ఒకే అర్థంలో ప్రయోగించినప్పటికీ జన వ్యవహారంలో రెండింటికి తేడా ఉంది. చిడతలు అంటే హరిదాసులు ధరించేవి, పరిమాణంలో చిన్నగా ఉండేవి. చిరుతలు పరిమాణంలో పెద్దగా ఉండి భజన సంప్రదాయంలో ఉపయోగించేవి. లోకానికి ధర్మమార్గాన్ని బోధించి, ఆదర్శ జీవనాన్ని ఆచరించిన రామున్ని దైవంగా స్తుతించే సంప్రదాయం చిరుతల రామభజనలో కనిపిస్తుంది. చిరుతలు అంటే చిన్నవారు అనే మరొక అర్థముంది చిన్నపిల్లలకు కూడా సులువుగా అర్థమయ్యే రీతిలో రాయడం, చిరుతలు వాయిస్తూ చేసే రామ భజనకు అనుకూలంగా ఉండడం వలన ఇది చిరుతల రామాయణంగా వన్నెకెక్కింది. వాద్యం పేరు మీదుగా ఏర్పడిన భజన సంప్రదాయానికి అనుగుణంగా రాయబడి తెలంగాణ ప్రాంతంలో యక్షగాన కళకు ప్రాణం పోసిన విశిష్టరచన "చిరుతల రామాయణం". యాభై ఏళ్ల క్రితం శ్రీకల్వగురుకృష్ణమూర్తిచే రాయబడిన ఈ చిరుతలరామాయణంను హైదరాబాద్ కు చెందిన దాచేపల్లి కిష్టయ్య 1956సంవత్సరంలో మొదట ముద్రితమైంది. సాంకేతిక వినోద సాధనాలు లేని కాలంలో యక్షగాన ప్రదర్శన రూపంలో ఎంతో ప్రచారం పొందింది. ఎన్నో తెలుగు రామాయణాలు అందుబాటులోకి వచ్చినా, వివిధరకాల వినోద సాధనాలు అందుబాటులోకి వచ్చి యక్షగాన కళ మరుగునబడిపోయినా చిరుతల రామాయణం ప్రాశస్త్యం తగ్గలేదు. హైదరాబాద్ దాచేపల్లి కిష్టయ్య సన్స్ పబ్లిషర్స్ వారు నేటికి చిరుతలరామాయణాన్ని ముద్రించడం ప్రజల్లో ఈ రచనకున్న ఆదరణను వెల్లడిస్తుంది.

## 3. సంక్షిప్తత-ప్రదర్శన యోగ్యత:

ఇరువైనాలుగు వేల శ్లోకాల వాల్మీకి సంస్కృత రామాయణాన్ని కవయిత్రి మొల్ల తొమ్మిదివందల పద్యగద్యలతో తెలుగులో సంక్షిప్తంగా రాసింది. అంతకంటే సంక్షిప్తంగా రాయబడిన రచన చిరుతలరామాయణం. రామాయణ

ఇతిహాసంలో ముఖ్యమైన విషయాలను మాత్రమే తీసుకొని సరళ సుబోధకంగా ఈ రచన చేశాడు కల్పగురు కృష్ణమూర్తి. దశరథుని పాత్ర ప్రవేశంతో మొదలై రామాయణంలోని అన్ని ఘట్టాలను స్పృశిస్తూ, కొన్ని చోట్ల వినూత్న కల్పనలను జోడిస్తూ అగ్నిపునీత అయిన సీతమ్మను రాముడు స్వీకరించడం వరకు సాగే కథాంశము చక్కని ప్రదర్శనయోగ్యమైన నాటకంగా మలచి రాయబడింది.

ఇతివృత్తాన్ని సంక్షిప్తం చేయడంతో పాటు ప్రదర్శన సౌలభ్యమైన నాటకంగా రామాయణాన్ని మలచడం విశేషం. తక్కువ నిడివి, ఎక్కువ పాత్రలు, సులువైన దరువులు, వాదాలు- సంవాదాలతో యక్షగాన ధోరణిలో సాగే కథను తేటగీతులు, కందార్థాలు, సీసపద్య రచనతో వేగవంతం చేస్తాడు. రెండు, మూడు రోజుల్లో ప్రదర్శన పూర్తయ్యే విధంగా ఈ రామాయణం రాయబడింది. ఇతివృత్తం సూటిగా, సంక్షిప్తంగా ఉండటం, సరళమైన భాషానుడికారంతో పాటు ప్రదర్శనకు అనుకూలంగా ఉండటం వలన చిరుతలరామాయణం ప్రజల్లో మిక్కిలి ఆదరణను పొందింది.

## 4. సంకీర్తన స్థాయి దరువులు:

"**విఘ్నరాయ నీకు శరణు ఇప్పుడజేతు బ్రోవుమయ/ వేగవేగ బ్రోవుమయ ఏకదంత మేలుమయా "1** అనే ఆటతాళము దరువుతో చిరుతల రామాయణం యక్షగానం మొదలవుతుంది. ఈ గణపతి స్తుతి కేవలం రామాయణ యక్షగాన ప్రారంభంలోనే కాదు ఇప్పటికీ చాలా సందర్భాల్లో భజన కార్యక్రమాన్ని మొదట ఈ దరువుతోనే ప్రారంభించడం గమనించవచ్చు. సంస్కృత, తెలుగు పదాల సమ్మిశ్రమంగా, మణిప్రవాళ శైలి లో తేలికైన ఆటతాళం దరువులో సాగే ఈ స్తుతి విశేష ప్రజాదరణ పొందింది.

రామలక్ష్మణులకు విశేష అస్త్రాలు అనుగ్రహించిన గురువు విశ్వామిత్రుడు. ఈ యక్షగానంలో విశ్వామిత్రుని రాకడ **"రమా రమణా నీ స్మరణ మరువరా/ శ్యామసుందర నామమొదలరా"2**అనే దరువు తో మొదలవుతుంది. ఇందులో గురువు చేత శిష్యుని కీర్తించబడుతాడు. **"నీ గురువులు నిను గొల్చిన వారు"3**అనే మాటలు ఈ దరువులో వ్యక్తమై రాముని గొప్పతనాన్ని ప్రకటిస్తాయి. సంగీతాత్మకమై లయబద్ధంగా సాగే ఈ స్తుతి భజన కీర్తనలలో మిక్కిలి ప్రాచుర్యం పొందింది.

రాముడు సీతా లక్ష్మణులతో కలిసి వనవాసానికి బయలుదేరుతూ మధ్యలో అడ్డుగా వచ్చిన గంగానదిని దాటే సందర్భంలో చెప్పబడిన దరువు సంకీర్తన స్థాయి ప్రాచుర్యాన్ని పొందింది "ఘనమైన ఈ గంగా నది దాటుట మనవశమా" అనే పల్లవితో **"కనుగొంటివా లక్ష్మణ ఈ గంగనది, కనుగొంటివా జానకి ఈ గంగ"** అనే అనుపల్లవితో సాగే ఈ దరువులో "**సురలాకు మునులాకు గరుడా గంధర్వులకు, పావనమే ఈ గంగా జీవనమైనది గంగా"4** అంటూ రాముని నోట గంగానది ప్రాశస్త్యాన్ని, మానవజీవన మనుగడలో నీటివనరుల ప్రాధాన్యతను

వివరించడం జరిగింది. సహజసిద్ధమైన ఆత్మీయ సంబోధనతో,గ్రామీణ వ్యవహారిక భాషలో ఉన్న ఈ దరువు భావగ్రాహ్య సౌలభ్యమై ప్రజాదరణ పొందింది.

రావణునికి హితవు చెప్పడం వలన లంక నుండి వెలివేయబడ్డ విభీషణుడు రాముని శరణు కోరి వస్తాడు. ఈ సందర్భంలో కనిపించే మరొక దరువు **"దండము దండాము నీకు శ్రీరామ/ కోదండధర మార్తాండ శ్రీ రామ"5** సుఖాలను ఇచ్చినప్పటికీ అధర్మవర్తనను వదలిపెట్టి ధర్మమార్గం దారికి మళ్ళిన విభీషణుని మానసిక చిత్తవృత్తిని, అతని నిర్మలిన వ్యక్తిత్వాన్ని నెమ్మదిగా, లాలిత్యంగా సాగే ఈ దరువు వ్యక్తీకరిస్తుంది.

రుశ్యమూక పర్వతంపై దిక్కుతోచని స్థితిలో ఉన్న సుగ్రీవుడు రామున్ని దర్శించగనే ఆర్ద్రంగా రామునికి తహన్ కష్టాలను చెప్పుకుంటూ పరోక్షంగా రామున్ని స్తుతించే **"దశరథ రామా / నను బ్రోవవేర సుగుణధామ"6** అనే దరువు, సముద్రలంఘనంలో హనుమంతుని నోట ఉత్సాహంగా వచ్చే **"ఓ రామా నీ నామామేమారక దలిచెదము/ ఏమారక దలిచెదము వేడ్కతో భజియించెదము"7**అనే దరువు, ఇలా సందర్భానుసారంగా వివిధ పాత్రల నోట వెలువడిన చిరుతల రామాయణం దరువులు అనేక భజన బృందాలలో ఎన్నోమార్లు గానం చేయబడుతూ తెలంగాణ గ్రామీణ ప్రజాజీవనంలో సంకీర్తన స్థాయి గౌరవాన్ని అందుకున్నాయని చెప్పవచ్చు.

## 5. సంభాషణాత్మక శిల్ప విన్యాసం:

ఇతిహాసమైన రామాయణాన్ని ఆఖ్యానంగా చెప్పడం కాకుండా నాటకీయ ధోరణిలో కన్నులకు కట్టించే విధంగా, ప్రదర్శన యోగ్యంగా మలిచింది చిరుతల రామాయణం. పాత్రల సంభాషణ ద్వారా కథాగమనాన్ని సాగిస్తూ అలరించే ఇందలి కొన్ని ఘట్టాలు ప్రేక్షకుల మదిలో ప్రత్యేకత ముద్రను వేశాయని చెప్పవచ్చు. ఆ ఘట్టాలలో కవి ప్రదర్శించిన సంభాషణశిల్ప నైపుణ్యం అలతి అలతి పదాలతో సాగినప్పటికీ, ఆలంకారికత, వర్ణనాచాతుర్యం, కాకువు వంటి సంవిధాననైపుణ్యాలలో ప్రబంధస్థాయికి ఏమాత్రం తగ్గలేదనిపిస్తుంది.

'మాయలేడిని చూసిన సీతమ్మ దాన్ని కావాలని కోరిన సందర్భం, రాముడు వద్దని చెప్పడం అందుకు ఇవ్వకపోతే ఇవ్వనని చెప్పు అంతేగాని ఇలాంటి కానిపోని మాటలు ఎందుకని సీతమ్మ చిరు కోపం ప్రదర్శించడం, అభిమానపడిన రాముడు మాయలోడి కోసమే పరిగెత్తడం' ఇదంతా సహజ సంభాషణలతో చక్కని దరువులతో సాగుతుంది.

**"చూడుమి నాథా/ఈ సొగసగు బంగారులేడి కావలెనాథా/ వేడుకొందుదాన్ని ఇటకు విడువక దెమ్మికనాథా/ కడుమోదముతోడ పెంచి కాపాడుకొందు స్వామి"8**అని సీతమ్మ ప్రేమగా కోరితే రాముడు

**"ఎందుకు సీతా/ ఆ మాయలేడి జాడలు మనకెందుకు సీతా/ ఇందువదన రక్కసులు ఇలను కామరూపులైరి/ మందమతులు నిందింతురు మాట వినుము భూజాత"9** అని ఆమె కోరికలోని ప్రమదాన్ని తెలిపి వద్దని వారిస్తాడు.

కానీ స్త్రీ సహజ చాంచాల్యంతో సీతమ్మ **" వద్దిటు బలుకా / భూవల్లభ నా మాట వినుము /బుద్ధి దీర్పకిట్లు నాతో కాని పోని మాటలేల / పోద్దుపోద్దున లేచి రద్దు జేయుచుంటి"10** అని చిరాకు పడగా ఆమె సంతోషం కోసం రాముడు లేడి వెంబడి పరుగెడుతాడు. సీత కోరిన వెంటనే స్పందించకుండా ఆమె నిందించిన తరువాత రాముడు స్పందించినట్లు చేసిన మార్పు గ్రామీణుల సహజమైన దాంపత్యజీవితపు విశేషాలను వెల్లడిస్తుంది. ఇతర రామాయణాలన్నీ సీతమ్మను ముగ్ధగా, అమాయకురాలిగా చిత్రిస్తే చిరుతలరామాయణం ఈ సందర్భంలో సహజసిద్ధమైన గ్రామీణ స్త్రీ గడసరితనాన్ని సీతమ్మలో చూపెట్టింది.

లంకలో సీతమ్మను చూసిన తర్వాత హనుమంతుడు ఉంగరం ఇచ్చి తన నిజరూపం చూపి "**అమ్మానాకేమో కాని ఆకలవుతున్నది- ఆకలి బాధ తీర్చవే మా అమ్మ జనని"11**అని హనుమంతుడు చిన్న పిల్లవాడిలాగా గోముగా సీతమ్మ తల్లిని తనకు ఆకలిగా ఉందని అడుగుతాడు. హనుమంతుని ఆకలి తీర్చే పరిస్థితుల్లో లేని సీతమ్మ **"ఏకాదశి శివరాత్రి ఏకమై యున్నది నీకేమీ పెడుదుర కొడకా అంజని తనయ"12**అని తన నిస్సహాయతను వ్యక్తీకరిస్తుంది.

సీతమ్మ తాను నిస్సహాయ స్థితిలో ఉండి ఏమీ ఇవ్వలేకపోతున్నానని బాధపడడంతో హనుమంతుడు లంకలో ఉన్న పళ్ళను తింటానని అడుగుతాడు. రాక్షసుల మాయతో కూడిన లంకలో ఏమి తినవద్దని **"కొమ్మ కొమ్మకు వేయి కోటి రాక్షసులుండు / విషముష్టి పళ్ళు కొడుకా / ఆ పళ్ళు వలదు కొడుకా అంజనితనయా"13** అని సీతమ్మ బుజ్జగించి చెప్తుంది. ఎలాంటి క్లిష్ట పరిస్థితుల్లో కూడా మంచివారు చెడు వైపు అడుగేయరాదనే సందేశంతో పాటు తల్లి కొడుకుల మధ్య సహజంగా కనిపించే ఈ మాటలన్నీ చక్కని సంభాషణాత్మకంగా సీత- ఆంజనేయుని వాదంలో కనిపిస్తాయి.

అలాగే సీతా - రావణుల సంవాదనలో రావణుడు సీతమ్మతో రాముని చులకన చేసి మాట్లాడితే సీతమ్మ ఏమాత్రం బెదరకుండా ఎప్పటికైనా తన భర్త రాముడు వచ్చి నిన్ను చంపుతాడని రామున్ని బెదిరించేటువంటి సందర్భంలో సీత దృఢచిత్తత అభివ్యక్తమవుతుంది

**"కనులార చూడవే కౌసల్య కోడాలా/ నా వంక చూడవే ఓ సీతా ఓరమణి"14**అని రావణుడు సీతమ్మను నిందాత్మక ధోరణిలో ప్రశ్నిస్తూ తన సంపదంతా నీకేనని రావణుడు ప్రలోభానికి గురి చేసే ప్రయత్నం చేస్తాడు. ఆ మాటలు విని సీతమ్మ **"లంకా నాకెందుకురా నీవు నాకెందుకురా /వదలక మా వదిన మండోదరి ఉండగను"15** అని నేను సోదరి సమానురాలను నన్ను నీచ భావనతో చూడవద్దని, చూస్తే నాశనం అవుతావని **"పొంగాకురన్నయ్యా పొంగాకు రావణా / పొంగిన నీ పొంగు రామ బాణముచే గుంగు"16** అని హెచ్చరిస్తుంది. బలవంతుడైన వ్యక్తి వలన తాను శీల ప్రమాదంలో ఉన్నపుడు స్త్రీ అతడిని అన్న అని సంబోధించే సహజసిద్ధ భావనతోపాటు ఎంతటి విపత్కరపరిస్థితులెదురైనా ధైర్యం కోల్పోవద్దనే సందేశం ఈ సంవాదం ద్వారా తెలుస్తుంది.

ఇలా చక్కని సంభాషణశిల్పనైపుణ్యంతో సాగే రామాయణం ఘట్టాలను చిరుతల రామాయణం కన్నులకు కట్టినట్టుగా ఆవిష్కరిస్తుంది. ప్రతీ ఘట్టంలో రమాయణ కథా గానం ద్వారా మానవ నడవడిని ధర్మాచరణ మార్గాన్ని నిరక్షరాస్యులకు సైతం సులువుగా అర్థమయ్యేలా చిరుతల రామాయణం వివరించింది.

## 6. వ్యవహారిక భాష:

చిరుతల రామాయణం యక్షగాన రచన అయినప్పటికీ ఇందులో జనవ్యవహారంలో ఉండే వ్యవహారిక భాషనే ఉపయోగించారు. అందుకే ఇది గ్రామీణ ప్రజానికానికి చేరువయ్యింది "కసకస రావే ముసలవ్వ" అని "దండమయ్యా పంతులు" "అన్నారో నాదుగతి" "ఎవ్వరు మీరలు ఏమీ ఆపదలు" " అమ్మా నాకేమొ కాని ఆకలవుతున్నాది" "అమ్మమ్మ సీతమ్మ" "లేరా లేరా లక్ష్మణ లేరా" "కొట్టినా తిట్టినా కోపగించిన గాని" మొదలైన దరువుల్లో పల్లె ప్రజల సహజ సిద్ధమైన భాషా ప్రయోగాలు కనిపిస్తాయి. "రాళ్ళు తాకిన కాలి వేళ్ళల్లో రక్తాలు", "కాలకంఠు శిరము పైన కాపురము ఈ గంగ" మొదలైన మాటలు భావచిత్రాలను రూపుగట్టిస్తాయి. "నీవులేని చోట నేనొక్క దినముండ", "ముక్కంటి తనయులలో చక్కని చంద్రుని బోలు", "ఎండా వానలకునోర్చి ఉండనైతి కొండ మీద" వంటి మాటల్లో సజసిద్ధమైన ఆలంకారికత గోచరమవుతుంది. ఇలా రచన శిష్ట సాహిత్యానికి చెందినా యక్షగానమే అయినప్పటి కొంత కావ్య భాషతో పాటు ఎక్కువగా గ్రామీణ వ్యవహారిక భాష, , కథా సందర్భాన్ని దృశ్యమానం చేసే వాక్య ప్రయోగాలు, సరళమైన సహజసిద్ధ పోలికలు ఇత్యాది అంశాలన్నీ చిరుతల రామాయణానికి ఒకవైపు కావ్య గౌరవాన్ని కలిగిస్తూనే మరోవపు పామర జనరంజకమైన రచనగా పేరొందడానికి కారణమయ్యాయి.

## 7. కరుణరసభరితం:

భవభూతి **"ఏకోరస కరుణ ఏవ నివర్తి ఖేదాభిన్న"17**అని ఉత్తరామచరిత్రలో కరుణరసానికి పెద్దపీట వేశాడు. నవరసాలుగా పేర్కొనబడ్డప్పటికీ కరుణము మాత్రమే రసము. నీరు ఒక్కటే అయినా తరంగాలు, అలలు, నీటిబుడుగలుగా ఉన్నట్టు కరుణ రసమే వివిధ సందర్భాన్ని బట్టి వివిధ రసాలుగా పరిణమిస్తుందని చెప్పి కరుణ రస ప్రాధాన్యతను తెలిపాడు. శోకము నుండి పుట్టిన శ్లోకంతో మొదలైన రామాయణంలో కరుణము నిండుగా కనిపిస్తుంది. జానపదుల మనస్సులను నిర్మలం చేసే అలాంటి కరుణరసానికి చిరుతల రామాయణం పట్టం కట్టిందనవచ్చు.

భట్టుమూర్తి 'కావ్యాలంకార సంగ్రహా'నికి సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి వ్యాఖ్యానం రాస్తూ "రసము అనుభవించినప్పుడు చిత్తవిధృతి కలుగును అది ప్రధానంగా విశేషించి కరుణరసమున మాత్రమే కలుగును" 18 కరుణమే ప్రధానరసంగా భాసిల్లే రామాయణకథ సంక్షిప్తంగా చిరుతలరామాయణం అనే యక్షగానంగా

రాయబడినప్పటికీ ఇందలి కరుణరస ఘట్టాల ప్రదర్శన ప్రేక్షకుల హృదయాలను ద్రవింపజేస్తుంది. ఈ రామాయణం ఆధారంగా ప్రదర్శించబడే ప్రతీ సందర్భాన్ని గ్రామీణ ప్రేక్షకులు తాదాత్మ్యం చెందుతారు.

లక్ష్మణుని చేత ముక్కు చెవులు కోయబడిన శూర్పనఖ అన్న రావణుని వద్దకు వచ్చి ఏడ్చే సన్నివేశంలో ఈర్ష్య భరితకోపము కరణము కనిపిస్తుంది

**"అన్నారో నాదుగతి కన్నులారా చూడుమన్న /కన్నులారా చూడుమన్న కన్నెత్తి కాంచుమన్న / అయోధ్య రాజులట దశరథ కుమారులట/నా ముక్కు చెవులు గోసి నన్నే గతి చేసిరన్న"19** అని తనకు జరిగిన అవమానానికి దుఃఖిస్తూనే తన దుఃఖం ద్వారా అన్నలో కోపాన్ని రగిలిస్తుంది. "**అతని ఇల్లాలు సీత అతి శృంగారము గలది/ ఆ స్త్రీని వర్ణింప ఎవరికి తరముగాదు/ నిక్కముగా పోయి నీవు చక్కగా దేవన్న/ కనకారథమున బోయి గని సీతను దేవన్న"20** అని తనకు జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకునే విధంగా రావణుని ప్రోత్సహిస్తుంది. ప్రతినాయిక శూర్పణఖ పాత్ర నుండి కూడా కరుణ రసాన్ని వ్యక్తం చేయడం ఇందలి రసప్రాధాన్యతను వెల్లడిస్తుంది.

రావణుడు మారువేషణలో వచ్చి మోసగించి సీతమ్మను అపహరించే సందర్భంలో సీతమ్మ దుఃఖం అందరినీ ఏడిపిస్తుంది "**అయ్యో వనచరులారా ఆగమైతిని/ అయోధ్యాచరులారా ఆగమైతిని /అయోధ్య రాములకు వేగదెల్పుడి"21** అని దుఃఖించే మాటల్లో తన తొందరపాటుతనము, తన కోరిక వల్లనే రామలక్ష్మణులు లేకుండా ఒంటరిగా ఉండాల్సి వచ్చిందని అందువల్లనే అపహరించబడ్డానని, ఎలాగైనా ఈ రావణుని నుండి తనను రక్షించమనే ఆవేదన వ్యక్తమవుతుంది. ఈ సన్నివేశం ప్రదర్శించబడినపుడు సమాజంలో ఎప్పుడో ఒకప్పుడు దురాత్ములవల్ల బాధింపబడ్డ ప్రతీ స్త్రీని దుఃఖింప జేస్తుంది.

సీతమ్మ దుఃఖమే కాదు, ధీరోదాత్తుడైన రాముని దుఃఖాన్ని కూడా కరుణరసార్ద్రంగా వర్ణించింది చిరుతల రామాయణం. మాయలేడిని వధించి తిరిగి వచ్చిన రామునికి పర్ణశాలలో సీతమ్మ కనిపించకపోవడంతో మిక్కిలి దుఃఖిస్తాడు.

**"సహోదర నా సీత లేదురా తమ్ముడా /ఎందుబాయే నా తార లేదురా తమ్ముడా / పాపి దానవుండు మాయవేషముతో వచ్చే/ మాయలేడి కోసమే నేను బోతి తమ్ముడా"22** అని సాగే దరువు తను ఆలోచించక చేసిన తప్పు వల్లనే తన ఇల్లాలు దూరమైందనే ఆవేదన వెల్లడవుతుంది. దీనికి కొనసాగింపుగా కనిపించే రాముని శోకావళిలో సీతమ్మ పై రామునికి గల అవ్యాజమైన ప్రేమ వ్యక్తం అవుతుంది. **"జీవితేశ్వరీ రాజీవా సమముఖి దేవి/ ఎందుబోయితీవో తెలియదాయెనే సీత/ కాననంబులోన నిన్ను గాంచినైతిగ సీత/ జానకి నిను వాసి నేను నిలువజాలను సీత.."23** ఈ మాటలు ఎంతటి కటిన హృదయాన్నైనా కరిగిస్తాయి. వాల్మీకి దృష్టిలో రాముడు, రాకుమారుడు, ధీరోదాత్తుడైన వీరుడు. జానపదుల దృష్టిలో రాముడు వీరుడే కానీ కష్టాలు ఎదురైనప్పుడు దుఖానికి అతీతుడు కాదు. అటువంటి జానపదుల దృష్టిలో రూపుగట్టుకున్న రామున్ని ఈ రామాయణం ఆవిష్కరించింది.

సుగ్రీవుడు రాముని దగ్గరకు వచ్చి తన బాధను తెలిపే సమయంలో ఎడతెగని ఆర్తి, ఆవేదన కరుణ రసాత్మకంగా వెల్లడవుతుంది. **"దశరథ రామా నన్ను బ్రోవవేర సుగుణధామ/ వాలి బెట్టు కష్టములకు తాళలేక యున్నవాడ/ ఎలా నీ లీలా చలమేలా జేసేదావు తండ్రి"24** అపార్థాల వలన అన్నదమ్ములు శత్రువులు కావడం, అధర్మవర్తనుడైన బలవంతుని వలన ధర్మాత్ముడైన బలహీనుడు ఇబ్బందులు పడడం వంటి సామాజిక అంశాలను సుగ్రీవుని నోట వ్యక్తీకరించాడు.

రాముని బాణం తగిలి ప్రాణం పోయే సందర్భంలో వాలి తన కుమారుడైన అంగదుడిని దగ్గరకు తీసుకొని దుఖిస్తాడు. **"రారా నా ముద్దుసుతా / రారా సుకుమారదేహా రారా తండ్రీ / రారా నీ రుణమింకను /తీరెను ఈ నాటి తోడ తెలియగ వశమే"25** వాలి సొంత తమ్ముణ్ని వెడలగొట్టి, అతని భార్యను చేపట్టిన దుర్మార్గుడు, కర్కశ హృదయుడు. అటువంటి వాలి మరణం ఆసన్నమైన సమయంలో కొడుకు పట్లచూపిన ఆత్మీయతను కరుణ రసభరితంగా తెలిపాడు. ఎంతటి కటినాత్ముడికైన తన పిల్లల పట్ల ఉండే వాత్సల్యం ఈ పద్యం ద్వారా వ్యక్తమైంది.

సీతాదేవి లంకలో ఒంటరిగా రామునికై ఎదురుచూస్తూ దుఃఖించే సన్నివేశం గుండెలను కరిగిస్తుంది. **"మరచితివో రాఘవ నన్ను మరచితివో రాఘవ/ ఇందుండ నేనెప్పుడూ ఆపదలెల్ల పొందగలేనిప్పుడు /సుందర రూపా నా యందు నిర్దయబూని/ అందముగా మీరు అందే ఉండితిరేమో/ ఏమి చేతును శ్రీ రామ స్వామి నిన్ను ఎట్లా చూతును శ్రీ రామ/ స్వామి నా పై నీకు ప్రేమ దీరేనేమో రామ రామ అనుచు రంజిల్లుచున్నాను"26**అనే మాటలు సీతమ్మకు రామునిపైగల అవ్యాజమైన ప్రేమభావన కనిపిస్తుంది. దానితో పాటు ఇంతకాలం నిన్ను విడిచి ఇంకా నేను జీవించి ఉన్నాను. నామీద ప్రేమను కోల్పోయారా?, నన్ను రక్షించడానికి రావడం లేదు, నేను నీకోసమే పరితపిస్తూ ఉన్నాను. రామా ఎలాగైనా వచ్చి సరే నన్ను తీసుకెళ్లమనే ప్రాధేయత, దాంపత్యవియోగంలో కనిపించే కించిత్ అనుమానము వ్యక్తమవుతాయి.

రాముడు పంపిన ఉంగరం హనుమంతుని ద్వారా తీసుకొని సీతమ్మ ఆ ఉంగరాన్ని అత్యంత ఆత్మీయంగా చూస్తూ దుఃఖించే సందర్భంలో జానపదుల వలపోత కనిపిస్తుంది.

**"ఉంగారమా ముద్దుటుంగారమా, మా రాముల చేతి ముద్దుటుంగరమా / ఎగుర రెక్కలు లేవు నడవ కాళ్ళును లేవు ఎలాగూ వసస్తివే ఉంగరమా/ కౌసల్య మాయత్త, కైక, సుమిత్రయు అందరూ క్షేమమేన ఉంగరమా/ మరది లక్ష్మణుడు భరత శత్రుఘ్నుడు బాగుగా ఉన్నారటే ఉంగరమా..."27** అని ఉంగరాన్ని సంబోధిస్తూ దుఖిస్తుంది. ఆత్మీయులు దూరమైనపుడు జానపదులు అందరినీ తలచుకొని వలపోస్తారు. ఇదే పద్ధతిలో అందరికీ దూరమై ఒంటరిగా దీనస్థితిలో బందీగా ఉన్న సీతమ్మ తనవాళ్లు యోగక్షేమాలను ఉంగరాన్ని అడిగి తెలుసుకునే సందర్భం మనసును ద్రవింపజేస్తుంది. నిర్జీవమైన వస్తువైనప్పటికీ ఉంగరం దిక్కుతోచని స్థితిలో ఉన్న సీతమ్మకు సాంత్వన కలిగించింది.తన భర్త చేతి ఉంగరం తీసుకొన్న తరువాత ఆమె దుఃఖం ఉపశమించే సమయంలో

గతమంతా గుర్తుచేసుకోవడం, అత్తగారింటి విశేషాలు ఉంగరాన్ని అడిగి తెలుసుకోవడంలో జానపదుల సహజమైన దుఃఖోపశమన విధానం కనిపిస్తుంది. ఈ విధంగా కరుణరసం రూపుదాల్చినట్లు పేరెన్నికగన్న చిరుతల రామాయణములో కోపము, ఆర్తి, ఆవేదన, ప్రేమ, దుఃఖము జానపదుల రీతిలో విభిన్నంగా కరుణరసాత్మకంగా వ్యక్తీకరించబడ్డాయి.

## 8. తోబుట్టువుల ఆత్మీయత:

మానవీయ విలువలకు ఆటపట్టయిన రామాయణంలో అన్నదమ్ముల అనుబంధం గురించి చాలా గొప్పగా చెప్పబడింది. వాల్మీకి రామాయణంలో లక్ష్మణమూర్ఛ సమయంలో **" దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః /తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతః సహోదరః" 28** అని చెప్పిన అంశం, "లోకంలో ఏమి దొరికినా తోడబుట్టిన తోడుదొరకదు" అనే జానపదుల విశ్వాసం చిరుతల రామాయణంలో అనేక సందర్భాల్లో వెల్లడువుతుంది. అన్నదమ్ముల సఖ్యతకు రామలక్ష్మణులు ఉదాహరణగా నిలిస్తే, అన్నదమ్ములలో అపార్థం వలన కలిగే నష్టానికి వాలిసుగ్రీవులు ఉదాహరణగా నిలుస్తారు. ఇటువంటి అన్నదమ్ముల ఆత్మీయతలను చిరుతల రామాయణం వ్యక్తం చేసింది.

తాను లేని సమయంలో అడవిపాలైన రాముని వద్దకు భరతుడు వెళ్లి తిరిగి రమ్మని ప్రార్థించే సమయంలో, భరతుని దుఃఖంలో అవ్యాజమైన అన్నదమ్ముల ఆప్యాయత వెల్లడవుతుంది.

**"నాయన్న శ్రీరామ/ నా పాలి దైవమా/ నా యందు దయవీడి నన్నిలా ఉంచితివా?/ ఈ ఇల్లు నాకేలా ఈ రాజ్యసుఖమేల /పాయక నీపాద భజన చేయుచునుందు/ నీవు లేని చోట/ నేనొక దినముండ/ ఈ వేళ నిను విడిచి/ నిమిషం ఉండగలేను"29** ఈ మాటలలో రాముని పై భరతునికి గల అపారమైన ప్రేమానురాగాలు వెళ్లడవుతూనే అన్నని విడిచి ఉండలేని తమ్ముని ఆర్తి, ఆవేదన ప్రేక్షకుల మనసును కదలించివేస్తుంది. రాముడి వనవాసానికి పరోక్షంగానైన తాను కారణమనే భరతుని అపరాధభావన కనిపిస్తుంది. రాముడు రాకుండా తాను వెళ్లనని చెప్పిన భరతుణ్ణి రాముడు బుజ్జగించే సందర్భం తమ్ముడి మీద అన్నకు ఉండాల్సిన వాత్సల్యాన్ని వ్యక్తపరుస్తుంది.

శరీరాలు వేరు ఆత్మలు ఒక్కటిగా నిలిచినవారు రామలక్ష్మణులు. అవసరం లేకున్నా రామునితో పాటు లక్ష్మణుడు అన్నీ సుఖాలు త్యాగం చేసి వనవాసానికివెళ్తాడు. అడుగడుగునా అన్నకు అండగా నిలుస్తాడు. సీతాపహరణం తరువాత **"సహోదరా నా సీతా లేదురా తమ్ముడా" అని ధీరోదాత్తుడైన రాముడు సాధారణ బాలుడిలా విలపించినప్పుడు "పరమపతివ్రత గనుక / సీతకేమి భయము లేదు / ఆత్మారామ స్వామి నీవు చింత జేయ ఫలము లేదు"30** అని లక్ష్మణుడు అన్నను ఓదార్చుతాడు. అటువంటి మనసెరిగిన తమ్ముడు లక్ష్మణుడు యుద్ధంలో మూర్ఛిల్లడం చూసి రాముడు చలించిపోతాడు.

**"హా పాపి దైవమా, నా అనుజుందిడు బడ న్యాయమా"** అని అమయాకంగా దైవాన్ని నిందిస్తూ **"ముందు జేసిన ద్రోహమో, మునుల జంపిన పాపమో /ఘనతరంబుగ స్త్రీల జంపిన ఘాత మనకిది వచ్చెగా"31**అంటూ గత విషయాలను గుర్తుకు తెచ్చుకొని విలపిస్తాడు. తనకోసం రాజ్యం విడిచి వచ్చి నిరంతరం నీడలా ఉండే తమ్ముని వియోగం వలన రాముడు దుఃఖించే తీరు హృదయాన్ని ద్రవింపజేస్తుంది.

హనుమంతుని చేతిలో అక్షయని మరణాన్ని చూసి ఇంద్రజిత్తు దుఃఖించే సందర్భంలో కూడా కరుణము అభివ్యక్తమవుతుంది. **"సహోదరా నీ దయలేదా నాపై /నా కుడి భుజమును నిన్ను నమ్మితి అక్షయ/ ఆ కపిసన్నిధికి నీవు పోకుండా బ్రతుకుదువేము/ చిన్న మరదలిగతిని ఎన్నగా ఇంకేమిరా/ పున్నమి చంద్రుని బోలి ఉన్నది నీ ముఖము రా.."32** ఇంద్రుణ్ణి జయించిన వీరుడు, రాక్షసుడు అయినప్పటికీ తోబుట్టువు వియోగం పట్ల ఉండేభాదను ఇంద్రజిత్తు పాత్ర ద్వారా వ్యక్తం చేయడం విశేషం. తన తమ్ముని మరణానికి పరోక్షంగా రాముడే కారణమని భావించిన ఇంద్రజిత్తు ప్రతీకారంగా లక్ష్మణున్ని చంపి రామునికి సోదరవియోగ దుఃఖాన్ని కలిగించాలనుకుంటాడు. మానవీయ విలువలకు ఆటపట్టుగా నిలిచినా చిరుతల రామాయణంలో వివిధ పాత్రల ద్వారా అన్నదమ్ముల అనుబంధం గురించి, సోదరవియోగ దుఃఖం గురించి చాలా గొప్పగా తెలియజేసారు.

## 9. విచిత్రమైన అవాల్మీకాలు:

తెలుగులో మొదటగా వచ్చిన గోనబుద్దారెడ్డి రంగనాథ రామాయణం ద్వారా ఎన్నో అవాల్మీకాలు ప్రచారమయ్యాయి. అహల్య రాయిగా మారడం, లక్ష్మణ రేఖ వంటి కల్పితాలన్నీ అందులోనివే. ఇవి కాకుండా ఇంకా ప్రేక్షకులను విశేషంగా ఆకర్షించడానికి, కథను సాధారణీకరించడం కోసం ఇదివరకటి రామాయణాల్లో లేని ఎన్నో కొత్త విషయాలు చిరుతల రామాయణంలో కనిపిస్తాయి. **'జానపదులలో రామకథ మొత్తమే కాక కథాంశములు, పాత్రల శీలచిత్రణము ఎన్నియో క్రొత్త పుంతలు త్రొక్కినది. రామాయణము యొక్క పవిత్రతను పెంచు ఉద్దేశ్యమునను విస్తరించినది" 33** చిరుతల రామాయణం యక్షగానమే అయినప్పటికీ పూర్తిగా జానపదులయిన గ్రామీణుల కోసం రాయబడినరచన. అందుకే ఇందులో పూర్వకవులు రాసిన రామాయణాల్లో లేని అంశాలు, గ్రామీణుల నమ్మకాలు అవాల్మీకాలుగా చేర్చబడ్డాయి. సీతారాముల కళ్యాణం తర్వాత తెలుగింటి సంప్రదాయంలో అప్పగింతలు. తండ్రి ఎంత గొప్పవాడు, జ్ఞానసంపన్నుడు అయినా కంటతడి పెట్టకుండా కూతురును అత్తవారింటికి పంపలేడని, అత్తవారింటిలో నడుచుకోవలసిన విధానం, అత్తమామల ఆదరణ ఇత్యాది విషయాలన్నీ ఈ సన్నివేశంలో కల్పించి చెప్పారు. వాల్మీకి రామాయణంలో విశ్వామిత్రుని నోట గంగానది వర్ణన ఉండగా చిరుతలరామాయణంలో వనవాసంలో రాముడు సీతాలక్ష్మణులకు గంగవైభవాన్ని వర్ణించడం. కథానాయకుని నోట గంగ వర్ణన చేయడం ద్వారా ప్రాణాధారమైన జలవనరుల పట్ల జానపదుల్లో ఉండే భక్తిభావన ద్యోతకమవుతుంది.

లక్ష్మణుడు బాణంతో పందును తెంపగా అందులో ఉన్న జంబుకాసురుడు మరణించడం. వలచి వచ్చిన శుర్పనఖతో రాముడు తనకు భార్యఉందని, ఒంటరిగా ఉన్న లక్ష్మణుని దగ్గరకు వెళ్ళమ ని చెప్పడంతో పాటు రాముడు శుర్పనఖ వీపులో **"నీవు ఆత్మలో చదివి దీని ముక్కు చెవులు గోసి రణమొనరించకను పంపు రమ్యము తోడన్"34** అని రాసి లక్ష్మణుని వద్దకు పంపడం. విచిత్రమైన ఈ కల్పనలో తప్పుచేసిన వారు స్త్రీలు అయినప్పటికీ వారిని విడచిపెట్టవద్దని, మోసకారులను మోసపూరిత విధానంలోనే శిక్షించాలనే భావన వక్తమవుతుంది.

శుర్పనఖ మాటలు విన్న రావణుడు సీతఃను ఎత్తుకు రావడానికి సిద్దపడుతాడు. ఆ విషయం తెలిసిన మండోదరి రావణున్ని **"వలదయ్యా ఓ ప్రాణేశ / నలినాక్షుని భార్య సీతనిటకుదేనూ"35** అని వారిస్తుంది. ఈ అవాల్మిక కల్పన ఇతర రామాయణాల్లో లేదు. తన భర్త పరస్త్రీ పై మోజు పడ్డప్పుడు ఇల్లాలు నయానో భయానో భర్త మనసు మార్చాలనుకుంటుంది. అదే విషయాన్ని మండోదరి పాత్ర ద్వారా కల్పించి చెప్పడం జరిగింది.

'హనుమంతుడు తనకు ఆకలిగా ఉందని లంకలో ఉన్న పళ్ళను తింటానని చెప్పినప్పుడు నిరంతరం రామనామం జపించే నీవు పాపాత్ముల ద్రవ్యం తినడం తప్పుని సీతమ్మ చెప్పడం' ద్వారా మంచి ఎలా ఉన్నా గ్రహించాలి, ఎంతటి విషమ పరిస్థితుల్లో కూడా చెడు వైపు వెళ్ళరాదనే భావన వ్యక్తమవుతుంది.

అక్షయుని మరణం చూసి రాక్షస వీరుడైన ఇంద్రజిత్తు దుఃఖించడం. జాతిపరంగా రాక్షసులు అయినా వారు కూడా ఆత్మీయుల ఎడబాటు దుఃఖానికి అతీతులుకారనే విషయాన్ని తెల్పుతుంది.

రామున్ని గెలవడం కోసం రావణుడు పాతాళలోకంలో హోమం చేసినప్పుడు వానరులు మండోదరి దగ్గరకు వెళ్లి రావణుడు చెడు చేస్తున్నాడని తెలిసి కూడా నువ్వు చూస్తూ ఉన్నావు, అతనికి నీతిమార్గం చెప్పడం లేదని నిందిస్తారు. కపులు తిట్టే తిట్లు భరించలేక మండోదరి వెళ్లి హోమతపస్సులో ఉన్న రావణున్ని లేపి హోమాన్ని భగ్నం చేయడం చిత్రంగా కనిపిస్తుంది. సాధారణమైన వానరులు లంకరాజ్యపు పట్టమహిషి మండోదరి దగ్గరికి వెళ్లి తులనాడుతూ మాట్లాడడమనే విషయం అసంభవం. ఇది అవాల్మీకమైనప్పటికి తప్పుచేసేవారు ఉన్నతస్థాయిలో ఉన్నా భయపడకుండా వారిని నిందించడమనే లక్షణం ఈ సన్నివేశంలో వ్యక్తమవుతుంది. ఈ విధంగా జనసామాన్యమైన అనేక విషయాలను రామాయణానికి ఆపాదించి చేసిన చిరుతల రామాయణంలోని వినూత్న కల్పనలు ప్రేక్షకులను ఎంతో ఆకట్టుకున్నాయి. ఇవన్నీ నాగరికులకు వింతగా అనిపించినా జానపదులకు సహజసిద్ధమైన భావనలే కావడం వలన చిరుతలరామాయణకథ వారికి చేరువ కాగలిగింది.

## 10. చిరుతల రామాయణం -విశ్వాసాలు:

రెండు దశాబ్దాల క్రిందటి వరకు తెలంగాణా ప్రాంతంలో విశేష ప్రజాదరణ పొందిన చిరుతల రామాయణ యక్షగానం పట్ల ప్రజలకు, నాటకకర్తలకు బలమైన విశ్వాసాలున్నాయి. ధర్మాచరణకు నిలువెత్తు నిదర్శనమైన

రామున్ని గొప్ప దైవంగా భావించే గ్రామీణులు చిరుతల రామాయణప్రదర్శనను మిక్కిలి భయభక్తులతో ప్రదర్శించేవారు. గురు ముఖత ఈ యక్షగానం నేర్చుకొని సాధన చేయడం మొదలు ప్రదర్శన పూర్తయ్యే వరకు నటులు నియమబద్ధమైన జీవితం గడిపేవారు. పూర్తి శాకాహారులై నాటకప్రదర్శన చేసేవారు. అలంకార సామగ్రిని స్వయంగా తయారు చేసుకొని వాటిని పవిత్రంగా చూసేవారు. చిరుతల రామాయణ నటులను ప్రజలు గౌరవభావంతో ఆదరించేవారు. ప్రదర్శన అనంతరం ప్రజలు నాటక సమాజానికి కట్నకానుకలు ఇచ్చేవారు. ప్రదర్శన చివర రోజున సీతారాముల పాత్రధారులకు తెలంగాణా సంప్రదాయం ప్రకారం ఒడిబియ్యం పోసి గౌరవించేవారు.36 ఇంతటి ఆదరణ ఉన్న చిరుతల రామాయణంలో "సీతమ్మ" పాత్ర పట్ల ఒక అపప్రథ ఉండేది. రామాయణంలో సీతమ్మ కష్టాలు పడ్డట్టుగానే సీతమ్మ పాత్రధారికూడా నిజ జీవితంలో కష్టాల పాలవుతారనే భావన ప్రజల్లో బలంగా ఉండేది. అది చాలాసార్లు రుజువయ్యేది కూడా. అయినా సీత పాత్రధారిని మిక్కిలి గౌరవాస్పదంగా చూసేవారు37. ఈ నమ్మకాలన్నీ రామాయణఇతిహాసం పట్ల ప్రజల్లో ఉండే గౌరవాన్ని, భయభక్తులను వెల్లడిస్తాయని చెప్పవచ్చు.

## 11. ముగింపు:

ఈ విధంగా చిరుతలరామ భజనకు అనుకూలంగా యక్షగాన ప్రక్రియలో రాయబడిన విశిష్ట రచన చిరుతల రామాయణం. కావ్యభాషతో పాటు సులువుగా అర్థమయ్యే గ్రామీణ వ్యవహారిక భాషా నుడికారా ప్రయోగం, జానపదుల చిత్తవృత్తికి తగిన వినూత్న కల్పనలు, సాధారణ వేదికల మీద కూడా నిర్వహించగల ప్రదర్శనసౌలభ్యత, సందర్భానుసారంగా సామాజిక సందేశ వ్యక్తీకరణ, భజనకీర్తనలుగా పేరొందిన ఆటతాళపు దరువులు, దుఃఖప్రకటనతో మనస్సును తేటపరిచే కరుణరసపోషణ వంటి విశిష్ట లక్షణాలు తెలుగు రామాయణాల్లో కల్పగురు కృష్ణమూర్తి చిరుతల రామాయణానికి ప్రత్యేక ప్రాశస్త్యాన్ని కలిగించాయని చెప్పవచ్చు.

## 12. పాదసూచికలు:

1. చిరుతల రామాయణం పుట.సం.1
2.చిరుతలరామాయణం పుట.సం.07
3. గేయ రామాయణం-బాలకాండ - రుక్మాభట్ల నరసింహశర్మ
4.చిరుతల రామాయణం పుట.సం.26
5.చిరుతల రామాయణం పుట.సం.85
6.చిరుతలరామాయణం పుట.సం.47
7. చిరుతల రామాయణం పుట.సం.55
8.చిరుతలరామాయణం పుట.సం.36

9.చిరుతలరామాయణం పుట.సం.36

10.చిరుతలరామాయణం పుట.సం.36

11.చిరుతలరామాయణం పుట.సం.67

12.చిరుతలరామాయణం పుట.సం.67

13.చిరుతలరామాయణం పుట.సం.67

14.చిరుతలరామాయణం పుట.సం.63

15.చిరుతలరామాయణం పుట.సం.63

16.చిరుతలరామాయణం పుట.సం.63

17.బేతవోలు రామబ్రహ్మం భవభూతి ఉత్తరరామచరితం, పుట.సం.6

18.కావ్యాలంకార సంగ్రహం- సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి వ్యాఖ్య ఓరియంటల్ సికింద్రాబాద్ 1945 పుటసంఖ్య 314

19.చిరుతలరామాయణం పుట.సం.34

20.చిరుతలరామాయణం పుట.సం.34

21.చిరుతలరామాయణం పుట.సం.41

22.చిరుతలరామాయణం పుట.సం.42

23.చిరుతలరామాయణం పుట.సం.42

24.చిరుతలరామాయణం పుట.సం.47

25.చిరుతలరామాయణం పుట.సం.53

26.చిరుతలరామాయణం పుట.సం.62

27.చిరుతలరామాయణం పుట.సం.65

28.వాల్మీకి శ్రీమద్రామాయణం, యుద్ధకాండ,101 సర్గ

29.చిరుతలరామాయణం పుట.సం.27

30.చిరుతలరామాయణం పుట.సం.43

31.చిరుతలరామాయణం పుట.సం.88

32.చిరుతలరామాయణం పుట.సం.71

33. వాల్మీకి రామాయణం -ఆలోచనీయంశములు, అష్టకాల నరసింహ రామశర్మ పుట.సం.34

34.చిరుతలరామాయణం పుట.సం.31

35.చిరుతలరామాయణం పుట.సం.34

36.ఆరుట్ల రాజిరెడ్డి ఇంటర్వ్యూ

37.ఆరుట్ల రాజిరెడ్డి ఇంటర్వ్యూ

## ఉపయుక్తగ్రంథసూచి:


1. కృష్ణదాసు కల్పగురు (2016),చిరుతల రామాయణం -చాచేపల్లి కిష్టయ్య సన్స్ పబ్లిషర్స్ హైదరాబాద్.
2. నరసింహ రామశర్మ అష్టకాల (2010) వాల్మీకి రామాయణం -ఆలోచనీయంశములు, శ్రీ సరస్వతిసేవాసమితి, సిద్ధిపేట.
3. నరసింహ శర్మ రుక్మాభట్ల (2001). గేయ రామాయణం-బాలకాండ, ఆడియో క్యాసెట్ , సిద్ధిపేట.
4. రామబ్రహ్మం బేతవోలు (2023). భవభూతి ఉత్తర రామ చరితం, అజో-విభో-కందాళం పౌండేషన్ ప్రచురణలు.
5. వాల్మీకి శ్రీమద్రామాయణం మూడవభాగము,(2016). గీతాప్రెస్, గోరఖ్పూర్.
6. సుబ్రహ్మణ్య శాస్త్రి. శ్రీపాద (2019). వాల్మీకి విరచిత రామాయణం,ప్రగతి పబ్లిషర్స్, హైదరాబాద్.
7. సూర్యనారాయణ శాస్త్రి సన్నిధానం (1945). కావ్యాలంకార సంగ్రహం- వ్యాఖ్యానం ఓరియంటల్ ప్రెస్, సికింద్రాబాద్.

**ఇంటర్వ్యూ:**

1. రాజిరెడ్డి ఆరుట్ల, వయస్సు 91 సం.లు, గ్రా.నగరం, మం.భూంపల్లి, జి.సిద్ధిపేట, తెలంగాణ.


***



AUCHITHYAM

ISSN: 2583-4797

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_19.php

# "కమనీయం తెలుగు రామాయణం"

**జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక**

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

## 19. మొల్లరామాయణం: కవితామాధుర్యం

**డా. కొయ్యా శ్రీనివాసులు**

తెలుగువి భాగాధిపతి,

ప్రభుత్వ డిగ్రీకళాశాల, బుక్కపట్నం,

శ్రీసత్యసాయిజిల్లా, ఆంధ్రప్రదేశ్.

సెల్: +91 9492625280. Email: koyyasrinivasulu@gmail.com

**వ్యాససంగ్రహం:**

*తెలుగుభాషలో ఎన్నోప్రసిద్ధరామాయణాలు ఉన్నాయి. వాటిలో అత్యంతప్రసిద్ధిచెందిన రామాయణం మొల్లరామాయణం. మొల్ల 16వ శతాబ్దానికి చెందిన కవయిత్రి. తన రామాయణాన్ని పోతన వలె భగవదంకితంచేసింది. మొల్ల రామాయణం వాల్మీకి రచించిన సంస్కృతరామాయణానికి యధానువాదంకాదు. మొల్లరామాయణంపై "ఆధ్యాత్మరామాయాణం, భాస్కరరామాయణం "అనుసరించి మనోహరమైన కల్పనలు చేసినట్లు పరిశోధకులు గుర్తిస్తారు. మొల్ల రామాయణాన్ని చాలా సంక్షిప్తంగా 869 గద్యపద్యాలలో వివరించింది. మొల్ల తన రామాయణ అవతారికలో తన కవితారీతులను గురించి వినమ్రంగా వివరించింది. "తేనె నోటికి తగిలితే, నోరు తియ్యగా ఉండేటట్లు, పద్యాల అర్థం వెంటనే స్ఫురించేటట్లు, కావ్యాలు అల్లాలని, కఠిన శబ్దాలతో కావ్యాలు వ్రాస్తే, అది మూగవారికి, చెవిటి వారికి మాత్రమే ముచ్చట కల్గిస్తుందని" మొల్ల వివరించింది. ఏదైతే అవతారికలో చెప్పిందో దానికి అనుగుణంగానే కవిత ఉన్నతస్థాయిలో నడిచింది. పాఠకులు మొల్లరామాయణాన్ని కథాంశాన్ని తెలుసుకోవడానికి కాకుండా, కవితామృతాన్ని ఆస్వాదించడానికి మాత్రమే చదవాలి" అన్నది వ్యాససంగ్రహం.*

**Keywords:** కవయిత్రిమొల్ల, మొల్లరామాయణం, అతిశయోక్తి, కవితాశైలి, రచనాశైలి, కందపద్యాలు, సీసపద్యాలు, కవితామృతం, పాఠకులు, మృదువైనమాటలు, భక్తి, ముక్తి.

## 1. ఉపోద్ఘాతం:

వాల్మీకి సంస్కృతంలో రచించిన 'రామాయణం' ప్రపంచంలో ఆదికావ్యంగా ప్రసిద్ధిచెందింది. ఆదికవివాల్మీకి రచించిన రామాయణాన్ని అనుసరించి ఎంతో మంది ఎన్నో భాషల్లో మరలా రచించారు. ఇంకా రచిస్తూనే వున్నారు. ప్రపంచంలోని మానవసమాజాలను ఇంతగా ఆకర్షించిన గాథ రామాయణం మాత్రమే! మరొకటిలేదు! అనడంలోఎంతమాత్రం అతిశయోక్తిలేదు. తెలుగువారిని రామాయాణం గాథ ఆకర్షించినంతగా

మరే గాథ ఆకర్షించలేదు అనడానికి ఉదాహరణగా ఎంతో మంది కవులు క్రీ.శ.13వ శతాబ్ది నుండి ఇప్పటిదాకా రచిస్తూనే ఉన్నారు. రామాయణ కావ్యం మీద భక్తి ప్రపత్తులు ప్రదర్శిస్తూనేఉన్నారు.

## 2. తెలుగు ప్రసిద్ధ రామాయణాలు:

భాస్కరరామాయణం, నిర్వచనోత్తరరామాయణం, రంగనాథ రామాయణం, మొల్లరామాయణం, కంకటిపాపరాజు ఉత్తరరామాయణం, కట్టావరదరాజురామాయణం, గోపీనాథ రామాయణం, శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణం, కూచిమంచి తిమ్మకవి` అచ్చతెలుగు రామాయణం, శ్రీమద్రామాయణ కల్పవృక్షం, సరస్వతీ రామాయణం, రామాభ్యుదయం, గోవిందరామాయణం మొదలైన రామాయణాలు ప్రసిద్ధమైనా తెలుగులో వందలాది మంది కవులు రామాయణాలు రచించారు, రచిస్తున్నారు. తెలుగులో ఇన్ని రామాయణాలుండగా కవయిత్రి మొల్ల రచించిన మొల్ల రామాయణం మాత్రం తెలుగువారి ఆదరాభిమానాలు పొందడమేకాదు! ఆమె పాండితీ వైభవానికి నీరాజనాలు పడుతారు కూడా! అటువంటి గొప్ప తెలుగుకవయిత్రి మొల్ల. '‘***కవితల్లిన తొలితెలుగు విదుషీమణి రామాయణ కావ్యరచనా రసధుని***’’ అని సాహితీకారుల చేత ప్రశంసింపబడిన కవయిత్రి మొల్ల. ఈమె (1440-1530) 15వ శతాబ్దం ఉత్తరభాగం, 16వ శతాబ్దం పూర్వార్థంలో జీవించినదని సాహిత్యచరిత్రకారులు నిర్ధారించారు. మొల్ల ఇంటిపేరు 'ఆతుకూరి'వారు, కులాన్నిబట్టి ఈమె 'కుమ్మరిమొల్ల'గా ఈమె పేరు జనవ్యవహారంలో ప్రచారం పొందింది. మొల్ల రచనలలో 'రామాయణం' ఒక్కటి మాత్రమే లభిస్తోంది. మొల్ల రచించిన రామాయణమునకు 'మొల్ల రామాయణం' అనిపేరు. మొల్ల రామాయణం వాల్మీకి రచించిన సంస్కృతరామాయణానికి అనువాదం కాదు. రామాయణాన్ని చాలా సంక్షిప్తంగా రచించింది. మొల్ల ఆధ్యాత్మరామాయణం, భాస్కరరామాయణాలను అనుసరించి చక్కని కల్పనలు చేసిన విషయాన్ని ఆరుద్ర సమగ్రాంధ్రసాహిత్యంలో వివరించారు.

## 3. మొల్ల రామాయణం- రచనాసౌందర్యం:

మొల్ల తన రామాయణం అవతారికలో తన కవితారీతుల గురించి ఈవిధంగా చెప్పుకొన్నది.

తే॥ **గావ్యసంపదక్రియలునిఘంటువులును/ గ్రమములేవియునెఱుగ, విఖ్యాతగోప/**
**వరపుశ్రీకంఠమల్లేశువరముచేత/ నెఱిగవిత్వంబుజెప్పగానేర్చుదాన** (మొ॥రా॥అవతారిక12వపద్యం)

క॥ **మునుసంస్కృతములదేటగ/దెనిగించెడిచోటనేమిదెలియకయుండన్**
**దనవద్యమెఱయగ్రమ్మఱ/ఘనమగుసంస్కృతముజెప్పగారుచియగునే.** (మొ॥రా॥అవతారిక16వపద్యం)

ఆ॥ తేనెసోకనోరుతీయనగురీతి/ దోడనర్థమెల్లదోచకుండ
గూఢశబ్దములనుగూర్చినకావ్యమ్ము/ మూగచెవిటివారిముచ్చటగును (మొ॥రా॥అవతారిక17వపద్యం)

క॥ **కందువమాటలు, సామెత / లందముగాగూర్చిచెప్పునదితెనుగునకుం**

**బొందై, రుచిపీనుల/ విందై, మతికానుపించువిభుదులమదికిన్ -** (మొ॥రా॥అవతారిక 18వపద్యం)

మొల్ల గోపవరము శ్రీకంఠమల్లేశు వరప్రభావం చేతనే కవిత్వము రాయగలుగుతున్నానని, శ్రీరామచంద్రుడు తనకు రామాయణం రాయమని ఆదేశించాడని, అందుకే తాను ఇహపరసాధనంగా రామాయణాన్ని వ్రాశానని మొల్ల వినమ్రంగా చెప్పుకొంది. "తేనెనోటికి తగిలితే, నోరుతియ్యగా ఉండేటట్లు, పద్యాల అర్థం వెంటనే స్ఫురించేటట్లు, కావ్యాలు అల్లాలని, కఠిన శబ్దాలతో కావ్యాలు వ్రాస్తే, అది మూగవారికి, చెవిటివారికి మాత్రమే ముచ్చట కలిగిస్తుందని" మొల్ల చెప్పింది. ఇంపైన మాటలతో, సామెతలతో కూర్చిన తెలుగుకవిత్వము పండితహృదయానికి పొందికగా, రసవంతంగా, చెవులకింపుగా కనబడుతుందని, చెప్పిన మొల్ల అలాంటి కవిత్వమే తన రామాయణ రచనలో కనబరచింది.

మొల్లకు పూర్వమే తిక్కన నిర్వచనోత్తరరామాయణం, భాస్కరరామాయణం, గోనబుద్ధారెడ్డి, రంగనాథ రామాయణం, ఎర్రన రామాయణం రాసారు. ఈ విషయమును ప్రస్తావించుచూ

ఉ॥ **రాజితకీర్తినరఘురామచరిత్రముమున్గవీశ్వరుల్**
**తేజమొలర్పజెప్పిరనితెల్పియుగమ్మఁజెప్పనే? లనన్**
**భూజనకల్పకంబగుచు, భక్తికిముక్తికిమూలమంచు, నా**
**రాజునుదైవమైనరఘురామనుతించినదప్పుగల్గునే?** మొ॥రా॥అవతారిక 21వపద్యం

"రాజితకీర్తి" అయిన రఘురాముడి చరితాన్ని వెనుకటి కవులు 'తేజమొలర్ప" చెప్పారని తెలిసి కూడా తిరిగి నేను చెప్పడం ఎందుకు అంటే "భూజనకల్పకం"అయి "భుక్తికి ముక్తికి మూలమైన రఘురాముని" స్తుతించడం తప్పా? అని మనల్నే ఎదురుప్రశ్న వేస్తుంది కవయిత్రి మొల్ల? అంతేగాకుండా తన రామాయణాన్ని శ్రీరామచంద్రుడికే అంకితం జేసింది. శ్రీరాముని ఆజ్ఞ మేరకు రామాయణాన్ని రాస్తున్నానని, తప్పులుంటే మన్నించండి అని కవులను (విమర్శకులు) ఇలా వేడుకొంది.

"**చెప్పుమనె రామచంద్రుడు**
**సెప్పించినపలుకుమీదజెప్పదనేనె**
**ల్లప్పుడునిహపరసాధన**
**మిప్పుణ్యచరిత్రతప్పులెంచకుడుకవుల్**?-(మొ॥రా॥అవతారిక 13వపద్యం)

మొల్ల తన రామాయణంలో బాలకాండ నుండి అరణ్యకాండ వరకు కథను వేగంగా నడిపించింది. రామాయణానికి ఆయువు పట్టిన సుందరకాండ నుండి, ఈమె రచన ఉన్నతస్థాయిలో నడిచి పాఠకులను పరవశులను చేస్తుంది. బాలకాండనుండి యుద్ధకాండవరకు ప్రతిఘట్టంలోనూ మొల్ల కవితాశైలి సరళసుందరంగా, సరసాలంకారాలతో, పాండిత్యస్ఫూర్తితో, ఔచిత్యరసపోషణతో నిండివుంటుంది.

## 4. మొల్ల రచనాశైలి:

మొల్ల తన రామాయణాన్ని ఆమె చెప్పినట్లే మధురప్రసన్నశైలిలో, నోటికి తేనెతగిలితే తియ్యగా వుండేటట్లు, మధురమైన కవితాశైలితో రచించింది. తమ రామాయణాన్ని ఇష్టదేవతాస్తుతితో ఇలా ఆరంభించింది.

ఉ॥ **శ్రీమహిమాభిరాముడువశిష్ఠమహామునిపూజితుండుసు**
**త్రామవధూకళాభరణరక్షకుడాశ్రితపోషకుండుదూ**
**ర్వామలసన్నిభాంగుండుమహాగుణశాలిదయాపరుండు, శ్రీ**
**రాముడుప్రోచుభక్తతతిరంజిల్లునట్లుగనెల్లకాలమున్** (మొ॥రా॥అవతారిక 1వపద్యం)

పై పద్యములోని కవితాశైలి, అక్షరరమ్యతా శైలికి ప్రసిద్ధి చెందిన శబ్దశాసనుడైన మహాకవి శైలిని తలపిస్తుంది. మొల్ల సీసపద్యాలు శ్రీనాథుని సీసపద్యాలు శబ్దాలంకార మాధుర్యముతో పాఠకులను సమ్మోహితులను చేస్తాయి.

**సీ॥ కన్నులుకలువలో? కామబాణంబులో? / తెలివిగానింతికిదెలియరాదు**
**పలుకులుకిన్నెరపలుకులో? చిలుకల / పలుకులో? నాతిరేర్పఱుపరాదు**
**అమృతాంశుబింబమో? యద్దమో? నమ్మోము / తెంపుతోసతికిభావింపరాదు**
**కుచములుబంగారుకుండలో? చక్రవా / కమ్ములో? చేతికెఱుగంగరాదు**
**తే॥ కురులునీలంబులో? తేటిగుంపులొక్కో?**
**పిఱుదుపులినంబో? మన్మధుపెండియరుగో**
**యనుచుగొందఱుసంశయంబందుచుండ**
**వెలదియొప్పారులావణ్యవిభ్రమములు.** (మొల్ల రామాయణం అరణ్యకాండ22వపద్యం)

ఈ విధంగా జానకి లోకోత్తర సౌందర్యాన్ని అరణ్యకాండలో శూర్పణఖ తన అన్న రావణాసురుడికి వివరించి చెబుతుంది. ఈ రామాయణంలోని సీసపద్యాలు మహాకవులు తనకు పూర్వులైన శ్రీనాథుడు, భక్తకవిపోతన శైలులను కలగలిపి రచించింది.

**సీ॥ నీలమేఘచ్ఛాయ బోలు దేహమువాడు / ధవళాబ్జ పత్ర నేత్రముల వాడు**
**కంబు సన్నిభమైన కంఠంబు గలవాడు / చక్కని పీనవక్షంబు వాడు**
**తిన్ననై కనుపట్టు దీర్ఘబాహుల వాడు / ఘనమైన దుందుభి స్వనము వాడు**
**పద్మరేఖలు గల్గు పదయుగంబుల వాడు / బాగైన యట్టి గుల్ఫముల వాడు**
**తే॥ కపట మెఱుగని సత్యవాక్యముల వాడు / రమణి రాముండు శుభలక్షణముల వాడు**
**ఇన్ని గుణముల రూపించ నెసగు వాడు/ వరుస సౌమిత్రి బంగారు వన్నె వాడు** (సుందర. 102)

హనుమంతుడు సీతమ్మకు రాముడు ఆనవాలుగా పంపించిన ఉంగరం ఆమెకిచ్చాడు. అప్పటికీ ఆమె నమ్మదు. "**రాముడేరీతి వాడు అతని చందం బెఱిఁగింపుము**." అంటుంది సీత. అప్పుడు హనుమంతుడు పైవిధంగా భక్తి భావబంధురంగా వర్ణించింది. ఈ పద్యం తెలుగు పిల్లలందరూ ఖచ్చితంగా కంఠస్థం చేయవలసిన పద్యాలలో ఇది ఒకటిగా నిలుస్తుంది. రసరమ్యమైన శైలితో రచించిన ఇటువంటి పద్యాలు మొల్లరామాణానికి వన్నె చేకూరుస్తాయి.

## 5. కమనీయమైన కంద పద్యాలు:

మొల్ల రామాయణం ''రాశిలో చిన్న వాసిలో పెద్ద'' ఈ చంపూరామాయణ కావ్యంలోని 869 గద్యపద్యాలలో కందపద్యాలే ఎక్కువ. తెలుగునాట ''**కందము వ్రాసినవాడే కవి, పందిని చంపినవాడే బంటు**'' అనే సామెత ప్రబలంగా వాడుకలో ఉంది. పందిని వేటాడడం వేటగాడికి ఎంతకష్టమో, కవికి కందపద్యం రాయడం కూడా కష్టమే కారణం కందపద్యం ఛందస్సు, వృత్తపద్యం లాగా ఖచ్చితమైన ఛట్రంలో బిగించినట్లు ఉండదు. అట్లాగని తేటగీతి, ఆటవెలదుల్లా ఇంద్రగణాలు, సూర్యగణాలు ఏవైనా ఎక్కడైనా రాయవచ్చు అన్నట్లుగా కూడా ఉండదు. కందపద్యానికి నియమాలు ఎక్కువ. తెలుగుభాషలో మొదటి కందపద్యం వ్రాసిన వారు నన్నయ అయినా ఉభయకవిమిత్రుడైన తిక్కన సోమయాజిగారు కందపద్యాన్ని కదం తొక్కించారు. తిక్కనంత వ్యంగభరితంగా, రసబంధురంగా కందపద్యం రాసినవారు తెలుగుసాహిత్యంలో అరుదుగా కనబడతారు. తిక్కన తరువాత కందపద్యాలు అద్భుతంగా రచించిన రచనల్లో సుమతీ శతకకర్త బద్దెన, ఆంధ్రమహాభాగవత కర్త పోతన, మొల్లరామాయణ కర్త కవయిత్రి మొల్లలు ముందువరుసలో ఉంటారు.

మొల్ల కందపద్యాలు సరళసుందరంగా, కమనీయ కవితతో రచింపబడి పాఠకున్ని రసలోకంలో విహరింప జేస్తాయి. ఉదాహరణకు

**క॥ కందువ మాటలు, సామెత**
**లందముగా గూర్చిచెప్ప నది తెనుగునకుం**
**బొందై, రుచియై వీనుల**
**విందై, మఱి కానుపించు విబుధుల మదికిన్** (మొల్లరామాయణం అవతారిక 18వపద్యం)

**క॥ పంటల భాగ్యము గలరై**
**పంటలపై బంటలమర బ్రతుకుదురెపుడున్**
**బంటలు బాడియు గల యా**
**పంటలు మొదలైనకాప్ర బ్రజలా నగరిన్** (మొల్ల రామాయణం బాలకాండ13వ పద్యం)

**క॥ కనియును వినియును నెఱుగము**
**కనకమ్మృగం, బనుచు వేడ్క గడలుకొనంగన్**
**గనగ, మృగంబద్భుతమిది**
**కనకమ్మృగం, బేమిసేయ గలదో మీదన్** (మొల్ల రామాయణం అరణ్యకాండ 29వ పద్యం)

**క॥ మఱువులు, సందులు, గొందులు**
**నిరవులు, జొరరానిచోట్లు, నాకాంతంపుం**
**దెరువులు, నంతంపురములు**
**బెరపున గపి కుంజరుడు వెదకం జొచ్చెన్** (మొల్లరామాయణం సుందరకాండ29వపద్యం)

ఈ విధంగా మొల్లకందపద్యాలు పాఠకుని మదిదోస్తాయి. వాటిని పదేపదే చదవాలనిపిస్తుంది. కందపద్య రచనలో మొల్లది అందెవేసినచేయి. ఈమె రచించిన మొల్లరామాయణంలోని కందపద్యాలను అన్నింటినీ వరుసగా

కూర్చితే మొల్ల కందరామాయణం అవుతుందని పరిశోధకులు మెచ్చుకున్నారు. కందపద్యరచనలో మొల్ల తిక్కన కవితాశైలిని గాకుండా బద్దెన, పోతన కవితాశైలులను అనుసరించిందేమో అనిపిస్తుంది. ''మొల్ల రామాయణాన్ని కథాంశం తెలుసుకోవడానికి చదువరాదు, కవితామృతాన్ని ఆస్వాదించడానికి మాత్రమే చదవాలి'' అన్న మాటలు అతిశయోక్తి గాదు.

## 6. సంభాషణా చాతుర్యం:

మామూలుగా ప్రతికావ్యంలోనూ సంభాషణలు ఉండటం సహజం అద్భుతమైన సంభాషణం మాత్రం నాటకంలో చూస్తాము. మహాకవి తిక్కన తన భారతంలో కథనాన్ని నాటకీయతతో నడిపిస్తాడు. తిక్కన నాటకీయశైలిలోని వ్యంగ్య వైభవాన్ని తరువాతి కవులు చాలా మటుకు అందిపుచ్చుకోలేక పోయినారు. కానీ కవయిత్రి మొల్ల మాత్రం సుందరకాండలోని సీతా-రావణ సంవాదఘట్టములోనూ, హనుమద్రావణ సంవాద ఘట్టములోనూ, యుద్ధకాండలోని రామరావణుల వీరాలాపముల ఘట్టములోనూ, మండోదరి దీనాలాపములు చేయు సందర్భములోనూ మొల్ల సంభాషణా చాతుర్యము సహజమైన వ్యావహారిక తెలుగుభాషనే స్ఫురణకు తెస్తుంది. సీతారావణసంవాద ఘట్టములో సీతారావణ సంభాషణ పాఠకులను ఊపిరి తీసుకోనివ్వకుండా చేస్తుంది మొల్ల కవయిత్రి.

రావణుడు సీతను చూసి ''నా యెడ గృపారసము సేయక వివేకమును నీయెడల నుండుటిది న్యాయమే లతాంగీ''. అన్నాడు. ''అలకేశ్వరుడు(కుబేరుడు)ఉపాయనంగా ఇచ్చిన చీనీ,చీనాంబరాలు మొ॥ఎన్నో కలవు నాయింట'' అని ఆమెను మురిపించాలని చూశాడు. ఆ తర్వాత ఆత్మస్తుతికి దిగి ఎవ్వాని వీటికి ఏడు వారధులు పెట్టని కోటలై పెచ్చుపెరుగు'' అంటూ మాట్లాడుతూ మరలా

తే॥ **జడలు ధరియించి తపసుల చందమునను**
**దమ్ముడును దాను ఘోర దుర్గమ్ములందు**
**గూరగాయలు కూడుగా గుడుచునట్టి**
**రాముడేరీతి లంకకు రాగలడు.** (మొ॥రా॥సుందరకాండ50వపద్యం) అనిఅంటాడు. మరలా

క॥ **నీ కన్నుల సౌభాగ్యము**
**నీ కుచముల గలుగు మేలు నాముఖ కాంతుల్**
**నీ కరముల లావణ్యము**
**నాక స్త్రీలందు లేవు నాకుంజూడన్** (మొ॥రా॥సుందరకాండ55వపద్యం) అని తన ధనసంపదను,

సీతాదేవి తనూసంపదను పొగుడుతుంటాడు. అప్పుడుసీత-

కం॥ **పతి దైవముగా నెప్పుడు**
**మతి దలచుచు నుండునట్టి మగువల జెఱుపన్**

**బ్రతిన గల యట్టి నీతో**

**బ్రతి వచనము లాడుకంటె బాపము గలదే.** (మొ॥రా॥సుందరకాండ59వపద్యం) అని తీక్షణంగా సమాధానమిస్తుంది. ఈ ఘట్టములో సీతారావణుల వాగ్వివాదములో రావణుడు సీతపై కోపం తెచ్చుకొని

**తే॥ నాకు నెదిరింప నొక పేద నరుని నొడ్డి**
**వెఱవ కేరీతి దుర్భాషలఱచు దీని**
**జిహ్వ మొదలంట బట్టి యీ శితకుర**
**ధార దునుమాడి ధారుణి బాఱవైతు".**(మొ॥రా॥సుందరకాండ74వపద్యం) అంటూ సాగే సంభాషణా చాతుర్యాన్ని మొల్ల అతిమనోహరంగా నడిపించింది.

## 7. అనుప్రాసలతో అందమైన రచన:

మొల్ల తన రామాయణాన్ని అనుప్రాసలతో వివరించింది. శబ్దాలంకారసమన్వితమైన పాఠకుల మదిని చూడగానే ఆకట్టుకొంటాయి. నన్నయలోని అక్షరరమ్యతా గుణం పోతన తన ఆంధ్రమహాభాగవతములో ప్రతిపద్యములోనూ అక్షరవిన్యాసం చేయించాడు. అందుకే అది ఆబాలగోపాలాన్ని ఆకట్టుకుంది. అనుప్రాసాలంకారం వచ్చిన హల్లే మళ్ళీ రావడం. పునరుక్తి చెవులకు ఇంపయిన శబ్దాన్ని అందిస్తుంది. కవయిత్రి మొల్ల తన రామాయణంలో అనుప్రాసలకు పెద్దపీట వేసి, కవితామృతాన్ని పాఠకుల మీదికి వెలజల్లింది.

**ఉ॥ రాజులు కాంతియందు, రతిరాజులు రూపమునందు, వాహినీ**
**రాజులు దానమందు, మృగరాజులు విక్రమ కేళియందు, గో**
**రాజులు భోగమందు, దినరాజులు సంతత తేజమందు, రా**
**రాజులు మానమందు, నగరమ్మున రాజకుమారులందఱున్**(మొ॥రా॥బాలకాండ11వపద్యం)

**ఆ॥ దేవగణములార! దిక్పాలవరులార!**
**వృక్షజాతులార! పక్షులార!**
**కుటిలదానవుండు గొంపోవుచున్నాడు**
**కరుణతోడ నన్ను! గావరయ్య!** (-మొ॥రా॥అరణ్యకాండ42వపద్యం)

ఈ విధంగా పైపద్యములో వృత్యాను, అంత్యానుప్రాసలు ప్రయోగించి చదువరులను మంత్రముగ్ధులను చేసి పద్యాన్ని సులభంగా కంఠస్థం చేసేటట్లు చేసింది.

**క॥ గిరి గిరి నభము నభంబును**
**ధర ధరయును, జలధి జలధి దార్కొను రీతిన్**
**సురరిపుడు నసురరిపుడును**
**దురమున నెదిరించి రధిక దోర్బల యుక్తిన్** (మొల్ల రామాయణం, యుద్ధకాండ53వపద్యము)

మొల్ల తన రామాయణములో ఇటువంటి అనుప్రాసలతో పద్యానికొక సొబగు చేకూర్చి పాఠకులను వింతలోకములో విహరించేటట్టు చేసింది.

## 8. ముగింపు:

మొల్ల తన రామాయణకావ్యములో కందువమాటలు లోకసహజమైన అనేక సామెతలతో, తేటతెలుగు పదబంధాలతో రామాయణాన్ని ప్రబంధశైలిలో రచించింది. మొల్ల కవితా లక్ష్యము వాల్మీకిరామాయణాన్ని సంపూర్ణంగా అనువాదం చేయడం కాదు. రంగనాథరామాయణం, భాస్కరరామాయణం, సంపూర్ణంగా వాల్మీకిరామాయణాన్ని అనుసరించి అనువాదమై జనామోదం, పండితామోదం పొంది చలామణిలో ఉన్నాయి. రామచరితం ఇహపర సాధనమని నమ్మిన మొల్ల భక్తికి, ముక్తికి మూలమైన శ్రీరాముడి దివ్యచరితమైన రామాయణాన్ని సంక్షిప్తంగా ప్రబంధరీతిలో రాయాలని సంకల్పించింది. ఆమె కవితాలక్ష్యం ప్రబంధ ఫక్కీలో, కావ్యశైలిలో, మృదువైన మాటలతో, దేశీయాలైన పలుకుబడులతో ప్రసన్నమధురంగా, చమత్కారభరితంగా, రసబంధురంగా, శబ్దార్థసమన్వితంగా ధ్వనీభూతంగా రాయడమే మొల్ల కవితాలక్ష్యం. మొల్లరామాయణం ఆసాంతమూ ద్రాక్షపాకమే కాదు రసపాకము కూడా. అందుకే అది తెలుగువారికి వీనులవిందు అయింది. మొల్ల అద్వితీయ కవయిత్రిగా తెలుగువారి హృదయాలలో చిరస్థానం సంపాదించుకున్నది.

## 9. పాదసూచికలు:

1. ఎమెస్కో మొల్లరామాయణం పీఠిక -14, 15, 17, 25పేజీలు
2. తెలుగు సాహిత్య సమీక్ష-ఆచార్యజి.నాగయ్య- 397, 398పేజీలు
3. తెలుగు సాహిత్య చరిత్ర-డా॥ద్వా.నా.శాస్త్రి- 54, 55పేజీలు
4. మొల్ల రామాయణం, కవిత, వర్ణనామాధుర్యాలు

## 10. ఉపయుక్తగ్రంథసూచి:


1. ఉషాదేవి, అయినవోలు. మొల్లరామాయణం: కవిత, వర్ణనామాధుర్యాలు.
2. నాగయ్య, జి, తెలుగుసాహిత్యసమీక్ష. జి.నాగయ్య (రెండవసంపుటం) 2021.
3. రామకృష్ణశాస్త్రి, యస్. A complete History of Telugu Literature Vol.I&II (యూనివర్శిటీఆఫ్‌మద్రాస్- 1976)
4. లక్ష్మీ కాంతమ్మ, ఊటుకూరి. మొల్ల రామాయణం -పొట్టి శ్రీరాములు విశ్వ విద్యాలయం హైదరాబాద్ 2008.
5. సిమ్మన్న, వెలమల. విమర్శ సిద్ధాంతాలు, దళిత సాహిత్య పీఠం విశాఖపట్టణం 2009.


***


AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_20.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 20. అన్నమయ్య: శ్రీరామసంకీర్తనం

**తంత్రవహి శ్రీరామమూర్తి**
తెలుగు అధ్యాపకులు,
ప్రభుత్వజూనియర్ కళాశాల,
సామర్లకోట, కాకినాడ జిల్లా.
సెల్: +91 ఆంధ్రప్రదేశ్. Email: tantravahisriram@gmail.com

**వ్యాససంగ్రహం:**

*శ్రీవేంకటేశ్వరుని పరత్త్వమూర్తిగా, ఆగమ సంప్రదాయాలలో వినుతుడైన వైభవమూర్తిగా కీర్తించిన సుప్రసిద్ధ వాగ్గేయకారుడు అన్నమయ్య. అనేక వైష్ణవ క్షేత్రాలను సందర్శించి ఆ దైవతములయందు శ్రీవేంకటేశ్వరుని భావించి కీర్తించాడు.సంగీతం సాహిత్యం,భక్తి త్రివేణీసంగమంగా సాగిన ఈ కీర్తనలలో గ్రాంధిక భాష, శిష్టవ్యావహారిక, వ్యావహారిక భాషా శైలులు కనిపిస్తాయి. సంస్కృతాంధ్ర భాషలలో ఈ సంకీర్తనలలో రచింపబడ్డాయి. శ్రీరామ క్షేత్రాలైన విజనగరము, గుత్తి, వావిలిపాడు, గండికోట, విజయనగరము మొదలైన క్షేత్రాల అధివాసుడైన రాముని వేంకటరామునిగా గానం చేసాడు. శ్రీరామ కీర్తనలలో తెలుగు భాషా కీర్తనలే అధికం. శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రి, శ్రీరాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, శ్రీనేదునూరి కృష్ణమూర్తి, శ్రీమతి శోభారాజ్, శ్రీ గరిమెళ్ల బాలకృష్ణ ప్రసాద్ మొదలైన ఎందరో మహనీయులు వీటిని ప్రకాశింపచేసారు. చేస్తున్నారు. ఎంతో మంది పరిశోధన కావించారు. వీరి కృషి వలన ఈ రోజు ఇంటింటికీ అన్నమయ్య పాట విస్తరించింది. కూచిపూడి నృత్యాలలోనూ, చలన చిత్రాలలోనూ భాసించి ఖండాంతరాలోనూ కోట్ల గళాలలో మారుమ్రోగుతోంది. అటువంటి కీర్తనబండారమునందు 34 సంపుటాలలో ఉన్న శ్రీరామసంబంధ కీర్తనలను వింగడిరచి అన్నమయ్య రామభక్తితత్త్వాన్ని విశ్లేషించి వివరించటమే ఈ వ్యాసంఉద్దేశం. దీనితో భవిష్యత్తులో మరిన్ని కీర్తనలను ఇదే విధంగా పరిశీలించటానికి మార్గం ఏర్పడుతుందని భావిస్తున్నాను.*

**Keywords:** అన్నమయ్య, శ్రీరామ సంకీర్తనలు, దేవ దేవం భజే, శ్రీరామమహిమ ప్రశస్తి, శ్రీరాముని పరాక్రమం.

## 1. ఉపోద్ఘాతం:

క్రీ.శ 15 శతాబ్దములో జీవించిన భక్త వాగ్గేయకారుడు, సంగీత సాహిత్య నిధి అన్నమయ్య. విశ్వరూపుడైన విష్ణువు శ్రీవేంకటేశుడుగా వేంకటాచలం మీద వెలిసాడు. అతనిని ‘‘ముప్పది రెండు వేళల’’ నుతిస్తూ ముప్పది వేల సంకీర్తనలు రచించి అన్నమయ్య రచనా విశ్వరూపాన్ని తెలుగు వారికి సాక్షాత్కరింపజేసాడు.

లభించిన పదునాలుగువేల కీర్తనలు చూస్తేనే ఇలా అనిపిస్తుంది. ఇక అన్ని కీర్తనలు లభించి ఉంటే, దీక్షగా కీర్తించే భక్తులకు శ్రీవేంకటేశ్వరుని సాక్షాత్కారమే లభించేదేమో. అటువంటి సంకీర్తనా భాండాగారంలోని 34 సంపుటాలలో కొన్ని సంకీర్తనలలో అన్నమయ్య దర్శించిన శ్రీరాముని స్వరూప స్వభావాలను, దయా పరాక్రమాలను, శ్రీరామ శరణాగతిని, రామకథ రచనా వైచిత్రిని, రామ మహిమ - ప్రశస్తిని స్థూలంగా పరిశీలించటమే ఈ వ్యాసం ఉద్దేశం.

## 2. శ్రీరాముని స్వరూప వర్ణన:

శ్రీరాముని అనేక విధాలుగా వర్ణించిన అన్నమయ్య కీర్తనలలో శ్రీరాముని స్వరూప వర్ణన చాలా స్వల్పమని చెప్పవచ్చు. దేవ దేవం భజే... (1వ సంపుటం-314 సంకీర్తన)లో ... శ్రీరాముడు రాజవరశేఖరుడు. ఆజానుబాహుడు. నీలాభ్రకాయుడు. నీల జీమూత సన్నిభ శరీరుడు. రాజీవలోచనుడు. ఘనవిశాల వక్షుడు. కోదండమును పట్టుకొనుటే దీక్షగా ఉన్నవాడు. జలజనాభుడు. భోగిశయనుడు అయిన పరమనారాయణుడే వేంకటేశ రూపంలో ఉన్న రఘుపుంగవుడు. ''రాముడు లోకాభిరాముడు వీడిగో వేమారు మొక్కుచు సేవించరో... (4వ సంపుటం-515 సంకీర్తన)లో చెలువపు రూపంలో ఉన్న జితకాముడు, ఘనకాంతుల నీల మేఘ శ్యాముడు, సిరుల మించిన తులసీ దాముడని వర్ణించాడు.

''రాముడు లోకాభిరాముడు ఆముక విజయనగరమందున్న రాముడు..... (3వ సంపుటం-233 సంకీర్తన)లో చక్కదనములవాడు, జానకీవల్లభుడు, పైడివిల్లునమ్ములవాడు, చాయనల్లని వాడు అని తెలుగుతనంతో వర్ణించాడు. ఈతడు తారక బ్రహ్మమితడు మా దేవుడు... (2వ సంపుటం-208 సంకీర్తన)లో ఇందీవరశ్యాముడు, షోడశ కళా సోముడు, నీలమేఘ వర్ణుడు, వాహన సుపర్ణుడు, భరత లక్ష్మణ శత్రుఘ్న సహితుడు అయిన శ్రీరామ స్వరూపాన్ని వర్ణించాడు. శ్రీరాముడు తామరకన్నుల దశరథ తనయుడు, అంబుదవర్ణుడు, కోదండధరుడు, గురుకిరీటపతి అని వీడివో అలవిజయరాఘవుడు....(32వ సంపుటం-52 సంకీర్తన)లో వర్ణించాడు. అనేక కీర్తనలలో ''రాజీవ నేత్రాయ నమో''అని నుతించాడు.

## 3. శ్రీరాముని స్వభావ వర్ణన:

శ్రీరాముడు పరమ దయా స్వరూపుడు అంటాడు అన్నమయ్య. దయను చూపడంలో అతనే హద్దు. అతనిని మించిన వారు లేరు అంటూ ''**రామా దయాపరసీమా.....** (3వ సంపుటం-94 సంకీర్తన)లో అపరాధి ఐన రావణుని తమ్ముని కృపచూపావు.. యాగవిఘ్నం చేసిన మారీచుని అప్పటికి విడిచిపెట్టావు. ఇది నీ దయే కదా అంటాడు. సీతను బాధపెట్టిన కాకాసురునికి అభయం ఇచ్చావు. దర్భశయనం చేసినా పలుకని సాగరునిపై కోపగించి అతనిని మంచి దారిలో పెట్టావు. నేరములెంచటం నీ స్వభావం కాదు.నీదయనే చూపుతావు. ఎందుకంటే శరణాగర

బిరుదుపొంది వేంకటాద్రి మీద నిలిచి కోరిన వరాలెల్ల ఇస్తున్నది నీ దయాగుణము వలననే. అందుకనే ''మా తప్పులు లోగొనవే''అని అభ్యర్థిస్తాడు. కారుణ్య రత్నాకర! కాకాసుర వరద! అని రామభద్ర రఘువీర..... (3వ సంపుటం-304 సంకీర్తన) లోను, కౌసల్యరామా! కరుణానిధి రామా! అని భళి భళి రామా...( 5వ సంపుటం-357 సంకీర్తన)లో రాముని దయాస్వభావాన్ని ఎత్తిచూపించాడు అన్నమయ్య.

శరణన్న విభీషణుఁ గరుణఁ గాచినవాడు... (2వ సంపుటం-226 సంకీర్తన) కేలను మోక్షమిచ్చి యేలెను జటాయువును యీతడా రాముడు? పరికింపఁదారక బ్రహ్మమా యీరాముడు! అంతటి దయాగుణం ఉన్న పరబ్రహ్మమే రాముడని అంతటివాడు శ్రీవేంకటాద్రిమీద ఉన్న ప్రతాపపుం దేవుడని అంటాడు. రాముడు ఎంత దయాస్వభావుడో చెబుతూ పాటించి నమ్మిన వారి భాగ్యముగాదా.... (3వ సంపుటం-88 సంకీర్తన)లో ''స్వామిద్రోహియైన చండి రావణుడు శరణంటే కాపాడుతాను'' అన్న దయాశాలి రాముడు. నీ దయను ఏమని ఎంచుతాను? ఆ మాటకు సరియౌను అఖిలవేదములు. సీతా ద్రోహము దలచిన కాకాసురుడు కావుమని శరణంటే కాచావు. ''అభయం సర్వభూతేభ్యే... అన్నమాటను గుర్తుచేస్తూ నిన్ను శరణనటమే ఇక్కడ గొప్ప తపస్సు అంటాడు. నిను చేరి ఏపాటి వాడైన శరణంటే కాపాడుతావు కదా అని ప్రశంసిస్తాడు.

## 4. శ్రీరాముని పరాక్రమ వర్ణన:

అన్నమయ్య ఆరాధించేది శ్రీరామునిలోని పరాక్రమమునే. అందుకే పదుల కీర్తనలలో పలురకాలుగా శ్రీరాముని పరాక్రమాన్ని వర్ణించాడు. ''జయజయ రామా! సమర విజయరామా!...(3వ సంపుటం-300 సంకీర్తన) అంటూ జయం పలుకుతాడు. ఈతడువో రాముడు యేకాంగ వీరుడు.... అని నుతిస్తాడు. (29వ సంపుటం-6 సంకీర్తన) రాముడు లోకాభిరాముడు త్రైలోక్యధాముడు.... (2 వ సంపుటం-219 సంకీర్తన) రణరంగ భీముడు, మహోగ్రపుశరుడు, రాక్షస సంహారుడు, లోకైక వీరుడు, శూరుడు, బలుడు అంటాడు. ''వీర ప్రతాపరామ విజయాభిరామునే శరణు శరణు సర్వపోషక''.... (4వ సంపుటం-170 సంకీర్తన) అని శరణువేడతాడు. ఏమని చెప్పగ వచ్చు నిదివో ప్రతాపము...(4వ సంపుటం-281 సంకీర్తన)లో శ్రీరాముడు హరుని విల్లు విరుగ దీసిన నాడే అసురులకు వీపులు విరిగాయి. వనవాస వ్రతం పట్టినపుడే శత్రువుల మతులకు భీతి పుట్టింది. దండకావనము చొచ్చిననాడే అసురులు పాతాళంలోకి పోయారు. శూర్పణఖ ముక్కుగోసిన నాడే దైత్యుల ఆశలు పెరికివేయబడ్డాయి. మారీచునిపై బాణం వేసిన రోజే దానవుల వేడుకలు ముగిసిపోయాయి. విభీషణుని జేపట్టితే రక్కసులు కంగారు పడి వెనక్కి మరలి పోయారని కార్యకారణాలకు వ్యవధిలేకుండా జరిగినట్లు చెబుతాడు.

'భళి భళి రామా! పంతపురామా! నీ బలిమికెదురులేదు భయహర రామా!......(5వ సంపుటం-357సంకీర్తన) అంటూ విలువిద్య వీరవిక్రమ, తలకొన్న తాటకాంతక, ఖరుని తలగుండుగండ, అని

సంబోధిస్తాడు. యుద్ధంలో దిగితే జయమే తప్ప మరొకటి ఎరుగని రామ పరాక్రమాన్ని ''సమరపు జయరామా'' అని గుర్తు చేస్తాడు. రావణాంతకా, జవసత్త్వసంపన్న అని కీర్తిస్తాడు. ''**అదె లంక సాధించె నవనిభారము దించె;విదితమై ప్రతాపము వెలయించెనితడు.....**(4వ సంపుటం-514సంకీర్తన)లో బలువుడు సీతాపతియని, వాలి మర్దనుడని, ఏకాంగవీరుడని, కోదండ దీక్షా గురుడని, సరిలేని అసురభంజకుడని వర్ణించాడు. ''**శరణు శరణు విభీషణ వరదా...**(2వ సంపుటం-220 సంకీర్తన)లో మారీచ సుబాహు మద మర్దన, తాటకాహర, క్రూరేంద్రజిత్తుల గుండుగండా, దారుణ కుంభకర్ణ దనుజ శిరచ్ఛేదక, వీర ప్రతాప రామా, విజయాభిరామా, వాలి నిగ్రహ సుగ్రీవరాజ్యస్థాపక, లాలిత వానరబల, లంకాపహార, పౌలస్త్యహరణ, శంకరచాపభంజక, శరధిబంధన, రామ సర్వగుణస్తోమ అని ప్రతాపవంతమైన రాముని నామాలను గానంచేసాడు.

''**ఏమి చెప్పేది ప్రతాపమెట్టి విలుకాడితడు;రాముడు వీడే మ్రొక్కుడు రణరంగధీరుడు............** (3వ సంపుటం-279 సంకీర్తన)లో రామప్రతాపాన్ని ప్రశంసిస్తాడు. ''**కౌసల్యానందనరామా! కమలాప్త కుల రామా!.....** (2వ సంపుటం-275 సంకీర్తన) లో తాటకసంహారం, హరధనుర్భంగం, పరశురాముని ఒప్పించడం, శూర్పణఖ, ఖరదూషణాదులను శిక్షించటం, మాయామృగాన్ని శిక్షించడం, వాలిని సంహరించడం, జలధిని బంధించడం, లంక సాధించడం ఇవన్నీ చేసిన రణరంగధీరుడు రాముడు అంటాడు. రాసికెక్కు కోదండ రచనావిద్యా గురువా! మారీచ సుబాహు మర్దన! తాటకాంతక! రామభద్ర రఘువీర రవివంశతిలక....(3వ సంపుటం-304 సంకీర్తన)లో దారుణ వీర శేఖర! ''**ఘాతల నీప్రతాపమెల్లా కడు నిండేనయ్యా'' సురలు విననిను మెచ్చేరయ్యా! అంటూ ''ఆలికై విల్లువిఱిచి, వాలికై యమ్ము వేసిన వాలు మగటిమిగలవాడా! వీడు**'' అంటూ మింటికట్లు తెగనేసి, యంటి పగసాధించి దంట రాకుమారుడు తా నీ శూరుడా! అంటాడు. క్షాత్రనాశనానికి పూనుకున్న పరశురాముడు తపస్సుతో సాధించుకున్న ఊర్ధ్వలోకాలను కొట్టి పగసాధించుకున్న రాకుమారుడని చాలా చక్కగా సార్థక ప్రయోగం చేసాడు అన్నమయ్య. బ్రతికున్న వాడిని చంపడం ఒకెత్తు ఐతే వారి ఊర్ధ్వలోకాలు కొట్టడం సామన్యమైనదా? ఇంతటి శూరుడు రాముడని, కంటకరావణ వైరిఘనుడా! యీ రాముడు! శరణన్న విభీషణుఁ గరుణఁ గాచినవాడు....(2వ సంపుటం-206 సంకీర్తన) అని పరవశంతో పాడతున్నాడు అన్నమయ్య. ''**నరుడా యీతడు ఆదినారాయణుడుగాక ధరణిని గీరితికెక్కె దశరథ సుతుడు...**(2వ సంపుటం-497 సంకీర్తన) అని రాముని వీరకార్యాలన్ని చెప్పి ఇవన్నీ చేయటానికి అవతరించిన ఆదిపురుషుడు శ్రీరాముడు అంటాడు అన్నమయ్య.

### 4.1శ్రీరామ ప్రతాపం - రాక్షసులకు హితవు:

**అదెవచ్చె రాఘవుడాతని దాడిముట్టె.....**(11వ సంపుటం-235 సంకీర్తన)లో ''రాముడు దాడిచేస్తున్నాడు. మీరు ఎదిరించరాదు. మీకు దారిలేదు అంటాడు అన్నమయ్య. విష్ణువే రాముడై పుట్టాడు. ఆయన దివ్యబాణాలు

మిమ్మల్ని వెతుకుతున్నాయి. మీరు ఎక్కడ దాక్కుంటారు. ఎవరికీ సాధ్యంకాని సముద్రమును కొండలతో కట్టాడు. మీరు తల చూపకూడదు. దేవతలే వానరులై వచ్చారు. మీరు ఎలా నిలుస్తారు? ఇప్పటిదాకా ఎవరికీ యుద్ధంలో జయంపొందలేని రావణుని పట్టుకుని చంపేసాడు. మీరు ఇంకా అక్కడే ఉంటే చనిపోతారు పారిపొండి.ఓ లంకావాసులాల! విభీషణని కాచిన శ్రీవేంకటపతిని శరణు అనండి'' అని హితబోధ చేస్తాడు అన్నమయ్య.

### 4.2 శ్రీరాముని బాణము - విశిష్టత:

తాటకను మారీచ సుబాహులను చదిపిన బాణము, పరశురాము మేట్లేసిన బాణము మృగమును వాలిని వేసిన బాణము, తోయధిమీద తొడిగిన బాణము కుంభకర్ణుని తల ద్రుంచినబాణము, రావణుని పరిమార్చిన బాణము అని శ్రీరామ బాణ విశిష్టతను పొగుడుతాడు రామునికి శరణంటే రక్షించీ బ్రదుకరో... (4వ సంపుటం-283 సంకీర్తన) కీర్తనలో. విజయదశమిరోజు వేంకటేశ్వరుని జమ్మిపై బాణం వేసే ఉత్సవాన్ని ప్రస్తావిస్తూ (3వ సంపుటం-472 సంకీర్తన) దశకంఠు పదిశిరసులమీద, అంబుధిమీద, ఏడుతాళ్ళు సర్వము ఒక్కటిగాగ యుద్ధంలో రావణుమీద అమ్ముబేసిన వేదమూరితి ఇందిరను కూడి అమ్మువేసాడని వర్ణించాడు.

### 4.3 యుద్ధరంగం-రావణసైన్యాలు:

రామరావణ యుద్ధరంగంలో రావణ సైన్యాలు రామపరాక్రమానికి భయపడి ఎలా గడగడ వణికాయో, వానర సైన్యాన్ని, రాముని ఎలా బ్రతిమలాడుకున్నాయో ఊహించాడు. ఈ కీర్తనలో అత్యంత సహజంగా రచించాడు.

**''అనుచు రావణుసేనలటు భ్రమయిచు వీగె**
**యినకుల రాయచంద్రనేడిదిగో నీ మహిమ (15వ సంపుటం-158 సంకీర్తన)**
**దదదద దదదద దశరథ తనయా..గకకక కావవే! అని రాముని శరణు వేడుతున్నారట**
**మమమమ్మ మమమమ్మ మన్నించుడు కపులార**
**చచచచ్చ చావకుండా...**
**మెమెమెమ్మె మెమెమెమ్మె మేము నీవారమె**
**మొమొమొమొ్మ మొమొమొమొ్మ మొక్కేము మీకు"** అని వానరులను ప్రార్థించారట.
**"తెతెతెత్తె తెతెతెత్తె తెరువేది లంకకు**
**తత్త తత్త తలమని దాగుదురూ.. మమ్మింకనేలు జయజయనీకు"**

అంటూ వేంకటరాఘవునకు జయవెట్టేరు. రాక్షసులకు భయంతో నత్తివచ్చి పలికిన పలుకులను యథాతథంగా వర్ణించి శ్రీరాముని ప్రతాపౌన్నత్యాన్ని తన ఊహా చమత్కృతితో అలంకృతి చేసాడు అన్నమయ్య.

### 4.4 యుద్ధరంగం-భూతగణాలు:

రామరావణ యుద్ధరంగంలో రాక్షసుల వధించబడి, భూతాలకు ఎలా ఆహారం లభిస్తోందో, దాని వలన భూతగణాల పొందే ఆనంద ఉద్రేకాలను అన్నమయ్యఈ విధంగా వర్ణించాడు.

''**బాపు! దైవమా మాపాలి భవమా....తీపు రాకాసి నెత్తురు దీం దోందోం దోందోం దోందోం...** (1వ సంపుటం-120సంకీర్తన)

**కాలనేమి పునుకు కంచువలె లెస్సవాగీ, తాళమొత్తరే తత్త తత తత్తత్త**
**మహోదరుడు వీపు ధణ ధణమని వాగీ, బిగియించరే తోలు భింభిం భింభిం భింభింభిం**

ఈ యుద్ధంలో ఉగ్రులైన మహోదరుడు వంటి రాక్షసులు వధించబడివారి పునుకలు,తోళ్ళు, తమకు లభిస్తున్నాయని, వారి పచ్చి నెత్తురు త్రాగగలుగుతున్నామని, తిత్తి తిత్తి తిత్తితి, మమ్మ మమ్మ మమ్మ మమ్మమ వంటి ధ్వనులు చేస్తూ నృత్యం చేస్తున్నారని శ్రీరామునిప్రతాపం ఇటువంటిదని వర్ణించాడు.

## 4.5 యుద్ధరంగం-వానరసైన్య విజయోత్సాహం:

రామ రావణ యుద్ధం ముగిసింది. రావణుడు సంహరించబడ్డాడు. వానర సేనలకు విజయం లభించింది. అపుడు వానరసైన్యాలు ఆనందంతో...

**జయము మనది వనచరులాల**

**రయమున దర్మదారలూ తుత్తుతూ....**అని ఊదుతున్నారని (4వ సంపుటం-517 సంకీర్తన)లో చెప్పాడు.

**రక్కసుల మీద రాముడలిగె నలు దిక్కుల నడపుడు తిడిరతిడిర**
**యెక్కుడు సేనలు యిటు మొరయింపుడు ధక్కానినదము ధమధమధమం**
**కుటిల దానవులు గొట్టుడు కోటలు తటుకున దాటుడు ధణం ధణం**
**పటుగతినార్పుచు పట్టుడు లగ్గలు పెటులు చూడదదె పెటపెటపెటల్**
**గుట్టున నుండక కూలె రావణుడు;పట్టుడు సంకులు భం భం భం**
**యిట్టె శ్రీవేంకటేశుడు గెలిచెను దిట్టలై యాడుడు ధిం ధిం ధిం**

వానరులు విజయోత్సాహంతో ధమధమ ధక్కలు మ్రోగించటం, శంఖాలు భం భం అని ఊదటం, ధిం ధిం అని నృత్యాలు చేయటం వంటి దృశ్యాలన్ని కళ్ళకు కనబడే విధంగానే కాక ఆ ధ్వనులను మనకు వినబడేలా రచించాడు అన్నమయ్య. ఈ పాట పాడుతుంటే మనం కూడా ఆ రామదండులో భాగమై ఆనందనృత్యం చేస్తాము.

## 5. శ్రీరామ కథా వర్ణన:

శ్రీరామ, స్వరూప స్వభావాలను పరాక్రమాన్ని ఎంత వర్ణించినా అన్నమయ్యకు తనివి తీరదు. శ్రీరామ గుణగానాన్ని చేస్తూ కథాకీర్తనం చేసి పరవశించిపోతాడు. శ్రీరామ కథను సృజించిన అనేకమైన కీర్తనలు అన్నమయ్య భాండారంలో ఉన్నాయి. ''**ఇతడే పరబ్రహ్మ మిదియే రామకథ, శతకోటి విస్తరము సర్వపుణ్యఫలము.....** (4వ సంపుటం-519 సంకీర్తన) **రాజీవనేత్రాయ....** (2వ సంపుటం-273 సంకీర్తన) వంటి కీర్తనలలో పూర్వరామాయణము, దేవతల గాచిన దేవుడితడు... (4వ సంపుటం-300 సంకీర్తన)లో ఉత్తర రామాయణ కథను రచించాడు. ఈ విధంగా పరిశీలించినట్లయితే రామకథ చెప్పడంలో అనేక విధానాలు పాటించాడు. తాళ్లపాక

చిన్నన్న చెప్పిన ప్రకారం ''నవముగా రామాయణము రచించిన '' అన్నమయ్య కీర్తనలలోనూ ఆ నవ్యతను పాటించాడు.శ్రీరాముని చరితాన్ని ఉక్తివైచిత్రితో

**నూతులు దవ్వగబోతే బేతాళములు పుట్టె**

**కాతాళపు లోకులాల! కంటిరా యీ సుద్దులు** (2వ సంపుటం-8సంకీర్తన)

పుత్రకామేష్టి చేస్తే అది లంక మీదికి వచ్చింది. అసలు రామావతారమే అసురులకు బాధ అయ్యింది. సీత పెండ్లి శివధనుస్సును పండుకాయలా రాల్చింది. ఇలాంటి వారిని ఎలా నమ్ముతాం అంటాడు. కైకేయి రాజ్యం కోరడం శూర్పణఖకు కష్టాన్ని తెచ్చింది. సీతాదేవి బంగారు జింకను కోరడం దాని ప్రాణాల మీదకు తెచ్చింది. సుగ్రీవు మేలు వాలికి గండమై కూర్చుంది. ఇలాంటి రాచపుట్టును ఎట్లా నమ్మాలి? అంటాడు. కోతులన్నీ కలవడం వల్ల సముద్రాన్ని కట్లువచ్చాయి. విభీషణుని తలపు వలన రావణుని తల పోయింది. శ్రీ వేంకటగిరి రాముని పట్టము కట్టడానికే ఇంతా జరిగింది. ఇలాంటి దైవాన్ని ఎలా నమ్ముతాము? అంటూ నిందాస్తుతిలో అన్నమయ్య రామచరితను వినిపించాడు.

''**రాజీవ నేత్రాయ రాఘవాయ నమో....** (2వ సంపుటం-273 సంకీర్తన)లో **దశరథ తనూజాయ తాటకదమనాయ... కుశిక సంభవాయ గోపనాయ, పశుపతి మహాధనుర్భంజనాయ నమో విశద భార్గవ రామ విజయ కరణాయ...భరిత ధర్మాయ"-** తండ్రి సత్యపాలన ధర్మాన్ని తలకెత్తుకుని అరణ్యవాసానికి వెళ్ళాడని అయోధ్య కాండ కథనంతా ఒక పదంలో ఇమిడ్చాడు. కీర్తనంతా ఇలానే సాగుతుంది. ''**చెప్పితే నాశ్చర్యము చేసిన చేఁత లితడు.....** (4వ సంపుటం-477 సంకీర్తన)లో **ఇతడు తారక బ్రహ్మమీతడు సర్వేశ్వరితడు....** (10వ సంపుటం-159 కీర్తన) లోను రామకథను సంక్షిప్తంగా చెప్పాడు.

## 5.1.శ్రీరాముడు జననం-దేవతల అవతరణం:

రామజననం వలన ఏమేమి జరిగాయో చెబుతూ అన్నమయ్య ''**రాముడు లోకాభిరాముడుదయించగాను భూమిలో వాల్మీకికి పుణ్యమెల్లా దక్కెను...**(11వ సంపుటం-225 సంకీర్తన) అంటూ రామజననం వలన రామచరిత రాసే పుణ్యం వాల్మీకికి దక్కింది. కర్మము మారీచుని తలపై పడిరది. శూర్పణఖ ముక్కున పండిరది. దైత్యభామల మెడతాళ్ళు పటుక్కున తెగాయి. మటుమాయ దైత్యులకు నూరేళ్ళు నిండాయి.రావణుడు పూర్వము చేసిన తపముల వలన కలిగిన ఆయువు తరిగిపోయింది. ఖరదూషణాదులకు కాలముతీరింది. కుంభకర్ణునికి పుట్టిన దినము వచ్చింది. మండోదరికి గండము తాకింది. అయోధ్యకు భాగ్యములు ఫలించాయి అంటాడు.

''**ఓవో రాకాసులాల వొద్దుసుండి వైరము! దేవుని శరణనరో! తెలుసుకోరో....**(4వ సంపుటం-295 సంకీర్తన)లో శ్రీరాముడు ఎందుకు అవతరించాడో తెలియని రాక్షసులు శ్రీరామునితో వైరం పెట్టుకున్నారట. వారిని వైరం వద్దని శ్రీరాముని శరణుకోరి

బ్రతికుండమని హితమూ, రామావతార రహస్యాన్ని చెబుతున్నాడు. విష్ణువే రామునిగా లక్ష్మి సీతగా జన్మించారు. శేషుడు శంఖచక్రాలు లక్ష్మణ భరత శత్రుఘ్నులయ్యారు. దేవతలు వానరులుగా సూర్యుడు సుగ్రీవునిగా, రుద్రుడు హనుమగా, బ్రహ్మ జాంబవంతునిగా, విశ్వకర్మ నలునిగా అవతరించారు. సేతువుకట్టి, లంకానగరాన్ని చుట్టిముట్టి, సైన్యంతో శ్రీరాముడు రావణుని సంహరించి, దాసులకు వరమిచ్చాడు. దానవ సంహారం కోసమే ఈ కార్యమంతా జరిగిందనే విషయాన్ని రాక్షసులకు తెలిపి వారిని బాగుపడమని వాత్సల్యంతో చెబుతున్నాడు అన్నమయ్య.

## 5.2 బాలకాండ-సీతారాముల పరిణయం:

శ్రీరాముడు "**చిఱుత ప్రాయమునాడే శివుని విల్లువిఱిచినవాడు** (ఈతడువో వీరుడు...29వ సంపుటం-6సంకీర్తన) అని శిరసుకూకటుల రాఘవా చిన్నారిపొన్నారి రాఘవా! గరిమ నా వయసునఁ దాటకిఁ జంపిన కౌసల్యనందన రాఘవా" - **రామ రామచంద్ర రాఘవా........** (1వ సంపుటం-392సంకీర్తన)అని పిలిచి మురిసిపోతూ "సీతఁబెండ్లియాడెను యీచిన్నిరాముడా!" అని ఆశ్చర్యపోతాడు. (నరుడా యీతడు..2వ సంపుటం-497 సంకీర్తన) ఈ కీర్తనలన్నింటిలోనూ రామచరితను గానం చేసాడు. సీతారాముల పరిణయాన్ని ఒక సంకీర్తనలో ప్రత్యేకంగా ప్రస్తావిస్తూ ముగ్ధ అయిన సీతమ్మను వర్ణించాడు.

సిగ్గరి పెండ్లికూతుర! సీతమ్మ! దగ్గరి సింగారబొమ్మ తలవంచకమ్మా! (32వ సంపుటం-40 సంకీర్తన)లో అల్లనాడే రాఘవుడు హరువిల్లు విరిచాడు. జనకుడు నిన్ను ఇవ్వగా నేడో రేపో పెండ్లాడతాడు. ఆనందించగా ఈ మాట వినవమ్మా! అదిగో పెండ్లి తెర ఎత్తగానే రాఘవుని కులగురువులైన వసిష్ఠులు రండని, మంత్రాలు చదువుతూ కనబడుతున్నారు. మంత్రాల అక్షతలు చల్లవమ్మా! రామునికంటె ముందుగానే చేతులు తలబ్రాలు పళ్ళెంలో ముంచి అతని మొగాన్ని చూడు. కంకణ దారాలు కట్టి, కాలుదొక్కితివి. మీరు కలిసి బువ్వబంతిలో విందులు చేసి కలిసారంటూ తెలుగు వారి పెండ్లితంతును వర్ణించాడు.ఈ సంకీర్తనలో సిగ్గుతో తలదించుకున్న ముగ్ధ సీతమ్మ. పెండ్లివార్త వినేటపుడు, రాముని పై తలంబ్రాలు పోసేటపుడు, పెండ్లితంతు పూర్తయ్యాక అయినా సీతమ్మ సిగ్గువదిలి మొగమెత్తి రాముని చూడమంటున్నాడు. వావిలిపాడులో శ్రీరామనవమినాడు అన్నమయ్య ఈ సంకీర్తన రచించి ఉండవచ్చు.

## 5.3 సుందరకాండ- సీతతో సంభాషణ:

అన్నమయ్య లంకలో ఉన్న సీతమ్మతోను, మాల్యవంతంపై ఉండి సీతాదేవి క్షేమసమాచారాన్ని కోరి ఎదురు చూస్తున్న రామునితోను సంభాషిస్తాడు. సీతతో చెప్పే మాటలు సీతకోసం రాముడు ఏమి చేస్తున్నాడో చెప్పడంతో ఆగక యుద్ధం జరిగిన విధానాన్ని చెబుతాడు. సంభాషణలు సహజ వాక్చాతుర్యానికి, పదప్రయోగ దక్షతకు

నిదర్శనాలు. ''వినవమ్మ జానకి నీ విభుడిరతసేసినాడు....(2వ సంపుటం-191సంకీర్తన) లో వానరుల దండు వారధి కట్టి లంక చుట్టి రాగా విడిసింది. త్రికూటపర్వతం ఎక్కి కోటగోడలను ఆక్రమించారు. రాముడు ఇంద్రజిత్తును, కుంభకర్ణుని, దానవులను కూల్చి మారణహోమం చేసాడని, రాక్షస మాయలు చెరిచాడని అంటాడు. బలిమితో రావణుని చంపి, లంక విభీషణునికిచ్చాడు. నిన్ను ప్రతాపముతో స్వీకరించాడు అంటూ ఇంకా ఏమి చేయడానికో శ్రీవేంకటాద్రి మీద ఉన్నాడు అని విన్నవిస్తాడు. ''అదే రాముడు సువేలాద్రిపై నిలిచె...(26వ సంపుటం-178 సంకీర్తన) లోనూ ఇలాంటి విషయాలను చెబుతున్నాడు. వనజాప్త కులుడు వచ్చాడు. దాని వలన దనుజులు భయపడగలరు. పారిపోగలరు.కపివీరులు అరుపులతో దండుగా విడిది చేసారు. కదనంలో కుంభకర్ణాది వీరులు మదంతో పోరుచేసి మరణించారు.రావణుని చేతులు తలలు నరుకబడగా సంపదలన్ని నీ వెంట నిండుగా పారుతున్నాయి. రాముడు విభీషణునికి పట్టం కట్టాడు. నిన్ను రమ్మని పిలువనంపాడు. ఇపుడే అతనిని కూడగా రమ్మని అశోకవనంలో నిలిచిన భక్తునిగా చెబుతున్నాడు అన్నమయ్య.

### 5.4 కిష్కింధకాండ-సుందరకాండ-రామునితో సంభాషణ :

శ్రీరాముడు సుగ్రీవాదులను కలిసాడు.ఋష్యమూక పర్వతం పై ఉన్నాడు. అపుడు సీతాదేవి అపహరించబడి ఈ దిశలోనే వెళ్లిందని చెప్పారు వారు. ఆమె వేసిన నగలమూట దాచి రామలక్ష్మణులకు చూపించారు. ఆ సందర్భంలో రామునితో హనుమంతుడు అంటున్న సందర్భంలోనిదీ కీర్తన. ''**అన్నియునందె యున్నవి అదిగోమాట. ఎన్నుకుని దినములు ఇదిగో మూట**''.....(25వ సంపుటం-496 సంకీర్తన) ఆ మాటను చెబుతూ, మూటను గుర్తు చేస్తూ సీతమ్మతల్లి చెప్పిపంపింది. తలను ధరించేటి మణి నీకిచ్చింది. ఆ తర్వాత దాని స్మృతులకు సంబంధించిన మాట నాకు తెలియదు. నీ విచ్చిన చేతి ఉంగరాన్ని ఆమెకందజేయగా ఆమె ఉంగరాన్ని కళ్ళకద్దుకుంది. ఆమె ఏమి తలచుకుందో. అదలా ఉండనీ ఈ మూటతీసుకో. తాళి పడిన మేనుతో తలపు నీకప్పగించి నీకు దూరంగా కాక దగ్గరగా ఉందనటం ఒక మాట. సీతాదేవి ధర్మం తప్పదు. ఇది ఆమె గుణము (శీలము) పదిలంగా ఉంది. ఆ హృదయంలో ఇంక ఎవరికీ చోటులేదు. అదిగో మూట.( ఈ మూట నగలమూట కాక ఈ ఉత్తమ ఇల్లాలే నీకసలైన సంపద అని చెప్పినట్లు కనబడుతోంది) నీ కామె బాస చేసింది. ఇది దేవతల మాట విను. అందరికీ తెలిసినదే సీతాదేవి పరమపవిత్ర శీల. పరమ పతివ్రత. గురుతుగా శ్రీ వేంకటాద్రి మీద కూడి ఉన్నారు. మీరిలా ఉండటమే భక్తులకు విలువైన మూట. సీతాదేవి అగ్ని ప్రవేశం చేసినపుడు దేవతలంతా సీత పూతచరిత అని చెప్పి రాముని స్వీకరించమన్నపుడు హనుమ చెబుతున్నట్లు రచించారు అన్నమయ్య. ఆ వేళ అక్కడ హనుమ ఇవన్నీ చెప్పినట్లు రామాయణంలో కనబడదు. ఒక భక్తునిగా సీతమ్మకు కలిగిన కష్టానికి చలించిపోయి ఈ కీర్తన రచించాడేమో అనిపిస్తుంది.

లంకలో ఉన్న సీతను దర్శించి వచ్చాడు హనుమ. సుగ్రీవాదులతో కలసి రాముడు ఈ వానర వీరుల కోసమే ఎదురుచూస్తోంది. వానర వీరులు మధువనం నుండి నేరుగా వచ్చారు. సీతా దర్శనం చేసుకున్న హనుమనే రాముని ముందుకు తోసారు వానరులు. ఆ సమయంలో శ్రీరామునితో ఇలా చెబుతున్నాడు.

''**ఇదె శిరసు మాణిక్యమిచ్చి పంపె నీకు నాకె**

**అదనెఱిగి తెచ్చితి నవధరించవయ్యా....(**20వ సంపుటం-229 సంకీర్తన)లో

ఓరామా! నీరామ, నినుబాసి ఆరామములో రామ!రామ! అను పాడుతూ ఉండగా చూసాను. అపుడు ఆ మెలుత సీతాదేవి అని తెలుసుకొని నీ ముద్ర ఉంగరాన్ని ఇచ్చాను. ఓ కమలాప్త కులుడ! నీ కమలాక్షి ఆ లంకలో నీపాద కమలములు ధ్యానిస్తూ విరహంతో వియోగ దు:ఖంతో కమలారి అయిన చంద్రుని నిందిస్తోంది. అపుడు సీతాదేవికి నీ క్షేమాన్ని విన్నవించాను. ఓ దశరథాత్మజ! నీవు దశశిరుని చంపి ఆ దిశలో ఉన్న సీతాదేవిని దశదిశలా కీర్తి వ్యాపించేలా కాపాడు. శశిముఖి అయిన నీచెలి సీతను చేరినపుడే శ్రీరామావతార కార్యం పూర్తవుతుంది. ఈ విధంగా హనుమ ముఖంగా అన్నమయ్య చెబుతూ తెలుగు పదాలతో ఆడుకుంటాడు.

## 5.5 యుద్ధకాండ వృత్తాంతం:

రాముడు చేసిన యుద్ధం ఎంత తీవ్రంగా సాగిందో, దాని వలన ఎలాంటి ఉత్పాతాలు కలిగాయో వివరించే సంకీర్తన ఒకటి రచించారు అన్నమయ్య. ''**వినుడిదె రఘుపతి విజయములు, పనుపడి రాక్షస బాధలడిగెను......**(11వ సంపుటం -223 సంకీర్తన)లో రాముడు రథమెక్కితే కులపర్వతాలు అదిరిపోయాయి. భూమి వణికిపోయింది. విల్లంబులు పట్టితే సముద్రాలు కలగిపోయాయి. లోకాలు కంపించిపోయాయి. వింటిలో బాణం తొడిగితే పిడుగులు పడ్డాయి. పెనుగాలి వీచింది. రావణుని వేయగా దిక్కులు ముడివడ్డాయి అనగా కలిసిపోయాయి. దిగ్గజాలు క్రుంగిపోయాయి. చుక్కలు రాలాయి. రాక్షసుని తల కూల్చినపుడు పంచభూతాలు స్రుక్కిపోయాయి. ఆ రాముడు వేంకటాద్రి మీద నిలువగా అందరికీ శుభాలు కలిగాయని రాముని విజయాన్ని వేనోళ్లా కొనియాడాడు అన్నమయ్య.

యుద్ధం పరిసమాప్తి అయింది. అపుడు రణరంగంలో పరిస్థితి ఎలా ఉందో ''**సమసె రావణుడు సమరములోపల, అమరులు కడు ముదమందిరి మెరసి....**(11వ సంపుటం-228సంకీర్తన)లో వర్ణించాడు. శ్రీరాముని బాణాలకు రాక్షసులు బెదిరారు.బాణపుపోటులకు క్రిందిగి కూలారు. నెత్తుటి దేహపుముక్కలు పడినందున దిక్కులకు తరచుగా తిరిగిపోయారు. జాంబవంతుడు మొదలైన ఎలుగుబంట్ల శబ్దాలకు, హనుమ తోక దెబ్బకు అంగదుని వివిధ శబ్దాలకు, సుగ్రీవుని బాహుబలానికి కూలి, వాలి వీలి తూలిపోయారు రాక్షసులు. లక్ష్మణుని ధాటికి, కపిసైన్యానికి భయపడి నాశనమయ్యారు. శ్రీవేంకటపతి దయారసానికి పాత్రులైనప్రజలు సంతోషం పొందారు.

యుద్ధకాండలోని రామునికి విజయం కలిగిన ఇతివృత్తాన్ని "**ఏమనిచెప్పేది ప్రతాపమెట్టి....**(4వ సంపుటం-279 సంకీర్తన)లో కపిసేన సముద్రం ఒడ్డున విడిసి లంకపైకి నడచింది. వింటిదొనలో బ్రహ్మాస్త్రము తొడిగి రాముడు ప్రయోగిస్తే రావణు తలలు పడ్డాయి. లంకలోకి చొచ్చిన సుగ్రీవాదులు రాకాసి చెరలో ఉన్న సీతాదేవిని తీసుకుని వచ్చారు. ఇంద్రాది దేవతలు జయజయ ధ్వనులు చేయగా సీతాసమేతుడయిన శ్రీరాముని అందరూ మెచ్చుకున్నారు. పుష్పకవిమానంపై వానరసైన్యంతో ఎక్కి అయోధ్యపట్టము కట్టుకుని తమ్ములతో పరిపాలించాడు. ఇతడు జగదేకమూర్తి. కౌసల్యసుతుడు"అని యుద్ధానంతర విజయ వృత్తాంతాన్ని వర్ణించాడు అన్నమయ్య.

## 5.6 యుద్ధకాండ - రావణునకు హితవు:

రామ రావణ యుద్ధం ముగిసింది. రావణుని తలలుపది నేలరాలాయి. జరిగిన సంఘటనల పట్ల ఒక ఎరుక లేకుండానే ప్రవర్తించాడు రావణుడు అని అనుకున్నాయి రణరంగంలోని భూతగణాలు. అందుకని రావణుతలలు అతికించి ఈ విధంగా బుద్ధి చెబుతున్నాయా అన్నట్లు రావణునితో సంభాషిస్తున్నాయని "**అని రావణుతల లట్టలు ఁబొందించి, చెనకి భూతములు చెప్పె బుద్ధి....** (3వ సంపుటం-31 సంకీర్తన)లో కపిసేనలు జలనిధిని కట్టాయి. లంక చుట్టూ మూగారు. దానవకోట్ల తలలు కొట్టారు. రావణా నీకు ఈ గతి అవసరమా? అని అడుగుతున్నాయి. కోటలు ఎక్కారు. ఇంతమందీ చిక్కి బందీలయ్యారు. చెరలో ఉన్న సీతమ్మ మార్పు జరిగింది. ఇన్నాళ్లూ తనకు విడుదల ఉంటుందా లేదా అనే స్థితినుండి ఇపుడు తాను కోరుకుంటున్న ఆశ నెరవేరబోతోంది. రావణా వీటన్నిటికీ కారణంకాబట్టి ఇవి అనుభవించడానికి నీకు మరోజన్మ తప్పకుండా ఉంటుంది. తొలుదొల్తనే రాముడు విభీషణునికి లంకాపట్టం కట్టాడు. శ్రీవేంకటగిరి రాముడు గొప్పగా ఉన్నాడు. నువ్వు చేసిన పనులు మంచివేనా? చెడ్డపనులకు ఇక నీవే ప్రతినిధివి అవుతావు. లోకం ఇంక నీపేరే చెప్పుకుంటుంది అంటున్నాడు అన్నమయ్య.

అలాగే "**ఎదురా రఘుపతికి నీ విటురావణా నీకిదేమి బుద్ధి తలచితిట్లాయె బ్రదుకు.......**(15వ సంపుటం-213 సంకీర్తన)లోను హనుమ లాంటి భక్తుడు రావణునికి చీవాట్లుపెడుతున్నట్లు రచించాడు అన్నమయ్య.హరుని నమ్మి హరితో పగగొన్నావు. ఇపుడు కూలిపోయావు కదా వెట్టిరావాణా! బ్రహ్మవరము నమ్మి రాముని శరణనకుండా వంశమంతా నాశనం చేసావు. జపతపాలనే నమ్మి సర్వేశుడైన శ్రీరామునే విడిచిపెట్టావు. అందువల్లనే ఈ విపరీతము జరిగింది కదా వెట్టి రావణా! చుట్టూ ఉన్న జలనిధిని నమ్మి కదనరంగంలో కపులపాలయ్యావు. నీ వీరత్వాన్ని నమ్ముకుని రాఘవు వింటికి బలి అయ్యావు కదా వెట్టి రావాణా! శ్రీవేంకటేశునే గొలిచి విభీషణుడు సుఖియయ్యాడు. నీగతి ఇలా అయ్యింది. అని కడిగిపారేశాడు అన్నమయ్య. రాముని శరణనలేని రావణుని అహంకారం పట్ల కోపం, విభీషణునిలా బాగుపడలేక పోయాడనే జాలి ఈ కీర్తనలో ధ్వనిస్తున్నాయి.

### 5.7. శ్రీరామ పట్టాభిషేకం-ఉత్తరకాండ వృత్తాంతం:

యుద్ధకాండ చివర రావణ సంహారం తరువాత శ్రీరాముడు సీతతో కూడి అయోధ్యకు రావటం, పట్టాభిషేకం జరిగిన కథను అన్నమయ్య వర్ణించాడు. ''సముఖా అవధారు సర్వేశ! రాఘవేంద్ర! అమరులు వారిలో చిత్తావధానా!.......(12వ సంపుటం-527 సంకీర్తన)లో రాఘవేంద్రా ! దేవతలు నీ సముఖములో ఉన్నారు. వారి మాటలను ఏకాగ్రతతో అవధరించండి అని రామునితో సంభాషించి, మిగతా వారందరూ ఏమిచేయాలో, ఎలా ఉండాలో నిర్దేశిస్తున్నాడు. రాముడు కొలువున్నాడు కావున రాజులార కొలవండి. వామదేవ! వసిష్ఠా! రాముని సేవించండి. సేనానాయకులార! సామజములతో జవనాశ్వ ములతో మీమీ సైన్యాలతో ఇరువైపులా నిలవండి. భరతుడా! గొడుగు పట్టు. శత్రుఘ్ను! విడెమునిమ్ము. లక్ష్మణుడా! స్వామికి వింజామర వీయి. సుగ్రీవాంగదులార! నిలవండి. ఓ విభీషణా విన్నపాలు చేయండి. వానరులార! మొక్కండి. హనుమంతుడా! స్వామి పాదములొత్తు. నానాదేశాల అధీశులార! కానుకలివ్వండి. శ్రీ వేంకటాద్రిమీద సీతాసమేతుడై శ్రీనిధిj ై వరాలిస్తున్నాడు. ప్రజలారా చేకొనండి.'' అని పిలుస్తున్నాడు అన్నమయ్య. ''చిత్తా! అవధారు జియ్య పరాకెచ్చరికె.....(11వ సంపుటం-17 సంకీర్తన)లోను పట్టాభిరాముని వామదేవాది మునులు, సుగ్రీవుడు, వానరులు మొక్కు తున్నారని, పౌజు అవధానంతో నిలిచినదని, హనుమ జాంబవతాదులు, భరత శతృఘ్నులు సేవిస్తున్నారని, సామజ వాజి రథాల సందడి వేళ సౌమిత్రి, విభీషణుడు ఆవంక ఈ వంక ఉండి రాముని మహిమలు విన్నవిస్తున్నారని వర్ణించాడు.

ఉత్తర కాండలోని కథాంశాలను ''దేవతల గాచిన దేవుడితడు....(5వ సంపుటం-300 సంకీర్తన)లో రావణుని చంపిన రాముడు పుష్పక రథమెక్కి సీతతో వచ్చాడు. అయోధ్యలో పట్టము కట్టుకున్నాడు. సుగ్రీవాది వానరకోట్లు కొలువగా పొగడొందిన శ్రీరాముడు ఇతడు. వసిష్ఠాదులు పొగడగా అశ్వమేథ యాగం చేసాడు. కుశలవులు పుత్రులుగా పొందిన దశరథరాముడితడు. రుద్రునికి విశ్వరూపు చూపి హనుమకు భావిబ్రహ్మ పట్టాన్ని ప్రసాదించాడని జయరాముని చరితాన్ని విపులంగా వివరించాడు.

ఈ విషయాన్నే మరొక కీర్తన ''అవధారు రఘుపతి యందరిని చిత్తగించు యివల నిండె గొలువిదె నడ సముఖా...... (3వ సంపుటం-492 సంకీర్తన)లో రామ! రాఘవ!రామభద్ర! రామచంద్ర! శ్రీమదయోధ్యాపతి! సీతాపతి! అని సంబోధిస్తూ నారదుడు పాడుతున్నాడు. రంభాదులు పాడుతున్నారు. మొగాలెత్తి కపులెల్ల మొక్కారు. ఇనవంశకుల జాత! ఇక్ష్వాకు తిలకా! ఘనకౌశిక ప్రియ! మునులు దీవిస్తున్నారు. ముందు, భరతుడు, వెనుక లక్ష్మణుడు వింజామరతో సేవిస్తున్నారు. కౌసల్యగర్భ రత్నాకర! సందడిలో కుశలవులు రామాయణాన్ని చదువుతున్నారు. ఓ రామా! నీ రాజసాన్ని గురించి మేమే చెప్పలేకున్నాం సుమా! అంటాడు. రామపట్టాభిషేక దృశ్యాన్ని ఉత్తర కాండ వృత్తాంతో కలపటం ఈ కీర్తనలలో విశేషం.

### 5.8 ఉత్తరకాండ-సీత రామునితో సంభాషించుట:

శ్రీరామ పట్టాభిషేకం జరిగింది. తరువాత జనవాక్యం వలన సీతారాముల వియోగం జరిగింది. రాముడు అయోధ్యలో, సీత వాల్మీకి ఆశ్రమంలో బ్రతుకుతున్నారు. కుశలవులను పొంది సీత శ్రీరామునకు అప్పగించింది. అపుడు ఏకాంతంలో రామునితో మాట్లాడే అవకాశం దొరికితే సీత ఏమని ఉండేది అనే ఊహతో అన్నమయ్య ఈ కీర్తన రచించి ఉండవచ్చు. "**రాజువు నీ కెదురేది రామచంద్ర! రాజీవనయన రామచంద్ర!.......**(25వ సంపుటం-165 సంకీర్తన) సీతకు రాముడు రాజారామునిగానే కనిపిస్తున్నాడు. క్షత్రియుడు మరో వివాహం చేసుకోవటం ధర్మమే. కాని రాముడు ఆ విధంగా చేయలేదు. ఆమెకు రాముని కన్నులంటే ఇష్టం. అందుకు రాజీవనయన అంటోంది. నీ వలపు వ్యర్థంకాదు. అంటే నీవు ఏరోజు నన్ను చూసేవో ఆనాటి నుండి ఒక అన్యోన్యమైన బంధం మనలను ముడివేసింది. వింటినారికే నన్ను తెచ్చావు. నామీది వలపుతోనే శివధనువు నారిని తెంపగలిగి ఉంటావు. ఇవన్నీ పైకి చెప్పగలిగేవేనా? ఎలా మరిచిపోగలము? నేను నీ ప్రక్కన ఉండటానికి అర్హత లేదన్నా నన్ను దూరం పెట్టలేక పోయావు. ఇంకో రూపాన్ని కూడా ఊహించుకోలేకపోయావు. అందుకే యజ్ఞం చేయడానికంటూ బంగారు ప్రతిమను పట్టుదలతో చేయించావు. నీ సహనం పేరెక్కింది. నీ యవ్వనాన్ని నాకోసం మీదుకట్టావు. ఈ ప్రేమను చూసాక నిన్ను ఇతరులు ఏమనగలరు రామచంద్రా! నాగేటి కొనతో నా వంటి సీతను తెచ్చావు (సీతా జననాన్ని గర్తు తెచ్చుకొని మరల నాగేటి కొనతో దున్ని సీత తేజో రూపాన్ని తెచ్చినాడని అన్నమయ్య భావించినాడేమో) గండికోట రామచంద్ర! శ్రీవేంకటాద్రిమీద నన్ను కూడి ఉన్నావు " అని సీత రామునితో ప్రేమతో సంభాషించింది.

## 6. శ్రీరామ మహిమ – ప్రశస్తి :

శ్రీరాముని మహిమలు ఎంత గొప్పవో చెబుతూ ఇందులోనే కానవచ్చె నిన్నిటా నీ మహిమలు..... (10వ సంపుటం-280 సంకీర్తన)లో ఓ రామా! నీకు వలసితే తృణము బ్రహ్మాస్త్రమయింది. భావిస్తే రాతికి ప్రాణము వచ్చింది. కావాలని వేస్తే పరశురాముని ఊర్ధ్వలోకాలు తెగాయి. దైవమంటే నీవే దశరథరామా! నీవు కూర్చుని ఏలితే కోతులు రాజ్యము చేసాయి. కోరితే నీటిపై కొండలు తేలాయి. నీ సైగతో సంజీవి కొండ కదిలివచ్చింది. నీ సమానం లేరు ఇనకులరామా! నీవు తలచుకుంటే నీ కోసం దేవతలు పంపబడ్డారు. నీపేరు వ్యాప్తి చెందగానే అదే జపమైపోయింది. ఓ వేంకటగిరి రామా! నీ కథ ప్రదర్శనయై ఆ చంద్రార్కము నిలిచింది.

ఇలానే "**ఎంతని నుతియింతు రామరామ యిట్టి నీ ప్రతాపము రామరామ....** (4వ సంపుటం-485 సంకీర్తన)లో సముద్రము బంధించ వచ్చునా? సంజీవినికొండ తెప్పించావు వాలిని ఒక్కకోలనేసావు. హరువిల్లు విరిచావు. భూమిజను పెండ్లాడావు. శరణంటే విభీషణుని కాచావు. రావణుని పీచమణిచావు. సురలు నుతించారు

ఇక నీ మహిమ ఎంతటిది? సౌమిత్రి, భరత, శత్రుఘ్నులు తమ్ములుగా కలిగిన రామా! నీవు కామిత ఫలదుడవు కౌసల్యనందనుడవు. నీ మహత్త్వము జగములెల్లా నిండిరదని ప్రశంసించాడు.

''**నిర్ణయించి చెప్పరాదు నేడీతని మహిమ**'' అని శ్రీరాముని మహిమను ''**ఈతడు తారక బ్రహ్మమితడు మా దేవుడు; కౌతుకాన జెప్పే వినగదరే వో జనులు**'' ( 2వ సంపుటం-208 సంకీర్తన)లో రాముడు. ఇందీవర శ్యాముడు. నానా సార్వభౌముడు, షోడశకళా సోముడు రాక్షసులను తుత్తుమురు సేసినాడు. సురలకు కామిత ఫలములిచ్చి కాచినాడు. పూర్ణుడు. నీలమేఘవర్ణుడు. దానమున విస్తీర్ణుడు. వాహన సుపర్ణుడు. అర్ణవము దాటి రావణాదుల గెలిచినాడు. నిర్ణయించి చెప్పరాదు నేడీతని మహిమ. వరుడు. సీతకు పరాత్పరుడు. కోదండదీక్షా గురుడు. దివ్యామోఘశరుడు. శ్రీవేంకటాద్రిపై తమ్ములతో నెలవై ఉన్నాడు''
అని అంత్యానుప్రాసాలంకారంలో వర్ణించాడు.

## 7. శ్రీరాముడు-శృంగార నాయకత్వం:

శ్రీరాముని శృంగార నాయకునిగా కీర్తించటం చాలా అరుదుగా జరుగుతుంది. రామభక్త కవులెవరూ రాముడు సీతతో ఉన్నపుడు జరిగే శృంగారాన్ని వర్ణించలేదు. ఏక పత్నీవ్రతుడు కావటం వలన అన్య నాయికలతో ఉన్నట్లు వర్ణించడం సాధ్యంకాలేదు. కానీ ఈ పరిమితులు గమనించే అన్నమయ్య ఒకటి రెండు చోట్ల రాముని ఉదాత్తతకు భంగం లేకుండా వర్ణించాడు. రాతి బతిమ సేసిన రామచంద్ర....నీ చేతిలోని దాననింతే శ్రీరామచంద్ర.... (26వ సంపుటం-36 సంకీర్తన)లో రట్టు సేయకయ్యా నీ దూరాన్ని నేను సహించలేను. నీ పై ప్రేమ పెంచుకున్నాను. ఉపయోగంలేని జాలి చూపకు. విన్నపాలు వేయునేల? నా కన్నులకు నీవే (గురి) లక్ష్యానికి. నన్ను విడిచిపెట్టకు. నన్ను ఎంచుకో. నా ఆయువు పట్టును తాకావు( నీ భావనతో నా అవయవములు నీకే వశమై ఉన్నాయి) ఇద్దరిదీ ఒకటే ప్రాయము. వావిలిపాటి రామచంద్ర. చేయారగా స్వీకరిస్తే నేను శ్రీవేంకటాద్రిమీద నీకు చెందుతాను.'' అని నాయిక శ్రీరాముని వలచిన విధానాన్ని అన్నమయ్య వర్ణించాడు.

''శ్రీరాముడు సీతా స్వయం వరంలో ధనుస్సునెక్కుపెట్టాడు. అందువలన సీత తనదైంది. అంతకు ముందె ఆయనకు కామించిన ఒక స్త్రీ తనలో తాను ఇలా అనుకుంటూ ఉంది. రామా సీత, నేను ఇద్దరిలో ఎవరిని మెచ్చుతావు? అంటూ సాగే కీర్తన ఇది. ఎవ్వరి మెచ్చెదగవు? యిద్దరిలో రామ రామ! రవ్వగా సురలు విచారము సేసేరిందుకే......(32వ సంపుటం-28 సంకీర్తన). దేవతలు సీత, ఆ వలపుల నాయిక ఇద్దరిలో ఎవరు గొప్ప అని విచారిస్తున్నారట! దశరథుని యజ్ఞంలో నీవు జన్మించావు. దశకంఠుని మేనున దావాగ్ని పుట్టింది. దశమైన కాంతితో వర్ణనకెక్కావు నీవు. దశకంఠుని పట్టిన ధర్మం ఏదైతే ఉందో (రాక్షస ధర్మం) దానిలోనే సమసిపోయాడు. సీత కోసం నీవు విల్లెత్తగా, సీతను చేరి మన్మథుడు చెఱకు విల్లు ఎక్కుపెట్టాడు. నీ ధనువైతే విరిగిపోయింది. కానీ మన్మథుని విల్లు

విరుగక నీకు పెండ్లి చేసింది. శ్రీ వేంకటాద్రి మీద నీవు ఎక్కి ఉంటే ఆమె నీ గుండెపై ఎక్కి కూర్చుంది. నీవు దేవుడవై ఇందరిలో తిరుగుతూ ఉన్నావు కానీ నా మనసు నీ పైనే ఉంది. ''సీత, నేను మా ఇద్దరిలో నీవు సీతనే కోరుకున్నావు కదా!'' అని నిట్టూరుస్తూ ఉందట వలపుల నాయిక.

## 8. ముగింపు:

ఈ విధంగా అన్నమయ్య శ్రీరాముని రూప సంపదను, గుణ సంపదను కొనియాడాడు. దయాగుణానికి పరవశుడై అందరినీ శరణుపొందమంటాడు. శ్రీరామునికెదురైన జోదు లేదని కీర్తిస్తాడు. బాలకాండ మొదలు ఉత్తర కాండ వరకు ఉన్న కథాంశాలను ప్రస్తావిస్తూ రామకథను గానంచేస్తాడు. సీతవంటి సౌశీల్యవతి లేదని రామునికే చెబుతాడు. రాముని అసాధారణ మహిమలు చూపి అతడేనరుడు కాదని పరబ్రహ్మమేనని ప్రతిపాదిస్తాడు. ఆ పరబ్రహ్మమే ఇపుడు వేంకటాచలం మీద ఉన్నాడని పొంగిపోతాడు. పద సాహిత్యానికి కావ్యత్వాన్ని కల్పించి, జీవితంలోని అన్ని అనుభవాలను, అనుభూతులను సామాన్యుల భాషలో వ్యక్తీకరించేలా చేసి, దానికి పరిపూర్ణ రూపాన్ని ప్రసాదించాడు. భగవదంకితంగావించి తరించాడు. ''పదకవితా పితామహ'' పట్టం కట్టుకున్నాడు. మనకు లభ్యమైన అన్ని సంపుటాలను, అన్నికీర్తనలను ఇంకా నిశితంగా పరిశీలించినపుడు శ్రీరాముని గురించి వర్ణించిన మరికొన్ని విశేషాలు తప్పక లభిస్తాయి. ''తాళ్ళపాక వారిని చదవందే తెలుగు రాదు'' అని వేటూరి ప్రభాకర శాస్త్రి గారన్నట్లు తెలుగు మరింత వికసించాలంటే భావి పరిశోధకులు ఈ శ్రీరామ కార్యాన్ని తప్పని సరిగా చేసి తెలుగు భారతికి మరిన్ని అలంకారాలు అందించగలరని ఆశిస్తున్నాను.

## 9. ఉపయుక్తగ్రంథసూచి:

1. అన్నమాచార్య, తాళ్లపాక. 1998. అధ్యాత్మసంకీర్తనలు తాళ్లపాకపదసాహిత్యము 4 సంపుటములు, తి.తి.దే., తిరుపతి.
2. అన్నమయయ సంకీర్తనలు. 2014. తెలుగు సాహిత్యవైభవం. శ్రీపద్మావతీమహిళా డిగ్రీ, పి.జి కళాశాల, తి.తి.దే.
3. నలచక్రవర్తి కానాల. 2001. అన్నమాచార్యులు శ్రీరామావతార సంకీర్తనలు. శ్రీ వేంకటాంబ పబ్లికేషన్, తిరుపతి.
4. మలయవాసిని కోలవెన్ను. 2023. అన్నమయ్య సంకీర్తన లహరి ప్రథమ సంపుటం, తి.తి.దే., తిరుపతి.
5. మలయవాసిని కోలవెన్ను. 2023-అన్నమయ్య సంకీర్తన లహరి ద్వితీయ సంపుటం, తి.తి.దే., తిరుపతి.

***



AUCHITHYAM

ISSN: 2583-4797

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_21.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

### (ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)

# 21. సినిమాపాటలు: రామాయణం

**దర్భ శ్రీనివాసన్**

విశ్రాంత బ్యాంక్ మేనేజర్,

సిండికేట్ బ్యాంక్,

విజయవాడ, ఆంధ్రప్రదేశ్.

సెల్: +91 9985810670. Email: srinidarbha55@gmail.com

**వ్యాససంగ్రహం:**

*సినిమా చలనచిత్ర సీమ అనేది అత్యంత ప్రభావితమైన మాధ్యమము. దాని ద్వారా సందేశాన్ని ప్రేక్షకులకు చక్కగా, సులభంగా, వేగంగా అందించగలిగే ఒక గొప్ప సాధనం. దీనిని ఎరిగి ఎందరో మహానుభావులు దాని ద్వారా చక్కటి సందేశాత్మక కళారూపాలను మలచి తద్వారా మానవతా విలువలను చూపుతూ, మన సంస్కృతి, సాంప్రదాయాలకు దర్పణంగా రూపొందించడమే కాక, నీతిబోధనలను చేస్తూ, అది విజ్ఞాన సాధనంగా తీర్చిదిద్ది, వారు తరించి, ప్రేక్షకులకు విజ్ఞానాన్ని, వినోదాన్ని అందించి జనరంజకంగా తీర్చిదిద్ది పండిత పామరులను అందరిని తరింపజేశారు. రానురాను దానిలో పెను పోకడలు వచ్చి వినోదం అనే పేరుతో వెర్రి మొర్రి వేషధారణతో ఎవరికి ఇష్టమొచ్చిన రీతిలో వారు కథలు వ్రాస్తూ వాటిని సినిమాలుగా తీస్తూ మన సంస్కృతి సాహిత్య విలువలకు తిలోదకాలు ఇస్తూ పాశ్చాత్య పెను పోకడలతో, అర్ధ నగ్న నృత్యాలతో అదే గొప్ప అనుకునే రీతిలో కుటుంబ విలువలు, మానవతా ధృక్పథాలు లోపించే విధంగా ఉన్న నేటి సినిమాలు మానవత్వాన్ని దిగజారుస్తున్నాయి. ఇటువంటి సందర్భంలో ఆది కావ్యమైన రామాయణం మన జాతి గౌరవాన్ని నిలబెట్టి మానవాళికి దివ్యత్వాన్ని అందించే మహోన్నతమైన, ఉదాత్తమైన గ్రంధంలోని అంశాలను తీసుకొని అనేకనేక తెలుగు సినిమాలు వచ్చాయి. ఆ సినిమాలలో పాటలు చక్కటి సాహిత్యంతో వీనుల విందైన సంగీతంతో, చక్కని గానంతో అప్పటి వారినే కాక నేటి తరం వారిని రంజింపజేస్తూ, ఇంకా తరతరాలుగా అవి మానవ స్రవంతిలో కలిసిపోయేలా తీర్చిదిద్దిన మహనీయులందరికి నా ప్రణతులు అర్పిస్తూ నేను రామాయణ కావ్య ప్రధాన ఇతివృత్తం కొనసాగిస్తూ, ఆయా చిత్రాలలో, ఆయా సందర్భాలలోని పాటలను ఉటంకిస్తూ నా రచనను సాగిస్తాను.*

**Keywords :** సినిమా పాటలలో రామాయణం, సీతాకళ్యాణం, లవకుశ, బాపురమణ, వాల్మీకి

## 1. ఉపోద్ఘాతం:

ముందుగా రామాయణాన్ని అందులోని ఇతివృత్తాలను తీసుకొని వెలువడిన ప్రధాన చిత్రాల వివరాలు తెలుసుకుందాం. బ్రాకెట్లలోని సంఖ్య చిత్రం విడుదలైన సంవత్సరాన్ని సూచిస్తుంది. కొన్ని సినిమాలు రెండు మూడు

సార్లు కూడా తీయడం జరిగినది. అహల్య (1934), పాదుకా పట్టాభిషేకం (1932, 1945, 1966), మైరావణ (1940, 1964), లంకాదహనం (1936), వాల్మీకి (1945, 1963), లవకుశ (1934, 1963), వీరాంజనేయ (1960), సంపూర్ణ రామాయణం (1936, 1959, 1971), సీతాకళ్యాణం (1960, 1976), సీతారామవనవాసం, శ్రీ రామాంజనేయ యుద్ధం (1975) అందరూ బాల నటులతో బాలరామాయణం చిత్రం 1996లో వచ్చినది. శ్రీరామరాజ్యం 2011లో వచ్చినది. వీటిలో ప్రధానమైనవి ప్రేక్షక మనోరథంలో సుస్థిర స్థానం ఏర్పరచుకున్నవి ''సీతాకళ్యాణం'' యన్.టి.ఆర్, బాపు దర్శకత్వంలో వచ్చినవి. 1976లో బాపు దర్శకత్వంలో వచ్చిన ''సంపూర్ణ రామాయణం'' 1963లో పుల్లయ్య గారి దర్శకత్వంలో వచ్చిన ''లవకుశ'' ప్రేక్షకుల హృదయాలలో చెరగని ముద్ర వేశాయి. సీతారాముల శుభచరితం రసభరితం. ఇది నిరతం రసగుళికం. కమనీయం, రమణీయం అనుదినము స్మరణీయం. కనుక జుఱ్ఱెద మీ కథామృతము జుఱ్ఱెద మీ పదకంజ తోయమున్, జుఱ్ఱెద రామనామమున జొబ్బిలిచున్న సుధారసంబు, నే జుఱ్ఱెద జుఱ్ఱ జుఱ్ఱగా రుచుల్గనువారి పదంబు కూర్చవే అని కైమోడ్పులు నిడుతూ కథా గమనంలోకి అడుగిడుదాము.

## 2. సినిమా పాటలలో బాలకాండ :

ఒకనాడు నారదుడు వాల్మీకి ఆశ్రమమునకు రాగా వాల్మీకి ఆయనను సేవించుకొని ఈ విధంగా అడిగాడు. దీనిని ''శ్రీరామరాజ్యం''లో ఇలా చిత్రీకరించారు. ఎవడున్నాడీ లోకంలో ఇదివరకెవరు ఎరుగనివాడు, ఎవడున్నాడీ కాలంలో సరియగునడవడివాడు, నిత్యం సత్యం పలికేవాడు, నిరతరం ధర్మము నిలిపేవాడు, చేసిన మేలు మరువనివాడు, ఎదనిండా దయగలవాడు, ఎవడు, ఎవడు, ఎవడు అని ప్రశ్నించగా దానికి సమాధానముగా నారదుల వారు ఒకడున్నాడీ లోకంలో, ఓంకారానికి సరిజోడు. ఇనకులమున ఈ కాలంలో జగములు పొగిడెడి మొనగాడు, విలువలు కలిగిన విలుకాడు, కడు సుగుణాల చెలికాడు, చెరగని విలువల నెలరేడు, మాటకు నిలబడు మొనగాడు, దశరథ తనయుడు, జానకిరాముడు, దానవదమనుడు, అతడే రఘురాముడు, అయోధ్యరాముడు, సాకేతరాముడు అని చెప్పి ఆ రామకథను కావ్యంగా వ్రాయమని చెప్పి వెళ్ళాడు. తదనంతరం బ్రహ్మ ప్రత్యక్షమై వాల్మీకిని ఆశీర్వదించి తలచినంతనే రామకథ అంతా కళ్ళకు కట్టినట్లు కనబడటమే కాక ఆయా పాత్రధారుల మనస్సులలోని సంగతులు కూడా వాల్మీకికి గోచరమవుతాయని కావ్యరచనకు శ్రీకారం చుట్టమని ఆదేశించారు. అంతట వాల్మీకి రామాయణ కావ్యరచన సాగించారు.

**రామయను దివ్యనామము నియమంబున జపము చేసి నిశ్చల భక్తిన్**
**రామాయణమును రచించిన వాల్మీకి మహర్షికిదియే వందన శతముల్ ॥** పాదుకాపట్టాభిషేకం 1945

రావణుడు తన తపశ్శక్తితో బ్రహ్మ నుండి వరాలను పొంది ఆ వర గర్వంతో, అహంకారంతో విర్రవీగుతూ

సృష్టిని అంతా తానే శాసిస్తూ దేవతలను ఎదిరించి, మునులను హింసిస్తూ, స్త్రీలపై అకృత్యాలు చేస్తూ జనజీవనాన్ని అరాచకం చేస్తూ లోకకంటకుడుగా మారి తన చావును తానే తెచ్చుకున్నాడు. దీనినే, **"నిన్ను విడచి (పరమాత్మ)ను తనను మరచి హుంకరించు అహంకారి, కానలేడు నీదు మహిమ. నటన సూత్రధారి । దేవదేవ పరంధామ, నీలమేఘ శ్యామ అని"** సీతాకళ్యాణంలో చూపించారు.

దేవతలు రావణుని ఎదిరించలేక శ్రీమన్నారాయణుని శరణు కోరతారు. వారంతా ''శాంతాకారం భుజగశయనం, పద్మనాభం సురేశం, వందే విష్ణుం భవ భయహరం, సర్వలోకైక నాథం'' అని స్తుతిస్తూ వైకుంఠానికి వెళ్ళి మొర పెట్టుకుంటారు. - సంపూర్ణ రామాణం, బాపు. రామావతారానికి నేపథ్యంగా దేవతాగణము మొత్తము వానరులుగా భూలోకంలో ఆవిర్భవించారు. శంఖచక్ర ఆదిశేషులు విష్ణుతేజము పాయసముగా ఉద్భవించినది. దీనిని **"రావణ వధకై దేవతా గణము వానరులై భువికి తరలే సమూహముగా అల శంఖచక్రాదిశేషువులు, విష్ణుతేజమ్ము పాయసమయ్యె. ఆదినారాయణుడు అవనిలో వెలిసే, ఆర్తజన హృదయాలలో అమృతము కురిసే."** అనే పాటలో రామలక్ష్మణ, భరత, శతృఘ్నుల జననాన్ని చిత్రీకరించారు.

ఇక ఆ చిన్నారుల ఆటపాటలలో దశరథుడు, ముగ్గురు తల్లులు మైమరచిపోతున్నారు. **"రామలాలి మేఘశ్యామలాలి, తామరాసానయన దశరథ తనయ లాలి"** అని ఆ చిన్నారులతోటి వారి జీవనం సాగుతున్నది. ఇంతలో విద్యాభ్యాసం - గురుబ్రహ్మ: గురుర్విష్ణు: గురుదేవో మహేశ్వర: గురుసాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీ గురువేనమ: అని వశిష్ఠుల వారి వద్ద అస్త్ర శస్త్ర విద్యలందు ఆరితేరారు. అక్కడ మిథిలా నగరంలో జనక మహారాజు ఇంట సీతాదేవి అయోనిజగా వెలిసింది. ఆమె ఆటపాటలలో జనక దంపతులు తేలిపోతున్నారు. **"వేయికన్నులు చాలవుగా వేడుకైన మా సీతనుచూడ వేయి కన్నులు చాలవుగా, జనకుని ఇంటను చందమామలా దినదినము వర్థిల్లగా"** సీత ఎప్పుడూ తన మదిలో ఆ పరంధాముని గురించే తలపోస్తూ ఉండేది. ఆ మహావిష్ణు గాథలను తలస్తూ ఆయన అవతార విశేషాలను విని ఆనందిస్తూ ఉండేది. **"జయగోవింద మాధవ దామోదర, జగదానందకారకా నారాయణా"** సీతాకళ్యాణం (1960), **"మహావిష్ణు గాథలు మధుర సుధా ధారలు, అవి విన్న వీనులే వీనులు, కనుగొన్న కన్నులే కన్నులు"** అని ఆయన మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ అవతార గాధలను శ్రద్ధగా ఆలకిస్తూ, ఆలపిస్తూ ఉండేది. - బాపు సంపూర్ణ రామాయణం. ఇక్కడ శ్రీరాముడు తన తమ్ములతో బాల్యం నుండి కౌమారంలోకి అడుగిడుతున్నాడు. విశ్వామిత్రుడు తన యాగ రక్షణకై రాముని పంపవలసినదిగా దశరథుడిని అడుగగా, రామునివదలి ఘడియ అయినా ఉండలేని ఆ రాజు తమ కులగురువు వశిష్ఠుని సూచన మేరకు లక్ష్మణుని, రామునికి తోడుగా ఇచ్చి కౌశికుని వెంట పంపిస్తాడు. ఇంతవరకు జరిగిన కథను చక్కటి పాటలో ''లవకుశ''లో చిత్రీకరించారు. **"రామకథను వినరయ్యా, ఇహపర సుఖములనొసగే సీతారామ కథను వినరయ్యా, అయోధ్యా నగరానికి రాజు దశరథ మహారాజు, ఆ రాజుకు రాణులు ముద్వురు. కౌసల్యా, సుమిత్రా, కైకేయీ. నోముఫలములై వారికి కలిగిరి కొమరులు నలుగురు. రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు, గడియయేని రఘురాముని విడచి గడుపలేని ఆభూజాని కౌశిక యాగము కాచిరమ్మని పనిచెను నీరధశ్యాముని"**

రామలక్ష్మణులను వెంటబెట్టుకొని విశ్వామిత్రుడు బయలుదేరాడు. చీకటి పడడంతో సాయంత్రపు సంధ్యావందనం కావించుకొని ఆ రాత్రి అడవిలో విశ్రమించాడు. తెలతెల్లవారుతుండగానే లేచి **"కౌశల్యా సుప్రజారామ, పూర్వాసంధ్యా ప్రవర్తరే, ఉత్తిష్ఠ నరశార్దూలాం కర్తవ్యం దైవమాహ్నికం"** అని రామచంద్రుని నిద్రలేపారు. ఆనాడు ఆయన పలికిన సుప్రభాతముతోనే నేడు కూడా మనము కలియుగ అవతారుడైన వెంకటేశ్వరుడిని మేల్కొలుపుతున్నాము.

రామలక్ష్మణులకు తన దగ్గరున్న సకల అస్త్ర శస్త్ర విద్యను వాటి ప్రయోగ ఉపసంహారములను తెలిపి సర్వ విజ్ఞానాన్ని కథల రూపంలో తెలుపుతూ వారిని సకల శాస్త్ర పారంగతులుగా చేశారు విశ్వామిత్రుడు. యాగ ధ్వంసానికి వచ్చిన తాటకి, సుభాహువులను నేలకూల్చి, మారీచుని పారద్రోలి యాగసంరక్షణ చేసి గురువుల ఆశీస్సులు పొంది మిథిలా నగరానికి జనకుని యాగము చూడడానికి విశ్వామిత్రుడితో బయలుదేరి అక్కడ శివధనస్సు విరిచి సీతను పెండ్లాడి రాముడు శ్రీరాముడయ్యాడు. ఈ ఘట్టాన్నంతటను లవకుశలలో చక్కడి పాటతో చిత్రీకరించారు. **"తాటకి దునిమి జన్మముగాచి తపసుల దీవెన తలదాల్చి, జనకుని యాగము చూచు నెపంబున చనియెను మిథిలకు దాశరధి, హరుని విల్లు రఘునాధుడు చేకొని ఎక్కిడ పెళపెళ విరిగినది. కళకళలాడే సీతారాముల కన్నులు కరములు కలసినవి"**

సీతారాముల కళ్యాణం పాట అంటే యన్.టి.ఆర్. దర్శకత్వంలో వచ్చిన "సీతారామ కళ్యాణంలోని" సీతారాముల కళ్యాణం చూతమురారండి, సిరి కళ్యాణపు బొట్టును బెట్టి మణిబాషికము నుదుటన కట్టి, చంపకవాసి చుక్కను బెట్టి అని సీతాదేవిని పెళ్ళికూతురుని చేసిన విధము, సంపెగ నూనెను కురులను దువ్వి, సొంపుగ కస్తూరి నామము తీర్చి అని రాముని పెళ్ళికొడుకును చేయడం - ఇలా అన్ని వివరాలతో చక్కటి సాహిత్యంతో సాంప్రదాయబద్ధంగా సాగుతున్న ఈ పాట ప్రత్యక్షంగా వారి కళ్యాణాన్ని మన కళ్ళకు చూపించారు. ఈ పాట వినని తెలుగువాడు ఉండడని, ఈ నాటికీ శ్రీరాముని పందిళ్ళలో ఈ పాట వినపడకుండా శ్రీరామనవమి పండుగ జరగదని అనడంలో ఎటువంటి అతిశయోక్తి లేదు. **"కళ్యాణము చూతము రారండి, ఆకశమంత పందిరి వేసి భూదేవంత అరుగులు వేసి ఆణిముత్యముల ముగ్గులు వేసి అంగరంగ వైభవోపేతమైన కళ్యాణము చూతము రారండి"** అని బాపు గారు రమ్యంగా చిత్రీకరించారు. పరశురాముడు రాముని అవతారం గ్రహించి తన అవతారాన్ని చాలించాడు. దీనితో బాలకాండ పూర్తవుతుంది.

### 3. సినిమా పాటలలో అయోధ్యకాండ:

అయోధ్యలో దశరథుడు తన కుమారులతో, కోడళ్ళతో ఆనందంగా ఉండడం భరతుడి మేనమామ వచ్చి తన మేనల్లుడిని తన రాజ్యానికి ఆహ్వానించడం, భరతుడిని అనుసరించి శత్రుఘ్నుడు కూడా వెళ్ళడం అనే పరిణామాలు చకచక సాగిపోయాయి. దశరథుడు శ్రీరామునికి పట్టాభిషేకము చేయాలని తలచడం ప్రజలందరు

దానికి సంతోషాతిశయములు వ్యక్తపరచడం జరిగినది. పాదుకాపట్టాభిషేకములో **"శ్రీరాముడు రాజౌనట మన సీతమ్మ తల్లి రాణౌనట, మనకందరకు ఆనందము, సంతోషము నిండగా"** అని, ఇక లవకుశలో **"శ్రీరాముని రారాజు చేయగ కోరెను దశరథ భూజాని, పౌరులెల్ల ఉప్పొంగి పోయిరా మంగళవార్త విని"** అని ఆడిపాడి తమ సంతోషాన్ని చూపించడం చిత్రీకరించారు. తానొకటి తలిస్తే దైవమొకటి తలచినట్లుగా మందర బోధతో దైవప్రేరణచే కైకేయి దశరథుడు తనకు ఇంతకు ముందిచ్చిన రెండు వరాలను ఇప్పుడు కోర నిశ్చయించుకొని మొదటి వరంగా రామునికి బదులుగా భరతునికి పట్టాభిషేకము జరగాలని, రెండవ వరంగా రాముడు పదునాల్గు సంవత్సరములు వనవాసము చెయ్యాలని కోరి, అలిగి, నానా దుర్భాషలాడి దశరథుని నిర్వీర్యుణ్ణి చేసి తాను అనుకున్నది సాధించినది. ఫలితంగా పట్టాభిషేకం ముహూర్తానికే శ్రీరాముడు సీతతో తమ్ముడు లక్ష్మణుడుతో అడవులకు బయలుదేరాడు. ఈ సన్నివేశాలను హృదయవిదారకంగా చిరస్మరణీయమైన సాహిత్యంతో అనేక చిత్రాలలో చక్కగా చిత్రీకరించారు. అవి అన్ని ఆ రామాయణ కాలంలోకి త్రేతా యుగానికి మనల్ని తీసుకొని వెళతాయనడం సత్యం. పాదుకాపట్టాభిషేకంలో **"వెడల్చుంటివా కారడవులకు శ్రీహరివైనను సామాన్యుని వలె, ఈశ్వరుని మాయలే చిత్రము, పరమేశ్వరుని లీలలే నిగూఢము"** అనే పాటలోనూ మందర దుష్టబోధలతో **"కారుచిచ్చుగా మారిన కైకేయి - అలుక తెలిసి ఏతెంచిన భూపతి అడిగెను వరములు ఆతన్వి, జరుపవలయు పట్టాభిషేకము భరతునికీ పృథ్వీ, మెలగవలయు పదునాలుగేండ్లు రాముడు కారడవి, చెలియ మాటకు అవును కాదని పలుకదు భూజాని, కూలే భువిపైని, కౌశులేయు రావించె మహీపతి ఆనతి తెలిపెను పినతల్లి. వనవాస దీక్షకు సెలవు కోరె పినతల్లి పదాలవ్రాలి"** అనే పాటలో చూపారు లవకుశ చిత్రంలో. మూర్ఛిల్లిన దశరథుడు కొంతసేపటికి తేరుకొని **"వెళ్ళాలా రామా, వెళ్ళి తీరాలా, కూరిమి తమ్మునితో బంగరు బొమ్మ సీతమ్మతో, ఎన్ని కలలు కన్నానో, ఎన్నెన్ని అనుకున్నానో, వెళ్ళాలా, వెళ్ళి తీరాలా అని చూడలేను రామా ఈ, నీ, దీన వేషము చూడలేను నీ వదనము. పదునాలుగేండ్లు కాదు ఒక దినమైనను ఉండలేను"** ఇక బ్రతుకలేను అని చింతిస్తూ తన అసహాయ శక్తికి చేతకానితనానికి రోధిస్తున్న తండ్రిని, గుండెలవిసేలా విలపిస్తున్న తల్లిని, దు:ఖ సాగరంలో మునిగి ఉన్న ప్రజలను విడిచి వెళ్తున్న ఆ రామచంద్రుని వనవాస ప్రయాణాన్ని లవకుశలో చిత్రీకరించిన సన్నివేశం ప్రేక్షకుల గుండెలను పిండి కంటతడి పెట్టించక మానదు. **"వెడలినాడు రాఘవుడు అడవికేగగా, పడతి సీత సౌమిత్రి తోడునీడగా, గోడు గోడున అయోధ్య ఘొల్లుమన్నది. వీడకుమా మనలేనని వేడుకొన్నది, అడుగులపడి రాఘవా ఆగమన్నది. అడలి అడలి కన్నీరై అరయుచున్నది"** అని తరువాత హే రామ వెడలుచుంటివా కారడవులకు శ్రీహరివైనను, సామాన్యుడివలె, మానవకోటికి మార్గదర్శకుడివై, జగన్మాత జనని జానకి నీడగా, శేషాంసుదు లక్ష్మణుడు తోడుగా, మాయామానుష వేషధారివై భూభారమును మాన్పగనెంచి, వెడల్చుంటివా కారడవులకు అని రామ వనవాస ప్రారంభాన్ని చూపించారు "పాదుకాపట్టాభిషేకం" (1945)

పితృవాక్య పరిపాలన కోసం అడవికి వెళ్ళిన రాముడి వియోగం తట్టుకోలేక దశరథుడు మరణించడం, భరతుడు కైకేయిపై ఆగ్రహించి తాను సింహాసనానికి అర్హుడను కాదని శ్రీరాముడే అన్ని విధాల యోగ్యుడని చెప్పి

తాను తమ్ముడు శత్రుఘ్నునితోను, గురువులు, తల్లులు, పురప్రజలను వెంటపెట్టుకొని రాముని అరణ్యంలో కలసి పలువిధములుగా ప్రార్థించి రాజ్యాన్ని పరిపాలించమని వేడుకొన్నాడు. రాముడు ఎవ్వరు ఏమి చెప్పినా తాను తండ్రి మాటను తలదాల్చి, ఆయనకు ఉత్తమ గతులను కల్పిస్తానని, తాను తన వంశపురుషుల కీర్తికి భంగం కలిగించనని, దృఢంగా చెప్పగా, చివరకు భరతుడు రాముని పాదుకలను అడిగి తీసుకొని, వాటిని శిరసున ధరించి, ఈ పాదుకలే రాజ్యమేలుతాయని, పదునాల్గేండ్ల తరువాత ఒక్క క్షణం ఆలశ్యమైనా ఈ భరతుడు జీవించడని, తాను అయోధ్యలో ఉండక నార చీరలు ధరించి, రామునిచే నియమింపబడిన బంటుగా ఉండి ఆ రామ పాదుకలే రాజ్యమేలుతాయని తిరిగి వెళతాడు. **"చెరితార్థుడైన భరతుడు అరయగా బ్రహ్మాదులకు అతి దుర్లభమౌ పరమాత్ముని పాదుకలను శిరమున ధరించి ధన్యజీవిగా వెలసెన్."** ఇక్కడతో అయోధ్యకాండ ముగిసినది. ఇక రాముడు గంగదాటి అడవిలోనికి ప్రయాణిస్తున్న సందర్భంలో ఎన్ని పాటలు చిత్రీకరించారో. **"ఈ గంగకెంత దిగులు, ఈ గాలికెంత గుబులు, కదలదయా రామా, నా హృదయంలా ఈ నావ"** అని ఒకరంటే ఇంకొకరు గుహుడు సీతారామలక్ష్మణులను గంగ దాటిస్తూ **"అందరిని దరిచేర్చే మారాజువే, అద్దరిని జేర్చమని అడుగుతున్నావే, నీవు దాటలేక కాదులే రామయతండ్రి, నన్ను తరియింపగ వచ్చావు, రామయ తండ్రి"** అని తత్త్వం దర్శనం చక్కగా చూపారు. ఇంకొకరు **"రామయ తండ్రీ, ఓ రామయ తండ్రీ అయ్య మాట కాదనక కైకేయినేమనక అయోధ్య వీడి అడవి దారి పట్టావయా, ఆదినారాయణుడవు నీవేనయ్యా"** అని చిత్రీకరించారు.

## 4. సినిమా పాటలలో అరణ్యకాండ :

అక్కడ నుండి దక్షిణ దిశగా ప్రయాణిస్తూ రాముడు అనేక ఋషుల ఆశ్రమాలను దర్శిస్తూ వారిని సేవిస్తూ వారి ఆశీస్సులను, అనుగ్రహాన్ని పొందుతూ దుష్ట రాక్షసులను సంహరిస్తూ వనవాస దీక్షను సీత సాన్నిహిత్యంలో లక్ష్మణుని సేవాతత్పరతతో పది సంవత్సరములు అడవిలో గడిపి, అగస్త్య ఆశ్రమము జేరి అక్కడ నుండి మూడు సంవత్సరములు పంచవటిలో కాలం గడుపుతున్నాడు. ఇలా ఆనందంగా వనవాస కాలం గడుస్తుండగా ఒకరోజు రావణాసురుని సోదరి శూర్పణక వారున్న ఆశ్రమానికి వచ్చి రామలక్ష్మణుల సౌందర్యానికి ఆకర్షితురాలై కామవాంఛతో వారిని చేరగా వారు తృణీకరించడంతో ఆగ్రహంతో సీతను చంపబోవగా లక్ష్మణుడు ఆమె ముక్కు, చెవులు కోసి పరాభవింపగా ఆమె అవమాన భారంతో జనస్థానంలో ఉన్న ఖరదూషణాదులను ప్రేరేపించగా, వారు పద్నాలుగు వేల మంది రాక్షసులతో యుద్ధానికి రాగా, రాముడు, వారందరిని ఒక్కడే ఎదుర్కొని, వారిని నేలకూల్చాడు. ఈ విషయం తెలుసుకొని రావణుడు, మాయోపాయంతో (సీతచే ఆకర్షింపబడేటట్లుగా మారీచుడిని మాయ లేడిగా చేసి, దానికోసమై రామ లక్ష్మణులను దూరంగా పంపేటట్టు చేసి, ఒంటరిగా ఉన్న) సీతను అపహరించి, లంకలోని అశోకవనంలో, రాక్షసుల మధ్య ఉంచాడు. రాముడు, సీత జాడ తెలియక ఆక్రోశిస్తూ

అడవుల వెంబడి పడి వెదుకుతూ జటాయువు అనే పక్షి ద్వారా సీతను రావణుడు ఎత్తుకొని పోయాడని, తాను ఆతని దుర్మార్గమును ఎదిరించబోతే, తన రెక్కలను విరిచి ప్రాణాలు తీసాడని, అవసాన దశలో ఉన్న ఆ పక్షి రామునికి తెలిపి ప్రాణాలు వదిలింది. రాముడు సీతను వెదుకుతూ కబంధుని చూసి ఆతనికి శాప విమోచనం కలిగించి, ఆతని సూచన మేరకు, సుగ్రీవుడుని కలవాలని, ఋష్యమూక పర్వతానికి సాగుతూ, దారిలో శబరిని గాంచి, ఆమె ఆతిథ్యం స్వీకరించి ఆమెకు ఉత్తమ గతిని కల్పిస్తూ, ఆమెను అందరికి ఆశ్రయము ఇచ్చే చల్లని నదీమ తల్లివై వర్ధిల్లాలని దీవించాడు. ఎంతో కాలంగా గురువు ఆజ్ఞ మీద నిరీక్షిస్తున్న శబరి విశిష్టతను తెలుపుతూ ఆ సన్నివేశాన్ని చక్కగా చిత్రించారు, పలు చిత్రాలలో. వాటిలో ముఖ్యమైనది బాపు గారి సంపూర్ణ రామాయణం. తన కోసమే రాముడు నడచి వస్తున్నాడని భావిస్తూ ఆయన దివ్య మంగళ మోహన రూపమును దర్శించలేకపోతున్న తన వార్ధక్యపు ఛాయలకు తోడుగా ఆయనను చూస్తున్నాననే తలపుతో వచ్చిన ఆనంద భాష్పాలు తోడై కన్నీరు నిండిన కళ్ళతో దర్శనం కావట్లేదని భాద పడుతూ ఆయనకు మంచి పళ్ళు, పుట్ట తేనె ఇవ్వాలని ఆశపడ్డ తీరును ఎంతో హృద్యంగా చిత్రీకరించారు. **"అసలే ఆనదు చూపు, ఆపై ఈ కన్నీరు । తీరా దయచేసిన నీ రూపు తోచదయ్యెయ్యో । ఏలాగూ నా రామా ఏదీ నీ దివ్య మోహన రూపము; చెట్టునడిగి పుట్టనడిగి తెచ్చుకొచ్చిన ఫలాలు । దోరవేవో, కాయవేవో, గారనొక్కినవేవో గాని ముందుగా రవ్వంత చూసి విందుగా అందీయనా"** అని ఆర్ద్రంగా సాగిన ఈ పాట భక్తుడికి, భగవంతుడికి మధ్య ఉన్న భావావేశాన్ని చక్కగా విశదపరస్తుంది. ఇంతవరకు జరిగిన ఈ కథను "లవకుశలో" **"శ్రీరాముని చరితమును తెలిపెదమమ్మా, ఘన శీలవతి సీత కథ వినుడోయమ్మ । చెలువు మీర పంచవటి సీమలో తమ కొలువుజేయ సౌమిత్రి ప్రేమతో, తను కొలువు తీరే రాఘవుడు భామతో, రాముగని ప్రేమగొని రావణుచెల్లి, ముకుచెవులు కోసె సౌమిత్రి రాసిల్లీ । రావణుడా మాట విని పంతము బూని । మైథిలిని కొనిపోయె మాయలు పన్ని"** అని చక్కగా సాహిత్యంతో పాటు సన్నివేశ చిత్రీకరణ చేసారు. దీనితో అయోధ్యకాండ పూర్తి అయినది.

## 5. సినిమా పాటలలో సంక్షిప్తంగా కిష్కింద, సుందర, యుద్ధ కాండలు :

ఇక వాయునందనుడు, రామభక్తుడు, మారుతి, దాసాంజనేయుడు, సీతాశోక వినాశకుడు, సుందరకాండ నాయకుడు అయిన హనుమప్రవేశము. సుగ్రీవునితో చెలిమి, వాలివధ, సుగ్రీవుని పట్టాభిషేకము, సీతాన్వేషణకై వానరసేన నలుదిక్కుల ప్రయాణము, దక్షిణ దిశగా అంగధ నాయకత్వంలో జాంబవంతుడు, హనుమదండు, సాగరం వరకు అన్వేషించి నిరాశ చెందిన వారికి, సంపాతి దర్శనం, ఆతని ద్వారా సీత లంకలో ఉందని తెలుసుకొని, ఆంజనేయుడు రామబాణంలా వంద యోజనాల సాగరాన్ని దాటి లంక జేరి సీతను గాంచి లంకాదహనం గావించి, రాముడికి సీత క్షేమ సమాచారం అందించడం, వానర సైన్యంతో లంకపై దండయాత్ర, విభీషణుడు శరణాగతి, సాగరంపై వారధి నిర్మాణం, చక చకా సాగిపోయాయి. ఇక కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు

మొదలైన అందరిని సంహరించి చివరకు రావణవధ. రామునిజయం. విభీషణుడి లంకాపట్టాభిషేకం, సీతమ్మకు అగ్నిపరీక్ష, అగ్ని దేవుడు సీత పవిత్రతను చాటడం, పుష్పకవిమానం ఎక్కి సీతారామలక్ష్మణులు, ఆంజనేయుడు, సుగ్రీవ, విభీషణాదుల మొత్తం పరివారంతో అయోధ్య ప్రయాణం. తమ్ములు, తల్లులతో సీతారామలక్ష్మణుల కలయిక, అంగరంగ వైభవముగా శ్రీరామ పట్టాభిషేకము. దీనితో సంక్షిప్తంగా కిష్కింద, సుందర, యుద్ధ కాండలు పరిసమాప్తి అయినాయి. పై కథా సారాంశములను ''లవకుశ''లో ఈ చక్కటి పాటతో రూపొందించారు. **"రఘుపతిని, రవిసుతుని కలిపెను హనుమా, నృపుచేసెను సుగ్రీవుని రామవచన మహిమ । ప్రతి ఉపకృతి చేయుమని పనిచెను కపుల । హనుమంతుడు లంకజేరి వెదకెను నలుదిశల । పాహియనియ శోకవనిని శోకించే సీత దరికి జెని ముద్రనిడి తెలిపె విభుని వార్త । ఆ జనని శిరోమణి అందుకొని పావని లంకకాల్చి రామునికడకేగెను రివ్వు రివ్వుమని । దశరథ శూనుడు లంకను డాసి దశకంఠు తలలు కోసి ఆతని తమ్ముని రాజుగజేసి సీతను తెమ్మని పనిచె । చేరవచ్చు ఇల్లాలిని చూసి శీలపరీక్షను కోరె రఘుపతి । అయోనిజపైనే అనుమానమా, ధర్మమూర్తి రామచంద్రుని ఇల్లాలికా ఈ పరీక్షా । పతియానతి తలదాల్చి అగ్ని దూకె సీత । హుతవాహుడు చల్లబడి శ్లాఘించెను మాత । సురులు పొగడ ధరణిజతో పురికి తరలె రఘునేత "** అని చక్కటి పాటను రసభరితంగా చిత్రీకరించారు.

ఇక మొత్తం రామాయణం ఆరు కాండలను సంక్షిప్తంగా ఒక్క పాటలో చిత్రీకరించారు ''భూకైలాస్'' చిత్రంలో. నారదుడు జగన్మాతకు రామ అవతారాన్ని వివరిస్తున్న సందర్భంలో సాగే ఈ పాట ఘంటశాల గారి గాత్రంలో సజీవంగా నిలిచిపోయింది. **"ద్వారపాలకుల మరల దరితీయు కృపయో । ధరలోన ధర్మము నెలకొల్పు నెపమో, రాముని అవతారం । రవికుల సోముని అవతారం"** అని చిత్రీకరించారు.

బాపు సంపూర్ణరామాయణచిత్రీకరణలో **"వెడలెను కోదండపాణి"** అనే చరణంతో ముఖ్యమైన సన్నివేశాలను చూపిస్తూ చిత్రీకరణ కొనసాగిన వైనం అద్భుతం. **"వెడలెను కోదండపాణి అడవులపడి ముని వెంబడి, యాగ రక్షణకై, నడచినంత నేల నందనవనమాయె", "వెడలెను కోదండపాణి" వనసీమకు తండ్రి ఆజ్ఞ తలదాల్చి తరుణితో, తమ్మునితో అయోధ్యరామయ్య అడవులపాలాయె ;** తరువాత సీతావియోగ సందర్భంలో సీతారాముల వియోగము, ఆ తలపే అతి బాధాకరము. సీతా సీతా అను కేకలతో భూతలమే కంపించే, **"వెడలెను కోదండపాణి"** శోకముతో, పరితాపముతో అన్నారు. తరువాత సాగరముపై వారధి నిర్మాణమప్పుడు **"వెడలెను కోదండపాణి"** కడలి మీద క్రోధముతో సాగరుడే శరణాగతుడాయెను. **రామదండు కదిలింది, లంక గుండె చెదిరింది. అడవి వదలి సమరానికి "వెడలెను కోదండపాణి". దనుజులను దునుమాడి ధరణిసుతి చెరబాపి తమ్మునితో, పరిచరులతో భూమిజనులు కలలుగనే రామరాజ్య స్థాపనకై "వెడలెను కోదండపాణి". వినువీధిన వైభవముగా "వెడలెను కోదండపాణి"** అనే సాహిత్యంతో చక్కగా కథాగమనాన్ని చిత్రీకరించారు.

### 6. సినిమా పాటలలో ఉత్తరకాండ:

ఆయా పాటలను సందర్భానుసారంగా వివరించడం జరిగింది. ఇప్పుడు ప్రధానాంశమైన సప్తమ కాండ ఉత్తర రామాయణంలో కథాభాగంలో శ్రీరాముడు జనరంజకంగా పరిపాలన సాగిస్తూ ఉన్నారు. **"అంతా**

**రామమయం, జగమంతా రామమయం"** అని జనులందరు ఆనంద సాగరంలో డోలలాడుతున్నారు. సీతాదేవి గర్భవతి అయినది. జనుల సంతోషానికి అవధులు లేవు. కానీ విధి మళ్ళీ వక్రించి ఒక అల్పుడు **"ఏడాది పాటు లంకలో చెరపడ్డ సీతను ఏలుతున్న రాముడు ఎంతటి విమోహి"** అన్నమాట జనవాక్యంగా ఎంచి రాముడు జానకిని కారడవులలో వదలి రమ్మని లక్ష్మణుని ఆదేశించడం, ఆమె బాధాదగ్ధ హృదయంతో ఒంటరిగా అడవిలో శోకిస్తున్న వేళ వాల్మీకి ఆమెను చేరదీసి, ఆశ్రయం కల్పించి ఆమె బిడ్డలైన కుశలవులకు, చక్కగా విద్యాబోధలు చేసి, వారికి రామాయణ కావ్యాన్నంతటిని, సంగీత సాహిత్యాల మేళవింపుగా నేర్పడం జరిగినది. వారు ఆలపించిన గీతాలే **"రామ కథను వినరయ్యా"** బాలకాండలోను **"వినుడు వినుడు రామాయణ గాథ"** అయోధ్యకాండలోను ఇక **"శ్రీరాముని చరితమును తెలిపెదమమ్మా"** అను పాట అరణ్య, కిష్కింద, సుందర, యుద్ధ కాండలను సంగ్రహంగా తెలుపుతాయి. వారి గానామృత ధారలతో అయోధ్య పుర వాసులతో పాటు రాముడు, సోదరులు, తల్లులు అందరూ వోలలాడుతారు. కానీ ఈ బాలురెవ్వరో ఎరుగరు వారు. తరువాత రాముడు అశ్వమేధయాగం చేయ తలపెట్టడం, సీతాదేవి రాముని ఏకపత్నీవ్రత భంగం అయినదేమోనని పరితపించడం, దానికి వాల్మీకి సంశయ నిర్మూలనం చేసిన సందర్భంలో చిత్రీకరింపబడిన పాట **"సందేహించకుమమ్మా రఘురామ ప్రేమను సీతమ్మ । ఒకే బాణము, ఒకటే మాట, ఒక్క భామకే రాముని ప్రేమ । మిన్నే విరిగి పడినా, వ్రతభంగము కానీడమ్మా । అని ఒకవేళ రఘురాముడే మరో భామతో కూడితే - నాదు జపము, తపము, నా కావ్యమ్మే వృధాయగునమ్మా"** అని చెప్పిన విషయం రాముని ఖ్యాతిని, ఏకపత్నీ వ్రత దీక్షత, దక్షతను చాటుతుంది. ఈ పాట రామాయణానికి పట్టుకొమ్మలాంటిది. ఇక యాగాశ్వాన్ని లవకుశులు బంధించడం, దానిని విడిపింపలేక శతృఘ్న, లక్ష్మణుల ఓటమి, తదనంతరం రాముడే స్వయంగా యాగరక్షణార్ధం యుద్ధానికి రావడం, అప్పుడు ఆంజనేయుడు ద్వారా విషయం తెలుసుకొన్న సీత యుద్ధరంగానికి రావడం, ఒకరినొకరు తెలుసుకొనడం, సీత కుశలవులను రాముడికి అప్పగించి, భూమాత ఒడిలో జేరడం, కుశలవుల పట్టాభిషేకం, రాముడు సరయూ నదిలో ప్రవేశించి వైకుంఠధామానికి చేరడంతో అవతార పరిసమాప్తి అయినది. సంక్షిప్తంగా ఇది రామాయణ చిత్రమాలిక "లవకుశ"లో చూపబడినది.

## 7. సాంఘిక చిత్రాలలో రామాయణ సంబంధ పాటలు :

ఇప్పుడు కొన్ని విశేషాలను జోడిరచనిదే ఇది సంపూర్ణం కాదు. సాంఘిక చిత్రాలలో కూడా కథానుగుణంగా పాటలలో చూపించిన సీతారాముల కళ్యాణాన్ని చూద్దాం. వాగ్దానం 1961 చిత్రంలో " **శ్రీనగజ తనయం సహృదయం చింతయామి సదయం, త్రిగజన్మహోదయం"** అని సీతారామ కళ్యాణాన్ని హరికథారూపంగా సన్నివేశానికి తగినట్లుగా నాయికా నాయకుల మీద చక్కగా చిత్రీకరించి, కళ్యాణ వేడుకను మనకు కన్నులారా

చూపారు. అట్లానే ''స్వాతిముత్యం''లో నాయికా నాయకుల మీద ''రామా కనవేమిరా, రఘురామా కనవేమిరా, రమణీలలామా, నవలావణ్యసీమ, ధరాపుత్రి, సుమగాత్రి నడయాడి రాగా'' అని కళాతపస్వి విశ్వనాథ్ గారు తన దర్శకత్వ ప్రతిభను చాటారు.

## 8. సినిమాలలో రామసంకీర్తనలు :

రామభక్తులైన త్యాగయ్య, రామదాసు, పోతన, అన్నమయ్య ఇలాంటి వారి మీద వచ్చిన చిత్రాలను, ఇంకా అనేక అనేక రామాయణ చిత్రాలలోని పాటలను పొందుపరచలేకపోయినందుకు చింతిస్తూ సాంఘిక చిత్రాలలో రాముని మీద వచ్చిన పలు పాటలలో కొన్నిటిని పేర్కొనదలిచాను. ''జయసింహ'' - 1955, **''జయజయ శ్రీరామ రఘువరా, శుభకర శ్రీరామ, త్రిభువన జన నయనాభిరామ'' ; ''మీనా - శ్రీరామ నామాలు శతకోటి, ఒక్కొక్క పేరు బహుతీపి''** అన్న పాట 'చదరంగం - 1967లోని **"బంగరు బొమ్మ సీతమ్మ, ఇల్లాలంటే నీవేనమ్మా",** 'శాంతినివాసంలోని **"శ్రీరామ చంద్ర: ఆశ్రిత పారిజాత, సమస్త కళ్యాణ గుణాభిరామ, సీతాముఖాంబోరుహ చంచరీకహా"** అనే పాట ఇక అందాల రాముడు సినిమాలోని "**పలుకే బంగారమాయె అందాల రామ, పలుకే బంగారమాయె ; మము బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లి, మము బ్రోవమని చెప్పవే ఏకాంత రామయ్య నీ చెంతగా చేరి చల్లంగా నీ ముద్దు చెల్లించువేళ"** అన్న పాటను ; భద్రగిరి కథను హరికథగా చక్కగా చూపారు బాపుగారు.

ఇక సినిమాలలో కొన్ని త్యాగరాజ కీర్తనలు వివాహబంధం సినిమాలోని **"నగుమోము గనలేని",** 'సప్తపది సినిమాలోని **"మరుగేలరా ఓ రాఘవా"** అనే కీర్తన 'పూజ సినిమాలో **"నీ దయ రాదా రామా నీ దయ రాదా",** శంకరాభరణం సినిమాలో **"బ్రోచేవారెవరురా, విను వినా నను బ్రోచేవారెవరురా"** లాంటి కీర్తనలు చక్కగా చిత్రీకరించారు.

## 9. ముగింపు:

రామ కథను వెండితెరకు ఎక్కించడంలో బాపురమణలది ఒక ప్రత్యేక శైలి. రామాయణాన్ని అన్ని కోణాలలో నిశితంగా పరిశీలించి వారు పౌరాణిక చిత్రాలైన సంపూర్ణ రామాయణం, సీతాకళ్యాణం, శ్రీరామాంజనేయ యుద్ధం, శ్రీరామరాజ్యం చిత్రాలనే కాక ముత్యాలముగ్గు, కలియుగ రావణాసురుడు, రాంబంటు, అందాలరాముడు, సుందరకాండలు, ఆ గాథలను పోలిన సాంఘిక చిత్రాలను నిర్మించారు. వారు రామాయణాన్ని ఎంతో ఇష్టంగా ఒక రమణీయ, శ్రవ్య, దృశ్య కావ్యంగా మలచి ప్రేక్షకులకు అందించి తరించారు. రామాంజనేయ యుద్ధం చిత్రంలో బాపు రామ నామానికి, రామ బాణానికి జరిగే పోరాటాన్ని చక్కగా చిత్రీకరించారు. శరణన్న వారిని శ్రీరామ పాద సాక్షిగా శరణిచ్చిన హనుమకు ఒక పరీక్ష. శ్రీరామ నామ వైశిష్ట్యాన్ని మధురంగా శక్తియుక్తంగా వివరించిన సినిమా. **''జయతు జయతు మంత్రం, జన్మసాఫల్య మంత్రం - రామ్ రామ్ రామ్''**

జనన, మరణ, క్లేశ, విచ్ఛేదక మంత్రం - రామ్ రామ్ రామ్, సకల నిగమ మంత్రం, సర్వ శాస్త్రైక మంత్రం, రఘుపతి నిజమంత్రం, రామరామేతి మంత్రం అని చక్కగా చూపారు / చెప్పారు.

వాల్మీకిది ధర్మదృష్టి; వ్యాసుడిది జ్ఞానదృష్టి; మన దర్శకనిర్మాతలు వాటిని గ్రహించి వాటి సారాన్ని (రసరూపంలో) చిత్రనిర్మాణాలు చేసి ప్రేక్షకులచే దర్శింపజేసినప్పుడు మన జాతి, సంస్కృతి, సంప్రదాయాలు, మానవతా విలువలు పెరిగి సకల సౌభాగ్యాలు సర్వులకు అందుతాయి. అప్పుడే రామరాజ్యం. అలా జరగాలన్నదే మన ఆకాంక్ష.

రామకథ అనే కరుణాసాగర తీరంలో ఆడుకుంటున్న నేను ఆ కరుణా రసాన్ని పొందాలని ఆశతో దోశలితో నీరు తీసుకోగా నీరు కారిపోగా చేతికి అంటిన ఇసుక (భక్తి) రేణువులను ఆత్రంగా అందుకుందామన్న ప్రయత్నంలో అవి రాలిపోతూ ఉంటే గట్టిగా అతుక్కున్న రేణువులతో ఆ రాముడి గురించి వ్రాయాలనే ప్రయత్నంలో మరిన్ని జారవిడుచుకున్న ఈ దీనుడిని పాఠకులు సహృదయంతో అర్థం చేసుకొని ఆదరిస్తారని భావిస్తున్నాను.

## 10. ఉపయుక్తగ్రంథసూచి:


1. కామేశ్వరరావు ఉప్పలూరి. వాల్మీకి రామాయణము. యథా మూలము, శాంతావసంత ట్రస్ట్, హైదరాబాద్, 2019
2. కృష్ణమాచార్యులు, యం.& వెంకటరామయ్య, గోలి. శ్రీమద్రామాయణం, గీతాప్రెస్ ప్రచురణ, హైదరాబాదు, 2004.
3. శ్రీరామచంద్రుడు, పుల్లెల. శ్రీమద్వాల్మీకి ప్రణీతశ్రీమద్రామాయణము (బాలానందిని వ్యాఖ్య). ఆర్షవిజ్ఞానట్రస్ట్, హైదరాబాదు, 2016
4. సుబ్బారావు, వావిలికొలను. శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము 'మందరము' (మూలము), శ్రీ కోదండరామ సేవక ధర్మసమాజం, దాసకుటి-అంగలకుదురు, 1982
5. సూర్యప్రకాశదీక్షితులు, పురాణపండ. ఉషశ్రీ రామాయణం, తిరుమలతిరుపతి దేవస్థానం, తిరుపతి, 2012.


***


AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_22.php

# "కమనీయం తెలుగు రామాయణం"

### జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)

# 22. తెలంగాణ సంకీర్తనకారులు: రామసంకీర్తనలు

**కొలుకుల రజిత**

తెలుగు అధ్యాపకురాలు,
తెలంగాణ సాంఘిక సంక్షేమ గురుకుల మహిళా డిగ్రీ కళాశాల,
నిజామాబాద్, తెలంగాణ.
సెల్: +91 7569856191. Email: rajithakolukula1984@gmail.Com

**వ్యాససంగ్రహం:**

*రామాయణం నిత్యనూతనంగా తెలుగు సాహిత్యంలో విరాజిల్లుతుంది. రామాయణంలోని ఒక్కో కాండ ఒక్కో ఉపదేశాన్ని, వ్యక్తిత్వ విలువల్ని అందిస్తుంది. రామాయణంపైన అనేక పాటలు, గేయాలు, సంకీర్తనలు ఎన్నో వచ్చాయి. ఎందరో కవులు రామనామ సంకీర్తనలతో వారు తరించడమే కాకుండా ఇతరులను తరింపచేస్తున్నారు. తెలుగు సాహిత్యంలో ఎందరో రామునిపై తమ భక్తిని కీర్తనల రూపంలో తెలిపారు. తెలంగాణ ప్రాంతంలో సంకీర్తనకారులుగా పేరు గడించిన రామదాసు, రాకమచర్ల వెంకటదాసు, తాళ్ల లక్ష్మీనారాయణ గౌడ్ గార్లు రచించిన రామాయణ కీర్తనలో ఉన్న ప్రత్యేకతలు, రామకీర్తన తత్వములను తెలియజేయడమే ఈ వ్యాస లక్ష్యం.*

**Keywords:** సంకీర్తనలు, రామతత్వం, రామదాసు, రాకమచర్ల వెంకట దాసు, తాళ్ళ లక్ష్మి నారాయణ గౌడ్.

## 1. ఉపోద్ఘాతం:

రామ కథ పవిత్రమైనది, పాపములను హరిస్తుంది. వేదాలతో సమానమైనది. రామ కథను పఠించువారు, సమస్త పాపాల నుండి విముక్తులవుతారు" అని రామాయణ పఠన ఫలాన్ని వాల్మీకి తెలిపాడు. కష్టాల బావి నుండి సుఖాలనే జలాలను చేదుకోవాలి. అది ఎలా సాధ్యమో తెలిపే గ్రంథమే రామాయణం. "జీవితంలో అన్నీ చదివి వెలితి పొందిన వారు రామాయణాన్ని చదివి వెలుగును దర్శిస్తారు అని పెద్దలంటారు" అన్ని కాలాల్లో అందర్నీ సంతృప్తి పరిచే అద్భుతమైన గ్రంథం రామాయణమహాకావ్యం. ఆలోచనామృతమైన, సాహిత్య రసభరితమైన రఘునాథుని రమణీయ చరితం.

ఈ వ్యాసంలో తెలంగాణ సంకీర్తనకారుల సంకీర్తనలు గమనించినట్లయితే వారు భిన్నమైన కాలాల్లో ఉన్నటువంటి వ్యక్తులైన సరే రాముడు గురించి చెప్పినప్పుడు వారి ఆర్తిని, బాధల్ని చెప్పడానికి ప్రయత్నం చేశారు. ఎందుకంటే రాముడు భయాన్ని పోగొట్టేవాడు, ఆపదలను దూరం చేసేవాడు. రామాయణమంతా కరుణే, దుఃఖమే అయినా అంత దుఃఖంలో కూడా రామాయణాన్ని చదివితే ఉపశమనం కలుగుతుంది. మౌలికంగా అందులో ఉన్న తత్వం అది. అందుకని కవులు రచయితలు, రాముడు గురించి రాస్తున్నారంటే తమ పరిస్థితులు చెప్పుకోవడానికి, కష్టాలు చెప్పుకోవడానికి 'ఆర్తి' కేంద్రంగానే రాశారు. వారి కీర్తనలు అన్నీ కూడా రామునికి చేసే ఆత్మ నివేదన. రాముని యెడల అవ్యాజమైన నమ్మకం రాముడే దేవుడనే భావన రామున్ని ఆవాహన చేసుకోవడం ఇలాంటివి సంకీర్తనల్లో మొత్తం రామమయం అయినా తీరు కనిపిస్తుంది. వారు రాసిన, పాడిన సంకీర్తనలు అన్నీ కూడా అక్షరాలు కావు హృదయ నివేదనలే. ఈ కీర్తనలన్నీ కూడా భగవంతుణ్ణి సంపూర్ణంగా విశ్వసించిన భక్తుని తీవ్రమైనటువంటి మానసిక ప్రేమలో నుండి వచ్చినవి, విపరీతమైన వాత్సల్యం నుండి వచ్చినవి, కరుణ నుండి వచ్చినవి ఇవన్నీ భక్తిలోని కోణాలే కరుణాభక్తి, వాత్సల్యభక్తి, ప్రేమభక్తి, ప్రణయభక్తి, ఒక్కోసారి వైరభక్తి కూడా ఇదంతా రామసంబంధం అనేక కోణాలైనా అందులో దాగి ఉంది రాముని తత్వమే.

## 2. వ్యాస ఉద్దేశం:

తెలంగాణలో చాలా ఏళ్ళకింద నుండే సంకీర్తనసాహిత్యం ఉంది. మనిషిసంసారం నుండి బయటపడడానికి భక్తి, జ్ఞాన, కర్మలనే మూడు మార్గాలు ఉపకరిస్తాయి. సంకీర్తనచార్యులు భక్తి జ్ఞానాలకు ప్రాధాన్యం ఇచ్చారు. సత్కర్మల వైపు సమాజాన్ని నడిపించారు. కాబట్టి వారికి ఈ సమాజంలో ఎంతో గౌరవం ఉంది. అన్నమయ్య, క్షేత్రయ్య, రామదాసు ఈ ముగ్గురు కూడా తెలుగు నేలను పవిత్రం చేసిన వాగ్గేయకారులు. ఈ కోవలో నడిచిన సంకీర్తనచార్యులు తెలంగాణలో చాలామంది ఉన్నారు.

వారిలో, రాకమచర్ల వెంకటదాసు ఇదే వరుసలో ఈ ఆధునిక కాలంలో కూడా సంకీర్తనలు రాసిన వారున్నారు వారిలో తాళ్ల లక్ష్మీనారాయణ గౌడ్ ఒకరు. వీరూ అనేక సంకీర్తనలు రచించారు . అందులో ప్రధానంగా వ్యక్తి ధర్మము, కుటుంబధర్మము, సంఘధర్మము ఈ ధర్మత్రయాన్ని లోకానికి వంటబట్టించే రామాయణ కథకు సంబంధించిన శ్రీరామ సంకీర్తనలను రచించారు. అలాంటి రామ నామ సంకీర్తనలతో వారు, తరించడమే కాకుండా ఇతరులను తన్మయులను చేస్తున్న తెలంగాణ సంకీర్తనకారుల మధ్యకాలంమారినాకూడా వారిసంకీర్తనల్లో రాముడితత్వాన్ని గురించి ఎవరు ఏ విధంగా చెప్పారో తెలియజేయడమే ఈ వ్యాస ఉద్దేశం.

## 2. రామదాసు – రామ సంకీర్తనలు

తెలంగాణ వాగ్గేయకారులలో మొదట గౌరవించదగిన వాడు. ఈయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు కంచర్ల గోపన్న, తాను భక్తితో రచించిన సంకీర్తనలు హృదయరంజకంగా ఉండీ ఈనాటికి పండితులు, పామరులు పాడుకునేలా ఉన్నాయి. రామదాసు సంకీర్తనలను భక్తులు భజన కార్యక్రమాలలో పాడుతుంటారు. కంచర్ల గోపన్న శ్రీరాముని కొలిచి, కీర్తించి భక్త రామదాసుగా చరిత్రలోకెక్కారు. భక్త రామదాసు సంకీర్తనలను పరిశీలించినట్లయితే తన్మయత్వంతో పాటు, జీవిత పరమార్ధం తెలుస్తుంది. ఉదాహరణకు,

**ప// అడుగుదాటి కదలనియ్యను - నాకభయమియ్యక నిన్ను విడను**
**చ// గడియ గడియకు తిరిగి తిరిగడిగడిగితిని వేసారి వచ్చి**
**గడువుదప్పిన నేను ఇక/బహుదుడుకుతనములు సేయుదును విను. (రామ)**
**కుదురుగా కూర్చుండనివ్వను నీకు/కోపమొచ్చిన భయపడను**
**ఇది మదె రిగియు ఇంక నీ మొహ/మాటమేమీయు లేదు గదా నా**
**హృదయ కమలములందు నీ మృదు/ పదములను బంధించివేయుదు (రామ)**
**రేపు మా పని జరిపినాను నే /నాపు చేసేడి వాడను కాను**
**ప్రాపు నీవని నమ్మి కొలచిన/ పాపముల నెడబాసి దయతో**
**తేప తేపకు నీదు మోమిట/సూపకుండిన ఓర్వ సుమ్మి ( రామ)**
**రాక్షసాంతక సీతా రమణ——సార/సాక్షా సద్గుణ భక్తాభరణా**
**ఈ క్షణంబున దీనజనుడని/మోక్షమీయక యుంటివైనను**
**సాక్షి బెట్టి నేడు వేరొక దీక్షచే సాధింతు నిన్ను (రామ)/భూరిభద్రాచలవాసా**
**భుజగశయన భక్త పోషా/కూరిమిగ నిను విడిచిపెట్టిన**
**ధరణిలో భద్రాద్రి రాఘవ/రామదాసు అనెడి నామము/మారుపేరున బిలువు నన్ను** (రామా)[1]

భక్తుడికి భగవంతుడి పైన ఉండే అధికారం ఈ కీర్తనలో కనిపిస్తుంది, నన్ను కరుణించకపోతే ఎలాంటి పూజలు పుణ్య కర్మలు చేసి అయినా నేను నిన్ను సాధించుకుంటాను అనేటటువంటి ఒక ధిక్కార స్వరం ఈ కీర్తనలో ఉంది. సాధారణంగా మానవులు ఏదైనా ఒక పని పంతం పట్టి సాధిస్తారు. దానిని ఎదుటి వాళ్లకు చెప్పే సందర్భంలో ఒక సవాల్ చేస్తూ ఈ పని కాకపోతే నా పేరే మార్చుకుంటాను అని చెప్తా ఉంటాం ఇక్కడ భద్రాచల రామదాసు కూడా నాకు నువ్వు కరుణించలేని సందర్భంలో నా పేరు రామదాసే కాదు అని చెబుతాడు.

**రామ సీతా రామ/ రఘురామ జయరామ /రామా నా మనవి విని /ఏమంటివి రామ**
**చ|| అపరాధిని నెపమెన్నక కృపజూడము రామ/జపతపము జేసి గతి/నెప మెరుగను రామ ( రామ)**
**చ||పాపాత్ముడా బహు బాధల/పాలైతిని రామ/ ఏ పారగా పెనుభూతము/ దాపాయెను( రామ)**
**కావరమున పర స్త్రీలను/కనుగొంటిని రామా/ ఏ విధముగా దుష్కర్మము లెడబాపెవు రామ**
**ఇలసౌఖ్యంబధికంబని/ఎంచితినేరామ/కలకాలంబొక్కరీతియని/ఉండవుగదారామ (రామ)/**
**అనుదినమును నెమ్మనమున/కనుగొంటిని రామా/ఘన కోపిని బహు పాపిని/**
**మన జాలను రామ ( రామ)**[2]

రామా నా మనవి విని ఏమంటివి రామా ! అని దీంట్లో అంతరార్థాన్ని గ్రహిస్తే రామదాసు ఒక 'వినతి పత్రాన్ని' నేను నీకు పెట్టాను, మరి ఏమంటావు. నాగురించి ఏం ఆలోచిస్తున్నావు. అని చెప్పి, ఆయన తన జీవితంలో

ఎలాంటి పొరపాట్లు చేశాడో, అవన్నీ చెబుతూ నేను ఇలాంటి తప్పులు చేశాను కాబట్టి నువ్వు కరుణించకుండా ఊరుకున్నావా? లేకపోతే నా విన్నపాన్ని అసలు పరిగణలోకి తీసుకోలేదా? అంటూ తను ఇంతకాలం చేసినవన్నీ చెప్తూ ఉంటాడు, ఈ కీర్తనలో నన్ను మన్నించి నా తప్పుల్ని చూసి చూడనట్లు వదిలేయమనే వేదన ఈ సంకీర్తనలో కనిపిస్తుంది.

**సకలేంద్రియములార జరుగ సమయము గాదుసద్దు చేయక యుండరే..**
**ప్రకటముగ మా ఇంట పండుగై జానకి పతి పూజ సేయు వేళ మీరు. (సకలే)**
**నిరతమును పదు నాలుగు భువనములు**
**కుక్షిలో నిర్వహించెడి స్వామిని ఇరవుగను**
**నా హృదయ కమలకర్ణిక మద్యమున**
**భక్తి నుంచుకొనియూ**
**శరణాగతత్రాన బిరుదు గలిగిన తండ్రి కరుణింపుమని వేడుచూ**[3]

సకలేంద్రియములు అంటే మన దేహంలో ఉన్న ఇంద్రియాలు అని రామదాసుల వారు చెప్తున్నారు,సద్దు చేయక ఉండరే ఎందుకంటే, ఈ వేళ జానకి పతి అయిన శ్రీరాముని పూజా మా ఇంటిలో చేస్తున్నాము. ఇంద్రియాలన్నీ కూడా మీరు చప్పుడు చేయకుండా ఉండండి అంటున్నాడు. సాధారణంగా మనం ఇలాంటివి ఇంట్లో కానీ పాఠశాల, కళాశాలలో కానీ ఏదైనా కార్యక్రమం చేస్తుంటే పిల్లలకి గట్టిగా చెప్తాం. చప్పుడు చేయకండి అని ఇంట్లో పిల్లలకైతే బయటికి వెళ్లి ఆడుకోండి, ఇక్కడ కేకలేయకండి పూజ జరుగుతుంది సప్పుడు చేయకండి అని మనం మామూలుగా అంటాం. అదే పద్ధతిలో రామదాసు మానస బోధ చేస్తున్నారు,ఎవరికి అంటే ఒంట్లో ఉన్న ఇంద్రియాలకి రాముని పూజ చేస్తున్నాను '' నన్ను డిస్టబ్ చేయకండి ''అని చెప్తున్నారు. ఇక్కడ పరోక్షంగా మనకు చెప్పేదేమిటంటే ఏ పని చేస్తున్నా కూడ 'Work is worship 'అంటాం కదా, 'మానవ సేవే మాధవసేవ' ఇలా ఏ పని చేసినా అత్యంత శ్రద్ధతో, ఏకాగ్రతతో చేయండి అని చెప్పకనే మన రామదాసుల వారు చెప్పారు.ఇది నిజంగా వ్యక్తిత్వ వికాస పూరితమైన కీర్తన.

రామనామము పవిత్రమైనది, అద్భుతమైనది,సంసారం అనే భవసాగరాన్ని దాటేలా ఒక నావలా తోడ్పడుతుందని, నావ లేకనే వానరులందరూ సాగరాన్ని దాటారు. అది కపుల వైభవమూ కాదు, రాళ్ల వైభవమూ కాదు అదంతా రామ వైభవం. రామనామ వైభవం, రామ నామమును కీర్తించు వారు కూడా కపులు సాగరాన్ని దాటి తీరం చేరినట్లు,భవసాగరాన్ని దాటి శాంతి తీరాన్ని చేరుతారు, అని నామమే'నావ'అని ఇక్కడ రామదాసు ఉద్దేశం.

## 3. రాకమచర్ల వెంకట దాసు – రామ సంకీర్తనలు:

బాల్యంలోనే భగవంతుని తెలుసుకోవాలనే జిజ్ఞాస వెంకట దాసులో కనిపిస్తుంది. రాకమచర్లలో వెలసిన ముచి కుంద మహర్షి అవతారమైనా వెంకటదాచారుల వారు భగవంతుని ప్రేరణచే రాకమచర్లలో తపస్సు చేసి అక్కడ

వెలసిన శ్రీలక్ష్మీ యోగానంద నరసింహస్వామి వారిని దర్శించి, శ్రీహరి కృపా కటాక్షముచే తాను భక్తి రసపూరితములైన ఒక లక్షకు పైగా సంకీర్తనలను రచించి గానం చేసినారని తెలుస్తుంది. అందులో కొన్ని మాత్రమే ముద్రితమయ్యాయి. అందులో

**రాగద్వేషామూలు మాని రాముని గొలువారే /బాగుమీరవై కుంఠ పదవి పొందేరు,**
**కామ క్రోధలోభ మోహములు కడకు జిమ్మారే /శ్యామసుందరమైన రాముని ప్రేమ దలువారే**
**చతుర్మధ్యమూన జిక్కే చింతాశయాకే మనసా/పరమాత్ములైన రాముని దలచు ముక్తి పొందేరు**[4]

పురుషోర్థాలలో ధర్మం, మోక్షం చాలా ఉదాత్తమైనవి . మధ్యలో ఉన్నవి అర్ధకామాలు వీటి ఆశలో చిక్కకే మనసా అని ఈ ఆశలు వీడి రాముని సేవించు మనసా అని రాకమచెర్ల వెంకట దాసు మానస బోధ చేస్తున్నట్లుగా ఉంటుంది ఈ సంకీర్తన.

**ఎక్కడి సంసార మెడబాయజాలదు రామచంద్రా/మరి చిక్కాములో బడ్డ జింకవిధంబాయే రామచంద్రా /ఎంచగారాని ప్రపంచ మార్గమునందు రామచంద్రా / మేలు కొంచమైన లేదు కుజన సమ్మతే కానీ రామచంద్రా**[5] అంటూ తన కీర్తనలు ప్రపంచ విషయాలలో తనకు ఆసక్తి లేదన్నట్లుగా చెబుతున్నారు.

క**థల నివ్వను చూడరా రాఘవ నిన్ను కదలానివ్వను చూడరా !/ కోపము రానివ్వకు నీలో ధర్మ గుణమెందు బోనివ్వకు/ పాపిష్టి నరుడాను ఓపలేను సుమ్మి/మరువజాల నా మనసున నిన్ను/ అరమర శేయకు ఆర్తుని నన్ను**[6] ఈ కీర్తనని గమనించినట్లయితే రామదాసు కీర్తనకీ, రాకమచర్ల వారి కీర్తనకి దగ్గరికి పోలికలు కనిపిస్తాయి. భగవంతునిపై ఉండే భక్తితో పాటు ఆర్థి కనిపిస్తుంది.

## 4. తాళ్ల లక్ష్మీనారాయణ గౌడ్ – రామ సంకీర్తనలు:

సంకీర్తన వాంగ్మయంలో చాలామంది భక్తి, జ్ఞాన, వైరాగ్యాలకు సంబంధించిన సంకీర్తనలు రాసిన వారున్నారు. ప్రస్తుత కాలంలో ఆధ్యాత్మికం, మధుర భక్తి తో కూడిన సంకీర్తనలు రాసిన వారు చాలా తక్కువ. ఇలాంటి సంకీర్తనలు రాసిన వారు తాళ్ల లక్ష్మీనారాయణ గౌడ్. ఈయన నిజామాబాద్ జిల్లా జానకమ్ పేట ప్రాంతానికి చెందినవాడు.

క్షేత్రయ్య పదాలు, అన్నమయ్య సంకీర్తనలను అధ్యయనం చేసి వారినే గురువులుగా భావించి ఆ కోవలోనే భక్తి, రక్తికి సంబంధించిన ముప్పై రెండు వేల సంకీర్తనలను రాశాడని ప్రసిద్ధి. అందులో రాముడికి సంబంధించిన సంకీర్తనలను చూసినట్లయితే-

**కమలరేకుల వంటి కనులు గల కోదండరామ/భూ మండలాని కధిపతి జగన్నాయక/భూమిని పాలించిన వారిలో ప్రఖ్యాతి చెందినవాడా మముగావర**[7] అంటూ కోదండ రామని కావమంటూ కీర్తిస్తున్న సంకీర్తన ఇది.

**ఓ విశ్వేశ్వర ప్రణవ స్వరూప పరంధామ/శ్రీవత్సమనే పుట్టుమచ్చ రొమ్మున గలవాడా/దేవా జగత్ స్వరూప దేవేశా జగదీశ/సకల శుభాలు ప్రసాదించే ఓ శ్రీరామచంద్ర/సకల సృష్టికి మూల కారణమైన ఆదిపురుష**[8] అంటూ తనను కాపాడమంటూశ్రీరాముడిని వేడుకున్న తీరు, కృష్ణుడిలోనే రామున్ని చూస్తూ హరిహరులు ఒకటే అనే భావనతాళ్ల లక్ష్మీ నారాయణగౌడ్ సంకీర్తనల్లో కనిపిస్తుంది.

తెలంగాణ సంకీర్తనకారులైన రామదాసు,రాకమచర్ల వెంకట దాసు, తాళ్ళ లక్ష్మీనారాయణ గౌడ్ వీరు రచించిన రామాయణ కీర్తనల్లో ప్రత్యేకత వీరి మధ్య వందల సంవత్సరాల తేడా ఉన్నా, భిన్నమైన కాలాల్లో ఉన్నటువంటి వ్యక్తులు అయినా సరే రాముడి గురించి చెప్పినప్పుడు వాళ్లు వారి ఆర్తిని, బాధల్ని చెప్పుకోవడానికి ప్రయత్నం చేశారు. వారు చూసిన తీరు ను బట్టి ఉదాహరణకు రామదాసు తన వ్యక్తిగత జీవితంలో జరిగిన కష్టాల్ని రాముడికి నివేదించుకునే పద్ధతిలో కీర్తనలు రాశాడు.తాళ్ల లక్ష్మీనారాయణ గౌడ్ కృష్ణుడిలోనే రాముడ్ని చూస్తూ కీర్తనలు రాశాడు. రాకమచర్ల వెంకట దాసు కీర్తనల్లో తథాత్మ్యం చెంది రాసిన తీరు కనిపిస్తుంది.

## 5. ముగింపు:

కాలానుగుణంగా వచ్చినటువంటి మార్పులు ఏవైతే ఉన్నాయో అవి సంకీర్తనలో ఎలా ఉన్నాయి, భక్తిని మోక్ష సాధనంగా ఎన్నుకొని నవవిధ భక్తి మార్గాలలో సంకీర్తనం అనే సాహిత్య ప్రక్రియను ఆలంబనగా చేసుకొని వారు తరించడానికి కారణమైన కీర్తనల ద్వారా ఈ నాటికి సమాజానికి రామాయణం అవసరం ఎంతో ఉందని తెలుస్తుంది. రాముడు భయాన్ని పోగొట్టేవాడు ఆపదలను దూరం చేసేవాడు ఆయన హస్తమే అభయహస్తం అంటారు. చాలామంది ఆయన్ని ఆ రకంగానే చూస్తారు.భారతీయ జీవన విధానంలో రామాయణం దుఃఖసాగారాన్ని ఈదడానికి అనేది ఒక విశ్వాసం రామాయణమంతా కరుణ, దుఃఖమే అయినా అంతటి దుఃఖంలో కూడా రామాయణాన్ని చదివితే ఉపశమనం కలుగుతుంది. మౌలికంగా అందులో ఉన్న తత్వం అది అందుకని కవులు రచయితలు, రాముడు గురించి రాస్తున్నారంటే తమ పరిస్థితులు చెప్పుకోవడానికి కష్టాలు చెప్పుకోవడానికి ఆర్తి కేంద్రంగానే రాస్తారు.

## 6. పాదసూచికలు:

1 భద్రాచల రామదాసు మధుర కీర్తనలు, సామ సుందరి ముత్య, పుట సంఖ్య. 05

2 భద్రాచల రామదాసు మధుర కీర్తనలు, సామ సుందరి ముత్య, పుట. 98

3 భద్రాచల రామదాసు మధుర కీర్తనలు, సామ సుందరి ముత్య, పుట. 111.

4 రాకమచర్ల వెంకట దాసు కీర్తనలు సిద్ధాంత గ్రంథం, ఆంజనేయ శాస్త్రి సాగి 1988, ఉ. వి.పుట 130

5 రాకమచర్ల వెంకట దాసు కీర్తనలు సిద్ధాంత గ్రంథం, ఆంజనేయ శాస్త్రి సాగి 1988, ఉ. వి పుట 162

6 పాలమూరు జిల్లా వాగేయకారులు, పి. భాస్కర యోగి, 2011.

7 ఆధ్యాత్మిక సంకీర్తనలు, తాళ్ళ లక్ష్మీ నారాయణ గౌడ్, పుట సంఖ్య 46.

8 ఆధ్యాత్మిక సంకీర్తనలు, తాళ్ళ లక్ష్మీ నారాయణ గౌడ్, పుట సంఖ్య184.

## 7. ఉపయుక్తగ్రంథసూచి:


1. ఆంజనేయశాస్త్రి, సాగి, 1988, రాకమచర్ల వెంకటదాసు కీర్తనలు సిద్ధాంతగ్రంథం ఉస్మానియా విశ్వవిద్యాలయం
2. భాస్కరయోగి, పి, పాలమూరు జిల్లా వాగ్గేయకారులు, 2011, తర్లపాటి ఫౌండేషన్, సికింద్రాబాద్
3. రంగనాథ ఆచార్యులు, కేకే (సం ),తెలుగులో తొలి సమాజ కవులు, 1983, (ఆంధ్ర సారస్వత పరిషత్తు)
4. లక్ష్మీనారాయణ గౌడ్, తాళ్ల,ఆధ్యాత్మిక సంకీర్తనలు, స్వీయ ప్రచురణ
5. శ్యామ సుందరి, ముత్య, భద్రాచల రామదాసు మధుర కీర్తనలు, మహేశ్వరి ఆఫ్ సెట్ ప్రింటర్స్ రాజమండ్రి


***



AUCHITHYAM

ISSN: 2583-4797

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_23.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

## 23. యూట్యూబ్ జానపదాలు: రామాయణం

**జంగిటి వేణు**

పరిశోధక విద్యార్థి, తెలుగుశాఖ, తెలంగాణ విశ్వవిద్యాలయం,

తెలుగు అధ్యాపకులు, ప్రభుత్వ డిగ్రీ కళాశాల స్వయంప్రతిపత్తి సిద్ధిపేట,

సిద్ధిపేట, తెలంగాణ.

సెల్: +91 919502585333. Email: venuhcu444@gmail.com

**వ్యాససంగ్రహం:**

*సకల మానవీయ విలువలకు నెలవు రామాయణం. రామాయణం నాటి నుండి నేటి వరకు ఎన్నో ప్రక్రియలతో నిత్య నూతనంగా సమాజంలో ఆదరించబడుతుంది. రామాయణానికి, జానపదులకు విడదీయరాని సంబంధం ఉంది. జానపదులు వారి శ్రమను మర్చిపోవడానికి పాటల్ని కైగట్టి అలవోకగా పాడుతుంటారు. వారు పాడే పాటలలో శ్రామిక గేయాలతో పాటు రామాయణ, భారత, ఇతిహాసాలకు సంబంధించిన పాటలు కూడా కోకొల్లలు. వినూత్న సాంకేతిక ఆవిష్కరణలతో అనేక మాధ్యమాలతో నేటి సమాజం అభివృద్ధి పథంలో పయనిస్తుంది. అలాంటి మాధ్యమాలలో యూట్యూబ్ ది ప్రత్యేక స్థానం. ఇది ఒక ఆన్లైన్ ప్లాట్ ఫారం. యూట్యూబ్ లో శాస్త్ర, సాంకేతిక, వైజ్ఞానిక, సాహిత్య మొదలగు అనేక అంశాలతో పాటు ఎన్నో జానపద పాటలు అందుబాటులో ఉన్నాయి. గత పరంపరగా ప్రచారంలో ఉండి నేటి సాంకేతిక ప్రపంచంలో కనుమరుగవుతున్న అపురూపమైన జానపద పాటలను ఈ తరానికి అందించడంలో యూ ట్యూబ్ ది వినూత్న ఒరవడి. యూట్యూబ్ వేదికగా వచ్చిన రామాయణ సంబంధ జానపద పాటలను, విశేషాలను ఈ వ్యాసం ఆవిష్కరిస్తుంది.*

**Keywords:** యూ ట్యూబ్, రామాయణం, జానపద పాటలు. రాముడు, సీత, లక్ష్మణుడు.

## 1. ఉపోద్ఘాతం:

వాల్మీకిచే విరచితమై సంస్కృత ఆదికావ్యంగా పేరొందిన రామాయాణం అనేక మంది కవులచేత తెనుగీకరించబడుతుంది. వివిధ ప్రక్రియల్లో తన సుగంధ పరిమళంతో ప్రత్యేక స్థానాన్ని పొందింది. రామాయాణ కావ్యంలో ఆద్యాంతం ఏదో ఒక రూపంలో సమాజాభివృద్దిని పెంపొందించే విషయాలెన్నో కన్పిస్తాయి. ముఖ్యంగా మానవసంబంధ, నీతి, రాజనీతి, పరిపాలన విషయాలతో పాటు అనేకాంశాలను కూలంకషంగా వివరిస్తుంది. మాడుగుల నారాయణ మూర్తి తన తెలుగులో రామాయణాలు అనే వ్యాసంలో "***రామాయణంలోని ఆదర్శాలన్నీ***

***నిరంతర మానవ సమాజానికి ఆచరణీయమే***"[1] అని తెలిపారు. తెలుగులో పద్య, వచన, చంపూ, గేయ రూపాలలో దాదాపు 400 కి పైగా రామాయాణాలు అందుబాటులో ఉన్నాయి. ఈ రామయణాలలో ఎన్నో అవాల్మీకాంశాలు, జనవ్యవహారంలో ఉన్న ఐతిహ్యాలు కూడా చోటు చేసుకున్నాయి. ముఖ్యంగా జానపదుల నోట పాటల రూపంలో ప్రచారం పొందిన రామకథలు ఎన్నో చిత్ర, విచిత్రమైన కల్పనలు కన్పిస్తాయి. ఇలాంటి పాటలన్నీ శ్రమ జీవనసంస్కృతి నుండి ఆవిర్భవించినవే కావడం వలన ఈ పాటలలో సీతారాములు సాధారణ గ్రామీణులుగానే గోచరిస్తారు. శ్రమసంస్కృతిలో ఈ పాటలు క్రమక్రమంగా జనవ్యవహారంనుండి కనుమరుగయ్యాయి. ఇటీవల అందుబాటులోకి వచ్చిన సాంకేతిక మాధ్యమాలు ఒక వైపు ప్రజల విరామ సమయాన్ని హరిస్తూ, గత వినోద సాధనాలను పక్కకు నెట్టివేస్తున్నవి. గతకాలంలో వైభవ చిహ్నాలైన అపురూపమైన ఇటువంటి జానపద గేయాలను నేటి తరానికి అందిస్తున్నాయని చెప్పవచ్చు. అలాంటి జానపద సాహిత్య సంపదను నేటి ప్రపంచానికి వారసత్వంగా అందించే బాధ్యత యూ ట్యూబ్ నిర్వహిస్తుంది. అలాంటి యూట్యూబ్ లో వచ్చిన జానపద పాటల్లో ఉన్న రామాయణ విశేషాలను తెలిజేయడమే ఈ వ్యాస ఉద్దేశ్యం.

## 2. జానపద పాటల్లో రామాయణం:

యూట్యూబ్ లో అనేక రకాల జానపద పాటలు అందుబాటులోకి వస్తున్నాయి. ఈ జానపద పాటల్లో కొందరు మౌఖిక ప్రచారంలో ఉన్న జానపదాలను యథావిధిగా అందిస్తే, ఇంకొందరు మార్చి అందిస్తున్నారు. కొందరు రచయితలువారి కాలంనుండి జారిన జనపదాలను యూట్యూబ్ లో పొందుపరుస్తున్నారు. ఇలా పాట ఏదైనా దానికి తగిన సంగీతాన్ని అందిస్తూ జనరంజకంగా మారుస్తున్నారు. జానపదులు వారి శ్రమను మరవడానికి రామాయణం పైన కూడా పాటలను కైగట్టి పాడుతారు. అలా ఒక్కో రామాయణ గట్టాన్ని, ఒక్కోలా జానపదులు తమ పాటల ద్వారా

## 2.1 బతుకమ్మ పాటల్లో రామాయణం:

తెలుగు ప్రాంతం వారికి రామాయణంతో అవినాభావ సంబంధం ఉంది. రాముడు సీత సమేతుడై ఈ ప్రాంతం లో తిరిగినట్టు ఇతిహాసాలు చెప్తున్నాయి. అందువల్ల సీత రాములను తమ వారిగా జానపదులు భావిస్తారు. తెలంగాణ ప్రాంతంలో జానపదులు బతుకమ్మ పండుగలో భాగంగా అనేకరకాల పాటలను పాడుతారు. ఆ పాటల్లో సీతరాములను అద్భుతంగా కీర్తిస్తారు. బతుకమ్మ ఆటను ప్రారంభించిన అనంతరం "రామా రామా రామా ఉయ్యాలో శ్రీ రామా రామా ఉయ్యాలో" అనే చరణంతో ప్రారంభిస్తారు. ఆ తర్వాత వివిధ పాటలను పాడుతుంటారు. మూల రామాయణంలో సీత జనకునికి నాగేటి సాళ్ళల్లో దొరికినట్టు ఉంటే జానపదుల నోళ్లలో మాత్రం -

"***జనకు జనకు నింట్ల ఉయ్యాలో / సత్యజనకు నింట్ల ఉయ్యాలో***

***పుట్టింది సీతమ్మ ఉయ్యాలో / పురుడే గోరింది ఉయ్యాలో***"[2] అని చెప్పడం ద్వారా జానపదులు సీతమ్మను జనకునికి స్వంత కూతురుగా భావిస్తున్నట్లు కన్పిస్తుంది.

"***చిన్న చిన్న మొంటెలల్ల ఉయ్యాలో / చెరగానెర్చినాది ఉయ్యాలో***

***వెండియచాటలల్ల ఉయ్యాలో / చెరగానెర్చింది ఉయ్యాలో***"[3] అనే చరణాల్లో మొంటెలు అనేది కేవలం జనపదులు మాత్రమే వాడే వస్తువు. జానపదుల పిల్లలు పెరిగే క్రమంలో మొంటెలతో ఆడుతూ పెరుగుతారు. సీతమ్మను రాణివాసపు స్త్రీ గా కాకుండా జానపదుల ఇంటి బిడ్డగా పెరిగిందని భావించారు.

"***తూరుపు రాజులు ఉయ్యాలో / దక్షిణపు రాజులు ఉయ్యాలో / పడమటి రాజులు ఉయ్యాలో***

***సీతనడగొచ్చిరి ఉయ్యాలో / విల్లు విరిస్తైగాని ఉయ్యాలో / ఇత్తుము సీతను ఉయ్యాలో***

***వీళ్ళు విరవలేక ఉయ్యాలో / వారెల్లి పోయిరి ఉయ్యాలో***"[4] సీత స్వయంవరంలో వివిధ రాజ్యాల రాజులు వచ్చి తమ బలబలాలను ప్రదర్శించిన కూడా శివధనుస్సును ఎత్తలేకపోయారు. "***ఇంతలో రామయ్య ఉయ్యాలో/వీళ్ళసేత బట్టి ఉయ్యాలో/పటపట విల్లిరిసే ఉయ్యాలో/పదతినే పెళ్ళాడే ఉయ్యాలో***"[5] అనీ సీతారాముల వివాహ ఘ ట్టాన్ని అధ్భుతంగా పాటల రూపంలో వ్యక్తీకరించారు.

## 2.2 సీతారాముల సంవాదం:

సీత రాములు వివాహానంతరం అయోధ్యకి రావడం, మందర మాటలతో కైకేయి రాముని వనవాసాన్ని కోరడం, తండ్రి మాటతో సీతారాములు, వారితో లక్ష్మణుడు అరణ్య వాసానికి వెళ్ళడం జరిగింది. అప్పటి వరకు ప్రశాంతంగా ఉన్న సీతారాముల జీవితాల్లో జింక నింపిన ఆవేదన అంతా ఇంత కాదు. ఈ బంగారు లేడి గురించి ఒక్కో రామాయణం లో ఒక్కోవిధంగా ఉంది. వాల్మీకి రామాయణంలో రాముడు తన తండ్రి పితృకర్మల కోసం మృగాన్ని వేటాడినట్టు ఉంది. కానీ ఆ బంగారుజింకను సీతనే కోరిందని జానపదులు వారి పాటలలో వ్యక్తీకరించారు. ఈ కల్పన సహజసిద్ధంగా కనిపిస్తుంది.

" ***చిక్కుడు చెట్టు కింద సిరిపొన్న కింద ఓ.. నా రామయ్య, సిరిపొన్న కింద ఓ.. నా రామయ్య***
***సీతమ్మ రామయ్య జూదమాడంగా ఓ.. నా రామయ్య, పందెమాడంగా ఓ.. నా రామయ్య***
***అటు జూడు రామయ్య అటు జూడవయ్యా ఓ.. నా రామయ్య అటు జూడవయ్యా ఓ.. నా రామయ్య***
***అటు ఏమి ఉన్నాది అడవి జీవరాశి ఓ.. నా సీతమ్మ అందాల రాశి ఓ.. నా సీతమ్మ***
***పైడి చుక్కల జింక పరువాల జింక ఓ.. నా సీతమ్మ పాయిరాల జింక ఓ.. నా సీతమ్మ***
***ఆ జింక తోలుతో రైక గుట్టించు ఓ.. నా రామయ్య కొకా గట్టించు ఓ.. నా రామయ్య***"[6]

అరణ్య వాసంలో ఒక రోజు సీతారాములు ఏకాంతంగా ఉన్న సమయంలో అటుగా వచ్చిన జింకను సీతమ్మ చూసింది. ఆ అందమైన జింక చర్మంతో చీర, రైక కావాలని అడిగిందని అందువల్ల రాముడు దాని వేటలో ఉండగా సీతాపహరణం జరిగిందని జానపదుల అభిప్రాయం.

## 2.3 లక్ష్మణ వియోగం – రాముని దుఃఖము:

సీతాపహరణంతో రామలక్ష్మణులు, సుగ్రీవ, హనుమాదులు చాలా చోట్ల వెతికి సీత లంకలో ఉందని తెలుసుకుని లంకకు వెళ్ళి, రావణాసురుడిపై యుద్ధం చేసే సమయంలో ఇంద్రజిత్తు బాణాలకు నెలకొరిగిన లక్ష్మణుడిని చూసి రాముడు విలపించిన విధానాన్ని జానపదులు అత్యంత కరుణరసాత్మకంగా తీర్చిదిద్దారు. మూర్ఛిల్లిన లక్ష్మణుడిని చూసిన రాముడు తీవ్ర దుఖంతో-

*"దశరథ మహారాజు గర్భమున జన్మించి ఏమీ అనుభవిస్తిమి లక్ష్మణ ఏమీ అనుభవిస్తిమి*

*మన తండ్రి దశరథుడు మర్యాద తప్పక అడవి పాలు చేసేరా లక్ష్మణ అడవి పాలు చేసేరా"*[7] అని పలుకుతూ మన తండ్రి ఇచ్చిన మాటకు కట్టుబడి ఉండడం కోసం, మనం తండ్రి మాటను తిరస్కరించకుండా అరణ్యవాసానికి వచ్చాం. ధశరథ మహారాజు కొడుకులుగా మనం రాజ్యాన్ని అనుభవించలేదు, ప్రజలను కన్నా బిడ్డల్లా చూసుకునే భాగ్యం దక్కలేదు తమ్ముడా అంటూ రాముడు విలపించాడని చెప్పడంలో జానపదుల వలపోత కనిపిస్తుంది.

*"సతి కొరకు తమ్ముని చంపించెనని చాలా అపకీర్తి పాలైతేరా లక్ష్మణ అపకీర్తి పాలైతిరా లక్ష్మణ"*[8] అంటూ భార్య కోసం తమ్ముడిని బలితీసుకున్న అన్నగా ఈ లోకం నన్ను ఎన్నో రకాలుగా వేదిస్తుంటది. లక్ష్మణ లేరా అనీ ఎంతో ఆర్ద్రంగా విలపించాడు. చావు ప్రతి మనిషికి సహజమే దానిని ఎవరు ఆపలేరనే నిత్యాసత్యాన్ని గ్రహిస్తూ

*"ఏ బ్రహ్మ రాసేనో ఈ సావు నీకిప్పుడు ఇది తప్పి పోదాయేరా లక్ష్మణ"*[9] పలుకుతూ గతంలో తన చిన్నమ్మ కైకేయి అరణ్యానికి వచ్చి తన తప్పును తెలుసుకొని అయోధ్యకు తిరిగి రమ్మని ఆహ్వానించినప్పుడు నిన్ను పంపితే ఈ ఘోరాన్ని తప్పించేవాడినని, నేను అయోధ్యకు వెళ్ళినప్పుడు భరతశత్రజ్ఞులు, నీ గురువులు, నీ చెల్లికాళ్ళు లక్ష్మణుడు ఎక్కడ? అని అడిగితే నేనెమని సమాధానం చెప్పాలి? లక్ష్మణా ..

*"ఉత్తమ ఇల్లాలు ఎదురుగా వచ్చితే ఊర్మిళతో ఏమందురా లక్ష్మణ ఊర్మిళతో ఏ మందు రా"*[10] నా కోసం కట్టుకున్న భార్యను వదిలి వచ్చావు. పదునాలుగు సంవత్సరాలు నీ నిద్రను ఊర్మిళకు ఇచ్చావు. తను నీ కోసం ఎన్నో కలలు గని, వేచి చూస్తుంటుంది. నీవు లేవనే విషయాన్ని ఊర్మిళకు ఎలా చెప్పాలి? నా చేతుల్లోనే లక్ష్మణుడు కనుమూశాడు. నీ పసుపుకుంకుమలు పోవడానికి పరోక్షంగా నేనే కారణమని ఎలా చెప్పాలి తమ్ముడా అనీ గుండెలు పగిలేలా ఏడుస్తున్న విధానాన్ని లోకంలో ప్రతి ఒక్కరూ కంట తడిపెట్టేలా జానపదులు తీర్చిదిద్దారు.

## 2.4 వాల్మీకి ఆశ్రమం- లవకుశులు:

హనుమంతుడు సంజీవని తెచ్చి లక్ష్మణుడిని బ్రతికించడం, రావణుడిని ఓడించి సీతను ఆయోధ్యకు తొలుకువచ్చి పట్టాభిషేకం చేయడం, రాజ్యప్రజలలో సీతపై నింద రావడం, లక్ష్మణుడితో సీతను అడివికి పంపించడం, వాల్మీకి ఆశ్రమంలో లవకుశులు జన్మించడం, సీత తన గతాన్ని లవకుశులకు తెలియజేసే సందర్భాన్ని జానపదులు కరుణ రసంతో సీత నోట పలికించిన తీరు ఎంతో రమణీయం.

*"నీ తండ్రి రాముడేమో నీ తండ్రి రాముడేమో ఇల్లేల్లగొట్టినపుడు నీ తండ్రి రాముడేమో*

***చిన తండ్రి లక్ష్మణుడు చిన తండ్రి లక్ష్మణుడు అడవికి పంపినపుడు చిన తండ్రి లక్ష్మణుడు***" [11] నేను గర్భవతిగా ఉన్నప్పుడు అడవిలోకి పంపించాడని, అలాంటి సమయంలో ఒక భర్తగా నాదగ్గర మీ తండ్రి లేదు. ఒక స్త్రీకి ఇలాంటి సమయంలో ఓ భర్త తోడు ఎంతో అవసరమని చెప్తూ,

"***టేకీయాటాకులన్ని దేరాలు గడితి కొడుకా, అరటియాటాకులన్ని మీకు అంగి కుల్లలు కొడుకా***" [12] రాజకుమారులలగా పెరగాల్సిన మీరు, ఋషులాశ్రమం లో పెరుగుతూ తండ్రి ప్రేమకు, తాతమ్మల ప్రేమకు దూరమై నిరడంబరమైన బాల్యాన్ని అనుభవించారు. అడవిలో సహజంగా దొరికే ఆకులే ఆహార్యాలుగా, పరదాలుగా మీకు ఉపయోగించాననే బాధను జానపదులు తమ ఇళ్ళలో జరిగే పురుడు మొదలైన కార్యక్రమాలను లవకుశులకు ఆపాదిస్తూ కైగట్టారు.

## 3. ముగింపు:

వర్తమానకాలంలో సమాజంపై విశేష ప్రభావం చూపుతున్న సామాజికమాధ్యమాల్లో అత్యంతప్రభావశీలి యూట్యూబ్. ఇందులో లేని అంశం అంటూ ఏది లేదని చెప్పడం అతిశయోక్తి కాదు. ప్రపంచీకరణ ద్వారా జానపదకళా సాహిత్యాలకు ఎంతో నష్టం వాటిల్లుతున్నప్పటికి యూట్యూబ్ వంటి మాధ్యమాల ద్వారా జానపద సాహిత్యానికి కొంత మేలు కూడా జరిగింది. అనేక కారణాల వల్ల అంతరించి పోయే దశలో ఉన్న జానపద గేయసాహిత్యంలోని కొన్ని పాటలు యూట్యూబ్ మాధ్యమం ద్వారా సంరక్షించబడి పునః ప్రచారమవుతున్నాయి. తెలుగువారి సంస్కృతిలో అంతర్వాహినిగా ఉన్న రామాయణ సంబంధ ఇతివృత్తాన్ని పండితుల నుండి పామరుల వరకు కావ్యాలు, గ్రంథాలు, పాటలు, సామెతల రూపంలో వెలువరించారు. ఆ విధంగా రూపుదిద్దుకొన్న రామాయణ సంబంధజానపదాలను యూట్యూబ్ సంరక్షించడంతో పాటు భవిష్యత్తరాలకు రామాయణమందించిన మానవీయవిలువలను, ఆచారవ్యవహారాలను, ధర్మాచరణమార్గాన్ని అందిస్తుందని చెప్పవచ్చు.

## 4. పాదసూచికలు:

**1. సాహితీసుధ, గుమ్మన్నగారి బాలశ్రీనివాస మూర్తి , పుట. 216**
**2.-5., folksongs YT channel**
**6. mahenderreddyపద్యసౌరభంYT channel**
**7.-10. mahenderreddyపద్యసౌరభంYT channel**
**11.-12. NS MUSIC YT channel**

## 5. ఉపయుక్తగ్రంథసూచి:


1. బాలశ్రీనివాస మూర్తి, గుమ్మన్నగారి, 2018, సాహితీసుధ, బండ్ల పబ్లికేషన్స్, హైదరాబాద్
2. శ్రీపాదసుబ్రహ్మణ్య శాస్త్రి, వాల్మీకి రామాయణం, 2022.విశాలాంధ్ర, హైదరాబాద్.
3. Folksongs YT channel, JANAKU JANAKUNINTLA -BATHUKAMMA PATA
4. Mahenderreddyపద్యసౌరభంYT channel, JANAPADULA RAMAYANAM KOLATAM PAATA
5. Mahenderreddy పద్యసౌరభం YT channel, LAKSHMANA MOORCHA, JANAPADA RAMAYANAM
6. NS MUSIC YT channel, NEE THANDR RAAMUDEMO, FOLK SONG


***


AUCHITHYAM
ISSN: 2583-4797
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_24.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 24. జానపద సాహిత్యం: సీతారాములు

**డా. కె.వి. సత్యనారాయణ**

తెలుగు అధ్యాపకులు,
డి.కె. ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల (A),
నెల్లూరు, ఆంధ్రప్రదేశ్ .
సెల్: +91 9440732210. Email: drkvsatyam@gmail.com

**వ్యాససంగ్రహం:**

*ప్రపంచ సాహిత్యంలో రామాయణం ఆదికావ్యం. ఆ సీతారాముల గాథను వేల సంవత్సరాల నుండి ఎందరెందరో గానం చేశారు. ఆ ఆదర్శమూర్తుల త్యాగమయ జీవితాన్ని శిష్టకవులు తమ కావ్యంలో అనేక రకాలుగా తీర్చిదిద్దితే సమాజంలో చదువు సంధ్యలు పెద్దగాలేని జానపదులు వైవిధ్యంగా గేయాలుగా, కథాగేయాలుగా, పురాకథలు, ఐతిహ్యాలు, సామెతలు, పొడుపుకథలుగా అనేక రూపాల్లో నిక్షిప్తం చేశారు. జానపద సాహిత్యంలో జానపదులు సీతారాముల కథను ఎంత రసరమ్యంగా తీర్చిదిద్దారో పరిశీలించడం ఈ వ్యాస ముఖ్య ఉద్దేశం.*

**Keywords:** జానపద గేయాలు, మేలుకొలుపు పాటలు, శ్రామిక గేయాలు, వేడుక పాటలు, పారమార్థిక గేయాలు, పెండ్లి, హాస్యం, శృంగారం, కరుణరసం, గొబ్బిళ్ళు, కోలాటాలు, చెక్క భజనలు,మంగళహారతులు, కథాగేయాలు, పురాగాథ,ఐతిహ్యం, సామెతలు, పొడుపుకథలు, దుక్కి దున్నడం, నారుపోయడం, కలుపుతీయడం, నలుగుపెట్టడం

## 1. ఉపోద్ఘాతం:

రసమయ చరితం సీతారామచరితం. భారతీయులమైన మనకు అది ఆదికావ్యం. రామాయణం లాగా లోక వ్యవహారాన్ని విస్పష్టంగా బోధించే కథ మరొకటి లేదంటే అతిశయోక్తి కాదు. ఆదికవి వాల్మీకి మొదలు నేటివరకూ ఈ సీతారాముల కథ అనేక భాషలలో అనేక రీతులలో ప్రదర్శింపబడుతూ విశ్వవ్యాప్తమైంది. మన తెలుగు నాట సీతారాములకు కోవెల లేని ఊరుండదు. తెలుగు సాహిత్యంలో శిష్టులు సీతారాముల కథను కావ్యాలుగా, కథలుగా

దృశ్య, శ్రవ్య నాటకాలుగా, తీర్చిదిద్దితే జానపదులు రామాయణాన్ని పాడారు, ఆడారు, నటించారు. రామాయణం వాళ్ళ జీవితంలో ఒక ప్రధాన భాగమైంది. గేయాలుగా, కథా గేయాలుగా, పురా కథలుగా, ఐతిహ్యాలుగా, వచన కథలుగా, సామెతలుగా, పొడుపుకథలుగా తనివితీరా చెప్పుకున్నారు. పొలం దుక్కి దున్నినా, నారు పోసినా, కలుపు తీసినా, జోలపాట పాడినా, నలుగు పెట్టి పెళ్ళికి ముస్తాబు చేసినా సీతారాములను తలచుకోకపోతే తెలుగు వారికి తృప్తి వుండదు.

## 1.0 జానపద గేయాల్లో సీతారాములు:

జానపదులకు శ్రీరాముడు తండ్రి, సీతమ్మ తల్లి. అందరి దేవుళ్ల కంటే వీరిద్దరి పట్లే వీరికి అనురాగం, మక్కువ. సీతారాములను తమలోని వారిగా, తమ గ్రామంలోనే నివసించినట్లుగా భావించుకుంటారు. తెల్లవారక ముందే నిద్రలేచి ఆ సీతారాముల మీద మేలుకొలుపు పాటలు పాడి తమ భక్తిని ప్రకటించుకుంటారు. తమకు ఏ కష్టం వచ్చినా వారితో చెప్పుకుని ఊరట పొందుతుంటారు. మన తెలుగు జానపద గేయాల్లో రామునికి చెందిన మేలుకొలుపు పాటలు అనేకం ఉన్నాయి. వాటిలో ఒకటి.

## 1.1 మేలుకొలుపు పాటల్లో సీతారాములు:

**మేలుకో శ్రీరామ మేలుకో రఘురామ**
**మేలుకో గుణధామ మేలుకో నా స్వామి మేలుకో**
**చాలునింక నిద్ర నీలమేఘశ్యామ వర్ణ మేలుకో**
**దీనుల రక్షింప దీక్ష వహించిన దేవ దేవ నిద్ర మేలుకో**....... 1

అలాగే సీతమ్మను కూడా

"**లేవే సీతమ్మా! ముద్దుల గుమ్మా లేవే బంగారు బొమ్మ**
**లేచి రాముని లేపుమి వేగము లేకున్న నింక లేవే**
**కాకులన్నియు లేచి కావు కావుమని కూయుచున్నవి యింక లేలే**....2

మరొకచోట

**అమ్మా సీతమ్మా మా తల్లి ముద్దుల గుమ్మ**
**లేవే బంగరు బొమ్మ లేవమ్మా.....**
**అత్త మామ మరుదులు తోడికోడళ్లు**
**అపుడె లేచుచున్నారు లేవమ్మా........3** అని సీతామతల్లిని మేలుకొలుపుతారు.

## 1.2 పిల్లల పాటలు, జోలపాటలు – సీతారాములు :

పుట్టిన బిడ్డలను లాలించి జోల పాడేటపుడు తమ బిడ్డ సాక్షాత్తూ రాముడిగానే భావించి, తమను తాము కౌసల్యగా రూపుదాల్చి-

"**జో అచ్యుతానంద జోజో ముకుందా**

**లాలి పరమానంద రామ గోవిందా**" అని జోల పాడుతారు.

బిడ్డ నిద్రపోయేదాకా రకరకాలుగా జోలలు పాడి నిద్ర పుచ్చుతారు. బిడ్డ ఒకవేళ నిద్రపోకుండా ఏడుస్తూంటే జానపద స్త్రీ కారణం తెలీక ఆందోళన చెందుతూ

**పుట్టకింత నెయ్యిబోసి – పూత్రూని నేను గంటీ**
**నీళ్లు బోసిన గానీ - నిద్దూరూపిన గాని**
**నిదురబోడమ్మా శ్రీరాములు - బెదరినాడేమో** 4 ..... పాటలు పాడుతుంది.

పిల్లలు మెల్లమెల్లగా పెరుగుతూ వుండే క్రమంలో తల్లిదండ్రులు వారికి క్రమ క్రమంగా భాషలోని చిన్న చిన్న మాటలను నేర్పిస్తూ పిల్లల్లో పెద్దల పట్ల, దేవుని పట్ల, భక్తిని, వినయాన్ని

ఏనుగు ఏనుగు నల్లన - ఏనుగు కొమ్ములు తెల్లన

ఏనుగు మీద రాముడు - ఎంతో చక్కని దేవుడు 5 ..... అంటూ పాటల ద్వారా నేర్పిస్తారు.

తల్లులు తన పాపకు రక్షణ కల్పించాలని రామచంద్రుని "**అంగరక్ష, ఆదిరక్ష, దివ్యరక్ష, దీపరక్ష, చిన్న నా అబ్బాయికి శ్రీరామరక్ష**"6 అని వేడుకుంటారు.

పెద్దలు ఎంతో భక్తి శ్రద్ధలతో సీతమ్మను కొలవగా పిల్లలు సీతమ్మను పెద్దక్కగా భావించి గౌరవిస్తారు. అందువల్లే వారు -

సీతమ్మ వాకిటా చిరుమల్లె చెట్టు – చిరుమల్లె చెట్టేమొ చితక పూసింది....

చెట్టు కదలాకుండ కొమ్మ వంచండి – కొమ్మ విరగకుండ పూలు గోయండి

అందులో పెద్దపూలు దండ గుచ్చండి – దాచుకో సీతమ్మ రాముడంపేడు

దొడ్డి గుమ్మంలోనే దొంగలున్నారు – దాచుకో సీతమ్మ దాచుకోవమ్మా..... 7ఇలా పాడుకుంటారు.

## 1.3 శ్రామిక గేయాలు – సీతారాములు:

జానపదులు పనిపాటలు చేసుకుంటూనే అలసట పోగొట్టుకోవడానికి, త్వరగా పనిచేయడానికి శ్రామిక గేయాలు పాడుకుంటారు. జానపదులు వ్యవసాయ పనులు చేసుకుంటూ అవకాశం చిక్కినప్పుడల్లా రామాయణానికి సంబంధించిన పాటలను పాడుకుంటుంటారు.

"**పాల సముద్రము మీద పవళించు రామ-శేషూని పయి నిద్ర సేవించు రామ**
**వటపత్రశాయివై పవళించు రామా - శ్రీలక్ష్మితో నుండు స్థిరముగా రామా**
**యమునికి నన్నప్పగించకు రామా - యముడంటె భయమగును నాకు రామా....**"8

అని తమ పరిస్థితిని నివేదించుకుంటారు. వడ్లు దంచేటప్పుడు జానపదులు-

"**సువ్వి సువ్వి రామచంద్ర / సువ్వి సువ్వి కీర్తి సాంద్ర 9**" అని పాడుకుంటారు. కాటమరాజు కథలో కూడా ఈ రోకటి పాట ఉందని బి.రామరాజుగారు

**చువ్వీ చువ్వెన్నలా చువ్వెన్నలాలా – చువ్వెన్నలాలా**

**చువ్వానీ పాడరమ్మ రాములారా రఘురాములాలా........** 10ఉదహరించారు.

అలాగే మరో దంపుడు పాటలో

**సువ్వి రామచంద్ర సువ్వి**
**సువ్వి రామచంద్ర సువ్వి**
**సువ్వి రామాభి రామా**
**సువ్వనాలే........** 11 జానపదులు పాడుకోవడం కన్పిస్తుంది.

**పొలం పనుల్లో కలుపు తీసేటపుడు**

**రామనా వుయ్యాలో గోవిందా రామనా వుయ్యాలో.....** 11 Aఅని సాగుతుంది.

### 1.4 వేడుక పాటల్లో సీతారాములు:

జానపదులు వివాహానికి సంబంధించినవి, పండుగలు, నోములు, వ్రతాలు మొదలగు వేడుకలు చేసుకునేటపుడు ఆనందంగా పాటలు పాడుకుంటారు. పెళ్ళి వేడుకలు వధూవరుల పెళ్ళి చూపులతో ప్రారంభమౌతాయి.

పిలిపించు నీ సీత పిలుపు చూతాము

పిలుపేమి సూసేవు చిలుక పలుకుల్లా

పిలిపించు నీ సీత నడక చూతాము

నడకేమి సూసేవు అంస నడకల్లా ........12అని సాగుతుంది.

మరో పాటలో

**కమ్మలు, కడియాలు, కస్తూరి బావిరీలు**

**నలుగూకు రావె సీతమ్మ...............**13అని పాడుకుంటారు జానపదులు.

మరో ఉయ్యాల పాటలో కూడా రాముని ప్రస్తావన కన్పిస్తుంది.

**ఉయ్యాలో జంపాలో ఊరి పేరేమిరా**
**ఉయ్యాలో జంపాలో ఊరు మేడికుర్తి**
**రామ రామ కోదండ రామా**
**రామ రామ కోదండ రామా**

## 1.5 పారమార్థిక గేయాలు – సీతారాములు:

జానపదులకు దేవుడంటే విపరీతమైన నమ్మకం. ఈశ్వరాజ్ఞలేనిదే చీమైనా కుట్టదని వారి బలమైన విశ్వాసం. అందునా మన దేశంలో భక్తికి, భక్తాగ్రేసరులకు కొదవలేదు. ఎందరెందరో మహర్షులు, భక్తులు రకరకాలుగా భక్తి, జ్ఞాన, వైరాగ్య విషయాలను ఎన్నో వేల సంవత్సరాల నుండి ప్రజలకు బోధిస్తూనే వున్నారు. జానపదులు ముఖ్యంగా భక్తిని తమ నరనరాన జీర్ణించుకుని పాటలు, తత్త్వాల రూపంలో ఒకరనొకరు చెప్పుకుంటుంటారు.

"శ్రీరామనామం మరువాం మరువాం

సిద్ధం యమునికి వెరువాం వెరువాం"14 అనే కీర్తనలు ఆబాలగోపాలం పాడుకుంటారు.

మరో గేయంలో రామనామం గొప్పతనాన్ని జానపదుడు"**రామనామమే లడ్డంట – అది తినే వారికే తీపంట**"15 అనే కీర్తనం బాలురు సులభంగా పాడుకునేవారు. ఇంకా రాపాక కవుల పేరుతో ప్రచారంలో వున్న

"**రామ రామ రామ యనుమా – సులభముగ తారక నామమది**

**మోక్షమును గనుమా ఓ మనసా ||రామ||**" 16 అనే కీర్తన జనసామాన్యంలో ఎంతో ప్రసిద్ధమైనది.

అలాగే 'సీతాపాట' లో సీతమ్మతల్లి శ్రీరాముని ముక్తికి ఏ మార్గము శ్రేష్టమైనదని అడుగగా-

**జనక నందన వేదసారార్థ మడిగితివి వినుమది రహస్యమే సీత**
**అష్టంగ యోగములు కష్టసాధ్యములగుట శిష్టులివి మెచ్చరే సీత అంటూ రాజయోగం బిదియ రాజమార్గము యోగిరాజు లిదిమెత్తరే సీత** 17 అని సాంఖ్య, తారకాది యోగాలను విడమర్చి చెప్తాడు.

వసిష్ట వాక్యములు లో కూడా వసిష్ఠుడు రామునికి సందేహ నివృత్తి చేస్తూ-

"**సైంధలవణము రాయి సాగరములోబడి తావుదకమాయెనే ఓరామా**

**అటువలెనే తన మనసు శివుని ధ్యానము చేసి శివునందు కలిసెనే ఓ రామా**"18అని చెప్తాడు.

## 1.6 పెండ్లిపాటలు - సీతారాములు:

వివాహం స్త్రీ, పురుషుల జీవితాల్లో చాలా ముఖ్యమైన ఘట్టం. ఆ సమయాల్లో వధువును సీతమ్మగా, వరుని రామయ్యగా భావించుకుని జానపదులు పాటలు పాడుకుంటారు.

**కళ్యాణము చూతము రారమ్మ**
**అయోధ్యరాముల కళ్యాణము చూతము రారమ్మ**
**చూచువారలకు చాల పుణ్యమట.**
**భక్తాగ్రేసర ముక్తిదానమట................. కళ్యాణము** 19

సీత సమర్త, సీతాదేవి వామనగుంటలాడుపాట, పెండ్లి పాటలు, సీతనత్తవారింటికి పంపుట. సీతమ్మ వారి వసంతము సీత గడియ….. ఒకటేమిటి కోకొల్లలుగా ఉన్నాయి. మచ్చుకు కొన్ని

వివాహానికి ముందు కొట్నములు దంచే కార్యక్రమంలో

**"సువ్వి సువ్వి రామచంద్ర – సువ్వి సువ్వి కీర్తి సాంద్ర**

**సువ్వి సీతమ్మా మాకు శుభములిమ్మా**"20అనే పాట అధిక ప్రచారంలో ఉంది.

"**సీతను అత్తవారింటికి పంపుట**" పాటలో జనకుడు సీతమ్మకు చెప్పిన బుద్ధులు ఇలా ఉన్నాయి.

**"నెలతరా కన్నకూతురువు గనుక నేనొక బుద్ధెరిగిస్తు**
**వినుమా నాధుని ముంగిట నెన్నడు పకపక నవ్వకుమీ**
**సుందరి నాధుని కన్నా ముందర మేల్కొనుమీ..... 21"**

## 1.7 హాస్యపు పాటల్లో సీతారాములు:

మానవ జీవితంలో హాస్యానికి అడుగడుగునా ప్రాధాన్యం ఉంది. ఎంతటి కష్టాన్నైనా మర్చిపోవాలంటే హాస్యమే దిక్కు. ఈ హాస్య గేయాల్లో శాంత గోవింద నామాల్లో ఋష్యశృంగుని కథ, అడవి అనే చర గోవిందనామములు, సూక్ష్మ రామాయణము, ఊర్మిళాదేవి నిద్ర, శ్రీరామ పట్టాభిషేకం, సీత గడియపాట ముఖ్యమైనవి. ఇవన్నీ వేటికవే సాటి అని చెప్పుకోవాలి. సీత గడియ పాట చాలా మనోహరమైన పాట. అత్తవారింట్లో సీత బాధ్యత గల పెద్ద కోడలు. అందునా క్రొత్తగా వచ్చింది. అందరికీ అన్ని పనులు చేసి, ఇంటి పనులన్నీ సరిచూసుకొనేసరికి బాగా ప్రొద్దుపోయింది. రాముడు సీత కోసం చూసి చూసి విసిగిపోయి కోపంతో శయ్యాగృహపు తలుపు గడియ వేసుకుంటాడు. అప్పుడు సీతాదేవి వచ్చి

**"నిలుచుండ పాదాలు చేతులూ నొచ్చె – దంతంపు తలుపులూ తీయవోయి నాథ......**

**వొంటింటి చినుకుకే వొక చెంగు దడిసె – కాముడా తీయవోయి కనకంపు గడియ**"22 అని బతిమాలుకుంటే రాముడు మరింత బెట్టుతో"నిద్ర నీకు లేకుంటే నాకేమి సీత – గంటవలె దీపంబు అది నాకు తోడు"23అని అంటాడు.

## 1.8 శృంగార గేయాల్లోసీతారాములు:

శృంగారం లేనిదే మానవ జీవితం లేదు. మానవ జాతి మనుగడ సాగించాలంటే శృంగారం ప్రధానమైంది. శృంగారంలో సూచ్య శృంగారం, వాచ్య శృంగారమని రెండు రకాలుగా చెప్తారు. జానపదులు ఎలాంటి కల్మషం లేనటువంటి వారు. తమ మనసులో ఏదీ దాచుకోరు. "కౌసల్య బైకలు" అనే గేయంలో ప్రసవవేదనలో కౌసల్య ఇలా ఉంటుంది.

**"అతనితో నేనేమో రతి చాలయితిని గాని**

**వెతల నేనెరుగ నైతిని దోయమ్మా వెతల నేనెరుగనైతిని –**

**ఈసారి గడిచితే ఇంక నా విభునితో ఏకాంత మాడేనమ్మా**

**వోయమ్మా ఏకాంత మాడనమ్మా**"[24]

అలాగే సీత గడియ, సీతమ్మ వారి అలక, సీతాదేవి వేవిళ్లు, ఊర్మిళాదేవి నిద్ర, సుందరకాండ పదము, కుశలవ యుద్ధం మొదలగు వాటిల్లో శృంగారం కన్పిస్తుంది.

## 1.9 కరుణ రస గేయాల్లో సీతారాములు:

శృంగారం తరువాత కరుణ రసాన్నే జానపదులు ఎక్కువగా ఇష్టపడ్డారు. నిజ జీవితంలో సుఖము, దుఃఖములు రెండే మనిషిని నడిపిస్తుంటాయి. జానపదుల కరుణ రస గేయాలలో "రాములమ్మ పాట" రామాయణ గాథను పోలి ఉన్నదని బి. రామరాజు గారు పేర్కొన్నారు.[25]

## 1.10 గొబ్బి పాటల్లో సీతారాముల కథ:

సంక్రాంతి పండుగ రోజుల్లో మన తెలుగు ప్రాంతాల్లో ముఖ్యంగా కోస్తా, రాయలసీమ ప్రాంతాల్లో పల్లెలు, గొబ్బిళ్ళ పాటలతో మార్మోగిపోయాయి. స్త్రీలు ఉత్సాహంగా ఇంటి ముంగిట అందమైన ముగ్గులు వేసి ఆవు పేడను గొబ్బెమ్మగా తీర్చి ముగ్గు మధ్యలో పెడతారు. ఆ గొబ్బెమ్మను తంగేడి పూలతోను, గుమ్మడి పూలతోను, బంతిపూలతోనూ అలంకరించి గొబ్బెమ్మ చుట్టూ స్త్రీలందరూ గుండ్రంగా నిలబడి ముందుకు వంగుతూ లేస్తూ పాటలు పాడుతూ, చప్పట్లు చరుస్తూ అలాగే గుండ్రంగా ముందుకు సాగుతారు. ఇలాంటి సమయంలో జానపద స్త్రీలు రామాయణానికి సంబంధించినఅనేక పాటలు పాడుకుంటుంటారు.

**గొబ్బియలో సీతారాముల గొబ్బీపాట సేడీలెల్లపాడీరి గొబ్బీయలో**
**గొబ్బీయలో సురులు హరులు బాధకోర్వక హరినీ వేడితే గొబ్బీయలో**
**గొబ్బీయలో ధరను దశరధరాజు ఇంట తనయుడై జన్మించెనే గొబ్బియలో....**[26]

## 1.11 కోలాటపు పాటల్లో సీతారాములు:

కోలాటం పాటల్లో రామాయణ ఇతివృత్తానికి సంబంధించిన గేయాలు ముఖ్యమైనవి. రామాయణంలోని ఏదో ఒక సంఘటనకు సంబంధించి గానీ లేదా కొన్ని సంఘటనలకు సంబంధించి గానీ జానపదులు పాటలు పాడుకుంటారు.

"**భద్రాచలములో గోదావరందున రంగా**

**జలకమాడిరే రాముల సేవజేసిరే రంగా .....**"[27] ఇలాసాగుతుంది పాట. ఈ పాటలో ఖమ్మం జిల్లాలో ఉన్న భద్రాచల రాముని కీర్తించడం కనిపిస్తుంది.

### 1.12 చెక్కభజనల్లో సీతారాములు:

తీరిక సమయాల్లో, పండుగ పబ్బాల్లో జానపదులు చెక్క భజనలు చేయడం మనం తరచూ చూస్తున్నాం. చేతిలో చెక్కలు ధరించి లయబద్ధంగా కొడుతూ, పాటలు పాడుతూ చిందులు వేస్తుంటారు. సీతారాముల కథకు సంబంధించి ఎన్నో పాటలు పల్లెల్లో దారుకుతున్నాయి. ఉదాహరణకు-

**రామ రామ రామ రామ రామ కోదండరామ**
**రాములా భజన చేయ జన్మమెందుకో రామ**
**బాలులంత గూడినారు బంతులాట ఆడినారు**
**బంతిబోయి శివాధనసు చెంత చేరెనో రామ**
**దనసు నెత్తి సీతాదేవి బంతి దెచ్చెనో రామ .....**[28]

మరో పాటలో

**రామం భజే రఘురామం భజే – మన**
**రాముడొస్తున్నాడు రామంభజే – మన**
**దేవుడొస్తున్నాడు రామంభజే**
**వాడా వాడా దిరిగి రామంభజే – మన**
**వాడ కొస్తున్నాడు రామంభజే .....**[29]

ఇంకా జానపద రూపకాల్లో, బొమ్మలాటల్లో (తోలుబొమ్మలు, కొయ్యబొమ్మలు) రామాయణానికి సంబంధించి అనేక పాటలు కన్పిస్తాయి.

### 1.13 మంగళహారతుల్లో సీతారాములు:

పెళ్ళిళ్ళు, నలుగులు, పేరంటాళ్ళల్లో ఆఖరున మంగళ హారతి ఇవ్వడం మన తెలుగు వారి సంప్రదాయం.

**"మంగళమని మంగళమని మంగళమనరే**
**ముత్యాల హారతులు ముదితులివ్వగా**
**రత్నా సింహాసనమున రాముని సిరి**
**కరి రాజ వరదునకు కాంతి మంగళం**
**తండ్రి శ్రీరాములకు జయ మంగళం**
**తల్లి సీతమ్మకు నిత్య మంగళం ....."**30 అని మంగళ హారతులు ఇచ్చుకుంటారు జానపదులు.

## 2.0 జానపద కథాగేయాల్లో సీతారాములు:

జానపద గేయాల్లో కథ వుండదు. కేవలం కొన్ని భావాలు ఉంటాయి. కానీ కథాగేయాల్లో కథాంశాలు ఉంటాయి. అంటే అంతర్లీనంగా కథ ఉంటుంది. వీటినే గేయ కథలనీ, కథా గేయాలనీ అంటారు. వీటిలో కథా కథనం ఎక్కువగా ఉంటుంది. జానపద రామాయణాల్లో కూచకొండ రామాయణము, శారద రామాయణము, ధర్మపురి రామాయణము, రామకథా సుధార్ణవము, మోక్షగుండ రామాయణము, సూక్ష్మ రామాయణము, సంక్షిప్త

రామాయణము, ఆధ్యాత్మిక రామాయణము, చిట్టి రామాయణము, శ్రీరామ దండములు, లంకా సారధి, రామాయణ గొబ్బి పాట, అడవి, శాంత, పెండ్లి, సేతు గోవింద నామాలు, ముఖ్యమైనవి. అయితే కొన్నిటిలో ఏదో ఒక ఘట్టం రసవత్తరంగా చిత్రంచబడి ఉంటుంది. వాటిల్లో పుత్ర కామేష్టి, కౌసల్య బైకలు, పాతాళ హోమము, లక్ష్మణ మూర్ఛ, శ్రీరామ పట్టాభిషేకము, ఊర్మిళాదేవి నిద్ర, లక్ష్మణదేవర నవ్వు, కుశలవుల యుద్ధం, కుశలవుల కుచ్చల చరిత్రము, శతకంఠ రామాయణమం, సీతా కళ్యాణం, సీతాదేలి యానవాలు, కోవెల రాయబారము, సీతమ్మ అగ్ని ప్రవేశము, మాయలేడి పాట మొదలైనవి ముఖ్యమైనవి.

## 2.1 కుశలవుల కుచ్చల చరిత్ర :

ఇది ఒక పెద్ద కథా గేయము. దశరధ రాజ్య పరిపాలనం నుండి సీతాదేవి భూగర్భ ప్రవేశము వరకు ఈ కథలో వర్ణించారు. ఒకనాడు సీతారాములు పాచికలు ఆడతారు. ఆ ఆటలో "**శాంతారాఘవులొకవైపైరీ – సీతాలక్ష్మణులొకవైపైరీ**" మరొక రోజు సీత శాంతతో సరసములాడుతూ శ్రీరాముని పిలుపును ఆలకించరు. శ్రీరాముడు కుపితుడై లక్ష్మణునితో తన విల్లు నమ్ములు తెప్పించుకుని వానిని పరిచారికలుగా పెట్టుకొనెను. ఆ స్త్రీలు

**"వేడుకతో విరిజామర విసరుచు -**
**ఆకుల మడుపులు అందిచ్చుచునూ -**
**పాదము లొత్తుచు శ్రీరాములకు -**
**కూడి యుండిరా రాముని తోను"**[31]

ఈ సందడి విని

**"చూచి వత్తమని జానకిదేవి-**
**జాలకర్రలా వెంటనే చూచుచూ-**
**విభ్రాంతి గాని యిట్లని పలికె-**
**ఏకపత్నీవ్రతుండవు అనుచూ-**
**ఇచ్చెగాక మా తండ్రయితేను-**
**యేక పత్నీవ్రతములు అన్నీ-**
**తెలిసె గదా ఇక్కడ ఈలాగు"**[32] అనెను.

ఆ తర్వాత శాంత వచ్చి రాముని మందలించి, సీతారాములకు సంధి చేసినది. ఈ జానపదుల కల్పన ఎంతో మనోహరంగా ఉందని చెప్పచ్చు.

అలాగే సీతా వనవాసమునకు జానపదులు బలవత్తరమైన కారణాన్ని సృష్టించారు. శూర్పణఖ పగతో రగిలిపోతూ అయోధ్య లోని అంతఃపురంలోని సీతను యతి వేషంలో వెళ్లి రావణాసురుని బొమ్మను గీయమని బలవంతపెడుతుంది. సన్యాసిని అడుగుతుంది కాబట్టి సీత అతని 'అంగుష్టకము' మాత్రము గీచి ఇస్తుంది. ఆ శూర్పణఖ బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్లి ఆ బొమ్మకు ప్రాణం పోపిస్తుంది. అప్పట్నుండి ఆ బొమ్మ-

**"రావే పోదము లంకకు నసుచు-**
**సీతను బట్టుక ఆపద బెట్టెను**
**జానకి బట్టుక యీాద్య దొడంగెను"**

అని సీతను రాముడి ముందు దోషిగా నిలబెట్టింది.

## 2.2 లక్ష్మణదేవర నవ్వు:

ఊర్మిళాదేవి పాటతో దగ్గర సంబంధము గల పాట ఇది. ఊర్మిళాదేవి 14 సంవత్సరముల దీర్ఘమైన నిద్రకు, లక్ష్మణుడు 14 సంవత్సరములు నిద్రాహారములు మాని అన్నా ఒదినలకు సేవ చేయడానికి జానపదులు మనోహరమైన కల్పనను జోడించారు. శ్రీరామ పట్టాభిషేకం తర్వాత సకల దేవతా సమక్షాన నిండు కొలువులో-

**"కలకల నవ్వే లక్ష్మణదేవరపుడూ – కలతలు పుట్టెనూ కపులందరికినీ**

**కిల కిల నవ్వే లక్ష్మణదేవరపుడూ – కిల కిల నవ్వగా ఖిన్నుడయె రాజూ?"**[33]

లక్ష్మణుడు అకారణంగా నవ్వేసరికి అక్కడున్న సభ్యులందరూ ఒకరి ముఖాలొకరు చుసుకుంటారు. ఇలా జానపద కథాగేయాల్లో రామాయణ కథకు సంబంధించి మనోహర కల్పనలు కన్పిస్తాయి.

## 3.0 పురాకథల్లో సీతారాములు:

పురాణకథలు విజ్ఞానదాయకంగా ఉంటాయి. విశ్వసృష్టికి సంబంధించిన ఆలోచనలు, నమ్మకాలు పురాణాల్లో ఉంటాయి. ధార్మిక మహాపురుషులు, వీర పురుషులు, దేవతా వ్యక్తులు నాయకులుగా ఉంటారు. జానపద సాహిత్యంలోని గద్య కథనాల్లో గూడా సీతారాముల కథ ఉన్నట్లుగా మనకు కొన్ని ఆధారాలు దొరుకుతున్నాయి.

## 3.1 చింతచెట్టు – చిన్న ఆకులు:

సాధారణంగా చింతచెట్టు చాలా పెద్దదిగా ఉంటుంది. అలాంటి చెట్టు ఆకులు చిన్నవిగా ఎందుకుంటాయో జానపదులు మనోహరంగా కల్పన చేశారు. రామాయణ పరంగా ఒక పురాణాన్ని కల్పించారు. సీతారాములు, లక్ష్మణుడు, వనవాసానికి వెళ్తూ దారిలో ఒక చింతచెట్టు కింద పడుకున్నారట. తెల్లారింది.

సీతారాములు ఎంతకూ నిద్ర లేవలేదు. ముందే నిద్ర లేచిన లక్ష్మణుడు వాళ్ళను నిద్రలేపడం ఇష్టం లేక ఏం చెయ్యాలో తోచక చింతచెట్టు ఆకుల్ని బాణాలతో చీల్చాడట. అంతకు ముందు చింతచెట్టు ఆకులు పెద్దవిగా ఉండేవట. చీల్చడం వలన సూర్యరశ్మి పడి సీతారాములు మేలుకున్నారట. చింతాకులు చిన్నవైనాయట. ఆకులు చిన్నవవటానికి జానపదులు చెప్పినకథ.[34]

## 4.0 ఐతిహ్యాలలో సీతారాములు:

నిర్దిష్ట వ్యక్తులకు, స్థలాలకు, వస్తువులకు సంబంధించినవే ఐతిహ్యాలు. ఐతిహ్యానికి పరోక్ష ఆధారాలు మాత్రమే ఉంటాయి. ఉదాహరణకు

### 4.1 కూనారం గ్రామం:

కరీంనగర్ జిల్లాలో కూనారం అనే గ్రామముంది. ఇది రామగిరి గుట్ట ప్రాంతంలో ఉన్న గ్రామం. రాముడు అరణ్యవాసం చేసేటప్పుడు ఆ ప్రాంతం వైపు వచ్చి ఆ రామగిరి గుట్టల కొనవరకు వచ్చి తన పాదాలను మోపాడు. 'కొనరాము' అన్నదే ఆ తర్వాత కాలంలో కూనారం అయింది.35 లోతుగా అధ్యయనం చేస్తే ఇలాంటి ఐతిహ్యాలు మన జానపద సాహిత్యంలో చాలా దొరుకుతాయి.

## 5.0 సామెతల్లో సీతారాములు:

జానపదులు ఎక్కువగా, అతి సాధారణంగా,అలవోకగా ఉపయోగించేవి ఈ సామెతలు. ప్రకృతి జీవితంలో సుదీర్ఘమైన అనుభవం పరిశీలనాశక్తి వల్లనే ఈ సామెతలు జానపదులు చెప్పగలుగుతున్నారని చెప్పొచ్చు.

ఉదాహరణకు "**హనుమంతుని ముందర కుప్పిగంతులు** [36]

**కోతికైనా గీత సక్కంగుండాల**" [37]

"**రామాయణం అంతా విని రాముడికి సీత ఏమౌతుంది? అన్నాడంట**" [38]

## 6.0 జాతీయాల్లో సీతారాములు:

జాతికి సంబంధించిన విశిష్టమైన పలుకుబడి జాతీయం. ఈ జాతీయాలనే పద బంధాలనీ, పలుకుబడులనీ అంటారు. ఉదాహరణకు రామాయణానికి సంబంధించిన జాతీయాల్లా రామరాజ్యం, లక్ష్మణరేఖ, ఉడతాభక్తి, కబంధ హస్తం మొదలైనవి ప్రముఖంగా చెప్పుకోవచ్చు.

## 7.0 పొడుపుకథల్లో సీతారాములు:

పిల్లల్లో లోకజ్ఞానాన్ని, జ్ఞాపకశక్తిని పెంపొందించడానికి వారి బుద్ధి వికసించడానికి జానపదులు ఈ పొడుపు కథల్ని చెప్తుంటారు. సంస్కృతంలో వీటిని ప్రహేళికలు అంటారు.

**అడవిలో సీతమ్మ ముగ్గు వేసింది"**[39] - చీమలబారు

**అరే రాముని గుల్లో గంట కొడితే**

**వినే వాల్లు గాని చూసేవాల్లు లేరు**[40] ఉరుము

**బావిలో సీతమ్మ మునిగి మునిగి లేచె**[41] వెన్నముద్ద

సీతారాముల పేర్లను రామాయణార్థంలో సరిగ్గా వాడకపోయినా జానపదుల నరనరాల్లో సీతారాములు ఎలా నిలబడిపోయారో చెప్పడానికి పై పొడుపుకథలు పనికి వస్తాయి.

## 8. ముగింపు:

ఈ విధంగా జానపద సాహిత్యంలో రామాయణానికి సంబంధించిన సీతారాముల కథను జానపదులు గేయాల్లోను, కథాగేయాల్లోను, పురాగాథలు, ఐతిహ్యాలు, సామెతలు,పొడుపుకథల్లో విస్తృతంగా గానం చేశారు. తమ కలవరింతల్లో, పలవరింతల్లో వారి జ్ఞాపకాల్ని దాచుకున్నారు. వీటిని చక్కగా విశ్లేషిస్తే జానపదుల హృదయాల్లో సీతారాములకు ఎంతటి గొప్ప స్థానమున్నదో మనందరికీ తెలుస్తుంది. గొప్ప గొప్ప కవులు, మహా పండితులకే తట్టని ఎన్నెన్నో మనోహర కల్పనలు కనిపించి జానపద సాహిత్యంలో ఉండడం మనసు పులకించి పోతుంది. జన్మ ధన్యమైపోతుంది.

## 9. పాదసూచికలు:

1. అంతా జానపదం – ఆచార్య పేట శ్రీనివాసులు రెడ్డి, పుట 70
2. అంతా జానపదం – ఆచార్య పేట శ్రీనివాసులు రెడ్డి, పుట 70
3. ఆంధ్రుల జానపద విజ్ఞానం – డా. ఆర్వీయస్ సుందరం, పుట 58
4. జానపద గేయాల్లో శ్రీ వేంకటేశ్వరుడు - డా. పేట శ్రీనివాసులురెడ్డి, పుట 14
5. తెలుగు జానపద గేయ సాహిత్యము - డా. బి. రామరాజు,పుట 532
6. తెలుగు జానపద గేయ సాహిత్యము – స్త్రీల పాటలు – శ్రీ బి. రామరాజు,పుట 476
7. తెలుగు జానపద గేయ సాహిత్యము – బి. రామరాజు, పుట 548,549
8. అంతా జానపదం – ఆచార్య పేట శ్రీనివాసులు రెడ్డి, పుట 70,71

9,10 తెలుగు జానపద గేయ సాహిత్యము – శ్రామిక గేయాలు – బి. రామరాజు,పుట 502

11. జానపద సాహిత్య సౌరభం – జానపద గేయాలు – డా. ఆర్వీయస్ సుందరం, డా. జి.యస్. మోహన్, పుట 21

11 A. జానపద సాహిత్య సౌరభం – జానపద గేయాలు – డా. ఆర్వీయస్ సుందరం, డా. జి.యస్. మోహన్, పుట 16

12,13. ఆంధ్రుల జానపద విజ్ఞానం – డా. ఆర్వీయస్ సుందరం, పుట 67,68

14. తెలుగు జానపద గేయ సాహిత్యము – బి. రామరాజు, పుట388
15. తెలుగు జానపద గేయ సాహిత్యము – బి. రామరాజు, పుట 393
16. తెలుగు జానపద గేయ సాహిత్యము – బి. రామరాజు, పుట 394
17. తెలుగు జానపద గేయ సాహిత్యము – బి. రామరాజు, పుట 414
18. తెలుగు జానపద గేయ సాహిత్యము – బి. రామరాజు, పుట 426
19. అంతా జానపదం – ఆచార్య పేట శ్రీనివాసులు రెడ్డి, పుట 71

20,21. తెలుగు జానపద గేయ సాహిత్యము – బి.రామరాజు, పుట 479

22,23. తెలుగు జానపద గేయ సాహిత్యము – బి.రామరాజు, పుట 486

24. తెలుగు జానపద గేయ సాహిత్యము – బి.రామరాజు, పుట 553

25. తెలుగు జానపద గేయ సాహిత్యము – బి.రామరాజు, పుట 995

26. అంతా జానపదం – ఆచార్య పేట శ్రీనివాసులు రెడ్డి, పుట 72

27. కోలాటం పాటలు – డా. కె. రాధికారాణి, పుట 178, 359

28. అంతా జానపదం – ఆచార్య పేట శ్రీనివాసులు రెడ్డి, పుట 74

29. జానపద సాహిత్యం అధ్యయనం – అనుశీలనం – డా. కసిరెడ్డి, పుట 122

30. చిత్తూరు జిల్లా జానపద విజ్ఞానం – ఆచార్య పేట శ్రీనివాసులు రెడ్డి,పుట 12

31. తెలుగు జానపద గేయ సాహిత్యము – బి.రామరాజు, పుట84

32. తెలుగు జానపద గేయ సాహిత్యము – బి.రామరాజు ,పుట 84

33. రామరసవాహని (విదేశాలలో రామకథ) – డా.జె.వి. సుబ్బరాయుడు, పుట 116

34. జానపద విజ్ఞాన విమోచనం – కురుగంటి శ్రీ లక్ష్మి, పుట 66

35. ఆంధ్రుల జానపద విజ్ఞానం – డా. ఆర్వీయస్ సుందరం, పుట 134

36,37.38 చిత్తూరు జిల్లా జానపద విజ్ఞానం – ఆచార్య పేట శ్రీనివాసులు రెడ్డి, పుట 41,43

39,40,41 జానపద సాహిత్య సౌరభం – డా. ఆర్వీయస్ సుందరం, డా. జి.యస్. మోహన్ ,పుట 121,127,132

## 10. ఉపయుక్తగ్రంథసూచి:

1.కసిరెడ్డి, 1994, జానపద సాహిత్యం అధ్యయనం అనుశీలనం – జాతీయ సాహిత్య పరిషత్ ,భాగ్యనగర్

2.మోహన్, జి.యస్, 2002, జానపద సాహిత్య సౌరభం, విశాలాంధ్ర బుక్ హౌస్, హైదరాబాదు

3.రాధికారాణి, కె, 2008, ప్రమీల పబ్లికేషన్స్, సదుం, చిత్తూరు జిల్లా

4.రామరాజు, బి,1990, తెలుగు జానపద గేయ సాహిత్యం – హైదరాబాదు

5.శ్రీనివాసులు రెడ్డి, పేట ఆచార్య, 2012, అంతా జానపదం – శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి

6.శ్రీనివాసులు రెడ్డి, పేట ఆచార్య, 1991, జానపద గేయాల్లో శ్రీ వేంకటేశ్వరుడు, శ్రీ బాలాజీ ప్రింటర్స్, తిరుపతి

7.శ్రీనివాసులు రెడ్డి, పేట ఆచార్య, 2012, చిత్తూరు జిల్లా జానపద విజ్ఞానం – తెలుగు అకాడమీ, హైదరాబాద్

8.శ్రీలక్ష్మి, కురుగంటి, 1988, జానపద రామాయణం మనోవిశ్లేషణ, తెలుగు పరిశోధన ప్రచురణలు, హైదరాబాద్

9.శ్రీలక్ష్మి, కురుగంటి, 1996, జానపద విజ్ఞాన వివేచనం, శ్రీ ఉదయ్ ప్రింటర్స్, హైదరాబాద్

10.సుబ్బరాయుడు, జె.వి, 2003, రామరసవాహిని, (విదేశాల్లో రామ కథ), నవోదయ పబ్లిషర్స్ , విజయవాడ,

11.సుందరం, ఆర్వీయస్, 2004, ఆంధ్రుల జానపద విజ్ఞానం, పొట్టి శ్రీరాములు, తెలుగు విశ్వవిద్యాలయం,హైదరాబాదు

***


AUCHITHYAM
ISSN: 2583-4797
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_25.php

---

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

---

# 25. "కల్పవృక్ష బాలకాండము రమ్యరమణీయదృశ్యకావ్యము": నిరూపణ

**అవధానం సుజాత**

తెలుగు సహాయాచార్యులు,

ప్రభుత్వ సిటీ కళాశాల, నయాపూల్, హైదరాబాద్,

హైదరాబాద్ , తెలంగాణ.

సెల్: +91 94909 94558. Email: sujathaavadhanam@gmail.com

---

**వ్యాససంగ్రహం:**

*జ్ఞానపీఠంపై తెలుగు సాహితీసరస్వతిని విరాజమానం చేసి, తెలుగువారికి సీతారాములను ఆత్మీయులుగా జేసి, మధురానుభూతిని అందించిన చక్కని రచన విశ్వనాథ సత్యనారాయణ రామాయణ కల్పవృక్షం. జీవుని వేదన, తండ్రి ఆనతి, ముని ఋణము ప్రేరేపించగా కల్పవృక్షం ఈ తెలుగు నేలపై ఆవిర్భవించింది. తిన్న అన్నమే మరల మరల తిన్నా, ఎవరి అనుభూతి వారిది అయినట్లు రామకథ ఎన్ని సార్లు చదివినా, గానం చేసినా, రామనామం పఠించినా, తనివితీరదు. రామాయణ కల్పవృక్షం రచించిన విశ్వనాథ నిజంగా ఋషితుల్యులే. తెలుగింటి ఆచార వ్యవహారాలను, సామెతలను, నుడికారాలను, లోకరీతిని, తమ రచనలో చిత్రించారు. ఇందలి బాలకాండము ఇష్టిఖండముతో మొదలై కల్యాణఖండముతో ముగియుచున్నది. ఆయా ఖండములలో ఎన్నో వర్ణనలు, తెలుగింటి ఆచారవ్యవహారాలు, భాషా విశేషాలు, పాత్రల సహజ చిత్రణలు దాగి ఉన్నాయి. బాలకాండలో దశరథుడు యజ్ఞం చేయడం నుండి సీతారాముల వివాహమువరకు అన్ని ఘట్టాలను విశ్వనాథ కనులకు కట్టినట్లు వర్ణించి దృశ్యమానం చేసారు. శ్రీమద్రామాయణ కల్పవృక్షం సమగ్ర అధ్యయనం ద్వారా ఆయా అంశాలను వివరించడమే ఈ పత్రం యొక్క ఉద్దేశ్యము.*

**Keywords:** విశ్వనాథసత్యనారాయణ, రామాయణకల్పవృక్షం, బాలకాండము, ఇష్టిఖండము, దశరథుని యాగము, విశ్వామిత్రుని రాక, ధశరథుని అతిథి మర్యాదలు, శ్రీ సీతారామ కళ్యాణం.

## 1. ఉపోద్ఘాతం:

భారతీయసంస్కృతీసంప్రదాయాలను తెలుగుజాతి వైభవాన్ని తమ రచనలలో నిక్షిప్తం చేసిన బహుముఖ ప్రజ్ఞాశాలి, సాహితీ దురంధరులు కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. విశ్వనాథ 1895లో నందమూరులో జన్మించారు. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారి శిష్యరికం, పల్లెజీవనం, జన్మసంస్కారం వీరి సాహితీ జీవనానికి వన్నె

తెచ్చాయి. విశ్వనాథ తాను చూసిన అనేక వీధినాటకాలు, హరికథలు, భట్రాజు పద్యాలు మొదలనైన అనేక కళారూపాలకు చెందిన అంశాలను తమ రచనలతో నింపి జాతికి అమూల్యమైన సంప్రదాయ సాహిత్యనిధిని అర్పించారు.

విశ్వనాథలో ప్రతిభావ్యుత్పత్తులు ఒకదానితో ఒకటి పోటీ పడుతూ ఉంటాయి. వారి తీవ్రమైన భావావేశానికి వ్యుత్పత్తి తోడైంది. అందుకే మల్లాది రామకృష్ణ శాస్త్రి విశ్వనాథను 'దేశం పట్టనంత కవి' అని చెప్పారు. నార్ల 'జీనియస్' అని జలసూత్రం 'కవ్యుర్ధ' అని ప్రశంసించారు. విశ్వనాథవారి సాహిత్యాన్ని వివేచిస్తూ బి. రామరాజు '**విశ్వనాథవారి సాహిత్యమెంత విస్తృతమైనదో అంత శక్తివంతమైనది. వైవిధ్యంతో పాటు వైశిష్ట్యము దాని లక్షణం**' అని అన్నారు. (రామరాజు, బి - వివేచన-1, పుట.9)

విశ్వనాథ సాహిత్యం విస్తృతమైనది. వీరి రచనలలో ఆంధ్రప్రశస్తి, ఆంధ్రపౌరుషం వంటి పద్య కావ్యాలు మధ్యాక్కరలు, విశ్వనాథశతకం, కిన్నెరసాని పాటలు, ఒకడు నాచనసోమన వంటి విమర్శ వ్యాసాలు, వేయిపడగలు వంటి నవలేతిహాసాన్ని రచించారు. అంతేకాక ఏకవీర, పురాణవైరగ్రంథమాల మొదలైన నవలలను, సుమారు 60 దాకా రచించారు. వేనరాజు, త్రిశూలం, మొదలగు నాటకాలు, వరలక్ష్మి త్రిశతి వంటి స్మృతికావ్యాన్ని, ఆత్మకతను, తెలుగు వారికి అపూర్వమైన కానుకగా రామాయణ కల్పవృక్షాన్నిరచించారు. అందుకే విశ్వనాథ సాహితీ స్రష్ట విరాణ్మూర్తి. తెలుగుసాహితీ నందనవనంలో రామాయణ కల్పవృక్షాన్ని నాటిన ఘనత విశ్వనాథకే దక్కింది.

## 2. రామాయణ కల్పవృక్షము వైశిష్ట్యము:

విశ్వనాథ తాను రామాయణ కల్పవృక్షం రాయడానికి గల కారణాలను ఈ విధంగా తెలిపారు. పలువురు విశ్వనాథను లోకంలో ఇన్ని రామాయణాలు ఉండగా, మళ్ళీ ఎందుకు రాస్తున్నావని అడిగారాట. దానికి విశ్వనాథ....

"**మరుల నిదేల రామాయణం బన్నచో నీ ప్రపంచక మెల్ల నెల్లవేళ**
**దినుచున్నయన్నమే తినుచున్నదిన్నాళ్లు తన రుచి బ్రదుకులు తనవిగాన**
**చేసిన సంసారమే సేయుచున్నది తనదైన యనుభూతి తనదిగాన**
**తలచిన రామునే తలచెద నేనును నా భక్తి రచనలు నావిగాన**" (బాలకాండ- అవతారిక.4)

నా అనుభూతి నాది, నా భక్తి రచనా నావి కావున నేను రామాయణము రచిస్తున్నాను. అంతేకాక

"**వ్రాసిన రామచంద్రు కథ వ్రాసితి వంచనిపించుకో వృథా**
**యాసముగాక కట్టుకత లైహికమా పరమా యటంచు తా**
**జేసిన తండ్రి యాజ్ఞయును జీవుని వేదన రెండునేకమై**
**నా సకలోహ వైభవ సనాథము నాథకథన్ రచించెదన్**" (బాలకాండ- అవతారిక.7)

ఏ రచనలు రాసినా ఇహమా, పరమా రామకథ వ్రాసిన జన్మ సార్థకమవుతుందన్న తండ్రియాజ్ఞ, జీవుని వేదన, ఏకమై ఈ రామాయనకల్ప వృక్ష రచనకు పూనుకొన్నానని విశ్వనాథ పేర్కొన్నారు.

## 3. రామాయణ కల్పవృక్ష అవతారిక విశేషాలు:

విశ్వనాథ రచనలో పూర్వ కవుల మార్గాన్ని అనుసరిస్తూనే దానిని విలక్షణంగా తీర్చిదిద్దారు. అవతారికలో....శ్రీమంజూశిక భక్తరక్షణ...అని ప్రారంభించి,. శ్రీమంతంబయి పొల్చు (బాలకాండ,అవతారిక,1) సేవింతు విశ్వేశ్వరా! అని ప్రారంభించారు. విశ్వనాథ హరిహరాద్వైత దృక్పథంతో శివకేశవులను అభేదం పాటించి ఇరువురిని ఒకే వెలుగు రూపాలుగా దర్శించారు. ఈ విధంగా శ్రీకారంతో, ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశంతో కావ్యాన్ని ప్రారంభించి, అవిచ్ఛిన్నమైన సంప్రదాయాన్ని పాటించారు.

విశ్వనాథ అవతారికపై నన్నయ, తిక్కనల కావ్యావతారికల ప్రభావం అంతర్లీనంగా ఉంది. నన్నయయు, తిక్కనయు నన్నవేశించిరి.... వారలు పోయిన తెన్నునమెరుగులను తీర్చిదిద్దుచు బోదున్ (బాలకాండ, అవతారిక-26) అని వారిని తన కవితామార్గదర్శకులుగా పేర్కొన్నారు.

విశ్వనాథ తన కావ్యాన్ని తమ కులదైవమైన నందమూరి విశ్వేశ్వరునికి  సమర్పించారు. విశ్వనాథ తన అవతారికలో గురుస్తుతి చేస్తూ శత్రువులకు వజ్రాయుధం వంటివాడైనా, చెళ్లపిళ్ల శిష్యవాత్సల్యం మాత్రం చెప్పలేనిది అనటంలో విశ్వనాథ కవితావైచిత్రి గోచరిస్తుంది. విశ్వనాథను తీర్చిదిద్దిన ఆధ్యాత్మిక గురువుల ప్రసక్తి కూడా ఈ అవతారికలో కనిపిస్తుంది.

విశ్వనాథ తన రచనలో కవిస్తుతిని ఈ విధంగా గావించారు. ఈ పద్యం తెలుగు సాహితీ ప్రియులకు మణిదీపిక. ఈ పద్యంలో నవరత్నాల వంటి తొమ్మిది మంది కవులను గూర్చి గురుస్తుతి గావించారు.

**"ఋషి వంటి నన్నయ రెండవ వాల్మీకి, తిక్కన శిల్పపు దెనుగుతోట,**
**ఎఱ్ఱన సర్వమార్గేచ్చా విధాతృండు, పోతన్న తెలుగుల పుణ్యపేటి,**
**శ్రీనాథుడు రసప్రసిద్ధి, ధారాధుని కృష్ణరాయడనన్య కృతి ప్రబంధ,**
**పెద్దన వడపోత పెట్టి ఇక్షురసంబు, రామకృష్ణుడు సూరారామగజము, ........... యీ యాంధ్రకవిలోక మూర్థమనుల మద్గురు స్థానములు"** (బాలకాండ,అవతారిక-29) అని నమస్కరించి పేర్కొన్నారు.

రామాయణ సృష్టి కర్తయైన వాల్మీకిని రామకథ అనే అమృతాన్ని అందించిన మహనీయుడిగా  స్తుతించారు.

**"అచ్చమైన యమృత మమరులుత్రావినా/ రోయి దానికి నే ననూయపడను**

**పరమమౌనియైన వాల్మీకికృత రామ / సత్కథా సుధారసంబు ద్రావి"** (బాలకాండ- అవతారిక.31)

అంటూ సర్వశిల్ప భూమి అయిన ఆదికవి వైశిష్ట్యాన్ని చక్కగా వివరించారు. అటువంటి మహామునిఋణము దీర్ప కావ్యాన్ని రచించారని చెప్పారు.

రామాయణ కల్పవృక్షము రమణీయ కమనీయ దృశ్యకావ్యము: ఈ కావ్యములో విశ్వనాథ తెలుగింటి ఆచారవ్యవహారాలను వర్ణనలను, వేడుకలను చక్కని భాషావిశేషాలను వర్ణనలను చిత్రించారు. పాత్రల మనోభావాలను తీర్చిదిద్దిన తీరు అద్భుతం. తాను చూసిన, తన అనుభవంలోని అంశాలనే పాత్రలలో పేర్కొన్నారు. ఒక కుటుంబంలోని అన్నదమ్ములు, భార్యాభర్తలు, సోదరి సోదరీమణుల ప్రేమ మనకు ఈ రామాయణంలో దర్శనమిస్తాయి. అంతేకాక రాజుకు మంత్రులకు, పౌరులకు ఉన్న సత్సంబందాలు గోచరిస్తాయి. విశ్వనాథ ఈ రామాయణ రచనలో కావ్యభాషలో వ్యవహారిక భాషా తియ్యదనాన్ని జొప్పించి ఒక కొత్త భాషాసౌందర్యాన్ని చిత్రించినారు.

## 4. భాషావిశేషాలు:

విశ్వనాథ రామాయణ కల్పవృక్షంలో తెలుగు నుడికారాలను, సామెతలను, మాండలిక పదప్రయోగాలను, పాత్రోచితమైన భాషను, వ్యవహారిక భాషను ప్రయోగించారు. ఉదాహరణకు రాముని బాల్యమును వర్ణించేటపుడు ముద్దుముద్దుగా రామునిచే పలికించారు. సాధారణంగా పెద్దల భాషకు, పిల్లల భాషకు తేడా ఉంటుంది. "ర"ను "ల"గా పలకడం బాలభాషలో కనిపించే లక్షణం. అదే విశ్వనాథ ఈ పద్యంలో వర్ణించారు.

**"తానోలాములు తండ్రి పేరేవరయా దాచాతమాలలు నౌ**
**లే నా పేరన నమ్మగాలనగ నోలిందల్లి కౌసల్య తం**
**డ్రీ నాగా ననబోయి రాక కనులన్ నీర్వెట్ట**
**నౌ గానే కానులే యమ్మనే యని ప్రభున్ గౌసల్యముద్దాడెడిన్."** (బాలకాండ-అవతార.335)

ఇందులో రాములు అనడానికి లాములు అనీ, దశరథమహారాజులు అనడానికి దాచాతమాలాలు అనీ అమ్మగారు అనడానికి అమ్మగాలు అని రామునిచే పలికించడం ఎంతో సహజంగా ఉంది. పాత్రోచితంగా బాలభాషను శ్రవ్యకావ్యంలో ప్రవేశపెట్టిన ఘనత విశ్వనాథకే దక్కింది.

రామాయకల్పవృక్షంలో ప్రయుక్తమైన కొన్ని సూక్తులు...

**"ఆడదానికి గలుగు ధనాశయెంతో యవని మగవానికుండు కీర్త్యాశయంత"**

**మన బంగారము మంచిదైనయెడ గంసాలిన్ మరేలాయనన్ వలయు విద్యాకైకాగ్ర్యమభ్యాసనవేళ."**

(అరణ్య-మరీచ-190) కల్పవృక్షంలో అడుగడుగునా సూక్తులు కనిపిస్తూ ఆయాఘట్టాలకు వన్నెతెచ్చాయి.

## 5. వర్ణనలు:

పాత్రల మనఃస్థితిని, చేష్టలను, స్వభావాలను, సన్నివేశాలను సంఘటనలను ఋతువులను వర్ణించటంతో విశ్వనాథ తమ ప్రతిభావైచిత్రిని ప్రదర్శించి కావ్యాన్ని దృశ్యమయం చేసారు.

బాలకాండలోని ఇష్టి ఖండంలో విశ్వనాథ దశరథుని భార్యలను వర్ణించిన తీరు హృద్యంగా ఉంది."కౌసల్య ముక్తి కాంతా సమానాకార, సుమిత్రయుపాసనా స్వరూప ......కైకేయి మధు సామగాన మూర్తి"(బాల-ఇష్టి-7)యని వర్ణించారు. కౌసల్య నవరత్నాల మందాకిని, సిత పుండరీకంబు శ్రీ సుమిత్ర మందార పుష్పంబు మహిళామణి సుమిత్ర, కైకేయి నునునల్ల కల్వపూవు. వీరి గుణగణాలచే వీరు నాలుగు సముద్రాల వంటి వారని అర్థం. మునుముందు వీరియందు నారాయణుడు నాలుగురన్నదమ్ములుగా అవతరింపబోతున్నారన్న భావికథ ఈ వర్ణనలో సూచింపబడింది.

దశరథుడు పిల్లలులేక పడే మానసిక స్థితిని సుమంత్రునితో వెలిబుచ్చినాడు. ఏ పసిపిల్లలను చూసినా, ఆట వస్తువులను చూసినా దశరథుని మనసు తల్లడిల్లేది.

**"దత సుకృతయేమి చేయు దంపతులు ధాత్రి**
**నోచుకొందురోనేనింత నోచలేదు**
**అల్ల కౌసల్య నోచలేదా సుమిత్ర**
**నోచలేదు కైకేయియు నోచలేదు**"(బాల- ఇష్టి .34)

అని సుమంత్రునితో చక్రవర్తి అయిన దశరథుడు సాధారణ తండ్రి వలె బాధ పడ్డాడు.

## దశరథుని పుత్రప్రేమ:

యాగరక్షణకై, విశ్వామిత్రుడు రామలక్ష్మణులను పంపమని దశరథుని కోరాడు. ఆ సమయంలో దశరథుని పుత్రవాత్సల్యాన్ని తండ్రి ప్రేమని విశ్వనాథ సహజరీతిలో వర్ణించారు. విశ్వామిత్రుడు దశరథునితో "మనుజమహేంద్ర, పంపుము కుమారుని నావెనువెంట; నూరకే యనాలము దాచుకొన్న ఫలమా? క్రతుయోగ్యము కావలెంజుమీ" అని అనగానే దశరథుడు

**"రాముడు నాకు స్నానమగు రాముడు నాకు జపంబు ధ్యానమున్**
**రాముడెయెల్ల నా బ్రతుకు రాముడు నన్నును గన్న తండ్రీ- ... మనజాలను గాదయేని,నీ**
**రాముని వీడి యీయఖిలరాజ్యము గాధిసుతా! గ్రహింపవే**" (బాలకాండ 34 పద్యం) అంటాడు. ఇక్కడ విశ్వనాథజీవుని వేదన, దశరథుని ప్రేమవ్యక్తమవుతున్నాయి. ఆమాటలకు "నీ కొడుకును గైకొని చని

**మా కాకలి యంచు దిందుమా? పిచ్చి నృపా!**
**యా కడ బ్రశస్తమస్త్ర**
**వ్యాకృతి కలదద్ది నేర్పి పంపెద మింతే!** " (బాలకాండ, 35)

అని విశ్వామిత్రుడు దశరథునికి నవ్వుతూ నచ్చచెప్పినట్టు చేసిన వర్ణనలో సహజత్వం కనిపిస్తుంది.. లౌకికంగా ఎవరైనా వస్తువు ఇతరులను అడిగితే వారు ఇవ్వకపోతే మేమేమి తినములే అంటారుకదా! ఈ అంశాన్ని సందర్భానికి అనుగుణంగా విశ్వామిత్రుని నోట పలికించాడు. అంతేకాక విశ్వామిత్రుడు

**"ఇమ్మగు విద్య నేర్పేదము నింకనునాకొక చిన్నయెత్తుకా**
**ర్యమ్మును జేసిపెట్టవలెనాపయి బూవులలోన బెట్టి కై**
**కొమ్మని నీకుమారుడిడుగో నని నీక యెసంగు వారమా**
**పిమ్మట నీవుగా నతని వీడవలెనన్ మఱిమాకు నేటికిన్.**"(బాలకాండ- అహల్య. 36)

ఈ పద్యములోని మాటలన్ని లౌకిక వ్యవహారములోనివే "పూవులలో బెట్టి", చిన్నమెత్తు కార్యమ్మును, నీకుమారుడిడుగో వంటి ఈ పదాలు పద్యానికి వన్నె తెచ్చాయి.

## అహల్యఖండం:

శ్రీరాముని పాదధూళి సోకి రాతినాతిగా మారే దృశ్యాన్ని విశ్వనాథ మనస్సుకు హత్తుకునేటట్లు వర్ణించారు.

**"ప్రభుమేనిపై గాలి పై వచ్చినంతనే పాషాణ మొకటికి స్పర్శవచ్చె**
**ప్రభుకాలిసవ్వడి ప్రాంతమైనంతనే శిలకొక్క దానికి జెవులుగలిగె**
**............రాతికి గనులు గలిగె**" (బాలకాండ-అహల్య.564)

అని రామునిమీద గాలి, కాలిసవ్వడి, శరీరగంధం, మంజుల మోహన మూర్తి దర్శనం వంటి వాటితో శిలలో క్రమంగా పంచేంద్రియాలు మేలుకొన్నటుగా వర్ణించడం అద్భుతం. శాస్త్రీయ, తాత్విక దృక్పథంతో చేయబడిన వర్ణన ఇది.

## కళ్యాణ కాండములోని వర్ణనలు:

సీతారామ కళ్యాణం లోకకల్యాణం. అటువంటి కళ్యాణ దృశ్యాలను విశ్వనాథ తనివితీరా వర్ణించాడు.

## ధనుష్కండము:

యాగరక్షణ తర్వాత విశ్వామిత్రునితో మిథిలకు వెళ్ళిన రాముడు లోకకళ్యాణ కారకుడై ధనుర్భంగము కావించినాడు. అప్పటి సన్నివేశాన్ని వర్ణిస్తూ

**"నతనిదృష్టికి జానకి యాగలేదు**
**అతని కృష్టికి శివధనుస్సాగలేదు**
**సీతజడ చెన్నుగా శిరసువంచె**
**చెరుకు గడ వోలె నడిమకి విరిగే ధనువు**"(బాలకాండ- కళ్యాణకాండ.302) అని రాముని పరాక్రమాన్ని, సీతమ్మను ఆకర్షించిన మనోహర రూపాన్ని ఏకకాలంలో కన్నులకు కట్టించాడు.

## తలంబ్రాల వర్ణన:

సీతారాములు నవరత్నాలను తలబ్రాలుగా పోసుకున్నారట. రాముడు పదిమార్లు పోస్తే, సిగ్గుతో సీతమ్మ ఒకమారు పోసిందట. విశ్వనాథ ఇక్కడ తలంబ్రాలను ఈ విధంగా వర్ణించారు.

**"చంద్రరేఖపైని సన్నని తెలిమొయి**
**ళ్ళాడినట్లు ముత్తీయమ్ము లాడె!**
**దల్లిమేనిపైని నల్లనియాకాశ**
**మట్లు రామచంద్రుదందే యుండ"** (బాలకాండ –ధనుష్కాండ.86)

అదే సమయంలో చినుకులు పడటం మొదలైనయట. అపుడు చిరుజల్లు వానలో పుల్ల విచిత్ర వర్ణములు పూవులు చూచిరి లంబమాలలన్. అని వర్ణించి అప్పటినుండి ప్రతి చైత్ర శుద్ధ నవమికి....

**"వితతంబుగ తెలుగు నేల విరిసేడు జల్లుల్**
**సీతాముక్తా సదృశంబులు**
**వ్రతములు తలంబ్రాలు వేళ వచ్చేజిటపటన్"** (బాల- కళ్యాణకాండ. 89)

వానజల్లు పడటం ఆనవాయితీగా మారిందనే సంప్రదాయాన్ని తెలియబరిచాడు. వధూవరులను జూసిన మనఃస్థితిని విశ్వనాథ కళ్ళకు కట్టినట్లు వర్ణించినాడు. అమ్మలక్కలంతా అయోధ్య రామయ్య తానొక విల్లు విరిచి, చందనపు బొమ్మ వంటి మరియు కోసల ముత్యము కొనితెచ్చినారట అనుకుంటూ ఆనందాశ్చర్యాలతో రండి చూతమని వీధులలోకి వచ్చినారనే విషయాన్ని చాల సహజసిద్ధంగా వర్ణించాడు.

**"కనులకు బసిరాముండును**
**మనుషులకాకాశమంత మహనీయుండున్**
**మనసో కనులో వీక్షించిన దేదో తెలియరాని స్థితియై పౌరుల్"**(బాల- కళ్యాణకాండ. 137)

అని విశ్వనాథ రాముని గొప్పతనాన్ని వర్ణించాడు.

సీతారాముల అన్యోన్యదాంపత్యాన్ని విశ్వనాథ వర్ణించినతీరు అద్భుతం.

**"సీత శ్రీరామచంద్రుని చిత్తపదము**
**రామచంద్రుడు జానకీ ప్రాణపదము**
**రామసర్పఫణా మణి రమణిసీత**
**ధరనిజా జీవితాతపసరణి స్వామి"** (బాల- కళ్యాణకాండ. 291)

అని సీతారాములు అన్యోన్య దాంపత్యాన్ని వర్ణించిన విశ్వనాథ ధన్యులు.

## 6. తెలుగింటి ఆచారవ్యవహారములు:

విశ్వనాథ తమ కావ్యంనిండా తెనుగుదనాన్ని నింపారు. ఇష్టికాండంలో దశరథుడు శాంతి ఋష్యశృంగులను ఉగాది పండుగకు పిలిచి వారికి ఉగాది పచ్చడిని రుచి చూపిస్తాడు.

**"......జలకమ్ము లాడించి సన్నమామిడి పిందెముక్కలతో వేపపూతబెట్టి**
**సన్నబంగరు జరీ చిన్ని పీతాంబరంబులు గట్టబెట్టి జోళ్లులు ప్రియాన**
**వజ్రగోమేధిక వైడూర్య మరకత స్వచ్ఛకాంతులగు భూషణములిచ్చి"** (బాలఇష్టికాండ. 257) భోజనముపెట్టి

మర్యాదలు రకరకాల మర్యాదలు చేసినాడని వర్ణించాడు. అట్లే బిడ్డ అల్లునికి సన్నని జారీవస్త్రములు ఆభరణాలు ఇచ్చి సత్కరించినాడు అని పండుగపూట బిడ్డకు అల్లునికి ఇచ్చే గౌరవ మర్యాదలను చక్కగా వర్ణించాడు.

దిష్టి తీయడం అనేది తెలుగింటి ఆచారమే అవతారఖండములో శాంత, ఋష్యశృంగులనలా వీడ్కోలు పలికి తిరిగి అంతఃపురానికి వచ్చిన చూలింతరాలైన రాణులకు దాసీలు కాళ్లుకడిగి కట్టెర్ర నీళ్లు తిప్పినార్రు. (అవతారఖండం 152)

అంతేకాక విశ్వనాథ సహజంగా గర్భవతులు తీసుకొనే జాగ్రత్తలను ముఫ్వురు రాణులు గర్భవతులైనపుడు వర్ణించారు. (అవతారఖండం 116) మంధర కైకేయి నిజాగ్రత్తగా చూసుకునేది. గర్భవతికి చేసే దోహద క్రియలన్ని చేసేది. కైకేయిని దేహళి నిలువగ నీయదు (అవతారఖండం 175) అంటే గడపలో నిలబడటాన్ని అనుమతించదు. గడపలో నిల్చుకోవడం, కూర్చోవటం, కాళ్లుపెట్టడం వంటి వాటిని నిషేధించే ఆచారం ఇప్పటికీ ఉంది. దీనినే విశ్వనాథ పేర్కొన్నారు. అంతేకాకుండా బాలింతలు నడికట్టు కట్టుకోవడం, చెవులలో దూదిపెట్టుకోవడం, ముసుగులు వేసుకోవడం మొదలైన ఆరోగ్యసూత్రాలను రాణులు పాటించినరాని తెలిపినారు. రానులకు ప్రసవమైన తర్వాత బంధువులకు స్నేహితులకు రాణివాసం నుండి పసుపు కుంకుమ, సీకాయ మొదలైన వాటిని అయోధ్యలోని ప్రతి ఇంటికి పంపినారని, విశ్వనాథ పేర్కొనారు. ఇవన్నీ జనసామాన్యంలోని ఆచారవ్యవహారములే.

## 7. అతిథి మర్యాదలు:

విశ్వనాథ తెలుగువారి అతిథి మర్యాదలను, భోజన పద్ధతులను, పిండి వంటలను, తమ కావ్యములో సందర్భోచింతంగా వర్ణించారు. యజ్ఞ నిర్వహణ సమయంలో వచ్చిన అతిథి ఎవరైనా సరే వారిని ప్రేమతో సమాదరించి ఆతిథ్యమివ్వాలని, వారిని సంతోషపరచాలని వశిష్టుని ఆదేశం. (బాల-ఇష్టి-294-295)

పౌరులంతా రాజాజ్ఞను అనుసరించి తమ ఇంట్లోనే యజ్ఞం జరుగుతున్నట్లుగా భావించి సంతోషంతో వచ్చిన వారికి అతిథి మర్యాదలు చేశారు. ఎంత ప్రొద్దువేళ తలుపు తట్టినా చిటికెలో వచ్చి తీసి మంచి తీర్థమడిగితే మజ్జిగ తెచ్చి ఇచ్చేవారట. అరుగుల మీద నిద్రిస్తామంటే మంచాలు, పక్కలు ఇచ్చేవారట. వచ్చిన వారందరికి చాలని చేతులు అడ్డుపెట్టినా కడుపునిండా వడ్డించే వారట. యజ్ఞవాటికల వెనుక పెద్ద పెద్ద భోజన శాలలు నిర్మించినారట. పందిళ్ళు వేసి బంతులు తీర్చినారట. ఆ భోజనశాలలో పెద్ద పెద్ద గుండిగల నిండా పొడి పొడి వేడి అన్నమును పూర్ణములు, కరకరలాడే పునుకులను, క్షీరాన్నమును, దొన్నెలనిండా గడ్డపెరుగును కూడా అతిథులకోసం సిద్ధము చేసి కొసరి కొసరి వడ్డించినారట.

రామాదుల ఉపనయన వర్ణలలో కూడా తెలుగు వారి వైదిక సంస్కృతి, ఆచారాలను వర్ణించాడు విశ్వనాథ వటువులు పెద్దలందరికి నమస్కరించి భిక్ష అడగడం సంప్రదాయం. రాముడు తల్లులకు నమస్కరించినాడు.

రామునికి కౌసల్య బంగారు సొమ్ములను భిక్షగా ఇచ్చిందట. అన్నదమ్ముల వివాహములో ఆడపడచులదే ప్రాధాన్యము. ఇక్కడ కూడా విశ్వనాథ శాంతకు మర్యాదలు చేసినాడు. ఏవిధంగా అంటే - "**అంత కౌసల్యయు వచ్చిశాంతను కౌగిలించుకొని ముద్దాడే. తల్లి నీవు వచ్చితివి నా బరువు తీరినది. మంగలహారతి పళ్ళెము పట్టుటకు, తమ్ముని దిద్దుకొనుటకు ఆడపడుచు వచ్చితివని పొంగిపోయెను**." (బాల, ధనస్సు-351)

ఈ విధంగా శాంత కనుసన్నలలోనే ఆమె ఆజ్ఞతోనే వివాహామంతా జరిగిందట. కళ్యాణ మంటప వర్ణనలో తెలుగుదనం వెల్లువిరిసింది. "**నాలుగు వైపులా పండిన గెలలతో కూడిన అరటి స్తంభాలు కట్టినారట. పచ్చిమామిడాకు తోరణాలు, రత్నమాణిక్య దీపతోరణాలు, లాజాపూర్ణములైన అరవేణి కుండల వరుసతో కళ్యాణ మంటపం చూడముచ్చటగా ఉందట.**" (బాల-కళ్యాణ 71)ఈ విధంగా విశ్వనాథ తెలిగింటి ఆచారవ్యవహారాలను వివాహ వేడుకలను రమణీయంగా వర్ణించారు.

## 8. ముగింపు:

ఈ బాలకాండలోని ప్రతిఘట్టం, పాత్రల సహజస్థితి వర్ణనలతో, తెలుగింటి ఆచారవ్యవహారాలతో నిక్షిప్తమైంది. అలనాటి అయోధ్యలోని పౌరుల మనఃస్థితిని, దశరథుని పుత్రవాత్సల్యాన్ని, విశ్వామిత్ర గురుత్వాన్ని, ధనుర్భంగ ఘట్టాన్ని, శ్రీ సీతారాముల పెండ్లి వేడుకలను వారి అన్యోన్య దాంపత్యమును విశ్వనాథ రమణీయంగా, కమనీయంగా కళ్ళకు కట్టినట్లు వర్ణించి ఈ బాలకాండను రమ్యరమణీయ దృశ్యకావ్యంగా మలిచారు. రామాయణ కథా పరంగా వర్ణించబడిన ఈ విశేషాల ద్వారా ఆదర్శసమాజ సంప్రదాయ విలువలను ముందు తరాలకు అందించే సదుద్దేశం అభివ్యక్తమవుతుంది.

## 9. ఉపయుక్తగ్రంథసూచి:


1.రామారావు, ఎస్వీ-2011, విశ్వనాథ సాహితీ దర్శన, పసిడి ప్రచురణలు, హైదరాబాద్.

2.సత్యనారాయణ, విశ్వనాథ, 2015, శ్రీమద్రామాయణ కల్పవృక్షం – బాలకాండం, విశ్వనాథ పబ్లికేషన్స్.

3.విశ్వనాథ శారద ప్రథమ భాగం, 1982, ప్రచురణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ స్మారక సమితి, హైదారాబాద్

4.విమర్శిని, పరిశోధన పత్రిక, జనవరి1977, తెలుగువిభాగం (కాకతీయ విశ్వవిద్యాలయం)

5.శ్రీనివాస, పాణ్యం, 2000, రామాయణ కల్పవృక్షం తెలుగుదనం, పాణ్య పబ్లికేషన్స్, కర్నూల్.

6.1995, విశ్వనాథ సాహితీ సమాలోచనం, యువభారతి ప్రచురణ, తిలక్ రోడ్, హైదరాబాద్.


***


AUCHITHYAM
ISSN: 2583-4797
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_26.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 26. 'సుధామూర్తి' రామాయణకథలు: వ్యక్తిత్వవికాసం

**డా. పప్పుల శైలజ**

తెలుగు సహాయాచార్యులు,

ఆంధ్రభాషాభివర్ధిని ప్రభుత్వ డిగ్రీ కళాశాల,

జనగామ, తెలంగాణ.

సెల్: +91 9290075488. Email: agresssailaja@gmail.com

**వ్యాససంగ్రహం:**

*మనం ఆచరించవలసిన ఆదర్శాలకు నిలువుటద్దం రామాయణం. ఇది కేవలం భారతీయుల ఆధ్యాత్మికగ్రంథమే కాదు, పూర్వకాలంలో వర్తకంమూలంగా మనపొరుగుదేశాలైన మయన్మార్, ఇండోనేషియా, కంబోడియా, మంగోలియా, వియత్నాం, లావోస్, థాయిలాండ్, చైనా మొదలైన దేశాలకు విస్తరించి అక్కడి వారిచే ఆకర్షించబడి వారి మన్ననలను పొంది వారి సంస్కృతిలో భాగమైంది. పొరుగు దేశాల అభిరుచులు, ఆచార వ్యవహారాలకు అనుగుణంగా రామాయణ కథనంలో కొన్ని మార్పులు జరిగినప్పటికీ అక్కడా రాముడు ఆదర్శపురుషుడుగానే కొలువబడుతున్నాడు. అంతటి మహోన్నతగ్రంథాన్ని యువతకు అందించాలన్న ఉద్దేశంతో సుధా మూర్తి సూర్యవంశ రాజుల చంద్రవంశ రాజుల కథలను (ది అప్ సైడ్ డౌన్ కింగ్) త్రిశంకు రాజుగా మన ముందుకు తీసుకువచ్చారు. ఈ కథలలో పేర్కొన్న వారందరూ జ్ఞాన, శక్తి సంపన్నులైనప్పటికీకొందరు ఆదర్శ పురుషులుగా, మరికొందరు చరిత్రహీనులుగా ఏగుణాల వల్ల మిగిలిపోయారో తెలియజేస్తూ,వ్యక్తిత్వ వికాసానికి సంబంధించిన అంశాలను ప్రస్తావించడం ఈ వ్యాసం ముఖ్య ఉద్దేశం. రామాయణ సంబంధ కథలు మాత్రమే వ్యాస పరిధి.*

**Keywords:** వాగ్దానం, అకుంఠిత దీక్ష, ధర్మ పరిరక్షణ,అహంకారం,స్థితప్రజ్ఞత, సుధా మూర్తి, త్యాగశీలి.

## 1. ఉపోద్ఘాతం:

**"చలంతిగిరయః కామం/ యుగాంత పవనాహతాః**

**కృ చ్ఛ్రేపి న చలత్యేవ/ ధీరాణా నిశ్చలం మనః"**[1]

ప్రళయకాలంలో పెనుగాలులు వీచినప్పుడు పర్వతాలు కూడా చలించిపోతాయి. కాని, ఎంతటి కష్టంలోనూ ధీరుల మనస్సు చలించనే చలించదు. ఎందరో ధీరుల కథలు కలిగిన రామాయణం భారతీయ ధర్మాలకు ప్రతీక.

తొలి మహిళ ఇంజనీర్, పారిశ్రామికవేత్త, మానవత సమతా భావన సామాజిక స్పృహ మేళవించుకున్న పర్యావరణవేత్త, బాలలలో/ యువతలో రానురాను తరిగిపోతున్న కుటుంబ, నైతిక విలువలు, దేశభక్తి, ఆధ్యాత్మిక భావాలను పునరుజ్జీవింపజేసే అకుంఠిత దీక్షతో భావి తరాలను తీర్చిదిద్దే పవిత్ర అధ్యాపక వృత్తిలో రాణించిన గొప్ప మహిళ. రచయిత్రిగా బహుముఖ ప్రజ్ఞాశీలి. ఇటీవలే కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు పొందిన పద్మభూషణ్ సుధా మూర్తి గారు పుంఖానుపుంకంగా కన్నడంలో, ఆంగ్లంలో కొనసాగించిన వారి సుదీర్ఘసాహితీ ప్రస్థానం ఎంతో విలక్షణమైనది. వీరి కలం నుండి జాలు వారినది అప్ సైడ్ డౌన్ కింగ్ఆంగ్ల పుస్తకాన్ని త్రిశంకు రాజుగా తెలుగులోనికి ప్రముఖ బాల సాహితీవేత్త, రేడియో అక్కయ్యగా తెలుగు వారందరికీ సుపరిచితమైన ముంజులూరికృష్ణకుమారి అనువదించారు.

ఈ పుస్తకంలోని సూర్య వంశీయులకథల నుండి స్థిరమైన గమ్యం, కచ్చితమైన మార్గం, ప్రయత్నంలో ఎలాంటి రాజీపడని తత్వం, ఎట్టి పరిస్థితులలోనూధర్మం తప్పని స్థితప్రజ్ఞులైనటు వంటి వారి గాథలు,ఎంతటి శక్తి సామర్థ్యాలు కలిగి ఉన్నా అహంకారం ఎలా వినాశనానికి దారితీస్తుందోతెలియజేసే కథలు, దశముఖ జ్ఞాని అయినా దురహంకారం, స్త్రీ లోలత్వం ఎలా పతనానికి, వంశ నాశనానికి కారణమైందోతెలియజేసే కథలుఇలా మనలో వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేసే అనేక కథలను సుధా మూర్తి ఇందులో రాశారు.

## 2. దిలీపుడు:

దిలీపుడుఇక్ష్వాకు వంశ రాజు. నందిని అనే గోవును భార్యా సమేతంగా సంరక్షిస్తానని గురువైన వశిష్టునికి మాట ఇస్తాడు. ఇచ్చిన మాట ప్రకారం నిబద్ధతతో ఆ గోవును సంరక్షించడానికి రాచకార్యాలు ఆటంకం కలిగిస్తాయని, రాచనగరికి దూరంగా అరణ్యాలలో ఒక పర్ణశాలలో ఉంటూ నందినికి ప్రతినిత్యం స్నానం చేయించడం, మేతకు తీసుకువెళ్లడం, గోశాలను శుభ్రపరచడం, పాలు పితకడం మొదలైన పనులన్నీ భార్య సుదక్షిణ సహితంగా స్వయంగా చేయసాగాడు అలా కొంతకాలం గడిచాక ఒకనాడు మేతకు వెళ్ళిన నందిని పై ఒక సింహం దుముకబోతుంది. అప్పుడు బాణాలు సంధించి నందిని ముందు నిలబడి రక్షిస్తాడుదిలీపుడు.

జంతువులు ఆహారంగా జీవించడం తమ జాతి ప్రకృతి సహజ గుణమని, ఒక ఆవు మరణిస్తే మరో ఆవును పొందగలుగుతామని, నీవు గొప్ప వీరుడవు, నీ రాజ్యానికి సంపద వంటి వాడివి, నీవు మరణిస్తే ప్రజలు అనాథలవుతారు, రాజ్యానికి ముప్పువాటిల్లుతుందని ఎన్నో రకాలుగా మానవ స్వరంతో ధర్మోపదేశాలు చేస్తుంది సింహం. ఆ మాటలలో నిజాన్ని గ్రహించినప్పటికీ గురువు గారికి చేసిన వాగ్దానానికి కట్టుబడి ప్రాణ త్యాగం చేసి నందిని రక్షించడానికే సిద్ధపడతాడు. ఆడిన మాట కోసం ప్రాణత్యాగానికి సిద్ధపడిన త్యాగశీలిదిలీపుడు.

ఈ కథద్వారా గోసంరక్షణ, గురుభక్తిఅనాదిగా వస్తున్న మన సత్సంప్రదాయాన్నిపిల్లలకు పరిచయం చేసారు సుధా మూర్తి.

### 3. భగీరథుడు:

భగీరథుడు తన పూర్వీకులు కపిల ముని శాపం వలన బూడిదగా మారిన వైనం, వారు స్వర్గానికి చేరుకోవాలంటే వారిపైనుండి గంగ ప్రవహించాలన్న విషయం తెలుసుకొని వారికి ఎలాగైనా ముక్తి ప్రసాదించడానికి పూనుకుంటాడు. మొదట విష్ణుమూర్తిని ప్రార్థించి ఆ దేవదేవుని ద్వారా గంగాదేవిని ప్రార్థిస్తే కార్యం సుగమవుతుందని తెలుసుకొని, గంగను గూర్చి ఘోరతపస్సు చేస్తాడు. గంగాదేవి భగీరథుడుకఠోర దీక్షతో చేసే తపస్సుని మెచ్చుకొని విష్ణుమూర్తి పాదాల వద్ద జన్మిస్తుంది. కానీ తన వేగాన్ని భూమి తట్టుకోలేదని శివుడు మాత్రమే తనను భరించగలడని తెలుపుతుంది. భగీరథుడు మళ్లీ శివుని గూర్చి కఠినమైన తపస్సు చేసి మెప్పించి గంగను శివుని జటాజూటంలో బంధించే విధంగా ఒప్పిస్తాడు. శివుడు ఎంతో పట్టుతో గంగను బంధించి ఒక పాయను మాత్రమే భూమిపైకి వదులుతాడు. అయినప్పటికీ గంగ వేగానికి యజ్ఞం చేస్తున్న జహ్నుముని ఆశ్రమం ధ్వంసం అవుతుంది అందుకు కోపించిన జహ్నుముని గంగను పుక్కిటబంధిస్తాడు. అందుకు ఎంతో విచారించిన భగీరథుడు మరలా జహ్నుముని,శివకేశవలను దీనంగా ప్రార్థిస్తాడు ఆ ప్రార్థనలకు కరిగిపోయిన ముని గంగను చెవుల ద్వారా వదులుతాడు. ఇన్ని ఆటంకాల తరువాత గంగానది భగీరథుని పూర్వీకుల చితాభ్యసమ్మపై ప్రవహించి వారు స్వర్గానికి వెళ్తారు.

భగీరథుడు తాను పూనినకార్యం నెరవేరేవరకు ఎన్ని ఆటంకాలు ఎదురైనా నిరాశ దరిచేరనీయకుండా, నిర్విరామంగా కృషి చేసాడు. కఠోర శ్రమ, సాధించాలన్న కృత నిశ్చయం, పట్టుదల ఉంటే సాధించలేనిది ఏదీ లేదని సుర గంగనుభూమార్గం పట్టించి నిరూపించి అందరికీ ఆదర్శమైనాడుభగీరథుడు. నేటికీ కష్ట సాధ్యమైన పనులను సాధించినటువంటి వారిని అపర భగీరథుడుఅంటూపొగడడం మనం చూస్తూనే ఉంటాం. భగీరథ ప్రయత్నానికి సాటి భగీరథ ప్రయత్నమే కానీ మరొకటి లేదు అని లోకంలో స్థిరపడిపోయింది.

ఈ కథలో సుధామూర్తి గొప్ప కార్యాలు సాధించి చరిత్రలో చిరస్థాయిగా నిలవాలంటే ఒక మంచి పనికి పూనుకున్నప్పుడు సహజంగానే ఎన్నో ఆటంకాలు ఎదురౌతాయని, ఆటంకాలకు వెరచి మధ్యలో వదిలివేయకూడదని చెప్పేరు.

**ధీరుల్విఘ్ననిహన్యమానులగుచుధ్రుత్యున్నతోత్సాహులై**
**ప్రారబ్ధార్థములుజ్జగింపరుసుమీప్రజ్ఞానిధలల్గావునన్**[2]

ఏదైనా పని మొదలు పెట్టినపుడు ఎన్ని అడ్డంకులు ఎదురయినా భయపడక చివరివరకు లక్ష్యం కోసం శ్రమించడమే కార్య సాధకుడి లక్షణం, అలాంటి లక్షణాలను చిన్న నాటి నుండే అలవాటు చేసుకునే దిశగా పిల్లల్లో స్ఫూర్తిని కలిగించే విధంగా రాసారు.

### 4. హరిశ్చంద్రుడు:

హరిశ్చంద్రుడు సూర్యవంశరాజు. ఒకరోజుదేవలోకంలో దేవతల, ఋషుల సమక్షంలో లోకాలన్నింటిలోను రుజుమార్గంలో వర్తించే ధర్మప్రభువుగా, ఆయనకు సాటి ఎవరూ లేరనిహరిశ్చంద్రుని వశిష్ఠుడు కీర్తించ సాగాడు. ఎప్పటి నుండోవశిష్ఠునితో వైరం కలిగిన విశ్వామిత్రుడు వశిష్ఠుని నమ్మకాన్ని తప్పని నిరూపిస్తానని పందెం కాస్తాడు.

విశ్వామిత్రుడు, హరిశ్చంద్రుని పరీక్షించేందుకు సృష్టించిన దున్న పల్లెల మీద పడి పొలాలను నాశనం చేస్తుంటుంది. ప్రజలను కాపాడేందుకు అడవిలోనికి వెళ్లిన హరిశ్చంద్రుడు అడవి దున్ననుసరిస్తూ దారి తప్పి ఒక ఆశ్రమంలోనికి వెళతారు. అలసిపోయిన హరిశ్చంద్రుని ఇద్దరు యువతులు పరిచర్యలు చేసి సేదతీరుస్తారు. అందుకు ప్రతిగా వారిద్దరికీ నగరానికి వెళ్ళిన తరువాత కానుకలు పంపుతానంటాడు హరిశ్చంద్రుడు. కానీ ఆ ఇద్దరు యువతులు అందుకు అంగీకరించక తమని వివాహమాడమంటారు. అప్పటికేతనకువివాహమయిందని, భార్య కొడుకు ఉన్నారని మరలా వివాహమాడడం అధర్మమని వారికి నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తాడు హరిశ్చంద్రుడు. అంతలో అక్కడికి వచ్చిన విశ్వామిత్రుడు తన అనుమతి లేకుండా తన ఆశ్రమంలో ప్రవేశించడమే కాకుండా తన కుమార్తెలను అవమానిస్తున్నావని వారి కోరికలను మన్నించి తప్పుదిద్దుకోమని హెచ్చరిస్తాడు. అందుకు అంగీకరించని హరిశ్చంద్రుడు రాజ్యానైనా త్యజిస్తాను కానీ ధర్మ వ్యతిరేకంగా ప్రవర్తించనంటాడు. ఆ అవకాశం కోసమే ఎదురు చూస్తున్న విశ్వామిత్రుడు వెంటనే రాజ్యాన్ని ఇచ్చేయమంటాడు. వేరు ఆలోచన లేకుండా హరిశ్చంద్రుడు మునికి రాజ్యాన్ని ధారపోస్తాడు అంతటితో తృప్తి చెందని విశ్వామిత్రుడు దక్షిణ ఇవ్వని దానం అసంపూర్ణమని ఒక పొడవాటి మనిషి ఏనుగు మీద నిలబడి ఒక నాణెం విసిరితే ఎంత ఎత్తైతే ఉంటుందో అంత బంగారం కావాలంటాడు. అందుకు అంగీకరించి, తనకు కొంత సమయం కావాలని భార్యాబిడ్డలతోకట్టుబట్టలతో సంపదను రాజ్యాన్ని వదిలి, ఆ రోజుల్లో సంపన్నప్రాంతంగా పేరు పడ్డ కాశీ నగరానికి పయనమవుతాడు. భర్త నిర్ణయాన్ని సమర్థిస్తూ చంద్రమతి ఆయనను అనుసరిస్తుంది. కాశీనగరం చాలా దూరం ప్రాంతమని తిరిగి రావడానికి చాలా కాలం పడుతుందని ఒకవేళ తిరిగి రాకపోతే? అన్న అనుమానంతో విశ్వామిత్రుడు తన శిష్యుడైన నక్షత్రకుని వారి వెంట పంపుతూ ఈ మాసాంతానికే తనకు బంగారం ఇవ్వవలసిందిగా ఆజ్ఞాపిస్తాడు. నక్షత్రకుడు ఎన్ని ఇబ్బందులకు గురిచేసినా చంద్రమతి, కుమారుడు లోహితాస్యుడుహరిశ్చంద్రునికిబాసటగా, దృఢ నిశ్చయంతో, ధర్మ నిరతితో ఉంటారు. చంద్రమతిని భయపెట్టి హరిశ్చంద్రుడు మాట తప్పే విధంగా చేయాలని

విశ్వామిత్రుడు మాయా దొంగలను,మృగాలను, తుఫానును, వరదలను, గాలి వానను సృష్టిస్తాడు. చంద్రమతి కాశీ విశ్వేశ్వరుని జపిస్తూ ఆ భ్రమలకు,మాయలకు భయపడకుండా ముందుకు సాగుతుంది.

హరిశ్చంద్రుడు కాశీ నగరంలో భార్యాబిడ్డలను ఒక ముదుసలికి ఇంటి పనులు చేయడానికి గాను అమ్మి వేస్తాడు.ఇంకా ఇవ్వవలసిన ధనంకోసం తనను తాను వీరబాహునికి, మణికర్ణికఘట్టానికి కాపరిగా అమ్ముడుపోయి విశ్వామిత్రునికి ఇవ్వ వలసిన ధనం చేకూర్చి, తాను ఇచ్చిన మాట నిలబెట్టుకోగలిగినందుకు సంతోషిస్తాడు.ఇన్ని ఇబ్బందులకు గురిచేసిన ఆడిన మాట నిలబెట్టుకోవడానికే కట్టుబడి ఉన్న ఆ కుటుంబాన్ని చూసి సంతృప్తి చెందని విశ్వామిత్రడు వారిని ఇంకా ఇంకా కష్టాలకు గురి చేస్తూనే ఉంటాడు.

ఒకనాడు అడవికి వెళ్ళిన లోహితాస్యుడు విశ్వామిత్రుడు సృష్టించిన పాముకాటుతో మరణిస్తాడు. పుట్టెడు దుఃఖంతో చేతిలో చిల్లిగవ్వ లేకుండా చనిపోయిన కుమారుని స్మశానానికి తీసుకువెళుతుంది చంద్రమతి. కానీ కాటికాపరి సుంకం కట్టకుండా దహనక్రియలు జరపడానికి అంగీకరించడు. తాను కడుపేదరాలినని చెల్లించడానికి తనవద్దఏమీలేదని, ఆ కార్యక్రమం నిర్వహించడానికి అనుమతించమని ప్రార్థిస్తుంది చంద్రమతి. తనకు చెల్లించాల్సిన సొమ్ముకు గాని ఆమె మెడలోని మంగళసూత్రాలను అమ్మి డబ్బు ఇమ్మంటాడు కాటికాపరి. చంద్రమతి మంగళసూత్రాలు కాశి విశ్వనాథునికి, ఆమె భర్తకు తప్ప ఎవరికీ కనిపించవని ఆ కాటికాపరిని తన భర్తగా గుర్తిస్తుంది. భార్యాభర్తలిద్దరూ కుమారుని మరణానికి కన్నీరు మున్నీరుగా విలపిస్తారు. తన కొడుకే అయినప్పటికీ సొమ్ము చెల్లించకుండా దహన క్రియలు చేయడానికి హరిశ్చంద్రుడు అంగీకరించడం.చేసేదిలేక ఏదో విధంగా యజమానివద్ద ఆ సొమ్ము తేవడానికి బయలుదేరుతుంది చంద్రమతి. మార్గమధ్యలో దొంగలు అపహరించి చంపివేసిన కాశీ యువరాజు శవం నేలపై పడి ఉండడం చూసి, తన కుమారుడేనని భ్రమించి ఆ శవం తలను ఒడిలో పెట్టుకుని దుఃఖిస్తుంది. యువరాజును వెతుకుతూ వచ్చిన భటులు ఆ దృశ్యాన్ని చూసి రాకుమారుని చంపింది చంద్రమతని భావించి రాజు గారి వద్దకు తీసుకువెళ్తారు. రాజు ఆమె గోడు వినకుండా యువరాజును చంపిన రాక్షసిగా భావించి శిరచ్ఛేదంగావించమని ఆజ్ఞాపిస్తాడు. భటులు చంద్రమతిని మణికర్ణికా ఘట్టానికి తీసుకపోయి హరిశ్చంద్రుని శిక్ష అమలు జరుపమంటారు. చంద్రమతి ఆ హత్య చేయలేదని తెలిసినప్పటికీ రాజాజ్ఞను పాటించడం తన విధిగా భావించి బాధాతప్త హృదయంతో కళ్ళు మూసుకొని ఆ పని చేయడానికి పూనుకుంటాడు.

ఆశ్చర్యకరంగా అప్పుడు ఆకాశం నుండి పూల వర్షం కురుస్తుంది. లోహితాస్యుడు నిద్ర నుండి లేచినట్లుగా లేచి వస్తాడు. కాశీరాజు కుమారుడు సజీవుడవుతాడు. విశ్వామిత్రుడు నక్షత్రకునితో సహా ప్రత్యక్షమై నీకు పెట్టిన కఠినమైన పరీక్షలను కోపం, పశ్చాత్తాపం లేకుండా ఎదుర్కున్నావు. నిజమైన ధర్మాచరణ చేసే ప్రభువుగా ఆ కాశీనాథుని సాక్షిగా లోకం ఉన్నంత కాలం సత్యహరిశ్చంద్రునిగా కీర్తించబడతావని దీవిస్తాడు.

**ఎందరో భారతీయులలో స్ఫూర్తిని నింపిన కథ ఇది. తనను అత్యంత ప్రభావితం చేసిన కథగా గాంధీ సత్యశోధన[3] అన్న ఆత్మకథలో తెలుపుతాడు.** ధర్మాచరణలో ఎంతటి కఠోర పరీక్షలనైనాదృఢచిత్తంతో ఎదుర్కొన్న హరిశ్చంద్రుని కథ అందరికీ స్ఫూర్తిదాయకం.

**"కదర్థితస్యాపి హి ధీరవృత్తే:**
**న శక్యతేధైర్యగుణఃప్రమార్ష్టమ్,**
**అధోముఖస్యాపికృతస్యవహ్నేః**
**నాథోశిఖాఃయాంతికదాచిదేవ"[4]**

(ధీరుడయినవాడు ఎన్ని కష్టాలు వచ్చినా, దారిద్ర్యంతో బాధ పడుతున్నా, అతని ధైర్యగుణాన్ని తుడిచి పెట్టడం సాధ్యంకాదు. నిప్పునుతలకిందులుగా వంచినా మంటలు ఎన్నటికీ కిందికిపోవుకదా)

ఆదర్శవంతమైన యువతరాన్ని తయారు చేయడమే ప్రధానంగా ఉన్న సుధామూర్తి మహోన్నతమైన ఆదర్శాలు కలిగిన సత్య హరిశ్చంద్రుని పరిచయం చేసి,జీవితంలో ఎదురయ్యే అనేకానేక దుర్భర పరిస్థితులకు లొంగి ధర్మాచరణకు దూరం కాకూడదనే సందేశాన్నందించేఈ కథను సూటిగా సరళమైన భాషలోపిల్లలను ఆకట్టుకునే శైలి చెప్పారు రచయిత్రి.

## 5. రఘుమహారాజు:

కౌస్తేయుడు శ్రద్ధగా అభ్యాసం చేసే అద్భుతమైన విద్యార్థి. అతడు పేదవాడు కావడం వలన ఎలాంటి గురుదక్షిణ ఆశించకుండా గురువుగారు విద్య బోధిస్తాడు. విద్యాభ్యాసం ముగిసిన తరువాత ఎంత వారించినా వినకుండా గురుదక్షిణ ఇవ్వకుండా చదువు ఫలించదన్న నమ్మకంతో ఏదో ఒకటి సమర్పించుకోవడానికి ఉవ్విళ్ళూరుతూ ఉంటాడు. కౌస్తేయుని బలవంతం వల్ల గురువుగారు విసిగిపోయి ఇవ్వగలిగితే పది లక్షల బంగారు నాణేలు ఇవ్వు, లేదంటే నా ఆశీస్సులు తీసుకొని నీ దారిలో నువ్వు వెళ్ళు అంటాడు గురువుగారు. అంత ధనం ఇవ్వమంటాడని ఊహించని శిష్యుడు, తన శక్తి కొద్దీ ప్రయత్నిస్తానని మీ ఆశీర్వాద బలంతో ఆ సొమ్మును తెచ్చి మీకు ఇస్తానని,పరిపరి విధాల ఆలోచిస్తూ బయలుదేరుతాడుకౌస్తేయుడు.

రఘుమహారాజు తనకు తప్పక సహాయం చేస్తాడని రాజభావనానికి వెళ్లి తన రాకకు గల కారణం చెబుతాడు. అప్పుడే యజ్ఞం పూర్తి చేసి ఉన్నదంతా దానధర్మాలు చేసిన రఘు మహారాజు కొంత వ్యవధి ఇస్తే ఆ ధనం తప్పక సమకూరుస్తానని మాట ఇచ్చి, అంత సొమ్ము ఎక్కడి నుంచి తేగలనా అని ఆలోచించి, కుబేరుని వద్ద మాత్రమే అంత సొమ్ము ఉంటుందని, తాను రాజు కాబట్టి యాచించలేడు కనుక కొంత సైన్యంతో కుబేరుని పైకి దండయాత్రకు వెళ్తాడు. అసలు విషయం వేగుల ద్వారా తెలుసుకున్న కుబేరుడు రఘు మహారాజు సమీపంలో ఉన్న శమీ వృక్షం ఆకులన్నింటినీ బంగారు నాణేలుగా మారుస్తాడు. అది కుబేరుని మాయగా గ్రహించి, రాజు

నిరాడంబరంగా ఎలాంటి భవబంధాలకు లోను కాకుండా జీవించాలని ఆ వృక్షం నుండి కేవలం పది లక్షల బంగారు నాణేలను మాత్రమే తీసుకునికౌస్తేయునికిస్తాడు.

బహుశా ఈ కథ స్ఫూర్తితోనే మారద వెంకయ్య భాస్కర శతకంలో **దానము సేయకోరినవదాన్యునకీయగ శక్తి లేనిచో/నైనపరోపకారమునకై ఒక దిక్కునతెచ్చియైన ఈ/ బూనును**[5] అనే పద్యం రాసి ఉంటాడు. తనను ఆశ్రయించిన వారిని నిరాశ పర్చకుండా ఇతరులకు సాయం చేయడమే ధ్యేయంగా భావితరాలకు ఆదర్శ పురుషుడిగా ప్రజలను కన్నబిడ్డలలా పాలించి వారి అవసరాలను తీరుస్తూ నిరాడంబరంగా జీవించాడు కాబట్టే వంశకర్తగా నిలిచాడు రఘు మహారాజు.

ఈ కథలోప్రతిఫలం ఆశించకుండా సర్వవిద్యలూ నేర్పే గురువు, గురువుని దైవంగా పూజించి కృతజ్ఞత తెలియ చేయాలనుకునే శిష్యుడు, గురు శిష్యుల అన్యోన్యమైన సంబంధం, ప్రాచీన భారతీయ విద్యా వ్యవస్థను,రాజు ధన సంపాదన ప్రజోపయోగానికే కానీ స్వప్రయోజనానికి కాదనే సందేశాన్ని అందించడానికి రఘు మహారాజు కథ నుండికేవలంఈ ఘట్టాన్ని మాత్రమే పరిచేయంచేశారు సుధా మూర్తి.

### 6. రావణుడు:

రావణుడు కైకసివిశ్రవసుని కుమారుడు. తల్లి నుండి పితృవంశపు వైదిక నీతిని, యుద్ధ సూత్రాలను నేర్చుకుంటాడు.దశముఖ జ్ఞాని, చతుర్వేద జ్ఞానం, జ్యోతిషం, సంగీతం తెలిసినవాడు. పరమశివ భక్తుడు. బ్రహ్మ గూర్చి తపస్సు చేసి మూడు వరాలను పొందుతాడు. అందులో మొదటిది ఏ దేవుని చేతిలో మరణం సంభవించకుండా ఉండడం. రెండవది ఒక వేళ యుద్ధంలో తన తల కోల్పోతే మరోతల ఏర్పడడం. మూడవ వరం కామరూపంధరించగలగడం.

బ్రహ్మ వరాలతో గర్వితుడైన రావణుడు కుబేరుని వద్ద నుండి లంకానగరాన్ని, పుష్పకవిమానాన్ని లాక్కుంటాడు. ఒకనాడు శివపార్వతులను దర్శించడానికి కైలాసానికి వెళ్లి శివుని వాహనమైన నందిని చూసి బలహీనమైన ఈ ఎద్దు శివుని వాహనమా అంటూ నందిని అవహేళన చేస్తాడు. తనను అనరాని మాటలంటూ అవమానించిన దురహంకారి అయిన రావణుని జంతు జాతి పట్ల గౌరవం లేని నీవు, నీ జాతి కోతుల వల్ల నాశనం అవుతావని శపిస్తుంది. మరొకసారి సూర్యవంశానికి చెందినరాజుఅనారణ్యుని రాజ్యాన్ని జయించాలన్న కోరికతో రావణుడు అతడి పైకి యుద్ధానికి వెళతాడు. ఇరు సేనల మధ్య ఘోరయుద్ధం జరుగుతుంది. రావణ సేన దాటికిఅనారణ్యుని సేన నిలబడలేక పోతుంది. రావణుడు గట్టిగా కొట్టిన దెబ్బకు అనారణ్యుడు గాయపడి రక్తమోడుతూ నేల మీద పడిపోతాడు. రావణుడు అనారణ్యుని ఓయీ మూర్ఖరాజా! నేను ఎంత బలవంతుడినో నీకు తెలియదా? ముల్లోకాలలోనూ నన్ను ఓడించగలవారు లేరు. నన్ను నువ్వు ఎప్పటికీ జయించలేవు అంటూ కొన

ఊపిరితో ఉన్న రాజును దుర్మదాంధ్ధుడైవేళాకోళం చేస్తాడు. అప్పుడు అనారణ్యుడు నేనే గనుక సత్యసంధుడైన రాజునైతే నా వంశానికి చెందిన వాడు నీ చావుకు కారణమయ్యేలా దేవతలనుగ్రహిస్తారుఅని శపిస్తాడు.

ఒకనాడు రావణుడు పుష్పక విమానంలో విహరిస్తూ బృహస్పతి మనమరాలైన, తపోనిష్ఠలో ఉన్న వేదవతిని చూసి ఆమె అందానికి ముగ్ధుడై ఎంత వారిస్తున్నా వినకుండా తనను వివాహం చేసుకోమని వేధిస్తాడు. దానితో విసిగిపోయిన వేదవతి నేను మళ్ళీ జన్మలో నీ చావుకు కారణం అవుతానంటూ శపించి అంతర్ధానం అవుతుంది.

మరొక నాడు రావణుడు స్వర్గంలో తన అన్న కుబేరుని కొడుకు అయిన నలకూబరుని ప్రేయసి అని తెలిసి కూడా రంభను చూసి మోహించి ఆమెను తనతో తీసుకుపోవడానికి ప్రయత్నిస్తాడు. అది చూసిన నలకూబరుడు నిన్ను ఇష్టపడని స్త్రీని పెళ్ళాడాలని చూస్తే ఆ క్షణమే మరణిస్తావని శపిస్తాడు.

రావణుడు సీతను అపహరించి లంకకు తెచ్చినప్పుడు విభీషణుడు సీత అభీష్టానికి వ్యతిరేకంగా ఆమెను ఇక్కడ ఉంచడం అన్యాయమని వెంటనే పంపించి వేయమని హెచ్చరించినా, లంకిని, వానరం చేతిలో ఓటమిపాలైనప్పుడు ఇకలంకారాజ్యం పతనం తప్పదని సీతను విడిచిపెట్టి ఆమె భర్త వద్దకు పంపించి వేయమని హితవు చెప్పినా, కుంభకర్ణుడు కూడా సీతను వెనక్కి పంపమని సలహా చెప్పినా, కుటుంబ సభ్యులు శ్రేయోభిలాషులు ఎవరు ఎన్ని రకాలుగా చెప్పినప్పటికీ రావణుడు తనను ఎవరు ఓడించలేరని గట్టి నమ్మకంతో ఎవరి మాటా వినక చివరికి రాముని చేతిలో ప్రాణాలు వదిలాడు.

బ్రహ్మను మెప్పించి వరాలు పొందగలిగిన వాడు, శివుని ఆత్మలింగాన్నే సాధించగలతపశ్శక్తి కలిగిన వాడు అయిన ఆ రావణుడు దుర్మధాంధుడైశాపాలు పొంది, హితుల హితోక్తులని లెక్క చేయక తనతో పాటు తన వారందరి మరణానికి కారణమయ్యాడు. **పెక్కుభంగులు వివేక భ్రష్ట సంపాతముల్**[6] అని ఏనుగులక్ష్మణ కవి అన్నట్లుగా రావణుడు గొప్ప విద్వత్తు కలిగిన వాడైనప్పటికీ అహంకారం, స్త్రీ లోలత్వంతో వివేకాన్ని కోల్పోయిపతనమయ్యాడు.

ఈ కథలో రావణుని దశకంఠునిగా కాకుండా దశముఖ జ్ఞానిగా అంటే దశ దిశలలో ఏంజరుగుతుందో ఏకకాలంలో తెలుసుకోగలిగే వ్యక్తిగా, జ్ఞాన సంపన్నునిగా పరిచయం చేసారు. మన పురాణాలు పుక్కిటిపురాణాలగా కాకుండా వాటిలో ప్రస్తావించిన అంశాలు ప్రతీకలుగా హేతుబద్ధంగా చెప్పే ప్రయత్నం చేశారు సుధా మూర్తి. అంతే కాకుండా ఎంతటి శక్తి సామర్థ్యాలు ఉన్నప్పటివినయం, వివేకం ఉంటేనే అవి రాణిస్తాయని చెప్పడానికి ఈ కథను ఎంచుకున్నట్లు కనిపిస్తుంది.

## 7. ముగింపు:

**"We can give our children only two things in life which are essential. Strong roots and powerful wings. Then they may fly anywhere and live independently. Of all the luxuries in life, the greatest luxury is getting freedom of the right kind."[7]** అంటారు సుధా మూర్తి. బలమైన మూలాలు, శక్తివంతమైన రెక్కలతో పిల్లలు స్వేచ్ఛగా జీవించాలంటేసరైనభీజాలు చిన్ననాడే పడాలి. అందుకు మంచి పుస్తకాలుఎంతో దోహదం చేస్తాయి. ప్రాచీన భారతీయసాహిత్యమంతా వ్యక్తిత్వ వికాస సాహిత్యమే. రామాయణం, భారతం, భాగవతం, భగవద్గీత, వేదాలు, ఉపనిషత్తులు, శతకాలు, సుభాషితాలు, పంచతంత్ర కథలుమొదలైన సాహిత్యమంతా అంతర్లీనంగా మానవ జాతి సమగ్రప్రగతికి దోహదం చేసేందుకు తోడ్పడే గ్రంథాలు. వాటిలోని సారాన్ని నేటి తరానికి అందించడం ఎంతో అవసరం. త్రిశంకు రాజు కథల ద్వారా సుధామూర్తి ఆ పనే చేశారు. ఇలాంటి కథలు భావితరాలను ఆదర్శంగా తీర్చిదిద్దుతాయనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు.

## 8. పాదసూచికలు:

1. క్షేమీశ్వర–చండకౌశికము–చతుర్థాంకము.
2. ఏనుగు లక్ష్మణ కవి - సుభాషితములు –పరోపకార పద్ధతి 72 వ పద్యం.
3.మోహన్ దాస్ కరంచంద్ గాంధీ – సత్యశోధన -పుట 5.తెలుగు సేత–వేమూరి రాధ కృష్ణ మూర్తి.
4.భర్తృహరి– సుభాషితములు -ధైర్య పద్ధతి - 76 వ శ్లోకం.
5.మారద వెంకయ్య – భాస్కర శతకం - 55 వ పద్యం.
6.ఏనుగు లక్ష్మణ కవి - సుభాషితములు –మూర్ఖ పద్ధతి 9వ పద్యం.
7.Sudha Murty – How I taught my grandmother to read and other stories P.No.130- 131.

## 9. ఉపయుక్తగ్రంథసూచి:


1. లక్ష్మణ కవి ఏనుగ. భతృహరినీతిశతక. శ్రీ వేంకటేశ్వర బుక్ డిపో, 2012.
2. వరలక్ష్మిభావరాజు. రామాయణ కథా సుధా ఒకటి రెండు భాగాలు. భావరాజు వరలక్ష్మి 2015
3. విజయభారతి.బి. షట్చక్రవర్తులు. హైదరాబాదు బుక్ ట్రస్ట్ -2015
4. సిమ్మన్న, వెలమల. తెలుగు సాహిత్య విమర్శ సిద్ధాంతాలు, దళిత సాహిత్య పీఠం, విశాఖపట్నం, 2009.
5. సుధామూర్తి. త్రిశంకు రాజు కథ (తెలుగు అనువాదం –ముంజులూరి కృష్ణకుమారి), అలకనందా ప్రచురణలు
6. SudhaMurty. The Upside-Down King: Unusual Tales about Rama and Krishna, Penguin Random House India Private Limited.


***



AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_27.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 27. పురిపండ అప్పలస్వామి రామాయణం: శాస్త్రవిజ్ఞానం

**డా. శీలం ఇందిర**

తెలుగు ఉపన్యాసకురాలు,

ప్రభుత్వ డిగ్రీ కళాశాల,

మధిర, ఖమ్మం జిల్లా, తెలంగాణ.

సెల్: +91 9553359879. Email: seelamindira1981@gmail.com

**వ్యాససంగ్రహం:**

*ఆదికావ్యమైన వాల్మీకి రామాయణాన్నితెలంగాణకు చెందిన ప్రముఖ రచయిత శ్రీ పురిపండ అప్పలస్వామి వ్యవహారిక భాషలోవచన రూపంలో ఆంధ్రీకరించారు.ఆ రామాయణంలో జ్యోతిష్యశాస్త్రసంబంధమైనవైజ్ఞానిక విషయాలు ఎన్నోఉన్నాయి. శ్రీరామ జననం మొదలుకొని ఉత్తరకాండ లోని శ్రీరాముని వైకుంఠ గమనం వరకు అడుగడుగునా వాస్తు, జ్యోతిష్య, శకున, సాముద్రిక శాస్త్ర రహస్యాలను కవి తెలియజేశారు. వాటిని ఈ వ్యాసంలో చర్చించటం జరిగింది. జ్యోతిష్య శాస్త్రాన్ని 18 మంది ఋషులు వివిధ రకాలుగా వ్యాప్తి చెందించారని ప్రసిద్ధి. అత్యంత ప్రాచీన కాలం నుండి జ్యోతిష్య శాస్త్రం పై పరిశోధనలు జరుగుతున్నందువల్ల ఈ శాస్త్రాన్ని గూర్చిన ఎన్నో గ్రంథాలు వేరువేరు విభాగాల్లో వెలువడ్డాయి. ఇవి దాదాపు క్రీపూ 1400 నుండి క్రీశ 1866 మధ్యకాలంలో వచ్చినవి. ఇంకా ఆధునిక కాలంలో వ్యాఖ్యానాల రూపంలోనూ, వేరువేరు విషయాల సమాహారంగానూ, ప్రత్యేక పరిశీలనలతోనూ, కూడుకున్న గ్రంథాలు వేరువేరు భాషల్లో పుంఖాను పుంఖాలుగా వెలువడుతూనే ఉన్నాయి. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఎంఏ జ్యోతిష్యం పుస్తకాలు, సాగి కమలాకర శర్మ గారి జ్యోతిష్య కమలాకరం,సి.వి.బి. సుబ్రహ్మణ్యం గారి అంతర్యామి,పురిపండా అప్పలస్వామి గారి వాల్మీకి రామాయణం యధాతధానువాదం ద్వారా విషయ సేకరణ చేయటం జరిగింది. ఈ పరిశోధనలో పౌరాణిక విమర్శ పద్ధతిని అనుసరించటం జరిగింది.*

**Keywords:** పురిపండ అప్పలస్వామి, రామాయణం, జ్యోతిష్యం, వాస్తు, శకునాలు, సాముద్రికం, త్రిజట.

## 1. ఉపోద్ఘాతం:

రామాయణం ఆదికావ్యం. అత్యంత పూజ్యనీయమైనది. జ్యోతి అంటే కాంతి. వేదాలలోనే జ్యోతిషాంశాలు చాలా ఉన్నాయి. వేదం అంటే జ్ఞానమే! జ్ఞానవంతమైన విషయాలను జ్యోతిష్య శాస్త్రం తెలియజేస్తుంది. ఎన్నో జ్యోతిష శాస్త్ర రహస్యాలు రామాయణం లో ఉన్నాయి. వాస్తు, శకునం, సాముద్రికం, మొదలైనవన్నీ జ్యోతిష్య శాస్త్ర అంతర్భాగ విషయాలు, వాటిని ఈ వ్యాసంలో చర్చించటం జరిగింది.

**2. వాస్తు:**

వస్తుగతమైనది వాస్తు.ఈ ప్రకృతిలో భూమిపై ఆనందంగా ఆరోగ్యంగా నివసించడానికి ఒక ప్రత్యేకమైన సదుపాయాలు కలిగి ప్రకృతి శుభ, అశుభ కిరణాలకు, భూఅయస్కాంత తరంగాలకు అనువుగా జీవనం సాగిస్తే అది వ్యక్తి అభివృద్ధికి హేతువవుతుంది. ప్రకృతికి వ్యతిరేకమైన జీవనం పతనం చేస్తుంది అనుకూలమైతే ఆనందాన్నిస్తుంది ఈ విషయాలకు శాస్త్రీయమైన రూపమే వాస్తు శాస్త్రం.[1]

ప్రస్తుత కాలంలో దీనిపై అత్యంత శ్రద్ధ పెరిగి ఇంటీరియల్ డెకరేషన్ ఆర్కిటెక్చర్, వాస్తు ఇంజనీరింగ్ విభాగాలుగా అధ్యయనం చేస్తూ నూతన అంశాల ఆవిష్కరణకు ప్రయత్నం చేస్తున్నారు.నేటి కాలంలో కూడా ఏదైనా గృహాన్ని కానీ మండపాన్ని కానీ దేవాలయాన్ని కానీ నూతనంగా నిర్మించే సమయంలో దేవతా వృక్షాల నుంచి శంఖులను తయారుచేసి స్థాపించటం చూస్తున్నాము.

రామాయణ కాలంలోనే అవి ఉన్నట్లుగా ఆధారాలు ఉన్నాయి. రామాయణం బాలకాండ పద్నాలుగవ సర్గలో దశరథ మహారాజు అశ్వమేధ యాగాన్ని చేయించే సమయంలో యజ్ఞవేదికను శాస్త్రం ప్రకారం నిర్మిస్తాడు. ఆ సమయంలో మారేడు, చంద్ర మోదుగు,చేవ, దేవదారు మొదలైన వృక్షాల కర్రలతో ఇరవై ఒక్క యూపస్తంభాలను చేయిస్తాడు.[2] ప్రతి యూపము ఎనిమిదేసి అంచులు పెట్టించి శాస్త్రంలో చెప్పిన దాని ప్రకారం చేయిస్తారు. యజ్ఞ వాటికలో అగ్ని వేదికకు ఉపయోగించే ఇటుకల కొలతలు కూడా శుల్బకర్మ నిపుణులైన బ్రాహ్మల చేత దగ్గరుండి దశరధుడు చేయిస్తాడు.

నేటి కాలంలోగృహప్రవేశాలు కానీ ఇంట్లో ఏదైనా శుభకార్యాలు తలపెట్టేటప్పుడు ఇల్లంతా వాస్తు ప్రకారం లక్ష్మీప్రదంగ అలంకరించటం శుభప్రదమని భావిస్తున్నాం. పువ్వులు, చందనం, పసుపు కుంకుమలు, కన్యలు, ముత్తైదువులు, గోవులు పాలు,జలబిందలు,పిండివంటలు,బ్రాహ్మణులు,తోరణాలు మొదలగు వస్తువులను శుభప్రదాలుగా భావించి వాటిని శుభకార్యాలలో విశేషంగా వినియోగిస్తూ ఉంటాము. శాంతి కోసం రకరకాల దానాలు చేయటం ఇప్పటికీ చూస్తుంటాము.

సీతారాముల వివాహ సమయంలో అగ్ని ప్రదక్షణ చేయటం కోసం శాస్త్ర ప్రకారం వేదిక నిర్మించారు. బంగారు పాలికలు, మట్టు లేని పాత్రలు,మూకుళ్లు, ధూపాలతో ధూప పాత్రలు, శంఖ పాత్రలు, అర్ఘ్య జల పాత్రలు, పేలాల పాత్రలు, అక్షతలు, పువ్వులు,శృక్ సృవాలు ఇవన్నీ సిద్ధం చేసి పెడతారు.[3] నిప్పు రగిలించి శాస్త్ర ప్రకారం మంత్ర పూర్వకంగా సమానమైన ధర్భలు పరిచి వేదమంత్రాలతో హోమం చేస్తారు.

రామాయణంలో రాముడికి పట్టాభిషేకం జరగటానికి ముందు వాస్తు శాస్త్ర సాంప్రదాయాల రీత్యా అయోధ్య నగరాన్ని మొత్తం ఎంతో చక్కగా మామిడి తోరణాలు, పూలదండలు, సుగంధ ద్రవ్యాల కళ్ళాపితో, పువ్వుల ముగ్గులతో అలంకరిస్తారు.పట్టాభిషేకం జరిగే వేదిక దగ్గరకు బంగారము, రత్నాలు, తెల్లటి పూలదండలు,

ఔషధులు, పేలాలు, తేనెలతో నిండిన గిన్నెలు, కొత్త బట్టలు, రథాలు, శుభలక్షణాలు గల ఏనుగులు, తెల్లటి చామరాలు, ధ్వజము, తెల్లగొడుగు,అగ్నిలా ప్రకాశించే బంగారు కుంభాలు, బంగారు కొమ్ముల ఆబోతులు, నిండుగానున్న పులితోలు సిద్ధంగా ఉంచుతారు.

సందర్శకులకు కొరత లేకుండా అపరిమితంగా పిండి వంటలతో షడ్రసోపేత అన్నదానాలు జరుగుతుంటాయి.సానులు,నటులు మొదలైన వారు బాగా ముస్తాబు చేసుకొని రాజ మందిరం దగ్గర సిద్ధంగా ఉంటారు.[4] దేవాలయాల దగ్గర చైత్యల దగ్గర అన్నము పిండివంటలతో మరి కొంతమంది సిద్ధంగా ఉంటారు అడిగిన వాళ్లకు అడిగినట్లుగా బ్రాహ్మణులతో సహా అందరికీ దక్షిణలు, దానాలు ఇస్తూ ఉంటారు.

సీతారామ లక్ష్మణులు అరణ్యప్రవేశం చేసిన తరువాత చిత్రకూటం లో రామాజ్ఞపై లక్ష్మణుడు ఒక అందమైన పర్ణశాలను నిర్మిస్తాడు. తిథి వార నక్షత్రాలు చూసి రాముడు లక్ష్మణుడితో నల్లలేడి మాంసం తెప్పించి రక్తం లేకుండా మాంసం బాగా పక్వం చేసి, గృహ అధిష్టాన దేవతలను పూజించి, వైస్వ దేవబలి, రుద్ర బలి, విష్ణుబలి పూర్తి చేస్తాడు, పుణ్యాహవచనం మొదలైన మంగళ కార్యాలను చేస్తాడు. నదిలోకి వెళ్లి స్నానం చేసి వచ్చి మరల పాప శాంతి కోసం ఉత్తమమైన బలిని యథావిధిగా నిర్వహించాడు.

ఇదంతా అయ్యాక బలివేదికలు, చైత్యాలు, అగ్నిహోత్ర గృహాలు నిర్మించుకున్నారు. అడవి పువ్వులతోనూ, పళ్ళు దుంపలతోనూ, పక్వమైన మాంసాలతోనూ శాస్త్రాల్లో చెప్పిన విధంగా భూతాలకు తృప్తి చేశారు. వాస్తు శాస్త్ర ప్రకారం వంట ఇల్లు అవి ఏవి ఎక్కడ ఉండాలో అక్కడ ఉన్నాయి. దేవతలు సుధర్మ దేవ సభలో ప్రవేశించినట్లు ఆ పర్ణశాలలోకి సీతారామ లక్ష్మణులుప్రవేశించారు.[5]

## 3. జ్యోతిష్యం:

గ్రహగతుల రీత్యా భవిష్యత్తును చెప్పే శాస్త్రం ఇది. గ్రహాల గతులు, ప్రభావాలు, తెలిపేది జ్యోతిషం అంటే ఆ నిర్వచనం సమగ్రమౌతుంది. కాగా సూర్యచంద్రాది గ్రహాలు, నక్షత్రాలు మొదలైన కాంతి గోళాల స్వరూప స్వభావాలను ప్రాణులమీద, ప్రకృతి మీద వాని ప్రభావాలను తెలిపే విజ్ఞానం జ్యోతిశ్శాస్త్రం.మానవుని దినచర్య సూర్యోదయ సూర్యాస్తమయాలలోను, చంద్రోదయం, చంద్రుని వృద్ధిక్షయాలు, నక్షత్రకాంతి, మొదలైన వాటితోను ముడిపడి ఉంది.

బాలకాండ పద్దెనిమిదవ సర్గలో శ్రీరాముడి జననాన్ని తెలియజేస్తూ రాముని జాతకాన్ని వివరించారు. చైత్రమాసం పునర్వసు నక్షత్రం రోజు ఐదు గ్రహాలు ఉచ్చరాసుల్లో ఉన్నప్పుడు కర్కాటక లగ్నంలో గురుడు, శుక్రుడు చంద్రుడు ఉండగా కౌసల్య ప్రసవించింది. జ్యోతిష్య శాస్త్రం ప్రకారం ఎక్కువ గ్రహాలు ఉచ్చస్థితిలో ఉండటం మహారాజజాతకాన్ని సూచిస్తుంది.

మరొకసందర్భంలో రామలక్ష్మణులు విశ్వామిత్రునితో కలిసి సభ లోనికి ప్రవేశిస్తారు అక్కడ రాముడు పునర్వసు నక్షత్రంలో ప్రకాశించిన చంద్రుడిలా ప్రకాశించాడు[6] అంటాడు కవి. పునర్వసు నక్షత్రం కర్కాటక రాశికి చెందింది. కర్కాటక రాశి చంద్రునికి స్వక్షేత్రం కనుక చంద్రుడు అక్కడ బలంగా ఉంటాడు.

దశరథ మహారాజు రాముడికి అభిషేకం చేయాలనుకుంటున్నప్పుడు రాముడిని పిలిపించి తనకు ఎన్నో పీడ కలలు కనిపిస్తున్నాయని చెప్పటంతో పాటు తన జన్మ నక్షత్రంలో అంగారకుడు, రవి, రాహువులాంటి పాప గ్రహాలు ఉన్నాయి కాబట్టి అది నా మరణాన్ని సూచిస్తుందని జ్యోతిష్కులు చెప్తున్నారు కనుక తొందరగా యువరాజుగా నిన్ను పట్టాభిషిక్తున్ని చేస్తాను అంటాడు. ఎవరి జాతకంలోనైనా జన్మనక్షత్రంలో పాపగ్రహాలు సంచరిస్తున్నప్పుడు మరణము లేదా అంతకు సమానమైన ఆపద సంభవిస్తుందని జ్యోతిష్యాస్త్ర వచనం.

సేతువు నిర్మించిన తర్వాత యుద్ధం ప్రారంభానికి ముందు లక్ష్మణుడు రాముడితో జ్యోతిష్యశాస్త్ర సంబంధమైన విషయాలను ఈ విధంగా తెలుపుతాడు. ఇక్ష్వాకు వంశీయుల ముఖ్య నక్షత్రమైన విశాఖ చాలా ప్రశాంతంగా ఉందని, రాక్షసుల నక్షత్రమైన మూలా నక్షత్రాన్ని పాప గ్రహాలు చూస్తున్నాయని, తోకచుక్క ఆక్రమించిందని చావుమూడిన వాళ్ళ నక్షత్రాన్ని క్రూర గ్రహాలు పీడిస్తాయని తెలియజేశాడు. అందువల్ల రాక్షసులకు వినాశనం ఇక్ష్వాకు వంశానికి లాభము జరుగుతుందని తెలపడం జరిగింది. జ్యోతిష్య శాస్త్రం ప్రకారం జన్మ నక్షత్రాన్ని పాపగ్రహాలు చూస్తున్నప్పుడు అశుభ పరిణామాలు జరుగుతుంటాయి, ఈ అన్నదమ్ముల సంభాషణల్లో ఆ విషయం తేటతెల్లమవుతుంది.

ఆ సమయంలోనే రాముడు లక్ష్మణుడితో లంకా పట్టణాన్ని చూస్తూ అంగారకుడు రోహిణి నక్షత్రాన్ని పీడిస్తున్నట్లుగా సీతాదేవిని రావణాసురుడు పిడిస్తున్నాడు అంటాడు. పై వాక్యంలో జ్యోతిష్యాస్త్ర రహస్యం ఎంతో ఇమిడి ఉంది.అంగారకుడు పూర్తి పాపగ్రహం. రోహిణి నక్షత్రజాతకులకు చంద్రుడు తప్ప ఇతర గ్రహాలు యోగించవు. ఇక పాప గ్రహమైన కుజుడు సంగతి సరేసరి. చంద్రుడికి రోహిణి దేవి ఎంతో ఇష్టమైన భార్య. గ్రహాలలో కుజుడు పాపి. రావణాసురుని పాప గ్రహమైన అంగారకుడుతోను సీతాదేవిని చంద్రుని ప్రియురాలైన రోహిణి తోనూ రాముడు పోల్చి చెప్పడం జరిగింది.

జ్యోతిష్య శాస్త్రం ప్రకారం బుధునికి చంద్ర, కుజులు శత్రువులు. రామ రావణ యుద్ధ ప్రారంభంలో ఇక్ష్వాకు వంశీయుల విశాఖ నక్షత్రాన్ని అంగారకుడు ఆక్రమిస్తాడు.చంద్రుడు ప్రియురాలిగా ఉన్న రోహిణి నక్షత్రాన్ని బుధుడు ఆక్రమిస్తాడు.[7] దాంతో రాముడు కొద్దిగా బలహీనుడు అవుతాడు. జ్యోతిష్యశాస్త్రరీత్యా అంగారకుడికి కుజుడికి వైరం ఉంటుంది అవి రెండు శత్రుగ్రహాలు. వజ్ర దంష్టుడికి, అంగదునికి అతిఘోరమైన యుద్ధం జరుగుతుంది. హోరాహోరీగా, రక్తాలు కక్కుకుంటూ యుద్ధం చేస్తూ ఉంటారు. అంగారకుడు బుధుడు కలబడినట్లుగా ఇద్దరు కలబడ్డారు[8] అంటూ వారి వారి యుద్ధాన్ని మహర్షి వర్ణిస్తారు.

రామ రావణ యుద్ధ సమయంలో రాముడు జాతకంలో రవి దృష్టి కొద్దిగా అశుభంగా ఉంది. అందువల్ల ఎంత భగవంతుడైనప్పటికీ తొందరగా అలసిపోయేవాడు. శత్రువుని సంహరించడం కష్టతరంగా మారింది. ఈ పరిస్థితిని గమనించిన అగస్త్యుడు రాముని దగ్గరకు వచ్చి అతి సనాతనమైన ఆదిత్య హృదయాన్ని ఉపదేశిస్తాడు.[9] అందువల్ల రాముని జాతకం పై సూర్యుని శుభదృష్టి కలిగి రావణాసురుని అవలీలగా సంహరించగలుగుతాడు.

ముహూర్తం కూడా జ్యోతిష్య శాస్త్రంలో అంతర్భాగం. రామునికి పట్టాభిషేకం చేసే సందర్భంలో వశిష్ట మహర్షి పునర్వసు నక్షత్రంలో పుష్యమి యోగం ఉన్న శుభ ఘడియల్లో ముహూర్తాన్ని నిర్ణయిస్తాడు.అంతేకాక రామాయణంలోని ప్రతి ముఖ్య ఘట్టాల్లోనూ, యుద్ధ సమయాల్లోనూ ముహూర్తాలను చూసినట్లుగా మహర్షి వివరించారు.

## 4. శకునాలు:

శుభ, అశుభ సూచకమైన నిమిత్తనికి శకునం అనే పేరు. శకునాలను గుర్తించేది మనసే! మనకు నిత్యజీవితంలో కనిపించే వస్తువులు, జీవజాలాలు వాటికి ప్రేరకాలే గాని అవి చెడ్డవి కావు. ప్రకృతిలో ఏదో మార్పు కలుగుతుందన్నప్పుడు జీవులు తమ శరీర ప్రకృతులు మార్చుకుంటాయి. అవి గమనించటం కూడా శకున సంబంధమైన అంశమే దీనిలో మనుష్య, ప్రకృతి, పశుపక్షి సంబంధమైన విభాగాలుగా విభజన చేసి అధ్యయనం చేస్తున్నారు. ఆదికావ్యమైన రామాయణంలో శకునాలు చాలాచోట్ల ఉన్నాయి.

సీతారాముల కళ్యాణం జరిగిన తర్వాత వారు అయోధ్యకు వెళుతుంటే కొన్ని శకునాలు కనపడ్డాయి. దశరధుడు వశిష్ఠుడిని ఈ విధంగా అడుగుతాడు అమంగళాలైన పక్షులు ఘోరంగా అరుస్తున్నాయి. మృగాలు ప్రదక్షిణంగా వెళుతున్నాయి. హృదయాన్ని కంపింపజేసే వీటిని చూసి నా మనసు విషాదాన్ని పొందుతోంది. దీనికి వశిష్టుడు ఈ విధంగా జవాబు చెప్పాడు పక్షుల క్రూరమైన అరుపుల వల్ల ఘోరమైన భయం వస్తున్నదని తెలుస్తోంది. మృగాల ప్రదక్షణ గమనం చేత ఆ భయం తొలగిపోతుంది.[10]

దశరధుడు చనిపోయిన తర్వాత భరతుడు అయోధ్యకు వస్తాడు. దారి పొడుగునా అపశకునాలే కనిపిస్తూ ఉంటాయి ప్రజలు ఎవరూ ఇల్లు వాకిళ్లు ఊడవరు, చెత్తాచెదారంతో శ్రీ హీనంగా ఉంటాయి. ఆలయాలు పూలదండలు లేక శూన్యంగా కనిపిస్తూఉంటాయి, దేవాలయాల మీద చైత్యాల మీద పిట్టలు కదలకుండా అరవకుండా కూర్చొని ఉంటాయి, పట్టణంలో ఆడ మగ అందరూ మలినంగా కనిపిస్తూ ఉంటారు.

పట్టణంలో చెట్ల ఆకులు రాలిపోయి ఏడుస్తున్నట్లుగా ఉంటాయి. తోటల్లోఆనందమే మాయమైపోయినట్లు ఉంటుంది పొద్దెక్కుతున్నా మృగాలు పక్షులు అరవకుండా నిశ్శబ్దంగా ఉంటాయి. దుఃఖం కుములకు వస్తుంది. కారణం కనపడదు అరిష్ట సూచికంగా ఎన్నో దారుణమైన అపశకునాలు కనిపిస్తున్నాయి ఇదంతా చూస్తే మా

వాళ్ళకి ఎవళ్లకు ఏదో ఆపద వచ్చినట్లే ఉంది సందేహం లేదు ఇలా అంటూనే కలత పడిపోతూ గబగబా అయోధ్య చేరాడు భరతుడు.[11]

సీతాపహరణం తరువాత అడవి నుండి రాముడు లక్ష్మణుడితో కలిసి వస్తుంటే ఎన్నో అపశకునాల కనిపిస్తాయి వాటిని చూసి సీతకు క్రూరమృగాలు రాక్షసుల వల్ల ఏమైందో అనుకుంటూ రాముడు లక్ష్మణుడు కంగారుగా నడుస్తుంటారు.రాముడి వెనుకగా ఒక నక్క వచ్చి వికారంగా అరుస్తూ ఉంటుంది. అన్ని అప్రదక్షిణంగా తిరుగుతూ ఉంటాయి.[12] లేళ్లు నక్కలు సూర్యుడికి మొరలెత్తి ఘోరంగా అరుస్తూ ఉంటాయి.

రావణాసురుడి పినతండ్రి అయిన మాల్యవంతుడు సీతాదేవిని తిరిగి రాముడికి ఇచ్చివేయమని హితబోధ చేస్తూ సీతాదేవి వచ్చినప్పటినుండి లంకలో కనపడే అపశకునాలను గురించి చాలా కూలంకషంగా రావణాసురుడితో చెప్తాడు.వికార రూపాలతో మహా మేఘాలు ఘోరంగా గర్జిస్తున్నాయి, వేడివేడి రక్తాలు లంకలో కురుస్తున్నాయి, వాహనాలు ఏడుస్తూ కన్నీళ్లు కారుస్తున్నాయి, జెండాలు వెలగల బోతున్నాయి, నక్కలు గద్దలు దారుణంగా అరుస్తూ లంకలో తిరుగుతున్నాయి.

నల్లటి దయ్యాలు కలలో కనపడుతున్నాయి పళ్ళు చూపిస్తూ నవ్వుతున్నాయి, ఇళ్లలోని బలిపిండాలను కుక్కలు తినేస్తున్నాయి, ఆవుల కడుపులో గాడిద పిల్లలు పడుతున్నాయి, ఎలుకలు ముంగిసలు జట్టు కడుతున్నాయి. పిల్లులు పులులతో, పందులు కుక్కలతో, కిన్నెరులు రాక్షసులు మనుషులతో తిరుగుతున్నారు. ఎర్ర కాళ్ళ తెల్లపావురాలు రాక్షసుల నాశనం సూచిస్తూ ఎగురుతున్నాయి, జంతువులు కయ్యాలాడుతున్నాయి, సూర్యుడు వైపు చూసి ఏడుస్తున్నాయి ఘోరంగా వికారంగా బోడితలతో నల్లటి కోతి రంగు పురుషుడు ఒకడు సంధ్యా సమయాల్లో రాక్షసుల ఇళ్లలో తొంగి చూస్తున్నాడు ఇంతే కాదు ఇంకా ఘోరమైన ఉత్పాతాలు ఎన్నో కనిపిస్తున్నాయి అంటాడు.

యుద్ధానికి ముందు లక్ష్మణుడు రాముడితో గాలిప్రశాంతంగా వీస్తుంది, పక్షులు మృదువుగా కూస్తున్నాయి,నీళ్ళు నిర్మలంగా ఉన్నాయి వానర సేన కలకలలాడుతూ కనిపిస్తుంది[13] ఈ శకునాలనుబట్టి వదిన దొరుకుతుంది. యుద్ధంలో మనమే గెలుస్తామంటాడు.

విభీషణుడు రావణుడితో మహారాజా, సీత లంకలో చేరింది మొదలు అపశకునాలే అవుపిస్తున్నాయి. మంత్రాలతో హవిస్సు పోస్తున్న అగ్నిహోత్రం శిఖతీర్చి వెలగడంలేదు. రవ్వలూ, పొగా మెలితిరిగి మందుతోంది వంటశాలల్లోనూ, అగ్నిహోత్ర గృహాల్లోనూ పురుగూ, పుట్రా, పాములూ అవీ అవుపిస్తున్నాయి. హవ్యాల్లో చీమలు కనిపిస్తున్నాయి, ఆవులపొదుగులు ఎండిపోతున్నాయి, మదపుటేనుగుల మదం ఆర్చుకుపోతూంది. గుర్రాలు దీనంగా సకిలిస్తువున్నాయి. దానముట్టడంలేదు, గాడిదలా, వొంటెలా, కంచరగాడిదలా వెంట్రుకలు రాలిపోతున్నాయి. అవి కన్నీళ్ళు కారుస్తున్నాయి. చికిత్స చేసినా లాభంలేకుండా వుంది.

పాడుకాకులు గుంపులు అన్ని వేపులా కావు కావు మంటున్నాయి. మందలు మందలు విమానాలమీద సభ తీరుస్తున్నాయి. ఇళ్ళమీద గెద్దలు చెక్క తిరుగుతున్నాయి. ఊరిపక్క ఉదయమూ సాయంకాలమూ నక్కలు వూళవేస్తున్నాయి. మాంసంతినే జంతువులు వూరిమొగని ఉరువుల్లా అరుస్తున్నాయి. ఈ దుర్నిమిత్తాలన్నిటికీ ఇప్పుడు ఒకటే ప్రాయశ్చిత్తం నా మాట విని సీతని రాముడికి ఇచ్చివేయటం.[14]

వజ్రధంస్ట్రుడు యుద్ధానికి బయలుదేరే సమయంలో లేని పిడుగులు పడతాయి, ఉల్కలు రాలతాయి, అగ్ని మంటలు కక్కుతూ ఘోరంగా నక్కలు అరుస్తాయి, భయంకరమైన మృగాలు రాక్షసుల నాశనం సూచించాయి.[15] వాటిని చూసి రాక్షసుడు తడబడిపోయారు అపశకునాలు అడుగడుగునా కనిపిస్తాయి.

ధూమ్రాక్షుడు యుద్ధానికి వెళుతుంటే ఆకాశం మీద ఘోరమైన పక్షులు అడ్డం వచ్చాయి. అక్కడికి రథం మీద భయంకరమైన పెద్ద గద్ద వాలింది శవాలు తినే రాబందులు ధ్వజం మీద కూర్చున్నాయి, తడిపిన తెల్లటి మొండం వికారమైన శబ్దంతో అతడి దగ్గరకు భూమి మీద పడింది నెత్తుటి వాన కురిసింది, భూకంపం పుట్టింది పిడుగు రేగినట్లు సుడిగాలి రేగింది దిక్కులు చీకట్లు కమ్మాయి రాక్షసులకి భయం పుట్టించే ఈ అపశకునాలు చూసాడు ధూమ్రాక్షుడు విచారించాడు నడుస్తున్న రాక్షసులు ఈ దుశ్శకునాలు చూసి మూర్ఛ పోయారు.[16]

జనస్థానంలో రామునితో ఖరుడు యుద్ధానికి వెళ్ళేటప్పుడు కూడా ఇలాంటి అపశకునాలే కనిపిస్తాయి ఖరుడు లెక్కచేయకుండా యుద్ధం చేసి ప్రాణాలు కోల్పోతాడు.

స్వప్నాలు కూడా శకునాల్లో అంతర్భాగమే! దశరథ మహారాజు చనిపోయే ముందు భరతునికి తన తండ్రి మలిన దేహంతో ఎర్రటి వస్త్రాలు ధరించి గాడిదనెక్కి దక్షిణం వైపుకు వెళుతున్నట్లు, పేడ గుంటలో పడిపోయినట్లు, అందులో మునుగుతూ లేస్తూ నూనెను దోసెళ్ళతో తాగుతున్నట్లు, నువ్వుల అన్నం తింటూ మాటిమాటికి తలకిందులై ఒళ్లంతా నూనెపులుముకున్నట్లు కల వచ్చింది. అంతేకాకుండా సముద్రం ఎండిపోయినట్లు, చంద్రబింబం నేలమీద పడినట్లు, ప్రపంచమంతా రణచీకటి కమ్మినట్లు, పట్టపుటేనుగు దంతాలు మొక్కలైపోయినట్లు, భూమి పగిలిపోయినట్లు, చెట్లు ఎండిపోయినట్లు, నల్లటి ఆడాళ్లు నల్లటి చీరలు ధరించి ఇనప పీటల మీద కూర్చొని దశరథుడిని చూసే నవ్వుతున్నట్లు కలగని భరతుడు ఎంతో దుఃఖిస్తాడు. సుందరకాండలో అశోకవనం లో రాక్షస స్త్రీల మధ్య సీతాదేవి కూర్చొని ఉన్నప్పుడు త్రిజట అనే ఒక రాక్షసి స్త్రీకి తెల్లవారుజామున ఒక కల వస్తుంది.అందులో రామలక్ష్మణులు తెల్లటి ఐరావతం లాంటి ఏనుగుఎక్కి,తెల్లటి పూలదండలు,గంధాన్ని ధరించి నవ్వుతూ లంకకు వచ్చినట్లు సీతాదేవిని తీసుకొని ఎంతో ఆనందంగా ఆ ఏనుగును ఎక్కి లంక దాటి వెళుతున్నట్లు వచ్చింది.ఆ కలలో రాముడు విష్ణుమూర్తి లాగా ఉన్నాడు దేవతలందరూ అతన్ని మొక్కుతున్నారు. సీతాదేవి శుభప్రదమైన వస్త్రాలతో పక్కన కూర్చోగా మంగళ వాయిద్యాల నడుమ తీర్థ జలాలతో వారికి అభిషేకం జరిగింది. ఇది చెప్పే త్రిజట త్వరలో వారికి శుభం కలగబోతోంది అంటుంది.

## 5. సాముద్రికం:

కాంతి ప్రభావాల వల్లనే వేరువేరు శరీర తత్వాలు, రేఖలు ఏర్పడటం, శరీరాంగాల వృద్ధి క్షయాదులు సాధ్యమని సాముద్రిక శాస్త్రం చెబుతుంది.ఈ అంగాల మరియు ఇతర ప్రభావాలను నిరంతరం అధ్యయనం చేయటం వల్ల ఈ రేఖలు మొదలైనవి భవిష్యత్తును సూచిస్తున్నాయని భావం ఏర్పడింది. అందువల్ల ఇది ప్రస్తుత కాలంలో ప్రత్యేకమైన శాస్త్రంగా అధ్యయనం చేస్తున్నారు. హస్త, అంగ, తిలక, పశు అనే ప్రత్యేక విభాగాలుఇందులో ఉన్నాయి.

చేతి రేఖల ఆధారంగా భవిష్యత్ నుచెప్పటాన్ని హస్తసాముద్రికంఅంటారు . శరీరాంగాల ఆధారంగా వ్యక్తి యొక్క విశేషాలను తెలియజేసేది అంగ సాముద్రికం. శరీరంపై గల పుట్టుమచ్చల ఆధారంగా ఫలితాలు తెలిపేది తిలక సాముద్రికం. ముఖం ఆధారంగా ఫల నిరూపణ చేస్తే ముఖసాముద్రికంగా భావింపబడుతుంది. పశువుల మీది సుడులు వాటి ప్రత్యేక లక్షణాలను ఆధారంగా వాటిలో మంచి వాటిని నిర్ణయించటానికి ఏర్పడిన శాస్త్రం పసుసాముద్రికం.

రాముడు మారీచుడిని చంపేస్తాడు రాముని కోసం లక్ష్మణుడు వస్తాడు. ఆ సమయంలో సీతాదేవిని జనస్థానంలో రావణుడు అపహరించిన తరువాత రాముడి ఎడమ కన్ను అదురుతూ ఉంటుంది, కాళ్లు తడబడతాయి ఒళ్లంతా వొణికింది. సీత క్షేమంగా ఉంటుందా అంటూ ఆత్రంగా ఆశ్రమంలోకి వెళ్లాడతడు[17].
సాముద్రిక శాస్త్రం ప్రకారం ఒక మనిషి తన జీవితంలో ఏదో ఒక సందర్భంలో కొంత రంగు తగ్గితే అప్పటినుంచి కష్టాలు ప్రారంభమవుతాయని చెబుతుంది. అదే విషయం రామాయణంలో కూడా త్రిజంట కలలో చెప్పబడింది. త్రిజట తన ఉన్న రాక్షస స్త్రీలతో తనకు అప్పుడే వచ్చిన కల గురించి చెబుతూ సీతాదేవి అవయవాలలోఏ అవలక్షణాలు కనిపించట్లేదని ఛాయ మాత్రం కొంత తగ్గింది కాబట్టి తగని దుఃఖం అనుభవిస్తుందనుకుంటాను ఈమె అభీష్టం త్వరలోనే తీరుతున్నట్లు కనపడుతున్నది నాకు అంటుంది.

ఈ శాస్త్రం ప్రకారం ఆడవాళ్లకు ఎడమ కన్ను మగవాళ్లకు కుడి కన్ను అదిరితే శుభ ఫలితాలు కలుగుతాయి. సుందరకాండలో హనుమంతుడు కనపడే ముందు సీతాదేవి అపరిమిత దుఃఖంతో ఆత్మ త్యాగానికి కూడా సిద్ధపడుతుంది. ఆ సమయంలో తన ఎడమ కన్ను, ఎడమ భుజం, ఎడమ తొడ వెంట వెంటనే అదురుతూ ఉంటాయి. ఇలాంటి శుభ శకునాలు ఎన్నోసార్లు ఫలించటం ఆమెకు తెలుసు కనుక ఆనందంతో శుక్లపక్ష రాత్రి చందమామలా ఆమె ప్రకాశించింది[18].

దశరథ మహారాజు మరణం తరువాత భరతుడు హుటాహుటిన కైకయ దేశం నుంచి అయోధ్య వస్తాడు. అంతకుముందే తన తండ్రికి ఏదో కీడు జరుగుతున్నట్లుగా పిడకలలు వస్తాయి. బయలుదేరి వచ్చే ముందు కూడా భయంకరమైన అపశకునాలు కనపడటంతో పాటు శరీరంలోని ముఖ్యభాగాలన్నీ అదురుతా ఉంటాయి మనసంతా

ఎంతో దిగులుగా ఉంటుంది గొంతుక అరుచుకుపోతూ ఉంటుంది కంఠం గద్గద పడుతుంటుంది[19]. ఎంతో దూరంలో ఉన్నాడు తన తండ్రి వృద్ధుడు అతనికి ఏమైందో అని తీవ్ర ఆందోళనకు లోనవుతుంటాడు భరతుడు.

సుందరకాండ రాముడు ఎలా ఉంటాడో చెప్పమని హనుమంతుడిని సీతాదేవి అడుగుతుంది. సాముద్రిక శాస్త్రం ప్రకారం ఏ మనిషి ఎలా ఉండాలో విధంగా రాముడు ఉన్నాడంటూ అతని అవయవాలను హనుమంతుడువర్ణిస్తాడు. శ్రీరాముడి మూపులు విశాలమైనవి అతడి బాహులు పొడవైనవి అతడి మెడ శంఖంలాగా ఉంటుంది. అతడి మొహం అందమైనది అతడి మూపూ సంధి ఎముకలు అవుపడవు. కళ్ళ చివరలు ఎర్రగా ఉంటాయి, అతడి కంట ధ్వని దుందుభిలా ఉంటుంది, శరీరం శ్యామలంగా స్నిగ్ధంగా ఉంటుంది. హెచ్చుతగ్గులు లేకుండా శాస్త్రం ప్రకారం ఏ అవయవం ఎలా ఉండాలో అలా ఉంటుంది.[20]

రామ రావణ యుద్ధ సమయంలో రామలక్ష్మణులు నాగపాశాల వల్ల యుద్ధంలో పడిపోవటం చూసి సీత దుఃఖిస్తూ త్రిజట తో తన బాల్యంలో జ్యోతిష్య పండితులు కొందరు తన నల్లటి సన్నని సమమైన తల వెంట్రుకలు, ఒకదాన్ని ఒకటి అంటని కనుబొమ్మలు, సందు లేని పలువరస, చేతి వేళ్ళు, ఎర్రటి అరచేతులుఅరికాళ్ళు, చిరునవ్వు, మణి లాంటి శరీర కాంతి, సంపూర్ణమైన అవయవ రేఖలు, ఉబ్బెత్తుగా ఉన్న నేత్రాలు, లలాటం, స్తనాలు ఉండటం శుభమని పలికి నాకు భర్తతో రాజ్యాభిషేకం జరుగుతుందన్నారు,[21] ఇవన్నీ అబద్ధం అయిపోయాయి నేడు అని బాధ పడుతుంది.

## 6. ముగింపు:

జ్యోతిష్యం లోకోపయుక్తమైన శాస్త్రం. అతి ప్రాచీనమైనది. మానవుడు ప్రారబ్ద కర్మలను అనుసరించి సుఖదుఃఖాలను పొందుతుంటాడు. జ్యోతిష శాస్త్రం ద్వారా జాతక చక్రాన్ని పరిశీలించి శుభాశుభ సమయాలను మహర్దశ అంతర్దశల ద్వారా గుర్తించి శుభసమయాలలో మరికొన్ని నూతన ప్రయత్నాలను చేయటం, అశుభ సమయాలలో వివిధ రకాల శాంతి ప్రక్రియలను పాటించి ఆ నష్ట ప్రభావాన్ని కొంత వరకు తగ్గించుకోవచ్చు. అలాగే శుభ అశుభ సమయాలలో కొన్ని శకునాలు మనకు గోచరిస్తాయి. వాటిని పరిశీలిస్తూ ముందుకు పోవటం ద్వారా అభివృద్ధి చెందవచ్చు.

మేదినీ జ్యోతిష్యం దేశాలకు సంబంధించినది.ప్రతి దేశానికి ఒక నక్షత్రం ఉంటుంది వాటి పరిశీలన ద్వారా ప్రకృతి వైపరీత్యాలను, యుద్ధాలను ముందే ఊహించి తగు జాగ్రత్తలు పొందటానికి వీలవుతుంది ఇవన్నీ రామాయణంలో ఉన్నాయి.

భాఅంటే కాంతి. కాంతిని అనుసరించేవారు భారతీయులు.మనపురాణాలు విజ్ఞాన భాండాగారాలు. ఆ కాలంలోనే భారతీయులు ఖగోళ, నక్షత్ర, జ్యోతిష్య శాస్త్ర విషయాలలో ఎంతో పాడిత్యం సాధించారని ముందు

తరాలకు అవగతం అవుతుంది.జ్యోతిషశాస్త్రంలో పెద్దగా పరిచయం లేని వారు కూడా రామాయణాన్ని చదవడం వల్ల జ్యోతిష, వాస్తు, శకున సాముద్రిక, శాస్త్ర జ్ఞానాన్ని పొందవచ్చు.

ఈ వ్యాసం లోచర్చించిన విషయాలవల్లరాముని జాతక విశ్లేషణ ద్వారా ఎక్కువ గ్రహాలు ఉచ్చలో ఉంటే మహారాజ యోగమని తెలుస్తుంది. యజ్ఞ యాగాది క్రతువులు చేసేటప్పుడు, నూతన గృహ నిర్మాణ సమయంలోను శుభప్రదమైన వస్తువులను మంగళ ద్రవ్యాలను( పువ్వులు పండ్లు పసుపు కుంకుమ పేలాలు తేన మొదలైనవి) పక్కన ఉంచుకోవాలని, బ్రాహ్మణులకు దానధర్మాలు చేయాలని తెలుస్తుంది. కష్టాలు రాబోయే ముందు పీడకలలు వస్తాయని, దుశ్శకునాలు కనిపిస్తాయని తెలుస్తుంది.

దుశ్శకునాలుఎదురైనప్పుడు ముఖ్యమైన పనులు చేయకపోవడం ఎంతో మంచిదని తెలుస్తుంది.తెల్లవారుఝామున వచ్చేకలలు నిజమవుతాయి,శరీరం ఛాయ తగ్గటం రాబోయే కష్టాలకు సూచన. శరీరం, వెంట్రుకలు, గోళ్లు శుభ్రంగా ఉండటం, అవయవాల హెచ్చుతగ్గులు లేకుండా ఉండటం శుభ ఫలితాలకు దారితీస్తుంది.జన్మ నక్షత్రాన్ని పాప గ్రహాలు చూస్తున్నప్పుడు కష్టాలు వస్తుంటాయి, శుభగ్రహాలు చూస్తుంటే శుభ ఫలితాలు వస్తాయని తెలుస్తుంది.

జ్యోతిష్య శాస్త్రం వైజ్ఞానిక శాస్త్రం.ఇందులో ఇంకా ఎన్నో పరిశోధనలు జరగాల్సి ఉంది. రామాయణంలో ఉన్న జ్యోతిష్య శాస్త్ర వైజ్ఞానిక విషయాలను ఇక్కడ ప్రస్తావించటం జరిగింది.ఇవిభావి జ్యోతిష్య పరిశోధకులకు మార్గదర్శకంగా ఉంటుందని భావిస్తూముగిస్తున్నాము.

### 7. పాదసూచికలు:

1. సాగి కమలాకర శర్మ, జ్యోతిష కమలాకరం– పుట –40
2. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం - బాలకాండ-14వ సర్గ - పుట -53
3. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం - బాలకాండ-73వ సర్గ - పుట -158
4. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం –అయోధ్యకాండ-3వ సర్గ - పుట -176
5. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం –అయోధ్యకాండ-56వసర్గ - పుట -335
6. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం - బాలకాండ-29వ సర్గ - పుట -83
7. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం –యుద్ధకాండ-103వ సర్గ - పుట -320
8. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం –యుద్ధ కాండ-54వ సర్గ - పుట -161
9. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం –యుద్ధ కాండ-107వసర్గ - పుట -328
10. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం –బాల కాండ-74వ సర్గ - పుట -160
11. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం –యుద్ధ కాండ-71వ సర్గ - పుట -370
12. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం – అరణ్యకాండ-57వ సర్గ - పుట -142

13. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం –యుద్ధ కాండ-4వ సర్గ - పుట -28
14. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం –యుద్ధ కాండ-10వ సర్గ - పుట -43
15. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం –యుద్ధ కాండ-53వ సర్గ - పుట -158
16. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం –యుద్ధ కాండ-50వ సర్గ - పుట -154
17. .వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం –అరణ్య కాండ-60వ సర్గ - పుట -145
18. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం –సుందర కాండ-29వ సర్గ - పుట -434
19. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం–అయోధ్యకాండ-72వ సర్గ - పుట -371
20. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం -సుందరకాండ-35వ సర్గ - పుట -445
21. వ్యావహారికాంధ్రవాల్మీకి రామాయణం –యుద్ధ కాండ-48వ సర్గ - పుట -143

## 8. ఉపయుక్తగ్రంథసూచి:


1. అప్పలస్వామి, పురిపండ. 2017. వ్యావహారికాంధ్ర వాల్మీకి రామాయణం. గొల్లపూడి వీరాస్వామి అండ్ సన్స్, రాజమండ్రి.
2. ఉషశ్రీ.1988. రామాయణం తెలుగు వచన. శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్ప్రైజెస్.
3. కమలాకర శర్మ, సాగి. 2000. జ్యోతిష కమలాకరం. తేజశ్రీ ప్రచురణలు, భాగ్యనగరం.
4. గోపాలకృష్ణమూర్తినందుల. 2013. శ్రీ రామాయణామృతం. చెరుకుపల్లి ప్రింటర్స్.
5. శాస్త్రి, వి.ఎస్. బృహత్ సంహిత (అనువాదం)
6. శ్రీపొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం. 2008 యం.ఏ, జ్యోతిష్యం పుస్తకాలు.
7. శ్రీమద్రామాయణం. 2000. గీతా ప్రెస్, గోరఖ్ పూర్.


***


AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_28.php

# "కమనీయం తెలుగు రామాయణం"

**జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక**

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

## 28. రామాయణం: రాజనీతి

**డా. బి. రాజారత్నం**

అసోసియేట్ ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు,
తెలంగాణ సరస్వతి పరిషత్ ఓరియంటల్ కళాశాల,
తిలక్ రోడ్, హైదరాబాద్, తెలంగాణ.
సెల్: +91 9440059827. Email: rrb3474@gmail.com

**వ్యాససంగ్రహం:**

*సంస్కృత పురాణేతిహాసాలను తెనుగించడంతోనే తెలుగు కవిత్వం ప్రారంభమైంది. సంస్కృతంలోని రామాయణ భారత భాగవతాలు లేదా మరేదైనా కావ్యాన్ని మాతృకగా తీసుకొని దాన్ని మరింత కళాత్మకంగా అనువదించడం తెలుగు కావ్య నిర్మాణానికి ఆధారం. తెలుగు రామాయణాలలో చెప్పకనే నీతిని బోధించే రాజనీతిని కవులు ఎలా మనకు అందించారో ఈ వ్యాసం లో మీ ముందు ఉంచే ప్రయత్నం చేస్తాను. మన దేశంలో రామాయణానికి ఉన్నంత లోకప్రియత్వం మరే ఇతర కావ్యానికి లేదు, అందుకు కారణం కావ్య నాయకుడైన రాముడి సచ్చరిత్రమే. ఒక పుత్రుడిగా, భర్తగా,అన్నగా,ఒక మంచి మిత్రుడిగా,రాజనీతిజ్ఞుడుగా, ధర్మజ్ఞుడిగా,సత్యనిష్ఠాపరుడిగా లోకంలో ఎవరినైనా ఉదహరించాలంటే మనకు తోచే ఒకే ఒక్క పేరు శ్రీరామచంద్రుడు. రామాయణం మనకు నేర్పే రాజనీతి ఏమిటో నేను ఈ పరిశోధన వ్యాసంలో చర్చించదలచాను. రామాయణాన్ని తరిచి చూస్తే మనకు ఎన్నో కోణాలు కనిపిస్తాయి. వాటిలో రాజనీతి ఒకటి. రామాయణంలో శ్రీరాముని పట్టాభిషేకం మొదలుకొని రావణాసురునితో యుద్ధంలో గెలిచి, వనవాసం ముగించుకొని అయోధ్యకు తిరిగి వచ్చేవరకు మనకు ఎక్కడ చూసినా రాజకీయం- రాజనీతి ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.తెలుగు రామాయణ కావ్యానికి వచ్చినన్ని అనువాదాలు బహుశా ఏ సంస్కృత కావ్యానికి వచ్చి ఉండవు. తెలుగులో నాకు అందుబాటులో ఉన్న రామాయణాలను సేకరించి, రెండు మూడు సార్లు అధ్యయనం చేసి కొందరు సాహితీవేత్తలతో చర్చించి రాజనీతి సంబంధించిన అంశాలను సమన్వయం చేసుకొని విశ్లేషణాత్మక పద్ధతిలో ఈ పరిశోధనా వ్యాసాన్ని రాశాను. తెలుగు రామాయణాలలో రాజనీతి కోణాన్ని చూపించే ప్రయత్నమే ఈ వ్యాసం.*

**Keywords:** రాజనీతి, కార్యదక్షత, సత్యనిష్ఠ, రామరాజ్యం, మృధుభాషణం, రాజ్యపాలన, సచ్చరిత్ర, కారుణ్యం, మానవీయ విలువలు.

### 1. ఉపోద్ఘాతం:

సంస్కృతపురాణాలను, ఇతిహాసాలను,కావ్యాలను తెనుగించడంతోనే తెలుగు కవిత్వం ఆరంభమైంది. ప్రారంభంలో కథాప్రాధాన్యం తెలుగు సాహిత్యపు ముఖ్యలక్షణం. సంస్కృతంలో రామాయణం, భారతం,

భాగవతాలు లేదా మరేదైనా అష్టాదశ పురాణాలలోని ఒకదానిని మాతృకగా తీసుకొని దాన్ని మరింత కళాత్మకంగా అనువదించడం తెలుగు కావ్య నిర్మాణానికి ఆధారం. లోకంలో రామాయణానికి ఉన్నంత లోకప్రియత్వం మరే ఇతరకావ్యానికి లేదు. అందుకు కారణం కావ్య నాయకుడైన రాముడి సచ్చరిత్రమే. తను కారణజన్ముడైన సామాన్య మానవుడిలాగా కష్టాలను అనుభవించాడు. మానవుడు ఏ విధంగా ప్రవర్తించాలో తనచేతలతో చెప్పి సకల లోకానికి ఆదర్శంగా నిలిచాడు. రామాయణంలోని అనేక ఘట్టాలు మన జీవితంలో సంభవించే ఒడిదుడుకుల్లాగే ఉంటాయి. అందుకే ఆ కావ్యం మనకు సన్నిహితంగా అనిపిస్తుంది.

మానవ స్వభావం కాలానుగుణమైన కొద్ది మార్పులతో ఇంచుమించుగా ఏ కాలంలోనైనా ఒకటిగానే ఉంటుంది. కారుణ్యం, నిష్కాపట్యం,త్రికరణ శుద్ధి మొదలైన సుగుణాలు, అసూయాద్వేషాలు,అహంభావం, అధర్మవర్తనం మొదలైన దుర్గుణాలు ఒకే నాణానికి రెండు వైపులా ఉండే బొమ్మ బొరుసులు. కాని ఆధునిక కాలంలో ఇతర రంగాలలో సాధించిన అభివృద్ధి పాశ్చాత్యనాగరికతా ప్రభావం, నైతికవిలువలను గురించి నిర్లక్ష్యం, వేగవంతమైన జీవనవిధానం అనే నెపంతో నీతి నియమాల పట్ల ఉదాసీనత, అస్తవ్యస్తమైన వ్యవస్థలోని లోపాన్ని గ్రహించలేకపోవడం, లౌకిక, ఆధ్యాత్మిక జీవితాలకి సరైన సమన్వయాన్ని కుదుర్చుకోలేని అయోమయావస్థ - ఇవన్నీ మన జీవితంపై ప్రభావాన్ని చూపిస్తున్నాయి. ఈ విషయాన్ని గుర్తించి రామాయణాది సత్ గ్రంథాలను ఆధారంగా గ్రహించి, ఆధునిక జీవనసరళికి సరిగ్గా సమన్వయించుకుని ప్రవర్తిస్తే మానవ జీవితం సుఖ సంతోషాలతో విరాజిల్లుతుంది. నేటితరం రామాయణంలోని సార్వకాలీనమైన విలువలను గుర్తించి తగిన విధంగా అనుసరించడం ఎంతో శ్రేయస్కరం.

## 2. రామాయణం - రాజనీతి :

రామాయణం కేవలం మత గ్రంథం మాత్రమే కాదు. నైతిక ధార్మిక విలువలతో పాటు లౌకిక జ్ఞానాన్ని, రాజనీతిని కూడా బోధించే మహా గ్రంథం.ధర్మమే రాముడు. రాముడే ధర్మం.డాక్టర్ గోపాల్ రెడ్డి గారు అన్నట్లు, **"యుగయుగాలుగా జాతి చరిత్రను చక్క దిద్దె రామాయణ మహా కావ్యాన్ని ఏదో ఆధునిక ఆర్థిక విలువల, యాంత్రిక పరిశ్రమల నడుమ లేచిన సిద్ధాంతాలను ఆదర్శంగా పెట్టుకొని విమర్శించడం అంత సమంజసమైన పని కాదు. జాతీయ కావ్యాలకు విపరీతార్థాలను చెప్పి ప్రజలను పెడ త్రోవలను పట్టించటం ఏమంత ఉచితం కాదు**!" (సంస్కృత సాహిత్య చరిత్ర, పుట:215.)

## 2. దిలీప చక్రవర్తి:

కాళిదాసు వంటి మహాకవులు దిలీప చక్రవర్తిని సూర్యుడితో పోల్చారు. తెలుగు రామాయణాలలో కూడా దిలీప చక్రవర్తిని అతని ఔన్నత్యాన్ని, రాజనీతిని కవులు వర్ణించారు. దిలీపుడిని సూర్యునితో పోలుస్తూ ఆదిత్యుడికి

రాత్రి లేదు పగలు లేదు పవళించడము లేదు మేల్కొనడము లేదు. నిరంతరం జీవకోటి సంరక్షణే ఆయన పని, సమస్త జగత్తుకు ఒకే ఒక మహా దీపం భాస్కరుడు. నిరంతరం చేతన శక్తిని ప్రసాదిస్తూ లోకానికి హితం కలిగిస్తాడు. అట్లాగే దిలీప మహారాజు కూడా రేయింబవళ్లు ప్రజాసేవలో నిమగ్నమై ప్రజలకు అందుబాటులో ఉండేవాడు. రాజనీతి చతురతతో దేశాన్ని సుభిక్షంగా ఉంచేవాడు. స్వచ్ఛమైనపాలనలో పాలకులకు ప్రధానంగా కావాల్సింది ధర్మబుద్ధి, మానవతాదృక్పథం ఆ తరువాత కావాల్సింది సమర్థత, జవాబుదారీతనం, ప్రభుత్వనిర్వహణలో దాపరికాలు లేకుండా పారదర్శకంగా ఉండడం. ఇది కూడా రామాయణం మనకు బోధిస్తుంది. అయితే ఇప్పుడు అంతా అందుకు విరుద్ధంగా జరుగుతుంది. ముఖ్యంగా అవినీతి, కటికపేదరికం, నిరక్షరాస్యత, నేరపూరిత రాజకీయాలు, అన్ని ప్రాంతాలు సమగ్రంగా అభివృద్ధి చెందకపోవడం వంటివి స్వాతంత్రం వచ్చిన 75 ఏళ్ల తర్వాత కూడా ఎంత ప్రబలంగా ఉన్నాయో అంతే లోతుగా ప్రజా జీవితంలోనూ ప్రైవేట్ రంగంలోనూ అవినీతి విస్తరించి, రాజకీయ నాయకులను ప్రజలు ఈసడించుకునే స్థాయికి ఈనాడు అవినీతి పెరిగింది.

### 3. హరిశ్చంద్రుడు:

రామాయణంలో హరిశ్చంద్రుడి సత్యనిష్టకు మెచ్చి ఇంద్రుడు స్వర్గం ఇస్తాను రమ్మన్నాడు. దానికి " నా ప్రజలను విడిచి నేను రాను,"అంటాడు హరిశ్చంద్రుడు.

'అదేమిటి! స్వయంగా దేవేంద్రుని వచ్చి స్వర్గానికి రమ్మని పిలిస్తే రానంటున్నావు? 'అని అడగగా,

'నీ మీద గౌరవం,స్వర్గం మీద కోరిక లేక కాదు! నాతో నా ప్రజలు కూడా వచ్చినట్లయితే స్వర్గానికేమిటి నరకానికైనా వస్తాను'అన్నాడు.

ప్రజల కోసం స్వర్గం వదులుకుంటావా? అని ఇంద్రుడు అడగగా, దేవేంద్రా! నీకు తెలియకనా అడుగుతున్నావు!పాలకులకు రాజ్య భోగాలు ఎక్కడినుంచి వచ్చాయి? ప్రజలు ఇస్తే వచ్చాయి. ప్రజల సహకారంతో వచ్చాయి. ప్రజాబలంతో వచ్చాయి. వాళ్ళ వల్లనే ఎన్నో మంచి పనులు చేయగలిగాను. మంచి వాడిని అనిపించుకోగలిగాను. ఇప్పుడు నువ్వు స్వర్గానికి రమ్మని పిలుస్తున్నావు. ఇంత ఉపకారం చేసి రాజ్యం, భాగ్యం కట్టబెట్టిన ప్రజలను వదిలేసి నేను ఒక్కడినే స్వర్గానికి రావడం న్యాయమా? నువ్వే చెప్పు అన్నాడు హరిశ్చంద్రుడు. నీ పుణ్యఫలాన్ని నీ ప్రజలకు కూడా పంచిపెట్టి వారిని కూడా నీతో స్వర్గానికి తీసుకువస్తానంటావ్. సరే!అలాగే చేద్దువుగాని కానీ అందరికీ పంచి పెట్టాక నీకెంత పుణ్యం మిగులుతుంది? ఒక్కడివే అయితే చాలా అనుభవించవచ్చుగా అని ఇంద్రుడు ప్రలోభపెట్టాడు. దానికి 'నా ప్రజలతో కలిసి అనుభవించే స్వర్గం ఒక్కరోజే అయిన ,ఒక్క గంటే అయినా చాలు. నా ప్రజల తోడిదే నాకు స్వర్గం' అన్నాడు హరిశ్చంద్రుడు. ఇది విని ఇంద్రాది దేవతలు ఆయన మీద పుష్పవృష్టి కురిపించారు.

ఇప్పటి నాయకులకు ఇలాంటి బుద్ధి అసలెప్పటికైనా కలుగుతుందా? కాళిదాసు మహాకవి రఘువంశంలో 'రాజు' అన్న పదానికి ప్రజలను రంజింపచేసేవాడు ప్రజలను సంతుష్టలను చేసేవాడు అని అర్థం చెప్పాడు. ప్రజాసంక్షేమానికి పాలకులు అత్యంత ప్రాధాన్యమివ్వాలని, సామాన్యుడు బాగున్నాడా లేదా అన్నదే సంక్షేమరాజ్యంలో కీలకమని ఆయన స్పష్టం చేశాడు. కాగితాల్లో కనిపించే లెక్కలు గణాంకాలు మనల్ని మోసం చేయొచ్చు. నిజమైన అభివృద్ధికి అవి సూచికలు కానేకావు. ప్రజల ముఖాల్లో వెల్లివిరిసే ఆనందం, సంతోషం, తృప్తే అసలైన సౌభాగ్యసూచికలు. కొద్దిమంది ఉన్నవారు, చాలామంది లేనివారు నివసించే రాజ్యంలో అందరూ తృప్తిగా సంతోషంగా బతికేలా ప్రజల ఆలనా పాలనా చూడగలిగిన వారే సమర్థులైన పాలకులు. పాలకులు ప్రజలకు తండ్రిలా వ్యవహరించాలి. తండ్రి బిడ్డలకు ఆదర్శంగా ఉండాలి. ఉన్నత ప్రమాణాలను, ఉత్తమ విలువలను నెలకొల్పాలి. వాళ్లు ఆదర్శాలు పాటించకుండా పిల్లలను ఆదర్శమార్గాన నడవమని ఎలా అడుగగలుగుతారు? కాబట్టి పాలకులు సచ్చరిత్రులై ఉండాలి. ఇతరులకు మార్గదర్శకంగా ఉండాలని రామాయణం బోధిస్తుంది.

## 4. దశరథ మహారాజు:

దశరథ మహారాజు కొలువులో ఉన్న అమాత్యుల గుణగణాలను వర్ణిస్తూ వాల్మీకి మహాకవి వాళ్లంతా విద్యావినీతులు అన్నాడు.అంటే వాళ్లంతా కేవలం చదువుకున్నవాళ్లే కాదు వినయమూర్తులు కూడా అని చెప్పాడు. రంగనాథ రామాయణంలో గోనబుద్ధ భూపతి దశరథుని మంత్రులుగా ఉన్న వారిని గూర్చి వర్ణిస్తూ ,

**"వినయనయోపాయ విజయసుస్థిరుడు, ఘనకీర్తి వితలక్ష్మాపాలవరుడు,**
**రాజ సర్వజ్ఞుండు రాజసింహుండు రాజశిరోమణి రాజపూజితుడు**
**సకల జగద్ధితచాతుర్యధుర్యుం, డొకనాడు కొలువున నున్నతుం డగుచు**
**బహుపురాణజ్ఞులు బహుశాస్త్రవిదులు, బహుకావ్యనాటక ప్రౌఢమానసులు**
**హితులు మంత్రులుపురోహితులునాశ్రితులు, సుతులు రాజులు బహు శృతులును గొల్వ**
**దీపించి భూలోక దేవేంద్రుపగిది, నేపారి యున్న చో నింపు సొంపొంద"** (రం. రా. బాల. పుట:3)

విశేషపాండిత్యం వలన, ప్రతిభ వలన వచ్చిన వినయవిధేయతలతో మూర్తిభవించిన విద్యావినయ స్వరూపులని పేర్కొన్నాడు. కనుక తెలుసుకోవాల్సిందేమిటంటే మంత్రులుగా నియమితులయ్యే వారికి వారు నిర్వహించవలసిన విధుల గురించి, బాధ్యతల గురించి పరిపూర్ణజ్ఞానం ఉండాలి. అతిశయ అహంకారాలు లేకుండా ఒద్దికగా ఉండాలి. పదవిని అడ్డం పెట్టుకొని ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించడం గాని, తప్పులు చేయడం గాని మంత్రులకు తగదని, మంత్రులుగా ఉండేవారు ఏ విషయానికీ ఆందోళన పడకూడదనీ ఆయన చెప్పాడు. సంక్షోభ సమయాలు వచ్చినప్పుడు అప్రమత్తంగా ఉంటూ, నిదానంగా ఆలోచిస్తూ ఆత్మస్థైర్యంతో అడుగులు ముందుకు వేయాలి. దశరథుని మంత్రులు ఏ సమస్య నైనా చిరునవ్వుతో ఎదుర్కొనే వారట. ఎవరు ఏమి చెప్పినా నిశ్చలచిత్తంతో శాంతంగా వినేవారట. తరువాత ఆ విషయం గురించి తీవ్రంగా యోచన చేసి తగిన విధంగా

నిర్ణయాలు చేసేవారట. అంతేకాక దశరథుని మంత్రులందరూ కుశాగ్ర బుద్ధులు.కేవలం మంచివారు, అర్హత ఉన్నవారు మాత్రమే మంత్రులుగా ఉంటే సరిపోదు వారు సర్వసమర్థులుగా కూడా అయి ఉండాలి.అప్పుడు గాని అనుకున్న పనులు అనుకున్నట్టు జరగవని చెప్పారు. ఇంకా సచివులుగా ఉండే వారికి ఇంద్రియ నిగ్రహం ఉండాలి. దీనివల్ల అన్ని సమయాలలో ఒకే చిత్తంతో ఉండేందుకు శాంతంగా ఉండేందుకు వీలవుతుంది. అబద్ధాలు ఆడరు. ఇచ్చిన మాటకు కట్టుబడి ఉంటారు. క్షమాగుణం కలిగి ఉంటారు. మంత్రులకు ఉండవలసిన మరో మంచి లక్షణం మృదుభాషణం. దశరథుని మంత్రులు పెదవుల మీద చిరగని చిరునవ్వుతో మృదు భాషలు ఉండేవారు. వారు మాట్లాడిన ప్రతి మాట నిజాయితీగా ఉండేది. ధర్మబద్ధంగా ఉండేది. మంత్రులుగా ఉండగోరే వారికి ఉండవలసిన మంచి లక్షణాలు ఇవి రాజ్యపాలన బాగా సాగాలంటే రాజు మంచి మిత్రులను కూడా సంపాదించుకోవాలి రాజ్యం ఉంది కదా ఐశ్వర్యం ఉంది కదా మాకు స్నేహితులతో పనేమిటని అనుకోకూడదు.

సముద్రుడికి నీళ్ల కొదవేమిటి చెప్పండి. ఎక్కడెక్కడి నదులన్నీ వచ్చి సముద్రంలోనే కదా కలిసేది. దానికి తోడు సముద్రగర్భంలో అమూల్యమైన రత్నాలు ఉంటాయని పెద్ద పేరు. అయినా అది చంద్రుడి రాక కోసం ఎదురుచూస్తూనే ఉంటుంది. అట్లాగే మంచి మిత్రుని సంపాదించుకోవడానికి వాళ్ల స్నేహాన్ని నిలుపుకోవడానికి పరిపాలకుడు నిరంతరం కృషి చేస్తూ ఉండాలి. మరో ముఖ్య విషయం ఏమిటంటే పురహితాన్ని కాంక్షించే పురోహితుడు ఒకడు రాజుని అనుసరించి ఉండాలి. ఇక్కడ కవి ఉద్దేశం పురోహితుడు అంటే తిధి,వార,నక్షత్రాలు చెప్పేవాడు, జపాలు చేయించేవాడు, పూజలు నిర్వహించేవాడు, పెళ్లిళ్లు చేయించేవాడు కాదు. పురోహితుడు అంటే పండితుడు, శ్రేష్టుడు, జ్ఞాని, ధర్మజ్ఞుడు, ఆచార్యుడు అని అర్థం. వీళ్ళని పూర్వం రాజగురువులని పిలిచేవారు.

రాజు రాజనీతి విషారదుడైతే, పురోహితుడు సకల శాస్త్ర పరంగాతుడై ఉండాలి. శాస్త్రానుసారంగా రాజ్య పాలనం చేయడానికి ఆచార్యుడైన పురోహితుడి సాయం రాజుకి కావాలి. శాస్త్రాన్ని, ధర్మాన్ని ఉచితనుచితాలను చెప్పగలిగేది జ్ఞానం. ఆ జ్ఞానాన్ని ఇచ్చేది ఆచార్య పురోహితుడు. ఆచార్యుడు నుండి అందిపుచ్చుకున్న జ్ఞానాన్ని ఆచరణలో చూపాల్సిన వాడు రాజు. ఒకరు మార్గం చూపేవారు.మరొకరు ఆ మార్గంలో నడిచి ఆదర్శ రాజ్యాన్ని నెలకొల్పేవారు.అది ఆనాటి రాజనీతి రహస్యం. ఆపద సమయాలలో ధైర్యంగా పోరాడగలిగే శక్తి, నేర్పు ఓర్పు మానవునికి ఉండాలని ప్రజాక్షేమం, దేశ క్షేమం కాంక్షిస్తూ నిరంతరం తన ప్రజలను దేశాన్ని కాపాడేందుకు అన్ని వేళల సిద్ధంగా ఉండాలని రామాయణంలోని రాజనీతి మనకు చెప్తుంది.

## 5. శ్రీరాముడు:

మహాకవి కాళిదాసు 'రఘువంశం' లో రామరాజ్యం అంటే ఏమిటో చెప్పాడు. రామరాజ్యం గురించి ఆయన చెప్పిన విషయాలు ఇప్పుడు మనం అనుకునే సుపరిపాలనకు సరిగ్గా సరిపోతుంది. శ్రీరాముడు

బుద్ధిమంతుడు, నీతి తప్పనివాడు. రుజువర్తనం కలిగిన వాడు. '**రామో విగ్రహవాన్ ధర్మః**' అని వాల్మీకి సంస్కృతరామాయణంలో కీర్తింపబడినాడు. ధర్మ స్వరూపుడు కనుక ఆయన తన ప్రజలను కూడా ఏనాడూ నీతిని ధర్మాన్ని తప్పనివ్వలేదు.

'**యతో ధర్మస్తతో జయః**' ధర్మమున్నచోట జయం సిద్ధిస్తుంది. అందుచే ధర్మాన్ని ఆచరించాలని రాముని ఆదేశం. వాల్మీకి రామాయణాన్ని అనుసరిస్తూ తెలుగులో వచ్చిన రామాయణాలలో కూడా రాముని గుణగణాల్ని, అతని పాలన గూర్చి, అతని రాజనీతిజ్ఞతను గూర్చి వర్ణించబడింది. దేశంలో ఎంత సంపద ఉన్నా, ఎన్ని వనరులు ఉన్నా వాటిని ప్రజల కోసం వినియోగంలోకి తెచ్చే విధంగా పాలకులు నీతిమంతులు శీలవంతులు కాకపోతే అవన్నీ నిష్ప్రయోజనం అవుతాయి. కనుక ప్రభువును ధర్మపరులుగా నీతిమంతులుగా ఉండాలని శ్రీరాముని మొదటి నియమం. రెండవది భద్రత, రక్షణ. తన రాజ్యంలోని జీవలోకాన్ని రక్షించడమే తన పని అనుకున్నాడు రామభద్రుడు. కాబట్టి ప్రజలకు ఎల్లవేళలా ఆయన రక్షణయై నిలిచాడు. ఆయన ఏలుబడిలో ప్రతి ఒక్కరికి విధిగా ఏదో ఒక వృత్తి ఉండేది. దానితో ప్రజలందరూ హాయిగా స్వేచ్ఛగా ఆడుతూ పాడుతూ ఎవరి పనులు వాళ్ళు చేసుకోగలిగేవారు. ఫలితంగా ఆయన ఏలుబడిలో ప్రతి పదార్థము ధాన్యము వస్తువులు ఇప్పుడు ముప్పిడిగా చేతికి అంది వచ్చేవి అరమెరికలు లేకుండా అందరూ వాటిని తృప్తిగా అనుభవించేవారు అంటే వస్తు ఉత్పత్తి పంటల దిగుబడి గణనీయంగా ఉండేవన్నమాట. చతుర్వర్ణ వ్యవస్థ పరమార్థం ఇదే. ప్రజల ఇష్టాను అవసరాలను గమనిస్తుండాలి వాళ్లకు కష్టం కలగకుండా చూడాలి రాజు తన ఏలుబడిలోని ప్రజలందరినీ తన ధర్మంతో తన శక్తి సామర్థ్యాలతో కాపాడాలి. ప్రజలు ఎవరిని పని లేని వారుగా ఉంచకూడదు. రాజ్యాన్ని ఆర్థికంగా పటిష్టం చేసే పనిలో వారిని భాగస్వాములు చేయాలి. దశావతారాలలో మత్స్య , కూర్మ వరాహ, నరసింహ, వామన, పరశురామ అర్చనావతారాలు. కానీ రామచంద్రునిది అనుసరణ అవతారం. మంచి పాలకులు నాయకులు కావాలనుకునే వాళ్లంతా శ్రీరాముడిని అనుసరించాల్సిందే.

తండ్రి మాటకు కట్టుబడి వనవాసానికి వెళ్ళిన రాముడిని అయోధ్యకు తిరిగి రమ్మని బతిమాలేందుకు భరతుడు చిత్రకూట పర్వతానికి వెళ్ళాడు . అక్కడ రామాశ్రమాన్ని కనుక్కుంటాడు. అక్కడ-

**"మునివేషమున జాల ముదమందు రాము,గను గొని యాత్మలో గడగి శోకించి**
**పోలుచు కాంచనగృహంబుల నుండువాడు, లలిదూలి పర్ణశాలల నున్నవాడు**
**పొగడొన్దు పూలపాన్పున నుండు వాడు, జగతిపై బూరిసెజ్జను నున్నవాడు**
**నెఱసి కిరీటంబు నెఱదాల్చువాడు, తలచైనజడ లర్థి దాల్చి యున్నాడు**" (రం.రామా. అయో. పుట 119)

అని దుఃఖపడుతుండగా...అప్పుడు రాముడు కుశలమడుగుతున్నట్లే అడుగుతూ రాముడు భరతుడికి రాజనీతిని ఉపదేశిస్తాడు.

**గుశపీఠముల నిల్వగోరి రాఘవుడు, దశరథుసేమంబు తల్లులశుభము**

**పలుమారు నడుగుచు భరత నీ వేల, యిలయేల కింతద వ్వేగుదెంచితివి**" (రం.రామా. అయో. పుట 120)

అని మనిషి తనను తాను కట్టడి చేసుకుంటూ, సంయమనాన్ని పాటిస్తూ,కాలాన్ని గమనిస్తూ, నేల విడిచి సాము చేయకుండా లక్ష్యాలను నిర్దేశించుకుంటూ, ఆచరణయోగ్యమైన ప్రణాళికలు రూపొందించుకుంటూ, ప్రాధాన్యాలని లెక్కిస్తూ ఇంటా బయట ఎలా గెలవవచ్చో తమ్ముడికి బోధిస్తాడు.

"**అగ్ని హోత్రముల సంధ్యాకాలనియతి, భగ్నంబుగాకుండ బాలింతె నీవు**
**సుజనులౌ మంత్రులచొప్పెల్ల దెలిసి, విజయంబు నామంత్ర విధి యెరుంగుదువె**
**యపర రాత్రుల లేచి యర్థచింతనము, నిపుణత జేయుదే నీవు నిత్యంబు**
**నరసి యుత్తమమధ్యమాధమజనుల, వెరపుతో బనిగొందువే తగినట్లు....**
**చారులవలన రాష్ట్రములవర్తనము, వైరుల తెఱగు సర్వము నెరుంగుదువే**" (రం.రామా. అయో. పుట 120)

అని చెపుతూ, లక్ష్యాలు ఉన్నతంగా ఉండాలి. స్పష్టంగా ఉండాలి. సాధించగలిగే విధంగా ఉండాలి. సత్ఫలితాలను ఇవ్వగలగాలి. వాటి సాధనకు నిర్ణీత కాలగడువు ఉండాలి. అలాగే చేయాల్సిన పనులు అనేకం ఉండొచ్చు. ప్రాధాన్యాన్ని బట్టి వాటికి ముందు వెనుక ఉండాలి. పదిమందికి ఉపయోగపడే మంచి పనులకు పెద్దపీట వేయాలి. శక్యంగాని పనులు చేయడానికి పూనుకోకూడదు. చేయడానికి వీలైన పనులును అజ్ఞానంతోనో, అధైర్యంతోనో ప్రయత్నించకుండా వుండకూడదు. ఒకేసారి రకరకాల ఆలోచనలు చేయకూడదు. ఒకేసారి అనేక కార్యాలు ప్రారంభించకూడదు. నిర్ణయించిన కార్యాలను వెంటనే ప్రారంభించాలి. ప్రారంభించడానికి ముందు, తర్వాత కూడా అనేక అవరోధాలు ఎదురుకావచ్చు. వాటినన్నింటినీ సవాళ్లుగా స్వీకరించాలి అనే సందేశాన్ని

"**ఎపుడు గోబ్రాహ్మణహితము గోరుచును, నిపుణుడవై ధర్మ నిష్ఠ నుండుదువె**
**శక్తిత్రయంబను షడ్గుణంబులును, శక్తిపంచాంగముల్ చతురోపాయములు**
**పదునాల్గు రాజపాపంబులు దెలిసి, సదయుడై మనుధర్మ శాస్త్రసంగతిని**" (రం.రామా. అయో. పుట 121)

అని హితబోధ చేస్తాడు నీతి కోవిదుడైన శ్రీరాముడు.

భరతుడు అన్న గారు చెప్పిందంతా ఏకాగ్రత గా వింటూ ఉంటాడు. కాలం చాలా విలువైంది. అమూల్యమైనది. మనిషికి అందుబాటులో ఉన్న వనరులన్నింటిలో అతి ముఖ్యమైనది. రోజు అందుబాటులో ఉండే సమయం అందరికీ ఒకే విధంగా ఉంటుంది .కానీ ఎవరు ఎంత సమర్థంగా దానిని వినియోగించుకుంటున్నారన్న దానిమీద వ్యక్తుల ప్రతిభ ఆధారపడి ఉంటుంది. ఉత్సాహం త్వరగా పట్టుదల ఉన్నప్పుడు కాలయాపన చేయకూడదు నిర్ధారించుకున్న లక్షల పూర్తి చేసేందుకు వడివడిగా అడుగులు ముందుకు వేయాలి. కోపం ఏమని పాటు అలసత్వం పనికిరావు అని భరతుడిని హెచ్చరిస్తాడు రాముడు. నీ పరివారంతో, సిబ్బందితో, అధికారగణంతో, పండితజనంతో నువ్వు మంత్రాంగం చేసే తీరు నీ కార్యదక్షతకు తార్కాణంగా నిలుస్తుంది. మిత్రులతో జరిపే సమావేశాలు మొక్కుబడిగా

జరగకూడదు. సమాచార సేకరణకు వితరణకు ఇతరుల అభిప్రాయాలను తీసుకునేందుకు కొత్త ఆలోచనలకు ఊపిరి పోసేందుకు, సహోద్యోగులను ప్రోత్సహించేందుకు, మంగళకరమైన పనులు ప్రారంభించేందుకు అవి దోహదం చేయాలి. ఏ ఆలోచన నువ్వు ఒక్కడివే చేయకూడదు. జ్ఞానులను, శ్రేష్ఠులను సంప్రదించాలని సలహా ఇచ్చాడు రాముడు. పాలకుడిగా ప్రజలమనిషిగా కొన్నింటిని మన్నించాలి, కొన్నింటిని తిరస్కరించాలి, కొందరిని ఆదరించాలి. ఇవన్నీ పరిస్థితిని బట్టి చేయాలని రామాయణం రాముని పాత్ర ద్వారా అనేక సందర్భాలలో మనకు చెప్తుంది.

ఇంకా రామాయణం - పాలకులు ధర్మజ్ఞులు కావాలని, వ్యవహార విషయంలో శత్రుమిత్రసములు కావాలి. రాజ్యపాలనకు సంబంధించిన నిర్ణయాలన్నీ విజ్ఞులతో, విశ్వసనీయులైన వారితో చర్చించి చేయాలి. లోభుల్నీ, దుష్టుల్ని, నయవంచకుల్నీ, అధికారంలో ఉన్న వారిని ప్రలోభ పెట్టి తమ పబ్బం గడుపుకునే వారిని దూరంగా ఉంచాలని బోధిస్తుంది. ప్రభుత్వ నిర్ణయాలలో ప్రజలకు భాగస్వామ్యం ఉండాలని, ఈ ప్రభుత్వం మనది, మనకు తెలియకుండా ఏమీ జరగదనే నమ్మకం ప్రజలకు కలగాలి. ఏ పని చేసినా న్యాయాన్ని, ధర్మాన్ని అనుసరించి చేయాలి. ధర్మాన్ని కాపాడేందుకు పటిష్టమైన న్యాయవ్యవస్థ ఉండాలి. మనవీయ విలువలను,మానవహక్కులను ప్రభుత్వాలు పరిరక్షించాలి. ప్రజలను అవమాన పరుస్తూ, బెదిరిస్తూ, భయభ్రాంతులను చేసేవారు శాంతిభద్రతలు, రక్షణదళాలలో ఉద్యోగులుగా ఉండకూడదని చెప్తుంది. ప్రభుత్వపాలనలో పారదర్శకత ఎంతైనా ఉండాలని రామాయణం మనకు రాముని పాత్ర ద్వారా తెలియజేస్తుంది.

## 6. ముగింపు:

రామాయణంలో ముఖ్యపాత్రలైన దిలీపుడు, హరిశ్చంద్రుడు, దశరథుడు, శ్రీరాముడి వంటి పాలకులు ప్రజలకు ఎంతైనా అవసరం. నేటి పాలకులు ప్రజలను అన్ని విధాలుగా ఆదుకుంటామని, రక్షిస్తామని ఏ ప్రమాణాలు చేసి అధికారాలలోకి వచ్చారో ఆ వాగ్దానాలను గాలికి వదిలేసి, ప్రజలను నిర్లక్ష్యం చేసే పాలకులనే నేడు మనం చూస్తున్నాం. అటువంటి వారు ఉన్నా ఒకటే !లేకున్నా ఒకటే! రాజులకు-పాలకులకు ఉండవలసిన లక్షణాలు రామాయణంలో మనకు కళ్ళకు కట్టినట్లుగా కనిపిస్తాయి. ప్రజా పాలన చేసేవాళ్ళ సంకల్పం మంచిదై ఉండాలి. వాళ్ళ ఆలోచనలు మంచివే ఉండాలి ప్రజలను రక్షిస్తానని, ఆపద వేళల్లో, ఆకలి వేళల్లో ఆదుకుంటానని, ధర్మం తప్పని పాలకులు మనసులో సంకల్పం చేసుకోవాలి. ఆ సంకల్పం కూడా దృఢంగా చేయాలి. అదే సువ్రతత్వం అని రామాయణం చెప్తుంది. పదవిని అంటిపెట్టుకొని ఒకే వ్యక్తి వీళ్ళ తరబడి కొనసాగడం లేదా తమ వారసులను ఆ స్థానాన్ని భర్తీచేసే వరకు సింహాసనాన్ని వదిలిపెట్టకపోవడం, ప్రజలకు ప్రజాస్వామ్యానికి శ్రేయస్కరం కాదని వీటన్నిటిని రామాయణం మనకు చెప్పకనే చెప్తుంది. ఆయా పాత్రల ద్వారా సందర్భాన్ని బట్టి సమయాన్ని బట్టి సమాజహితానికి రాజు ఏ రాజనీతిని పాటించాలో బోధిస్తుంది. ఈ కోణంలో చూస్తే రామాయణం

అత్యుత్తమైన రాజనీతి శాస్త్రంగా కనిపిస్తుంది. ధర్మం,నీతీ, నియమాలను గాలికి వదిలేసిన నేటి తరానికి రామాయణము అందించిన రాజనీతిజ్ఞానం ఎంతైనా అవసరం.

## 7. ఉపయుక్తగ్రంథసూచి:


1. గోపాల్ రెడ్డి, సుజాతరెడ్డి, ముదిగంటి.(2021).సంస్కృతసాహిత్యచరిత్ర, పొట్టిశ్రీరాములుతెలుగువిశ్వవిద్యాలయం,హైదరాబాద్.
2. బుద్ధారెడ్డి, గోన. (1989). రంగనాథ రామాయణం, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్.
3. శాస్త్రి, ద్వానా. (1998). తెలుగు సాహిత్య చరిత్ర, విశాలాంధ్ర పబ్లిషర్స్. హైదరాబాద్.
4. సుబ్రహ్మణ్య శాస్త్రి. శ్రీపాద. (2019) వాల్మీకి విరచిత రామాయణం, ప్రగతి పబ్లిషర్స్, హైదరాబాద్.
5. సూర్యప్రకాశ దీక్షితులు. పురాణపండ (2012) తి.తి.దే ప్రచురణలు, తిరుపతి.


***


AUCHITHYAM
ISSN: 2583-4797
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_29.php

## "కమనీయం తెలుగు రామాయణం"

### జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 29. దక్షిణాత్య భాషల్లో రామాయణం-అవాల్మీకాంశాలు

**డా. నల్ల ఓబిరెడ్డిగారి ఓబిరెడ్డి**
తెలుగు సహాయ ఆచార్యులు,
శ్రీసాయిబాబా జాతీయ డిగ్రీ మరియు పి.జి. (అటానమస్) కళాశాల అనంతపురము,
అనంతపురము 515 001., అనంతపురము, ఆంధ్రప్రదేశ్.
సెల్: +91 9666303121. Email: nogobireddy@gmail.com

**వ్యాససంగ్రహం:**

*భారతీయ సంస్కృతసాహిత్యంలో సర్వాలంకార గుణ శోభితమైన ఆదికావ్యం వాల్మీకి రామాయణం. కొన్ని వేల సంవత్సరాలుగా రామకథ భారతదేశంలోనే గాక భారతీయ సంస్కృతి ప్రసరించిన దేశాలన్నింట్లోను విశేష ప్రచారాన్ని, ప్రశస్తిని పొందింది. సంస్కృత సాహిత్యంలోనే గాక భారతీయ భాషాసాహిత్యాల్లోను, భారతీయేతర భాషాసాహిత్యాల్లోను, రామాయణానికి వివిధరూపాలైన అనువాదాలు, అనుకరణలు, రామకథవస్తుకాలైన స్వతంత్రగ్రంథాలు వెలువడినాయి. అలాగేప్రాంతీయ భాషల్లో దేశీయతకు అనుగుణంగా రామకథ రూపుదాల్చింది.ప్రాంతీయ భాషలైనతమిళం,తెలుగు,కన్నడం,మలయాళం లలోరామాయణాల్ని రచించినకంబర్, గోనబుద్ధారెడ్డి, కుమార వాల్మీకి (నరహరి),ఎళుతచ్చన్లుతమ రామాయణాల్లో చేసినకల్పనలు,మార్పులు, వర్ణనలుమొదలైనవి వాల్మీకి రామాయణంలో లేని అవాల్మీకాంశాలనుతెలియజేయడం జరుగుతుంది.*

**Keywords:** దాక్షిణాత్యరామాయణం, కంబరామాయణం, రంగనాథ రామాయణం, కుమార వాల్మీకితొరవె రామాయణం, ఎళుత్తచ్చన్ ఆధ్యాత్మ రామాయణం, అవాల్మీకాంశాలు.

## 1. ఉపోద్ఘాతం:

భారతీయసంస్కృతికి ప్రధానాలు రామాయణ, భారతకావ్యాలు. అందులో వాల్మీకిరామాయణంలో సీతారాములు ఆదర్శదంపతులు పితృవాక్య పరిపాలనకు, ఏకపత్నీవ్రతానికి, సత్యనిష్టకు, పరాక్రమానికి రాముడు ప్రతీకైతే, పతిభక్తికి సీతాదేవి ప్రతీక. వాళ్ళ జీవితాల్లో ఎన్నో ఒడిదుడుకులు ఎదురైనాయి. పద్నాలుగేండ్లు అడవి పాలైనారు. ఆ తర్వాత అపనిందలకు గురైనారు, రాముడు జననిందకు భయపడి సీతాదేవిని త్యజించినా పరస్పరం

వాళ్ళలో చెరగని ప్రణయభావాలు పెల్లుబికి ప్రవహించాయి. అందుకే రామాయణం అందరికీ ఆదర్శమైంది. దేశమంతటా రామమందిరంలేని ఊరులేదు. స్త్రీపురుషులకేగాక కాయలకు, పండ్లకు, పశుపక్షాదులకు సీతారాముల పేర్లు పెట్టబడ్డాయి. రామయ్య, సీతమ్మ, రాములక్కాయ, రామాఫలం, సీతాఫలం, రామచిలుక, సీతాకోకచిలుక, సీతమ్మవారి జడ మొదలైన పేర్లు తెలుగునాట కనిపిస్తాయి. ఈవిధంగా ప్రతిభాషా ప్రాంతంలోను వాళ్ళ వాళ్ళ సంస్కృతి సంప్రదాయాలకు అనుగుణంగా ఈ పేర్లు వాడుకలో ఉన్నాయని చెప్పవచ్చు. ఈ అంశాలలో భాషానుడికారాలతో పాటు దక్షిణ భారత ప్రధాన భాషాల్లో వచ్చిన రామాయణాల్లో కూడా వాల్మీకి రామాయణంలో లేని ఎన్నో స్థానిక సంబంధ కల్పనలు కనిపిస్తాయి. అటువంటి విచిత్రమైన అవాల్మీకాంశాలను, వాటికి గల కారణాలను పరిశీలించడమే ఈ వ్యాసంయొక్కఉద్దేశ్యం.

## 2. దాక్షిణాత్య రామాయణాల్లోఅవాల్మీకాంశాలు:

భాషాశాస్త్రవేత్తలు ద్రావిడభాషల్ని 23భాషలుగా పేర్కొన్నారు. అందులో లిపి,సాహిత్యాలతో పాటు నాగరికంగా అభివృద్ధి చెందిన దాక్షిణాత్య భాషల్లో వందలాదిగా రామాయణ సంబంధమైన రచనలు వెలువడినాయి. వాటిలో తమిళం, తెలుగు, కన్నడం, మలయాళం భాషల్లో మొదట వెలువడిన రామాయణ కావ్యాల్నే పరిశోధించుటకు స్వీకరించడమైంది. అవి: తమిళంలో కంబర్ రచించిన 'కంబ రామాయణం,' తెలుగులో గోనబుద్దారెడ్డి రచించిన'రంగనాథ రామాయణం', కన్నడంలో కుమారవాల్మీకి రచించిన తొరవె రామాయణం. మలయాళంలో ఎళుత్తచ్చన్ రచించిన అధ్యాత్మరామాయణం. ఈ నాలుగు భిన్నభాషల్లో వెలసిన రామాయణాల్లో ఉన్న అవాల్మీకాలలో రచనా కాలనికి సంబంధించిన సామాజిక విశేషాలు తెలుస్తాయి.

## 2.1. కంబరామాయణం – అవాల్మీకాంశాలు :

కంబర్ తన రామాయణంలో ద్రావిడ సంప్రదాయానికి, సంస్కృతికి, ద్రావిడప్రజల అలవాట్లకు, మనస్తత్వాలకు, సాహిత్యసంప్రదాయాలకు తగినట్లు ఎన్నో మార్పులు చేశారు. అవి. వివాహానికి ముందే సీతారాములు ఒకరినొకరు చూసుకుంటారు. చూపుల కలయికతో పరస్పరం ప్రేమించు కుంటారు. ఒకరి నొకరు తలచుకుంటూ విరహవేదనలో తల్లడిల్లి పోతారు, మరునాడు సీత రాముడు విల్లువిరిచిన వార్తవిని అతడు తను చూసి ప్రేమించినవాడు కాకపోతే ఆత్మహత్యచేసుకుంటానని శపథం చేస్తుంది. ఇది కంబర్ కల్పన. వాల్మీకి రామాయణంలో లేదు.

చ. ***'వలపు వహించు చూపులను పాశముచేసిరు మానసంబులున్***
***బలముగలోగి లాగ బ భాను కులాంబుధి సోము మానసం***
***బల జనకాత్మజాతయేద యందు వసించెను సీత మానసం***
***బల రఘురామ చంద్రు నెద యందు రగుల్కొనెజిత్ర వైఖరిన్ '***[1]

దశరథుడు రాముని అడవులకు పంపమంటున్న కైకేయిని కోపించి దూషించినాడు. మనసు కరగని కైకను భరతుడు తన తన పుత్రుడు కాదని, అతడు తన అంత్యక్రియలు చేయరాదని దశరధుడు శాసిస్తాడు. ఈ విషయం మూల గ్రంథమైన వాల్మీకి రామాయణంలో లేదు.భరతుడు రాముని పాదుకలను శత్రుంజయమనే ఏనుగుపై పెట్టుకొని వెళ్ళినట్లు కంబరామాయణంలో వుంది.

రావణుడు సీతను ఒక చేతితో తొడను, ఒకచేతితో వెంట్రుకలను పట్టుకొని బలవంతంగా తీసుకొని వెళ్లి రథంపై కూర్చొని బెట్టుకున్నట్లు మూలంలో వుంటే, కంబర్ రావణాసురుడు సీతను తాకకుండా ఆమె నిలిచివున్న భూభాగాన్ని పెళ్ళగించుకొని వెళ్లినట్లుంది

**తే.** ***తొంటిశాపంబు తలంచియా ; దుష్ట దైత్యం దురు భుజంబు నా వేల నొక్క పెట్ట***
***బెల్లగించి సీతను దాటి వెడల నీక, చేత బట్టి రధమున...***[2]

**తే.** ***ఉరముపై భయమునఁ జేతు లుంచు కొనిన, చెలువ తన ప్రాణములఁగూడ దెలియదయ్యె***
***మట్టితో నామె మెఱుపులో మరగిపోయె. రావణుండాకసంబున రథముదోలె***[3]

వాలి వధ తర్వాత సుగ్రీవుడు తారని చేపట్టినట్లు మూలంలోవుంది. తారకూడా సుగ్రీవుని, ప్రేమను అంగీకరిస్తుంది. కానీ కంబరామాయణంలో సుగ్రీవుడు తార పట్ల మాతృభావం వున్నవాడని, తార సంసారజీవితాన్ని త్యజించి యోగినిలాగా జీవించిందని చెప్పబడింది.కోపంతో వస్తున్న లక్ష్మణుని శాంతింపజేయడానికి హనుమంతుని ఆలోచన ప్రకారం తార లక్ష్మణునికి ఎదురు వస్తుంది. వాల్మీకి రామాయణంలో ఆమె తాగిన కైపులో తూలుతూ అర్ధనగ్నంగా వస్తే లక్ష్మణుడు ఈమెను చూసి జుగుప్సతో తలవంచు కుంటాడు. కానీ కంబరామాయణంలో వైధవ్యాకారంతో, శోకం మూర్తీభవించి వచ్చిన తారను చూసి లక్ష్మణుడు తన తల్లులు గుర్తొచ్చి తలదించుకుంటాడు.

రామలక్ష్మణులను చూసి వాలి పంపిన వీరులని, పగవాళ్లని భయపడిన సుగ్రీవుడు నిజం తెల్చుకొని రమ్మని పంపిస్తే హనుమంతుడు రామలక్ష్మణుల దగ్గరికి వెళ్లినట్లు వాల్మీకిరామాయణంలో చెప్పబడింది. రాజుయొక్క ఖ్యాతిని, సందేహాన్ని పోగొట్టడం. మంచి మంత్రి కర్తవ్యం కాబట్టి హనుమంతుడు తనకు తానే వాళ్ళ దగ్గరికి వెళ్ళినట్లు కంబరామాయణంలో ఉంది.రామలక్ష్మణులు పగవాళ్ళు కారని తెలుసుకున్న హనుమంతుడు వాళ్ళను తన భుజాలపై ఎత్తుకొని సుగ్రీవుడున్నచోటికి వెళ్ళినట్లు వాల్మీకి రామాయణంలో చెప్తే, ముందు తాను మాత్రంవెళ్ళి సుగ్రీవుణ్ణి రామలక్ష్మణుల దగ్గరికి పిలుచుకొని వచ్చినట్లు కంబర్ వర్ణించాడు

హనుమంతునికి సీత తన జీవితంలోని ఒక సంఘటనను చెప్పంది. ఒకప్పుడు తన పెంపుడు చిలుకకు పేరు పెట్టమని సీత రామున్ని కోరుతుంది. రాముడు చిలుకకు కైక పేరు పెట్ట మంటాడు. దీనివల్ల కైకపట్ల రామునికి ఉండే భక్తి, గౌరవాలు వ్యక్తమవుతాయి. ఇలాంటి సన్నివేశం వాల్మీకిరామాయణంలో లేదు.

కుంభకర్ణుడు రామునితో పోరాడుతున్నప్పుడు రావణుడు సీతప్రేమను పొందటానికి మాయాజనకుని సృష్టించి సీతకు-హితం చెప్పమని ప్రయత్నించడం కంబరామాయణంలో ఉంది. వాల్మీకి రామాయణంలో లేదు.

ఈ విధంగా కంబర్అనేక అవాల్మీక అంశాలతోతన రామాయణంలో అనేక మార్పులతో తన కాలం నాటి ద్రావిడ సాంస్కృతిని దృష్టిలో పెట్టుకొని అనేక అంశాలను రాయడం జరిగింది.

## 2.2 రంగనాథ రామాయణం - అవాల్మీకాంశాలు:

తెలుగులో వెలసిన రామాయణాలన్నింటిలోనూ మొట్టమొదట పేర్కొనదగింది రంగనాథ రామాయణం దీనిని గోనబుద్ధారెడ్డి (13వ.శ) ద్విపదలో రాశాడు. గోన బుద్ధారెడ్డి తన కాలంనాటి ప్రజలలో వాడుకలో ఉన్న జానపదకథలను, నమ్మకాలను తన రామాయణంలో తెలియ జేశారు. ఆ కారణంగా రంగనాథరామాయణంలో అనేకే అవాల్మీకాంశాలు చోటు చేసుకున్నాయి. అవి:

*నిద్రాదేవితో లక్ష్మణుడు తనకు బదులుగా తన భార్య అయిన ఊర్మిళాదేవిని ఆవేశింపమని, అరణ్యవాసం పూర్తయిన తర్వాత నిద్రను స్వీకరిస్తానని అంటాడు.*[4]

వాల్మీకి రామాయణంలో లేని జంబుమాలికథ రంగనాథరామాయణంలో ఉంది. హనుమంతుడు రావణాసురుని ముందు తోకను పెంచడం కూడా అవాల్మీకాంశమే. తనకు హితాన్ని ఉపదేశించిన తమ్ముడైన విభీషణుని రావణాసురుడు తన్ని లంకానగరం నుండి వెళ్ళగొట్టాడు. తనతల్లి దీవెనలతో విభీషణుడు రాముని శరణు వేడడం, రంగనాథ రామాయణంలోని కల్పన, వాల్మీకి రామాయణంలో తాను పలుమార్లు చేసిన హితాన్ని రావణాసురుడు పెడచెవినిబెట్టడం చూసి విరక్తితో విభీషణుడు తానే రాముని శరణు కోరినట్లుఉంది.

సేతు నిర్మాణంలో ఒక ఉడుత సహాయపడడాన్ని చూసి రాముడు సంతోషంతో దాని వీపును నిమిరినట్లు రంగనాథ రామాయణంలో చెప్పబడింది.[5] వాల్మీకి రామాయణంలో అలా లేదు. రావణాసురుని తల్లి కైకసి కొడుకుకు హితబోధ చేస్తే అతడు పెడచెవిని బెట్టడం రంగనాథరామాయణంలో ఉంది. రావణాసురుడు రాముని సాక్షాత్తు విష్ణువని గ్రహించినట్లు, అతని చేతిలో మరణాన్ని పొంది స్వర్గాన్ని చేరాలన్న కాంక్షతో సీతను అపహరించినట్లు రంగనాథరామాయణంలో చెప్పబడింది. వాల్మీకి రామాయణంలో రావణుడు గొప్ప ప్రతినాయకుడుగా సృష్టించబడినాడు.[6]

వాల్మీకిరామాయణంలో లేని ఇంద్రజిత్తు భార్య సులోచనా వృత్తాంతం రంగనాథరామాయణంలో తెలిపాడు. కాలనేమి వృత్తాంతం కూడా రంగనాథరామాయణంలో ఉంది. కానీ వాల్మీకి రామాయణంలో లేదు.[7] రామరావణ యుద్ధంలో రాముడు రావణాసురుని శిరస్సును, చేతుల్ని, ఖండించినా, అవి మళ్ళీ యథా ప్రకారం అతుక్కుంటుంటే, ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించి రావణుని నాభిలో ఉన్న అమృతకలశాన్ని ఇంకింపజేసి, అతనిని చంపమని విభీషణుడు రామునికి ఉపాయం చెప్పినట్లు రంగనాథరామాయణంలో ఉండగా మూలంలో వాల్మీకి రామాయణంలో బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించమని రామునికి మాతలి సలహా చెప్పినట్లుంది.

పై విధంగా గోన బుద్ధారెడ్డి తన రంగనాథ రామాయణంలో తెలుగు సంస్కృతి, ఆచారాలు ఆధారంగా రామాయణంలో అనేకమార్పులతో అవాల్మీకాంశాలు కల్పించడం జరిగింది.

## 2.3 కుమారవాల్మీకిరామాయణం –అవాల్మీకాంశాలు:

కుమార వాల్మీకిగా ప్రసిద్ధి గాంచిన తొరవె నరహరి కవి (క్రీ.శ.1580) తన దైవమైన తొరవె నృసింహుని పేర తొరవె రామాయణమును కన్నడంలో ఐదు వేలకుపైగా భామిని షట్పదులతో కొన్ని చోట్లమూలమునకు భిన్నముగా సన్నివేశములను చేర్చినాడు.కన్నడ రామాయణకర్త మూలకథకు వాల్మీకిని ఆశ్రయించినా, నిరూపణలో తనదైన విధానాన్ని అనుసరించినాడు. అందువల్ల మూలమైన వాల్మీకి రామాయణానికిభిన్నమైన కల్పనలు కొన్ని చోటు చేసుకున్నాయి. జానపదకథలు, జైనరామాయణాలు, కుమార వాల్మీకిపైన ఎంతోప్రభావాన్ని చూపాయి. కేవలం ఇతిహాసంగా ఉన్న రామాయణానికి తోడు భక్తితత్త్వాన్ని కలిపాడు.

కుమారవాల్మీకి దృష్టిలో రామాయణాన్ని సృష్టించినవాడు బ్రహ్మదేవుడు. బ్రహ్మదేవుడు వాల్మీకికి ఆ కథను చెప్పాడు. దీనిని శివపార్వతుల సంభాషణలతో ప్రారంభించి శివుడు పార్వతికి చెప్పినట్లు నిరూపించాడు.

మూలంలోవాల్మీకిరామాయణంలో రాముడు పురుషుడేకాని దైవం కాదు. కానీ భక్తి ఉద్యమప్రభావం వల్ల కన్నడకవి కుమార వాల్మీకిశ్రీరామున్ని విష్ణువు యొక్క అవతారంగా చెప్పాడు. అవకాశం దొరికినప్పుడంతా రాముని దేవుడని కీర్తించాడు.[8]

గౌతముడు తన భార్య అహల్యను శపించినప్పటి నుండి ఆమె అదృశ్యరూపంలో మూల రామాయణంలో ఉంటే. కన్నడ కుమారవాల్మీకి రామాయణంలోఅహల్యశిల రూపంలో ఉన్నట్లు రాముడు ఆ శిలను తాకగానే శాపవిమోచనం కలిగినట్లు చెప్పబడింది. మూలరామాయణంలో గౌతముని సతి అయిన అహల్యకు రాముడు నమస్కరిస్తాడు. సాక్షాత్తు విష్ణుస్వరూపుడైన శ్రీరామచంద్రుడుగౌతముని భార్యకు నమస్కరించడం సరైందికాదని అహల్య రామునికి నమస్కరించినట్లు కుమార వాల్మీకి తన రామాయణంలోమార్చినాడు.సీతా స్వయంవరానికి సంబంధించి కుమారవాల్మీకి ఒక అద్భుతమైన కల్పన చేశాడు. రాముడు జనకుని ఆస్థానానికి శ్రీరామ.రావణులు వెళ్ళకముందే చాలా మంది రాజులు శివధనుస్సు ఎత్తే ప్రయత్నంలోఓడిపోయినట్లు మూలవాల్మీకి రామాయణంలో ఉంటే, దేశంలోని అనేకమంది రాజులుఒక నిర్దిష్ట సమయంలో వచ్చి శివధనుస్సు ఎత్తే ప్రయత్నం చేశారని అందులో రాముడు మాత్రమే నెగ్గాడని ఆ సమయంలో రామ, రావణులప్రథమ దర్శనం అయిందని కుమారవాల్మీకి చెప్పాడు. వనవాసకాలంలో లక్ష్మణుడుపద్నాలుగు ఏళ్లు నిద్రాహారములు మాని సీతారాములను సేవించినట్లు కుమార వాల్మీకితన తొరవెరామాయణములోచెప్పాడు.[9]

రామాయణంలో మంథర పాత్ర చాలా కీలకమైంది. అసలు రామాయణాన్ని నడిపించే మంథర మూల

రామాయణంలో ఆమె చాలా సహజమైన స్త్రీలాగా వ్యవహరించి భరతుణ్ణి రాజుని చెయ్యమని కైకేయిని ప్రేరేపిస్తుంది. కన్నడ రామాయణంలో మంథర మాయ యొక్క అవతారం. ఆమె కారణంగానే ఉత్తమురాలైన కైకేయి పుత్రవ్యామోహంలో పడి రామున్ని దూరంచేసుకొని, తన కుమారునికి పట్టాభిషేకం చేయుమనిపట్టుపడుతుంది. మూలంలో దశరథుడు చనిపోగానే ఆ వార్త దావానలంలా రాజ్యమంతటా తెలుస్తుంది. కన్నడ రామాయణంలో భరతుడు అయోధ్యకు వచ్చేంతవరకు ఆ వార్త బయటకి తెలవదు. మూలంలో భరతుడు తన తండ్రి చనిపోవడానికి, రాముడు అడవులకు వెళ్ళడానికి తల్లి కారణమని భరతుడు కోపంతో ఆమెను చంపడానికి వస్తాడు. కన్నడ రామాయణంలో భరతుడు తన ఆవేశాల్ని, కోపాల్ని , బాధను దిగమింగుకొని చాలా ఓర్పుతో వ్యవహరిస్తాడు.

విభీషణుని మాటలు పెడచెవిన పెట్టినందుకు చివరకు రావణుడు పశ్చాతాప పడినట్లు తొరవెరామాయణములో కలదు. ఇది మూలంలో లేదు.[10]

పై విధంగా అనేక అవాల్మీకాంశాలను కన్నడ కవి కుమార వాల్మీకి తన రామాయణంలో కన్నడ సంస్కృతి , సాంప్రదాయాలకు అనుగుణంగా అనేక మార్పులతో చేయడం జరిగింది.

## 2.4 ఆధ్యాత్మ రామాయణం –అవాల్మీకాంశాలు :

ఎళుత్తచ్చన్రామాయణ రచన ద్వారా పాఠకులకు ఆధ్యాత్మికానందాన్ని చేకూర్చడానికి ప్రయత్నించాడు. అతనిజీవితమంతా భగవంతునిపట్ల, అతని అవతారాల పట్ల నిశ్చలమైన భక్తి నిండుగా ఉండడంవల్ల, భగవంతుని లీలల్ని హృదయపూర్వకంగా వర్ణించాడు. భక్తుడు కావడంవల్ల అతని కవిత్వం ఆవేశపూరితంగా కన్పిస్తుంది. అతని పద్యాలు సంగీత మాధుర్యంతో నిండి పాఠకుని పట్టి చదివించేవి. అతని ఉపదేశాలు ప్రజలకు ఆమోద యోగ్యాలుగా ఉండేవి. మానవ విధిని, జీవిత రహస్యాలను చొప్పించి ప్రజల ఆలోచనావిధానాన్నీ ఉన్నత స్థానాలకు తీసుకుపోగల తాత్విక విషయాలతో నింపి ఎళుత్తచ్చన్ రామాయణాన్ని రచించాడు.

మూలకథను స్వతంత్రంగా, వ్యక్తిగతమైన రీతిలో పునర్నిర్మించిన మూలానికి సన్నిహితంగానే కన్పిస్తుంది. అయినా ప్రతి పంక్తిలోను రచయిత ఆత్మీయత స్పష్టంగా గోచరిస్తుంది.

రాముని నామసంకీర్తన చేసే సందర్భాల్లో ఒకటి రెండు విశేషణాలో, పర్యాయపదాలో వాడి తృప్తి చెందదు. రాముని పూజించడానికి వాటి సమూహాన్ని ఒక సుందరమైన మాలగా గుచ్చుతాడు. భగవంతుని లీలావిలాసాన్ని చిత్రించడానికి నీతి, తత్త్వ సిద్ధాంతాలకు ప్రాధాన్యమివ్వడం అధ్యాత్మరామాయణంలో కన్పిస్తుంది.[11]

ఈ కవి మూలవిధాయంగా రాసిన కథలను రాముడు అతని సహోదరుల బాల్యం రామ పరశురాముల పోరాటం సూర్పనకు ప్రవేశం వాలి మరణం లంక విధ్వంసం రావడంతో యుద్ధం మొదలైన వాటిని మార్పులతోతన రామాయణాన్ని కూర్చాడు.[12] వాల్మీకి రామాయణంలో పురుషోత్తముడుగా, ప్రజారంజక పరిపాలకునిగా

వర్ణించబడిన రాముడు మలయాళ ఆధ్యాత్మిక రామాయణంలో దైవంగా చిత్రించబడినాడు. కవి రామభక్తుడుగా దర్శనమిస్తాడు. వీరరసాన్ని ప్రత్యేక శ్రద్ధతో పోషించాడు. కేరళలోని ఆనాటి యుద్ధాలు , సాంఘిక ఆచారాలు ఇతని వీరరస పోషణకు బాగా తోడ్పడినాయి. వాలి-సుగ్రీవుల ద్వంద్వయుద్ధం వీరరసానికి ఆయువు పట్టుగా కనిపిస్తుంది.[13]

ఆధ్యాత్మ రామాయణంలో కేరళ కవిఎలుత్తచ్చన్ లక్ష్మణోపదేశంలో వేదాంతాన్ని చర్చించాడు.రామాయణ రచనకు మూల వాల్మీకిరామాయణంలోనిసంస్కృతఛందస్సుల్ని కాకుండామలయాళ ఛందస్సులను ప్రవేశపెట్టాడు. ఈ విధంగాఎళుత్తచ్చన్ తన ఆధ్యాత్మిక రామాయణంలో కేరళ సాంస్కృతిక సాంప్రదాయాలను, నాటి యుద్ధాలను దృష్టిలో పెట్టుకొని మూలంలో లేనిఅనేక మార్పులతో కేరళ చందస్సులను కూడా చేర్చి రాయడం జరిగింది.

## 3. ముగింపు:

దాక్షిణాత్య భాషలైన తమిళం, తెలుగు, కన్నడం, మలయాళం, నాలుగు భాషల్లోను రామాయణరచన వాల్మీకి రామాయణాన్ని అనుసరించే జరిగింది. కాని రామునిపాత్రను వాల్మీకి కంటే భిన్నంగా, గొప్పగాదక్షిణాత్య భాషా కవులుగొప్పగాపోషించారు. అయినా నలుగురు కవులు రాముని సాక్షాత్తు మహావిష్ణువు అవతారంగా చెప్పారు. ఈ కవులందరూ భక్తులుగా దర్శనమిస్తారు.

అయినా ఆయా భాషల్లోని ఛందోరీతులు, ఆయా కాలాల్లోని సామాజికాంశాలు ప్రత్యేకతల్ని సంతరించుకున్నాయి. నాలుగు భాషల్లోను రామాయణ రచన మొదట దేశీయంగా వెలువడడం. గమనించదగిన అంశం. అందరు కవులు మూలాన్ని అనుసరిస్తూనే సామాన్య ప్రజల్లో ప్రచారంలో ఉండిన కథల్ని, సన్నివేశాల్ని, నాటి పరిస్థితుల్నిచేర్చి, అవాల్మీకమైన కల్పనల్ని జోడించి రచన చేశారు. అవన్నీ ఆయా రామాయణాలకు ప్రాధాన్యతను తెచ్చి పెట్టడం జరిగిందని చెప్పవచ్చు.

## 4. పాదసూచికలు:

1. కంబరామాయణం (ఆంధ్రానువాదం)బాలకాండ పుట -68
2.కంబ రామాయణం (ఆంధ్రానువాదం) అరణ్యకాండ పుట 354
3.కంబ రామాయణం (ఆంధ్ర అనువాదం) అరణ్యకాండ పుట 354
4.దాక్షిణాత్య సాహిత్య సమీక్ష- పుట 70
5.రంగనాథరామాయణం-యుద్ధకాండ పుట- 253 540 పద్యం
6..రంగనాథ రామాయణంయుద్ధకాండ-(పుట 301,పద్యం-1100)
7..రంగనాథ రామాయణం యుద్ధకాండ - పుట- 305,ప-1230
8.దాక్షిణాత్య సాహిత్య సమీక్ష- పుట- 82
9.దాక్షిణాత్యసాహిత్య సమీక్ష -పుట 31
10.మలయాళ వాఙ్మయచరిత్రము-పుట .72

11.మలయాళ వాఙ్మయచరిత్రము-పుట 73.

12.మలయాళ వాఙ్మయచరిత్రము-పుట77.

13.మలయాళ వాఙ్మయచరిత్రము-పుట 72

## 5. ఉపయుక్తగ్రంథసూచి:


1. నాగయ్య, జి. (1976), దక్షిణాత్య సాహిత్య సమీక్ష, నవోదయ పబ్లిషర్స్, విజయవాడ 2.
2. నాగేశ్వరరావు, ద్వాదశి, (1998), తెలుగు సాహిత్య చరిత్ర,విశాలాంధ్ర పబ్లిసింగ్ హౌస్, హైదరాబాదు.
3. పరమేశ్వరన్ నాయర్. పి.కె.(1978) మళయాళ వాఙ్మయచరిత్రము, సాహిత్య అకాడమీ, న్యూఢిల్లి.
4. బుద్ధారెడ్డి గోన (1949) రంగనాథరామాయణం. రాయలు,అండుకోపబ్లిషర్స్& బుక్సెల్లర్స్ ,కడప.
5. మలయవాసిని, కె. (1989), ఆంధ్ర వాఙ్మయము - రామాయణము, విశాఖ పట్టణం.
6. ముగలి, రం. (1978) కన్నడ సాహిత్ర చరిత్ర, సాహిత్య- అకాడమీ,న్యూఢిల్లి.
7. వరదరాజన్, ము.(1982), తమిళ సాహిత్య చరిత్ర,సాహిత్య అకాడమీ, న్యూఢిల్లి.
8. శ్రీరాములురెడ్డి,పూతలపట్టు,(1953), కంబరామాయణము (ఆంధ్రానువాదం) సంపుటి-2, పూతలపట్టు శ్రీరాములురెడ్డి మెమోరియల్ ట్రస్టు, చిత్తూరు.


***


AUCHITHYAM
ISSN: 2583-4797
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_30.php

# "కమనీయం తెలుగు రామాయణం"

**జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక**

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

## 30. తందనాన రామాయణం: అవాల్మీకీయాంశాలు

**సబ్బని రామస్వామి**

తెలుగు ఉపన్యాసకులు,
ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి), సిద్ధిపేట,
సిద్ధిపేట జిల్లా, తెలంగాణ.
సెల్: +91 6301845163. Email: sabbaniramaswamy@gmail.com

**వ్యాససంగ్రహం:**

*వాల్మీకి సంస్కృత రామాయణాన్ని అనుసరించి తెలుగులో ఎన్నో ప్రక్రియల్లో రామాయణాలు వచ్చాయి.వాటన్నిటిలో గేయపద్ధతి లో వచ్చిన తందనానా రామాయణానికి ప్రత్యేక స్థానం ఉంది. రుక్మాభట్ల విధుమౌళి శర్మ రాసిన తందనానా రామాయణం వాల్మీకి రామాయణ ఆధారంగానే రచించినప్పటికీ వాల్మీకి రామాయణంలో లేనటువంటి అనేక విచిత్రమైన కల్పనలు ఇందులో ఉన్నాయి.జానపదలకు ప్రధానంగా గ్రామీణుల కొరకు ఉద్దేశించి,ప్రధానంగా గ్రామీణుల కొరకు భజన సాంప్రదాయం కోసం రాయబడినటువంటి తందనానా రామాయణంలో పతంగిదారం ఆధారంగా హనుమంతుడు ఇంద్రలోకం వెళ్లడం, మాయ సీత,నిజ సీత హనుమంతుని తోకకు నిప్పు పెట్టే సమయంలో రావణుని మీసాలు కాలడం ఇలాంటి విచిత్ర మైన కల్పనలు ఎన్నో ఉన్నాయి. నాలుగు దశాబ్దాల కిందట తెలంగాణ ప్రాంతంలో భజన సాంప్రదాయానికి పునర్జీవనం పోసిన తందనానా రామాయణాన్ని అధ్యయనం చేయడం ద్వారా వాల్మీకి రామాయణంలో లేనటువంటి విచిత్రమైన కల్పనలను అవాల్మీకాంశాలు తెలియజేయడమే ఈ వ్యాసం యొక్క ఉద్దేశ్యం. మరియు అవాల్మీక అంశాలు ఈ వ్యాసం ఆధారంగా తెలుసుకోవచ్చు.*

**Keywords:** తందనాన రామాయణం, విధుమౌళిశర్మ, అవాల్మీకీయ, హనుమంతుడు, ఇంద్రలోకం, మాయాసేత పట్టాభిషేకం., మైనాక, జయంతుడు,

## 1. ఉపోద్ఘాతం:

మానవీయ విలువలకు, పటిష్టమైన కుంటుంబవ్యవస్థకు నిలువెత్తు నిదర్శనం రామాయణం, అన్నతమ్ముల అనుబంధానికి, పితృవాక్య పరిపాలనకు, భార్యాభర్తల అనుబంధాలకు ఆలవాళం రామాయణం. అలాంటి రామాయణము సంస్కృతంలో వాల్మీకి రాసిన తరువాత ప్రపంచవ్యాప్తంగా ఎన్నో భాషల్లోకి అనువాదమైంది. క్రీశ

12 వ శతాబ్దంలో గోనబుద్ధారెడ్డి రంగనాథరామాయణంలో తెలుగులో రామాయణం మొదలు అయింది. తరువాత భాస్కరా రామాయణం, మొల్లరామాయణం లాంటి ఎన్నో రామాయాణాలు తెలుగులో వెలిసాయి, అలాంటి సమయంలో వెలసిన క్రమంలో వచ్చిన గానయోగ్యమైన రామాయణమే తందనాన రామాయణం. పండిత, పామర జనరంజకంగా తందానాన రామాయణాన్ని అందించిన వాగ్గేయకారుడు "శ్రీ రుక్మభట్ల విధుమౌళిని గర్మ గారు". గజ్వేల్ లో జన్మించిన వీరు ఉత్తర తెలంగాణలో ఉరూరా ఈతందనాన రామాయణాన్ని ప్రచారం చేసిన గొప్ప వాగ్గేయకారుడు.

## 2. తందనాన రామాయణం- రచన నేపథ్యం :

సిద్దిపేట జిల్లా వాస్తవ్యులైన విధుమౌళి శర్మ గారు హరికథా గానంలో మిక్కిలి ఖ్యాతి గడించిన పండితులు. ఒక రోజు వారింటికి చంద్రయ్య మల్లమ్మ అనే శారదకాండ్ర దంపతులు కిన్నెర మీటుకుంటూ, తందానతానే అని పాడుకుంటూ యాచించడానికి వచ్చారు. వారి గానంలో లయత్మకత రుక్మభట్ల విధుమౌళి శాస్త్రి గారిని ఆకర్షించింది ఆ బాణీనే పదేపదే నెమరువేసుకుంటూ ఈ జానపద పద్దతిలో రామయణ రచన చేసినట్టయితే ప్రజలకు బాగా చేరువవుతుందని భావించారు.వారం రోజుల పాటు చంద్రయ్య మల్లమ్మ దంపతులను తన వద్దనే ఉంచుకొని వారు పాడే తందానతానే పాటలు విని ఆ బాణీ పైన పట్టు సాధించాక రామాయణ రచనకు పునుకున్నాడు. రచనా కాలం నాటికి విధుమౌళిశాస్త్రి గారికి దృష్టి దోషం ఉండటం వల్ల ఆయన గానం చేస్తుండగా ధీకొండ బాలనర్సు అని లేఖకుడు ఈ రామాయణంను రాసాడు .దాదాపుగా మూడు సంవత్సరాల పాటు ఈ రచన కొనసాగింది.ఈ తందనాన రామాయణాన్ని విధుమౌళి శర్మ తన గురువైన శ్రీ భావానంద స్వామికి అంకితమిచ్చాడు.

## 3. తందనాన పరమార్థం :

గేయకావ్యాలకు లయాత్మకత ప్రాణం, తందనాన రామాయణంలో ప్రతిపాదం చివర తందాన తాన ! జయరామారావు (2+3+3) మాత్రలతో సాగే పదాలు పునారావృతమవుతుంటాయి. దీనివల్ల ఈ రామాయణం. అనాయాసంగా సులువుగా పాడుకోవడానికి వీలు కలుగుతుంది. చదువురానివారు కూడా ఈ రామాయణ పాదాలకు "జయరామరామ" అని వంత పాడేవారు. మాత్ర ఛందస్సులో రాయబడిన ఈ రచనలో ఆరు రకాల గతులు వంతలను ప్రత్యేకరీతిలో వాడటం విశేషం. అందుకే ఇతర రామాయాల్లాగా ఇది వ్యక్తి పేరుతోనే, ఛందస్సు పేరుతోనే ప్రచారం కాకుండా లయాత్మకతను సూచించే "తందనాన" అనే పదం పేరుతో "తందనాన రామాయణంగా " ప్రసిద్ధి చెందింది. దానిలో వ్యాఖ్యానం కన్నా శృతికి ప్రాధాన్యత ఎక్కువ. పాడేటప్పుడు గాయకుడు అలసిపోకుండా వంతల ద్వారా "రామరామ సీతారామ జయ రామ రామ – బాలా నగరాజనందనా జయ రామ రామ" అనే అనుపల్లవి పునరావృతమౌతుంది. తందనాన పేరుతో వెలువడిన ఈ రచనలో ఉపయోగించిన

తందానాన పదానికి వేదాంతపరంగా విశేషమైన అర్థం ఉంది. తందానా పేరుతో వెలువడిన ఈ రచనలో ఉపయోగించిన తందానాన పదానికి వేదాంతపరంగా విశేషమైన అర్థం ఉంది. తందానాన < తను తనేనా తనువు తనదేనా అంటే మిధ్య అయిన శరీరం తనదేనా అనే అర్థాన్నిస్తుంది. అలాగే తనుతానే తందానే < తనకు తానే బాగుపడాలి అని లోతైన అర్థం వస్తుంది.

## 4. తందనాన రామాయణంలో భాషాంశాలు:

తందనాన రామాయాణంలో కని ప్రామాణిక భాష కన్నా ప్రాంతీయభాషకే ఎక్కువ ప్రాధాన్యతనిచ్చాడు. ఇందులో పాదపాదానా ప్రాంతీయ మాండలిక పదజాలం, పలుకుళ్ళు, సామెతల తో పాటు మన భాషలో కలిసిపోయిన ఉర్దూ వంటి అన్యభాషా పదాలు కన్పిస్తాయి. నిజాం కాలంలో తెలంగాణా ప్రాంత పాలకుల అధికారభాష ఉర్దూ కావడం వల్ల తెలుగులో ఎన్నో ఉర్దూ పదాలు చేరి. వ్యవహారంలో నిలిచిపోయాయి. అటువంటి చాలా పదాలు ఈ తందనాన రామాయణంలో చూడవచ్చు.

ఉదా:- "దొరవు నీవు పొర బిరానా"- జయరామ రామ మధ్య మధ్య" మహలాబు" లను-జయరామరామ.1 ప్రజలభాషలో రాయబడిన " తందనాన రామాయం లో కొన్ని సంస్కృత సమాసాల శ్లోకాల అనువాదం. అచ్చ తెనుగు పదాలలో జనవ్యవహారానికి దగ్గరగా ఉండటం విశేషం. రాముడి వర్ణనలు 'ఆజానుబాహుడు' అనే ప్రసిద్ధ ప్రయోగాన్ని అర్థం చెడకుండా మోకాలును దాటేడు కీలు" - జయరామరామ అని అనువదించాడు.

## 5. తందనాన రామయణంలో అవాల్మీకీయాంశాలు :

ఇందులో వాల్మీకి రామాయణంతోపాటు, తులసీదాసు రామచరితమానస్, ఆధ్యాత్మిక రామాయణం, రాధేశ్యాం రామాయణం, రంగనాథ రామాయణం,విచిత్ర రామాయణం మొదలుకొని ఎన్నో రామాయణాల్లోని ప్రజాను రంజక ఘట్టాలను వాడుకున్నట్టు ప్రకటిస్తుంది. రామయణానికి మూలం అయిన వాల్మీకి రామామంత లేని ఎన్నో అంశాలను ఈ తందనాన రామాయణంలో ప్రస్తావించారు. " నవనవోన్వేష లేని శాలినీ ప్రతిభ" అన్నట్టూ ప్రతిభ గల కవి అంశాన్ని కొత్తగా చెప్పే ప్రయత్నం చేస్తూ ఉంటాడు.ఆ కోణంలో ఆ లోచించి చూస్తే తందనాన రామాయణంలో చాలాచోట్ల విచిత్రమైన అవాల్మీకాలైన కథాంశాలు కనిపిస్తాయి. ఇవి మూలకథను,కథాసూత్రాన్ని ఏ మాత్రం భంగం చేయకుండా పాఠకునికి ఆనందం కలిగించే విధంగా ఉన్నాయి.

### 5.1. పతంగి దారం ఆధారంగా హనుమంతుడు ఇంద్రలోకానికి వెళ్ళి రావటం :

**తమ్ములతోడు మారుతితోడ! తరలె రాము డాటల నాడ!**
**సరయునదితీరము జారి!త్వరను పతంగమ్ము విడచిరి!**
**పతంగమ్ము స్వర్గమువరకు! పారె నచట భామ కనుటకు !**
**ఆ జయంతు వనిత గాంచెను ! అప్పుడు భయమువిడి పట్టును!**

**పతంగమ్ము బట్టిరి హనుమ! పట్టుకొనగ వేగమె బొమ్మ!**
**ఏయూరని బోవుదునయ్య ఎచటి ! నేను వెదుకునయ్య!**
**ఈ సూత్రముబట్టి వెడలుము ! ఇపుడా స్వర్గమ్ము జేరుమ!**
**హనుమంతుడు సూత్రము ముట్టి! జనెనా మార్గమ్మును బట్టి**[2]

విధుమౌళి శర్మ గారు వాల్మీకి రామాయంలో లేని ఘట్టాన్ని ఇందులో పేర్కొన్నారు. శ్రీ రాముడు తన సోదరులలో కలిసి పతంగి ఎగురవేస్తూ వుండగా ఆ పతంగి కనపడకుండా ఆకాశంలో కనుమరుగు అవుతుంది. ఆ పతంగి కావాలని శ్రీరాముడు హనుమంతుని కోరగా ఏక్కడికని వెళ్ళాలి,ఏ ఊరు అని వెళ్లాలి అని అంటాడు. ఆ శ్రీరాముడు ఈ దారం ఆధారంగా వెళ్లు అంటాడు.ఆ దారం ఆధారంగా పనుమంతుడు ఇంద్రలోకానికి వెళ్లి రావడం జరుగుతుంది.

## 5.2. వాలి తినడానికి తెచ్చుకున్న తాటి పళ్ళు తక్షకుడు తినగా వాలి ఆ పామును నరికి చంపాడు. అందుకు కోపించిన తక్షకుడు ఈ ఏడు తాటి చెట్లు నరికిన వాడి చేతిలో వాలికి చావు కలుగునని శపించటం :

**వాలి తాటిఫలములు యేడు! వాంఛ తోడ తెంపెను నాడు !**
**సంధ్యాకాలమాయెను త్వరగా!సంధ్యావందనము సేయగ !**
**కోరిఫలము లచ్చుట నిల్పన్ ! సురవరము దారము పైనన్ !**
**సర్పమ్మా ఫలముల మెక్కె!సరగున తన విషమును !**
**గ్రక్కె వాలి దాని గని కోపించె ! తనవు నేడు తునకలు !**
**జేసే తునక లిటకు పారవేయగ। ఘనవృక్షము లాయే !**
**జూడగ తక్షకు డా చెట్టులజూచే! తన తనయుం ఉంచును !**
**పగచే వాలి నాదు కొడగును జంపె!వాని జంపు శాపము !**
**నింపే సప్తతాళవృక్షము లెవరు!శరము వేసి కుల్చేడివారు !**
**వారివలన జచ్చునట్లుగా!వాలకంత శాపమిచ్చెగా!**[3]

ఒక రోజు వాలి తినడానికి ఏడు తాటిపళ్ళు తెచ్చుకొని సంధ్యా వందనము చేసి తినాలి అనుకుంటాడు. సంధ్యావందనం చేసే సమయంలో ఒక పాము. ఆ తాటిపళ్ళు తింటుంది. దానికి వాలి ఆ పామును ఏడు ముక్కలుగా చేసి వాటిని విసిరేస్తాడు.ఆ ముక్కలు పెద్ద పెద్ద తాటి వృక్షాలు గా వెలిసాయి. తక్షకుడు ఆ చెట్టులను చూసి నా యొక్క కుమారుడు అని కోపంతో ఆ వాలిని ఈ ఏడు తాటి చెట్లు నరికిన వాడి చేతిలో వాలి కి చావు వస్తుందని శపిస్తాడు.

## 5. 3. సీతమ్మ కత్తితో తల నరుక్కొని ప్రాణత్యాగానికి సిద్ధపడటం :

**నా మగడా ఓ శ్రీరామా । నా మగడా నాదు ప్రాణమా !**
**ఈ రాత్రి రాఘవ నీకు ॥ ఎడబాటి కలిగెను నాకు !**
**కలితోడ తనదు కంఠము ! నొత్తదలచే సీతయు సుమ్ము !**
**హనుమంతుడు వృక్షమునుండి ! అపుడు దూర తాపమువిడి !**
**సీత చేతి ఖడ్గంము దీసే శ్రీఘ్రముగా ధరపై వేసే !**[4]

సీతాదేవి శ్రీరాముడి నుండి దూరంగా ఉండటంతో శ్రీరాముణ్ణి నా ప్రాణ నాధ ఈ రాత్రి నీకు దూరమై ఉండలేకపోతున్నాను.అని బాధత కత్తితో తన యొక్క కంఠమును నరుక్కోవాలని చూస్తుంది.అది చెట్టు. మీద నుండి హనుమంతుడు గమనించి చెట్టు మీద నుండి క్రిందకు దూకి సీతదేవి చేతిలోని కత్తిని తీసుకొని దూరంగ విసిరేస్తాడు.ఇది వాల్మీకి రామాయణం లో కనిపించదు. కేవలం తందానాన రామాయాణంలో మాత్రమే ఆవిష్కరించాడు.

### 5.4. ఎన్ని బట్టలు కట్టినా హనుమంతుని తోకకు చాలకపోవడంతో సీతమ్మకోక తెమ్మనడంతో తోక చిన్నగా మారిపోయి సరిపోవటం :

**తమ్ముని వాక్యమును మెచ్చితిమ్మని!వాలము గాల్చి !**
**పంపించుట మేలని దలచే! బట్టలు గొనిరమ్మని బిలచె !**
**సేవకులు గుడ్డలు బట్టి! చేరి తోకను జుట్టి !**
**తోక పెంచ బూనె హనుమడు!కోకలెన్నో చాలకప్పుడు !**
**దనుజులకు వేసట బుట్టి!హనుమని పై కోపము బుట్టి !**
**అంతనొక ధనుజుడు ఉరికె ! అరుగుమన అవనిజకడకు!**
**సీతకోక తెమ్మని యనగ!చిన్నదాయె వాలము కనక![5]**

అశోక వనం నాశనం చేస్తున్నా హనుమంతుని బంధించి తెచ్చి రావణుని ముందు సభలో నిలబెట్టారు.హనుమంతుడు రావణుని చూచి సీతాదేవి లోకమాత వంటింది.ఆమెను వదిలేయమని అంటాడు.దానికి కోపించిన రావణుడు హనుమంతుని చంపమని తన సైన్యానికి చెపుతాడు.

అక్కడే ఉన్న విభీషణుడు దూతగా వచ్చిన వారిని చంపడం ధర్మం కాదు అని ఆక అన్నకు గుర్తు చేస్తాడు.రావణుడు అది గ్రహించి హనుమంతుని తోకను కాల్చి పంపాలను కుంటాడు. తన సైనికులకు గుడ్డలు తీసుకొని వచ్చి హనుమంతుని తోకకు చుట్టమని ఆజ్ఞాపిస్తాడు. హనుమంతుడు తన తోకను పెంచుతాడు ఎన్ని గుడ్డల తెచ్చిన కూడ ఆ ఆకు సరిపోవడం లేదు.సైనికులకు కోపం వచ్చి సీతమ్మ కోకను తెమ్మని చెప్పగానే హనుమంతుడు తోకను చిన్నగా చేస్తాడు.ఇది కూడ తందనాన రామాయణం యొక్క సృష్టి అని తెలుస్తుంది.

### 5.5. ఎవరు అంటించిన అంటుకోని హనుమ తోక రావణుడు అంటించగా అతని మీసం కాలడం:

**హనుమని వాక్యమ్మును వినిరి !**
**అంత రావణునకు దెల్పిరి దశాననుడు తమ్మునిజేరి !**
**త్వరగా నగ్ని జేరెను కీరి అగ్ని ముందు వాలమునుంచె !**
**అప్పుడు తా నూదగా దలచే హనుమడు తన తండ్రిని దలచె!**
**అప్పుడు చాల మంటలు లేచే మంటలు దశ ముఖుని మీసము!**
**మాడ్చివేయ అవమానమ్ము కలువాయె! దశకంఠునకు, కదిలిపోయె వాడు సిగ్గుకు! [6]**

హనుమంతుని ఒక ఎంతమంది అంటించిన కూడా అంటుకోదు చివరికి రావణుని తమ్ముడు

హనుమంతుని తోకను నిప్పుల కొలిమిలో పెట్టి పెద్ద పెద్ద గొట్టాలతో ఊదిన కూడ అంటుకోలేదు.ఈ విషయాన్ని రావణనికి తెలియజేయగానే స్వయంగా వచ్చి ఆ నిప్పుల కొలిమిని ఊదుతాడు.ఆ సమయంలో హనుమంతుడు తనతండ్రి అయిన వాయుదేవుని వేడుకుంటాడు.వేగవంతం అయిన గాలి ప్రభావం వల్ల రావణుని యొక్క మీసం అంటుకుని కాలి పోతుంది. మీసం కాలిపోయింది అని అవమానంలో రావణుడు సిగ్గుపడతాడు.ఈ ఘట్టం కూడా తందనాన రామాయణంలో మాత్రమే చూడవచ్చు.

వీటితో పాటు మరెన్నో ఆవాల్మీకియ అంశాలను ఈ తందానాన రామాయాం లో చూడవచ్చు. వారధి నిర్మాణం కోసం హనుమంతుడు తెచ్చిన గోవర్ధన గిరిని బృందావనంలో ఉంచడం, అలాగే యుద్ధం కోసం కుంభకర్ణున్ని నిద్ర లేపిన తరువాత కుంభకర్ణుడు చనిపోయే ముందు అనేకమైన నీతి వాక్యాలు చెప్పడం, ఇంద్రజిత్తుడు మాయా సీతను సృష్టించడం. వాల్మీకి రామాయణంలో లక్ష్మణుడు ఒకసారి మాత్రమే మూర్ఛ పోతాడు కానీ తందనాన రామాయణంలో రెండుసార్లు మూర్ఛ పోవడం జరుగుతుంది.

సంజీవనిని తెచ్చే సమయంలో హనుమతున్ని భరతుడు అడ్డగించుట సీతాపహరణం విషయం తెలిసి అయోధ్యావాసులు దుఃఖించుట ఇందులో చూడవచ్చు కాని వాల్మీకి రామాయణంతో అయోధ్యావాసులకు ఈ విషయం తెలియదు. నవజాత శిశువుగా ఉన్న అహిరావణున్ని భూమిలో పూడ్చి పెట్టగా తానూ అక్కడే పెరిగి నగరనిర్మాణం చేసుకోవడం.హనుమంతుడు తమ్మిల్లవ్వ పూలదండల్లో దాక్కొని అహిరావణుని మందిరానికి వెళ్ళటం. పన్నెండేండ్లు నిద్ర లేని వాని చేతిలో ఇంద్రజిత్తులకు మరణం అనే శాపం.సులోచన తన ప్రాతివత్యంత మరణించిన శిరస్సును నవ్వించడం.

పట్టాభిషేక సమయంలో హనుకు హృదయంలో సీతా రాముల దర్శనం అనే ఘట్టం ఈ రామాయణానికే మణితునక లాంటి ఘట్టం అనడంలో ఇలాంటి సందేహం లేదు.పట్టాభిషేకం అవుతున్న సమయంలో సీతాదేవి రామునితో స్వామి మీ బంటు అయిన హనుమంతునికి ఏదైనా కనుక ఇవ్వండి అని కోరుతుంది.రాముడు ఏమి వరం కావాలో కోరుకో హనుమా అని అనగానే ఈ భూమి మీద శ్రీ రాముని పేరు ఉన్న కాలం నా పేరు వుండాలని కోరుకుంటాడు. దానికి ఆ రాముడు సరే అని వరం ప్రసాదిస్తాడు. సీత దేవి ఒక విలువైన రత్నాల హారాన్ని హనుమంతునికి ఇస్తుంది. ఆ హారాన్నీ కొరికి లోపల చూస్తాడు అందులో శ్రీ రాముడు లేడు అని ఆ హారమును నేలకేసి కొడతాడు.శ్రీరాముడు హనుమంతుని శాంతింప జేస్తాడు. ఆ హనుమంతుడు వెంటనె తన హృదయాన్ని తన చేతులతో చీల్చుతాడు తన హృదయంలో, అ సీతారాములు కొలువై వున్నారు అని అందరికీ చూపిస్తూ అమోఘమైన భక్తిని ప్రపంచానికి చాటు కుంటాడు. ఈ ఘట్టాన్ని విధుమౌళి శర్మ వాల్మీకి రామాయంలో తేడా లేకున్నా అందరిని ఆకర్షించే విధంగా రచించాడు.

## 6. ముగింపు:

ఇతర గ్రంథాలలో, రచనలలో మార్పులు చేర్పులు కల్పితాలు చేసినపుడు ఆ రచనలయొక్క విశిష్టత దెబ్బతింటుంది. కానీ రామాయణంలో ఉన్న ప్రత్యేకతల వల్ల మూల గ్రంథానికి ఎన్ని కల్పితాలు చేర్చిన కూడ దాని యొక్క ప్రతిష్ఠ ఇంక పెరుగుతుంది అనడానికి నిలువెత్తు నిదర్శనం తందనాన రామాయణంలోని అవాల్మీకాంశాలు. అవాల్మీకాంశాలు గ్రామీణ ప్రజలను ఆకర్శించడానికి వారికి సులువుగ అర్థమయ్యే రీతిలో విచిత్రమైన కల్పనలు చేయండి జరిగింది. ఈ కల్పనల వల్ల గాన యోగ్యత కలిగి తందనాన రామాయాణం పండితుల నుంచి పామరుల వరకు వివేషంగా ఆదరణ పొందింది. విశిష్టమైన రీతిలో తందనాన రామాయాణం రాయడమే కాకుండా తన శిష్య బృందంలో ఊరూర తిరిగి గానం చేసిన విధుమౌళి శర్మ గారు తెలుగు దేశి సాహిత్యానికి చేసిన కృషి అమూల్యమైనది చెప్పవచ్చు.

## 7. పాదసూచికలు:

1.తందనాన రామాయణం – పుట – 110
2.తందనాన రామాయణం – పుట – 20
3.తందనాన రామాయణం – పుట – 65
4.తందనాన రామాయణం – పుట – 78
5.తందనాన రామాయణం – పుట – 86
6.తందనాన రామాయణం – పుట – 87

## 8. ఉపయుక్తగ్రంథసూచి:


1. ఆరుద్ర సమగ్ర సాహిత్యము తెలుగు అకాడమీ హైదరాబాద్ ప్రచురణ 2003.
2. ఉషశ్రీ -ఉషశ్రీ రామాయణం –తిరుమల తిరుపతి దేవస్థానము తిరుపతి -2012.
3. విధుమౌళి శర్మ రుక్మాభట్ల - తందనాన రామాయాణం. శ్రీ సిద్ధేశ్వర పబ్లికేషన్స్, హైదరాబాదు 2009 .
4. వెంకమాంబ, సుంకర, రంగనాథ రామాయణము అనుశీలనము, డాక్టర్ సుంకర వెంకమాంబ, బళ్లారి, కర్ణాటక.
5. శ్రీహరి, రవ్వా, భాస్కర రామాయణము విమర్శాత్మక పరిశీలనము, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాద్ ప్రచురణ 1988.
6. .సిమ్మన్న వెలమల –విమర్శ సిద్ధాంతాలు ,దళిత సాహిత్య పీఠం విశాఖపట్టణం 2009.


***


AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_31.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 31. భాస్కర రామాయణ అయోధ్యకాండ: అవాల్మీకాలు

**పిన్నోజి నరేశ్**

తెలుగు ఉపన్యాసకులు,
ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయం ప్రతిపత్తి), సిద్దిపేట,
సిద్దిపేట జిల్లా, తెలంగాణ.
సెల్: +91 8074137379. Email: pinnoji1947@gmail.com

**వ్యాససంగ్రహం:**

*సంస్కృతంలో వాల్మీకి రచించిన రామాయణము అనేకానేక భాషలలోకి అనువాదమైన విషయము సువిదితమే! అందులో భాగంగా మన తెలుగు భాషలోకి వాల్మీకి రామాయణాన్ని పద్య గద్యాల మేలవింపుగా అనగా చంపూ పద్ధతిలో రచించినవారు భాస్కర కవులు. వీరి రామాయణం భాస్కర రామాయణంగా జగత్ప్రసిద్ధమైంది. ఈ భాస్కర కవులు రామాయణాన్ని అనువాదం చేస్తున్న సమయంలో స్వేచ్ఛానువాద పద్ధతిని అనుసరించడం వల్ల వీరి రామాయణంలో కొన్ని అవాల్మీకాలు చోటు చేసుకున్నాయి. అవాల్మీకాలు అనగా వాల్మీకి రామాయణంలో లేని అంశం అని అర్థము. నేను నా వ్యాసంలో భాగంగా భాస్కర రామాయణం అయోధ్యకాండలోని అవాల్మీకాంశాలను పరిచయం చేయదలచును. తులనాత్మక పద్ధతిని ఉపయోగించి భాస్కర రామాయణము లోని అయోధ్యకాండము వాల్మీకి రామాయణములోని అయోధ్యకాండతో సరిపోల్చి భాస్కర రామాయణం అయోధ్యకాండలోని అవాల్మీకాంశాలను గురించి వ్యాసంలో తెలియజేయడం జరిగింది.*

**Keywords:** భాస్కర రామాయణం, భాస్కరుడు, కుమార రుద్ర దేవుడు, అయోధ్యకాండ, అవాల్మీకాంశాలు.

## 1. ఉపోద్ఘాతం:

తెలుగు మహాభారత అనువాదం కవిత్రయంతో పూర్తయింది అదే మాదిరిగా తెలుగులో మొదటి పద్య గద్య చంపూకావ్యంగా వెలసిందే భాస్కరరామాయణం. హుళిక్కి భాస్కరుడు అతని కుమారుడైన మల్లికార్జున భట్టు శిష్యుడైన కుమార యుద్ధ దేవుడు మిత్రుడైన శాకల్య అయ్యలార్యుడు కలిసి వివిధ కాండాలను రాశారు. ఈ భాస్కర రామాయణాన్ని రెండవ ప్రతాపరుద్రుని సేనానియైన సాహిని మారనకు అంకితం చేశారు.

వాల్మీకి మూల రామాయణంలో 20200 శ్లో కాలను 4179 పద్య గద్యాలతో చంపూ పద్ధతిన సంక్షిప్తంగా కావ్యంగా కనిపిస్తుంది. భాస్కర రామాయణం.

## 2. హుళక్కి భాస్కరుడు :

భాస్కరుడు కాకతీయ కాలంలో జీవించినట్లు తెలుస్తున్నది సాహిత్య వాఙ్మయంలో చాలామంది భాస్కరులు ఉన్నారు. అయితే వాళ్లలో హుళక్కి భాస్కరుడే నిజంగా భాస్కర రామాయణం కర్త అని నిరూపించగలిగిన బలమైన సాక్ష్యం భాస్కర రామాయణంలోనే యుద్ధకాండ చివరి పద్యంలో కవి తనను గురించి ఇలా చెప్పాడు.

**అమర హుళక్కిభాస్కరమహాకవి చెప్పఁగ నున్న యుద్ధకాం**
**డమతరువాయి చెప్పె వికట ప్రతిభాషణుఁ డప్పనార్యస**
**త్తమసుతుఁ డయ్యలార్యుఁడు కృతస్థితి నార్యులు మెచ్చునట్లుగా**
**హిమకరతారభాస్కరమహీవలయస్థిరలక్ష్మి చేకుఱన్ (భాస్క ర యుద్ధం 2699)**

భక్తి భావంతో రామ కథను ఆధ్యాత్మానందానికి తెలుగు చేశారు. దానికి కర్త భాస్కరుడే! గోన బుద్ధారెడ్డి రంగనాథ రామాయణం ద్విపద చందస్సులో తెలుగులో వచ్చిన తొలి రామాయణం. దీనిని అనుసరిస్తూ భాస్కరుడు కొత్త ఒరవడితో మూలంలో ఉన్నటువంటి రామకథాంశాలను సంక్షిప్తంగా స్వతంత్రానువాదపద్ధతినే అనుసరించారు భాస్కరుడు.

## 3. కుమార రుద్ర దేవుడు :

భాస్కర రామాయణాన్ని నలుగురు కవులు రాసినట్లు ఐతిహాసం కలదు. కుమార రుద్రదేవుడు అయోధ్యకాండము సంక్షిప్తంము కావించినాడు. ఇతడు సకల కళా విశారదుడైన శారదముఖ ముకురాయ మాణుడు సారస్వత భట్ట బానుడు నిశ్శంక వీర మారయ కుమారుడు రుద్రుడు మూల అయోధ్యకాండమున 4300 శ్లోకాలు ఉండగా అనువాదమున 468 పద్యాలు మాత్రమే ఉన్నాయి. కథను వేగముగా చెప్పే ఉద్దేశంతో రుద్రదేవుడు అయోధ్యకాండను రాసెను. ఈ కాండమున కవితా శిల్పం అంతగా కానరాదు. దీర్ఘ సమాస రచన అలతియలతి దేశ పదములతో కూడిన వర్ణనాత్మక రచనగా కనబడుతుంది. రుద్రదేవుని శైలికి ఈ కింది పద్యము ఉదాహరణ

**దళదంభోజ పరాగ రాగ విలసత్కల్లోల కేళీనట**
**త్కల హంస వ్రజ చక్రసారన ఒక క్రౌంచభ్రమ దృంగ సం**
**కుల నానారవ శిక్షణ దృహు సరఃకూలానుకూల క్రియా**
**లలితా లోల సమీర కంపిత లతా లాస్యంబు లీక్షించుచున్ (అయో. 289.)**

## 4. అయోధ్యకాండ- అవాల్మీకాంశాలు :

దశరథ మహారాజు శ్రీరామ పట్టాభిషేక విషయమై మంత్రి సామంత పౌర నగరవాసులతో సంప్రదించినటువంటి ఘట్టం భాస్కర రామాయణమున కనిపిస్తుంది. రామ పట్టాభిషేకము నిర్వహించుటకు

పౌరులు సమ్మతింపగా మీ మనసు తెలుసుకొనుటకై అన్నాను కానీ నేను రాజ పాలన చేయలేనా? అని దశరథుడు వారిని అడిగాను ప్రజలు రాముడు రాజ్యాన్ని పరిపాలించడానికి నిష్ణాతుడు కాడ ఎదురు ప్రశ్న వేశారు. దానికి నేను పలికిన మాటల్లో రాముని రాజుగా చేయక ఎలా ఉంటానని దశరథుడు బదులిచ్చెను చక్రవర్తి తన అభిప్రాయాలను సేకరించుటకు చాకచక్యముగా ప్రజల మర్మమును తెలుసుకొనుటకు ఇలా ప్రవర్తించెను ఈ ఉదాంతమంతయు భాస్కర రామాయణ కలదు ఊసుర ముక్కులకు భూమి ప్రజలు దశరథుని అభిప్రాయమునకు తమ సమితి మిక్కిలి సంతోషముతో తెలుపుచూ ఆ ఉత్సాహం సంతోషాలతో తనవు మరిచి నీతియు, ప్రీతీయు నేర్పును ఓర్పును ఖ్యాతిని భూతిని కాంతియు దాంతి శాంతియు మొదలగు సద్గుణాలు నంతయు రామున్ని రాజుగా చేయుట యుక్తమని తెలుసుకొనెను దశరథుడు ఆ ఆనంద సమరంభమున దశరథుడు పుత్రోత్సాహమున పట్టాభిషేక మహోత్సవానికి పిలుపునిచ్చెను ఇట్టి వృత్తాంతము భాస్కర రామాయణమున దశరథుడు సర్వజన మతమున ఈ మహత్తర కార్యం నడిపించదలసి శ్రీరాముని కడకు చేరి ఇలా అనెను

**లోపలికి బోయి దశరథ**
**భూపాలునిగాంచి మ్రొక్కి పొసగ తదాజ్ఞన్**
**వేపైడి పీఠమందున**
**బ్రాపుగ కూర్చుండెనెల్ల ప్రజలకు పతియై. (అయో. 19)**

దశరథ మహారాజు తన కుమారుడిని పట్టాభిషేకం చేస్తున్న సమయానికి ప్రజల అభిప్రాయాన్ని చూసి గర్వించెను ఇచ్చట తన కుమారుని యొక్క ఔచిత్యాన్ని తెలుసుకొని సంతోషపడను తన ఆజ్ఞను స్వీకరిస్తాడని అనుకున్నాడు. ఈ అంశము భాస్కర రామాయణమున వర్ణనాత్మకంగా కనిపిస్తుంది

దశరథు రామునితో పుష్య నక్షత్రంలో యువరాజు పట్టాభిషేకము చేస్తానని చెప్పినాడు. ఇలా రాజ్యంలోని ప్రజలందరూ కూడా సంతోషంతో ఉత్సవం చేసుకుంటున్నా సమయాన అయోధ్య నగరం దీపాల కాంతులతో వెలిగిపోతున్న సమయం అది అంతఃపురాణులు పుర ప్రజలు జానపదులు సంతోషపడే సమయం అయోధ్యకాండలో ఉంది.

## 1. మంథరవైరం:

మంథరకు రామునిపై ద్వేషము కలుగుటకు వాల్మీకమున కారణ మేమియు కానరాదు. అందు మంథర 'పాపదర్శిని' యని మాత్రమే చెప్పబడినది. రాముడు బాల్యమున గావించిన 'చరణతాడన భంగంబు'ను వైరకారణముగాగొని రాముని పట్టాభిషేకమునకు భంగము గావింప దలపెట్టినట్లుగ కలదు. రాముడు బాల్యంబునందు **"తన కాలు విఱిచిన తప్పు సాధింపనిది నాకు తఱి"** యని మంథర రామునికి హాని తలపెట్టినట్లుగ పేర్కొనబడినది. రాముడు బాల్యమున మంథర కాళ్లను పట్టి లాగిపడవేసినట్లుగ అగ్ని పురాణము తెలియుచున్నది.

## 2. కైకేయి కోపగృహప్రవేశము:

రాజ్యాభిషేక ఉత్సవానికి తరలిరావాలని దశరథుడు రాణులను కోరుతాడు. కానీ కైకేయ దానికి సంబంధం లేనట్లుగా వ్యవహరిస్తుంది. కారణమేమి అని తెలుసుకొనగా రాముని పట్టాభిషేకం ఇష్టం లేదు. అని తనకు కావాల్సిన వరములు ఇవ్వాలని పూర్వ వృత్తాంతాన్ని తెలియజేస్తుంది.

మంథర కైకకు దుర్బోధచేయు సమయమున పూర్వము జయంత పురమున పురందర, శంబరులకు జరిగిన యుద్ధమున ఇంద్రునకు తోడుగా దశరథుడు పోయి యుద్ధము చేయుటయు, ఆ రాక్షసుడనేక మాయలు గావింపగా కైకేయి తాను ధవళాంగుడను మునివలన పడసిన మంత్రవిద్యచే నా మాయలకు ప్రతీకారము కావించుటయు, అందుకు దశరథుడు మెచ్చి తనకు రెండు వరములిచ్చుటయు జ్ఞప్తికి తెచ్చును. ఈ ధవళాంగుని ప్రసక్తి కాని, మంత్రవిద్యా ప్రసక్తికాని వాల్మీరామయణంలో లేదు. అందు క్షతుడైన దశరథుని యుద్ధరంగమునుండి దూరముగ కొనిపోయి రక్షిచినట్లుగ మాత్రమే కలదు.

## 3. శ్రీరాముడు కౌసల్యతో పట్టాభిషేక భంగ వృత్తాంతము తెలుపుట:

**ఏ నిట్లు తపోవేషము**
**బూని నరేంద్రుడు వగల బొగులుచు నుండం**
**గానేతెంచితి నిటకును**
**మానసమున దీని కింకమలు గకు మింకన్ (అయో. 113)**

నిజముగా రాముడప్పుడు మునివేషధారి కాడు. ఇంకనూ నార చీరలను కూడా ధరింపలేదు. ఇది అవాల్మీకం.

## 4. కాకాసురుని వృత్తాంతము:

కాకాసురుని వృత్తాంతము వాల్మీకమున అయోధ్యకాండలో కాక సుందరకాండలో కనబడుతుంది. కానీ చిత్రకూట పర్వతము వర్ణన సందర్భంలో సీత హనుమంతునితో రామునికి ఆనవాళ్లు తెలిపే సందర్భం భాస్కర రామాయణం అయోధ్యకాండలో ఈ వృత్తాంతం కలదు.

## 5. సీత అనసూయతో తన వివాహ్వృత్తాంతాన్ని చెప్పడం:

సీతాదేవి అనసూయతో తన వివాహ్వృత్తాంతమును చెప్పు సందర్భంగా సీతాదేవి జన్మ వృత్తాంతం సంబంధించిన అవాల్మీకము. వింత విషయంగా భాస్కర రామాయణంలో కనిపిస్తుంది. ఒకప్పుడు జనకుడు తన భార్యతో కలిసి యజ్ఞభూమికి పోగా, అక్కడ మేనక కనిపించగా జనకుడు ఆమె రూప సౌందర్యానికి ముగ్ధుడైనాడు.

## 6. లక్ష్మణప్రతిజ్ఞ:

సీతారాములు గంగాతీరమున గుహుని కలుసుకొని సాయంకాలమనగుటచే అచట సంధ్యావంద నియమాలు తీర్చుకొని అతడు తెచ్చిన కందమూలాలు ఆహారంగా తీసుకొని నేలపైనే నిద్రించును అప్పుడు లక్ష్మణుడు అహర్నిశములు నిద్రవదిలి 14 ఏళ్లు రాముని సేవించుతానని ప్రతిజ్ఞ చేయుట.

**ఆ పదునాలుగేడులు నహర్నిశముందన నిద్రదప్పి యా**
**రోపితచాపుడై రఘువరుంగొలువంబరమాద్భుత ప్రతి**
**జ్ఞాపరుడైన లక్ష్మణుడు జానకి విన్నదనంబు చిత్తసం**
**తాపము సేయ నాశబరనాథునకద్దెప జూపి వెండియున్ (అయో. 266)**

## 7. దశరథుడు మునిబాలుని వృత్తాంతం తెలుపుట:

దశరథుడు కౌసల్యతో మునిబాలుని వృత్తాంతం చెప్పినప్పుడు బాణాహతుడైన ముని బాలకుడు నమశ్శివాయ అని ఓంకార మంత్రాన్ని జపించినట్లుగా భాస్కర రామాయణ ఉంది. ఎందుకంటే కార్యకర్తలు శైవులు కావడం వల్లనే! ఈ పలుకులు మూలమున లేవు.

## 8. యజ్ఞదత్తుడు:

యజ్ఞదత్తుడు మరణించగా ముని మాత్రమే విలపించినట్లుగా మూలంలో ఉంది. కానీ అనువాదమున మునిపత్నీ విలాపం కూడా వర్ణింపబడింది. అంతేగాక భాస్కర రామాయణంలో మునిపత్నివిలాపమునే మొదటగా వర్ణించి స్త్రీ యొక్క సహజమైన వేదనను ప్రేమను జాలి దయా గుణమును ప్రకటించారు.

## 9. ముగింపు:

రామాయణం భారతీయ సంస్కృతి సనాతన ధర్మాన్ని కాపాడడానికి ఇతిహాసాల్లో మొదటిది శ్రీరాముడు మానవునిగా జన్మించి తాను అనుభవించిన విధానాన్ని వాల్మీకమున కనబడును.

అలాంటి విషయాన్ని తెలుగు రామాయణ కర్తలు మూలంలో ఉన్న విషయాన్ని తీసుకొని కొత్తనైన కల్పనలతో తెలుగువారికి రామాయణాన్ని దగ్గర చేసే అంశాలను చేర్చి మూల అనువాదానికి భంగం కలగకుండా భాస్కర రామాయణ కర్తలు ఈ రామాయణాన్ని పూరించారు.

కుమార రుద్రదేవుడు తాను రాసిన అయోధ్యకాండలో వాల్మీకములో లేని అంశాలను చేర్చి తన ప్రతిభను చాటారు.

## 9. ఉపయుక్తగ్రంథసూచి:


1. ఆరుద్ర. సమగ్ర సాహిత్యము తెలుగు అకాడమీ హైదరాబాద్ ప్రచురణ, 2003.
2. ఉషశ్రీ. ఉషశ్రీ రామాయణం. తిరుమల తిరుపతి దేవస్థానము తిరుపతి, 2012.
3. వెంకమాంబ, సుంకర. రంగనాథ రామాయణము అనుశీలనము,సుంకర వెంకమాంబ, బళ్లారి, కర్ణాటక.
4. శ్రీహరి, రవ్వా. భాస్కరరామాయణము విమర్శాత్మకపరిశీలనము, ఆంధ్ర సారస్వతపరిషత్తు, హైదరాబాద్, 1988.
5. సిమ్మన్న, వెలమల. విమర్శ సిద్ధాంతాలు ,దళిత సాహిత్య పీఠం విశాఖపట్టణం, 2009.


***




AUCHITHYAM
ISSN: 2583-4797
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_32.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 32. జానపదవాఙ్మయం: అవాల్మీకీయాంశాలు

**తాడి రేవతి**

తెలుగు అధ్యాపకురాలు,
ప్రభుత్వ కళాశాల (స్వయంప్రతిపత్తి),
రాజమహేంద్రవరం, ఆంధ్రప్రదేశ్.
సెల్: +91 6305633005. Email: tadirevathi2017@gmail.com

**వ్యాససంగ్రహం:**

*జానపద సాహిత్యంలో రామాయణానికి విశేషమైన స్థానము కల్పించబడింది. మౌఖిక ప్రసరణ జానపద సాహిత్య మౌలిక లక్షణం. ఈ విధంగా ఒకరి నుండి మరొకరికి జానపద సాహిత్యం చేరవేయబడుతుంది. ఈ క్రమంలో కొన్ని మార్పులు చేర్పులు అనేవి సంభవిస్తూ ఉంటాయి. అదే విధంగా జానపదులు ప్రత్యేకించి రామాయణ పాత్రలను ఆత్మీకరించుకోవడం, మానవ సామాజిక సంబంధాలను పౌరాణిక పాత్రలకు ఆపాదించడం వలన జానపద సాహిత్యములో రామాయణము వినూత్నంగా కనబడుతుంది. అల్లే వాల్మీకి రామాయణంలో లేని అమూలక అంశాలను అనగా అవాల్మీకాలను జానపద సాహిత్యంలో గమనించవచ్చు. నేను నా వ్యాసంలో భాగంగా జానపద సాహిత్యంలో కనబడే చక్రభూపాలుని వృత్తాంతము, రావణుడి చిత్రపటం కథ వంటి ప్రసిద్ధ అవాల్మీకాలను విశ్లేషణాత్మక పద్ధతిలో నా వ్యాసంలో పొందుపరిచాను.*

**Keywords:** జానపదవాఙ్మయం, అవాల్మీకీయాంశాలు, జానపదరామాయణం, చక్రభూపాలుడు, జంబు కుమారుడు, రావణుని చిత్రపటం

## 1. ఉపోద్ఘాతం:

జానపదులు అంటే గ్రామీనులు అని మనకు తెలిసిందే. జానపదుల యొక్క జీవన విధానం, వారి ఆచార వ్యవహారాలు, సాంప్రదాయాలు, మూడ విశ్వాసాలు తెలియజేసేదే జానపద సాహిత్యం.

ఆదికవి వాల్మీకి సంస్కృతంలో 24,000 శ్లోకాలతో రామాయణం రచించారు. అనంతరం తెలుగు కవులు సంస్కృత రామాయణమును తెలుగులోనికనువదించారు. తిక్కన, భాస్కరుడు, కంకంటి పాపరాజు, గోనబుద్ధరెడ్డి,

మొల్ల, విశ్వనాధ వంటి వారు రామాయణం రాశారు. ఎంతోమంది కవులు రామాయణం రాసిన రామాయణానికి ఉన్న ప్రాముఖ్యత మాత్రం నేటికి పెరుగుతూనే ఉంది.

జానపదులు పౌరాణిక కథలను వారి నిజ జీవితంలో అన్వయించుకోవడం మనం చూస్తుంటాము. పండితులు నుంచి చదువురాని వాళ్ళు కూడా అర్థమయ్యే రీతిలో పౌరాణికాలను జానపద కథల గాను గేయాలు గానూ చెప్పుకుంటారు. ఆంధ్ర ప్రాంతము నందు జానపద గేయాల రూపంతో రామాయణ, మహాభారతాలు ప్రచారం పొందుతున్నాయి. వాటిటో ఆదికావ్యమైన రామయాణ కథ అనేది జానపదుల మనస్సులోని చెరగని ముద్రగా ఉంది.

## 2. అవాల్మీకీయాంశాలు:

సంస్కృతంలో ఆదికవి వాల్మీకి రాసిన రామాయణంలోని శ్లోకాలను తెలుగు కవులు అనువదించారు. జానపదులుగేయాలను కథలుగా చెప్పుకుంటారు. జానపదులుకు తెలిసినంత రాముడి చరిత్ర పండితులకు కూడా తెలియదు అనే విధంగా వారు రామాయణం గురించి కథలుగా చెప్పుకుంటారు. జానపదులు రామాయణంలోని కథా విశేషాలను మౌకిక ప్రచారం ద్వారా వారు విన్నవి నాలుగువంతులు కవుల రామాయణంలోని లేని కథలు కూడా  మనకు కనిపిస్తాయి.

శ్రీరామ పట్టాభిషేకము, దశరధుని పుత్ర కామేష్టి యాగము, శ్రీరాముని ఉగ్గిపాట, లక్ష్మణ మూర్ఛ పెండ్లి గోవింద నామాలు, లక్ష్మణ దేవర నవ్వు, ఊర్మిళాదేవి నిద్ర మొదలగు రామాయణ సంబంధ కథలను జానపదులు వారికి అనుగుణంగా పాడతారు.

### 2.1. జానపదులు దేవుడిని పౌరాణిక పాత్రలను ఆత్మీకరించుకోవడం :

జానపదులు దృష్టిలో రాముడిని తండ్రి గాను, సీతను అమ్మగాను పిలుచుకుంటారు. తెలుగు జానపదులు స్వయంగా సీతారాములను చూసినట్లు చెప్పుకుంటారు. అలాగే రాముడు నడిచిన ప్రాంతంలో వారు ఉంటున్నట్లు కథలలోను గేయాలలోను చెప్పుకుంటారు. రాముడు వనవాస సమయంలో గోదావరి నదీ తీరాన సంచరించారని సీతా రాముడు పర్వతములు, వనములు సంచరిస్తూ, పర్ణశాలలు కుటీరాలు నిర్మించుకున్నారని జానపదులు చెప్పుకుంటారు. కాని ఇది కవులు రామాయణములలో చెప్పలేదు. అలాగే రామాయణం రచించిన కవులకు కూడా తెలియని సమాచారం జానపదుల యొక్క కథలలో కనిపిస్తుంది. ఇటువంటి సంపద కల్గిన జానపదులు ‘‘**ఎంత భాగ్యవంతులు - అదృష్టవంతులీ జానపదులు**’’![1] ఇన్ని విషయాలు కవులకు కూడా తెలియలేదు.

రాముడు, సీత పాత్రలను తెలుగువారు దైవ భక్తితో కొలుస్తారు. అయితే వారికన్నా ఎక్కువగా సీతారాములను జానపదులు వారు సృష్టించుకున్నా కథలను బట్టి మరీ ఎక్కువగా విశ్వసించడం చూడవచ్చు.

అలాగే రామాయణ కవులకు రామాయణం జ్ఞాన సంపదగా, కర్మ సిద్ధాంతంగా కనిపిస్తుంది. అదే జానపదులకు రాముడు అంటే భక్తిని కలిగించే ఒక మార్గంగా చూస్తారు. జానపదులు యొక్క దృష్టిలో వీరు అవతార పురుషులుగా భావించారు. మానవ జీవితంలో ఉండే కష్టం, సుఖాలకు సంబంధించిన వ్యక్తులుగా చూస్తారు. రాముడు సీత పాత్రలు మిగిలిన రామయణ పాత్రలను వారి నిత్య జీవితంలోని కనిపించే వ్యక్తులుగా భావిస్తారు.

కవులు చెప్పిన రామాయణ కథలను జానపదులు తమకునచ్చిన విధంగా మలుచుకోవడం చూస్తాము. సీత వనవాసంలో ఉన్నప్పుడు లక్ష్మణుడు పర్ణశాలలో ఉన్న మొక్కలకు నీళ్ళు పోయడానికి గోదావరి నదిలో నీళ్ళు తెచ్చి ఇచ్చారని వీరు చెప్పుకుంటారు.

## 2.2. మానవ సామాజిక సంబంధాలును పౌరాణిక పాత్రలకు ప్రతిపాదించడం:

జానపదులు రామాయణంలోని పాత్రలకు మానవ సమాజంలోని వ్యక్తుల మధ్య ఉన్న సంబంధాలను ఆరోపించడం గమనించవచ్చు. రాముడు రావణుడుని చంపి సీతాదేవితో తిరిగి అయోధ్యకు వచ్చిన తరువాత రాజ్యంలోని ఆడవాళ్ళతో మాట్లాడిన విధానం మానవ సంబంధాలను తెలియజేస్తుంది. సీత తన ఇరుగుపోరుగు స్త్రీలతో "**అమ్మలారా మీరందరు నన్ను తలతుర మరతుర**"[2] అని అంత:పురంలోని స్త్రీలను సీత పలకరించడం జానపదులు చెబుతారు. అయితే సీతా పలకరించిన తీరుకు అక్కడ స్త్రీలు "**పదియునాలుగు వత్సరమ్ములూ - వనములు దిరిగిటు వచ్చిన కొమ్మా - మరచిందిగాదే మనలందరనూ**"[3] అని పురకాంతలు సీత అందరిని గుర్తు పెట్టుకొని పలకరించిందని సీతను పోగిడారు. ఇది జానపదులు వారి ప్రాంతాలలో ఉండే ఇరుగు పొరుగు స్త్రీలను ఏ విధంగా ఆత్మీయంగా పలకరిస్తూ మానవ సంబంధాలను కొనసాగిస్తారు అనేది సీత పాత్ర ద్వారా జానపదులు చెప్పడం జరిగింది.

## 2.3. వస్తువులకు మానవత్వ ఆరోపణ:

అయోధ్యలో ఒక రోజు పాచికలు (చక్కుపగడాలు) అనే ఆటను ఆడడం జరిగింది. అయితే ఆ ఆటలో శాంత రాముడు ఒక జట్టు, సీతాలక్ష్మణులు ఒక జట్టుగా ఆడారు. అంటే జానపదులు వారి నిజ జీవితంలో వినోదాత్మకంగా ఆడే ఆటలును రామాయణంలోని ఆటలుగా పేర్కోన్నారు.

ఒక రోజు సీత శాంతతో సరదాగా మాట్లాడుతుండగా రాముడు సీతను పిలుస్తాడు. కాని సీత రాముడి మాటను పట్టించుకోలేదు. ఎంత సేపు పిలిచిన సీత రాముడి వద్దకు వెళ్ళలేదు. అప్పుడు రాముడు కోపించి తన విల్లును తీసుకురమ్మని లక్ష్మణుడికి చెప్పాడు. తన విల్లులోని బాణాలను పరిచారం చేసేపని కత్తెలుగా చేసి వారి చేత విసిరించుకోవడం, తాంబూలం ఇప్పించుకుంటూ అలాగే పాదాలను ఒత్తించుకుంటాడు.

అదే సమయంలో సీత రాముని వద్దకు రాగా రామునికి సేవలు చేస్తున్న స్త్రీలను చూసి సీత రాముడిని ఈ విధంగా అంటుంది-

''**ఏకపత్నీవ్రతుండవు అనుచూ - ఇచ్చెగాక మా తండ్రయితేను - యేకపత్నీ వ్రతములు అన్నీ - తెలిసెగదా ఇక్కడ ఈలాగు**''[4] అని సీత రాముడినిక అడుగుతుంది. అప్పుడు సేవలు చేస్తున్న స్త్రీలు సీతను ఈ విధంగా అవమాన పరుస్తారు.

''**ఎక్కడదానవే జానకీ నీవు - యెప్పటికి మేమే వున్నాము - అడవులలో నీవు బాసినప్పుడు - అంత వేడుకతో మాతో వుండే - విల్లు విరువగా వచ్చినదానవు - యెక్కడిదానవె జానకి నీవు**''[5] అని రామునితో మేము ఎప్పుడు ఉన్నాము.

నీవు మాత్రం అడవులలో రాముడిని వదిలిపెట్టన దానవు అలాగే బాణము విరవడంతో వచ్చావు నీవు అని చెప్పారు. అలా చెప్పడంతో సీతకు కోపం రాగా శాంత వచ్చి రామునికి సీతకు సంధి కుదిర్చింది. జానపదుల యొక్క విచిత్రమైన కల్పనలో స్త్రీల యొక్క మనస్తత్వం, భర్తపై స్త్రీలకు ఉండే సహజమైన ప్రేమ అనేది కనిపిస్తుంది. అలాగే బాణాల నుంచి పుట్టుకు వచ్చిన మాయ స్త్రీలు మట్లాడిన మాటలు చమత్కారంగా ఉంటాయి.

స్త్రీలను బాణాలుగా మూర్తిభవించడం, బాణాలకు స్త్రీలుగా మూర్తీమత్వ ఆరోపణ చేసి, ప్రాణారోపణ చేసి ఆ విల్లంబులే స్త్రీలైనప్పుడు ఆ విల్లులు ఎప్పుడూ రాముడిని అంటిపెట్టుకుని రాముడితో సావాసం, సాంగిత్యం కలిగి వున్నాయి. ఆ విల్లంబులకి స్త్రీ తత్వ ఆరోపణ స్త్రీ సహజ స్వభావం చెప్పబడిరది. నువ్వు రామున్ని ఎడబాసావు తప్ప రాముడుని మేము ఎప్పుడు ఎడబాయలేదు అని అనడంలో స్త్రీ హృదయాన్ని ఆరోపించడం జరిగింది. వస్తువుకి ప్రాణాత్వ ఆరోపణగా జానపదులు చిత్రించారు. మానవత్వం ఆరోపణ అనేది జరిగింది.

మానవత్వ ఆరోపణ చేయడమే కాదు. దానికి సహజ స్త్రీ స్వభావాన్ని అంటగట్టారు. అయితే ఇక్కడ శాంతి వచ్చి రాముడికి సీతకి సంధి చేయడం అంటే జానపదులు గృహాలలో జరిగే సంఘటనలను ఇక్కడ ప్రస్తావించారు. భార్యభర్తలు గొడవ పడినప్పుడు ఇరుగు పొరుగు వారు ఏ విధంగా వారికి సర్ది చెప్తారో అదే విధంగా శాంత చేసిందని జానపదులు చెప్తారు. పౌరాణిక పాత్రలకి జానపదుల సహజ స్వభావాన్ని ఆరోపించారు.

## 2.4. మాతృభావన :

రాముడు కైక కోరికను బట్టి దశరదుడు ఇచ్చిన మాటను నిలబెట్టుటకు రాముడు సీతాలక్ష్మణులతో సహా వనవాసానికి వెళ్ళాడు. అయితే లక్ష్మణడు తన అన్నతో వనవాసానికి వెళుతున్నాడని సుమిత్ర లక్ష్మణుడికి రాముడిని

తండ్రిగాను, సీతను తల్లిగాను భావించి వారికి సేవలు చేయమని సూచిస్తుంది. ఇది ఒక తల్లి త్యాగపూరితమైన మనస్సుకు నిదర్శనం, అయితే కౌసల్య తన కొడుకుతో (రాముడు) వనవాసానికి సిద్ధపడిరది. ఇక్కడ సుమిత్ర కౌసల్యలలో మాతృత్వ భావనను గమనించవచ్చు. వీరిద్దరికి కొడుకులపై ఉన్నా అభిమానాన్ని జానపదులు వారికి నచ్చిన విధంగా మలుచుకున్నారు. ఇక్కడ జానపదులు సుమిత్ర కౌసల్యలలో తమ కొడుకులపై ప్రేమ ఏది గొప్పది? అనే విషయంలో జానపదులు సుమిత్ర యొక్క త్యాగమే గొప్పది అని చెబుతారు. కౌసల్య కొడుకుని విడిచి ఉండలేక రామునితో వస్తానని చెప్తే, సుమిత్ర మాత్రం లక్ష్మణుడుని అడవులకు వెళ్ళి రాముడు, సీతలకు సేవ చేయమని వారిని తల్లిదండ్రులుగా భావించమని చెప్పిన గొప్ప మాతృత్వ పాత్రగా జానపదులు సుమిత్రను చెప్పుకుంటారు.

## 2.5. శూర్పణఖ కుమారుడి తపస్సు :

వనవాస సమయంలో ఒక రోజు లక్ష్మణుడు పండ్లు, వెదుళ్లు కోసం అడవికి వెళ్తాడు. అయితే అదే సమయంలో శూర్పణఖ కొడుకు చక్రభూపాలుడు చంద్రుని కొరకు తపస్సుని చేస్తారు. అయితే కొన్ని సంవత్సరాల నుండి తపస్సు చేయడం వల్ల చక్రభూపాలుని చుట్టు పుట్టలు, చెట్లు, వెదుళ్లు పుట్టుకొచ్చాయి. చక్రభూపాలుని తనస్సును మెచ్చి చంద్రుదు ఒక అద్భుతమైన ఖడ్గమును వరంగా ఇస్తాడు. అయితే ఆ ఖడ్గం లక్ష్మణుడికి దొరుకుతుంది. ఆ ఖడ్గాన్ని పండ్లు కోయడానికి ఉపయోగించాడు. ఆ క్రమంలోనే వెదుళ్లు నరుకుతూ ఉండగా తపస్సు చేసుకుంటున్న చక్రభూపాలుడి తలను నరకడం జరిగింది. దానితో వెదుళ్లు అతని రక్తం ప్రవాహించడంతో లక్ష్మణుడు అది చూసి తను ఒక బ్రాహ్మణుడిని హత్య చేసాను అని భాద పడతాడు అని జానపదులు చెప్పుకుంటారు దానినే రామాయణం కవులు క్రింది విధంగా మలిచి రచించారని అని వీరి భావన.

శూర్పణఖ కుమారుడు జంబుకుమారుడు తపస్సు చేసుకుంటాడు. అదే సమయంలో లక్ష్మణుడు అక్కడికి పండ్లు, వెదుళ్లు కోసం వెళ్తాడు. జంబుకుమారుడు తన తండ్రి అయిన విద్యుజ్జిహ్వాన్ని రావణుడు చంపాడని, వాళ్ళకు అవమానం చేసాడనే కారణంతో పగతీర్చుకోవడానికి జంబుకుడు సూర్యుని కోసం తపస్సు చేస్తాడు. అలా తపస్సు చేయడం వల్ల అతని మీద పుట్టలు, వెదుళ్లు అనేవి మొలిచాయి. జంబుకుడు కనిపించనంతగా అవి చుట్టు ఉంటాయి. అయితే సూర్యుడు జంబుకుని తపస్సు మెచ్చి ఒక దివ్య ఖడ్గమును వరంగా ఇస్తాడు. అది సూర్యుడు స్వయంగా వచ్చి ఇవ్వకుండా వేరొకరి ద్వారా పంపించాడని ఆ ఖడ్గమును తీసుకోకుండా మరళ తపస్సు చేసుకుంటూ ఉంటాడు. అయితే ఆ ఖడ్గం లక్ష్మణుడికి దొరకుతుంది. దానితో లక్ష్మణుడు పండ్లు, వెదుళ్లు కొస్తాడు. ఆ వెదుళ్లతోపాటు మధ్యలో ఉన్న జంబుకుని తలను కూడా నరకుతాడు అని రామయాణ కవులు కథను చెప్పారు.

పైన చెప్పబడిన రామాయణ కవుల కథ జానపదులు కథలు రెండిరటిలోను లక్ష్మణుడు తెలియక చేసిన హత్యగా ఆరోపించారు. అయితే త్రిపురనేని రామస్వామి చౌదరి సూతపురాణంలో ఈ సంఘటను ప్రస్తావించడం జరిగింది లక్ష్మణుడిని గొప్పవానిగా, జంబుకుడిని రాక్షస పాత్రగా చిత్రించారు. లక్ష్మణుడు జంబుకుడిని వదించిన వెంటనే బ్రాహ్మణ హత్య చేసానని భాదపడుతూ రాముడి దగ్గరకు వెళ్ళి చెప్పడం అప్పుడు రాముడు జంబుకుడి గురించి విని బ్రాహ్మణ హత్య కాదు రాక్షస సంహారం చేసావని చెప్తాడు. అంటే ఆనాటి సమాజంలో రాక్షసులు భూమి మీద ఉండకూడదని, బ్రాహ్మణులు ఉత్తములు అని రామాయణ కవులు రచనలు చేసారు. వాటినే త్రిపురనేని వారు హేతువాద దృక్పధంతో ప్రశ్నించడం జరిగింది.

## 2.6. రావణుడి చిత్రపట సంఘటన :

సీత వనవాసానికి సంబంధించి జానపదులు ఒక గొప్ప బలమైన కారణం ఉందని వారి కధలలో చెప్పారు. అది రాముడు, సీత, ప్రజలు ఏవరు కూడా ప్రక్కకు నెట్టలేనంత బలమైన కారణం ఉందని జానపదులు చెప్తారు. రామాయణంలో చాలా సందర్భాలలో రాక్షసులు దేవతలను కూడా మాయలతోను మోసం చెయ్యడం జరిగింది. అయితే ఈ మాయలకు సంబంధించిన సంగతులు సంస్కృత రామాయణంలో కూడా కనిపిస్తుంది. భాసుడు రచించిన ప్రతిమా నాటకంలో రాముడు దగ్గరకు రాక్షసరాజు సన్యాసి వేషంలో వస్తాడు. రాముడు అతనికి అతిధి సత్కారాలు చేస్తాడు. అలాగే మారీచుడు అనే రాక్షసుడు మాయ లేడి వేషంలో వచ్చి రాముడిని మోసం చేస్తాడు. అలాగే ఇంద్రజిత్తుడు ఆంజనేయుదుని ముప్పు తిప్పలు పెట్టడానికి సీత రూపంలో వచ్చి తల నరకడం లాంటి పనులు చేస్తాడు. ఇలా రాక్షసులు దేవతలను కూడా మోసం చేయడం రామాయణంలో ఉంది. అలాంటి కథ ఒకటి జానపదులు చెప్పుకుంటారు.

రాముడు, రావణుడికి మధ్య జరిగిన యుద్ధంలో రాక్షసులు అందరు చనిపోయారు అయితే రావణుడి చెల్లెలు శూర్పణఖ మాత్రం బ్రతికింది. అదే సీతకు శాపంగా మారిందని జానపదులు చెప్తారు. ఎలాగం టే కొన్ని సమయాలలో పెద్దలు అయినవారు ఒక మాట చెప్పుతుంటారు. ''శత్రుశేషము పనికిరాదు'' అని అదే మాట సీత, రాముడు విషయంలో నిజం అయింది.

గతంలో లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులు కోసాడు. అయిన వారి మీద ఉన్న ఆశ మాత్రం పోలేదు. అంటే అన్నను చంపారు అనే ద్వేషం, పగ కన్నా రాముడి మీద ఉన్న ప్రేమతో ఎలాగైన సీతను తొలగించి రాముడిని సొంతం చేసుకోవాలనే కోరిక శూర్పణఖకు ఎక్కువగా ఉన్నది.

శూర్పణఖ ఏదో ఒకటి చేసి వారిద్దరిని విడదియాలని ఆలోచించింది. మాయలుకన్న బుద్ధితోనే సీతపై పగతీర్చుకోవాలని అనుకుంది. అందుకు అయోధ్యకు రావడానికి యతి విషం వేసుకుంది. అయోధ్యలో రాముడు, లక్ష్మణుడిని చూసింది వారికి తన విద్యను చూపించింది. అయితే రాముడు వేటకు వెళ్ళి హడావుడిలో ఆ యతిని అంత:పురంలో విశ్రాంతి తీసుకోమని చెపుతాడు. అయితే వచ్చిన యతి స్త్రీ కాబట్టి ఆమెను సీత శాంతల వద్దకు పరీచారాకులు తీసుకొని వెళ్తారు, అయితే శాంతకు ఆ యతి యొక్క విధానం నచ్చలేదు కాని సీత మాత్రం ఆ యతికి ఉపచారాలు చేయిస్తూ ఆమెకు సకల మర్యాదలు చేస్తుంది.

అయితే సీత యతి వేషంలో ఉన్నా శూర్పణఖకు బహుమతులుగా రత్నాలు, వజ్రాలు, చీరలు, వంటివి ఇవ్వబోయింది. కాని ఆ యతి మాత్రం వాటిని తీసుకోలేదు. అంతే కాదు అవి తన దగ్గర ఉండటం వల్ల దొంగల భయం కలుగుతుందని సీతకు చెప్పింది. దానితో సీత ఆ యతిని ఎం కావాలి అని అడిగింది. అప్పుడు ఆ యతి "**రావణుపటమూ వ్రాసియిచ్చితే - బ్రతుకుదు నేనీలోకములోనూ**"[6] అని కోరినది.

అలా శూర్పణఖ అడగగానే సీత గుండె ఒక్కసారిగా గుభేలు మంది. దానితో సీత తనకు తాను సద్ది చెప్పుకుని నాకు తెలియదని సమాధానం చెప్పింది. నిజానికి ఇలాంటి పరిస్థితి సీతకు వనవాస సమయంలో ఎదురైనది. ఏ విధంగా అంటే రాముడు మాయ లేడిని తీసుకురావడానికి వెళ్ళిన సందర్భంలో భిక్షువుని వేషంలో రావణాసురుడు సీతను ఎత్తుకుపోవడానికి వస్తాడు. ఆ సమయంలో సీతను, లక్ష్మణుడు లక్ష్మణ రేఖ దాటవద్దని చెప్పిన, సీత రేఖను దాటి వెళ్ళుతుంది.

ఇక్కడ స్త్రీకి సహజంగానే భయం ఉంటుంది. స్త్రీలకు సహజంగానే వినయ స్వభావం కలిగి ఉండుటచే వనవాసంలో ఎదుర్కున్న పరిస్థితి మరొక రూపంలో అంటే యతి రూపంలో ఉన్న శూర్పణఖ ద్వారా అంత:పురంలో కూడా ఎదురైంది. ఏదో ఒక విధంగా యతిని ఆనంద పరచాలనే సీత స్వభావము. వనవాస సమయంలో అశోకవనంలో పది నెలలు పాటు లంకలో ఉన్నా కూడా రావణాసురుడి బొటనవేలు మాత్రమే చూసానని చెబుతుంది. స్త్రీలు సహజంగానే ఇతర పురుషులను తెలుసు అని చెప్పేటప్పుడు వారిని సోదరుడుగాను, తండ్రి గాను సంభోదిస్తారు.

అలాగే సీత కూడా యతికి, రావణాసురుడుని తండ్రిగా భావించానని చెప్తుంది. అయితే ఆ యతి రావణుడి బొటనవేలు గీసి ఇమ్మనగా సీత యతిని ఆనందపరచడానికి పటము వేసి ఇచ్చింది. అప్పుడు శూర్పణఖ ఆ పటమును తీసుకొని వెళ్ళి మిగిలిన ఇతర శరీర భాగాలను గీసి బ్రహ్మ దగ్గరకు వెళ్ళింది. బ్రహ్మను తన అన్న చనిపోయి ఆరునెలలు అయ్యింది అని తను ఇంక తన అన్నను మరిచిపోలేకపోతున్నాను అని బ్రహ్మకు చెప్పింది. కాబట్టి నా

అన్నకు మారుగా ఈ పటమును చూసుకొంటున్నాను. నా మీద కనికరించి అన్న పటమునకు ప్రాణం పోయండి అని బ్రతిమిలాడిరది. బ్రహ్మ ఆ పటమునకు ప్రాణం పోసాడు. దానితో ఆ పటమును తీసుకొని అయోధ్యకు చేరిన శూర్పణఖ ఏలాగోలాగా అంత:పురంలోకి పటాన్ని పంపించింది. అంతట ఆ పటము సీత దగ్గర నిలబడి ''రావే పోదము లంకకు నసుచు సీతను పిలిచింది.''

దానితో సీత అంత:పురంలోని వారందరు ఆశ్చర్యపడిరి. అనంతరం ఆ పటమును ధ్వంసం చేయాలని నూతిలోను వేసారు కాని పటం తిరిగి వచ్చింది. పెద్ద మంటగా చేసి అందులో వేసారు అయిన మంటలో నుంచి బయటకు వచ్చింది. పెద్ద బండ రాళ్ళల్లో పడేసిన తిరిగి వచ్చింది. ఎన్ని చేసిన పటము తిరిగి రావడంతో సీత ఆ పటమును మంచము పరుపు క్రింద దాచి పెట్టింది. ఆ సమయంలో రాముడు అంత:పురంలో లేదు. దానితో అంత:పురంలోని పనివాళ్ళు అందరికి ఈ విషయం రాముడికి చెప్పవద్దని చెప్పింది. తన భద్రతకు ముప్పు వచ్చే విషయాలను స్త్రీలు దాస్తారు.

ఆ రోజు రాత్రి సీత రాముడు మంచ మీద పడుకొని ఉండగా ఆ పటం రాముడిని క్రిందకు పడగొట్టింది. రాముడు తొలుత సీత సరసంగా పడగొట్టిందని అనుకున్నాడు. ''**ఆడుదురు పాడుదురు నవ్వుదురుగాని - పడద్రోసుట లివి సరసనులటవే**''[7] అని రాముడు అన్నాడు. కానీ అంతలోనే రాముడు కళ్ళకు ఎదురుగా పటము కనబడిరది. పటము రాగానే రాముడుకి అనుమానం కలిగింది. ఎంత మంది ఎన్ని చెప్పిన రాముడు వినలేదు.

ఈ కారణం చేతనే రాముడు సీతనీ అడవులకు పంపించాడు అని జానపదులు వారి నిజ జీవితంలో ఎదురయ్యే భార్య భర్తల మధ్య సంఘర్షణలను ఎంతో చక్కగా రామయాయణంలో చూపించారు. ఇక్కడ జానపదులు బ్రహ్మకు భూత, భవిష్యత్, వర్తమాన కాలాలు, మాయలు, మంత్రాలు తెలియని అమాయక పాత్రగా మలిచారు. బ్రహ్మ కన్నా శూర్పణఖకి తెలివి ఎక్కువగా ఉన్నట్లు జానపదులు నమ్మినట్లు అయ్యింది. అంటే ఇక్కడ సీతమీద జానపదులకు ఉన్నా ఆత్మీయత అనురాగాలు శూర్పణఖను జిత్తులమారిగాను, బ్రహ్మ అమాయకుడుగాను భావించేటట్లు చేసాయి.

ఇక్కడ రాముడు సీత మీద అనుమానం రావడం అనేది ఒక బలమైన కారణంగా చెప్తారు. అంటే పితృస్వామ్య సంస్కృతిలో స్త్రీలు భర్త మనస్సుకు అనుగుణంగా నడుచుకోవాలి అనేది జానపదులు పాటిస్తున్నట్లుగా తెలుస్తుంది. ఈ కథలో స్త్రీలు రహస్యాలు దాస్తారు అనే సహజ లక్షణాన్ని సీతకు ఆరోపించడం, పరాయి మగాడి పటము వివాహం అయిన స్త్రీ దగ్గర అనుమానస్పదంగా ఉండటం అనేది బలమైన కారణంగా కనిపిస్తుంది.

కాబట్టి చాకలి అన్న మాట కోసం కాదు సీత దగ్గర రావణుడి పటం ఉన్నా హేతువును చూపించడం వల్ల రాముడు నిరాపరాదిగా చూపించే ప్రయత్నం చేసారు.

## 3. ముగింపు:

రామాయణంలోని సీతారాముల పాత్రలు భారతదేశంలోని స్త్రీ పురుషులకు ఆదర్శంగా ఉన్నాయి. జీవితం కేవలం సుఖం లేదా దుఖం: కాదు సుఖదు:ఖాలు రెండు మనిషి జీవితంలో సమాంతరంగా ఉంటాయి అని రామాయణం ద్వారా తెలుస్తుంది. జానపదుల పుట్టుక నుంచి చావు వరకు వేడుకలు వినోదాలు స్త్రీ సంబంధ కార్యాలు వైవాహిక జీవితంలోనూ రామాయణం ప్రతిబింబిస్తుంది. రామాయణ కథలు జానపదులు వారి నిత్యజీవితంలోని జరిగే సందర్భంలో వాటిని కథలుగా చెప్పుకుంటారు.

జానపదులు సీతకు రాముడికి సంబంధించి రామాయణ ఇతర పాత్రలను కూడా అవాల్మీకీయాంశాలుగా అనేక సంఘటనలను కథలుగా, గేయాలుగా చెప్పుకుంటారు. పైన సీతకు సంబంధించి పేర్కొన్న అంశాలు అన్ని అవాల్మీకీయాలు వాటిని సందర్భానుసారంగా జానపదులు పాడుకుంటారు.

## 4. పాదసూచికలు:

1. జా.గేయ పు. పేజీ - 65
2. జా.గేయ పు. పేజీ - 67
3. జా.గేయ పు. పేజీ - 67
4. జా.గేయ పు. పేజీ - 67
5. జా.గేయ పు. పేజీ - 67
6. జా.గేయ పు. పేజీ - 69
7. జా.గేయ పు. పేజీ - 70

## 5. ఉపయుక్తగ్రంథసూచి:

1. రామరాజు, బిరుదురాజు, తెలుగు జానపద గేయ సాహిత్యం, హైదరాబాదు, 1990.
2. వెంకటరెడ్డి, కసిరెడ్డి, జానపద సాహిత్యం అధ్యయనం అనుశీలనం, జాతీయ సాహిత్య పరిషత్ , భాగ్యనగర్ 1994.
3. శ్రీలక్ష్మి, కురుగంటి, జానపద రామాయణం మనోవిశ్లేషణ, తెలుగు పరిశోధన ప్రచురణలు, హైదరాబాద్, 1988.
4. సుందరం, ఆర్వీయస్, ఆంధ్రుల జానపద విజ్ఞానం, పొట్టి శ్రీరాములు, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 2004.
5. సుందరం, ఆర్వీయస్, సుందర జానపదం, ప్రొఫెసర్ ఆర్వీయస్. సుందరం, మైసూర్, 2017.

***


AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_33.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 33. శ్రీకార పద్యాలలో రామాయణం

**డా. గోలి శ్రీలత**

తెలుగు సహాయయాచార్యులు,
ప్రభుత్వ డిగ్రీ కళాశాల, లక్షెట్టిపేట,
మంచిర్యాల, తెలంగాణ.
సెల్: +91 9293802345. Email: siripochampally@gmail.com

**వ్యాససంగ్రహం:**

*తెలుగులో కావ్యరచన ప్రారంభమైన నన్నయ కాలం నుండి ఆధునిక యుగం వరకు సంప్రదాయ సాహిత్య రచన చేసిన కవులందరూ అవతారిక సంప్రదాయాన్ని పాటించారు. ఇందులో కవిజీవిత విశేషాలతో పాటు, అంకితం, ఇష్టదేవత స్తుతి, సుకవిస్తుతి మొదలైన విషయాలు పొందుపరచడం సంప్రదాయంగా కనిపిస్తుంది. తెలుగు కావ్యావతారికలు అంశంపై జి.నాగయ్యగారు, అవతారికల్లో ఇష్టదేవతాస్తుతి విశేషాలపై బి.రాములు గారు విలువైన పరిశోధనలు చేసారు. మంగళకరమైన శ్రీకారంతో ప్రారంభమయ్యే తెలుగు కావ్యాది పద్యాలలో కవులు తమ ఇష్టదేవతాస్తుతిలో భాగంగా సీతారాములను వేనోళ్ళా కీర్తించారు అటువంటి శ్రీకారపద్యాల అధ్యయనం ద్వారా రామాయణంకు సంబంధించిన అంశాలైన సీతారాముల ఆదర్శ జీవితాన్ని, దాంపత్యాన్ని , రూప వర్ణనను, కళ్యాణఘట్ట వర్ణలను, రచనా చమత్కారాన్ని విశ్లేషించడమే ఈ వ్యాసం యొక్క ముఖ్య ఉద్దేశ్యం.*

**Keywords:** శ్రీకారపద్యాలు, అవతారిక, రామాయణం, సీతారాములు, ఆదర్శజీవితం, ఆదర్శదాంపత్యం, ఉదాత్తశృంగారం, మంగళకరం, శుభకరం, ప్రార్థనపద్యం, దేవతాస్తుతి, సంకల్పం, గుణగణాలు, కృతికర్త, కృతి భర్త, ధర్మమార్గం.

## 1. ఉపోద్ఘాతం:

తెలుగు సాహిత్యంలో కవులు తమ రచనలను ప్రారంభించేటప్పుడు వారి రచనా సంకల్పానికి ఎలాంటి ఆటంకాలు కలగకుండా మొదటగా తమ ఇష్ట దైవాన్ని స్తుతించి కావ్యారంభం కావించేవారు. ఇప్పటికీ కూడా మనం ఏ పని ప్రారంభించిన ముందు మన ఇష్టదైవాన్ని తలుచుకొని ప్రారంభించడం కనిపిస్తుంది. ఇది తెలుగునాట

తరతరాలుగావస్తున్న సంప్రదాయం. కవుల రచనాల్లో కావ్యాది శ్రీకార పద్యాల్లో ఇలాంటి సంప్రదాయనుగుణమైన ఇష్టదేవతాస్తుతితో పాటు చక్కని చమత్కారము కనిపిస్తుంది. తెలుగువారికి ఆరాధ్యదైవంగా పేరొందిన రామునికి సంబంధించిన ఎన్నో విషయాలు తెలుగు కావ్యాది శ్రీకారపద్యాల్లో కనిపిస్తాయి.

కవి కావ్యారంభంలో ఇష్టదేవతాస్తుతి చేసి ఆ కావ్య రచనకు ప్రేరేపించిన అంశాలను పేర్కొంటూ కృతికర్త కృతిభర్త వంశవర్ణనలు యొక్క వంశవర్ణనలు, సుకవిస్తుతి, కుకవినింద మొదలైనవి పేర్కొంటాడు. ఈ అంశాలన్నిటిని పేర్కొనే అవతారిక సంప్రదాయం నన్నయ నుండి నేటి వరకు కవులు తప్పకుండా పాటించినట్లు తెలుస్తుంది. జి. నాగయ్య అవతారికల గురించి తెలుపుతూ "**అవతారిక సాంప్రదాయము ప్రాచీన సంస్కృత కావ్యము లందు మృగ్యము. సంస్కృతకావ్యములు అత్యధికముగా వస్తు నిర్దేశ పూర్వకమగు మంగళ శ్లోకముతోనే ప్రారంభించబడినవి. కాళిదాసు రఘువంశము వంటి కొన్ని కావ్యము లందు మాత్రము ప్రారంభమున దేవతా స్మరణ పూర్వకమగు మంగళశ్లోకము రచించబడినది**" (బి.రాములు, తెలుగు కవుల ఇష్టదేవతాస్తుతి విశేషాలు, పుట.సం.20) అని అన్నాడు.

తెలుగు కవులందరూ అవతారికలోని మొదటి పద్యం శ్రీకారంతోనే ప్రారంభించి ఇష్టదేవతాస్తుతి చేసారు. విష్ణువు దశావతారములలో ఏడవ అవతారంగా చెప్పబడే శ్రీరాముడు ప్రజలందరికీ ఆదర్శ నడవడి చూపిన దైవం. భగవంతుడే స్వయంగా మానవుడిగా ఈ నేలపై రాముని రూపంలో సంచరించాడని ప్రజలు నమ్మకం. అందుకే శ్రీరాముని దేవునిగా ఆరాధించారు. రాముని మీద అచంచలమైన భక్తితో కవులు శ్రీకార పద్యాలలో సీతారాముల దాంపత్యం, హనుమంతుని రామభక్తి వంటి విశేషాలను పొందుపరచి స్తుతించారు.

## 2. శ్రీకారం – శుభకరం :

'శ్రీ' అనే శబ్దానికి లక్ష్మీ, సంపద, ఐశ్వర్యము, త్రివర్గము, వృద్ధి, శోభ, అలంకారము, కీర్తి, బుద్ధి, సరస్వతి, విషము, ఉపకరణము, మారేడు అనే అర్థాలని బహుజనపల్లి సీతారామాచార్యులు "శబ్దరత్నాకరం" (బహుజనపల్లి సీతారామాచారులు, శబ్దరత్నాకరం, పు.సం.760)లో పేర్కొన్నారు. వీటితో పాటుగా 'కాంతి' అనే అర్థాన్ని జి.ఎన్. రెడ్డి "'తెలుగు నిఘంటువు తెలుగు - తెలుగు"లో చేర్చారు. (జి.ఎన్. రెడ్డి, తెలుగు నిఘంటువు, పు.సం.764) "ఆంధ్ర- తమిళ- కన్నడ త్రిభాషానిఘంటువు"లో పైన పేర్కొన్న అర్థాలే కాకుండా శ్రీయుతులు, గౌరవాచకము అనే అర్థాలను మరియు "పారమార్థిక పదకోశం" (2010)లో పొత్తూరు వెంకటేశ్వరరావు శ్రీదేవి, మహాలక్ష్మి, బ్రహ్మవిద్య, అవిద్య, పద్మం, మోక్షసామ్రాజ్యలక్ష్మి, కీర్తి అనే అర్థాలు కూడా పేర్కొన్నాడు. తెలుగులోని ప్రాచీన కావ్యములలో ఒకటి రెండు తప్ప మిగిలినవన్నీ కూడా 'శ్రీ'కారంతో ప్రారంభమైనవే ఉన్నవి. 'శ్రీ' అనేది లక్ష్మీ వాచకం కనుక శ్రీకారం కావ్యాదిలో ప్రయోగించుటవలన సర్వశుభములు కలుగుననే నమ్మకంతోనే అందరూ శ్రీకారంతో కావ్యాన్ని ప్రారంభించిరి. రాను రాను ఇదొక సాంప్రదాయంగా కొనసాగింది. "**తెలుగులో నన్నయ నుండి 19వ శతాబ్దం చివరి వరకు కవులందరూ' శ్రీ'కారముతో కావ్యము నారంభించే సంప్రదాయాన్ని నియతంగా**

**పాటించారు. అచ్చ తెనుగు కావ్యములైన తెలగన 'యయాతి చరిత్ర', కూచిమంచి తిమ్మకవి 'అచ్చ తెనుగు రామాయణము' మొదలైన కావ్యములలో 'శ్రీ' కి వికృతి అయినా 'సిరి'తో ఆరంభమైనవి. కొందరు కవులు కావ్యాది పద్యమే కాకుండా రెండవ, మూడవ పద్యాలు సైతం శ్రీకారంతోనే చెప్పినారు. మడికి సింగన 'వాశిష్ట రామాయణము' నందు మొదటి శ్లోకం ఆ తరువాత రెండు శ్రీకార పద్యములు కలవు. చేమకూర వెంకట కవి 'విజయ విలాసము' నందు మరింగంటి సింగారాచార్య 'దశరథ రాజ నందన చరిత్ర' యందు వరుసగా మూడు శ్రీకార పద్యములు కలవు**". (బి. రాములు, తెలుగు కవుల ఇష్ట దేవతా స్తుతి విశేషాలు, పుట.సం.25) ఇలాంటి శ్రీకారంతో ప్రారంభమయ్యే కావ్యాది పద్యాలలో శ్రీరామునిపై భాక్తిభావనలు, కావ్యవస్తునిర్దేశం, రామయణానికి సంబంధించిన అనేక విశేషాలు చమత్కారంగా వర్ణించబడ్డాయి.

### 3. సీతారాముల ఆదర్శ దాంపత్యం :

**"శ్రీ లీలం దిలకంబు కస్తురిని జిత్రింపంగ నీచెక్కుట**
**ద్దలం జూచెద నీడ నానఁ గఁ వదుద్యుత్కాంతికర్పూర రే**
**ఖాలక్ష్మిం గన మిక యంచు మఱి దక్కం జూడు నాఁ జూచి వీ**
**క్షాళి నల్వుగ మెచ్చుసీత నగురామాధీశుఁ జింతించెదన్.**" (సమీరకుమారవిజయము, పుట.1)

పై పద్యం పుష్పగిరి తిమ్మన్న రచించిన "సమీర కుమారవిజయము"లోనిది. ఈ శ్రీకారపద్యంలో సీతారాముల యొక్క ఆత్మీయతను, ఆదర్శదాంపత్యాన్ని సహజ సిద్ధంగా, సౌందర్యబద్ధంగా వర్ణించారు. శ్రీరామునికి సీతమ్మ నుదుటిపైన కస్తూరి తిలకాన్ని దిద్దుతున్నప్పుడు శ్రీరాముని చెక్కుటద్దాలలో ఆ సీతాదేవి రూపం ప్రతిబింబించిందట. అయితే అమ్మవారు తెల్లని ముఖవర్చస్సు కలిగి ఉండటం వల్ల ఆ ప్రతిబింబించిన రూపం మిక్కిలి కాంతిని వెదజల్లుతుందట. ఆ వెదజల్లిన కాంతిని సీతాదేవి చూడలేక తన కళ్ళను పక్కకు తిప్పుకుందట. అలాంటి సీతాదేవిని చూసి శ్రీరాముడు మెచ్చుకొని నవ్వుతున్నాడు. అలాంటి శ్రీరామచంద్రునికి నమస్కరిస్తున్నాను అని అర్థం. ఇందులో సీతారాముల దాంపత్య జీవితాన్ని అత్యంత సుందరంగా,కడు ఆత్మీయంగా వర్ణించడం జరిగింది.

రఘునాథ నాయకుడు రచించిన "వాల్మీకి చరిత్రము" లోని ప్రథమశాసంలో శ్రీకార పద్యంలో రాముని స్తుతి ఈ విధంగా కలదు. రామాయణ కావ్యకర్త. సృష్టికి ఆదికవి అయిన వాల్మీకి యొక్క జీవిత చరిత్రను కావ్యంగా అందించాడు రఘునాథ నాయకుడు. "వాల్మీకి చరిత్రము" లోని శ్రీకార పద్యం ఈ క్రింది విధంగా ఉంది.

**"శ్రీ వైదేహియురోజ పూర్ణ కలశీశృంగంబులం బల్లవ**
**శ్రీవిన్యాసముఁజూపు హస్తముల చేఁ బ్రేమం బ్రకాశంబుగా**
**శ్రీవిద్యల్ నతకోటి కిచ్చు నలరాజీవాక్షుఁ డిక్ష్వాకువం**
**శావిర్భూతమహార్ఘరత్నము మదీ యాభీషముల్ సేయుత"** (వాల్మీకి చరిత్రము, పుట.1)

సాధారణంగా రామాయణంలో సీతారాముల దాంపత్యజీవితాన్ని గురించి వర్ణించిన సందర్భాలు తక్కువగానే కనిపిస్తాయి. కొన్ని సందర్భాలలో సీతారాముల దాంపత్యాన్ని వర్ణించినప్పటికీ కూడా అది ఉదాత్త

శృంగారంగానే కనిపిస్తుంది. కానీ రఘునాథుని "వాల్మీకి చరిత్ర"లో శ్రీకార పద్యంలో సీతారాముల శృంగారాన్ని ఆ కాలంనాటి భోగలాలసతకు చిహ్నంగా వర్ణించడం విశేషం. సీతమ్మ యొక్క స్తనసంపదపై తన చేతి వేళ్ళ లాఘవాన్ని ప్రేమగా ప్రదర్శింపజేసే ఆ శ్రీరామచంద్రుడు గొప్ప సంపదలన్నింటిని తన భక్తకోటికిచ్చే రాజీవాక్షుడు. రఘువంశలో జన్మించిన గొప్ప రత్నం లాంటి ఆ శ్రీరామచంద్రుడు మా కోరికలన్నింటినీ తీర్చుగాకా అని భావం. సీతారాముల దాంపత్యాన్ని కాస్త పచ్చిగా వర్ణించిన పద్యాలు చాలా తక్కువ. అందులో ఒకటి "వాల్మీకి చరిత్రము" లోని ఈ శ్రీకార పద్యం. నిజానికి అది ఆ కాలంనాటి భోగలాలసతను సీతారాముల పరంగా వర్ణించాడని మనం భావించవచ్చు.

## 4. శ్రీ సీతా రామాంజనేయుల స్తుతి :

శా. **"శ్రీ మద్దివ్యనిజాం ఘ్రిపద్మములు సంసేవించుచున్ భ క్తి చే**
**ధీమంతుం డగునాంజనేయుని నసద్దేహేంద్రియాతీత చి**
**ద్భూమానందుఁడ వీవ నే నని కృప న్బోధించు శ్రీ జానకీ**
**రామబ్రహ్మము నంతరంగమున నారాధింతు నశ్రాంతమున్.**" (శ్రీసీతారామాంజనేయ సంవాదం, పుట.1)

పై పద్యం పరశురామ పంతులు లింగమూర్తి గారు రచించిన "శ్రీ సీతారామాంజనేయ సంవాదము" లోనిది. ఒకానొక సందర్భంలో యయాతిని రక్షిస్తానని ఆంజనేయుడు మాట ఇవ్వడం, అతన్ని సంహరిస్తానని రాముడు ప్రతినభూనడంతో శ్రీరామునికి, ఆంజనేయునికి యుద్ధం వాటిల్లిన సందర్భంలో రాసిన కావ్యం ఇది. ఈ శ్రీకార పద్యంలో శ్రీరాముని స్తుతితో పాటు ఆంజనేయున్ని కూడా స్తుతించడం విశేషం. ఎల్లప్పుడూ శుభకరమైన, దివ్యమైన శ్రీరాముని పాదపద్మములను భక్తితో సేవిస్తున్న బుద్ధిమంతుడైన ఆంజనేయున్ని, ఇంద్రియాలకు అతీతమైన గొప్ప ఆనందాన్ని కృపతో ఇచ్చే ఆ జానకి రామబ్రహ్మమును ఎల్లప్పుడు మనసులో వేడుకుంటున్నాను అని అర్థం. జానకి మాత శ్రీరామునికి,ఆంజనేయునికి జరిగే యుద్ధాన్ని నివారించడానికి మిగుల ప్రయత్నం చేయడం చేత 'శ్రీ జానకి రామబ్రహ్మము'అని ప్రయోగించెను. చివరికి రామాంజనేయ సంవాదంలో రామ బాణం కంటే రామ నామమే గొప్పదని రుజువవుతుంది. ఆ రామ నామం వల్ల కలిగే ఆనందాన్ని శ్రీరాముడు హనుమంతునికి కటాక్షిస్తున్నానని ఈ పద్యంలో పరోక్షంగా చెప్పడం జరిగింది.

## 5. రాముని గుణగణాల వర్ణన:

**సీ. శ్రీ దేవతలకెల్ల - నాదిదేవుండవు /మూడు లోకములకు - ముఖ్యగురుఁడ**
**వవని జాతకు భర్త - వాద్యుండ వీవు స/ త్యవ్రతుండవు; శాంతి తత్పరుఁడవు**
**కోటిచంద్రులమించు మేటికాంతులు గల్గు/ ముఖమండలుండవుసఖుడవీవు!**
**కౌస్తుభమణి తోడ - గాంతియుక్తుండవు/సకలార్థ సిద్ధుల సహితుఁడీవు:**
**గీ. పరగ, సరయూ నదీతీర వాసుఁడగుచు**
**భక్తకోటిని రక్షించు పావనుఁడవు**

**అమల రఘువంశరాజుల నధికుఁడీవు**
**ప్రాంజలి, నొనర్తు రామ నీపాదములకు.** (శ్రీరామకర్ణామృతము, పుట.1)

పై శ్రీకార పద్యం కల్లూరి అహోబల రావు గారు రాసిన "శ్రీరామ కర్ణామృతము" ప్రథమశ్వాసంలోనిది. శ్రీరామప్రభవు ఎప్పుడూ కూడా తాను దైవాన్ని అని ప్రకటించుకోలేదు. కానీ ఎప్పుడూ ధర్మమార్గంలోనే పయనించాడు. కాబట్టి ఆయనకు దైవత్వాన్ని మనమే కల్పించుకున్నాము. సాక్షాత్తు ఆ నారాయణమూర్తి అవతారంగా భావించాము. అందుకే దేవతలోకెళ్ళి మొదటి దేవుడవు అని, కేవలం ఈ మానవలోకానికే కాదు, సకల చరాచర సృష్టికే కాదు, అన్ని లోకాలకి కూడా గురుత్వం వహించదగిన వ్యక్తివి అని, ఇక్కడ గురుత్వమంటే చెప్పదగినటువంటిది అని, తాను చేసినప్పుడు, పాటించగలిగినప్పుడే మరొకరికి చెప్పే అర్హత ఉంటుంది. ఇక్కడ రాముడు ధర్మ మార్గాన్ని పాటించాడు కాబట్టే అందరూ ఆ ధర్మమార్గాన్ని ఆచరించారు. అందుకే ఆ రాముడు ముల్లోకాలకు గురవు స్థానంలో ఉన్నాడు అని, ఆ సీతాదేవికి భూమాతకు భర్తవు అని, మొదటి వాడవు అని,ఎల్లప్పుడూ సత్యాన్నే పలికే వాడవు అని, రామాయణంలో రాముడు కోపించిన సందర్భాలు చాలా తక్కువ, కనుక ఆయన్ని ఆకృతి దాల్చిన శాంతి స్వరూపడవు అని, కోటి చంద్రుల కాంతితో సమానమైన గొప్ప ముఖ కాంతి కలిగిన వాడవు అని, విష్ణు అవతారంలో ధరించిన కౌస్తుభ మణిని రాముడు ధరించడం చేత అలాంటి మణికాంతితో దివ్యంగా వెలుగొందే వాడవు అని, (ఇక్కడ రాముడిని విష్ణు అవతారంగా స్తుతిస్తున్నాడు) అన్నింటినీ ఇవ్వగలిగే వాడివి అని, సరయు నది తీరంలో అయోధ్య పురంలో పుట్టి, పెరిగి, అక్కడే అవతారాన్ని చాలించినటువంటి వాడవు అని ,భక్త సమూహాన్ని పాపముల నుండి విముక్తి కలుగజేసే వాడివి అని, రఘువంశంలో పుట్టిన వారందరూ గొప్పవారని, రఘువంశంలోని వారు ఏనాడు ధర్మాన్ని వీడి ప్రవర్తించలేదని, అలాంటి నిర్మలమైన, మచ్చలేని రఘువంశ రాజులలో గొప్పవాడివి అని, ఇక్కడ రాముడు కాదు గొప్ప రఘువంశంలో పుట్టినందుకే రాముడు గొప్పవాడైనాడని కవి ఉద్దేశం. అలాంటి రాముని పాదాలకు నమస్కారం చేస్తున్నానని అర్థం.

శ్రీ కార పద్యాలు సాధారణంగా వృత్త పద్యాలలో ఉంటాయి. కానీ ఇక్కడ సీస పద్యంలో శ్రీ కార పద్యాన్ని రాయడం విశేషం. ఈ శ్రీ కార పద్యంలో రాముని శుభలక్షణాలన్నీ చెప్పబడ్డాయి. శ్రీరాముని నామం చెవులకు వీనుల విందుగా, కడు రమ్యంగా, అమృతం తాగినట్లుగా ఉందని వివరించడం జరిగింది.

నిండైన రామభక్తితో రామాయణాన్ని సంక్షిప్తంగా, సరళంగా తెలుగువారికందించిన కవయిత్రి మొల్ల. ప్రబంధయుగానికి చెందిన తొలి తెలుగు కావ్యకవయిత్రిగా భావింపబడే మొల్ల "చెప్పుమనే రామచంద్రుడు…." అని తనతో రాముడే రామాయణం చెప్పించాడని తెలిపి భక్తితో రామాంకితంగా రాసిన రామాయణం శ్రీరాముని గుణవర్ణనతో ప్రారంభించింది.

**"శ్రీ మహిమాభిరాముడు వశిష్ఠ మహాముని పూజితుండు సు**
**త్రామ వధూ కళాభరణ రక్షకుడాశ్రిత పోషకుండు, దూ**
**ర్వామల సన్నిభాంగుడు, మహాగుణశాలి, దయాపరుండు శ్రీ**
**రాముడు ప్రోచు భక్తతతి రంజిలున్నట్లుగ నెల్లకాలమున్."**

ఇందులో తెలిపిన రాముని గుణాలన్నీ మానవులకు సర్వదా ఆచరణీయాలు, అనుసరణీయాలు. అందుకే రాముడు అందరికి ఆదర్శమయ్యాడు. కవులు ఇష్టదైవ స్తుతిలో ఆదర్శమూర్తియైన శ్రీరాముని గొప్ప లక్షణాలను తెలియజేయడం సాధారణంగా కనిపించినా వాటన్నింటినీ కథాక్రమ పద్ధతిలో చెప్పడం విశేషం.

## 6. సీతారామ లక్ష్మణుల రూప వర్ణన :

పాలవేకరి కదిరీపతి రచించిన "శుకసప్తతి" లో శ్రీకార పద్యంలోని రాముని స్తుతి ఈ విధంగా ఉంది.

**"శ్రీ కమలాక్షి యై మెలంగు సీత తటిద్రుచి నొంద లక్షణ**
**శ్రీకర బాహుదండమునః జేర్చుధనుర్లత యింద్ర చావశో**
**భాకృతిc దాల్ప మేరుశిఖ రాశ్రయనీరదలీల సింహపీ**
**ఠీకమనీయుc డౌ జయప టిష్ఠుని శ్రీరఘురాము నెన్నెదన్."** (శుకసప్తతి, పుట.1)

సీతారామ లక్ష్మణుల రూపాన్ని మన ముందు చిత్రించినట్లుగా వర్ణించబడిన పద్యం ఇది.సాక్షాత్తు లక్ష్మీదేవి స్వరూపమైన ఆ సీతాదేవి మెరుపుతీగ లాగా , పక్కనే ఉన్న లక్ష్మణుని చేతిలో ఉన్న ధనస్సు, ఇంద్రుని యొక్క చాపం లాగా అంటే ఇంద్రధనస్సు లాగా, మేరు పర్వతం మీద నల్లని మేఘం నిలిచినట్లుగా ఎత్తైన సింహాసనం మీద ఉన్న, జయాన్ని కలిగించే ఆ శ్రీరామునిని నేను స్తుతిస్తున్నాను అని అర్థం. దీనిలో శ్రీరామున్ని మేఘం తోను, సీతాదేవిని మెరుపుతీగతోను, లక్ష్మణున్ని ఇంద్రచాపంతోనూ అంటే ఇంద్ర ధనస్సుతోను పోల్చడం జరిగింది. విశేషం ఏంటంటే సీతారాములను మేఘం,మెరుపుతో పోల్చడం విశేషం. మేఘం, మెరుపు రెండు విడదీయరాని అంశాలు. మేఘంతోనే మెరుపు ఉంటుంది. మెరుపుతోనే మేఘం ఉంటుంది. మిక్కిలి కాంతితో మెరిసిపోతున్న సీతమ్మను మెరుపుతీగ లాగా, ధనస్సు ధరించిన లక్ష్మణస్వామి చేతిలో ఉన్న ధనస్సు ఇంద్రధనస్సులాగా ఉండగా నల్లగా ఉన్న శ్రీరామచంద్రుడు మేఘం లాగా ఉన్నాడు ఎలాంటి మేఘం అంటే సింహాసనం మీద ఉన్న శ్రీరాములు కనుక, మేరు పర్వతం మీద ఉన్న మేఘంలాగా ఉన్నాడని అర్థం. రామున్ని మేఘంతో పోల్చడానికి కారణం నలుపు మాత్రమే కాదు, మేఘం ఈ లోకానికి సుభిక్షాన్ని అందించే విధంగా వర్షాన్ని ఇస్తుంది. శ్రీరామచంద్రుడు సుభిక్షాన్ని కలిగించే విధంగా కరుణా వర్షాన్ని ప్రసాదిస్తున్నాడు. కాంతిని ప్రసాదిస్తుంది సీతమ్మ తల్లి. ఆనందాన్ని కలిగించే విధంగా రక్షణ ఇస్తున్నాడు లక్ష్మణుడు. అలాంటి దృశ్యాన్ని కలిగించే విధంగా ఈ పద్య రచన జరిగింది. సీతారామ లక్ష్మణుల రూపురేఖల్ని ఒక చిత్తరువు రూపంలో ఆవిష్కరించినట్లుగా ఉన్న అద్భుతమైన పద్యం ఇది.

చేమకూర వెంకట కవి రచించిన "విజయ విలాసము"లోని శ్రీకార పద్యంలో శ్రీ రాముని స్తుతి ఈ విధంగా ఉంది.

**"శ్రీ లెల్లప్పుడొసంగ నీ సకల ధాత్రీ చక్రమున్ బాహుపీ**
**ఠీ లగ్నంబుగ జేయు దిగ్విజయ మీన్ డీకొన్న చందాన,**
**నే వేళన్ సీతయు లక్ష్మణుండుఁదను సేవింపంగ విల్ పూని,**
**చె ల్వొప్పీలన్ దగు రామమూర్తి రఘునాథాధీశ్వరుం బ్రోవుతన్"** (విజయవిలాసము, పు.సం.1 )

"**ఎప్పుడూ తన దగ్గరనే సీతా లక్ష్మణులు ఉండగా విల్లు ధరించి ఉన్నందువల్ల ఎల్లప్పుడు సంపదలను, భూమండల పరిపాలనమును, దిగ్విజయాలను ఇవ్వడానికి పూనుకున్నడన్నట్లు (వరదహస్తము కనబరుస్తూ) ఉన్న శ్రీరామమూర్తి రఘునాధ రాజును రక్షించుగాక**". (చేమకూర వెంకట కవి, విజయవిలాసము, తాపీ ధర్మారావు వ్యాఖ్య, పు.సం.1 )

ఈ పద్యంలో చేమకూర వెంకట కవి శ్రీరాముని కోదండరాముడిగా వర్ణించాడు. నిజానికి సాధారణంగా రాముని విగ్రహంలో రాముడు మధ్యలో ఉండి, కుడి ఎడమవైపులకు సీతా లక్ష్మణులు నిలిబడి ఉంటారు. రాముడు తన ఎడమ చేతిలో నిలువుగా పట్టుకున్న విల్లుతో ఉండి, కుడి అర చేతి వేళ్ళు కిందికి చూపుతూ ఉన్నాడని వర్ణించాడు.

చేమకూర వెంకట కవి యొక్క ఇష్ట దైవం సూర్యుడు.కాని "విజయ విలాసము" కావ్యాదిలో మాత్రం దేవతా ప్రార్థనలో కావ్య కృతి భర్త అయిన రఘునాథ రాజు యొక్క ఇష్టదైవమైన శ్రీరాముని ప్రార్థించాడు.అంటే కవులు తమ ఇష్ట దైవాన్ని కాకుండా కృతిభర్తల యొక్క ఇష్టదైవాన్ని కూడా స్తుతించే ఆచారం ఉన్నదనే విషయం ఈ పద్యం ద్వారా మనకు తెలుస్తుంది. పారిజాతాపహరణంలో కూడా ముక్కుతిమ్మన తన ఇష్ట దైవం ఈశ్వరుడైనప్పటికిని, కృష్ణదేవరాయల ఇష్టదైవం వెంకటస్వామిని స్తుతించాడు. "**సీత లక్ష్మీ అవతారం. కాబట్టి సంపదలనూ, లక్ష్మణుడు భూమిని మోసే ఆదిశేషు అవతారం కాబట్టి భూచక్రభరణమునూ, విల్లు విష్ణువు పంచాయుధములలోని శార్ఙమనే ధనస్సు కాబట్టి దిగ్విజయమునూ రాముడు ఇస్తాడని భావము**." (చేమకూర వెంకట కవి, విజయ విలాసము, తాపీ ధర్మారావు వ్యాఖ్య,పు.సం.3 )

నారాయణామాత్యుడు రచించిన "హంసవింశతి" లోని శ్రీకార పద్యం.

**"శ్రీ రామాంశజ యైనజానకి యుర స్సీమాంతరాత్యంతవి**
**స్తారప్రోజ్జ్వలహారనాయకమణీ సందర్శితంబౌ నిజా**
**కారం బారసి యన్యకాంత యను శంఖకం జెందు నం చెంచి త**
**న్నారీ రత్నము నంకపీఠి నిడు సీతాభర్త నర్ల బ్రోవుతా** (హంసవింశతి, పు.సం.1)

లక్ష్మీదేవి అంశయైన సీతాదేవి తన ఎదురుగా ఉన్న శ్రీరామ మూర్తి యొక్క వక్ష స్థలం పై నున్న మణిమాల మధ్యలోని మణిరత్నం యందు తన ప్రతిబింబమును చూసి,అది తన రూపమే అని గ్రహించక అన్యకాంత అని భ్రమించుతుందేమేనని, ఆ శ్రీరామచంద్రుడు నారీరత్నమైన సీతా దేవిని తన ఎడమ తొడపై కూర్చోబెట్టుకున్నాడు.

అలాంటి శ్రీరామున్ని సేవిస్తున్నాను అని అర్థం. సాధారణంగా రామునికి ఎడమ వైపున సీత , కుడివైపున లక్ష్మణుల యొక్క విగ్రహాలనే మనం ఎక్కువగా చూస్తుంటాము.కాని భద్రాచలం లాంటి కొన్ని చోట్ల సీతాదేవిని రాముడు తన ఎడమ అంకం పై కూర్చోబెట్టకోవడం మనకు కనిపిస్తుంది.

ఇక్కడ సీతా దేవిని తన ఎదురుగానో, కుడివైపు గానో కాకుండా ఎడమవైపున కూర్చోబెట్టకోవడం చేతి ,తన మెడలోని హారం సీతాదేవికి కన్పించే అవకాశం లేకుండా,రాముని మనసులో అన్యకాంత ఉందేమో అన్న భ్రమ సీతకు కలగకుండా రాముడు చేసాడట.ఇక్కడ సీతా రాముల విగ్రహాన్ని అత్యంత చమత్కారంగా కవి వర్ణించాడు.

## 7. సీతారాముల వివాహ వర్ణన :

రామరాజభూషణుడు తన "వసు చరిత్ర"లో సీతారాముల కళ్యాణ ఘట్టాన్ని అద్భుతంగా వర్ణించాడు.

**"శ్రీ భూపుత్రి వివాహవేళ నిజమంజీరాగ్రరత్నస్వలీ**
**లాభివ్యక్తి వరాంఘ్రిరేణుభవ కన్యాలీల యంచున్ మదిం**
**దా భావింప శుభక్రమా కలనచేఁ దద్రత్నముంగప్పు సీ**
**తాభామాపతి ప్రోవుతన్ దిరుమలేంద్ర శ్రీమహారాయనిన్"** (వసుచరిత్ర, పు.1 )

ఈ పద్యంలో సీతారాముల కళ్యాణ సందర్భంలో పెళ్లి పీటలపై కూర్చున్న సీత తన కాలి యొక్క అందెలలో ఉన్న రత్నములో తన ప్రతిబింబమును చూసి రాముని పాదము తగిలినంతనే అహల్య రాయిగా మారిన విధంగానే రాముని పాద స్పర్శ చేత ఈ మంజీరంలో ఉన్న రత్నము కూడా స్త్రీ రూపం పొందిందనదేమోనని భావించిందట. ఇది గమనించిన రాముడు సీతాదేవి యొక్క అనుమానాన్ని పోగొట్టడానికై సన్నెకల్లు తొక్కడం అనే ఒక సంప్రదాయంతో ఆ మంజీర రత్నాన్ని తన కాలివేలతో తొక్కి వేసినాడట. అలాంటి సీతాభామ పతి తిరుమల రాయలని రక్షించాలని భావం. ఇక్కడ కోపంలో ఉన్న సీతను 'సీతాభామ' అని ప్రయోగించాడు. వివాహ సాంప్రదాయంలోని సన్నెకల్లు దొక్కడం అనేది ఒక పద్దతి. రాముడు సీత అనుమానాన్ని నివారించడానికి ఈ సన్నెకల్లు దొక్కడం అనే నెపంతో ఆ మంజీర రత్నంను తోక్కినట్టుగా వర్ణించడం అద్భుతం. ఇప్పటికి కూడా ఈ సన్నెకల్లు దొక్కడం అనే సాంప్రదాయం మన వివాహ పద్ధతిలో కొనసాగుతుంది. ఇక్కడ స్త్రీ లో సహజంగానే, ప్రేమ చేత ఉత్పన్నమయ్యే ఈర్ష్య, అసూయాలను సీత పాత్ర ద్వారా అద్భుతంగా వ్యక్తీకరించాడు కవి.

అలాగే సారంగ తమ్మయ తన 'వైజయంతి విలాసము'లో సీతారాముల వివాహసమయ వర్ణనలో భక్తితో పాటు సామాజికత వెల్లడవుతుంది.

ఉ. **"శ్రీ వసుధాసుతాంఘ్రి వివరింప శిరీషదళో సమాన మీ**
**క్ష్మావరు కే ల్ని సర్గ గుణకర్కశ మశ్మము మెట్టఁ బల్కె నె**
**ట్లీవసుధామరుండనుచు నింతులు వల్కగనంటఁ గొంచులో**
**కావనుఁ డై న పెండ్లికొడు కస్మ దభీప్సితముల్ ఘటించుతన్."** (వైజయంతివిలాసము, పు.సం.1).

భూదేవి ముద్దులకూతురు ముగ్ధ సీతమ్మ, ఆమె చేయి శిరీష పుష్పము వలే మిక్కిలి సుకుమారమైంది. భూమిని పాలించే ధీరోదాత్తుడైన రాజు రాముడు అతని చేయి రాయి వలె కఠినమైంది. ఈ లోకంలో మన్మథునివంటి రామచంద్రుడు ఈమెను ఎలా చూసుకుంటాడో అని చెలికత్తెలు మాట్లాడుతుండగా విని నవ్వుతున్న శ్రీరాముడు మా కోరికలు నెరవేర్చాలని కవి భావన. ఇందులో సీతారాముల కళ్యాణ సమయములో జరిగిన విశేషాలను వివరించాడు. రాచరికపు వివాహ సంబంధాలలో దూరభారాలు ఎక్కువ. అందుకే పెళ్లి చేసే సమయంలో వరుని గురించి పూర్తిగా తెలియని వధువు సంబంధీకులు అత్తవారింట్లో ఆమెను ఎలా చూసుకుంటారో అనే భావంతో ఉండేవారు. ఇదే అంశాన్ని చెలికత్తెల మాటల రూపంలో వెల్లడించాడు కవి. ఇది సీతారాముల వివాహాంశంగా చెప్పినప్పటికీ రచనా కాలం నాటి సామాజిక విశేషాలను తెలియజేస్తుంది.

## 8. ముగింపు:

తెలుగు సాహిత్యచరిత్ర నిర్మాణానికి ప్రధాన ఆకారాలుగా నిలిచినవి కావ్యావతారికలు. విశేషించి అటువంటి అవతారికల్లోని శ్రీకారపద్యాలు కవి ప్రతిభాపాండిత్యాలతో పాటు వ్యక్తిగతభక్తిజీవిత విశేషాలను వెల్లడిస్తాయి. వాల్మీకి రామాయణం ఆధారంగా గోనబుద్ధారెడ్డి గారి రంగనాథ రామాయణం తెలుగువారికి మొదటిసారి రామకథను కావ్యంగా అందించింది.అనంతరం ఎందరో కవులు రామాయణ కావ్యాలు రాసారు. ఇతర కావ్యాలు రాసిన కవులు కూడా నిండైన రామభక్తితో కావ్యాది పద్యాల్లో రామున్ని స్తుతించారు.

ఈ విధంగా కావ్యఅవతారిక సంప్రదాయంలో భాగంగా వచ్చిన ఇష్టదేవతాస్తుతి శ్రీకారపద్యాల్లో రాముని దివ్యమంగళాకారాన్ని, సీతారామకళ్యాణాన్ని, ఆదర్శదాంపత్యాన్ని, అవ్యక్తానురాగప్రణయాన్ని, సీతాలక్ష్మణుల సమేత శ్రీరాముడిని అత్యంతరమణీయంగా వర్ణించాయి. శ్రీకారం మంగళకరం, శుభకరం. సీతారాములు ఆదర్శ దంపతులు, ధర్మ మార్గంలో నడిచిన వారు. ఈ రెండు అంశాలను మేళవించి కవులు సీతారాముల గుణగణాలను, స్తుతిస్తూ రాసిన శ్రీకారపద్యాలు రామాయణం సార్వజనీనతను వెల్లడిస్తున్నాయని చెప్పవచ్చు.

## 9. ఉపయుక్తగ్రంథసూచి:

1. అహోబలరావు, కల్లూరి.(1980). శ్రీ రామ కర్ణామృతము.
2. కదిరీపతి, పాలవేకరి.(1935).శుకసప్తతి,వెంకట రమణ పబ్లికేషన్స్, హైదరాబాద్.
3. జి.ఎన్. రెడ్డి, (1979). తెలుగు నిఘంటువు తెలుగు –తెలుగు, ఆం.ప్ర.సా. అ.
4. తిమ్మన్న, పుష్పగిరి. సమీర కుమార విజయము.(1929). వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి.
5. ధర్మారావు, తాపీ.(1968). చేమకూర వెంకట కవివిజయ విలాసము, హృదయోల్లాస వ్యాఖ్య, విశిష్ట రచనలు, హైదరాబాద్.
6. నారాయణామాత్యుడు, అయ్యలరాజు, (1945). హంసవింశతి.
7. రఘునాథ భూపాలుడు. (1940). వాల్మీకి చరిత్రము,ఆంధ్రవిజ్ఞాన సమితి, విజయనగరము.

8. రాములు, బి. (2023) తెలుగు కవుల ఇష్ట దేవతా స్తుతి విశేషాలు. సహృదయ ప్రచురణలు, వరంగల్లు.
9. రామరాజభూషణుడు, (2013) వసు చరిత్ర. ఎమెస్కో ప్రచురణలు, హైదరాబాద్.
10. వెంకటేశ్వరరావు, పొత్తురు. (2010). పారమార్థిక పదకోశం.
11. వేంకటరాయ శాస్త్రి, వేదము. (1911). విజయవిలాసము (వ్యాఖ్య), జ్యోతిష్మతి ముద్రాక్షరశాల.
12. సీతారామాచార్యులు, బహుజనపల్లి, (2017). శబ్దరత్నాకరం.

***

**గమనిక:** ఈ పత్రికలోని వ్యాసాలలో అభిప్రాయాలు రచయితల వ్యక్తిగతమైనవి.

వాటికి సంపాదకులు గానీ, పబ్లిషర్స్ గానీ ఎలాంటి బాధ్యత వహించరు.



AUCHITHYAM

International Research Journal for Telugu Language & Literary Studies

ISSN: 2583-4797

UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_34.php

## "కమనీయం తెలుగు రామాయణం"

### జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

### (ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)

# 34. బాలవ్యాకరణం: రామాయణం

**కందుకూరి భాగ్యమ్మ**

తెలుగు అధ్యాపకులు,

ప్రభుత్వ డిగ్రీ కళాశాల, సిద్దిపేట (స్వయంప్రతిపత్తి),

సిద్దిపేట జిల్లా, తెలంగాణ.

సెల్: +91 9703228034. Email: kandukuribhagyamma@gmail.com

**వ్యాససంగ్రహం:**

*సంస్కృత సాహిత్యంలో ఆదికావ్యంగా ప్రసిద్ధి చెందిన రామాయణానికి తెలుగు భాషాసాహిత్యాలలో విశేషమైన ప్రజాదరణ ఉంది. పామరుల నుండి పండితుల వరకు, కవుల నుండి వ్యాకర్తల వరకు తమ పాటలలో, కావ్యంలో, రచనలలో తమదైన శైలిలో రామాయణాన్ని స్పృశించారు. రామాయణ ఇతివృత్తాన్ని పాక్షికంగాకొందరు, సంపూర్ణంగామరికొందరు కవులు కావ్యరచన చేస్తే వ్యాకరణకారులు సూత్రాలకు ఉదాహరణల రూపంలో రామాయణాన్ని ఉపయోగించుకున్నారు. ఆ విధంగా పరవస్తు చిన్నయసూరి బాలవ్యాకరణం సమగ్రఅధ్యయనం ద్వారా అందులో వ్యాకర్త ఉదహరించిన ఉదాహరణలను, రామాయణ ఘట్టాలను తద్వారా చిన్నయసూరి రామాయణభక్తిప్రపత్తులను తెలుసుకోవడానికి అవకాశం ఉంది.*

**Keywords:** రామాయణం, రాముడు, పరవస్తుచిన్నయసూరి, బాలవ్యాకరణం, పరిచ్ఛేదాలు, సూత్రాలు, లక్ష్యాలు, సమన్వయం.

## 1. ఉపోద్ఘాతం:

సంస్కృతంలో వాల్మీకి రాసిన రామాయణానికి తెలుగులో ఎన్నో అనువాదాలు వచ్చాయి. పండితుల నుండి పామరుల వరకు అందించే ప్రయత్నంలోరామాయణాన్ని అందించే ప్రయత్నంలో కవులు అనేక రకాల ప్రక్రియల్లో రామాయణాల్ని రాశారు, రాస్తూనే ఉన్నారు. చలనచిత్రాల్లో సైతం రామాయణం విశేషంగా ఆదరించబడింది. రామాయణ కథాంశాన్ని ప్రత్యక్షంగా, పరోక్షంగా కథలుగా రాస్తున్న రచయితలు ఎందరో ఉన్నారు. ఇలాంటి రామాయణ సంబంధ అంశాలు కావ్యాల్లోనే కాకుండా వ్యాకరణ సంబంధ రచనల్లో కూడా ఉన్నాయి. అయితే

కావ్యరచనల కంటే విభిన్నమైనది వ్యాకరణ రచన. ఇది కావ్యంలోని కథల మాదిరిగా కాకుండా జనవ్యవహారంలో ఉండే భాషకు సంబంధించిన అంశాలను సూత్రీకరణ చేస్తుంది. అందుకని కావ్యరచనలో ఉండే స్వేచ్ఛ, వ్యాకరణరచనలో ఉండదు. అయినప్పటికీ తెలుగువారి ఆరాధ్యదైవంగా విలసిల్లిన రామచంద్రుని మీద అపారమైన భక్తి కావ్యకర్తలకే కాదు, వ్యాకరణకర్తలకు కూడా కనిపిస్తుంది. అలాంటి వ్యాకరణకర్తల్లో పరవస్తు చిన్నయసూరి బాలవ్యాకరణంలో రాముని మీద తన భక్తి ప్రపత్తులను ఎలా చాటుకున్నాడో ఉదాహరణల ద్వారా తెలియజెప్పడమే ఈ వ్యాస ఉద్దేశము.

శ్రీమద్రామాయణంలో హనుమంతుని మాట తీరును గురించి శ్రీరాముడు **"నూనం వ్యాకరణం కృత్స్న మనేనా బహుధాశ్రుత/ బహు వ్యాహరణేనేన నకించి దప భాషితమ్**"అంటాడు. (తెలుగు వ్యాకరణ పరిణామం-ఛందోలంకార పరిచయం, పుట.సం.27) పూర్వ పరిచయం లేకపోయినా తనతో మాట్లాడిన హనుమంతుని మాటల్లో ఒక్క తప్పు పదం కూడా లేదని, దానివల్ల హనుమంతునికి వ్యాకరణ జ్ఞానం ఉన్నట్లు తెలుస్తోందని శ్రీరాముడు ఈ సందర్భంలో హనుమంతున్ని ప్రశంసించాడు. అలాగే హనుమంతుడి అష్టోత్తర శతనామాలలో "నవవ్యాకరణ పండితుడు" అని పేరు కనిపిస్తుంది. అంటే హనుమంతుడికి వ్యాకరణంలో ప్రావీణ్యం ఉందని అర్థం. ఈ నామం అంతరార్థం గ్రహిస్తే హనుమంతుడు మాట్లాడడంలో నేర్పరి అని గ్రహించవచ్చు. ఈ విషయం రామాయణంలో అనేక ఘట్టాలలో ఆవిష్కృతమైంది. ఇలా రామాయణ కథాంశాలలో వ్యాకరణ ప్రస్తావన ఉండడమే కాదు తెలుగు వ్యాకరణాలలో కూడా రామాయణం ప్రస్తావన కనిపిస్తుంది.

## 2. భాష -వ్యాకరణం:

భాష ప్రవాహం వంటిది. ఒక నది ప్రవాహం ఎలాగైతే మార్పులు చెందుతూ ముందుకు సాగుతుందో, భాష కూడా అలాగే కాలక్రమంలో ఎన్నో రకాల మార్పులకు గురి అవుతుంది. భాషలో సాధురూపాలను, అసాధురూపాలను తెలియజేసేటటువంటిది వ్యాకరణం, వ్యాకరణము శాస్త్రం. ప్రజలు ఉపయోగించిన పదాలను, వాక్యాలను, కవులు ప్రయోగించిన భాషాప్రయోగాలను అధ్యయనం చేసి వాటిలో సరైనవి ఏవి అని విడమర్చి సాధు, అసాధురూపాలను సమగ్రంగా వివరించునది వ్యాకరణం. ఇది భాషా రూపాలను తెలుపుతుంది కావున అందుకు సంబంధించిన ఉదాహరణలను పేర్కొనే సందర్భంలో వ్యాకరణకర్తలు సాధారణంగా కవుల ప్రయోగాలను ఉదాహరించడం కనిపిస్తుంది.

తెలుగులో వచ్చిన వ్యాకరణాలన్నింటిలోకెల్లా సుప్రసిద్ధమైన వ్యాకరణం చిన్నయసూరి బాలవ్యాకరణం. పదిపరిచ్ఛేదాలతో ఎంతో ప్రాశస్త్యం పొందిన బాలవ్యాకరణం భాషాబోధకులకే కాకుండా తెలుగువారందరికీ అనుసరణీయం.

బాలవ్యాకరణం సరళసుబోధకంగా అర్థం చేసుకోవడానికి ఇందలి సూత్రాలను ఎందరో వ్యాకరణకర్తలు సమగ్రంగా వివరించి వ్యాఖ్యానాలు రాశారు.

### 3. బాలవ్యాకరణం- రామాయణ ఉదాహరణలు:

చిన్నయసూరి బాలవ్యాకరణంలో సూత్రాలకు తగిన ఉదాహరణలు ఇచ్చే సందర్భాలలో రామాయణ సంబంధ అంశాలను పేర్కొనడం జరిగింది. అలాంటి ఉదాహరణలన్నింటినీ గమనించినట్లయితే వారి అపారమైన రామభక్తి వెల్లడవుతుంది. రామాయణానికి సంబంధించిన కథాంశాలను, కథా ఘట్టాలను వరుసగా సూత్రీకరణకు అనుకూలమైన ఉదాహరణలుగా ఇవ్వడం ఈ బాల వ్యాకరణంలో గమనించవచ్చు.

సంజ్ఞాపరిచ్ఛేదంలో **"ద్రుత ప్రకృతులు గాని శబ్దంబులు కళలనంబడు"** (బాలవ్యాకరణం సంజ్ఞాపరిచ్ఛేదము 13వ సూత్రం) అనే సూత్రంలో **"రాముడు, రాములు, రామునికయి"** అనే ప్రయోగాలతో మొదటిసారిగా రామశబ్దాన్ని ఇందులో ప్రయోగించాడు.

తరువాత **"ఉత్తునకు అచ్చు పరంబగునపుడు సంధియగు"**( చి.సూ.బా. వ్యా. సంధి పరిచ్ఛేదం 1వ సూత్రం) అనే సూత్రంలో **"రాముడతడు"** అని రామున్ని పరిచయం చేస్తాడు. తర్వాత తత్సమ పరిచ్ఛేదంలో అనేక విభక్తులతో కూడిన రామ శబ్దాన్ని **"రాముని చేత, రాముని తోడ, రాముని కొరకు, రాముని వలన, రామునికంటే, రామునియందు, రాముని"** అని చివరకు ఆమంత్రణశబ్దంలో **"ఓయామంత్రణంబునందుగు"**(చి.సూ.బా.వ్యా. త.ప.14వ సూత్రం) అనే సూత్రంలో **"ఓ రాముడ, ఓరామా"**అని రామ శబ్దాన్ని ఉదహరిస్తాడు.

అన్నింటికన్నా ఎక్కువగా తత్సమ పరిచ్ఛేదంలో చాలా సందర్భాలలో రామశబ్దాన్ని ఉదాహరణలుగా ఉపయోగించుకున్నారు.బాలవ్యయాకరణం అన్ని పరిచ్ఛేదాల్లో ఉపయోగించిన ఉదాహరణలను గమనించినట్లయితే రామాయణ కథాక్రమం కూడా కనిపిస్తుంది.

ఉదాహరణకు **'ఓ రాములారా'** అని రాముని సంబోధించి **'రాముని బాణము'** అని (సమాస పరిచ్ఛేదం1వ సూత్రంలో) '**రాముడు బలవంతుడు**' (చి.సూ.బా.వ్యా కా.పరిచ్ఛేదం 37వ సూత్రం)అని తెలియజేస్తూ **"రాముడేని అర్జునుడేని విలువిద్యలో సాటి లేనివారు"**అని రాముని యొక్క విలువిద్య నైపుణ్యాన్ని వ్యక్తీకరిస్తాడు.

కారకపరిచ్ఛేదం 12వ సూత్రంలో '**రాముని కంటే నన్యుండు ధనుష్మండు లేడు'** (చి.సూ.బా.వ్యా కారకపరిచ్ఛేదం 12వ సూత్రం) అని రామున్ని మించిన విలువిద్యా నైపుణ్యం కలిగిన వాడు వేరొకడు లేడని రాముని విలువిద్య నైపుణ్యాన్ని తెలియజేశాడు. విశ్వామిత్రునితో కలిసి రామలక్ష్మణులు సీతా స్వయంవరానికి మిథిలా నగరానికి వెళ్లిన సందర్భం గురించి తెలియజేస్తూ **'రాముడుమిథిలంగనియె'** (క్రియాపరిచ్ఛేదం 124వ సూత్రంలో) అని రామాయణంలో ప్రాధాన్యత పొందిన మిథిలా నగరాన్ని ప్రస్తావించాడు.

తరువాత కారకపరిచ్ఛేదంలో '**రాముడు విల్లందినం ద్రిలోకంబులాకులంబగు**' (కారకపరిచ్ఛేదం 32వ సూత్రం) అని రాముని శౌర్యగుణ సంపత్తిని చాటిచెప్పాడు. ఒకవేళ రాముడు కనుక ఈ విల్లును పట్టుకున్నట్లయితే త్రిలోకాలు అన్నీ కూడా అతలాకుతం అవుతాయి అని దీనర్థం. శివ ధనుర్భంగం సమయంలో విశ్వామిత్రుని అనుమతితో శ్రీరాముడు శివధనస్సుని విరచి సీతమ్మను వివాహం చేసుకున్న ఘట్టానికి సంబంధించిన అంతరార్థం ఈ ఉదాహరణలో కనిపిస్తుంది. అలాగే కారక పరిచ్ఛేదంలో '**జనకుడు రాముని కొరకు కన్య నిచ్చె**' అని జనకమహారాజు సీతమ్మను రామునికి ధార పోశాడని సీతారాముల స్వయంవర ఘట్టాన్ని ఆవిష్కరించాడు.

తర్వాత సమాసపరిచ్ఛేదంలో **" రాముడు వసించిన పర్ణ గృహము, రాముడు వసించిన చోటు**"(చి. సూ. బా. వ్యా.సమాస పరిచ్ఛేదం 26వ సూత్రం)అనే ఉదాహరణలు గమనించినట్లయితే రాముడు సీత, లక్ష్మణులతో కలిసి వనవాసానికి వెళ్లిన సందర్భాన్ని ఇక్కడ ఉదహరించాడని తెలుస్తుంది. అనంతరం **"రాముడు రక్షించిన భృత్యుడు"** అంటే రాముడు హనుమంతున్ని, సుగ్రీవున్ని ఆదరించిన సందర్భం కూడా సమాస పరిచ్ఛేదంలోని 26వ సూత్రంలో కనిపిస్తుంది. తరువాత **'రాముడొక బాణంబున వాలిని కూలనేసే'** అనే కారక పరిచ్ఛేదంలోని 23వ సూత్రం మరియు **'రాముడు వాలినేసిన బాణం'** అని సమాస పరిచ్ఛేదంలో 26వ సూత్రం. ఈ రెండు సూత్రాలకు ఇచ్చిన ఉదాహరణలను గమనించినట్లయితే శ్రీరాముడు ధర్మ రక్షణ కోసం, సుగ్రీవునికి రాజ్యాన్ని ఇప్పించడం కోసం వాలిని సంహరించాడనే విషయం తెలుస్తుంది.

క్రియాపరిచ్ఛేదంలో "**రాముడు రావణుంబరి మార్చి సీతయుందాను సౌమిత్రి సహితంబుగంరాముడు బుష్ప కారూడుండయి సాకేతంబున కేతించె**" (చి. సూ.బా. వ్యా. క్రియా పరిచ్ఛేదం 120వ సూత్రం) అనే సూత్రాన్ని గమనించినప్పుడు యుద్ధంలోరాముడు రావణుని చంపి తరువాత సీతమ్మను స్వీకరించి, అందరితో కలిసి పుష్పకవిమానంలో తిరిగి అయోధ్యకు రావడం అనే శుభసందర్భాన్నితెలియచెప్పడం జరిగింది.

ఇలా బాలవ్యాకరణంలో సూత్రాలకు ఇచ్చిన ఉదాహరణలను అధ్యయనం చేసినప్పుడు అనేక చోట్ల రామ శబ్దం కనిపిస్తుంది. రామ శబ్దం కనిపించడమే కాదు దాంట్లో అంతరార్థంగా బాలవ్యాకరణం రాసిన చిన్నయ సూరి గారి రామభక్తి వెల్లడవుతుంది.

## 4. ముగింపు:

వ్యాకరణ సూత్రాలకు ఉదాహరణలు ఇవ్వాలంటే ఎక్కడి నుండైనా ఇవ్వవచ్చు. లోకంలో జనవ్యవహారంలో ఉన్న పదాలు తీసుకోవచ్చు లేదా కవులు కావ్యంలో ప్రయోగించిన పదాలను ఉదాహరణలుగా గ్రహించవచ్చు కానీ బాలవ్యాకర్త విశేషించి రామశబ్దాన్ని తీసుకొని రామకథకు అనుకూలమైనటువంటి అనేక ఉదాహరణలను తన వ్యాకరణంలో సూత్రాలకు అనుగుణంగా ఉదాహరించడం జరిగింది. తెలుగునాట ఆబాలగోపాలానికి

ఆరాధ్యనీయుడయిన రామున్ని కేవలం పామర జనమే కాదు పండితులు సైతం తమ రచనల్లో రామున్ని విశేషంగా స్తుతించారు. అందుకే బాలవ్యాకర్త తాను రాస్తున్నది వ్యాకరణ సంబంధ శాస్త్రమే అయినప్పటికి, అందులో ఉదాహరణల రూపంలో తన రామభక్తిని చాటుకున్నాడు.

ఈ విధంగా జానపదుల నోట పాటలు, నుడికారాల రూపంలో, కవుల కావ్యవస్తు రూపంలో కనిపించే రామాయణం చిన్నయసూరి బాలవ్యాకరణం ఉదాహరణల రూపంలో కనిపించి తెలుగునాట "అంతా రామమయం" అనే భక్తి భావనను వెల్లడించిందని చెప్పవచ్చు.

## 5. ఉపయుక్తగ్రంథసూచి:


1. రామకృష్ణా రావు, వంతరాం, 1970, బాలవ్యాకరణ ఘంటాపథము, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్.
2. విశ్వేశ్వరయ్య, ఉప్పులూరు, 2000, సుబోధిని, టెక్నికల్ పబ్లిషర్స్, గుంటూరు.
3. వెంకటేశ్వర్లు, వారణాశి,2012, సుగమ బోధినీ వ్యాఖ్యాన సహితము, టెక్నికల్ పబ్లిషర్స్, గుంటూరు.
4. సూర్య ప్రకాశ దీక్షితులు, పురాణపండ, 2012, ఉషశ్రీ రామాయణం ,తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి.
5. సుబ్రహ్మణ్య శాస్త్రి. శ్రీపాద (2019) వాల్మీకి విరచిత రామాయణం,ప్రగతి పబ్లిషర్స్, హైదరాబాద్.


***



AUCHITHYAM

ISSN: 2583-4797

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_35.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 35. సార్వత్రికత్రయం నికష: రామాయణం

**డా. పోలుమాటి అన్నవరం సత్యనారాయణ**

తెలుగు అధ్యాపకులు,

ప్రభుత్వ కళాశాల,

రాజమహేంద్రవరం, ఆంధ్రప్రదేశ్.

సెల్: +91 9848566307. Email: drsatyanarayana74@gmail.com

**వ్యాససంగ్రహం:**

*సీత కష్టాలు సీతవి పీత కష్టాలు పీతవి.అయినప్పుడువింటే భారతం వినాలి తింటే గారెలే తినాలి అని ఎలా తీర్మానిస్తాం. మెజారిటీ వర్గం మెచ్చుకోళ్లను కనపడని శాసనం చేసి తద్వారా వాటిని పాటించడానికి సుముఖంగా లేనిదిక్కారస్వరాలపై సామాజిక బహిష్కరణ వేటుపరోక్షంగా వేసి సంస్కృతిని నిర్మించడం రాచరిక సమాజాల సహజ స్వభావం. ఆయా సమాజాల స్వభావాల ప్రాతిపదికగా ఆయా సంస్కృతులు పురుడోసుకుంటాయి. ప్రాబల్యసమాజసంస్కృతులు ఇతర సంస్కృతులపై నయానో భయానోప్రభావం. అయితే విద్య శాస్త్ర సాంకేతిక విప్లవం భూగోళం అంచులు దాక వెళ్లి దాని వైశాల్యాన్ని తగ్గించేసి దాన్ని ఒక గ్రామంగా మలుస్తున్న నేపథ్యంలో అన్ని వైపుల నుంచి వీచే భావజాల గాలులకు గవాక్షాలు తెరుచుకున్న తరుణంలో అలా నాది మాత్రమే మానవాళికి ఆదర్శం శిరోధార్యం అని చెప్పటంబుకాయింపోఅజ్ఞానమో అవుతుంది. సమాజంలో సంస్కృతిలోనూ చట్టాల్లోను వైరుధ్యాలు వైవిధ్యాలు సహజం. భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించడానికి ప్రయత్నించాలి తప్ప ఏకత్వానికిభిన్నత్వం అడ్డు తగులుతుంది అని భిన్నత్వాన్ని తప్పు పట్టడం మహాతప్పిదం అవుతుంది. సంప్రదాయ సాహిత్యాన్ని విమర్శించడానికి ఆధునిక విమర్శ పనిముట్లు పనికిరావు అన్నప్పుడు ఆధునిక సమాజానికి సంప్రదాయం కూడా పనికిరాదు అన్న వివేచన ఆవశ్యం మధ్యే మార్గంగా సంప్రదాయ సాహిత్యంలోంచి ఆధునిక సమాజానికి పనికొచ్చే విలువలను పరికించి వాటిని ఉపయోగించుకోవడంలో పేచీ ఉండదు కానీ కొందరు కొండను తవ్వి ఎలుకను పట్టినట్టు సమకాలీన సమాజానికి పనికొచ్చే విలువని సంప్రదాయ సాహిత్యం నుంచి వెలికి తీయడం వృధా ప్రయాస అవుతుంది. పూర్వ సాహిత్యం అపూర్వం కాజాలదు అది సమకాలీన సాహిత్యానికి చాలా వరకు పునాది అవ్వదు పూర్వపక్షం మాత్రమే అవుతుంది అన్నది చారిత్రకసత్యం. పూర్వ సాహిత్యం వర్తమాన సాహిత్యానికి చరిత్రగా ఉపకరిస్తుంది కానీ చరిత్ర వర్తమానంలో చర్విత చర్వణం కాకూడదు అందానుకరణ సృజన కాజాలదుకదుసృజన కాలేని శుష్కరచనలు సంబంధిత సమాజాన్ని చిటికెన వేలు పట్టుకొని ముందుకు నడపలేవు కాబట్టి ప్రతి సమాజానికి దాని వైయక్తిక అవసరాలు ఉంటాయి. ఏది అన్నిటికీ ఆల్ ఇన్ వన్ లా వర్తించదు అంటే ఒక సమాజం దాన్ని వైయుక్తికత ప్రాతిపదికగా ఇతర సంస్కృతిలో నుంచి దానికి పనికొచ్చే దినుసులను స్వీకరిస్తుంది. పనికిరాని వాటిని పక్కన పెడుతుంది ఒకేకాలంలోనేభిన్న సమాజాలకు పనికి రానప్పుడు పాత చింతకాయ పచ్చడి లాంటి గతకాలపు రాతలు వర్తమాన సమాజాలకు శిరోధార్యాలు ఎలా అవుతాయి అన్నది ప్రశ్నార్థకం చర్చనీయాంశం. ఆధునిక సామాజిక సమస్యలకు రాచరిక సమాజ సృజన అయిన రామాయణం పనికిరానిదవుతుంది ఇప్పుడు రామాయణం వర్తమాన సమాజానికి రామాయణంలో పిడకల వేట అవుతుంది రామాయణం అంటే రాముడి దారి ఇప్పుడు ఆయన దారిలో ఆధునిక సమాజాలను నడపడం నడిపించడం సన్మార్గ బోధ కాలేక పోతుంది. ఆయన*

*దారిలో వ రాళ్లు రప్పలు ఉన్నాయి అది ముళ్ల దారి. పాక్షికంగా ఆటవికమైనది ఆ దారి అందరికీ ఆదర్శం అనడం పాక్షిక సత్యమే అవుతుంది. ఆ మాటకొస్తే పూర్ణ సత్యాలు ఏమీ ఉండవు పూర్ణ సత్యం వైపుకు ప్రయాణమే ఉంటుంది. ప్రస్తుత సాహిత్యం చరిత్రగా రామాయణం ఏం చేయాలో నేర్పించదు. కానీ ఏం చేయకూడదో నేర్పిస్తుంది. ఔదార్యం, భక్తి అన్ని అసమానతలకు ప్రాతిపదికలు. ఎవరి మోచేతి నీళ్ళోతాగి బతకమని చెప్పడం ఆధునిక సమాజ స్వభావానికి వ్యతిరేకం.*

**Keywords:** సార్వకాలిక త్రయం, సర్వకాలికం, సార్వజనీనం, సార్వదేశికం, లక్ష్యం, లక్షణం, ఫ్యూడల్ వ్యవస్థ, సంప్రదాయం, సనాతనవాదం, ప్రజాస్వామ్యం, స్వేచ్ఛ, సౌభాతృత్వం

## 1. ఉపోద్ఘాతం:

ప్రజాస్వామ్యయుగంలో ప్రధానశ్రేణిగా సమకాలీన ఆధునికసాహిత్యం సమకాలీన సాహిత్యానికి సమాంతరంగా ఉపశ్రేణిగా సంప్రదాయ సాహిత్యం ప్రయాణిస్తున్నాయి పాత లక్ష్యాలకు కొత్తలక్షణాలు కొత్త లక్షణాలకు పాత లక్ష్యాలు ఒదగక పోవడం చర్చినీయాంశం అవుతున్నది ఒక కాలపు సాహిత్యానికి రక్తమాంసాలు, ఆత్మ దాని యొక్క స్వభావం నుంచి పుడతాయని అవి ఆయా స్థల కాలాలకు ప్రత్యేకమైనవని తీర్మానించాల్సి ఉంటుంది. ప్రభుభక్తి, పతిభక్తి త్యాగం దాస్యం లాంటి భావనల స్థానంలో స్వేచ్ఛ స్వాతంత్రం సౌభాతృత్వాల పునస్తాపనను నొక్కి ఒక్కాణించాలి.

ఏ సమాజంలో అయినా ఏ దేశంలో అయినా రాజభాష అధికార భాష అవుతుంది. అధికార భాషలోని రచనలే సాహిత్య హోదా పొందుతాయి అవే రాబోయే తరాల వారసత్వ సంపదగా పుస్తక భాండాగారాల్లోనూ మ్యూజియాల్లోనూ చెక్కుచెదరకుండా భద్రపరచబడతాయి కాల పరీక్షలో నిలబడలేకపోయినా పని కట్టుకుని మరీ వాటిని తర్వాత తరాలకు అందించే ప్రయత్నం అనేది దాని భావజాలంతో మమేకమైన ప్రాబల్యవర్గాలు ఉన్నప్పుడే సాధ్యమవుతుంది ఇలా తెలుగు జాతిపై సంస్కృతం ఆంగ్లం లాంటి భాషలు ప్రత్యక్షంగానో పరోక్షంగానో పెత్తనం సాగిస్తూ ఉంటాయి.రాజాశ్రయం కోసమో పండితుల ఆమోదం మెప్పుల కోసమో జాతి జీవనాడి సాహిt త్యేకరించబడకుండా కాలగర్భంలో కలిసిపోయింది. కలిసిపోతున్నది ఒకవేళ అది సాహిత్యం అయినప్పటికీ సరిగా భద్రపరచబడకుండా పోతుంది భద్రపరచబడినప్పటికీ సమాంతరంగా పయనించే ఒక ఉపపాయగానే మిగిలిపోతుంది. అందుకే ఆర్థిక సాంస్కృతిక ఆధిపత్యం కోసం తెలుగు వాళ్ళు ఇతర భాషల్లోని రచనలను అనువాదంగానో అనుసరణగానో అరువు తెచ్చుకున్నారు ఆత్మ వాళ్ళది శరీరం వీళ్ళది అన్నట్టు. ఈ విధంగా అన్యభాష సంస్కృతులనుమన స్వీకృతభాష సొంతం చేసుకున్న నేపథ్యంలో ఈ అనుసరణలు అనుసృజనలు గురించి మనం చర్చించుకుంటున్నాం.

సార్విక త్రయవాదం, ప్రభు భక్తి దాస్య భక్తి మాతృభక్తి పితృభక్తి లాంటి భావనలు రాచరిక యుగంలో అత్యుత్తమ విలువలుగా చలామణిలో ఉండేవి. అయితే ఇవాళ కూడా వాటిని పునర్నిర్మించి సుస్థిరీకరించే

ప్రయత్నాలు జరుగుతాయి పెత్తనం చేజారిపోయిన వర్గం దాన్ని తిరిగి చేజిక్కించుకునే ప్రయత్నం ఏదో రూపంలో చేస్తూనే ఉంటుంది ఒకనాటి ప్రయోగమైన సంప్రదాయాన్ని పాత నీటిని వదిలించుకుంటూ కొత్తనీటిని ఆహ్వానిస్తూ నిరంతరం పారే నది లాంటి సంస్కృతిని మారనివిగా చెక్కుచెదరనివిగా స్వయంభువులుగా చిత్రీకరించి పాత రోత కాదు ఓల్డ్ గోల్డ్ అన్న భావజాలం ప్రజాస్వామ్య భావజాలానికి సమాంతర పాయగా పయనిస్తుంది.

స్వేచ్ఛ స్వాతంత్రం సౌభాతృత్వాలను పునాదిగా గల ప్రజాస్వామ్యంలో కూడా ఒకప్పటి రాచరిక వ్యవస్థ లోని ఫ్యూడల్భావజాలం ప్రజాస్వామ్య విలువల కంటే సమున్నతమైనదని తీర్మానించే వర్గం గొంతుక అక్కడక్కడ అప్పుడప్పుడు వినిపిస్తున్న నేపథ్యంలో ఈ సార్వత్రిక త్రయభావన మళ్లీ తెరమీదకి వస్తుంది. సార్వకాలికం సార్వజనీనం సార్వదేశికం అన్నవి సార్వత్రిక త్రయం తాలూకు భావనలు. ఈ సార్వత్రికత్రయం సంప్రదాయ సాహిత్యం సమకాలీన సమాజానికి అంతటా అన్నివేళలా సీమా సమయాలకతీతంగా వర్తిస్తుందని వాదిస్తుంది.

## 2. ప్రగతిశీల వాదం:

ఎక్కడైనా మనిషేఎప్పుడైనామనిషే అతని బాధక సాధకాలు కష్టాలు కడగండ్లు ఒకటే. కాబట్టి సంప్రదాయ సాహిత్యాన్ని సమకాలీన సమాజం ఆత్మీకరించుకోవాలంటుంది సంప్రదాయవాదం. ఎవరి ఆశలు వారివి. ఎవరు ప్రాధాన్యాలు వారివి. మొత్తంమీద ఎవరి గోల వాళ్ళది. ఎవరిస్వీయ అనుభవం వారికి ప్రత్యేకం విభిన్నం. అన్న వైయక్తికతను అణిచివేసే ప్రయత్నంలో భాగంగా కాలం చెల్లిన సాహిత్యం గొంతు పెకల్చడానికి సమకాలీన సమాజంలో సందర్భాలను సృష్టించుకుంటుంది. ఆర్థిక సాంస్కృతిక సామాజిక భౌగోళిక లింగ వయసు ఆధారిత మొదలైన అసమానతలు ఎరుకలోకి వచ్చిన నేపథ్యంలో సంప్రదాయ భావజాలం బోనులో నిలబెట్టబడుతుంది. నిలదీయబడుతుంది ఎప్పటినుంచోఉనికిలోఉన్న, ఉంటున్న, ఈ అసమానత ఉక్కు పాదం సమ్మతమైనదని ఒప్పించే కుతంత్రాలు ప్రశ్నించబడడం అనివార్యం ఇలా ప్రశ్నించటం ప్రజాస్వామ్యయుగ స్వభావం.

ఇవాళ ప్రభు వ్యక్తి స్థానాన్ని దేశభక్తి ఆక్రమించింది. దేశమంటే మనుషులనీ; వట్టి భూభాగమే కాదని పునర్ నిర్వచించబడింది. ఒకప్పటి ఏలికల స్థానంలో ఉన్న ప్రస్తుత పాలకులు ప్రజా సేవకులు మాత్రమే అని ప్రజాసేవ నిమిత్తమే వాళ్ళు తప్ప; వాళ్ళ ఔదార్యం ప్రజలకు ఇప్పుడు అక్కర్లేదని చట్టాలు తిరగరాసుకున్న నేపథ్యంలో కూడా ఈఫ్యూడల్ భావజాలం రకాల రకాల రూపాల్లో తొంగి చూసే ప్రయత్నం చేస్తుంది. ప్రజలే ప్రభువులు కాబట్టి వారికి వేరొక ప్రభువు ఉండజాలదని సర్వసత్తాక సార్వభౌమత్వం ప్రజల సొంతం కాబట్టి ఈ ప్రభుభక్తి భావజాలం ప్రస్తుతం మనజాలదు.

అయితే ఇది పతిభక్తిగా మాతృభక్తిగా దాస్య భక్తిగా నిలదొక్కుకోవడానికి సాయి శక్తుల కొనప్రాణంతో ప్రయత్నం చేస్తూనే ఉంటుంది. శాస్త్ర సాంకేతిక విప్లవం పుణ్యమా అని సమానతలు ఏ రూపంలో ఉన్నప్పటికీ అవి

తగ్గుముఖం పట్టాల్సిన వాతావరణం అంతటా నెలకొలాల్సిన పరిస్థితులు అనివార్యం. అయినప్పటికీ ఈ ప్యూడల్భావజాలం గురుస్థానం కోసం పాకులాడడం మనకు కనిపిస్తుంది.

ఇప్పుడు పతిభక్తి కూడా పునర్మూల్యాంకనానికి గురవుతుంది '**మగడు వేల్పన పాత మాటదిప్రాణమిత్రుడు**'[1] అన్న నూతన భావజాలం పురుడోసుకుంది సహభాగస్వామ్యం ఉండవలసిన చోట దాస్యం త్యాగం ఆక్రమించడం శోచనీయం. కానీ బాధ్యతలు అన్నీ బాధితులకి! వాటిని మోయలేక మోయడం పుణ్యం పరమార్థం అని పాతివ్రత్యం పేరు మీద అంటగట్టి హక్కులమాట ఎత్తడం మహాపాతకం అనే మాయల మాటలు ఏదో ఒక రూపంలో సంస్కృతి సంప్రదాయాలమిషలోపొడ చూపుతూనే ఉంటాయి. పతి దైవం కాదు స్నేహితుడు అనటంలో సమానత్వం చేతన ఉంది. కానీ భగవంతుడు భక్తుడు,అన్న ద్వంద్వాలు నెక్స్ట్ ప్రజా స్వామ్య యుగానికి సరిపడేవి కావు.

## 3. వైవిధ్యాన్ని గుర్తించడం:

నాయకుడు పరివారం అనుచరుడు అనుచరగణంఅన్నవి ఇవాళ దిగివశ్రేణిగా పరిగణించబడుతున్నాయి పెద్దవాళ్లకు చిన్నవాళ్ళులోబడి ఉండడం ప్రశ్నించబడుతుంది. చిన్నవాళ్ళను పెద్దవాళ్లు అనుసరిస్తే మహా పాపం ఏమీ కాదు అన్న అభిప్రాయం బలపడుతుంది. నియంత్రత్వం త్యాగం బలిదానాల స్థానంలో పరస్పర సహకారం శ్రేయస్సు అభిలషణీ యాలయ్యాయి సోదరుడైనా సేవకుడైనా బానిసగా తమకంటూ వ్యక్తిగత జీవితం లేని వాళ్ళగా కేవలం పెత్తందారుల పనివాళ్ళుగా పరివారంగా బ్రతుకు వెళ్లపుచ్చటమే జీవిత పరమార్థం అన్న విషపూరిత భావజాలానికి కాలం చెల్లింది. వైయక్తికతకు ప్రత్యేకతకు వైవిద్యానికి స్పష్టమైన ఉనికి ఏర్పడే వాతావరణం నెలకొన్న తర్వాత కూడా ఏదో ఒక మూలన సనాతన వాదం పేరుతో అణిచివేత అందమైన రూపంలో కవిపిస్తూనే ఉంటుంది. ఒక వ్యక్తి కోసం మరి కొంత మంది వారి సామాజిక కుటుంబ వ్యక్తిగత జీవితాన్ని జీవిత అనుభూతులను పణంగా పెట్టి పరిచారికలై దాసులై పని వాళ్ళయిపోయి చిక్కి శల్యమైపోయి తమది కాని బతుకు బతకాల్సి రావడం గత జన్మలో చేసిన పుణ్యంగా కొనియాడబడడం అనేది తేనెపూసినకత్తి లాంటిది. ఈ దోపిడికి ప్రజలు, సతులు, స్నేహితులు, సోదరులు మరెవరు మినహాయింపు కాదు. వీళ్లంతా శత్రువుల్లా పాద క్రాంతం కావలసిందే.రాముడి కోసం సీత లక్ష్మణుడు ఆంజనేయుడు వగైరాలు కానీ ; రాముడు మాత్రం వాళ్ల కోసం కాదు. ప్రధాన పాత్ర చుట్టూ వీళ్లంతా దీపపుపురుగుల్లా తిరుగుతూ ఎవరి యాగాల కోసమో సమిధలైపోవడం అనేదిఆదర్శ జీవితంగా రాచరిక యుగపుప్యూడల్భావజాలంనినదిస్తుంది కానీ దాన్ని ప్రజాస్వామ్య భావజాలం నిలదీస్తుంది.

ఒకప్పటి లక్ష్యాలకు ఇప్పటి లక్షణాలు సరిపడవు అన్నప్పుడుపాతకాలపు సమాజ జనితలక్ష్యాన్ని ప్రగతిశీల సమాజానికి అనువర్తింప చేయటం అన్నది వెగటు పుట్టిస్తుంది. ఒకప్పుడు అత్యవసరాలు ఆయన గుంపు జీవనం ఉమ్మడి కుటుంబ స్వభావం ఇప్పుడు సమాజానికి అనవసరం అయ్యాయి. వ్యష్టి జీవనానికి వైయక్తికతకు, స్వేచ్ఛ

స్వాతంత్ర్యాలకు అనువైన వాతావరణంలోపాతకాలపు విలువలు పునర్ మూల్యాంకనానికి గురవుతాయి కాలపరీక్షలో నిలబడలేక పోతాయి. ప్రగతిశీలం కానిది ఏదైనా అది చివరకు పితృవాక్యమైనా పక్కకు తొలగించబడుతుంది. పితృస్వామ్య మాతృస్వామ్యాల స్థానంలో ప్రజాస్వామ్యం పరడ విల్లుతున్న తరుణంలో పాతవి గతిస్తాయి ప్రజాస్వామ్య పథంలో సమస్తం నూత్నం గావించబడతాయి.

**"సాహిత్యం లో రెండు ప్రధాన దృక్పథాలు ఉన్నాయి ఒకటి పూర్వ సాహిత్యం. మరొకటి ఆధునికసాహిత్యం. వీటికి సంఘ స్పర్శ ఉండడం వల్ల నాటి దానికి గత సమాజం నేటిదానికివర్తమాన సమాజం లక్షణాలు ఉంటాయి ఈ రెండు సమాజాలు పరస్పరం సంఘర్షించే శక్తులుగా నిలుస్తాయి. ఈ సంఘర్షణలో సాహిత్యం సాహిత్యం తోవ తప్పుతుంది సహృదయులకు విమర్శకులకు యోగ్యమేదో గుర్తించేంత దాకా ప్రమాదం వస్తుంది."**[2]

## 4. ముగింపు:

రాచరిక యుగాల్లో ఆడవాళ్ళ కోసం ఆస్తులు కోసం కొట్టుకు చచ్చారు. ఆస్తులు చేతులు మారాయి ఆడవాళ్లు చేతులు మారారు. అలా వస్తువుల్లాగచేతులు మారటానికి అంగీకరించలేని కొంతమంది పితృస్వామ్య భావజాలం తలకెక్కిన ఆడవాళ్లు జోహార్ లాంటి అమానవీయవ్యవస్థల్లో సమిధలు అయిపోయారు కూడా. చాలా వరకు ఆస్తులు బాగానే ఉన్నాయి ఆడవాళ్లు బాగానే ఉన్నారు అశ్వం తిరిగేనంత మేర ఆస్తుల్ని ఆడవాళ్ళని మాన మర్యాదల్ని అతిక్రమించి ఆక్రమించడం ఆనాటి రాచరిక వ్యవస్థల స్వభావం. అప్పుడు అంతటా ఎవడు అహం తృప్తి కోసమో వనరుల మానవ వనరుల విధ్వంసం యదేచ్ఛగా కొనసాగింది.

ఈ ద్వంస రచనకు ప్రజాస్వామ్య భావజాలం భరత వాక్యం పలికిన నేపథ్యంలో భక్తి ఔదార్యం ద్వేషం వృష్టి స్థానాల్లో ప్రేమ పరస్పర సహకారం సహనం సమష్టిలాంటి విలువలు వచ్చి చేరాయి. పోయిన వాటికంటే వచ్చి చేరి ప్రస్తుతం అమలు లోఉన్నవి సమస్త మానవాళికి ఆమోదయోగ్యాలు అనుసరణీయాలు ఆచరణ యోగ్యాలు, ప్రస్తుత ఆదర్శాలుగా చలామణిలో ఉన్నాయి. ఈ విలువల కంటే మెరుగైనవి వచ్చేదాకా ఇవే శిరోధార్యాలు.

వీటిని కాదని తొలగించబడ్డ వాటిని ఏదో రూపంలో పునఃస్థాపితం చేయాలని నవ్య సంప్రదాయవాదం ఎప్పుడూప్రయత్నిస్తూనేఉంటుంది గతకాలమే మేలనిసన్నాయి నొక్కులు నొక్కుతుంది. మనుషుల్ని వేష భాషల్లో మాత్రమే ఆధునికలుగా ఉండనిస్తూ భావజాలంలో మాత్రం ప్రగతినిరోధక సంప్రదాయాన్ని కొనసాగింప చేయడం దాని పరమ లక్ష్యం.

అనివార్యమైన మార్పులు అంగీకరించలేకపోవడం చేజారి పోతున్న పారంపర్య ప్రయోజనాలను అంత తేలికగా పెత్తందారి వర్గం వదులుకోలేని నేపథ్యంలో ఈ ప్రగతి నిరోధక పూర్వ భావజాలం మళ్ళీ మళ్ళీ తెరమీదకి వస్తూనే ఉంటుంది ఖండన మండనలకు గురవుతూనే ఉంటుంది దానిఈ నిరంతర ప్రయత్నంలో బానిసత్వ భావాలు

గల కొంతమంది అల్ప బుద్ధులు కురచ బుద్ధులుప్రగతి పదాన్ని వీడిపోయే ప్రమాదంలో ఉన్నది. కాబట్టి వారిని ప్రగతిశీల విద్యావంతులను చేయటం మన ముందు ఉన్న కర్తవ్యం.

### 5. పాదసూచికలు:

1. తెలుగు సాహిత్య సమీక్ష, రెండవ సంపుటము ,ఆచార్య జి నాగయ్య, పుట. 516.
2. ఆధునిక సాహిత్య విమర్శ సూత్రం, ఆచార్య కొలకలూరి ఇనాకు, పుట. 117.

### 6. ఉపయుక్తగ్రంథసూచి:


1. ఇనాక్, కొలకలూరి, ఆధునిక సాహిత్య విమర్శ సూత్రం , జ్యోతి గ్రంథమాల. 2010.
2. నాగయ్య, జీ, తెలుగు సాహిత్య సమీక్ష- ఒకటవ భాగం, నవ్య పరిశోధక ప్రచురణలు, ఆగస్టు 2004.
3. నాగయ్య, జీ, తెలుగు సాహిత్య సమీక్ష రెండవ భాగం, నవ్య పరిశోధక ప్రచురణలుఆగస్టు2004.
4. నారాయణరెడ్డి, సింగిరెడ్డి, ఆధునిక కవిత్వము సంప్రదాయములు ప్రయోగములు, విశాలాంధ్ర ప్రచురణలు,1997.
5. సూర్యనారాయణ(ఉషశ్రీ), పురాణపండ, ఉషశ్రీ రామాయణం. తిరుమల తిరుపతి దేవస్థానము, తిరుపతి, 2012.


***


AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_36.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 36. 'ఈ మాట' అంతర్జాలపత్రికావ్యాసాలు: రామాయణవిశేషాలు

**బి. సోనీ**

పరిశోధక విద్యార్థిని,

తెలంగాణ విశ్వవిద్యాలయం,

నిజామాబాద్, తెలంగాణ.

సెల్: +91 9603975539. Email: sameekshacharan523@gmail.com

**వ్యాససంగ్రహం:**

*రామాయణం ఆదర్శమూర్తి రాముడి జీవితం, అతను నడచిన దారి. రామాయణం మానవ జన్మ ఎత్తిన ప్రతి వ్యక్తి నడవదగ్గ దారిని చెబుతుంది. పితృ వాక్య పరిపాలన, అవ్యాజమైన సోదర ప్రేమ, ఏకపత్నీవ్రతం, నీతి నియమాలతో కూడిన జీవితం, తప్పని పరిస్థితులలో వాటిని ఉల్లంఘించడం అన్ని కలగలిసిన ఒక మంచి కుటుంబ కథ. ప్రతిదారి పూలు పరిచినట్లు మెత్తగా ఉండదు, దానిలో ముళ్ళు, రాళ్లు ఉంటాయి. తండ్రి మాట వినే సుపుత్రుడు అని మెచ్చుకున్నా, భార్యని అడవుల పాలు చేసిన కఠినాత్ముడని నిందించినా అది ఆ వ్యక్తి జీవితం. మానవ జన్మ ఎత్తిన రాముని జీవితం. నచ్చినది ఒప్పుకొని ఆచరించటం నచ్చనిది తిరస్కరించగల నేర్పు కలిగి ఉండటం వ్యక్తి వ్యక్తిత్వ నిర్మాణానికి ఉపకరిస్తుంది. 1998 సంవత్సరంలో 'ఈమాట' అంతర్జాల సాహిత్య పత్రిక ప్రారంభమైంది. గత ఇరవై ఐదు ఏళ్లుగా దిగ్విజయంగా నడుస్తుంది. 'ఈమాట' ఎల్లలు లేని ప్రపంచానికి ఒక ఎలక్ట్రానిక్ సాహిత్య పత్రిక. 'ఈమాట' అంతర్జాల సాహిత్య పత్రిక 25 ఏళ్ల నుంచి వెలువడిన వ్యాసాల్లోరామాయణ సంబంధ వ్యాసాలను గూర్చి చర్చించడం ఈ వ్యాసం ముఖ్య ఉద్దేశం.*

**Keywords:** 'ఈమాట', వ్యాసం, విశ్లేషణ, రామాయణం, వాల్మీకి, కాళిదాసు, మొల్ల, స్త్రీల రామాయణం పాటలు.

## 1. ఉపోద్ఘాతం:

రాముడి గురించి అనేక భాషలలో నేటి వరకు ఎన్నో రకాల పుస్తకాలు వచ్చాయి. వాటి మీద చాలా రకాల సమీక్ష వ్యాసాలు వచ్చాయి 'ఈమాట' అంతర్జాలసాహిత్యమాసపత్రికలో స్త్రీల రామాయణం పాటల మీద, మొల్ల రామాయణంమీద, వాల్మీకి రామాయణం మీద, ఆంగ్లభాషలో రాముని గురించి వచ్చిన పుస్తకాల మీద వ్యాసాలు ఉన్నాయి. వాటిని అనుశీలించడమే ఈ వ్యాస లక్ష్యం.

'ఈమాట' వ్యాసాల్లో జానపద రామాయణాలకు సంబంధించిన విషయాలున్న వ్యాసాలు ఉన్నాయి. అవి ఊర్మిళ దేవి నిద్ర-ఒక ఆలోచన, సీత గడియ,లక్ష్మణుని జాగారము, లక్ష్మణదేవరనవ్వు ఇవన్నీ జానపదులు పాడుకునే పాటలు. వీటికి సాహిత్యం అందించిన వారు ఎవరో, సంగీతాన్ని సమకూర్చిన వారెవరో ఎవరికీ తెలియకపోవడమే వీటి ప్రత్యేకత. జానపదులు స్వేచ్ఛగా పాడుకోవడమే కాక ఇతివృత్తం మార్చకుండా అనేక పాత్రలను తమకు నచ్చినట్టుగా మలుస్తారు. ఆ విధంగా వారు వారి ఊహ ప్రపంచంలో విహరించి సృజించిన పాటలు స్త్రీల రామాయణ పాటలు. వీటి గురించి 'ఈమాట' వ్యాస రచయితలు తమదైన శైలిలో విశ్లేషించుటకు ప్రయత్నించారు.

## 2. ఊర్మిళాదేవి నిద్ర-ఒక ఆలోచన:

ఊర్మిళాదేవి నిద్ర గురించి చెప్తూ "**ఈ పాట అంతా తెలుగులో ప్రచారంలో ఉన్న కథలానే ఉంది. ఈ పాట నిస్సంశయంగా ఒక తెలుగు కవయిత్రి సృష్టి**"1 అంటారు. ఇతిహాస పాత్ర అయినా ఒక స్త్రీ గురించి పాట రాయడానికి తెలుగు కవయిత్రి కావాల్సిన పనేం లేదు కవి కూడా అయి ఉండవచ్చు కదా కానీ వెల్చేరు వారు ఆ విధంగా నిక్కచ్చిగా చెప్పారు. దేవేంద్ర సత్యార్థి ఊర్మిళాదేవి నిద్ర పాటను 1932లో ఆంధ్రదేశంలో విని ఇంగ్లీష్ లో ఒక వ్యాసాన్ని రాశారు. కోలవెన్ను మలయ వాసిని 1986లో ఆంధ్ర జానపద సాహిత్యము రామాయణం అనే పుస్తకంలో ఈ పాటని గురించి వివరంగా చర్చించారు. వాల్మీకి రాసిన రామాయణంలో ఊర్మిళాదేవి గురించి సీతారాముల పెళ్లి ప్రస్తావనలో తప్పితే ఎక్కడ ఉండదు. అలాంటి ఊర్మిళను తెలుగు ఆడవాళ్లు అక్కున చేర్చుకున్నారని వెల్చేరు వారు తెలిపారు. సీతారాములు వనవాసానికి వెళ్లేటప్పుడు లక్ష్మణుడు కూడా వారి వెంట వెళతాను అంటాడు అప్పుడు ఊర్మిళ నేను కూడా మీ వెంటే వస్తానంటుంది. అప్పుడు లక్ష్మణుడు ఒప్పుకోడు. ఇది అవాల్మీకం. ఇది తెలుగు స్త్రీల ఊహాశక్తికి నిదర్శనం అలా ఒంటరిగా వదిలివేయబడ్డ ఊర్మిళ అడవికి వెళుతున్న లక్ష్మణుడు ఒప్పందం చేసుకున్నట్టుగా ఆ ఒప్పందం ప్రకారం లక్ష్మణుడు తన నిద్రని ఊర్మిళకి ఇస్తాడు. ఊర్మిళ తన మెలకువను లక్ష్మణునికి ఇస్తుంది. ఊర్మిళ భర్త విరహాన్ని అనుభవించినక్కర లేకుండా ఈ చమత్కారమైన ఊహ చేశారు. తెలుగు ఆడవాళ్లు అంటూ వెల్చేరు వారు తెలుగు ఆడపడుచుల మీద తనకున్న అభిమానాన్ని గౌరవాన్ని చాటుకున్నారు. ఈ వ్యాసంలో ఊర్మిళాదేవి నిద్ర అనే పాటను వివరిస్తూ వెల్చేరు వారు స్త్రీల రామాయణం పాటలు నిర్మాణంలో ప్రత్యేకత ఉంది అంటూ ఒక వినూత్న అంశాన్ని తెలియజేశారు. "**స్త్రీల రామాయణం పాటలు మన ఊర్లలో ఉండే పెద్ద కుటుంబాల ఇళ్ల నమూనాలో నిర్మించబడ్డాయి. ఆ ఇళ్లలో మొదటి భాగంలో మగవాళ్ళే ఉంటారు. ఆడవాళ్లు కనిపించరు. ఇంటి యజమాని గాని, సేవకులు గాని అక్కడ ఉండే వాళ్ళందరూ మగవాళ్లే. ఇంటి మధ్య భాగంలో ఆడవాళ్లు, మగవాళ్ళు సందర్భాన్ని బట్టి కలిసి కూర్చుంటారు, మాట్లాడుకుంటారు. ఇంటి వెనక భాగంలోను,పెరట్లోనూ కేవలం ఆడవాళ్ళే ఉంటారు. అక్కడికి మగవాళ్ళు ఎప్పుడు వెళ్లరు చాలా అవసరమైనప్పుడు వాళ్ళు అక్కడికి వస్తున్నామని తెలియపరచి అక్కడికి వెళ్లే సందర్భాలు ఉండవచ్చు. కానీ ఇంటి వెనక భాగం పూర్తిగా ఆడవాళ్ళ సామ్రాజ్యం**"1 అంటూ ఒక ఊహత్మక సౌధాన్ని వెల్చేరు వారు నిర్మించారు. ఊహాత్మక సౌధం అని ఎందుకన్నానంటే పూర్వకాలంలో ఇండ్ల నిర్మాణాలు ఎలా ఉండేవో తెలియదు గానీ 21వ

శతాబ్దంలో మాత్రం కచ్చితంగా పై విధంగా లేవని మాత్రం చెప్పవచ్చు. ఈ విధంగా సినిమాల్లో చూపించే రాజ కుటుంబీకుల రాజభవనాలు ఉండవచ్చు గాక.

ఊర్మిళాదేవి నిద్రలో ఊర్మిళా తన గదిలోకి పరపురుషుడు ప్రవేశించాడని తలచి అతనికి బుద్ధి చెప్పే ప్రయత్నంలో ఇలా అంటుంది. "**ఒకడాలి కోరి గాద ఇంద్రునికి ఒడలెల్ల హీనమాయే పరసతిని కోరి కాదా రావణుడు మూలముతో హతమాయెను**"1 అని అంటుంది. నీకు అక్క చెల్లెలు లేరా అని అంటుంది.

"**ఊర్మిళ ఇంకా నిద్రపోతూనే ఉంది కదా ఈ మాటలన్నీ ఎలా అనగలుగుతుందని ప్రశ్నించకండి తాను స్త్రీగా పుట్టటం మూలంగా వచ్చిన అది భౌతిక బలహీనత నిద్రలో కూడా మర్చిపోవడానికి వీలులేని కుటుంబంలో ఉంది ఆమె. నిద్రపోతున్న ఊర్మిళ చేత కూడా కవయిత్రి మాటలు కంఠతా పట్టిన మాటల్లా చెప్పిస్తుంది**"[1] అని పదేపదే ఈ పాటని ఒక స్త్రీ రాసింది అని చెప్పడానికి ప్రయత్నిస్తారు వ్యాసకర్త.

## 3. సీత గడియ:

సీత గడియ అనే స్త్రీల రామాయణం పాటకు జానపద స్త్రీలు అద్భుతమైన సాహిత్యాన్ని అందించారు. ఆ పాటలోని విశేషాలను గురించి వెల్చేరు నారాయణరావు గారు ఈ వ్యాసంలో వివరించారు. నిజానికి ఇది రాముడు వేసిన గడియ కానీ ఆ గడియను రాముని చేత తీయించడంలో చాకచక్యం చూపిస్తుంది సీత. అందుకని సీత గడియగా ప్రసిద్ధి చెందింది. "**ఈ పాటను ఎవరో చదువుకున్న కవయిత్రి తన తోటి వాళ్ళు పాడుకోవడానికి రాసిన పాట**"[2] అని వ్యాసకర్త అభిప్రాయపడ్డారు. దేవుళ్ళ శృంగార వర్ణనలు ఎక్కువగానే వినిపిస్తాయి కానీ శ్రీరాముని శృంగార వర్ణనలు అంతగా కనిపించవు సీతారాములకు కోపతాపాలు, అలకలు ఇవన్నీ ఈ పాటలో తెలుస్తాయి. రాముడు పడకగదిలో సీత కోసం ఎదురుచూస్తూ ఉంటాడు. సీతాదేవి అత్తమామల సేవలో నిమగ్నమై ఎంతసేపైనా రాకపోయేసరికి రాముడు కోపగించి గది తలుపు గడియ పెట్టేస్తాడు. అలా రాముడు పెట్టిన గడియను సీత ఎలా తీయిస్తుందో ఈ పాట వింటే తెలుస్తుంది. సీత అత్తమామల సేవలో ఎంత సమయం గడిపింది. తనని తాను అలంకరించుకోవడానికి ఎంత సమయం గడిపింది, ఎలా అలంకరించుకుంది, ఎలా భర్తని గడియ తీయమని బతిమిలాడింది, అత్తగారితో రాయబారం నడిపి ఏ విధంగా గడియ తీయించుకుందో ఈ పాట తెలుపుతుంది. సీత ఆలస్యం చేసినందుకు రామునికి కోపం వచ్చి గడియ తీయకుండా ఇలా అంటాడు.

**"(నీవు లేకుంటేను నాకేమి సీత) గంట వలే దీపమ్ము అది నాకు తోడు.**
**(నీవు లేకుంటేను నాకేమి సీత ) పువ్వులూ బుక్కాయి అది నాకు తోడు**
**(నీవు లేకుంటేను నాకేమి సీత ) గంధమూ కస్తూరి అది నాకు తోడు**
**(నీవు లేకుంటేను నాకేమీ సీత) పట్టె మంచము పరుపు అది నాకు తోడు**"[2] అంటూ సీత మీద కోపాన్ని తన ఒంటరితనాన్ని ఒకేసారి తెలియచేస్తాడు.

## 4. లక్ష్మణ దేవర నవ్వు:

ఇది ఒక స్త్రీల రామాయణం పాట శ్రీరాముడు రావణ వధానంతరం అయోధ్య సభలో కొలువైన సందర్భంలో అంతటి ప్రశాంత వాతావరణంలో లక్ష్మణుడు కిలకిల నవ్వుతాడట మహామహులంతా కొలువై ఉన్న సభలోని వారందరూ ఒక్కక్షణం ఆగి లక్ష్మణుడు తమనే చూసి నవ్వుతున్నాడేమో అని ఎవరికి వారే మనసులో బాధపడి అవమానంగా భావిస్తారు. ఆ విధంగా శివుడు, జాంబవంతుడు, ఆదిశేషుడు, నీలుడు, సీతా, రాముడు వంటి వారు అవమానభారంతో తలదించుకుంటారు. ఎవరికి వారు తమ తమ మనసులలో లక్ష్మణుని నవ్వుకి వారికి తోచిన అర్థాల్ని చెప్పుకుంటూ ఏ విధంగా తమకి ఆపాదించుకుంటారో ఈ పాటలో ఉంటుంది. లక్ష్మణుని నవ్వుకి గల కారణం తెలియాలంటే ఈ పాటైనా వినాలి లేదా నారాయణరావు గారి వ్యాసమైన చదవాలి.

లక్ష్మణుడు ఆదిశేషుని అవతారం అంటారు. ఆదిశేషుడు లక్ష్మణుడు ఒకరే అయినప్పుడు ఇద్దరు ఒకే సభలో ఎలా ఉండగలిగారు.

ఊర్మిళాదేవి నిద్ర అనే పాటలు లక్ష్మణుడు అడవులకు వెళ్లేటప్పుడు ఊర్మిళ లక్ష్మణుడు ఒక ఒప్పందం చేసుకుంటారని లక్ష్మణుడు తన నిద్రని ఊర్మిళకి ఇచ్చి ఊర్మిళ మేలుకువను తాను స్వీకరిస్తాడని ఉంటుంది. లక్ష్మణ దేవర నవ్వు పాటలో అడవులకు వెళ్ళిన తర్వాత ఒకరోజు నిద్ర దేవి వచ్చి నీవు నన్ను నీ దగ్గరికి రానివ్వలేదని వాపోతుంది అప్పుడు లక్ష్మణుడు నేను అన్నా, వదినల సేవలో ఉన్నానని నీవు నాకోసం ఎదురు చూసే నా భార్య దగ్గరికి వెళ్లి ఆవహించమని పంపిస్తాడు అని ఉంటుంది. పైన తెలిపిన మూడు వ్యాసాలు వెల్చేరు నారాయణరావు రచించారు. ఆయన ఈ పాటల గురించి విశ్లేషిస్తూ ఇవన్నీ తెలుగు కవయిత్రి అద్భుత సృష్టి అని చెప్పారు.

## 5. లక్ష్మణుని జోగారము:

**"శ్రీరామ భూపాలుడా సీతతో**
**జేరి చనే గాననములో**
**వారితో దా వెళ్లగా వదలకను**
**వారిజాక్షుని నీడగా ఘోర కాంతారాములలో -గూర్మితో**
**దూరముల గడచే నతడు**
**చారు హటకారుపుడా -సౌమిత్రి**
**వీర విక్రముడు గాదా.**"[3]

అంటూ సాగే ఈ పాటను కృష్ణ మోహన్ రావు తన గలంలో పాడి వినిపించారు. ఈ పాటను కూడా ఊర్మిళాదేవి నిద్ర గతిలోనే పాడుకోవాలని తెలియజేశారు. ఊర్మిళాదేవి నిద్ర ఛందస్సు కస్తూరి రంగ రంగా నాయన్న కావేటి రంగ రంగా వంటిదే అని తెలిపారు.

ప్రతి పాదములో దీనికి 5, 7 – 5 - 5, 7 మాత్రలు.

ఏడుమాత్రులను 2,5 లేక 3,4 లేక 4,3 మాత్రలుగా ఎన్నుకోవచ్చునని మొదటి భాగము (5,7 మాత్రలు)

వలనే చివరి భాగము కూడా (5, 7 మాత్రలు) రెండు భాగాలు మధ్య ఉండే ఐదు మాత్రల వంతెన కలపబడుతుంది అని తెలిపారు. పాదమునకు 20 అక్షరములు గల కృతి ఛందములోని 240443వ వృత్తము గణములు – ర/స/త/జ/ర/స/గగ UIU III UU – IIUI – UIU III UU, అక్షరసామ్య యతి (1, 9) ప్రాసయతి (1, 13 అనగా 2వ, 13వ అక్షరములతో ప్రాస)

**"మాధవా పిలువరాదా – మనసార – రాధతో పలుకరాదా**
**బాధతో మనసు నీకై – వనమాలి – పేదగా వణకె నాకై**
**మోదమో కనఁగ రాదే – పొడుగైన – ఖేదమా బ్రదుకు నీదే**
**చేదు నా మధువు గాదా – చిరమైన – హ్లాద మా మరువు గాదా"**[3]

"ఊర్మిళా జాతి పద్యము" అనే కొత్త ఛందస్సును కూడా వీరు ఈ వ్యాసంలో పరిచయం చేశారు.

## 6. మొల్ల రామాయణంలో కవితా వర్ణన వైశిష్ట్యాలు:

ఒక స్త్రీ రచించిన తొలి తెలుగు రామాయణం మొల్ల రామాయణం. ఈ రామాయణంలోని అనేక కోణాలను విశ్లేషిస్తూ అయినవోలు ఉషాదేవి వ్యాసం రచించారు. ఈ వ్యాసంలో మొల్ల రామాయణంలోని అలంకారాలు, వర్ణనలు, సంభాషణ శైలి, చమత్కారాలు, భాషా విశేషాలు వంటి ఉపశీర్షికల ద్వారా చెప్పే ప్రయత్నం చేశారు. మొల్ల చేసిన వర్ణనల గురించి చెబుతూ "**ఇవాళ మనం తెలుగు ఇళ్లల్లో చూసే లక్ష్మీదేవి క్యాలెండర్ నమూనా బహుశా మొదట చిత్రించింది మొల్లనేమో! అచ్చం అలాగే ఉంది ఆమె వర్ణన**"[4] అంటారు వ్యాసరచయిత్రి. "**తామర పువ్వు గద్దె మీద కూర్చున్న లక్ష్మీదేవిని రెండు ఏనుగులు రెండు వైపులా నీటితో అభిషేకిస్తున్నట్టుగా వర్ణించింది మొల్ల**"[4] అని తెలియజేశారు.

**"సామజయుగ్మ మింపలరఁ జల్లని నీరు పసిండికుండలన్**
**వేమఱు వంచి వంచి కడు వేడుకతో నభిషిక్తఁ జేయఁగాఁ**
**దామరపువ్వు గద్దియ ముదంబున నుండెడి లోకమాత మా**
**కాముని తల్లి సంపద లఖండముగా నిడు మాకు నెప్పుడున్."**[4]

'ఈమాట' అంతర్జాల సాహిత్య మాస పత్రికలో The collected essays of a.k ramanujan అనే పుస్తకం మరియు three hundred ramayanas on translation పౌలరిచ్మెన్ సారథ్యంలో వెలువడిన many ramayanas అన్న పుస్తకాలను ఆధారంగా చేసుకుని మూడు వ్యాసాలు వచ్చాయి. అవి నా రామయణం, మూడు వందల రామాయణాలు, అనేక రామాయణాలు పునర్నిర్మాణాలు, ప్రతి నిర్మాణాలు– శూర్పణఖ ఉదంతం ఒకరోజు సభలో రాముడు కొలువుతీరి ఉండగా ఆయన వేలికి ఉన్న వజ్రపు ఉంగరం జారుకుంటూ పాతాళలోకంలోకి వెళ్లి పడుతుంది. హనుమంతుడు చిన్నగా మారి ఆ ఉంగరాన్ని వెతుక్కుంటూ పాతాళ లోకానికి వెళ్తాడు. అక్కడ పాతాళ భేతాళ రాజు చాలా ఉంగరాలు ఉన్న పళ్ళెమును చూపి దీనిలో ఏది నీ రాముని ఉంగరం దాన్ని తీసుకొని భూలోకానికి వెళ్లిపో అంటాడు. కానీ ఆ పళ్లెంలో ఉన్న అనేక వేల ఉంగరాలు ఒకే విధంగా ఉండేసరికి

హనుమంతుడు అయోమయంగా చూస్తాడు. అప్పుడు పాతాళ భేతాళ రాజు ఇవన్నీ నీ రాములవారిలా ఉంగరాలే ఒక్కో రాముడికి ఒక్కో ఉంగరం అని, రాముడు అవతారం చాలించేటప్పుడు ఆయన ఉంగరం నా దగ్గరికి వస్తుందని వాటిని జాగ్రత్తగా దాచి ఉంచడమే నా పని అని అయినా నువ్వు భూలోకానికి వెళ్ళేటప్పటికి మీ రాముడు అవతారం చాలించేస్తాడని చెప్తాడు. ఈ కథను చెప్తూ వేలూరి వారు మీ రామాయణం మీది నా రామాయణం నాది, మీ ఋషులు వేరు నా ఋషులు వేరు. రామాయణంలో సీత, రాముడు, దశగ్రీవుడు, హనుమంతుడు ప్రధాన పాత్రలు అనే అంశాన్ని ప్రతిపాదిస్తాడు.

**"మీకు కాలపురుషుడు, దుర్వాసుడు ఇష్టమైతే వారి గురించే రాసుకోండి, కానీ అసలు విషయాన్ని పక్కకి నెట్టకండి."**[5] అని నా రామాయణం అనే వ్యాసంలో వేలూరి వెంకటేశ్వరరావు తెలియజేశారు.

రాముని ఉంగరం గురించి లక్ష్మణుడు అవతారం ఛాలించుటకు ముందు జరిగిన సంఘటనలు తెలిపే పైన చెప్పిన కథని ఉదాహరణగా చేసుకుని సురేష్ కొలిచాల ఒక్కొక్క రామునికి ఒక్కొక్క రామాయణం ఉందని చెప్పడానికి ఈ కథ చెప్తూ ఉంటారని తెలిపారు. **"కావ్య రూపంలోని వివిధ రామాయణాల్ని అధ్యయనం చేసిన కమీల్ బల్కె 300 దాకా రామాయణాలను లెక్కించాడని తెలిపారు. ఈ వ్యాసంలో సురేష్ కొలిచాల వివిధ భాషల్లో, వివిధ సంస్కృతిలలో, వివిధ సాంప్రదాయాలలో రామాయణం ఎలా చెప్పుకున్నారు? వాటి మధ్య భేదాలు ఏమిటి? సామ్యాలు ఏమిటి? ఏది యధాతధంగా అనువాదం చేశారు? దీని అనుసృజన చేశారు? ఎలాంటి విషయాలు మార్పు పొందాయి?"**[6] వంటి విషయాలను గురించి విపులంగా చర్చించారు.

వ్యాస రచయిత వాల్మీకి రామాయణంలో మరియు కంబ రామాయణ కథనాలలో అహల్యవృత్తాంతాన్ని ఏ విధంగా చెప్పారో వివరించారు. విమల సూరి రామాయణం కథనాలలో గల రావణుడి కూతురే సీత అని చెప్పే కథని ఇక్కడ ప్రస్తావించారు. ఆగ్నేయాసియా దేశాల్లోని రామాయణాలను కూడా ప్రస్తావించారు.

థాయి భాషలో రాసిన "రామ ఎకిన్" లో ముందుగా మనుషులు, రాక్షసులు, వానర జాతుల పుట్టుకకు సంబంధించిన కథతో ప్రారంభమవుతుందని తెలిపారు. ఏ రామాయణ కథ వారి సొంతం కాదు అలాగని ఏ ఒక్కటి పున:కథనం కాదు. ఈ కథకు కథనాలకు అంతం లేదు. ఎవరో చెప్పినట్టు భారతదేశంలో రామాయణాన్ని భారతాన్ని మొదటిసారి చదవటం అనేది ఉండదు. ఈ కథలు ఎవ్వరు ఎప్పుడు చెప్పినా అవి అంతకుముందు విన్నవే అనే నిర్ణయానికి వచ్చారు వ్యాసకర్త. "ఏ.కే. రామానుజన్" "The Collected Essays of A.K.Ramanujan, (1999)" వ్యాసం మీద జరిగినట్టే ఈ వ్యాసం మీద కూడా అనేక చర్చలు 'ఈమాట' పాఠకుల మధ్య జరిగాయి.

## 7. అనేక రామాయణాలు - శూర్పణఖ ఉదంతం:

ఈ వ్యాసం "మెని రామాయణాస్" అనే గ్రంథంలో "క్యాథలిన్ ఎర్న్ డల్" రాసిన వ్యాసాన్ని పి. సత్యవతి తెలుగులోకి అనువదించారు. రాముడికి అపఖ్యాతి తెచ్చిపెట్టిన శూర్పణఖ గురించి ఏ రామాయణంలో, ఏ ఏ విధంగా ఉందో ఈ వ్యాసంలో వ్యాస రచయిత్రి తెలియజేశారు.

### 8. త్రిపద -కొన్ని రామాయణ విశేషాలు:

వాల్మీకి రామాయణంలోని అంశాలను "తల్లావజ్ఝల శివాజీ" ఈ వ్యాసంలో తెలియజేశారు. నీ పాదధూళి తాకి రాయికూడా స్త్రీ అయిందట. అలాంటి నీ పాదాలు తగిలితే నా పడవ ఏమవుతుందో అని గుహుడు రాముని పాదాలు కడిగి పడవ ఎక్కించుకున్నాడని ఇప్పటికే అందరూ విని ఉంటారు. కానీ గుహుడు శృంగబేరపురానికి చెందిన వాడనీ, పడవ నడిపేవాడు కాదని అసలు గుహునికి పడవే లేదని వాల్మీకి రామాయణంలో ఉన్న అంశాన్ని గుర్తు చేశారు. శబరి తాను ఏరి తెచ్చిన పండ్లను ఒక్కొక్కటిగా కొరికి రుచి చూసి శ్రేష్ఠమైన పళ్ళని రామునికి అందించింది అని మనకు తెలుసు ఈ దృశ్యం అసలు వాల్మీకి రామాయణంలో లేదని వ్యాసకర్త తెలియజేశారు. రాముని కాదని భరతుడు రాజ్యం చేయడానికి అంగీకరించడు. ధర్మం విషయంలో రాముని కంటే కూడా భరతుడు ఎక్కువ పట్టుదల కలవాడని నా అభిప్రాయం అని దశరథుడు కౌసల్యతో అన్న మాటలు చూస్తే తండ్రి గుర్తించినట్టుగా తన పుత్రుని మనసును కైకేయి చెప్పుడు మాటల మైకంలో పడి గుర్తించలేకపోయిందని తెలుస్తుంది.రాముడు అడవులకు వెళ్లేటప్పుడు కౌసల్యాదేవి ఇలా అంటుంది. తండ్రి మాటే కాదు తల్లి మాట వినవలసిందే. నీవు అడవికి వెళ్లవద్దు వెళితే నేను ప్రాయోపవేశం చేస్తా అన్నది కౌసల్య. రాముడు తల్లి మాట కంటే తండ్రి మాటకే ఎక్కువ విలువిచ్చాడని అర్థమవుతుంది. అభిప్రాయం ఏదో పూర్తిగా తెలుసుకోకుండానే నిన్ను అడవికి తీసుకుపోలేను కదా అంటూ అడవులకు వెళ్లే సమయంలో సీత అభిప్రాయానికి విలువని ఇచ్చాడు రాముడు. జాగ్రత్త మెత్తని వాడు ఎప్పుడూ తిరస్కరించబడతాడు అని లక్ష్మణుడు రాముడితో అంటాడు.నిజమే కదా మరి. ఈ విధంగా వాల్మీకి రామాయణంలోని విశేషాలను తెలుపుతూ మూల కథను స్పష్టంగా వివరిస్తూ సత్యాన్ని ఆవిష్కరిస్తాడు వ్యాసకర్త. ఇప్పటికే లోకంలో స్థిరపడిపోయిన వాల్మీకి రామాయణంలో లేని ప్రక్షిప్తాలను గురించి తెలుసుకొని అసలైన వాల్మీకి రామాయణం గురించి తెలుసుకోవడానికి ఉపయోగపడుతుంది ఈ వ్యాసం.

### 9. వాల్మీకి వాకిట్లో కాళిదాసు:

ఈ వ్యాసంలో "కొంపెల్ల భాస్కర్" వాల్మీకి రామాయణంలోని మరియు కాళిదాసు ఋతుసంహారంలోని ప్రకృతి వర్ణనలను పోల్చి చూపారు. చివరగా కొన్ని చిట్టాపద్దులు ఇచ్చారు.

### 10. ఎవరీ సీత, శూర్పణఖలు?:

ఈ వ్యాసాన్ని "జే.యు.బి.వి.ప్రసాద్" రచించారు. కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు పొందిన "వోల్గా" విముక్త కథల సంపుటిలోని 'సమాగమం' కథని విమర్శిస్తూ వచ్చిన వ్యాసం.

**"రామాయణం వంటి మత గ్రంథాలలోంచి పాత్రను తీసుకొని కొత్త సంఘటనలను సృష్టించి కథలు రాసేటప్పుడు కొన్ని సూత్రాలను పాటించాలని ఎన్ని కొత్త సంఘటనలు సృష్టించిన పాత్రలు తమ స్థాయికి మించిన చైతన్యంతో మాట్లాడకూడదు అన్నది అతి ముఖ్యమైన సూత్రం"**[7] అని తెలిపారు. దీనిలో సమాగమం కథను

క్లుప్తంగా వివరిస్తూ సీత శూర్పణఖ లవకుశల పాత్ర చిత్రణ గురించి వివరించారు. ఈ వ్యాసంలోని ఫెమినిజం కోణాల్ని వ్యాసకర్త ప్రశ్నించారు.

## 11. ముగింపు:

దినదినాభివృద్ధి చెందుతూ మంచి తెలుగు సాహిత్యాన్ని అందజేస్తూ అంతర్జాలంలో దూసుకుపోతున్న 'ఈమాట' ఈ పత్రికలోని సాహిత్యం అందరికీ చేరువవుతుంది.

ఈ వ్యాసాల పరిశీలన ద్వారా జానపద రామాయణం, మొల్ల రామాయణం, సంస్కృత రామాయణం, కావ్య ప్రబంధ విశేషాలను తులనాత్మకంగా పరిశీలించి వాటిలోని అంశాలను తెలుసుకోవచ్చు. ఆయా రచనల్లో ఉండే వస్తు శిల్ప విన్యాసాన్ని వ్యాసరచయితలు ఏ విధంగా చర్చించారు అనే విషయాన్ని తెలుసుకోవచ్చు. సంస్కృత రామాయణం జానపద రామాయణం కావ్య ప్రబంధ అంశాలతో కూడిన రామాయణ వ్యాసాలు 'ఈమాట'లో ఉన్నాయి అని తెలుస్తుంది.

ఈ వ్యాసాలను గురించి తెలుసుకోవడం ద్వారా ఈ వ్యాసరచయితలు చెప్పిన దాంట్లో ఉన్న సత్యాసత్యాలను తెలుసుకోవాలనే కోరికతో మూలగ్రంథాలను చదవాలనే కుతూహలం పాఠకులలో కలుగుతుంది.

## 12 పాదసూచికలు:

1. వెల్చేరు నారాయణరావు, ఊర్మిళాదేవి నిద్ర-ఒక ఆలోచన, 'ఈ మాట' అంతర్జాల పత్రిక, 2012 జనవరి సంచిక, ఊర్మిళాదేవి నిద్ర ఒక ఆలోచన, Link: https://eemaata.com/em/issues/201201/1895.html
2. వేల్చేరు నారాయణరావు, సీత గడియ, 'ఈమాట' అంతర్జాల పత్రిక, 2012 మార్చి సంచిక, సీత గడియ, Link: https://eemaata.com/em/issues/201203/1917.html
3. బెజ్జాల కృష్ణమోహన్ రావు, లక్ష్మణుని జాగారము, 'ఈమాట' అంతర్జాల పత్రిక, 2017 ఆగస్టు సంచిక, లక్ష్మణుని జాగారము, Link: https://eemaata.com/em/issues/201708/12860.html
4. అయినవోలు ఉషాదేవి, మొల్ల రామాయణంలో కవితా వర్ణన వైశిష్ట్యాలు, 'ఈమాట' అంతర్జాల పత్రిక, 2022 ఏప్రిల్ సంచిక, మొల్ల రామాయణంలో కవితావర్ణన వైశిష్ట్యాలు, Link: https://eemaata.com/em/issues/202204/28368.html
5. వేలూరి వెంకటేశ్వరరావు, నా రామయణం, 'ఈమాట' అంతర్జాల పత్రిక, 2000 జూలై సంచిక, నా రామాయణం, Link: https://eemaata.com/em/issues/200007/791.html
6. కొలిచాల సురేష్, మూడు వందల రామాయణాలు 'ఈమాట' అంతర్జాల పత్రిక, 2011 నవంబర్ సంచిక, మూడు వందల రామాయణాలు, Link: https://eemaata.com/em/issues/201111/1868.html
7. జే.యు.బి.వి.ప్రసాద్, ఎవరీ సీత శూర్పణఖలు, 'ఈమాట' అంతర్జాల పత్రిక, 2006 జనవరి సంచిక, ఎవరీ సీత శూర్పణఖలు? Link: https://eemaata.com/em/issues/200601/31.html

## 13. ఉపయుక్తగ్రంథసూచి:


1. మాధవ్, మాచవరం, ఈ-మాట. (అం.ప.), 2017, ఆగస్టు సంచిక, (వ్యాసం:లక్ష్మణుని జాగారము, బెజ్జాల కృష్ణమోహనరావు.)
2. మాధవ్ ,మాచవరం (సంపా), ఈ-మాట( అం. ప.), 2018, డిసెంబర్ సంచిక, (వ్యాసం: అనేక రామాయణాలు, పి. సత్యవతి.)
3. మాధవ్, మాచవరం (సంపా), ఈ-మాట (అం. ప.), 2019, మే సంచిక, (వ్యాసం: త్రిపద కొన్ని రామాయణ విశేషాలు, తల్లావజ్ఝల శివాజీ.)
4. మాధవ్, మాచవరం (సంపా), ఈ మాట (అం.ప.), 2022, ఏప్రిల్ సంచిక, (వ్యాసం: మొల్లరామాయణంలోని కవితావర్ణనా మాధుర్యాలు, అయినవోలు ఉషాదేవి.)
5. వెంకటేశ్వరరావు, వేలూరి. (సంపా), ఈ-మాట (అం.ప), 2000, జూలై సంచిక, (వ్యాసం: నా రామాయణం, వేలూరి వెంకటేశ్వరరావు.)
6. వెంకటేశ్వరరావు, వేలూరి. (సంపా), ఈ మాట (అం. ప.), 2001, మే సంచిక, (వ్యాసం: వాల్మీకి వాకిట్లో కాళిదాసు, కొంపెల్ల భాస్కర్.)
7. వెంకటేశ్వరరావు, వేలూరి. (సంపా), ఈ మాట, 2006, జనవరి సంచిక, (వ్యాసం: ఎవరీ సీతా శూర్పణఖలు, బి. వి. వి. ప్రసాద్.)
8. వెంకటేశ్వరరావు, వేలూరి. (సంపా), ఈ మాట, 2011. నవంబర్ సంచిక, (వ్యాసం: మూడువందల రామాయణాలు, కొలిచాల సురేష్.)
9. వెంకటేశ్వరరావు, వేలూరి. (సంపా), ఈ మాట, 2012, జనవరి సంచిక, (వ్యాసం:ఊర్మిళాదేవి నిద్ర, వెల్చేరు నారాయణరావు.)
10. వెంకటేశ్వరరావు, వేలూరి. (సంపా), 2012, మార్చి సంచిక, సీత గడియ,(వ్యాసం: వెల్చేరు నారాయణరావు.)
11. వెంకటేశ్వరరావు, వేలూరి. (సంపా), ఈ మాట, 2012 మే సంచిక, (వ్యాసం:లక్ష్మణదేవర నవ్వు, వెల్చేరు నారాయణరావు.)


***




AUCHITHYAM

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

ISSN: 2583-4797

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_37.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 37. రామాయణం: అలంకరణలు

**గూడూరి శైలజ**

తెలుగు అధ్యాపకులు,

ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయం ప్రతిపత్తి), సిద్ధిపేట,

సిద్ధిపేట, తెలంగాణ.

సెల్: +91 9703817390. Email: shailajagudurinavya@gmail.com

**వ్యాససంగ్రహం:**

*అలంకారం అంటే సహజ సౌందర్యాన్ని మరింత ఇనుమడింపజేసేది. విశేషించి సమాజంలో స్త్రీలను అలంకార ప్రియులుగా చెప్తారు. రామాయణం మానవ జీవితానికి ధర్మ మార్గాన్ని బోధించిన సద్గ్రంథం. వాల్మీకి రాసిన రామాయణానికి తెలుగులో ఎన్నో అనువాదాలు వచ్చాయి. ఈ అనువాదాల్లో కథాపరంగా అనేక మార్పులు చేర్పులు జరిగినప్పటికీ మూలకథలో ఎలాంటి మార్పు లేకుండా రాముడి నడవడిని రాముడి ఆదర్శజీవితాన్ని మానవీయవిలువలని సరికొత్తకోణంలో తెలుగుకవులు ఆవిష్కరించారు. ఈ సందర్భంలో రామాయణకథ ఘట్టంతో ముడిపడి ఉన్న నగల ప్రస్తావన గురించి వాటి విశేషాలు గురించి తెలియజెప్పడమే ఈ వ్యాస ఉద్దేశం. (నేను చేసిన పూర్వ పరిశీలన వాల్మీకి రామాయణం, ఆధ్యాత్మరామాయణం, తందనాన రామాయణం.)*

**Keywords:** నగలు, చూడామణి, ఉంగరం, అలంకరణ, భూషణాలు, పట్టీలు, నారచీరలు, రామాయణం.

## 1. ఉపోద్ఘాతం:

వాల్మీకి రాసిన సంస్కృతరామాయణానికి తెలుగులో అనేక అనువాదాలు వచ్చాయి. వచ్చిన ప్రతి అనువాదాన్ని ప్రజలు, పాఠకులు ఆదరించారు. తెలుగులో ప్రతి ప్రక్రియలో రామాయణం వెలువడింది. రామాయణం కథ ఇతివృత్తంలో ఎన్నో మార్పులు చోటు చేసుకున్నాయి. ప్రేక్షకులను ఆదరించడానికి సరికొత్త కల్పనలు చేయబడ్డాయి. ఈ సందర్భంలో కథాపరంగా అనేక రకాల అంశాలను గురించి తెలియజేస్తూ కథలో ఉపయోగించిన అలంకారాలకు, విశేషించి ప్రధాన పాత్రధారులైన సీతారాముల యొక్క అవినాభావ సంబంధాల్ని ఆత్మీయసంబంధాల్ని వెల్లడించేటువంటి నగలకు విశేషమైన ప్రాధాన్యం కల్పించబడింది. వివిధ తెలుగు రామాయణాల అధ్యయనం ద్వారా అటువంటి నగల ప్రస్తావనను, వాటి ప్రత్యేక విశేషాలను తెలుసుకుందాం.

## 2. బాలకాండము:

సీతమ్మ శ్రీరాముని వివాహ సందర్భంలో వివాహం చేసుకుంటున్న వధూవరులకు అలంకరణలో భాగంగా వస్త్రాలను ఆభరణాలను వారికి ఇచ్చినట్లుగా ఉంటుంది.'**ఇట్లు శ్రీరామచంద్రుని సత్యసంపదకు మెచ్చి రామలక్ష్మణ భరత శత్రఘ్నులకు మంగళ స్నానం చేయించి, నిర్మలాంబరాభరణంబు లొసంగి, వేరు వేరు ముహూర్తమున తన కూతురు సీతను శ్రీ రామచంద్రునకు తన తమ్ముడు కుశధ్వజునికూతులకు మాండవ్య ఊర్మిళ శృతకీర్తులను భరత లక్ష్మణ శత్రుఘ్నులకు ను ఇచ్చి వివాహం చేసి...."**[1]

వివాహనంతరము వధూవరులను అత్తగారింటికి పంపునపుడు అరణంగా ఇచ్చు సందర్భంలో **'పదివేలు దాసీ జనమ్ముని, లక్ష ధేనువులునునరణంబులిచ్చి దశరథాది రాజలోకమునకు బహుమానముగా నవరత్న ఖచిత భూషణములను చినీ చీనాంబరమ్ములను నొసంగి..**[2] అనునపుడు నగల ప్రస్తావన గురించి ఉన్నది. కల్యాణం తరువాత అత్తగారింటికి వచ్చిన సీతమ్మకు రాముడు మొదటిసారిగా చూడామణి అలంకరించిన సన్నివేశం సీతాకళ్యాణం సినిమాలో చూడవచ్చు. అందుకే అపహరణ సమయంలో తన నగలన్నిటినీ ఋష్యమూక పర్వతమో మీద పడవేసినప్పటికీ చూడమణిని మాత్రం రాముని గుర్తుగా ఉంచుకొని తీయలేదు.

## 3. అయోధ్యకాండ:

అయోధ్యకాండలో సీతారాములు అడవికి వెళ్లే సందర్భంలో నారచీరలు కట్టుకొని వెళ్లమని కైకేయి ఆజ్ఞాపించి చెప్పడం ఉంటుంది. కానీ సౌభాగ్యవతి అయిన సీతమ్మను అన్ని రకాల నగలను పెట్టుకుని వెళ్ళవలసిందిగా దశరథుడు చెప్తాడు. ఈ రెండు సందర్భాల్లో నగల ప్రస్తావన ఉంటుంది. రాముడిని అడవిలోకి పంపేటప్పుడు కైక స్వయంగా వెళ్లి నారచీరలు తెచ్చి రామునికి ఇస్తుంది. అంతవరకు మౌనంగా ఉన్న కులగురువు వశిష్టులు కైకతో అడవులకు వెళ్తున్న సీత తన ఆభరణాలతో చినాంబరాలతో వెళుతుందే కానీ ఈ వల్కలాలతో కాదు[4] వాహనాలు పరిచారిక గణం కూడా ఆమె వెంట వెళ్లాలంటారు. దశరధుడు కోశాగారాధిపతిని పిలిచి ఈ 14 సంవత్సరాలకు అవసరమైన ఆభరణాలను[5] వస్త్రాలు జానకిరథంలో పెట్టించు అన్నాడు. సీతాదేవికి ఆవశ్యమైన వస్త్రభూషణాలతో పంపుతూ కౌసల్య ఆమెను దగ్గరగా తీసుకొని "అమ్మాయి సిరిసంపదలతో తులతూగుతున్నప్పుడు భర్తను సుఖపెట్టడం విశేషం కాదు, సంపదలు పోయినప్పుడు కూడా భర్తను సేవించడంలోనే ఉంది స్త్రీ ధర్మం." అని అమూల్యమైన స్త్రీ భూషనాన్ని తెల్పుతుంది. అయోధ్యకాండలో భరతుడు అతని పరివారం గూర్చి మాట్లాడుకునే సందర్భంలో వారి దినచర్యను గురించి తెలిపే సందర్భంలో వస్త్రాభరణాలు, అంగరాగాల ప్రస్తావన ఉంటుంది.

సీతారామ లక్ష్మణులు అరణ్యాలకు బయలుదేరి వెళుతున్న క్రమంలో చిత్రకూట పర్వతం మీదికి వెళ్లి అక్కడ ఉన్న అత్రి మహర్షి ఆశ్రమానికి వచ్చి వారికి పాదాభివందనాలు చేసి ఆశీర్వాదాలను పొందుతారు. ఆ సమయంలో అత్రి తన భార్యను చూపెడుతూ "అమ్మ! సీత, ఈమె నా భార్య అనసూయ, ముదుసలి అనావృష్టితో బీటలవారిన భూమిపై తన శక్తితో జాహ్నవి నదిని ప్రవహింపజేసింది. ఆమె నీకు తల్లి లాంటిది తన అనుగ్రహం పొందు" అని

చెప్పగానే సీత అనసూయ యొక్క ఆశీర్వాదాలు తీసుకొని తన నుండి ధర్మ మార్గాలను తెలుసుకుంటుంది. 'పాణిగ్రహణ సమయంలో మా అత్తగారు చెప్పిన మాటలు నా మనసున నిలిచిపోయాయి పరమోత్తమ స్థానం పొందిన సావిత్రి కథ విన్నాను. ప్రత్యక్షంగా మిమ్మల్ని చూస్తున్నాను ఆ ఇద్దరినీ అన్నివేళలా స్మరించుకుంటాను' అన్న సీత మాటలకు అనసూయ సంతోషించి నీ మాటలు నాకు సంతోషాన్ని కలిగించాయి. నీకేమైనా ఇవ్వాలని ఉంది ఏం కావాలో అడుగు అంటుంది. అప్పుడు సీత మీ మాటలతోనే అన్ని నాకు ఇచ్చారు' అంటుంది. అనసూయ మరింత సంతోషించి ***"ఇదిగో ఈ దివ్య మాలలు, వస్త్రాభరణాలు అంగరాగానులేపనాలు తీసుకో ఈ పువ్వులు వాడవు ఈ బట్టలు మాయవు, నీ భర్త ఎదుట శచీదేవి వలే ఉంటావు"***[3] అని వాడిపోని మాసిపోని ఆభరణాలను వస్త్రాలను ఇస్తుంది. ఇక్కడ రాముని ఎదుట సీత ఎప్పుడు స్వచ్ఛంగా ఉండడం కోసం తాను వాటిని ఇచ్చినట్లుగా ఉషశ్రీ రామాయణం చెబుతుంది.

## 4. అరణ్య కాండం -మొల్ల రామాయణం:

రావణుడు సీతమ్మను పర్ణశాల నుండి పుష్పకవిమానంలో ఎత్తుకెళ్లే సందర్భంలో దిగువన ఎవరైనా ఉన్నరేమో తన వార్తను శ్రీ రామచంద్రునికి తెలుపుతారేమోనని చూస్తే మనుష్యుల జాడ తెలియలేదు కానీ అక్కడ వనచరులు తిరుగుతున్నట్లు కనిపించింది .

కం . **వనచరులొకగిరి చేరువ**
**వనమున జరిగింప చూచి వసుధాసుతయున్**
**తన చీర కొంగు తునుకను**
**తన సొమ్ములు మూటగట్టి ధరపై వైచెన్**[6]

అప్పుడు సీతమ్మ తన ఆభరణాలను చీర కొంగును చింపి అందులో వాటిని మూటగట్టి వానరులు తిరిగే కొండమీద జారవిడిచిందని మొల్ల రామాయణంలో కనిపిస్తుంది. అంతే కాకుండా ఉషశ్రీ రామయణలో సీతమ్మ తన నగలను మూటగా కట్టి ఋష్యమూక పర్వతంపై జార విడిచినట్టుగా ఉంది. లంకలో అశోకవనంలో రావణుడు ఎంత ప్రయత్నించినా దేనికి లొంగని సీతను ఎలాగైనా ను లొంగదీయలనే తపనతో ఆమెను ప్రలోభ పెట్టడానికి కాంచన మణిరత్న ఖచితభూషణాలు అమూల్యాభరణాలు ఆవిడ ఎదురుగా ఉంచమని[7] రావణుడు అంటాడు.

## 5. కిష్కింధకాండ:

కిష్కింధకాండలో సీతమ్మ పడవేసిన నగలను ఆంజనేయుడు తీసుకొచ్చి చూపించినప్పుడు అందులో నగలన్నింటినీ చూస్తూ రాముడు చూడలేక కన్నీరు కారుస్తూ పక్కనున్న లక్ష్మణునికి ఇస్తే లక్ష్మణుడు ఆ నగలను చూస్తూ ఈ నగలన్నీ మా అమ్మ సీతమ్మవి అవునో కాదో నాకు తెలియదు కానీ ఈ పట్టీలు మాత్రం ప్రతిరోజు నేను

ఉదయం నమస్కారం చేసే పాదాలకు ధరించేది నా తల్లి సీతమ్మవి.[8] అని పాదాలకు ఉండే పట్టీల గురించి చెప్పినట్లు ఉంది. ఇక్కడ సీతమ్మకు లక్ష్మణునికి ఉండేటువంటి వాత్సల్య భరిత సంబంధం వెలువబడుతుంది. సీతమ్మ కాళ్ళకు ధరించిన పట్టీల ప్రస్తావన రుక్మాభట్ల నరసింహ శర్మ గారి గేయ రామాయణంలో కనిపిస్తుంది.

సుగ్రీవపట్టాభిషేకం ఘట్టంలో స్వర్ణదండం మీద శ్వేతచక్రం, హేమదండానికి కట్టిన చమరీ వాలాలు రత్నాలు ఉన్నట్లుగా వర్ణన ఉంది. అంగదుడు పరుషోక్తులు ఆడుతున్న లక్ష్మణున్ని వేడుకుంటూ తన నగరంలోకి తీసుకెళ్తున్న సందర్భంలో రత్నఖచిత కూడ్యాలతో అలరారే సౌధాలు కిష్కిందలో ఉన్నట్లుగా వర్ణించాడు[9]. సుగ్రీవుడు ఉత్తర దిశగా ఉన్న దేశాల గురించి చెప్తున్న సందర్భంలో వైఖానస సరోవరం గురించి వర్ణిస్తూ బంగారు పద్మాలు[10] ఉన్నాయని అన్నాడు.

## 6. సుందరకాండ:

సుందరకాండలో హనుమంతుడు లంకాన్వేషణ చేస్తున్న సందర్భంలో లంకలో పయనిస్తూ, లంకలో ఉన్న స్త్రీలను గమనిస్తూ ముత్యాల హారాలు కర్ణాభరణాలు కింకిణిలు మొదలైన ఆభరణాలు ఉన్నాయని[11] పరిశీలించాడు. రావణుడు సీతమ్మను సందర్శించిన సమయంలో దివ్యవస్త్రాభరణాలు ధరించమని రత్నఖచిత హంస తూలికా తల్పాలపై శయనించమని[12] అంటాడు. సుందరకాండలో రాముడు పంపించినటువంటి హనుమంతుడు లంకకు వెళ్లి లంకలో సీతమ్మను చూసి రాముడు పంపగా ఇచ్చిన **ఉంగరాన్ని** సీతమ్మకి ఇస్తాడు. సీతమ్మ ఆ ఉంగరాన్ని చూసి మురిసిపోతుంది. రాముడే తన దగ్గరకు వచ్చాడన్నంతగా సంతోషిస్తుంది. *" ఉంగరమా ముద్దుటుంగరమా, మారాములా చేతి ముద్దుటుంగరమా" అంటూ* మురిసిపోయి ఉంగరానికి ప్రాణం ఉన్న జీవిగా భావించి ఎంతో ఆత్మీయంగా తన వారి యోగక్షేమాలను అడుగుతుంది. చిరుతల రామాయణంలో దీనికి సంబంధించిన ప్రస్తావన ఉంది. హనుమంతుడు 'నేను దూతగా వచ్చాను తిరిగి వట్టి చేతులతో వెళ్లకూడదు కదా అందుకని నీ చూడామణి ఇవ్వమని అన్నప్పుడు సీత ముందు నిరాకరిస్తుంది. ప్రాణప్రదంగా భావించే రాముడు అలంకరించిన తొలి నగ కాబట్టి హనుమంతునిపై పూర్తి నమ్మకము లేక **"నేనా రత్నము నమ్మి నీకీయజూమీ"** అంటుంది. హనుమంతుడు **"చుక్కలు తలపూవులుగా"** పెరిగి తన రూపాన్ని చ్చుపిన తరువాత రామునికి తన గురుతుగా తన వద్ద ఉన్న చూడమణిని ఇస్తుంది.[13] ఆ చూడామణిని రాముడు మొదటిసారిగా అలంకరించి నటువంటి నగ కాబట్టి సీత ఆ చూడామణిని ఎప్పుడు తీయలేదు అనే విషయం ఈ సందర్భంలో వెల్లడవుతుంది.

## 7. యుద్ధకాండ:

యుద్ధకాండలో సీతమ్మను వశపరచుకోవడం కోసం రావణుడు అనేక రకాల ఆభరణాలను ఇచ్చాడని రామాయణాలన్నిటిలో తెలుస్తుంది. రావణ వధ తరువాత జరిగిన పట్టాభిషేకంలో సీతమ్మ తన ముత్యాల హారాన్ని బహుమతిగా ఆంజనేయునికి ఇస్తే ఆంజనేయుడు ప్రతి ముత్యాన్ని కొరికి చూసి అందులో రాముడు లేదని పారవేస్తాడని, నిజంగా నీవు అంతటా రామున్ని చూస్తావా అని అడిగిన వెంటనే తన హృదయంలో సీతారాములను చూపించడం రామాంజనేయ యుద్ధం వంటి చలనచిత్రంలో కనిపిస్తుంది.

## 8. ముగింపు:

ఈవిధంగా రామాయణకథలో ఇతివృత్తంతోపాటు అందులో నాయిక, నాయకుల పరంగా ఉపయోగించిన నగలను కూడా విశేషమైన ప్రాధాన్యం ఇవ్వబడింది. ప్రాణంలేని వస్తువులే అయినప్పటికీ శ్రీరాముని ఉంగరము, సీతమ్మ చూడామణి వియోగదుఃఖంతో బాధపడుతున్న సీతారాములను సాంత్వనపరిచాయి. నారచీరలు మొదలైన అలంకార విశేషాలు ఈ విశేషాలు అన్నింటిని పరిశీలించినప్పుడు ఆయా రామాయణాలలో చెప్పబడిన వివిధ అలంకరణ విశేషాలు ఆయా రామాయణాలు వెలువడిన కాలంనాటి సామాజిక పరిస్థితులను ప్రజల అలంకరణల విశేషాల గురించి తెలుసుకోవడానికి అవకాశం ఉందని చెప్పవచ్చు.

## 9. పాదసూచికలు:

1. ఊటుకూరి లక్ష్మీ కాంతమ్మ - మొల్ల రామాయణం- వచనం 83
2. ఊటుకూరి లక్ష్మీ కాంతమ్మ - మొల్ల రామాయణం- వచనం 83
3. ఉషశ్రీ -ఉషశ్రీ రామాయణం అయోధ్యకాండ –పుట 104
4. ఉషశ్రీ -ఉషశ్రీ రామాయణం అయోధ్యకాండ –పుట 52
5. ఉషశ్రీ -ఉషశ్రీ రామాయణం అయోధ్యకాండ –పుట 53
6. ఊటుకూరి లక్ష్మీ కాంతమ్మ - మొల్ల రామాయణం- పద్యం 45
7. ఉషశ్రీ -ఉషశ్రీ రామాయణం అయోధ్యకాండ –పుట 152
8. రుక్మాభట్ల విధుమౌళి శర్మ-తందనాన రామాయాణం- పుట 110
9. ఉషశ్రీ -ఉషశ్రీ రామాయణం కిష్కిందకాండ –పుట-194
10. ఉషశ్రీ -ఉషశ్రీ రామాయణం కిష్కిందకాండ –పుట-194
11. ఉషశ్రీ -ఉషశ్రీ రామాయణం సుందరకాండ –పుట-238
12. ఉషశ్రీ -ఉషశ్రీ రామాయణం సుందరకాండ –పుట-239
13. ఉషశ్రీ -ఉషశ్రీ రామాయణం సుందరకాండ –పుట-261

## 10. ఉపయుక్తగ్రంథసూచి:


1. పద్యసౌరభం, యుట్యూబ్ ఛానల్, మొల్ల రామాయణంలో నగలు- విశేషాలు
2. లక్ష్మీ కాంతమ్మ, ఊటుకూరి. 2008, మొల్ల రామాయణం. పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం, హైదరాబాద్.
3. విధుమౌళిశర్మ, రుక్మాభట్ల. 2009 తందనాన రామాయాణం. శ్రీ సిద్ధేశ్వర పబ్లికేషన్స్, హైదరాబాదు.
4. సిమ్మన్న, వెలమల. 2009, విమర్శ సిద్ధాంతాలు. దళిత సాహిత్యపీఠం, విశాఖపట్టణం.
5. సూర్యనారాయణ(ఉషశ్రీ), పురాణపండ, 2012, ఉషశ్రీ రామాయణం. తిరుమల తిరుపతి దేవస్థానము, తిరుపతి,


***



AUCHITHYAM

ISSN: 2583-4797

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_38.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 38. 'కల్పవృక్షం' సుందరకాండ: వర్ణన వైచిత్రి

**చక్రహరి రమణ**

తెలుగు అధ్యాపకులు,

ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయం ప్రతిపత్తి), సిద్దిపేట,

సిద్దిపేట జిల్లా, తెలంగాణ.

సెల్: +91 9247226292. Email: ramana.chakrahari@gmail.com

**వ్యాససంగ్రహం:**

*భారతదేశ సంస్కృతిని, సంప్రదాయాన్ని, మానవ మనుగడను, ఔన్నత్యాన్ని కాపాడడంలో ప్రాచీనకావ్యాలైన భాగవత, భారత, రామాయణాల పాత్ర ఎంతగానో ఉంది. వీటన్నింటిలో రామాయణ కథ కుటుంబపరంగా, వైవాహిక జీవితం విషయంలో, సోదరప్రేమ, అటు తల్లిదండ్రుల వాత్సల్యం, ఇటు రాజ్య పరిపాలనా, వనజీవుల పట్ల ప్రేమాదరణాలు, ఇచ్చిన మాటకు కట్టుబడటం వంటి విషయాలెన్నో వర్తమానులకు, భావితరాలకు స్ఫూర్తిదాయకం. అలాంటి రామాయణ కథలు ప్రస్తుత కాలంలో అనేకంగా ఉన్నాయి. అందులో ఆధునిక కాలములో తెలుగు మహాకావ్యంగా వెలిగిన 'కవిసామ్రాట్' విశ్వనాథ సత్యనారాయణచే విరచిత శ్రీమద్రామాయణకల్పవృక్షం కావ్యానికి ఎంతో ప్రాశస్త్యం ఉంది. తెలుగువారి సంప్రదాయాలను రామాయణ కథాంశాన్ని మేళవించి భారతీయ సాంస్కృతిక ఔన్నత్యాని చాటి చెప్పడానికి రాయబడిన ఈ రచన తెలుగుభాషకు జ్ఞానపీఠను అందించింది. ఈ మహాకావ్యంలో ప్రతీ కాండము మహోన్నతమైనదే. విశేషించి సుందరకాండలోని వర్ణనా వైచిత్రిలో ప్రకృతిగత విశేషాలు, మానవీయ విలువలు, ఊహాత్మక సౌందర్యం మిక్కిలి ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. రామాయణ కల్పవృక్షం సమగ్ర అధ్యయనం, ఇతర రామాయణాల విశ్లేషణాత్మక పద్ధతి, తులనాత్మక పద్ధతుల ద్వారా సుందరకాండలోని వర్ణనా వైచిత్రిని తెలియపరచడమే ఈ వ్యాసం ఉద్దేశ్యం.*

**Keywords:** కల్పవృక్షం, సుందరకాండ, విశ్వనాథ, వర్ణనలు, కపివరుండు, సీత, రాముడు, రాక్షసస్త్రీలు, చెంపసరాలు , ముంతకొప్పులు.

## 1. ఉపోద్ఘాతం:

కం. **ఈయమ తనువల్లి జగ**
**న్నాయక సాయక యస్సనాథ జ్యోత్స్న**
**ప్రాయముగ గానిపించెడు**
**నీయమ రఘు రాము భార్యయే యగు టొప్పున్** 1

సీత జాడ కోసం వెళ్లిన హనుమకు లంకలో కనించిన ఆ స్త్రీ మూర్తిని చూసి ఆమె రఘురాముడి భార్య జానకీ యే అని అనుకుంటున్న తీరు ఈ పద్యంలో కనిపిస్తుంది. రామాయణ కాండలన్నిటిలో కథాగతమైనపేరు లేకుండా ఉన్నది సుందరకాండ మాత్రమే. వియోగ వేదన నుండి సీతారాములకు ఊరట కలిగించిన కథాంశంతో ఉన్న సుందరకాండలో ప్రతీ అంశము సుందరమే అని వాల్మీకి ప్రశంసించారు. అంతే స్థాయిలో విశ్వనాథ వారు ఈ కాండను రసరమ్యంగా తీర్చిదిద్దారు. అటువంటి సుందరకాండలోని వర్ణన వైచిత్రి గమనిస్తే దీని నామ సార్థక్యం వెల్లడవుతుంది.

ప్రాచీన కాలం నుండి ఆధునిక కాలం వరకు రామాయణం, భారతం, భాగవతం, పురాణాలు, కావ్యాలు అనేకంగా తెలుగులోకి అనువదించబడడం జరుగుతూనే ఉంది. ఇవ్వన్నీ భారతదేశ సంస్కృతిని,సంప్రదాయాన్ని, మానవ మనుగడను, ఔన్నత్యాన్ని కాపాడడంలో వర్తమానులకు, భావితరాలకు ఉపయోగకరంగా ఉంటాయి కాబట్టి వాటిని రక్షించుకునే బాధ్యత అందరిది. నాటి నుండి నేటి వరకు ప్రజలకు ఆచరణాత్మకంగా, ఆదర్శప్రాయంగా, ధర్మోపదేశంగా నిలుస్తున్న రచనలన్నింటిలో శ్రేష్ఠమైనది, లౌకికసంస్కృత వాఙ్మయంలో వెలసిన ఆదికావ్యం, ధర్మాలన్నింటికీ ఆధారంగా నిలిచిన ఇతిహాస కావ్యం, మనిషి జీవితాన్ని సంస్కరింప చేసే కావ్యం వాల్మీకి రామాయణం. తర్వాత కాలంలో వాల్మీకి రామాయణం నుండి అనేక రామాయణ గ్రంథాలు తెలుగు భాషలోనే కాకుండా ఇతర భాషలలో కూడా వెలుగులోకి వచ్చాయి. ఉదాహరణకు మొల్ల రామాయణం, రంగనాథ రామాయణం, భాస్కర రామాయణం, ఆనంద రామాయణం మొదలైనవి. తమిళంలో కంబ రామాయణం, హిందీలో రామచరిత మానస్, ఇలా అనేక రామాయణాలతో సమానంగా నిలిచి జ్ఞానపీఠ పురస్కారం పొందిన తెలుగు రామాయణం కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ రాసిన '**శ్రీమద్రామాయణ కల్పవృక్షం**'.

కల్పవృక్షంలోని సుందరకాండలో లంకానగరిని విశ్వనాథ సత్యనారాయణ వర్ణించిన తీరును చూసినట్లయితే శ్రీరాముల సుగ్రీవుల ఆజ్ఞ మేరకు హనుమంతుడు సీతను వెతకడం కోసం లంకా నగరానికి వెళ్తాడు. లంకా నగరంలోని ఇంటింటికి వెళ్లి సీత జాడను తెలుసుకొనుటకు ప్రయత్నాలు చేస్తాడు. ఆ మార్గంలోని కుంభకర్ణ విభీషణుల భవనాలను కూడా చూస్తాడు. కుంభకర్ణ విభీషణుల మేడలో నుండి సన్నని మేళతాళములతో రాగముల గీతములు వినిపిస్తున్నాయి. అక్కడ జానకిదేవి లేదని తెలుసుకొని తిరిగి లంకా నగరంలోని రావనంతపురంలోనికి వెళ్తాడు.

## 2. కుంభకర్ణ, విభీషణుల భవనాలు:

వాల్మీకి రామాయణంలో హనుమంతుడు లంకా నగరంలో ఉన్న ప్రతి ఇంటిని వెతకడం, కుంభకర్ణుని విభీషణుల భవనాలల్లోకి వెళ్లి సీత జాడను తెలుసుకునే ప్రస్తావన కనిపించదు. కానీ విశ్వనాథ సత్యనారాయణ

లంకా నగరంలోని ఇండ్లను కుంభకర్ణుని విభీషణుల భవనాలను వర్ణించిన తీరు కల్లకు కట్టినట్టుగా ఉంటుంది. అక్కడి నుండి సీత జాడ కొరకు రావణ సౌదమునకు వచ్చి చూస్తాడు. అక్కడ రావణుడి భవనము స్వర్గాన్ని తలపించే విధంగా కనబడుతుంది.

**ఉ. అంబర చుంబి డంబర మహాశిఖరంబులతోడ రాజ చి**
**హ్నంబులు లేని రాజభవనం బన నున్నది మేరుపర్వతా**
**గ్రంబన హేమగోపుర శిఖా కమనీయ మహాంశురాజిచే**
**నంబుజవైరికాంతి నివహంబులతో నెకసక్కెమాడుచున్.2**

రావణగృహము భూమికి దిగివచ్చిన స్వర్గములా అనేక రత్నకాంతులతో ప్రకాశిస్తూ దేవతలచే రాక్షసులచే ప్రశంసించబడుతున్న భవనంలా, మేరు పర్వత శిఖరం బంగారు గోపురంతో మెరుస్తూ ఆకాశాన్ని తాకుతున్నాయా అన్నట్లుగా కనిపిస్తుంది.

## 3. రాక్షస స్త్రీల అలంకారాలు:

భవనం అంతా అనేక రకాల చెట్ల పూలతో వ్యాపించబడి పుప్పొడితో నిండిన కొండ లాగా ఉందని వర్ణిస్తూ, విశ్వనాథ సత్యనారాయణ గారు భవనంలో ఉన్న రాక్షస స్త్రీలను దేవతా స్త్రీలతో పోల్చి వర్ణించారు.

**చ. చివురుల తోపు చీరలును జెంపసరాలును ముంతకొప్పులున్**
**గవుసెనలైన నవ్వులును గమ్మలు కల్గిన దైత్యకామినల్**
**సవరన తెల్లసీరలును సన్నని చెక్కిళు లచ్చచూపులున్**
**గలిసిన దైన్యభావములు కర్ణములం జను వేల్పుటంగనల్3**

ఆధునిక సమాజానికి అద్దం పట్టినట్టుగా రాక్షస స్త్రీలు కూడా అలంకారాలకు తీసిపోరు అన్నట్టుగా చిగురాకుల రంగు వంటి చీరలు, చెంపసరాలు, ముంతకొప్పులు(కేశములతో చుట్టిన ముడులు) కప్పుల కమ్మలు కలిగిన రాక్షసులు స్త్రీలు, శరీర ఒయ్యారాలు కలిగిన చూపులతో ఉన్న ఆ రాక్షస స్త్రీలను చూస్తుంటే ఆ దేవతా స్త్రీలేనేమో అనిపిస్తుందట. దివిలో నుండి భువికి దిగివచ్చిన దేవకాంతల వలె ఆ దైత్యకాంతలు ఉన్నారని వర్ణించాడు కవి.

వాల్మీకి రామాయణంలో రావణ సౌధం యొక్క వర్ణన ఉంది కానీ రాక్షస స్త్రీల వర్ణన సుందరకాండలో లేదు. అలా ఒయ్యారాలు వెలుకబోస్తున్న స్త్రీలు ఒక్కసారిగా కనిపించకుండా పోయారని, ఇదేంటి ఇదంతా ఒక స్వప్నమా అని కపివరుడు ఆలోచించి చూస్తే తనకర్థమైన విషయం చతుర్విధ పురుషార్థాలలో ధర్మార్థకామమోక్షములు మానవులకు ఎంత ముఖ్యమో అని తెలియ పరచడం కొరకు రాక్షస స్త్రీలల్లో చూపెట్టాడు విశ్వనాథ సత్యనారాయణ.

**గీ. ప్రొద్దుపోయి నిదురపోవగా బురుషులు నతివ లసురరాజు నంతిపురము**
**పొలిచె గోపియైన భుజగరాజములోన బుస్స కొట్టుచున్న పుట్టవోలె4**

అలంకారులుగా ఉన్న ఆ రాక్షస స్త్రీలందరూ రావణ శయ్యమందిరంలో ఉన్నట్లు హనుమకు తెలిసిందట. ఇక్కడ

రావణుదుని రాత్రి వేళలో బుస కొడుతున్న పాముతో పోల్చి చెప్పాడు కవి.

## 4. అశోక వనం:

హనుమ సీత కొరకు ముందుకు వెళ్లడంతో అక్కడ బ్రహ్మ మానసంలో నుండి పుట్టిన బంగారు మేడ వలె తెల్లని శరీరం కలిగిన అందమైన కైలాస పర్వతం వలెనున్న బంగారముతో, మణులతో, వజ్రాలతో చేయించిన గవాక్షములు కలిగిన విమానం గురించి, అశోక వనంలో సీతను వెతుకుతున్న సమయంలో హనుమకు కనిపించిన తోటను గురించి కవి వర్ణించిన తీరు-

**గీ. ఎంత కోట కలదో యంత యున్నది తోట కోట యంత పొడుగు తోట**
**తోట యడ్డముగను కోట యంత వెడల్పు చిత్ర చిత్ర మైన చెట్ల తోడ5**

రావణుని కోట గోడలు ఎంత వరకు వ్యాపించి ఉన్నాయో అంత వరకు తోట ఉందని,అంతే కాకుండా తోట మధ్యలో కోట ఎంత ఉందో అంత వెడల్పు చిత్రములైన చెట్లు ఉన్నాయన్నాడు. తోట యొక్క వర్ణన ఇలా ఉంటే ఇందులో శబ్దాలంకారమైన వృత్యనుప్రాసను చెవులకింపుగా వాడారు.

## 5. అవాల్మీకాలు:

అశోకవనంలో శింశుపావృక్షం యొక్క ప్రస్తావన గురించి కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ రామాయణ కల్పవృక్షంలో అశోకవనంలోని శింశుపావృక్షం క్రింద సీత రాముని కొరకు ఎదురు చూస్తున్నట్లుగా ఉంటుంది. ఆనందరామాయణంలో

**సీ. విశ్రుత శింశుప వృక్షంబు గనుగొని యా వృక్ష మూలంబు నందు దైత్య**
**కాంతలు గొల్వగ గడు గృశ దేహయై యొక వేణి తోడు తనూర్చు లెసగ**
**మలిన వస్త్రము తోడ మహిపైన శయనించి రామ రామయటంచు రహి బలుకుచు6**

ఇందులో కూడా శింశుపావృక్షం కింద సీత కూర్చొని రామా రామా అంటూ ఉన్నట్లు తెలుస్తుంది. కానీ వాల్మీకి రామాయణంలో '**అశోకైః శోక నాశనైః**'7 అని అశోక వృక్షాల గురించి వాల్మీకి అశోక వృక్షములు శోక నాశనం చేస్తాయని అందుకే సీతను అశోక వృక్షవృక్షం క్రింద ఉన్నట్లు తెలుస్తుంది.

వాల్మీకి రామాయణంలో-

**శ్లో. సీతాం పద్మ పలా శాక్షీం మన్మథస్య రతిం యథా8**
**శ్లో. నిశ్వాస బహుళం భీరుం భుజగేంద్ర వధూమివ9**
**శ్లో.స్మృతీ మివ, సందిగ్ధామృద్ధిం నిపతితా మివ**
**విహతామివ చ శ్రద్ధా మాశాం ప్రతిహతామివ10**

అందంలో మన్మథుని భార్య రతిదేవిలా ఉందని, భయంతో కన్పించే సర్పరాజ కన్యవలె ఉందని, సందేహం కలిగించే స్మృతి వాక్యంలా, క్షీణించిన సంపద వలె, సడలినటువంటి శ్రద్ధ వలె, నిరోధించిన ఆశవలె సీత ఉన్నట్టు

తెలుస్తుంది. వాల్మీకి రామాయణం అనంతరం వచ్చిన భాగవతాన్ని అనుసరించి విశ్వనాథ సత్యనారాయణ భాగవతంలోని ఘట్టాలను ఆధారంగా చేసుకుని వాటిని సీతకు ఉపమానంగా పోల్చి చెప్పాడు.

సముద్రంలో అగ్ని దాగినట్లు, అరణి కొయ్యలతో నిప్పు దాగినట్లు సోమకాసురుడు వేదాలను సముద్రంలో పడేస్తే దీనవదనముతో సరస్వతీదేవి బాధపడ్డట్లుగా సీత ఉందనీ,

**గీ. చాపగాఁజుట్టి నిట్టబుజానఁ బెట్టి యల హిరణ్యాక్షుఁ డేగెడునపుడు వాని**
**వల్లకోఱ గీసుకపోయి పాలిపోయి క్రిందు మీదగు ధారుణీసుందరివలె.11**
**గీ. పరమదురహంక్రియాశిఖాభాసురుండు తానె సర్వేశ్వరురండనని తర్జనంబు**
**సలిపెడి హిరణ్యకశిపుని సభను సర్వ ప్రళయ భీతిని గను విష్ణుభక్తి వోలె12**
**గీ. ఆత్మ విజ్ఞాన విరహితమై వితరణ మాది లౌకిక సాదుగుణాళిమోక్ష**
**మన్న బలిరాజ్యమున స్థితి యవని కేవలము కృశీభూత యగు స్వర్గలక్ష్మివోలె13**
**గీ. తిన్నయింటి వాసంబుల నెన్నునట్టి కార్తవీర్యార్జునుని పరాక్రమమువలన**
**నావువోలె సంభాయని యఱచి యట్లె దిగులుపడిపోవు నాతిథ్యదేవతవలె14**

కూర్మావతారంలో భూమిని చాపవలె చుట్టి తీసుకుని వెళుతున్న హిరణ్యాక్షుని కొమ్ము గీసుకొని బాధపడిన ధరణి వలె లోకైక సుందరి సీత ఉందని, నరసింహావతారంలో హిరణ్యకశిపుడు పంచభూతాలను శాసించేవాడిని నేనే అనే దురహంకారముతో ప్రవర్తిస్తున్నపుడు, ఈ దురహంకారాన్ని అణిచివేయడానికి భగవంతుడు ఉన్నాడులే అని ప్రహ్లాదునికి విష్ణువుపై నమ్మకం ఉన్నట్లు సీతకు కూడా శ్రీరామచంద్రుని మీద భక్తి ఉన్నట్లు కవి వర్ణన.

వామనావతారంలో స్వర్గాధిపతి ఇంద్రుడైనప్పుడు స్వర్గంలో ఉండవలసిన లక్ష్మీదేవి సకల శోభలతో విలసిల్లుతూ ఉంటుంది. దానికి విరుద్ధంగా బలి చక్రవర్తి స్వర్గాధిపత్యాన్ని వహిస్తూ అందరినీ శాసిస్తూ పరిపాలన చేస్తున్న సమయంలో అక్కడ ఉండాల్సిన రాజ్యలక్ష్మి, స్వర్గ లక్ష్మి కృశించిపోయినట్లు సీతాదేవి ఉందని పోలిక.

తిన్నింటివాసాలను లెక్కపెట్టినట్టుగా జమదగ్ని తన దగ్గర ఉన్న కామధేనువు వల్ల కార్తవీర్యార్జునులకు తగిన ఆహార సదుపాయాలను ఏర్పాటు చేస్తే, ఆ కామధేనువునే కావాలని, అహంకారముతో దొంగిలించి తీసుకొని వెళితే ఆ కామధేనువు అంబా అని దీనంగా అరిచినట్టుగా సీతాదేవి రాముని కొరకు ఎదురు చూస్తుందని వర్ణన.
వేగంగా వస్తున్న వాయువుకు సముద్రం అలల ఊగిసలాడుతుందని, అందులోనున్న జలచరాలు ఒకదానికొకటి పోటీ పడి పొద్దుకు పడుతున్నపుడు ఆ సముద్రం యొక్క దైన్య స్థితి వలె జానకి దేవి కనబడుతుందని,

## 6. సీతా రాముల అన్యోన్యం:

**ఉ. ఆకృతి రామచంద్ర విరహాకృతి కన్పొమతీరు స్వామి చా**
**పాకృతి కన్నులన్ బ్రభుకృపాకృతి కైశికమందు రామదే**
**హాకృతి సర్వదేహమునయందున రాఘవ వంశమౌళి ధ**
**ర్మాకృతి కూరుచున్న విధమంతయుస్వామి ప్రతిజ్ఞ మూర్తి యై.15**

ఆకారం రామచంద్రుని వలె, కనుబొమలు శ్రీరాముని ధనస్సు వలె, కన్నులు రామచంద్రుని దయవలె,

సీతాదేవి కేశములముడి రామచంద్రుని దేహము వలె, దేహము సూర్య వంశానికి కిరీటం లాంటివాడైన ధర్మ ప్రభువు శ్రీ రామచంద్రుడివలె ఉందని, ఆ సీతా రాములు వేరు వేరు కాదు ఒకటేనని, ప్రస్తుత వివాహ వ్యవస్థలో భార్యాభర్తలు ఒకటేనని  చెప్పకనే చెప్పినట్లు ఉంది. అంతేకాకుండా రాముని కోసం ఎదురుచూస్తూ ఆశలు సన్నగిల్లిపోయి నల్లని మేఘములలో తెల్లని మెరుపు వలె ఎక్కడో చిన్న ఆశతో ఎదురుచూస్తున్నట్లుగా సీత ఉందని కవి వర్ణన ఉంటుంది.

## 7. ముగింపు:

తెలుగుదేశం ఆచారాలు సంతరింపులు ఇట్టి మధురిమలు భావనలు రామాయణ కల్పవృక్షంలో సమృద్ధిగా ఉన్నాయని కల్పవృక్ష రహస్యాలులో విశ్వనాథ తెలియజేశారు. ఆధునిక కవులలో విశ్వనాథకు తెలుగు ప్రాంతం పట్ల, తెలుగు జాతి పట్ల,  సంస్కృతి సంప్రదాయాల పట్ల, ఆచార వ్యవహారాల పట్ల అభిమానం అధికమైనదని తెలుపుటకు నిదర్శనమే! ఈ రామాయణ కల్పవృక్షం. వాల్మీకి వర్ణనలను మరువకుండా ఆధునిక సమాజానికి అద్దం పట్టినట్టుగా వాల్మీకి రామాయణంతో పాటు తర్వాత వచ్చిన కావ్యాలలోని సన్నివేశాలను ఘట్టాలను ఉదహరిస్తూ 'ఉపమా కాళిదాసః'  అన్నట్లు చాలా సందర్భాలలో అనేక ఉపమాలంకారాలను వాడుతూ కాళిదాసుతో సమానంగా నిలిచిన విశ్వనాథ సత్యనారాయణ వర్తమానులకు భవిష్యత్తు తరాల వారికి ఆదర్శనీయులై తాను రాసిన జ్ఞానపీఠ పురస్కార రచన శ్రీమద్రామాయణ కల్పవృక్షం ఆధునిక తెలుగు రామాయణాలకు కమనీయంగా ఆదర్శంగా ధీటుగా ఉంది. కావున భావి పరిశోధకులు విశ్వనాథ రామాయణంలోని అలంకారాలపైన, పాత్రచిత్రణ పైన  కూడా వ్యాసాలు రాయవచ్చు.

## 8. పాదసూచికలు:

1.కల్పవృక్షం- సుందర కాండ - పరరాత్ర ఖండము- 49
2.కల్పవృక్షం- సుందర కాండ - పూర్వరాత్ర ఖండము- 231
3.కల్పవృక్షం- సుందర కాండ - పూర్వరాత్ర ఖండము- 237
4.కల్పవృక్షం- సుందర కాండ - పూర్వరాత్ర ఖండము- 261
5.కల్పవృక్షం - సుందర కాండ- పరరాత్ర ఖండము- 4
6.ఆనంద రామాయణం-సారకాండం-1275
7.వాల్మీకి రామాయణం- సుందర కాండ-సర్గ 15-7
8.వాల్మీకి రామాయణం- సుందర కాండ-సర్గ 15-28
9.వాల్మీకి రామాయణం- సుందర కాండ-సర్గ 15-30
10.వాల్మీకి రామాయణం- సుందర కాండ-సర్గ 15-32

11.కల్పవృక్షం- సుందర కాండ- పరరాత్ర ఖండము-134

12.కల్పవృక్షం- సుందర కాండ- పరరాత్ర ఖండము- 135

13.కల్పవృక్షం- సుందర కాండ- పరరాత్ర ఖండము- 136

14.కల్పవృక్షం- సుందర కాండ- పరరాత్ర ఖండము- 137

15.కల్పవృక్షం- సుందర కాండ- పరరాత్ర ఖండము- 140

## 9. ఉపయుక్తగ్రంథసూచి:


1. రామచంద్రాచార్యులు, బుక్క పట్టణం. ఆనంద రామాయణం-పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం హైదరాబాద్, 2001.
2. విశ్వనాథ సత్యనారాయణ - శ్రీమద్రామాయణ కల్పవృక్షం-శ్రీవిశ్వనాథ పబ్లికేషన్స్ హైదరాబాద్, 2011.
3. విశ్వనాథ సత్యనారాయణ - కల్పవృక్ష రహస్యాలు-PS&కొ.గుంటూర్, 1976.
4. వేంకట శేషాచార్యులు, చలమచర్ల. శ్రీమద్రామాయణం సుందర కాండ- శ్రీజయలక్ష్మీ పబ్లికేషన్స్, హైదరాబాద్, 2015.
5. సుజాతారెడ్డి, ముదిగంటి. సంస్కృత సాహిత్య చరిత్ర- పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం, హైదరాబాద్, 2001.


***



AUCHITHYAM

ISSN: 2583-4797

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_39.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 39. రంగనాథ రామాయణయుద్ధకాండ: వర్ణనలు

**ఆది ఆంధ్ర రామాంజనేయులు**

పరిశోధక విద్యార్థి, తెలుగుశాఖ,

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం,

అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్.

సెల్: +91 9989399439. Email: adiandhraramanjaneyulu05@gmail.com

**వ్యాససంగ్రహం:**

*వాస్తవానికి వాల్మీకి రామాయణము పాఠ్యగేయేచ మధురమ్ అని కీర్తించబడింది. అనగా చదువుకోవడానికి, పాడుకోవడానికి వీలుగా రామాయణము రచించబడింది. ఇక తెలుగు విషయానికి వస్తే ద్విపద ఛందస్సు పాడుకోవడానికి, చదువుకోవడానికి అనువైన ఛందస్సు. అందువల్ల గోనబుద్ధారెడ్డి ద్విపదలో రామాయణాన్ని రచించి ఉంటాడు. పైగా పామరులకు సైతం అర్థమయ్యే భాషలో రచించినప్పుడే ఆ రచన అనునది అందరికీ చేరువవుతుంది. అది కవి యొక్క అసలైన విజయం. కఠినమైన చిత్ర, గర్భ కవిత్వంలో జటిలమైన శైలిలో పద్యాలను అల్లి పండితుల చేత పొగడబడడం కంటే, సాధారణ ప్రజలకు అర్థమయ్యే రీతిలో సాహిత్యాన్ని అందించి వారిని సంస్కరించడం ఎంతో ఉత్తమమైన కార్యం. ఇందులో గోనబుద్ధారెడ్డి సఫలుడయ్యాడు. ఆధునిక కాలంలో విశ్వనాథ సత్యనారాయణ రచించిన రామాయణ కల్పవృక్షము పరమోత్కృష్టమైనది. అంతకు ఏమాత్రం తీసిపోని రచన గోనబుద్ధారెడ్డిది. భావి కథా సూచనకు సంబంధించిన వర్ణనలు చేయడం, తాత్వికపరమైన వర్ణనలు చేయడం, ఔచిత్యాన్ని పోషించే విధంగా కల్పనలు చేయడంలో గోనబుద్ధారెడ్డి సిద్ధహస్తుడని రంగనాథ రామాయణాన్ని అధ్యయనం చేస్తే తెలుస్తుంది. పై విషయాన్ని రూఢము చేయడానికి గ్రాంథిక విమర్శ, అలంకారిక విమర్శ, కళా విమర్శలను ఆలంబనగా చేసుకుని రంగనాథ రామాయణం యుద్ధకాండలో ప్రకృతి, భావికథాసూచన, ప్రతీకాత్మక వర్ణనలను వ్యాసాన్ని కూర్చదలచాను.*

**Keywords:** రంగనాథ రామాయణం, యుద్ధకాండ, ప్రకృతి వర్ణనలు, ప్రతీకాత్మక వర్ణనలు, భావికథాసూచన వర్ణనలు, అసుర సంహార యజ్ఞం.

## 1. ఉపోద్ఘాతం:

తెలుగులో వచ్చిన రామాయణాలలో రంగనాథ రామాయణం అతి ప్రాచీనమైనది. మొదటిది. రంగనాథ రామాయణం తెలుగులో బహుళ ప్రసిద్ధి పొందిన బృహత్కావ్యం. ఇది ప్రజలు పాడుకోవడానికి కూడా వీలుగా దేశీ

ఛందంలో రాయడం జరిగింది. ఈ రామాయణం ద్విపద కావ్యం పదకొండు వేల ద్విపదలు కలిగిన మహాకావ్యం. తన తండ్రి అయిన విట్టల రంగనాథుని కోరిక మేరకు గోనబుద్ధారెడ్డి ద్విపదలో రామాయణాన్ని రచించాడు. ఈయన పూర్వరామాయణం (బాల - యుద్ధకాండలు) వ్రాయగా, ఉత్తర రామాయణ భాగాన్ని బుద్ధయ కుమారులు కాచవిభుడు, విఠలనాథుడు (సోదర జంట కవులు) రచించినట్లుగా కావ్యం అక్షర సాక్షమిస్తుంది. దీనిని అనుసరించి రంగనాథ రామాయణ కర్తలు గోనబుద్ధారెడ్డి, కాచవిభుడు మరియు విఠలనాథుడు.

ముందు చెప్పుకున్నట్లుగానే వాల్మీకి రామాయణము చదువుకోవడానికి, పాడుకోవడానికి వీలుగా పాఠ్యగేయేచ మధురముగా రచించబడింది. ఆ బాటలోనే రంగనాథ రామాయణం సాగింది. ఇక వాల్మీకి రామాయణము ఆదికావ్యము, అందులో లేని వర్ణనలు లేవు. అట్టి రామాయణ కావ్యాన్ని గోన బుద్ధారెడ్డి తెలుగున అనువదిస్తూ తనదైన శైలిలో ప్రకృతి వర్ణనలు, నగర వర్ణనలు, పాత్ర వర్ణనలు, ఆగమ వర్ణనలు, ఇతర వర్ణనలు (బావికథాసూచన, తాత్వికసంబంధవర్ణనలు) చేస్తాడు. నా సిద్ధాంత గ్రంథ పరిశోధనాంశం రంగనాథ రామాయణం, కంబ రామాయణం యుద్ధకాండల తులనాత్మక పరిశీలన కావున నేను కేవలం రంగనాథ రామాయణం యుద్ధకాండలోని వర్ణనలను తీసుకుని వ్యాసం నిడివిని దృష్టిలో ఉంచుకుని ప్రకృతి, భావికథాసూచన, ప్రతీకాత్మక వర్ణనలను వివరించదలాచాను.

## 1. ప్రకృతి వర్ణనలు:

### చంద్రోదయ వర్ణన:

లక్ష్మణ సమీతుడైన రామచంద్రుడు, వానర సేనలతో మహేంద్ర పర్వతము దాటి సముద్రతీరము చేరిన సందర్భంలో చేసిన చంద్రోదయ వర్ణన-

**దివినాథకులదేవి దెచ్చి మోదించు-ధనుజనాథుని మోమ్ముదమ్ములు విరియు**
**నని నగియెడి మాడ్కి నప్పుడందర-తనువొందగా గుముదంబులు విరిసె**
**- (రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - ద్విపద - 179-180)**

సూర్యవంశ ప్రభువైన శ్రీ రాముని భార్యను తాను తెచ్చినందుకు సంతోషించే రావణుని ముఖాలనే కమలాలు రాలిపోతాయని నవ్వే విధంగా కలువలు వికసించాయి. గోనబుద్ధారెడ్డి పరోక్షంగా చేసిన చంద్రోదయ వర్ణన ఇది. దీనిని పరిశీలిస్తే కమలాలు సూర్యుని కిరణాల చేత వికసిస్తాయి, సూర్యాస్తమయం తరువాత అవి రాలిపోతాయి. కలువలు చంద్రుని వెన్నల చేత వికసిస్తాయి. ఇక్కడ కమలాలు రాలిపోయాయి, కలువలు వికసించాయనగా చంద్రోదయమైనదని అర్థమవుతుంది.

**రాజునై యేను వారాశి యుబ్బింతు-రాజవై నీవు వారాశి యింకింప**
**దలచుట పాడియే ధరణీశవర్య-విలసితసత్కళాన్వితుడగు నీవు**

**నటు చేసితేని దోషాకరత్వంబు-చటువృత్తి నీయందు బ్రభవించు నంచు**
**దూఱ వచ్చినమాడ్కి దోచె జందురుడు....... (రంగ. రా. యుద్ధ. ద్విపద. 188-191)**

రామా! రాజునై (చంద్రుడు) నేను సముద్రాన్ని ఉబ్బేటట్లు చేస్తాను. నీవు రాజువై (ప్రభువు) కూడా సముద్రాన్ని ఇంకించటానికి ఆలోచించడం ధర్మమేనా? సకల గుణాలు కలిగిన నీవు ఇలా చేస్తే నీకు దోషం అంటదా? అని నిందించడానికి వచ్చిన వాడి లాగా చంద్రుడు కనిపించాడు. అతని అతిశయమైన కిరణాలు ఆకాశంలో వ్యాపించాయి. ఇక్కడ రాజ శబ్దాన్ని చంద్రుడు, ప్రభువు అనే భిన్నమైన అర్థాలలో ప్రయోగించి గోనబుద్ధారెడ్డి చేసిన మనోహర వర్ణన ఇది. చంద్రుడు నీటిని, నదులను, సముద్రాన్ని నియంత్రించేవాడు. అట్టి చంద్రుని వల్లనే సముద్రంలో ఆటుపోట్లు కూడా సంభవిస్తాయి. అలాంటి చంద్రుడు (రాజు) సముద్రములోని అలలను ఉప్పొంగేలా చేస్తాడు. అనగా సముద్రాన్ని ఉబ్బేలాగా చేస్తాడు. ఇక రాజైన (ప్రభువు) నీవు (రాముడు), లంకను చేరడానికి సముద్రం అడ్డంగా ఉన్నదని దానిని ఇంకింప చేయడానికి ఆలోచించడం ధర్మమేనా? అని రాముని నిందించడానికి వచ్చినవాడిలా చంద్రుడు కనిపించాడు. అతని అతిశయమైన కిరణాలు ఆకాశంలో వ్యాపించాయి. పై వర్ణనలను పట్టి చూస్తే అనగా చంద్రుని కిరణాలు ఆకాశంలో వ్యాపించడం, సముద్రంలో ఆటుపోట్లు పెరగడం అనేవి ఈ చంద్రోదయ వర్ణనలో చంద్రుడు పూర్ణచంద్రుడు అని చెప్పకనే చెబుతున్నాయి.

**జనకజకై రామజననాథతిలక-నను దలదాల్చి మన్నన జేసినట్టి**
**హరునువిల్లువిఱచిన యాదోషమునకు-విరహి వైతివి సీతవెఱపున ననుచు**
**జందురు డట్టహాసము చేసె ననగ-నందంద జంద్రిక లతిశయ మొందె**
**శరనిధి నురువను చందనంబర్థి-గరమొప్పె వీచికాగణముల గల్పి**
**కరముల పుచ్చి దిక్కాంతలమేన-బొరిపొరి యారాజు పూసెనో యనగ**
**దలకొని మఱియును దట్టనై పరి-వెలయంగ వెచ్చని వెన్నెల యొప్పె (రంగ. రా. యుద్ధ. ద్విపద 192-197)**

ఓ రామజన నాథతిలకా! సీత కోసం నన్ను తలదాల్చిన శివుని విల్లు విరిచావు. ఆ దోషం వల్లనే సీత విషయంలో విరహివి అయ్యావు. అంటూ చంద్రుడు అట్టహాసం చేశాడేమో అన్నట్లు అతి దట్టంగా వెచ్చని వెన్నెల ఒప్పింది. చంద్రున్ని శివుడు తన తల పైన ధరించాడు. అందువల్ల అతన్ని చంద్రశేఖరుడు అని కూడా పిలుస్తారు. అలా చంద్రునికి శివునికి మధ్య అవినాభావ సంబంధము ఉన్నది. అలాంటి శివుని విల్లును విరవడం అనేది చంద్రునికి నచ్చక, సీతా వియోగంలో నున్న రామభద్రుని చూసి అట్టహాసం చేసినట్టుగా, అలా చేయడం వల్లనే దట్టమైనటువంటి వెన్నెల ఏర్పడిందని గోన బుద్ధారెడ్డి వర్ణించాడు. ఇక్కడ గమనించాల్సిన విషయం వెచ్చనివెన్నెల అనే పదప్రయోగం. సాధారణంగా చల్లని వెన్నెల ఉంటుంది కానీ వెచ్చని వెన్నెల ఉండదు. బహుశా శ్రీరామచంద్రుని విరహము ప్రతిధ్వనించాలనే ఉద్దేశంతో గోన బుద్ధారెడ్డి చల్లని అనే పదానికి బదులుగా వెచ్చని అనే పదాన్ని ప్రయోగించి ఉంటాడు.

**ఉషోదయ వర్ణన :**

లక్ష్మణ సమేతుడైన రామచంద్రుడు, వానర సేనలతో మహేంద్ర పర్వతము దాటి సముద్రతీరము చేరి రాత్రి విశ్రమించిన తరువాత ఏర్పడిన ఉషోదయాన్ని గోనబుద్ధారెడ్డి వర్ణించిన తీరు.

**జలనిధి రాఘవేశ్వరుడేయునపుడు-బలుశిలీముఖములు బడుదునో యనుచు**
**కడువేగ తొలగి యాకంపంబు నొంది-బడబాగ్ని యుదయాద్రి బ్రాకెనో యనగ**
**రాముబాణాగ్ని వారాశి దహించు-చో మిన్నుముట్టి యర్చులు పర్వె ననుచు**
**వెఱచి తొలంగిన విధమున గ్రుంకె-నెఱసినచుక్కలన్నియు దోడుతోడ**
**విదియేల దడసెద? వీయబ్ధిగట్టి-వదలక చంపు రావణు రాఘవేంద్ర**
**యని మనుమనికిదోడైరేపకడకు-జనుదెంచెననగభాస్కరుడుదయించె- (రంగ.రా.యుద్ధ.ద్విపద 216-220)**

రాఘవుడు సముద్రము మీద బాణాలు వేసేటప్పుడు ఆ బాణాల దెబ్బలు తింటానేమో అని ఆకంపము పొంది బడబాగ్ని (సముద్రంలో ఉండే అగ్ని) సముద్రములో నుండి ఉదయాద్రికి ప్రాకిందేమో అన్నట్లు తూర్పు ఎర్రనైంది. రాముని బాణం సముద్రాన్ని దహించేటప్పుడు ఆకాశమంటి ఆ బాణజ్వాలలు వ్యాపించాయో అని భావించి, భయపడి తొలగిపోయినట్లు ఆకాశంలో వ్యాపించిన చుక్కలన్ని కృంకిపోయాయి. రామా! ఇంకా ఆలస్యం ఎందుకు చేస్తావు? ఈ సముద్రాన్ని బంధించి రావణున్ని వదలకుండా చంపు అని తన మనుమనికి (సూర్యవంశంలో రామచంద్రుడు ప్రభవించిన కారణము చేత సూర్యునికి రాముడు మనమడు అవుతాడు అని అర్థము) తోడుగా వచ్చినట్లు సూర్యుడు ఉదయాన్నే ఉదయించాడు.

గోనబుద్ధారెడ్డి ఈ ఉషోదయ వర్ణనలో సూర్యోదయమనే ఉపమేయాన్ని శ్రీరామచంద్రుని ధనుర్విద్యా నైపుణ్యము అనే ఉపమానముతో అత్యద్భుతంగా ఆవిష్కరించాడు. పైగా ఈ వర్ణనలో సూర్యునికి, సూర్యవంశతిలకుడైన శ్రీరామునికి మధ్య ఉన్న బాంధవ్యాన్ని కూడా చక్కగా ఆవిష్కరించాడు.

ఇక-

**గమలాప్తకులుని రాఘవుని సద్విజయ-కమలయు దద్రాజ్యకమలయుగీర్తి**
**కమలయునని మేలుకనినచందమున-గమలంబు లెల్ల నొక్కట మేలు కనియె.**
**(రంగ.రా. యుద్ధ.ద్విపద. 222-223)**

కమలాప్తకులుడైన (కమలములకు ఆప్తుడు సూర్యుడు, ఆ సూర్యుని కులములో/వంశములో జన్మించినవాడు రాముడు) రాఘవుని సద్విజయకమల (విజయలక్ష్మి), రావణుని రాజ్య కమల (రాజ్యలక్ష్మి), కీర్తి కమల (కీర్తి లక్ష్మి) చేరే మేలుకాలం చూద్దామన్నట్లు కమలాలన్నీ ఒక్కసారే మేల్కొన్నాయనే ఈ వర్ణనలో కమల అనే పదాన్ని భిన్న అర్థాలలో ప్రయోగిస్తూ శబ్ద వైచిత్రిని పాటించి తన కవితా చమత్కృతిని ప్రదర్శించాడు గోనబుద్ధారెడ్డి. ఇక్కడ రాముని విజయలక్ష్మి రావణుని రాజ్యలక్ష్మి, కీర్తి లక్ష్మిను చేరబోతున్నదంటే, రావణుని రాజ్యము, కీర్తి రాముని విజయము వల్ల హరించబడబోతున్నదనే భావి కథ సూచన కూడా చేశాడు.

**చంద్రోదయ వర్ణన :**

**రామసేతువు నిర్మిస్తున్న సమయంలో గోనబుద్ధారెడ్డి చేసిన చంద్రోదయ వర్ణన**

**గృతకృత్యుడగు రాముకీర్తిపుష్పములు-చతురతమై వెదచల్లినయట్లు**
**కరమొప్పజుక్కలు గాన్పించెనంత-ఙిరకాలముల సీమ శిశువులమామ**
**పొలుపొందు కలువల పోరానివిందు-కలసిన జక్కవకన బాపుమందు**
**పాలవెల్లిని ద్రచ్చి పడసిన వెన్న-శూలి యౌదలపూవు చుక్కలనవ్వు**
**నెరిచకోరములకు నెలనెలపంట-యురువేది విరహులనుడికించుమంట**
**గగనంబుతొడవు దొంగలగుండెదిగులు-నొగి నబ్ధి బొంకించు నూరటపట్టి**
**హరిహరబ్రహ్మల యానందదృష్టి-సరసిజరిపుడైన చంద్రుడుపొడిచె**-(రంగ.రా.యుద్ధ.ద్విపద 1014-1020)

కృతకృత్యుడైన రాముని కీర్తి పుష్పాలను చతురతతో వెదజల్లినట్లు అందంగా చుక్కలు కనిపించాయి. అప్పుడు చిరకాల సీమ, శిశువుల మామ, సుందరమైన కలువల పోరాని విందు, కలసిన జక్కవ పిట్టలను దూరం చేసే మందు, పాల సముద్రాన్ని మధించి సంపాదించిన వెన్న, శూలి తలపువ్వు, చుక్కల నవ్వు, చకోరాలకు నెల నెల పంట, విరహులను ఉడికించే మంట, ఆకాశానికి ఆభరణం, దొంగల గుండె దిగులు, సముద్రాన్ని పొంగించే ఊరట పట్టి, హరిహర బ్రహ్మల ఆనంద సృష్టి, పద్మ శత్రువైన చంద్రుడు ఉదయించాడు. పాలసముద్రం అతిశయించి వెల్లి విరిసిందా అన్నట్లు వెన్నెల వ్యాపించింది.

పై వర్ణనలో చంద్రుని భిన్నమైనటువంటి పేర్లతో గోనబుద్ధారెడ్డి ఉటంకించాడు. శూలి తలపువ్వు అనగా శూలి అంటే శివుడు, శివుని తలలో ఉన్న పువ్వు చంద్రుడు అని అర్థం. ఆకాశానికి ఆభరణము కూడా చంద్రుడే! ఇలా ప్రతి ఒక్క మాటలో చంద్రుని యొక్క స్వరూప స్వభావాన్ని ముగ్ధ మనోహరంగా ఆవిష్కరించాడు.

## 2. భావి కథా సూచనకు సంబంధించిన వర్ణనలు:

భవిష్యత్తులో ఇలా జరగబోతుంది అని ముందుగానే ఒక సంఘటన ద్వారా పరోక్షంగా పాఠకులకు సందేశం ఇచ్చినా లేదా పాత్ర చేత చెప్పించినా అది భావికథా సూచన అవుతుంది. రంగనాథ రామాయణములోని యుద్ధకాండలో ఇట్టి వర్ణనలు కలవు.

**రాముని చేత రావణుని అంతమని చెప్పే భావి కథా సూచనకు సంబంధించిన వర్ణన :**

లంకను చేరడానికి వానరవీరులంతా రాముని సారథ్యంలో కదలారు. అప్పుడు వారు నదులు, కొండలు దాటుతూ ఉత్సాహంగా కదులుతున్నప్పుడు-

**నప్పుడు కపివీరులయ్యయియెడల-నొప్పెడుకొలకుల నురవడి జొచ్చి**
**యానిర్మలపునీరు లారంగ గ్రోలి-యానందమును బొంది యందంద గదిసి**
**కమనీయమృదుకరకమలయుగ్మముల-గమలము ల్దుంతురు కమలంగ బట్టి**
**కమలాకరంబుల గమలాప్తకులుడు-కమలారియును బోలికమలముల్ నొంచు**
**గ్రమ మొప్పగా దశకంధరువదన-కమలంబు లని తెల్పుకరణి జెలంగి**

**దొగలు వెట్టింతుము దుష్టారిసతుల-తొగలు జానకి యింక దొలగంగ వైచు**
**- (రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - ద్విపద -135-140)**

వానర వీరులు ఆయాచోట్ల ఒప్పిదంగా ఉన్న కొలనుల్లో తొందర తొందరగా దిగి ఆ నిర్మలపు నీరు తనివి తీరా త్రాగి ఆనందం పొందారు. తమ కమనీయమైన కరపద్మాలతో ఆ కొలనులలోని కమలాలను విలాసంగా త్రుంచారు. ఇదెలా ఉందంటే ఓ సరస్సులారా! సూర్యవంశీయుడైన రామచంద్రుడు చంద్రుని లాగా కమలాల నొప్పిస్తాడు. ఇలాగే క్రమమొప్పగా రావణుని ముఖకమలాలను కూడా త్రుంచుతాడు. అన్నట్లు వానరులు కమలాలను త్రుంచారు. సూర్యవంశంలో జన్మించిన చంద్రుని వంటివాడు రామచంద్రుడు. చంద్రుడు ఏ విధంగానైతే కమలాలను నొప్పిస్తాడో, అలాగే క్రమంగా రాముడనే చంద్రుడు, రావణుని ముఖాలు అనే కమలాలను త్రుంచుతాడు అని గోనబుద్ధారెడ్డి భావి కథా సూచన చేశాడు.

**విభీషణుని హెచ్చరికలో భావి కథాసూచనకు సంబంధించిన వర్ణన :**

విభీషణుడు రావణునికి నీతులు చెబుతున్న సమయంలో-

**వాతూలసుతుచేత వనము చెడ్డట్లు-సీతచే లంకయు జెడగల దింక**
**వచ్చెద రగచరు ల్వారిధి దాటి-వచ్చి యీరాక్షసవనితల నెల్ల**
**మోడ్చినకరముల ముందల ల్పట్టి-యీడ్చెద రటువలె వీడ్వకమున్నె**
**యొప్పింపు మాసీత నుర్వీశ్వరునకు-దప్పక చెప్పితి దానవాధీశ!**
**మండెడి నగ్నులమాడ్కి రాఘవుని-చండిబాణంబు రుద్దండత వచ్చి**
**నీఱొమ్ము కొనికాడ వేర్తునె చూడ-నీరాజ్యగతి చూడ నేర్తుగా కేను**
**ప్రళయావిలము ఘనపర్వత శిఖర-ములు ద్రోచుపగిది రాముడు భండనమున**
**వీతల లందంద నేలపై గూల్ప-నేర్చును వీక్షింప నిర్జరారాతి**
**- (రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - ద్విపద - 522-529)**

హనుమంతుని చేత వనము చెడిపోయినట్లు, ఇక సీత చేత లంక చెడగలదు. సముద్రం దాటి వానరులు వస్తారు. వచ్చి ఈ రాక్షస స్త్రీలందరినీ పట్టి ఈడుస్తారు. అలా ఈడ్చకముందే సీతను రామునికి అప్పజెప్పు. దానవాధీశా! నిజంగా చెప్తున్నాను. మండే అగ్నుల లాగా రాఘవుని బలమైన బాణాలు ఉద్ధండతతో వచ్చి నీ రొమ్మును చీలుస్తుండగా నేను చూడగలనా? ఈ రాజ్య గతి చూడగలను కానీ! ప్రళయ కాలంలోని వాయువు ఘన పర్వత శిఖరాలను త్రోసివేసినట్లు రాముడు యుద్ధంలో నీ తలలు అప్పటికప్పుడే నేలపై కూలుస్తుంటే నేనెలా చూడగలను. పైన వర్ణించినట్లుగానే మండోదరి కొప్పు పట్టి ఈడుస్తాడు అంగదుడు.

**అసుర సంహార యజ్ఞం:**

రావణుడు తన వద్ద నున్న చారనుడైన శుకున్ని సుగ్రీవుని వద్దకు పంపి, అతనితో స్నేహమేర్పడేటట్లు పలికి, అతనితో మనకు పగలేని సంగతిని తెలిపి అతని యుద్ధము నుండి మరలించి, తిరిగిరా అని ఆజ్ఞాపిస్తాడు. ఆ

తరువాత శుకుడు సుగ్రీవునితో మాట్లాడటం, అతని ప్రస్తావని సుగ్రీవునికి నచ్చక అతని రెక్కలు తెగగొట్టి, ముక్కు చెవులు కోయగా ఇంతలో రాముడు కలగజేసుకుని దూతలు ఎంత బాధలు పెట్టరాదని ధర్మాన్ని ఉపదేశించి అతన్ని వదిలిపెడతాడు. రాఘవుని ఆజ్ఞకు భయపడిన వానరులు అతన్ని విడిచిపెట్టగా, అతను ఆకాశ వీధికి ఎగసి సుగ్రీవునితో ఇలా అడిగాడు. కపిరాజా! రావణునితో ఏమని చెప్పేది? దానికి సుగ్రీవుడు కోపించి, బదులిస్తున్న సందర్భంలో

**పటుకార్ముకంబె యూపంబుగా నిలిపి-చటులాస్త్రములు వరిస్తరణము లేసి**
**పరగ గెంధూళ్ళను బ్రభలుగా జేసి-తరుచరస్రుక్స్రువతతులు చేపట్టి**
**సమరభూవేదికాస్థలమున నిలిచి-యమరుల కెల్ల బ్రియం బెక్కుచుండ**
**గరమొప్ప వీరాంకముల బెల్లుబ్బి-తొరగుచు నున్న నెత్తురు నెయ్యి వోసి**
**మహితగుణధ్వనుల్ మంత్రముల్గాగ-బహురాక్షసశ్రేణి పశుకోటి గాగ**
**దనరిన విరహనాదంబుపేర్మి-యనిమిషావలికి నాహ్వానంబు గాగ**
**విడువని కాహళ వితతులమ్రోత-కడునింపుగా సామగానంబు గాగ**
**ఘనమైన రామలక్షణులుకోపంబు-మునుకొని నాకోపమును నుండుచుండ**
**ననుపనాగ్నుత్రయంబై యుండ నందు-దనదుప్రాణముల నత్తఱి నాహుతులుగ**
**రణమున దనవీరరస మడంచుటయు-బ్రణుతింపగా సోమపానంబు గాగ**
**బ్రకటరాక్షసవీరపశుపలలముల-సకలభూత వ్రాత సంతృప్తు లెసగ**
**విడువక సంగ్రామ విపులయజ్ఞంబు-గడునొప్ప జేయు రాఘవసోమయాజి**
**- (రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - ద్విపద - 806-817)**

రామచంద్రునికి ద్రోహి అయిన రావణుని సహించనని చెప్పు, ఏ లోకంలో ప్రవేశించినా చంపుతాను కానీ వదలను అని చెప్పు. బలమైన ధనుస్సునే యూపస్తంభంగా (యజ్ఞ పశువును కట్టి వేయడానికి పాతిన స్తంభం) నిలుపుతాను. తీవ్ర అస్త్రాలను పరిస్తరణాలు (అగ్ని చుట్టూ పరిచిన దర్భలు) చేస్తాను. ఎర్రధూళులను అగ్ని కాంతులుగా చేస్తాను. వానరులు స్రుక్స్రువతతులను (హోమ సాధనమైన నేతి గరిటెలు) చేపడతారు. సమరాంగణమే యజ్ఞ వేదికగా నిలిచి, దేవతలకందరికి సంతోషము కలుగుతూ ఉండగా వీరుల శరీరాల నుండి ఉవ్వెత్తున ఎగిసిపడి స్రవిస్తూ ఉండే నెత్తురు నెయ్యిగా పోస్తాను. మహితమైన (పూజనీయమైన) అల్లెత్రాటి ధ్వనులు మంత్రాలు అవుతాయి. అసంఖ్యాకమైన రాక్షసశ్రేణి యజ్ఞ పశువులు అవుతారు. రాక్షస స్త్రీల విరహనాదాల అతిశయం దేవతలకు ఆహ్వానం అవుతుంది. కాహళల మ్రోత (రణములో ఉపయోగించు వాద్యవిశేషము) మిక్కిలి శ్రావ్యంగా సామగానం అవుతుంది. ఘనమైన రామలక్ష్మణుల కోపం, నా కోపం అనుపమానమై అగ్నిత్రయమై మండుతూ ఉంటుంది. రావణుని ప్రాణాలను ఆహుతులుగా (హోమద్రవ్యాలు) చేస్తాము. యుద్ధంలో అతని వీరరసాన్ని అనచడమే సోమపానం (యజ్ఞంలో సోమరసం అనే పానీయం తాగడం) అవుతుంది. ప్రసిద్ధరాక్షసవీరులనే యజ్ఞపశువుల మాంసాలతో సకల భూత సమూహాలు సంతృప్తులయ్యేటట్లు సంగ్రామమనే మహా యజ్ఞాన్ని రాఘవసోమయాజి (సోమయజ్ఞము చేసినవాడు) ఎంతో ఒప్పిదంగా చేస్తాడు. అలా జరగకముందే సీతను తెచ్చి ఇక్కడ రామునికి ఇచ్చి బుద్ధిగాబ్రతకడం మంచిది అని సుగ్రీవుడు శుకునితో అన్నాడు. చారుడైన శుకుడు వేగంగా

లంకకు తిరుగు ప్రయాణం అయ్యాడు. రంగనాథ రామాయణం యుద్ధకాండకు ప్రాణం పోసిన వర్ణన ఇది. సాధారణంగా ఇతిహాసాలను విష్ణుయజ్ఞ ప్రతిపాదకంగా దర్శించి ముక్తిని పొందవచ్చని ఐతిహాసికుల అభిప్రాయం. ఈ రావణ సంహారాన్ని ఒక మహాయజ్ఞముతో పోల్చుతూ గోనబుద్ధారెడ్డి చేసిన ఈ వర్ణన అపురూపమైనది.

## 3. ప్రతీకాత్మకతకు సంబంధించిన వర్ణన :

**రాముని సూర్యునిగా చూపడం (సాయంకాలాది రాత్రి వర్ణన) :**

**"........................................బ్రొద్దు గ్రుంకిన గాని పోడు రాఘవుడు**
**ఎప్పుడు గ్రుంకునో యిను డింక ననుచు-నప్పటప్పటికి బెట్టదరుచు నుండ**
**నంచితకఠినపుంఖాస్త్రాంశుతతుల-ముంచి రావణుని తమోగుణం బణప**
**భీమప్రతాపసస్ఫీతుడైయున్న-రాముడే చాలు దుర్వారుడన్మాడ్కి**
**ఘనతరంబగు తనకరములు ముడిచి-చనజాప్తు డపరదిగ్వనధిలో మునిగె"**
**- (రంగనాథ రామాయణము - యుద్ధ కాండము - ద్విపద - 2341-2345)**

లంకలో తొలిరోజు యుద్ధము ముగిసిన తరువాత, లంకలో రాక్షసులు ఒప్పొంగే శోకసముద్రంలో మునిగి పట్టుదలగా చేసే ఆ యుద్ధంలో ప్రొద్దు క్రుంకితే తప్ప రాముడు శిబిరానికి పోడు, ఎప్పుడు సూర్యుడు క్రుంకుతాడో అని మాటిమాటికి సూర్యుని వంక చూస్తూ ఉన్నారు. రావణుని తమోగుణం అణచివేయడానికి భీమ ప్రతాపంతో విరాజల్లుతున్న దుర్వారుడైన రాముని మిక్కిలి ప్రకాశంతో వెలువడే కఠోరమైన రామబాణాలు చాలన్నట్టు ఘనతరమైన తన కిరణాలు ముడుచుకుని సూర్యుడు పడమటి సముద్రంలో మునిగిపోయాడు.

గోనబుద్ధారెడ్డి అసమాన వర్ణన చాతుర్యానికి ప్రత్యక్ష నిదర్శనం ఈ వర్ణన. పై వర్ణనలో ఏకకాలంలో శ్రీరామచంద్రుని పరాక్రమాన్ని, సూర్యాస్తమయాన్ని చక్కగా వర్ణించాడు. అంతేకాక రావణునిలోని తమోగుణాన్ని అనగా రావణుని అజ్ఞానాన్ని, ఆకాశంలోని తమస్సుతో అనగా ఆకాశంలోని చీకటితో వర్ణించాడు. ఇక సూర్య కిరణాలను రాముని బాణాలతో వర్ణించి రాముని పరాక్రమాన్ని కూడా ఇదే వర్ణనలో చూపించాడు.

## 4. ముగింపు:

రంగనాథ రామాయణంలో గోనబుద్ధారెడ్డి ప్రకృతి వర్ణనలల్లో భాగంగా చంద్రోదయ వర్ణన, ఉషోదయ వర్ణన చేస్తూ శబ్ద చమత్కృతిని పాటిస్తూ అత్యంత కమనీయంగా వర్ణనలను తీర్చిదిద్దాడు. ఈ సమయంలో కమలాలు, తామరలు, చంద్రుడు, సూర్యుడనే వాటిని ప్రాతిపాదికగా తీసుకుని వాటిని విస్తృతార్థాలతో అన్వయపరుస్తూ కొన్ని భావి కథా సూచనలు కూడా చేశాడు. ఈ ప్రకృతి వర్ణనలలో శ్రీరామచంద్రుని విరహ వర్ణన చేయడం విశేషంగా కనిపిస్తుంది. కానీ యుద్ధకాండలో సందర్భోచితంగా ప్రకృతి వర్ణనలు చేయడంలో గోనబుద్ధారెడ్డి ప్రతిభ అసమామాన్యమనే ఇక భావి కథా సూచనకు సంబంధించిన వర్ణనలు చేయడంలో

గోనబుద్ధారెడ్డిది అందవేసిన చేయిగా కనిపిస్తుంది. కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ తన రామాయణ కల్పవృక్షంలో ఏ విధంగా అయితే జరగబోయే కథను ముందుగానే కొన్ని సూచనల్లో నిక్షిప్తం చేస్తాడో అలాగే బుద్ధారెడ్డి కూడా చేశాడు. అయితే పండిత విమర్శకులకు ద్విపద పట్ల కాస్త చిన్నచూపు ఉండడంవల్ల ఈయన రామాయణానికి అంతటి ఆదరణ లభించలేదని అర్థమవుతుంది.

## 5. ఉపయుక్తగ్రంథసూచి:


1. ఆరుద్ర సమగ్ర సాహిత్యము తెలుగు అకాడమీ హైదరాబాద్ ప్రచురణ 2003.
2. ఉప్పశ్రీ -ఉప్పశ్రీ రామాయణం –తిరుమల తిరుపతి దేవస్థానము తిరుపతి -2012.
3. కృష్ణమాచార్యులు, యం. మరియు వెంకటరామయ్య, గోలి. శ్రీమద్రామాయణం, గీతాప్రెస్ ప్రచురణ, హైదరాబాదు, 2004.
4. నాగయ్య, జి, తెలుగు సాహిత్య సమీక్ష, నవ్యపరిశోధక ప్రచురణలు, తిరుపతి, 2004.
5. ప్రభాకర శాస్త్రి, వేటూరి, రంగనాథ రామాయణం, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్, 2016.
6. విశ్వనాథ సత్యనారాయణ, శ్రీమద్రామాయణ కల్పవృక్షం, శ్రీ విశ్వనాథ పబ్లికేషన్స్, విజయవాడ, 2008.
7. సిమ్మన్న, వెలమల, తెలుగు సాహిత్య విమర్శ సిద్ధాంతాలు, దళిత సాహిత్య పీఠం, విశాఖపట్నం, 2009.


***



AUCHITHYAM

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

ISSN: 2583-4797

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_40.php

# "కమనీయం తెలుగు రామాయణం"

**జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక**

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

## 40. విశ్వామిత్రుడు దర్శించిన శ్రీరాముడు: సత్యపరాక్రమం

**(అవతారాలలో సారూప్యత)**

**కొమాండూరి వేంకట రామశేషు**

విశ్రాంత సీనియర్ మేనేజర్,

నేషనల్ డెయిరీ డెవలప్మెంట్ బోర్డ్ జైపూర్,

రాజమహేంద్రవరము, ఆంధ్రప్రదేశ్.

సెల్: +91 9989362582. Email: komanduriramaseshu@gmail.com

**వ్యాససంగ్రహం:**

*శ్రీ వైష్ణవ సాంప్రదాయంలో శ్రీమద్రామాయణము మోక్షశాస్త్రంగా అభివర్ణించబడింది. అట్టి రామాయణము ఆదికావ్యము. సాహితీవేత్తలు రామాయణాన్ని కేవలం కావ్యంగా భావించి బాలకాండలో రాముని బాల్యాన్ని గురించి వాల్మీకి వర్ణించలేదని అంటారు. కానీ శాస్త్రార్థాలపరంగా బాల అనే శబ్దము గురు శబ్దానికి చెందింది. ఈ విధంగా పరిశీలిస్తే బాలకాండలో బాలుడు విశ్వామిత్రుడు అవుతాడు. అందుకు తగినట్లుగానే బాలకాండలో విశ్వామిత్రుడు ప్రధానంగా కనిపిస్తాడు. ఈ అంశాన్ని ప్రతిపాదిస్తూ అవతారాలలో భగవానుడుగా శ్రీరాముడు నాకు తెలుసు, అహంవేద్మి అంటూ విశ్వామిత్రుడు దశరథునితో సంభాషిస్తూ- అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్, వశిష్ఠోపి మహాతేజా యే చేమే తపసి స్థితా: అనే శ్లోకాన్ని చెబుతాడు. ఈ శ్లోక ప్రాధాన్యతను విశేష అర్థముతో దర్శించి శ్రీమహావిష్ణువు అవతారాలలో సారూప్యతను ఈ వ్యాసంలో తెలియపరిచాను.*

**Keywords:** రామాయణం, విశ్వామిత్రుడు, అహం వేద్మి, బాలకాండ, బాలుడు, శ్రీరాముడు, అవతారము.

### 1. కవి, కావ్యనాయకుని పరిచయము:

వాల్మీకి కావ్యసృష్టికి, నాయకుడు శ్రీరాముడు. అవతారరహస్యం రావణసంహారం. తపస్సు కారణంగా బ్రహ్మ ఇచ్చిన వరాలను పొంది రావణుడు అమిత పరాక్రమవంతుడు అయినాడు. వరాలలో నరుడు, వానరుడు మినహాయింపు. రావణుని దృష్టిలో నరులు అల్పజీవులు, చులకన భావన. దేవతల కోరిక మేర మహావిష్ణువు లోక హితము కోసము రావణ సంహారము, మానవులు తప్ప మరియొకరికి సాధ్యం కాదని శ్రీరామావతారం వచ్చింది.

కుల గురువు అయిన వశిష్టుల వారు ఇక్ష్వాకు వంశములో మహావిష్ణువు అవతార పురుషునిగా ఉదయిస్తున్నాడని గ్రహించి, దశరథుని తండ్రి అజ మహారాజును, తల్లి ఇందుమతిని శ్రద్ధగా పరీక్షిస్తూ తగు సూచనలు ఇచ్చేవారు. మహావిష్ణువు దశరథున్ని తండ్రిగా ఎంచుకున్నాడు. **"పితరం రోచయా మాస తథా దశరథం నృపమ్" బాలకాండ 15(30).** వాల్మీకి ఎక్కడా శ్రీరాముడు భగవత్ స్వరూపమని చూపలేదు. అవతార పురుషుడు అని రావణునికి తెలియకూడదు అని లక్ష్మణుడు, దశరథుడు, ఆఖరికి రాముడు సత్యం, ధర్మం అంటూ చివరి దాకా తమ ఉనికిని చాటుకున్నారు. అవతార రహస్యం తెలియకుండా వాల్మీకి రామాయణ రచన కావ్యరూపంలో సాగింది. శ్రీరాముడు తన నడవడికలో మానవునిగా రూపం. అతిమానుష క్రియా కలాపములు చేసినా తన దైవత్వం బయటపడకుండా జాగ్రత్త పడ్డాడు. **"ఆత్మానం మానుషం మన్యేరామం దశరథాత్మజమ్" యుద్ధకాండ 120(11).**

కొన్నిచోట్ల శ్రీరాముడు దైవమా? మానవుడా? అన్న సందేహం కలుగుతుంది. శ్రీరాముడు ఆచార్య ప్రధానుడు. తన పరత్వము తనకు తెలియనట్లు మరుగుపరచటానికి ప్రయత్నించినా అహల్య శాప విమోచన వృత్తాంతము ఆయన దైవత్వమునకు నిదర్శనము. కేవలం శ్రీరాముని ఉనికి మాత్రం చేతనే అహల్యకు శాపవిమోచనం కలిగినది. శ్రీరాముని దర్శనము - శ్రీరామునిచే కటాక్షింపబడటం పురుషార్థంగా తెలుస్తుంది. గుణరూపమైన తేజస్సు అహల్య దు:ఖానికి కారణమైతే శ్రీరాముని పాదరజస్సు సుఖహేతువైంది. శ్రీరాముని పదపరిచయంతో తన పతిపద పరిచార్యార్హతను తిరిగి సంపాదించుకొంది. శ్రీరాముని జీవితములో ఇది ఒక అతీంద్రియ సంఘటన.

మానవుడు తన తండ్రికి ఇవ్వని మోక్షము శ్రీరాముడు ఒక పక్షిగా ఉన్న జటాయువుకు ఇచ్చాడు. వెనుకకు మరలిరాని లోకములకు పంపగల శక్తి మనుష్య మాత్రుడుగా ఉన్న రామునకు ఉండునా ? సమాధానం అయోధ్యా కాండలో దశరథుడు కైకేయికి సత్యధర్మాలు పాటిస్తే అన్ని లోకాలు వశమౌతాయని చెబుతాడు.

**"సత్యేన లోకాన్ జయతి దీనాన్ దానేన రాఘవ:**
**గురూన్ శుశ్రూషయా వీరో ధనుషా యుధి శాత్రవాన్" అయోధ్యకాండ- 12(29)**

మనకు అర్థంకాని విషయం, విజ్ఞుడు అయిన దశరథుడు తాటక సంహారం రాముడు చేశాడని వింటాడు, శివ ధనుర్ భంగం రాముడు చేశాడని తెలుసు, సీతారాముల వివాహానంతరం పరశురాముని గర్వ భంగం ప్రత్యక్షంగా చూస్తాడు. తన వైష్ణవ చాపం శ్రీరామునికి అందిస్తూ పరశురాముడు సాక్షాత్ విష్ణు స్వరూపమని అంటాడు. కుల గురువు వశిష్టుడు, విశ్వామిత్రుడు రాముడు సత్యపరాక్రమవంతుడు అని చెప్పిన సందర్భాలు మనకు తెలుసు. అంతా తెలిసిన దశరథుడు దైవం (శ్రీరాముడు) నుంచి మోక్షం కోరుకోలేకపోతాడు. ఎందుకంటే అసత్యం ఆడితే దశరథునికి దోషం అని పూర్వాచార్యులు కారణం చెబుతారు. లౌకిక విషయంపై మక్కువతో దశరథుడు శ్రీరాముడిని చివరకు అడవులకు పంపే పరిస్థితి ఏర్పడిరది.

యుద్ధకాండలో లక్ష్మణుడు ఇంద్రజిత్తుతో యుద్ధం చేసేటప్పుడు అన్న మాటలు చూడండి. శ్రీరాముడు ధర్మాత్ముడు, సత్యసంధుడు, పరాక్రముడు అయితే ఓ బాణమా ఇంద్రజిత్తును వధించు. ఈ శ్లోకమును మూలమంత్రంగా పూర్వాచార్యులు భావిస్తారు.

**"ధర్మాత్మా సత్య సంధశ్చ రామో దాశరధిర్యది !**
**పౌరుషే చాప్రతి ద్వంద్వ: శరైనం జహి రావణీమ్ !! యుద్ధకాండ 91(73)**
**యో వజ్రపాతాశనిసన్నిపాతా**
**న్న చుక్షుభే నాపి చచాల రాజా ।**
**న రామబాణాభిహతో భృశార్త**
**శ్చచాల చాపం చ ముమోచ వీర: ॥ (యుద్ధకాండ 59 (139))**

శ్రీ రాముడు మహా పరాక్రమవంతుడు అనటానికి యుద్ధకాండలో ఉదాహరణ పై శ్లోకము. వజ్రాయుధం వేటకు కాని, పిడుగుపాటుకు కాని క్షోభపడి ఎరుగని రావణాసురుడు, రామబాణం దెబ్బకు తాళలేని బాధపడ్డాడు, వణికిపోయాడు. తెలియకుండా చేతిలోని ధనుస్సు వదిలిపెట్టినాడు.

## 2. శ్రీరామాయణంలో వాల్మీకి రామ, రావణ యుద్ధ ఉపమానం :

**"గగనం గగనాకారం సాగరస్సాగరోపమ:" ॥ యుద్ధకాండ : 111 (23)**
**"రామరావణయో ర్యుద్ధం రామరావణయోరివ" ॥ యుద్ధకాండ : 111 (234)**

ఆకాశమునకు పోలిక ఆకాశమే, సముద్రానికి పోలిక సముద్రమే. ఆవిధముగా రామ రావణ యుద్ధం పోలిక రామరావణ యుద్ధం. రావణ సంహారంలో దేవతలు, ఋషులు, మునులు తమ తమ తపస్సులను శ్రీరామునికి అర్పించి అవతార విజయమునకు తోడ్పడ్డారు.

ఈ నా శీర్షిక "బ్రహ్మర్షి విశ్వామిత్రుడు దర్శించిన శ్రీరాముని సత్య పరాక్రమమ్" మీ ముందు ఉంచుతున్నాను.

బాలకాండలో ప్రధానంగా విశ్వామిత్ర మహర్షి శ్రీరాముడిని యాగరక్షణ కోసం అడగటానికి వచ్చినప్పుడు అతడు దశరధునితో పలికిన మాటలు సర్వత్రా శ్రీరాముని పరత్వం స్పష్టమవుతున్నది. భగవానుని సౌలభ్యం మోక్షజనకము అని తెలిసిన బ్రహ్మర్షి. ఇతని తండ్రి గాధి. విశ్వామిత్రుని జన్మ వృత్తాంతాన్ని శ్రీరామునికి గౌతమ మహర్షి, అహల్య కుమారుడైన శతానందుడు (జనక మహర్షి ఆస్థాన పురోహితుడు) వినిపిస్తాడు. దీనిని వాల్మీకి రామాయణం బాలకాండలో 51-65 సర్గల మధ్య వర్ణించాడు.

**అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్,**
**వశిష్ఠోపి మహాతేజా యే చేమే తపసి స్థితా: (బాలకాండ 19-(14)**

**తే॥ ఏ నెఱుంగుదు రాజేంద్ర లి యీ మహాత్ము.**
**రాము సత్య పరాక్రమో లి ద్దాముమఱి ప్ర**
**సిద్ధ తేజోధికుండు వ లి శిష్ఠ మునియు,**
**నీ తపవస్థితు లెల్లరు లి నెఱుగవీర.**

**(శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము బాలకాండము పేజి 60 (564 వ పద్యం) )**

ఈ శీర్షిక మొత్తము పై శ్లోకముతో ముడిపడి ఉంది.ఇందులో శ్రీరాముని, విశ్వామిత్రుని ఔచిత్యమును చూస్తాము. విశ్వామిత్రుడు దశరధునితో రాముడు మహాత్ముడని - సత్యపరాక్రముడు అని నేను ఎరుగుదును. శ్రీరాముడు పరంధాముడని, బ్రహ్మాది దేవతలు నీవు ఆదిమధ్యాంతరహితుడని, నారాయణుడవని కీర్తిస్తుంటే-తను ఇంకా మానవుడని తలుస్తు వున్నాడంటే మాయామానుష విగ్రహుడైన రాముణ్ణి వివిధ కోణాల్లో చూడాలని వాల్మీకి మహర్షి హృదయం.

విశ్వామిత్రుడు గాయత్రీ మంత్ర దృష్ట. రామాయణం గాయత్రీ బీజ సంహిత. ఇరవై నాలుగు వేల శ్లోకాలతో వేద మాతకు బీజ రూపంగా ప్రతిబింబచేసిన వాల్మీకి రచనకు మూలాధారం విశ్వామిత్రుని పాత్ర. శ్రీరాముని కోసం విశ్వామిత్రుడు అయోధ్యకు వచ్చేనాటికే అతడు బ్రహ్మర్షి. విశ్వామిత్రుడు మూర్తీభవించిన ధర్మము.

**"న కర్మణా న ప్రజయా ధనేనా త్యాగేనైకే అమృతత్వ మానశు: !**
**పరేణ నాకం నిహితం గుహాయాం విభ్రాజతే యద్యతయో విశన్తి !!"**

**(కైవల్యోపనిషత్ - ప్రథమ: ఖణ్ణ: (3)**

కర్మచేతకాని, పుత్రాది రూప సంతానము చేతకానీ, దానాదులకు ఉపయోగించు ధనము చేతకాని అమృతత్వము లభించదు. త్యాగము చేతనే అమృతత్వమును (అమరత్వము) పొందుదురు అని తెలిసిన మహర్షి.

## సామాన్య ధర్మముతో చూస్తే ఈ శ్లోకానికి అర్ధం :

ఈ రాముడు అధికమగు ధైర్యము కలవాడనియు ఎచ్చటనైనను, ఎవరినైను కాపాడటంలో పరాక్రమము కలవాడనియు నేనెరుగుదును. ఇక్ష్వాకు కులగురువు వశిష్టుడు కూడా ఎరుగును. మరియు తపస్సు చేయు నీ ఋషులందరు ఎరుగుదురు అని సామాన్య అర్థము.

## విశేష ధర్మముగా మనము చూచినట్లైతే విశ్వామిత్రుని మాటల్లో :

శ్రీరాముడు సర్వజగత్తుకు విభుడు. సర్వశక్తి మంతుడు. సర్వజగత్తును ధరింపగలడు. శ్రీరాముడు అపరిచ్ఛిన్నమగు మహిమ కలవాడు అని నేను ఎరుగుదును. మీ కుమారుడు ఎంతటి మహనీయుడో నాకు తెలుసు. అతనిలో దాగియున్న సత్య పరాక్రమాన్ని మీ వాత్సల్యం అవగాహనం చేసుకోలేకుండా ఉన్నది అని అతిశయంగా సూచించుచున్నాడు. శ్రుతి **"వేదాహమేతం పురుషం మహాంతం" అని పేర్కొనిన పరబ్రహ్మమే ఈ శ్రీరాముడు. ఈ పురుష సూక్త వాక్యమే రామాయణమున లౌకికమైన మంత్రముగా మార్చి చెప్పినాడు. "అహంవేద్మి మహాత్మానం రామం"**

వాల్మీకి ప్రణీతమైన శ్రీరామాయణము వేదోప బృంహణమైన ఇతిహాస ఆదికావ్యం. ''వేదోప బృంహణార్థాయ తాప గ్రాహయత ప్రభు.'' శ్రీరామాయణం వేదం యొక్క సారార్థాన్ని విశదీకరించింది. వేదోప బృంహణం అంటే విశదీకరింపబడిన విషయానికి మాతృక లేదా మూలం వేదము అని అర్థం.

**భద్రోభద్రయా సచమాన ఆగాత్**
**స్వసారం జారో అభ్యేతి పశ్చాత్**
**సుప్రకేతై ర్య్ఘ భీ రగ్ని ర్వితిష్ఠన్**
**శద్భిర్వర్ణై రభిరామ మస్థాత్ - ఋగ్వేదము**

మొట్టమొదటి పర్యాయముగా బీజ రూపములో ఋగ్వేదములోని ఈ మంత్రములో శ్రీరామకథ కన్పిస్తుంది. నాలుగు చరణాల్లో శ్రీరామకథలోని నాలుగు ప్రధాన ఘట్టములు సంకేతింపబడినవి. ఈ సూచనే ప్రత్యక్ష ప్రమాణం. వేదవేద్యుడైన పరంధాముడు దశరథాత్మజుడైన శ్రీరాముడుగా అవతరించగా, నాదాత్మకమైన వేదం రసాత్మకమైన రామాయణ మహాకావ్యంగా ఆవిర్భవించింది. వేదం అపారుషేయం కాబట్టి నిర్దుష్టం శ్రీరామాయణం. మనస్వీ, తపస్వీ అయిన వాల్మీకి మహర్షి ప్రణీతం. శ్రీరామాయణ కావ్యం ధ్వని. అనగా మాటల వలన తోచు అర్థముకాక విశేషార్థమునకు సంజ్ఞ, కావ్యమునకు ధ్వనియే ప్రాణము.

పూర్వులు చేసిన ఆచరణ మనకి ఆదర్శం అయితే వాళ్ళని మనం ఆచార్యులు అంటాం. భగవద్రామానుజాచార్యులు శ్రీరామాయణంలో రహస్యార్థములను గ్రహించటానికి తిరుపతి క్షేత్రంలో ఏడాదిపాటు ఉండి, శ్రీశైల పూర్ణులనే ఆచార్యుల ద్వారా 18 సార్లు 18 రకాల అర్థాలను సత్య, ధర్మాలకు సమన్వయం చేస్తూ, అధ్యయనం చేసారట. అంతటిది శ్రీరామాయణం.అందుకే ఈ కావ్యం వేదానికి రూపాంతరము.

ఆచార్యపీఠాన్ని అధిరోహించిన ఆచార్య పురుషులు శ్రీ పరాశరబట్టరువారు. శ్రీ పెరియవాచ్చాన్ పిళ్ళైగారు ప్రభృతులు విశేషార్థాలను శిష్యపరంపరలకు అందించిన వాటిని జిజ్ఞాసువులకు అందించేందుకు అవతరించిన వ్యాఖ్యాన రాజమే శ్రీగోవిందరాజవ్యాఖ్య. పూర్వాచార్యుల వివరణలో వేదాంతతత్వం మనకు గోచరిస్తుంది. శ్రీరామాయణంలో ఉన్న ప్రతి సన్నివేశం వాస్తవం. అందులో ఉండే ప్రతి అక్షరం అనుభవసారం. శ్రీరామాయణంలో ఉన్నన్ని ఉపమానాలు, అర్థాంతరన్యాసం మొదలైన అలంకారాలు ఏకావ్యంలోను ఉండవేమో? వాల్మీకి మహర్షి కుండలినీ యోగమనే పరమౌషధాన్ని మానవాళికి బహుకరించాడు. ఆ ఔషధానికి ఒక తేనేపూత అనుష్టుప్ ఛందస్సులో ఉన్న వాల్మీకి కావ్యం శ్రీరామాయణం.

ఇక శ్లోకానికి అర్థం విశేష ధర్మముతో పరిశీలిస్తే పూర్వము హరిశ్చంద్రుడు అయోధ్యకు చెందిన సూర్యవంశపు (ఇక్ష్వాకు వంశ) రాజు. దేవేంద్రుని సభలో విశ్వామిత్రుని శపథం కారణంగా, ధర్మంతప్పని హరిశ్చంద్రుడు - చంద్రమతి దంపతులు విడిపోయారు. చేసిన తప్పును దిద్దుకోవటానికి విశ్వామిత్రుడు త్రేతాయుగములో దివ్య దంపతులైన సీతారాములను కలపాలని కాంక్షించాడు. లక్ష్మీనారాయణులు ఇద్దరిని కలిపి

ఆరాధించాలి అని విశ్వామిత్రుని ప్రయత్నం. అమ్మవారు మిథిలానగరంలో ఉంది. శ్రీరాముడు అయోధ్యలో ఉన్నాడు ఇద్దరినీ కలపాలి. సీతారాములు ఒకరిని విడిచి ఒకరుండరు. (పుష్పము పరిమళము వలె) సీతారాముల కల్యాణము విశ్వామిత్రుని ధ్యేయం. మధ్యలో యాగ సంరక్షణ, రాక్షస వధ, అహల్య శాపవిమోచనం అన్నీ ఈ దివ్య కల్యాణ సంరంభానికి హంగులు. తమోగుణ ప్రధానమైన తాటకిని సంహరించి, రజోలీనమై అదృశ్యగా నున్న అహల్యను అవిష్కరించి, నిత్యసత్య సందిప్తమైన సాత్త్విక తేజస్సుతో అయోనిజగా జనకుని వాత్సల్యముతో పెరుగుతున్న జానకిని చేపట్టడమే శ్రీరాముడు విశ్వామిత్రునిని అనుసరించటంలో సాధించిన సత్త్వసిద్ధి.  ఈ మహర్షి సాధించిన సీతారామ సమాగమం సీతా సమేత అయిన రాముని అయనానికి మొదటి మెట్టు. విద్యలను సముపార్జించాలి. భగవంతునికి అర్పణంకోసం తన ప్రయత్నం.

### 3. అవతారాలు-సారూప్యత:

మన పూర్వాచార్యులు ముఖ్యమైన శ్లోకాలకు విశదమైన విలక్షణమైన వాఖ్యానాన్ని లోతైన విశేష అర్థాలను వివరించారు. పై శ్లోకాన్ని వివిధ కోణాల్లో చవిచూసి విశ్వామిత్రుని దర్శనం అవతారాలతో వినూత్నంగా ఎలా సారూప్యత చూపారో పరిశీలిద్దాము.

మందర పర్వతాన్ని కవ్వంగా వాసుకి త్రాడుగా ఒక పక్క దేవతలు, ఒక పక్క దానవులు చిలుకుతూ ఉంటే మందరగిరి జారిపోతూ ఉంటే నారాయణుడు కూర్మరూపం దాల్చి పర్వతాన్ని మోసిన వ్యక్తి కూర్మనాధుడు - ఆ సత్యపరాక్రముడు ఈ రాముడు.

అహంవేద్మి - నాకు తెలుసు రామం సత్య పరాక్రమము!

బ్రహ్మచేత సృష్టించబడ్డ భూమి జలములో మునిగిపోయింది. బ్రహ్మచింతాక్రాంతుడై విష్ణువుని ప్రార్ధించగా వరాహారూపంలో శ్రీహరి భూమిని తన కోరలపై నుంచి, సముద్రముపై నిలిపిన యజ్ఞ వరాహమూర్తి ఈ రాముడే.

అహం వేద్మి-నాకు తెలుసు-రామం సత్యపరాక్రమము!

దేవతల ప్రార్ధనపై రాలేదు నృశింహావతారము. ప్రహ్లాదుడు ఇన్ని మాటలు ఎందుకు నాన్నగారు **"సర్వత్రచాస్తి"** అంతటా ఉంటాడు. ఉన్నాడనే నాలోను ఉన్నాడు-లేదన్న మీలోను ఉన్నాడు. హిరణ్యకశ్యపుడు ఎక్కడ నుండి రమ్మనమంటాడో అలా రమ్మనమని అడిగితే కొంచెం ఆలశ్యం అయితే హిరణ్యకశ్యపుడు నమ్మకపోవచ్చు అని అంతటా నృశింహరూపంతో వ్యాపించి ఉన్నాడు. అసలు నృశింహ అవతారానికి హేతువు తన భక్తుడు చెప్పిన మాటను సత్యంగా నిరూపించుటకు కారణము. **"సత్యం విధాతుం నిజభృత్య భాషితమ్".** ఆ నృశింహావతారము ఈ రాముడే.

వామనుడు బలిచక్రవర్తి దగ్గర నుండి మూడడుగుల నేల అడిగి ఒక అడుగుతో ఈ లోకాన్నంతా కొలిచాడు. రెండవ అడుగుతో ఉపరితలాన్ని కొలిచాడు. బలిచక్రవర్తిని అడిగాడు మూడడుగులు ఇస్తానన్నావు. మూడవ అడుగు నా శిరస్సు మీద పెట్టవలసింది అని అంటున్నాడు. భూమండలం కొలిచినపుడు బలిశిరస్సు కూడా అందులోనికి వచ్చేయలేదా? అసత్య దోషం బలిచక్రవర్తికి రాకూడదని, మూడవపాదాన్ని బలిచక్రవర్తి శిరస్సు మీద ఉంచి అతనిని త్రికరణ శుద్ధి గావించి దేహభ్రాంతిని అణగద్రొక్కి ముక్తిని ప్రసాదించాడు. లోకాలను కొలిచిన పరమాత్మ-ఆ త్రివిక్రముడే ఈ రాముడు.

అహంవేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్!

తన తండ్రి చెప్పిన మాటను నిజము చేయుటకు యావత్ క్షత్రియజాతిపై ఆగ్రహించి 21 మార్లు దండెత్తి క్షత్రియ వంశమును నాశనముచేసిన పరశురామావతారం ఈ రాముడే.

మహర్షి తప: సంపన్నుడు. భూత భవిష్యత్ వర్తమాన విషయాలను యోగ దృష్టితో చూసి భగవత్ దర్శనం చేసినవాడు, ద్వాపరయుగంలో ఈ రాముడే శ్రీకృష్ణ పరమాత్మగా అవతరించి కురుక్షేత్ర యుద్ధంలో, శ్రీకృష్ణుని శపధం-ఆయుధం పట్టనని, భీష్ముడు-శ్రీకృష్ణునిచే ఆయుధం పట్టిస్తానని శపధం. తన భక్తుని మాట సార్థకం కావాలని అసత్యం కాకూడదని యుద్ధంలో భీష్ముని నిరోధించాలని శ్రీకృష్ణుడు చక్రం పడతాడు ఆయనే ఈ రాముడు.

అహంవేద్మి-నాకు తెలుసు రామం సత్య పరాక్రమమ్!

ఓ రాజా! రాముడు మహాశూరుడు. నేను నా తపోబలముతో వానిని కనిపెట్టి ఉంటాను. రామునికి అనేక విద్యలు ఉపదేశిస్తాను. ఈ కార్యము నాకు నెరవేర్చితివా నీ కుమారునకు ఎన్నియో శుభములు కలుగు చేసెదను. నీ పుత్రుడు లోకమున విశేషము, కీర్తిమంతుడై ప్రకాశించును.

**శ్రేయశ్చాస్మై ప్రధాస్యామి బహురూపం న సంశయ: !**
**త్రయాణామపి లోకానాం యేన ఖ్యాతం గమిష్యతి !! బాలకాండ 19 (10)**

నాకు ఇప్పుడు ధర్మమే ప్రధానము. శ్రీరాముడు పేరునకు నీ కుమారుడే కాని లోకమునకు తండ్రి. నీ కొడుకని రామునియందు ఎంత ప్రీతి నీకున్నదో, అంత ప్రీతి జగజ్జనకుడు అయిన శ్రీరామునికి లోకము మీద ఉన్నది.

రాజేంద్రా ! రాజులు రజోగుణప్రధానులు. వారిలో నీవు శ్రేష్టుడవు. కావున నీవు సత్యము ఎరుగవు. నేను అనేక గురువుల సేవలు చేసి జ్ఞానమును సంపాదించుకున్నవాడను. పరాపరతత్వ ఆధ్యాత్మికతను నా యోగ బలము చేత ప్రత్యక్షముగా చూడగలను. నీవు యజ్ఞాధికామ్యకర్మలు ఆచరించువాడవు. ఐహిక సుఖములను వదిలి జటావల్కలములు ధరించువాడను నేను. నీవు రజోగుణ సముద్భవములు అయిన కామ క్రోధాదులు ధరించువాడవు. 'గర్భభూతా స్తపోధనా:' అన్నట్లు భగవంతుని గర్భమునందు ఉండువారము మేము. నీవు-ఆయన పుత్రునిగా

జనించెనని గర్వించువాడవు. యోగక్రమ ఎరిగినవాడను నేను, భోగక్రమ ఎరిగినవాడవు నీవు. మోక్షకామినై యాగము చేయువాడను నేను. పుత్రకామినై యాగము చేసినవాడవు నీవు. ధర్మ మోక్షములు పాటించువాడను నేను. అర్థకామములు పాటించువాడవు నీవు. ఇట్టి గుణములు గల నేను శ్రీరామచంద్రమూర్తి యెట్టివాడో ఎరుగుదును. కాని మట్టిలోనున్న రత్నము విలువ మట్టికి తెలియనట్లు నీ ఇంట ఉన్నంతమాత్రమున ఆయన మహిమను నీవు ఎరుగజాలవు అని భావము.

నేను నా కార్యార్థమై ఇట్లు చెప్పలేదు. ఈ విషయము ఎరిగివాడు నేను ఒకడినే కాను. మీ వశిష్టునికినీ తెలియుననుచున్నాడు. బ్రహ్మపుత్రుడు యోగ మహిమచే జ్ఞానము సంపాదించి ప్రసిద్ధి చెందిన ప్రభావము కలవాడు. సత్యం వధ, ధర్మం చర అని నీకు ఉపదేశించుట మాత్రమే కాక తాను అనుష్టించి చూపిన తేజోవంతుడు. ఎవని వాక్యముచే నేను బ్రహ్మర్షిని అయితినో అంతటి గొప్పవాడు వశిష్టుడు. నీకు తెలియని రాముని గొప్పదనము నాకు తెలియును అన్న విశ్వామిత్రుని మాటలకు వశిష్టుల వారు దశరధునితో విశ్వామిత్రుని పరిపూర్ణముగా ఎరుగుదును అంటూ దశరధునితో ఇట్లు చెప్పెను. ఇక్ష్వాకు కులమున పుట్టిన నీవు ధర్మమును వదలరాదు. చేయుదునని చెప్పిన పనిని చేయనివాడు ఇష్టాపూర్త వధము చేసిన పాపము నొందును.

**త్రిషు లోకేషు విఖ్యాతో ధర్మాత్మా ఇతి రాఘవ ।**
**స్వధర్మం ప్రతిపద్యస్వ నాధర్మం వోఢుమర్హసి ॥**
**ఏష నిగ్రహవాన్ ధర్మ ఏష వీర్యవతాం వర: ।**
**ఏష బుద్ధ్యాధికో లోకే తపసశ్చ పరాయణమ్ ॥** **(బాలకాండ 21(7,10))**

ఓ రాజా, ధర్మమే ఈ విశ్వామిత్రుడు రూపంలో కనిపిస్తున్నాడు. కాబట్టి సందేహించకుండా. రామునిని ఇతని వెంట పంపు. ఇతడు నీ కుమారుని చేత ఏయే కార్యాలు ధర్మమార్గం అనుసరించి చేయాలో, ఏయే కార్యాలు బుద్ధి బలం చేత చేయించాలో, ఏయే పనులు తపోబలం చేత సాధించాలో వాటిని అన్నింటినీ ఆయా పద్ధతుల ద్వారా చేయించగల నేర్పరి. పరతత్త్వము తెలిసిన ఈ ముని రాముణ్ని రక్షిస్తు ఉంటాడు. నీ కుమారులకు వివాహము చేయవలెనని తలంపుతో ఉన్న నీకు విశ్వామిత్రుని ఆగమనము సమాధానమవుతుంది. సంశయము వలదు. మారీచ, సుబాహులను తానే స్వయముగా నిరోధించగలడు. కానీ నీ కుమారులకు మేలు కలుగవలెనని మిషతో నీ వద్దకు వచ్చి యాచించుచున్నాడు అని వశిష్ఠులవారు చెప్పగా దశరధుని మనస్సు ప్రసన్నమై రామునికి తగు సూచనలు ఇచ్చి విశ్వామిత్రునితో పంపుటకు దశరథుడు నిశ్చయించుకొనెను.

చివరగా శ్రీరాముడు గురువుల ఎదుట తన పితృవాక్య పరిపాలనను ఏవిధముగా ఉన్నది గమనిద్దాం.

**మునేర్వచనమక్లీబం శ్రుత్వా నరవరాత్మజ: ।**
**రాఘవ: ప్రాంజలిర్భూత్వా ప్రత్యువాచ దృఢవ్రత: ॥**
**పితుర్వచననిర్దేశాత్ పితుర్వచనగౌరవాత్ ।**
**వచనం కౌశికస్యేతి కర్తవ్యమవిశంకయా ॥ (బాలకాండ 26 (1,2))**

మా తండ్రి గారు దశరథుల వచన నిర్దేశము వలన వారి మాటపై నాకు ఉండెడి గౌరవము వలన మీ యొక్క వచనము వలనను ఈ కార్యము (స్త్రీ వధ చేయరానిది అయిననూ) జంకులేకుండా చేయగలను. అయోధ్యయందు గురుజన సమక్షమున మా తండ్రిగారు మీరు చెప్పినట్లు చేయవలసినదిగా అనుశాసించిరి. ఆ మాట ఉపేక్షింపరానిది. కావున తండ్రి గారి మాటను బట్టి బ్రహ్మావాదులైన మీ శాసనమును బట్టి ఉత్తమమైన తాటకావధను గావింతును. సందేహము వలదు.

రాక్షసుడైన మారీచుడు ఇంకొక మహాశత్రువు ఎదుట శ్రీరాముడు మూర్తీభవించిన ధర్మము అని ప్రశంసించినాడు.

**'రామో విగ్రహవాన్ ధర్మ: సాధు: సత్యపరాక్రమ: ।**
**రాజా సర్వస్యలోకస్య దేవానాం మఘవానివ ॥ అరణ్యకాండ 37 (13)**

మారీచుని పాత్ర రామాయణములో, బాలకాండలో విశ్వామిత్రుని యాగ సంరక్షణ వేళ కనపడుతుంది. యాగ విధ్వంసానికి వచ్చిన మారీచుడిని రాముడు మానవాస్త్రముతో కొట్టాడు. ఆ అస్త్ర ఘాతకానికి మారీచుడు నూరు యోజనములు దూరములో పడ్డాడు.

## 4. ముగింపు:

బాలకాండ పేరు పెట్టడములో వాల్మీకి ఉద్దేశ్యమేమిటి? శ్రీరామాయణములో (మూలం) రాముని బాల్యం ఎంత ఉంది? ఒకే ఒక సర్గ. బాలకాండము మొత్తము 77 సర్గలు. పుత్రేష్టి క్రతువు అయి సంవత్సరము కావచ్చింది. ఆరవ ఋతువు జరుగుతూ ఉంది. కౌశల్య గర్భంలో పన్నెండు మాసములు ఉన్నాడు. అది చైత్రమాసం. ఆనాడు శుద్ధ నవమి. పునర్వసు నక్షత్రము. అయిదు గ్రహాలు ఉచ్చస్థితిలో ఉన్నవి. కౌసల్యాదేవికి మగ శిశువు జననం.

**తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ ।/నక్షత్రే దితిదైవత్యే స్వోచ్చసంస్థేషు పంచసు ॥**
**గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతావిందునా సహ।/ ప్రోద్యమానే జగన్నాథం సర్వలోకనమస్కృతమ్ ॥ బాల. 18 (8,9)**

పదకొండవ రోజున పిల్లలకు దశరథ మహారాజు నామకరణ కర్మను ఏర్పాటు చేసినారు.

**అతీత్యైకాదశాహం తు నామకర్మ తథాకరోత్।/ జ్యేష్ఠంరామం మహాత్మానం భరతం కౌకయీసుతమ్॥ బాల18 (20)**

24వ శ్లోకములో వేదాధ్యయనము, పురాణాలు చదివినారు. ఒకే సర్గలో వాల్మీకి వెంట వెంటనే శ్లోకాలలో బాల్యం చూపెట్టినాడు. పుత్రులకు యుక్త వయస్సు సమీపిస్తున్నందువల్ల పురోహితులను, బంధువులను రావించి వారితో పుత్రుల వివాహ విషయం ఆలోచన చేయసాగినారు. అదే సమయాన మహాతేజోవంతుడు విశ్వామిత్ర మహర్షి అయోధ్యా నగరానికి ఆగమనం.

**తస్య చింతయమానస్య మంత్రిమధ్యే మహాత్మన:**
**అభ్యగచ్ఛన్మహాతేజా విశ్వామిత్రో మహాముని: ॥ బాలకాండ 18 (37)**

గాధి పుత్రుడు విశ్వామిత్రుడు వచ్చినాడని రాజుకి చెప్పడం జరుగుతుంది. భాగవతములో శ్రీకృష్ణ లీలలుగా

రామాయణములో రామునికి లీలలు ఉదాహరణకు కూడా కనపడవు. మన పూర్వాచార్యులు విశేష అర్థములో బాలకాండలో బాలుడు అంటే విశ్వామిత్రుడని విశేష అర్థం చెప్పారు. విశ్వామిత్రుని వైభవం తెలియజేయటం వాల్మీకి ఆంతర్యము. బాలుడంటే ఎవరని ఉపనిషత్తులలో కనపడుతుంది.

- తన గొప్పదనము ఏమిటో తెలియనివాడు - బాలుడు

- శాస్త్రములు చదివినవారు తమను తాము రక్షించుకోలేము అని తెలిసి పరమాత్మడే రక్షకుడు, ఆయనచే రక్షింపబడతాము అనే జ్ఞానము కలిగి ఉంటారు - వారు బాలుడు

- తనను కాపాడుకునే విషయములో తన ప్రయత్నం చేయని వాడు - బాలుడు (పిల్లలకు తమను తాము కాపాడుకునే సామర్థ్యము ఉండదు.)

- ఎంతటి జ్ఞానం సంపాదించినా అహంకారం లేనివాడు, గ్రహించగల్గినవాడు, గ్రహించగల్గినదానిని ధరించగలవాడు ఈ లక్షణములు ఎవరు కలిగి ఉంటారో వారు బాలుడు.

విశ్వామిత్రుడు సీతారాముల వివాహము అయిన మరునాడు ఉత్తరగిరికి తపస్సుకై బయలుదేరుతాడు.

**అథ రాత్ర్యాం వ్యతీతాయాం విశ్వామిత్రో మహాముని: ।**
**ఆపృష్ట్వా తౌ చ రాజానౌ జగామోత్తరపర్వతమ్ ॥ బాలకాండ 74 (1)**

పరమాత్మ అనుగ్రహం ఉంటేనే పరమాత్మను పొందగలము అని తెలిసిన విశ్వామిత్రుడు సీతారాములు ఇద్దరిని ఏకంచేయాలి అనేదే సంకల్పం. శ్రీరామునికి విద్యలు సముపార్జించాలి. తన తపస్సును పరమాత్మునకు సమర్పించాలి. బాలకాండలో 77 సర్గలలో సుమారు 56 సర్గలు విశ్వామిత్రునితో ముడిపడి ఉన్నవి. ఈ లక్షణముల వలన బాలకాండలో విశ్వామిత్రుడు బాలుడుగా పరిగణించవచ్చును.

## 5. ఉపయుక్తగ్రంథసూచి:

1. అప్పలాచార్యులు, శ్రీభాష్యం. శ్రీమద్రామాయణము (తత్త్వదీపిక), శ్రీరామాయణ ప్రవచనమహాయజ్ఞ నిర్వహణసంఘం, విశాఖపట్నం, 2011.
2. కృష్ణమాచార్యులు, యం. మరియు వెంకటరామయ్య, గోలి. శ్రీమద్రామాయణం, గీతాప్రెస్ ప్రచురణ, హైదరాబాదు, 2004.
3. వేంకటశేషాచార్యులు, చలమచర్ల, శ్రీ జయలక్ష్మీ పబ్లికేషన్స్, హైదరాబాదు, 2021
4. శ్రీరామచంద్రుడు, పుల్లెల, శ్రీమద్వాల్మీకి ప్రణీతశ్రీమద్రామాయణము(బాలానందినివ్యాఖ్య),ఆర్షవిజ్ఞానట్రస్ట్, హైదరాబాదు; 2013,
5. సుబ్బారావు, వావిలికొలను, శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము 'మందరము'(మూలము), శ్రీ కోదండరామ సేవక ధర్మసమాజం, దాసకుటి-అంగలకుదురు, 1982

***




AUCHITHYAM

ISSN: 2583-4797

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_41.php

# "కమనీయం తెలుగు రామాయణం"

**జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక**

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 41. శ్రీమద్వాల్మీకి రామాయణము: సామాజికశాస్త్రాలు- వ్యక్తిత్వవికాసం

**మంత్రవాది వీరవెంకట సత్యనారాయణ**

న్యాయవాది,

గుంటూరు, ఆంధ్రప్రదేశ్.

సెల్: +91 8121499695. Email: vvsmantravadi9@gmail.com

**వ్యాససంగ్రహం:**

*సంస్కృతమున ప్రథమేతిహాసమైన రామాయణంలో వాల్మీకి మహర్షి వేద వాఙ్మయ సారాన్ని రంగరించి 24 వేల శ్లోకాలతో మనకు అందించారు. ఈ విధంగా రామాయణము వేద ప్రతిపాదకము, వేదార్థ సమన్వితము. అదేవిధంగా సకల కావ్య లక్షణ శోభితమైన ఆదికావ్యం. ఇట్టి రామాయణాన్ని ఆధునిక కాలంలో మానవాళికి ఉపయోగపడే సామాజిక శాస్త్రాల పరంగా అధ్యయనం చేసినప్పుడు రామాయణంలో ఆర్థిక శాస్త్రము, రాజనీతి శాస్త్రము, పరిపాలన శాస్త్రము, న్యాయ శాస్త్రము, మనస్తత్వ శాస్త్రము మొదలైన సామాజిక శాస్త్రాలు ఉన్నట్లుగా తెలుస్తుంది. అదేవిధంగా వ్యక్తిత్వ వికాసానికి సంబంధించిన అంశాలు కూడా రామాయణంలో నిక్షిప్తం చేయబడినట్లు అవగతం అవుతుంది. ఈ అంశాలన్నింటినీ బేరీజువేస్తే రామాయణము విజ్ఞాన సర్వస్వంగా కనిపిస్తుంది. ఇంతటి మహత్తరమైన కావ్యాన్ని పరిశీలనాత్మక దృష్టితో అధ్యయనము చేసి శ్రీమద్వాల్మీకి రామాయణంలో గల సామాజిక శాస్త్రాలను, వ్యక్తిత్వ వికాస సూత్రాలను పరిచయం చేయదలిచాను.*

**Keywords:** శ్రీమద్వాల్మీకి రామాయణము, సామాజిక శాస్త్రములు, ఆర్థిక శాస్త్రము, రాజనీతి శాస్త్రము, పరిపాలన శాస్త్రము, న్యాయ శాస్త్రము, మనస్తత్వ శాస్త్రము, వ్యక్తిత్వ వికాసము

## 1. ఉపోద్ఘాతం:

శ్రీమద్వాల్మీకి వ్రాసిన శ్రీమద్రామాయణం తెలియనివారు ఉన్నారంటే అది ఆశ్చర్యకరమౌతుంది. అనునిత్యము ఏదో ఒక సందర్భమున మానవ జీవన గమనంలో రామాయణానికి సంబంధించిన ఏదో ఒక అంశం

అనుసంధానం చేయబడుతునే ఉంటుందనడంలో నిసుమంత సందేహము ఉండదు. భారతీయ వాఙ్మయ చరిత్ర ప్రకారం రామాయణ కావ్యం వేద కాలం తర్వాత, అనగా సుమారు సా.శ. పూ.1500 సంవత్సరమున దేవనాగరి భాషగా చెప్పబడుచున్న సంస్కృతంలో రచించబడినది. త్రేతాయుగంలో జరిగినట్లు వాల్మీకిచే చెప్పబడినది. శ్రీమద్వాల్మీకి రామాయణమే గాక, వేదవ్యాసుఁడు వ్రాసిన ఆధ్యాత్మ రామాయణము, భవభూతి ఆవిష్కరించిన ఉత్తర రామచరితము బహుళ ప్రసిద్ధి. అనేక భారతీయ భాషలలోను రామాయణం ఆవిష్కృతమైంది.

శతశ్లోకియైన సంక్షేప రామాయణాన్ని నారదుడు వాల్మీకికి చెప్పగా తాదాత్మ్యమునొందినవాల్మీకి

**శ్లో. తపఃస్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాంవరమ్,**
**నారదంపరిపప్రచ్ఛవాల్మీకిర్మునిపుఙ్గవమ్. (బా.కాం.స.1.శ్లో.1)**

భా.తపశ్శాలియైన వాల్మీకి తపస్సు యందు, వేదాధ్యయనము నందు ఆసక్తి కలవాడు, వాక్కులు తెలిసిన వారిలో శ్రేష్ఠుఁడు, మునులలో గొప్పవాడైన నారదుని ప్రశ్నించెను.

అనే శ్లోకముతో బాలకాండమును ఆరంభం కాండముగ చేసికొని రామాయణ రచనను ప్రారంభించినాడు. తన శిష్యుడు భరద్వాజునితో తమసా నదీ తీరమువెడలుచున్న సమయమున ఒక వేటగాడు క్రౌంచ పక్షుల జంటలోనిమగ పక్షిని వేటాడగా బాధతో ప్రాణము విడిచింది. ఆ దృశ్యమును జూచి, శోకచిత్తుడై పల్కిన ఈ మాటలు ఛందోబద్ధముగా

నున్న మొదటి శ్లోకమని, అది రామాయణం వినుట వలన తటస్థించెనని సంస్కృత సాహిత్య చరిత్రలో పండితుల నమ్మకము.

**శ్లో. మానిషాదప్రతిష్ఠాంత్వమగమఃశాశ్వతీస్సమాః,**
**యత్క్రౌంచమిధునాదేకమవధీః కామ మోహితమ్. (బా.కాం.స.2.శ్లో.15)**

భా. ఓయీ! కిరాతకుడా! క్రౌంచపక్షులుకామహితులైయుండగాఒకదానిని చంపి, నీవు శాశ్వతమైన అపకీర్తిని పొందినావు. అనిఅతనిని శపించినాడు.

ఇది గమనించిన విధాత వాల్మీకిని రామాయణము రచించుమని చెప్పగా నాతడు రామాయణ మహాకావ్యమును రచించెను. రామాయణము ఏడుకాండములుగా దర్శనమిచ్చుచున్నప్పటికీ, వాల్మీకి వ్రాసినవి ఆరు కాండలు, మొత్తం 24వేల శ్లోకములు "శతకోటియక్షరసంయుక్తమ్ము" అంటారు. అపుడు ఏడవ కాండము అయిన ఉత్తర కాండము వాల్మీకి రచన అయి ఉండకపోవచ్చును అని పండితాళియభిప్రాయము. బాల కాండ77; అయోధ్య 119; అరణ్య 75; కిష్కింధ 67; సుందర 68; యుద్ధ 131 మిగిలిన ఏడవది ఉత్తర కాండము.

తెలుగు అనువాద రామాయణములు అనేకమంది ఆవిష్కరించారు. 120 నుంచి130 వరకూ ఉంటాయని అంచనా. అయితే ఇందులో ఒక 30 నుండి 35 తెలుగు అనువాద రామాయణములు మిక్కిలి ప్రశస్తిని పొందినవి.

ఆదికావ్యముగా శ్రీమద్రామాయణం సన్నుతింపబడితే, ఆదికవిగా వాల్మీకి మహర్షి ప్రసిద్ధి పొందినాడు. మహత్తరమైన పాత్రచిత్రణతో, సామాజికవిలువలతో, పవిత్రమైన కుటుంబ బంధుత్వములతో, ప్రేమానురాగాలను జతచేసి నిరంతర ధర్మప్రవృత్తిని తెలియచేస్తూ దృశ్యమును కండ్ల ముందు ఆవిష్కరించే విధంగా కథనాన్ని అందించిన వాల్మీకి భూత, భవిష్యద్వర్తమాన కాలములలో మిక్కిలి పూజనీయుడు. ఎన్నో సామాజిక శాస్త్ర సంబంధమైన అంశాలు ఆయాకాండములలో దర్శనం మిస్తాయి. సమాజాభివృద్ధికి తోడ్పడే సామాజికాధ్యన శాస్త్రములన్నియూ సామాజిక శాస్త్రములే ఆర్థిక, భౌగోళిక, రాజకీయ, పర్యావరణ, పరిపాలన, న్యాయ, మనస్తత్వ, వ్యక్తిత్వ వికాసశాస్త్రములన్నియూ ఆకోవ క్రిందికి వస్తాయి. శ్రీవాల్మీకి మహర్షి రచించిన రామాయణాధ్యనములో ఈ శాస్త్రముల తాలూకు చాలా అంశములు ఆయా సందర్భములలో మనకు దర్శనమిస్తాయి.

## *2. రామాయణం-సామాజికాధ్యయనం:*

ఏ సామాజిక శాస్త్ర అధ్యనమైనా అది సమాజం శ్రేయస్సును కాంక్షిస్తుంది. సంఘజీవి అయినా మానవునికి దిశానిర్దేశాన్ని అలవాటుచేస్తుంది. తనతో కలిసి జీవనం సాగిస్తున్న మానవులతో ఏవిధంగా మసలు కొనవలెనో తెలియచేస్తుంది. ఈ అంశము రామాయణంలోని అనేక సందర్భములలో ఋజువు చేయబడింది. 2016 వ సంవత్సరములో జాదవ్‌పూర్ విశ్వవిద్యాలయంలో తత్వశాస్త్ర విభాగంలో సందర్శనాచార్యునిగా ఉన్న ఆచార్య రాబర్ట్ గోల్డ్‌మన్ చేసిన మూడు ఉపన్యాసాలలో ఆదికావ్యాన్ని నైతిక మార్గదర్శిగా పేర్కొన్నాడు. దశరథుడు రామునికి రాజ్యాన్ని కైకేయికిచ్చిన వరమును తీర్చుట కొఱకు నిరాకరించడం, రామ వనవాసం, అనంతరం రాముడు ఎదుర్కొన్న స్థితిగతులు, పాటించిన నైతిక విలువలు, త్యాగ నిరతి ధర్మ శాస్త్రానికి, అర్థశాస్త్ర-ఆధారిత రాజరిక ప్రవర్తనకు అద్దం పట్టింది. రామాయణం ఒక మహా కావ్యంగా, ఇతిహాసంగా, ధర్మశాస్త్రంగా నీతిశాస్త్రంగా ఋజువు చేయబడింది.

## 3. రామాయణం-ఆర్థికశాస్త్రం:

సంపదను ఆధారముగా చేసుకొని దాని స్థితి గతులను గూర్చి అధ్యయనం చేసే శాస్త్రమే అర్థశాస్త్రము. లేదా ఆర్థిక శాస్త్రము. రామాయణంలోని బాలకాండమున సంపదకి సంబంధించిన అనేక అంశాలను మహర్షి వాల్మీకి ఆవిష్కరించారు. సంపద కలిగిన దేశం లేదా రాజ్యము అభివృద్ధి చెందినదిగా శాస్త్రకారులు చెబుతారు. అలాగే విద్యతో పాటుగా ధర్మపరిపాలన ఉంటే ఆర్థిక వనరులు వాటంతట అవే సమకూరుతాయి. అదే అంశాన్ని ఈ క్రింది శ్లోకములు వివరిస్తున్నాయి.

**శ్లో. తేనసత్యాభిసంధేనత్రివర్గమనుతిష్ఠతా,**
**పాలితాసాపురీశ్రేష్ఠుడుఇన్ద్రేణేవామరావతీ. (బా.కాం.స.6.శ్లో.5)**

సత్యమునకు కట్టుబడి పట్టుదలతో ధర్మార్థకామములను మూడు ధర్మములకు సమమైన ప్రాధాన్యమునిచ్చి అనుసరించుచున్న దశరథుడు అమరావతిని ఇంద్రుడు పాలించిన విధంగా అయోధ్యను పాలించు చున్నాడు.

**శ్లో. వాల్పసన్నిచయఃకశ్చిదాసీత్తస్మిన్పురోత్తమే,**
**కుటుమ్బీయోహ్యసిద్ధార్థోఽగవాశ్వధనధాన్యవాన్. (బా.కాం.స.6. శ్లో.7)**

ఆ నగరమందు తక్కువ ధనము సంపాదించే వాడు కాని, ధర్మార్థకామమనుపురుషార్థములు సాధించనివాడుకాని, గోవులు, గుఱ్ఱములు, ధనధాన్యములు లేనివాడు కాని అయిన ఒక్క కుటుంబీకుఁడు కూడాలేడు.

**శ్లో. ననాస్తికునానృతకోనకశ్చిదబహుశ్రుతః,**
**నాసూయకో నా చాశక్తోనావిద్వాన్విద్యతేసదా. (బా.కాం.స.6.శ్లో.14)**

దశరథుని రాజ్యమునందు ఎక్కడ నాస్తికుఁడు, అసత్యముపల్కువాఁడు, శాస్త్రాధ్యయనము చేయనివాఁడు, అసూయకలవాఁడు, అసమర్థుడు, పలువిషయములందు విషయం జ్ఞానము లేనివాఁడు లేకుండెను.

**శ్లో. సాతేనేక్ష్వాకునాదేనా పురీసుపరి రక్షితా,**
**యథాపురస్తాన్మనువామానవేంద్రేణధీమతా. (బా.కాం.స.6.శ్లో.20)**

మానవేంద్రుఁడు, బుద్ధిశాలియైన మనుచక్రవర్తి పూర్వమెవ్వధముగ పరిపాలించెనో అదే విధముగా ధదశరథుఁడు అయోధ్యను పరిరక్షించెను. దీనిని బట్టి అయోధ్యనగరము పాలించు కాలమున అర్థశాస్త్ర సంబంధమైన అంశాలు కనిపిస్తున్నాయి.

## 4. రామాయణం-రాజనీతిశాస్త్రం:

రాజనీతిశాస్త్రముఒకసాంఘికశాస్త్రము. ఇదిరాజ్యము, అధికారము, పరిపాలనా సంబంధమైన అంశాలను అధ్యయనం చేస్తుంది. అంటే రాజ్యపాలనాధికారము ద్వారా ప్రజాసంక్షేమమును గూర్చి వివరించేశాస్త్రము. అయోధ్యను దశరథ మహారాజు పరిపాలించిన విధానం వర్ణనలో రాజనీతిశాస్త్ర సంబంధ విషయములు కనబడతాయి. మరీ ముఖ్యంగా కిష్కింధ కాండము నందు సుగ్రీవుడు తన కారణముగానే తన సోదరుడు వాలి మరణించాడని, ఆ విధముగా సంభవించిన రాజ్యాధికారం తనకు వలదని రాముని ప్రార్థించిన సందర్భమున తను మరణించుటకు అనుమతినిమ్మని మొర పెట్టుకున్నపుడు అతని లోని రాజనీతి తేటతెల్లమవుతుంది. అదే విధముగా రాజ్యమును పరిపాలించువాడు అధర్మచిత్తుడై, పరస్త్రీవ్యామోహము నందు ఓలలాడువాడు పనికిరాదని, సర్వసమర్థుడైన సుగ్రీవునకు పట్టాభిషేకము చేయ నిర్ణయించడం, యువరాజపట్టాభిషేకము అంగదునికి చేయడం రాముని రాజనీతికి అద్దంపడుతుంది.

**శ్లో. కృత్స్నంతుతేసఏత్స్యతికార్యమేతన్మయ్యవ్యతీతేమనుజేన్ద్ర పుత్ర!,**
**కులస్యహన్తారమజీవనార్హంరామానుజానీహికృతాగసంమామ్. (కి.కాం.స.24.శ్లో.23)**

రాజకుమారా! రామా! నేను మరణించినంత మాత్రమున నీ కార్యము నెరవేరక మానదు. కులమును నశింపఁజేసి ఇంత పెద్ద పాపమునకు వడిగట్టిన నేను జీవించుటకు అనర్హుడు. నేను మరణించినటకు అనుమతినిమ్ము.

**శ్లో. చతుర్దశసమాఃసౌమ్య! గ్రామంవాయదివాపురమ్,**
**నప్రవేక్ష్యామిహనుమాన్ పితుర్నిర్దేశపాలకః. (కి.కాం.స.26.శ్లో.9)**

సౌమ్యుఁడ వైనహనుమా! నేను పదునాలుగు వత్సరములు గ్రామము లోనికి గాని, పట్టణము లోనికి గాని ప్రవేశించకుండా నాతండ్రి ఆజ్ఞను పాలించుచున్నాను. ఇటువంటి అంశాలు **కి.కాం.స.26.శ్లో.10, 11,12 & 13** శ్లోకాలలో చాలా ఉన్నాయి.

## 5. రామాయణం-పరిపాలనశాస్త్రము:

రాజ్యాధికారము పొందిన అనంతరము పరిపాలన చేయడం ముఖ్యం విధానము. పరిపాలనకు సంబంధించిన అనేక అంశాలు అంటే, ప్రజాక్షేమము, గూఢచర్యము, రక్షణవ్యవస్థ, శత్రువుల రాకను గుర్తించుట, శాంతి భద్రతలు ఇత్యాది విషయములన్నియూ పరిపాలనాశాస్త్రము పరిధిలోకి వస్తాయి. యుద్ధకాండము నందు, రావణునితో విభేదించి వచ్చిన విభీషణుని విషయములో జరిగిన తర్జన భర్జనలు అనేక పరిపాలనా అంశాలను ఆవిష్కరించాయి. రాముఁడు ఒక్కొక్కరినీ పిలిచి వచ్చిన వానిని గురించి తమ అభిప్రాయములు చెప్పమని అడిగినపుడు వారి వారి అభిప్రాయాలు చెబుతారు. హనుమంతుఁడు చెప్పిన విధానములో గూఢచారులను, నేరస్తులను యితరులను, బుద్ధమంతులను ఏవిధంగా విచారించి వారి వద్ద నుండి నిజము తెలుసుకొనవలెననే విషయములు విశదమౌతాయి.

నేను విభీషణుఁడను వచ్చాను. సర్వ లోకరక్షకుఁడైన శ్రీరామునితో చెప్పమని విభీషణుఁడు సుగ్రీవునితో చెప్పగా, అపుడు సుగ్రీవునితోఇట్లనెను.

**శ్లో. మన్త్రేవ్యూహేనయేచారేయుక్తోభవితుమర్హసి,**
**వానరాణాంచభద్రంతేపరేషాంపరంతప. (యు.కాం.స.17.శ్లో.20)**

ఓ! శత్రునాశకా! వానరులకు లాభకరమగు మంత్ర, వ్యూహ, నీతి, గూఢచర్యం ముందు సావధానముగా ఆలోచించి అన్యులు ప్రయోగించు ఆచతుర్వ్యూహములందు అప్రమత్తముగా ఉండుము. నీకు క్షేమముకల్గును.

**శ్లో. ఇత్యుక్తేరాఘవాయాథమతిమానఙ్గదోఽగ్రతః,**
**విభీషణపరీక్షార్థమువాచవచనంహరిః. (యు.కాం.స.17.శ్లో.38)**

కొంత మంది వానరులు పలికిన అనంతరం బుద్ధిమంతుఁడైన అంగదుడు ముందుగా విభీషణుని

పరీక్షించుకోవాలి అని రామునితో చెప్పెను. ఇటువంటి అంశాలు **యు.కాం.స.17.శ్లో.52, 55, 60, 66,67** శ్లోకాలలో చాలానే ఉన్నాయి.

## 6. రామాయణం-న్యాయశాస్త్రము:

తప్పొప్పులను గ్రహించి శిక్షను నిర్ణయించుటయే న్యాయము. అంటే రాజ్యములోని విధివిధానములకు లోబడి దోషులను దండించి, నిర్దోషులను రక్షించు విధానమును అధ్యయనము చేసే శాస్త్రమే న్యాయశాస్త్రము. ఈ విధానమునకు స్నేహం బంధుత్వాదులు అతీతము కాదని రామాయణములోని అనేక సందర్భములందు నిరూపించబడింది. అందుకొన్ని అంశములు అయోధ్య, అరణ్య, సుందరకాండములందు గోచరిస్తాయి. కైకేయి తన కుమారుని పట్టాభిషిక్తుడను చేయుమని భర్తను ఒప్పించి రామునితో విషయము చెప్పగా తన తండ్రి నిర్ణయించిన న్యాయమైన శిక్షకు తాను కట్టుబడి వనవాసమునకు వెడలేదనని చెబుతాడు. అరణ్యకాండము నందు రామునితో సీత రాక్షసులైనను వైరము లేని వారలను దండించుట న్యాయము కాదని, ఆయుధము చేత ధరించినపుడు దానిని ఉపయోగించవలెనను అభిప్రాయము కలిగిన అది అన్యాయమగునని చెప్పిన సందర్భమున న్యాయశాస్త్ర అంశములు ఆవిష్కరింపబడ్డాయి. సుందరకాండమున దూతగా వచ్చిన హనుమంతునిపై ఆగ్రహముతో రావణుఁడు చంపుమని ఆజ్ఞాపించాడు, అపుడు విభీషణుఁడు రావణునితో, " సత్పురుషులైన మీవంటి రాజ్యశ్రేష్ఠులు దూతను వధించిన న్యాయము కాదు. అది న్యాయవిరుద్ధము అవుతుంది" అని చెప్పగా వానరులకు ఇష్టమైన వాలమునకు నిప్పు పెట్టమని ఆజ్ఞాపించెను. న్యాయశాస్త్ర సంబంధమైన యిటువంటి సందర్భములందు అనేకములు దర్శనమిస్తాయి.

**శ్లో. అహోధిఙ్నార్హసేదేవివక్తుంమామీదృశంవచః,**
**అహంహివచనాద్రాజ్ఞఃపతేయమపిపావకే,**
**భక్షయేయంవిషంతీక్ష్ణంగా మజ్జేయమపిచార్ణవే,**
**నియుక్తోగురుణాపిత్రానృపేణచహితేనచ. (అ.కాం.స.18.శ్లో.28,29)**

అయ్యో! దేవీ! నా విషయమున నీవు ఈ విధముగ మాట్లాడవద్దు. తండ్రిగారు చెప్పిన నిప్పులో దూకెదను. మహారాజు పూజ్యుఁడు, నాహితమును వాంఛించువాఁడు అయిన తండ్రి ఆజ్ఞాపించినట్లు భయంకర విషమును తినెదను. సముద్రములో మునిగెదను. అని రాముఁడు కైకేయి తో చెప్పుటలో....

**శ్లో. ఏతేనత్వాంనరేంధ్రద్రోఽయంకారుణ్యేనసమాప్లుతః,**
**శోకసంక్లష్టవదనోనశక్నోతినిరీక్షితుమ్. (అ.కాం.స.18.శ్లో.39)**

నీపై జాలిగల దశరథ మహారాజు దుఃఖముతో ముఖము వాడి పోయి నిన్ను చూడలేకున్నాడు.

ఇలాంటి అంశాలే **అ. కాం. స. 18. శ్లో. 40, స.9. శ్లో. 25, అర.కాం.స. 9.శ్లో. 28, అర.కాం. స.39. శ్లో.20**, **అర.కాం. స.39. శ్లో.23, సుం.కాం.స.52.శ్లో.5** మొదలైనవాటిలో ఉన్నాయి.

## 7. రామాయణం-మనస్తత్వశాస్త్రము:

జ్ఞానము, గ్రహణము, ఉద్వేగము, వ్యక్తిత్వము, ప్రవర్తన అనే అంశములు మనసును ప్రభావితం చేసినపుడు అనేక విధములైన అనుకూల, వ్యతిరేక భావములు ఉద్భవిస్తాయి. వాటిని గురించి కూలంకషంగా అధ్యయనం చేసే విధానమే మానసిక లేదా మనస్తత్వ శాస్త్రము. ప్రతిమానవునకు ఈ భావములు ఏదో ఒక సందర్భమున కలిగి తీరుతాయనేది మనస్తత్వ శాస్త్రవేత్తల అభిప్రాయము.

రామాయణంలో ఈ మనస్తత్వశాస్త్ర సంబంధమైన అంశములు అనేక సందర్భములలో దర్శనమిస్తాయి. ముఖ్యంగా అయోధ్యకాండములో రామునికి పట్టాభిషేకం నిర్ణయం జరిగిన తరువాత అయోధ్యలోని పండుగ వాతావరణాన్ని చూసి మన్థర కైకేయి మనస్సును వికలము చేయుటకు అనేక ప్రయత్నములు చేసిన సందర్భమున ఆమె ప్రేరణకు ఆకర్షితురాలై, కైకేయి దుర్భద చిత్తురాలై వ్యతిరేక భావావేశమునకు గురౌతుంది. అంతులేని మనోవ్యధకు లోనవుతుంది.

**శ్లో.  ఉత్తిష్ఠ మూఢ కిం శేషే భయం త్వామభివర్తతే,**
**ఉపప్లుతమఘౌఘేనకిమాత్మానం న బుధ్యసే.  (అ.కాం.స.7.శ్లో.14)**

ఓ తెలివితక్కువదానా! పరుండి ఉన్నా వేమి? లెమ్ము. నీ పైకి ఆపదలు ముంచెత్తికొని వచ్చుచున్నవి. నీవు తెలిసికొనజాలకున్నావు!

**శ్లో.  అనిష్టేసుభగాకారేసౌభాగ్యేనవికత్థసే,**
**చలం హి తవ సౌభాగ్యం నద్యాఃస్రోతఇవోష్ణగే. (అ.కాం.స.7.శ్లో.15)**

ఓ కైకేయీ! నీవు భర్తకు ప్రియురాల వని పైకి కనబడుటయే కాని వాస్తవమున నీ వాతనికిష్టురాలవు కాదు. సౌభాగ్యవంతురాలనని (భర్త ప్రేమకు పాత్రురాలనని) బడాయి చెప్పుకొనుచున్నావు! కాని నీ సౌభాగ్యము గ్రీష్మము నందు నదీ ప్రవాహము వలె చంచలమైపోయినది.

ఇలాంటి అంశాలే **అ.కాం.స.7.శ్లో.18, అ.కాం.స.7.శ్లో.19, అ.కాం.స.7.శ్లో.20, మొదలైన వాటిలో ఉన్నాయి.**

## 8. రామాయణం-వ్యక్తిత్వవికాసము:

ఒక వ్యక్తిలో అనేక ప్రేరణల కారణముగా ఎన్నో మానసిక సంఘర్షణలు పుట్టుకొస్తాయి. సంఘర్షణ యొక్క సాంద్రతను అనుసరించి కొన్ని ఊహించని స్థాయిని చేరుకుంటే, మరికొన్ని సమసిపోతాయి. ఇదంతా ఆ వ్యక్తి మానసిక స్థితిగతులను బట్టి ఆధారపడి ఉంటుంది. ఈ లక్షణముల నుండి వ్యక్తిని వేరుచేసి, మానసిక ఒత్తిడి నుంచి దూరం చేసి, వికాస పునర్నిర్మాణము చేయడమే వ్యక్తిత్వ వికాసము. ఇటువంటి సందర్భములను వాల్మీకిమహర్షి తాను రచించిన శ్రీమద్రామాయణము నందు సందర్భానుసారముగా చొప్పించినట్లు అర్థమౌతుంది.

కిష్కింధకాండమున జాంబవంతుఁడు సముద్రోల్లంఘనము గావించి, లంకకు చేరుకుని జానకి జాడ తెలుసుకొను సందర్భమున వారి వారి శక్తియుక్తులను ఎంచుకొను కాలమున హనుమంతునితో జాంబవంతుఁడు జన్మవృత్తాంతము తెలిపి, శక్తిని గురించి చెప్పినప్పుడు పొందిన ప్రేరణ వ్యక్తిత్వ వికాసమే. సుందర కాండము నందు తనకు మరణము శరణ్యమని బాధపడి విలపించుట, శుభ శకునములను, స్వప్నమందుగాంచుట, అది గమనించిన హనుమ రామచరితమును మధురముగా పల్కుట వలన జానకి మనమున మానసిక వికాసం పునర్నిర్మాణము జరిగి తన భర్త కొఱకు జీవింపనెంచుట, ఇవన్నియు వ్యక్తిత్వ వికాసమునకు అద్దం పట్టే ఉదాహరణలే.

**శ్లో. బలం బుద్ధిశ్చతేజశ్చసత్త్వం చ హరిపుఙ్గవ!,**
**విశిష్టం సర్వభూతేషుకిమాత్మానం న సజ్జసే. (కి.కాం.స.66.శ్లో.7)**

భా. ఓ! వానరశ్రేష్ఠుడా! నీ బలము, బుద్ధి, తేజస్సు, ధైర్యము ఇతర ప్రాణులలో ఉన్నవాటికంటె అధికమైనవి. నీవు ఈ కార్యమునకై ఎందుకు సిద్ధము అగుట లేదు. ఎంతో సంస్కారవంతురాలు, మహాపతివ్రతా శిరోమణి అయిన నీ మాతృమూర్తితో వాయుదేవుఁడు పల్కిన పల్కులు చెప్పుచున్నాను.

**శ్లో. మనసా స్మిగతోయత్త్వాంపరిష్వజ్య యశస్విని,**
**వీర్యవాన్బుద్ధిసమ్పన్నస్తవపుత్రోభవిష్యతి. (కి.కాం.స.66.శ్లో.18)**

ఓ! కీర్తిమంతురాలా! నిన్ను నేను కౌగలించుకొని మనస్సుచేతనే నిన్ను అనుభవించితిని. అందుచేత నీకు వ్రతభంగము లేదు. నీకు పరాక్రమవంతుడు, బుద్ధిమంతుడు అయిన పుత్రుడు కలుగును. కావున నీవు వాయుదేవుని వర పుత్రుడవు అదియును గాక,

**శ్లో. శతానిత్రీణిగత్వాథయోజనానాంమహాకపే,**
**తేజసాతస్యనిర్ధూతో న విషాదం గతస్తతః. (కి.కాం.స.66.శ్లో.22)**

ఓ! వానరశ్రేష్ఠుడా! నీవు మూడు వందల యోజనముల దూరము ఎగిరి, సూర్యుని తేజస్సు ఆక్రమించుచున్నను దాని వలన భయపడలేదు. అంతబలమైనవాడవు నీవు.

**శ్లో. వయమద్యగతప్రాణాభవానస్మసుసాంప్రతమ్,**
**దాక్ష్యవిక్రమసంపన్నఃకపిరాజఇవాపరః (కి.కాం.స.66.శ్లో.31)**

ఇప్పుడు మా ప్రాణములు కడబట్టుచున్నవి. మాలో సామర్థ్యము, పరాక్రమము గల వాడవు నీవే. రెండవ సుగ్రీవుని వంటివాడవని జాంబవంతుఁడు పలికిన పల్కులు తనలో నిబిడీకృతమైన శక్తిని తెలుసుకొని తన సామర్థ్యముతో లంకను చేరుకొనుటకు నిశ్చయించుకొనెను.

**శ్లో. తతఃకపీనామృషభేణచోదితఃప్రతీతవేగఃపవనాత్మజఃకపిః,**
**ప్రహర్షయంస్తాంహరివీరవాహినీంచకార రూపం మహదాత్మనస్తదా. (కి.కాం.స.66.శ్లో.38)**

భా. ప్రసిద్ధమైన వేగము గల వాయుపుత్రుడైన ఆ హనుమంతుడు, వానర శ్రేష్ఠుడైన జాంబవంతుడు ఈ విధముగా ప్రేరేపించగా, ఆ వానరవీర సైన్యమునకు సంతోషము కలుగునట్లు తన శరీరమును చాల పెద్దదిగా చేసెను.

## 9. ముగింపు:

ఆదికవి వాల్మీకిమహర్షియే కాక ఒక గొప్ప సామాజిక అధ్యనకర్త, దార్శనికుడు, సామాజికమార్గదర్శి. ఆయన రచించిన శ్రీమద్రామాయణం ఏకాలమునకైనా, ఏయుగమునకైనా ఒక గొప్ప దిక్సూచి. ఆయన స్పృశించని అంశమంటూ ఏదీ లేదు. ప్రతి శాస్త్ర సంబంధమైన అంశాన్ని ఆయా సందర్భానుసారంగా అనుసంధానము చేసి ఆవిష్కరించినాడు. ఆర్థిక, రాజనీతి, పరిపాలన, న్యాయ, ధర్మ, మనస్తత్వ, జ్యోతిష్య, శకునశాస్త్రములను తనదైన శైలిలో చొప్పించి మెప్పించినాడు. త్రిజట స్వప్నవృత్తాంతము (సుం.కాం.స.27) నందు శకున శాస్త్రమే మూలము. శుభ శకునముల జాడ సీత కనుగొనిన విధము ఇందు ప్రధానాంశము.

రామాయణం ఒక ఆదర్శవంతమైన జీవనవిధాన సూచిక. అన్నదమ్ముల మధ్య, తలిదండ్రుల మధ్య, గురుశిష్యులు మధ్య, ప్రభువుకు ప్రజలకూ మధ్య, భార్యా భర్తల మధ్య ఉండవలసిన సంబంధ బాంధవ్యాలు వివరంగా ఆవిష్కరింపబడ్డాయి మహర్షి వాల్మీకి ద్వారా. అన్య స్త్రీల మాన ప్రాణములకు విఘాతం కల్గించువారలు ఎంత గొప్పవారైనా పరివార సమేతంగా నశింపకమానరు అనే విశేష సత్యమును సూటిగా చెప్పాడు వాల్మీకి మహర్షి. చెయ్యదగినవి, చేయకూడనివి ఏమిటో కూడా మహర్షి తాను రచించిన శ్రీమద్రామాయణము ద్వారా తేటతెల్లము చేసినాడు. శ్రీమద్రామాయణము చదివి అర్థము చేసుకొనగలిగితే మనోవికాసముతో పాటు వ్యక్తిత్వ వికాసము కూడా కలుగుతుంది అనడంలోసందేహం మిసుమంతయు కానరాదు. ఆచంద్రార్కం శ్రీమద్రామాయణం సజీవ వాఙ్మయశిల్పం

## 10. సంకేత సూచికలు :

అ.కాం– అయోధ్యకాండ; అర.కాం– అరణ్యకాండ; కి.కాం – కిష్కింధకాండ; బా.కాం – బాలకాండ; యు.కాం – యుద్ధకాండ; సుం.కాం – సుందరకాండ; స - సర్గ; శ్లో - శ్లోకము

## 11. ఉపయుక్తగ్రంథసూచి:


1. కృష్ణమాచార్యులు, యం. మరియు వెంకటరామయ్య, గోలి. శ్రీమద్రామాయణం, గీతాప్రెస్ ప్రచురణ, హైదరాబాదు, 2004.
2. రాధాకృష్ణ శర్మ, చల్లా. రామాయణ వ్యాసాలు. లక్ష్మి నారాయణ ప్రచురణలు, హైదరాబాదు,1992.
3. వెంకటరెడ్డి, కసిరెడ్డి. జాతిజీవనం పై రామాయణప్రభావం. జాతీయసాహిత్య పరిషత్ ప్రచురణ, హైదరాబాదు, 1974.
4. వేంకటశేషాచార్యులు, చలమచర్ల, శ్రీ జయలక్ష్మీ పబ్లికేషన్సు, హైదరాబాదు, 2021
5. శ్రీరామచంద్రుడు, పుల్లెల, శ్రీమద్వాల్మీకి ప్రణీతశ్రీమద్రామాయణము(బాలానందినివ్యాఖ్య),ఆర్షవిజ్ఞానట్రస్ట్, హైదరాబాదు; 2016.


***



AUCHITHYAM

ISSN: 2583-4797

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_42.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 42. "రామో విగ్రహవాన్ ధర్మః": నిరూపణం

**డా. కె.డి.డి. మృణాళిని**

పరిశోధకులు, విమర్శకులు,

ఉస్మానియావిశ్వవిద్యాలయం,

హైదరాబాద్, తెలంగాణ.

సెల్: +91 7993892706. Email: Kdd.mrunalini@gmail.com

**వ్యాససంగ్రహం:**

*'రామోవిగ్రహవాన్ధర్మః' అనే ఆర్యోక్తి రామాయణంలో ధర్మం, సత్యం అనే బహు గుణాల మాలకి కొలికిపూస. భారతావనితో పాటు ప్రపంచవ్యాప్తంగా ఖ్యాతి గడించిన రామాయణ కథానాయకుడు శ్రీరాముడు. విశ్వజనులకు సుపరిచితుడు. కోదండ రాముడు ధర్మబద్ధమైన నడవడికతో లోకారాధ్యుడు అయ్యాడు. రామావతారం సత్య ధర్మాచరణతో ఆరాధ్యదైవం అయింది. సకలగుణాభిరాముడు పెద్దల మాటలువిని, వివేచనతో ధర్మబద్ధమైన వాటిని ఆచరించి చూపాడు. రాముని యొక్క ధర్మమార్గాన్ని, వ్యక్తిత్వాన్ని, జీవితాన్ని వాల్మీకి రామాయణంతో పాటు ఇతర తెలుగు రామాయణాలైనా రంగనాథరామాయణం, భాస్కర రామాయణం, మొల్ల రామాయణం, ఉత్తర రామాయణం, రామాయణ కల్పవృక్షం మొదలైనవి రచనా కాలం నాటి సమాజానికే కాక భవిష్యత్కాల సామాజిక శ్రేయోదృష్టితో ఉత్తరోత్తర వన్నె తెచ్చే విధంగా వర్ణించాయి. అటువంటి రామాయణం గురించి, రాముడి గురించి కొన్ని సంఘటనలను ఆధారంగా చేసుకుని కువిమర్శలు చేస్తున్న సందర్భాలు నేటికి చూస్తున్నాము.ఆ సన్నివేశ అంతరార్థం గ్రహిస్తే అసలు అర్థం బోధపడుతుంది. విమర్శకు తావు ఉండదు. మరొక్క సారి ఈ వ్యాసం ద్వారా కువిమర్శకు సమాధానాలు ఇస్తూనే ,రామ, రామాయణ ఔన్నత్య -ప్రాశస్త్యాన్ని పునశ్చరణ చేసుకుందాము. **పరిశోధనాపద్ధతులు:** 1.నైతిక విమర్శనాత్మక పరిశోధన, 2.విశ్లేషణాత్మక పరిశోధన. **పూర్వపరిశోధనలు** : 1. తెలుగులో ఆధ్యాత్మ రామాయణాలు - పరిశీలన - శ్రీరామచంద్రమూర్తి - జె . సూర్యప్రకాశరావు - 1991 - బనారస్, 2.తెలుగు రామాయణాల్లో - శ్రీరామవాణి - బాబురావు మహంతి - పై . వీరేశలింగం - 2003 - బరంపురం, 3. రామాయణంలో రామరాజ్యం - ధర్మస్వామ్యం - జి . వెంకట లక్ష్మి - ఎల్లూరి శివారెడ్డి - 2003 - ఉస్మానియా.*

**Keywords:** రామాయణం, ఆత్మానాంమానుషంమన్యే, ధర్మమంటే ఏమిటి?, అగ్రశ్రేణి లక్షణాలు, ధర్మపరిరక్షణ, ఘనపుణ్యుడు, జితేంద్రియుడు, సత్యసంధత, సత్యపాలన రాజనీతిజ్ఞత, శ్రీమంతుడు, సుచరిత్రుడు, రమయతీతిరామః, రామోవిగ్రహవాన్ధర్మః.

## 1. ఉపోద్ఘాతం:

**"రామస్యఅయనమ్- రామాయణం"-** రామాయణం అంటే రామకథ కాదు. రాముడి జీవనం. రామ జనన కారణం మొదలుకొని రామావతార పరిసమాప్తి మధ్య కాలమే రామాయణం. రామాయణం జీవిత విలువలను బోధించడమే కాదు, వాటిని కాపాడేందుకు మార్గాలు కూడా చూపించింది. ఆదర్శ మానవుని గుణగణాలు ఎలా ఉండాలన్న వానికి రఘుకులోత్తముడైన రాముని ప్రతీకగా నిలబెట్టింది. రాముడు సాక్షాత్తు నారాయణుడై ఉండి కూడా పరిపూర్ణమానవుడిగా జీవించాడు. మనిషి మర్యాదాపురుషోత్తముడైతే దేవుణ్ణి మించిపోతాడని నిరూపించాడు. లోకం నువ్వుదేవుడివి అన్నా కూడా, **"ఆత్మానాంమానుషంమన్యే"** అంటూ నేను మనిషిని, దశరథుని కొడుకుని అని సగర్వంగా చాటుకున్నాడు.

జీవుడిగా జన్మించిన దేవుడు రాముడు. బాల్యం నుంచి చివరి వరకు రాముని ప్రతీ అడుగు, మాట, ప్రవర్తన సర్వజనులకు ఆచరణీయం. రామాయణంలో ప్రతీ సన్నివేశ - సంఘటనల్లో దేశ, కాలపరిస్థితులకు తగినట్లుగా రాముడు చూపించిన ప్రతిభ అనన్య సామాన్యం. విశ్వామిత్రుని యాగపరిరక్షణ, సీతా స్వయంవరంలో శివధనుర్భంగం, పితృవాక్య పరిపాలనకై వనవాసం మొదలైన సందర్భాల్లో క్రమంగా రాముడి బలపరాక్రమాలు, తెలివితేటలు, వినయ విధేయతలలో ఆదర్శప్రాయుడిగా మలిచాయి. రామాయణంలో రాముడి పాత్ర సుపుత్రుడిగా ప్రారంభమవుతుంది. కన్న తల్లి కౌసల్యతో పాటు సవతి తల్లుల అనురాగానికి పాత్రుడై ముగ్గురమ్మల ముద్దుల బిడ్డగా బాల్యం సాగుతుంది. కన్నతల్లి కాకపోయినా, కైకేయి కోరికపై అయోధ్య విడిచి అడవులకు మారుమాట్లాడకుండా వెళ్ళిపోయాడు. భరతుడు వేడుకున్నా, తన తల్లి మాట వెనక్కి తీసుకునేలా చూస్తానని చెప్పినా వినలేదు. ఏదో ఒక దారిన అధికారం చెజిక్కించుకోవడానికి ఆసక్తి చూపలేదు. దేశప్రజలంతా తన వెన్నంటే ఉన్నా, అధికార యంత్రాంగం యావత్తు బాహాటంగా రాముడి వెంటే ఉండి ఆయనకు మద్దతు ప్రకటించినా , ఆ ఆసరాతో సింహాసనం ఆక్రమించుకునే ఆలోచన చేయలేదు. శ్రీరాముడు తన ధర్మాన్ని తాను ఆచరించి చూపాడు. ఎవరెవరితో ఎప్పుడు, ఎక్కడ, ఎలా మెలగాలో, ఎలా ప్రవర్తించాలో తన ఆచరణ ద్వారా నేర్పి ప్రాజ్ఞుడయ్యాడు. అందుకే నేటికీ మానవ జాతికి ఆదర్శ ప్రాయుడయ్యాడు. రామః అయ్యతే అనేన ఇతి రామాయణం. దీనిని పఠించినంత మాత్రం చేతనే రాముని వలె ధర్మశీలురు అవుతారు.

## 2. ధర్మమంటే :

**"ధరతి విశ్వం ధర్మః", "ధరతి లోకాని తిధర్మః"** అని అమరకోశం. విశ్వాన్ని, లోకాలను, ధరించేది, జనుల చేత పూనబడేది ధర్మం. అంటే తప్పక ఆచరించవలసిన స్వభావం, నీతి, ఆచారం, నడవడిక మొదలైన వాటి సమాహారమే ధర్మం. ఈ ధర్మం మూర్తీభవించిన రూపమే రాముడు. ధర్మం ఆయన రూపం అయితే, సత్యం ఆయన ఆత్మ. దేహాత్మల పరస్పర సంయోగం చేత ఒక వ్యక్తి నామ రూపాలు ప్రకటమవుతాయి. ధర్మ సత్యాల సంయోగం

ఆవ్యక్తిని లోకారాధ్యుడిని చేస్తుంది. సర్వమానవాళికి ఆవశ్యకమైన పుత్ర, భ్రాతృ, శిష్య, భర్తృ , మిత్ర, శత్రు మొదలుగా గల ధర్మాలను స్వీయాచరణతో చూపి లోకానికి మార్గదర్శకుడయ్యాడు. ఇలా రామాయణం కావ్యేతిహాసమే గాక ధర్మశాస్త్రగ్రంథం కూడా అయింది. మానవ జీవితంలో ధర్మార్థకామములను మూడు పురుషార్థాలు సాధింపదగినవి ఈ త్రివర్గానికి ధర్మం మూలం. ధర్మ బద్ధాలు కానీ అర్థ కామాలు రెండూ అనర్థహేతువులు. ధర్మానికి విరుద్ధంగా పచ్చిస్వార్థంతో భరతుడికి రాజ్యాన్ని(అర్థమును) కట్ట బెట్టాలని చూసిన కైక లోక నిందకు గురైంది. ధర్మాన్ని వీడి కామాతురుడై, పరిస్థితులను ఆశించిన దుష్ట రావణుడు లోకాన అపకీర్తి పాలై సపరివారంగా నశించాడు. ధర్మబద్ధుడై రాజ్యాన్ని పరిత్యజించిన శ్రీరాముడు లోకారాధ్యుడయ్యాడు. సత్యధర్మైక నిరతుడిగా, ధర్మాన్ని దాని ఫలమైన అర్థాన్ని ఒకే త్రాటిపై నడిపిన వాడిగా నిలిచాడు. అందుకే **''రామోవిగ్రహవాన్ధర్మః''** అన్న సూక్తికి కారకుడయ్యాడు. ధర్మోరక్షతిరక్షితః అన్న లోకోక్తికి మూలంగా మారాడు.

**"ఎవ్వడు శ్రీమంతుడెవ్వడు శాంతు,**
**డెవ్వడు ఘన పుణ్యుడెవ్వడు న్నతుడు**
**ఎవ్వడు నీతిజ్ఞుడెవ్వడు ప్రాజ్ఞు,**
**డెవ్వడు దుర్ధముం, డెవ్వడు త్తముడు**
**ఎవ్వడు జిత కాముడెవ్వడ జేయు**
**డెవ్వడు నిరసూయు డెవ్వడాద్యూండు**
**ఎవ్వడు సువ్రతుండెవ్వడు దారు,**
**డెవ్వడు సుచరిత్రు డెవ్వడు సముడు**
**ఎవ్వని కిన్నకు నింద్రాది సురలు,**
**దవ్వు దవ్వుల నుండి తలకుచుండుదురు.. " 1**

మొదలైన అగ్రశ్రేణి లక్షణాలు పోత పోసిన ధర్మరూపం శ్రీరాముడు. వాటిలో మచ్చుకు కొన్ని విశ్లేషించే ప్రయత్నంచేద్దాము.

## 3. ధర్మపరిరక్షణ :

యక్షుడైన సుకేతుడికి బ్రహ్మవరం చేత వేయి ఏనుగుల బలం గల "తాటక" జన్మించింది. ఆమె యుక్తవయస్సుకి వచ్చాక, జంబాసురుడి పుత్రుడైన సుందుడికి ఇచ్చి వివాహం చేసాడు. వారికి మారీచ, సుబాహులను ఇద్దరు కొడుకులు పుట్టారు. హింస చేత, అధర్మం చేత జనులందరినీ బాధిస్తూ దుష్కృత్యాలకు పాల్పడుతున్న వీరిని అగస్త్య మహర్షి **"రాక్షసులు కండ నిశాపమిచ్చె"2** అది మొదలు మరింతగా లోకవినాశనాన్ని చేస్తున్న తాటక అనే రాక్షసిని చంపమని విశ్వామిత్రుడు రాముడితో చెప్పాడు. "స్త్రీని చంపడం ధర్మమా?" అన్న రామ సంశయాన్ని గమనించిన గురువైన విశ్వామిత్రుడు **"ఓరామా! అధర్మానికి ఒడిగట్టిన తాటకను వధించు. ప్రజలను పీడిస్తూ లోక వినాశనం చేసే ఈమె పనులలో అధర్మం తప్ప ధర్మం లేదు. ప్రజల మేలు కోరడం ధర్మపరిరక్షకుడైన రాజు కర్తవ్యం. లోకహితార్థమై సతుల బొదవిచంపుటయును బుణ్యంబులనఘ" 3** అధర్మానికి పాల్పడిన స్త్రీలను వధించడం. లోకహితానికి కారణమే తప్ప దోషము కాదు, అన్నాడు. గురువు మాట చేత సంశయ నివృత్తి అయిన

రాముడు తాటకను వధించి ధర్మాన్ని పాటించాడు.

## 4. ఘనపుణ్యుడు జితేంద్రియుడు :

ఇంద్రియ చాంచల్యం కలిగించే ఇంద్ర రూపాన్ని (ప్రతీకాత్మకంగా) చూడటం వలన 'ఇంద్రియలౌల్యం' పొందిన అహల్య మనసునందలి అధర్మం చేత **"పడతి పాషాణమై పడియుండు మీవు" 4** అని గౌతమునిచే శాపం పొందింది. విశ్వామిత్రుడితో కలిసి వస్తున్న రాముడు, గౌతముని ఆశ్రమంలో ప్రవేశించాడు.

**"ప్రభుమేనిపై గాలి పై వచ్చినంతనే పాషాణ మొకటికి స్పర్శవచ్చె**
**ప్రభుకాలిసవ్వడి ప్రాంతమైనంతనే శిలకొక్క దానికి జెవులుకలిగె**
**ప్రభుమేనినెత్తావి పరిమళించినతోన యశ్మంబు ఘ్రానేంద్రియంబుచెందె**
**ప్రభునీలరత్నతోరణమంజులాంగంబు కనవచ్చి రాతికి గనులు కలిగె**
**నా ప్రభుండు వచ్చి యాతిథ్యమును స్వీకరించినంత నుపలహృదయవీథి**
**నుపనిషద్వితాన మొలికి శ్రీరాముభద్రాభిరామమూర్తి యగుచుదోచే." 5**

పైపద్యంలోచెప్పినట్లుఇంద్రియనిగ్రహంకోల్పోవడంచేతచలనంలేకపాషాణంలాకనిపించినఅహల్యపంచేంద్రియజ్ఞానం కలిగిపవిత్రురాలయింది. ఈవిధంగారాతినినాతిగామలచినరాముడుఘనపుణ్యుడు, జితేంద్రియుడు.

## 5. సత్యసంధత :

దశరథుడు ధర్మాన్ని ఆచరించినప్పటికీ, సత్యప్రతిజ్ఞను త్యజించాడు. (కేకయ రాజుకిచ్చిన మాట నిలబెట్టు కోలేకపోవడం) బహు గుణాలు కలిగిన రాముణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేయాలన్న సంకల్పం గొప్పదైనా, సత్య దూరత చేత సంకల్ప విఘాతం కలిగింది. రాముడు ఆసత్య విఘాతాన్ని తొలగించి తన తండ్రి యొక్క సత్యప్రతిజ్ఞను నిలపడానికి అడవులకు వెళ్ళాడు.

## 6. సత్యపాలన :

అరణ్యవాసోపయుక్తమైన నారచీరలు ధరించి వనవాసులైన సీతారామలక్ష్మణులు మహర్షుల ఆశ్రమానికి వచ్చారు. అక్కడ వైఖానస, వాలకిల్యాది మహర్షులు దుష్ట రాక్షసుల వలన హింసకు గురవుతున్నారు. ఆహింస నుంచి తాపసులను, మహర్షులను, వనమృగాది పశుపక్ష్యాదులను రక్షించాలని శ్రీరాముని వేడుకున్నారు. ఇనకులసంజాతుడు, ధర్మాత్ముడైన రాముడు "రాక్షసులను సంహరించెదనని" మహర్షులకు అభయమిచ్చాడు. అప్పుడు సహధర్మచారిణి అయిన సీతాదేవి " వైరభావం లేకపోయినా మానవులు అజ్ఞానంతో ఇతర ప్రాణులని హింసిస్తారు. ఇచ్చిన మాటకు కట్టుబడే మీరు ఇలా రాక్షసులను చంపుతాననటంతో నా మనసు వ్యాకులత చెందుతోంది" అన్నది. అప్పుడు రాముడు

**"ఉత్తమ రాజధర్మైక్యపరులు, శరచాపములు దాల్చి చరియించుటెల్ల శరణాగతులగా వజర్చింపగాదె**

**నమ్మహామునులతో నాడిన ప్రతినయిమ్మెయి .. గావింతు నిదియె నిశ్చయము"6** అధర్మవర్తనులై, సామాన్యులను హింసిస్తూ, ధర్మ కార్యవిధ్వంసనం చేస్తూ, ఋషులకు విరోధులైన రాక్షసులు నాకు శత్రువులే. మహర్షులకు ఇచ్చిన మాట నిలబెట్టుకోవడానికి సత్యపాలనయే నాకు ఇష్టం. మాట నిలుపుకోవడానికి ప్రాణాలను సైతం విడుస్తాను" అని సమాధానం ఇస్తాడు.

## 7. రాజనీతిజ్ఞత :

తమ్ముడి యందు అధర్మవర్తనుడు, దుష్కృత్యుడు, దుష్టప్రవర్తనాపరుడు, దూరాత్ముడు అయిన వాలి- సుగ్రీవుడిని తరిమేస్తాడు. ధర్మాలోచనా పరుడై హనుమ సహాయంతో సుగ్రీవుడు రామమైత్రి చేసాడు. వాలి- సుగ్రీవ యుద్ధంలో రాముడు వాలిని సంహరించాడు. కొనప్రాణంతో ఉన్నవాలి, **" ఓరామా! నేను నిరపరాధిని. నిన్ను ఎదిరించలేదు. నీతో యుద్ధం చేయాలనుకోలేదు. నీకు అపకారం చేయలేదు. వేరేవారితో యుద్ధం చేస్తుంటే నువ్వు నన్ను చెట్టు చాటు నుండి కూలదోసావు. భరతుండు తగుగాక పట్టిశిక్షింప నీకు కారణమేమి నీవు భూపతివె?" 7** అన్నాడు. అప్పుడు రాముడు **చపలుడవై ధర్మశాస్త్రంబు తెరగు తెలియక నీవు నాదెసదప్పు మోపిపలికెద విది ధర్మపద్ధతికాదు 8** ధర్మార్థకామములను, లౌకిక ఆచారాలను తెలుసుకోకుండా అజ్ఞానంతో తప్పుపడుతున్నావు. జంబుద్వీపమంతా ఇక్ష్వాక ప్రభువుల ఆధీనంలోనిది. **" పతి అయిన భరతుని పంపున వచ్చి దుష్ట మృగముల, దుష్టరాక్షసుల సృష్టిపై మేము శిక్షించుచుండుము "9** అంతే కాక తమ్ముడి భార్యను చెరగొన్న నీవుపాతకుడవు. కాబట్టి నిన్ను చంపాను."అని ధర్మ పరిరక్షణకై సంచరిస్తున్న శ్రీరాముడు రాజనీతిజ్ఞతను చూపించాడు.

## 8. శ్రీమంతుడు :

రాముడు సీతను అనుమానించలేదు. అగ్నిప్రవేశం చేయమనలేదు. ఆమెను విడువ లేదు. సీతామాత తనంత తానుగా తీసుకున్న నిర్ణయం అది. ఇది తెలియని కొందరు అనవసర కువిమర్శలు చేస్తుంటారు. రామాయణతత్త్వం తెలియాలంటే రామాయణం పూర్తిగా అవగాహన చేసుకోవాలి.

## 9. ధర్మం :

సుచరిత, సత్యసంధత, రాజనీతిజ్ఞత మొదలైన పెక్కు సద్గుణాలు మూర్తీభవించిన ధర్మాత్ముడైన రాముడికి పశు, పక్షి, వానర, దేవ, దానవ, రాక్షస, గంధర్వాది సమస్త ప్రాణులు సహాయం చేశాయి. చివరికి సర్వాన్ని దహింప చేసే అగ్ని కూడా రాముడి మనోరూపమైన వైదేహి పాతివ్రత్యాన్ని, స్వచ్ఛతను నిరూపించి రాముని చెంతకు చేర్చాడు. నేటికీ రామో విగ్రహవాన్ధర్మః అన్న ఆర్యోక్తికి నిదర్శనంగా తన ధర్మపత్నిని విడువకుండా ఆ రాజారాముడు వామాంకస్థిత జానకితో కూడి మన తెలంగాణలోని భద్రాద్రిపై స్వయంభువుగా వెలిశాడు.

## 10. సుచరిత్రుడు:

తాటకకొడుకు, అధర్మవర్తనుడు,ఘోరరాక్షసుడైన మారీచుడు సిద్ధాశ్రమంలో విశ్వామిత్రయాగంలో రామునిచేత కొట్టబడి వేయి యోజనాల దూరంలో స్మృతి లేకుండా పడిపోయాడు. కొంత సేపటికి తెప్పరిల్లి రాముని యుద్ధకౌశలాన్ని తలచుకుని భయపడ్డాడు. అప్పటి నుంచి రాక్షస కృత్యాలు మానేసాడు. అరణ్యంలో మహర్షిలా కృష్ణాజినం, నారచీరలు ధరించి తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. శూర్పణఖ దుర్బోధ చేత ప్రేరేపితుడై రావణుడు మారీచుడి సహాయంతో సీతను అపహరించి, రాముడిని నిర్జించాలన్న ఆలోచనతో మారీచుడి ఆశ్రమానికి వచ్చాడు. రావణుడి రాకకు కారణం తెలుసుకున్న మారీచుడు పలు విధాల రావణుడికి అతని ఆలోచన తప్పని నచ్చజెప్పే ప్రయత్నం చేసాడు. కానీ రావణుడు తన ఆలోచనను సమర్ధించుకుంటూ రాముడిని అనేక రకాలుగా తప్పు పట్టాడు. తన ఆజ్ఞను మారీచుడు తప్పక పాటించాలన్నాడు. ఆమాటలకు మారీచుడు "నువ్వు చేసిన ప్రతిపాదనలన్నీ రాముడు కాదు. రాముడంటే నాకు తెలుసు. రాముని పసిప్రాయంలోనే ఆమహాపురుషుని వీరశౌర్యాలు నేను అనుభవ పూర్వకంగా చూశాను.అప్పటి నుంచి ఇప్పటి వరకు ఏదీ చూసినా రామ మయంగా కనిపిస్తోంది"-

**"ఎరుగని వారి గూర్చి........అధర్మ పథ కచ్చరమైన నుగాల ద్రోసెదున్" 10**

**"తాను గనాకృతిం గనిన ధర్మము రాఘవుండని" 11**

రాముడు మూర్తీభవించిన ధర్మమని పొగిడాడు. రాముడి స్వరూపం, వ్యక్తిత్వం, పరాక్రమం సమస్త మానవ దేవేంద్రాది జాతుల్లో అనితర సాధ్యం అని రావణుడికి హితవు పలికాడు.ఎన్ని చెప్పినా పెడచెవిన పెట్టిన రావణుడితో చివరకు నీఆజ్ఞమీరితే నీచేతిలో మరణం ఖాయం ,దాని కన్నా రాముని చేతిలో మరణం నాకు నయం అన్నాడు.మారీచుడు తాను చనిపోతాడని తెలిసి కూడా రాముడి చేతిలో మరణానికి సంసిద్ధుడై రాక్షసత్వాన్ని వీడి రాముడి స్మరణ, దర్శన, స్పర్శనాధులు చేత "రామోవిగ్రహవాన్ధర్మః" అన్న ఆర్యోక్తికి సాక్షీ భూతుడై మోక్షాన్ని పొందాడు. ధర్మం సనాతనమైనది.

## 11. రమయతీతిరామః

పుట్టుక తోనే తన రూప సంపద చేత సంతోషాన్ని కలిగించిన రాముడు తనజీవన పర్యంతం సకల గుణ సంపద చేత మూర్తీభవించిన ధర్మమయ్యాడు. రాముడి పెక్కుగుణాలను ధర్మానికి ఆధారమైన ఉపనిషత్తులకే సంపూర్ణంగా కీర్తించ శక్యం కాలేదు. వేదవేదాంగాల నుండి ఆధునిక శాస్త్ర విజ్ఞానాల వరకు ఎంతో సంపదను పోగేసుకున్నా, సత్ప్రవర్తన అంటే ఏంటో తెలిపినారు. రుజుమార్గంలో బతకలేకపోతున్నాడు మానవుడు. రాముని చూసి ఎలా బతకాలో తెలుసుకోవాలి. రాముని ఆదర్శాలు ఆకళింపు చేసుకుని ఆచరిస్తూ, ఆయన చూపిన బాటను అనుసరిస్తే ప్రతి మానవుడు మహనీయుడు అవుతాడు.

## 12. ముగింపు:

త్రేతాయుగ సమాజానికి - కలియుగ జీవనానికి మధ్య ఎన్నో పోలికలు ఉన్నాయి. యుగాలు మారినా, తరాలు గడిచినా మనిషిమారలేదు, కానీ ధర్మంపట్ల చిత్తశుద్ధిలోనే బుద్ధివక్రత అధికమైంది. ఆ వక్రాధిక్యతను అధికమించగలిగితే సర్వం రామమయమే. రామకథకు ఆత్మ అయిన ధర్మమే సర్వకాల సర్వావస్థల్లో ప్రపంచాన్ని నిలబెట్టే సాధనం. ధర్మంమాత్రమే మనిషిని తలెత్తుకునేలా చేస్తుంది. వృత్తి ధర్మాలకు అతీతమైనదే మానవధర్మం. మానవరూపంలో అవతరించిన రాముని నిలువెత్తు రూపం ధర్మానికి పోతపోసిన రూపమే. మర్యాదాయా స్థితో ధర్మః-అన్న వేదవ్యాసుని మాటకు అసలైన అర్థం తన పరిమితుల్లో తనను ఉంచుకోవడమే.అదే ధర్మం . శమః శౌచస్య ఆత్మనిగ్రహమే దానికి మార్గం. అది తెలిసినవాడు కనుకనే విగ్రహవాన్ ధర్మః అని రాముడు అనిపించుకున్నాడు. మహాజనోఏనగతస్సపంథా-గొప్పవాళ్ళు నడిచిన దారిలోనే మనము నడవాలి. రామాయణమే దారి దీపం. ఆ దీపంవెలుగుని ఉపయోగించుకుంటూ రాముడు చూపిన దారిలో ధర్మమార్గంలో ఎంతవరకు జీవనయానం చేయగలరనేది వ్యక్తి సంస్కారం నిర్ధారిస్తుంది. ఆ సంస్కారం సంస్కృతితో అలవడుతుంది. అందుకు రామాయణ పఠనం పరమావధి. ఆ పఠనం జీవనం కావాలి. ఆ జీవనం ధర్మబద్ధంగా మారాలి. ధర్మాన్ని మించిన కొలమానం లేదు కనుకనే రాముడు రామోవిగ్రహవాన్ ధర్మః అనేంతగా ధర్మ స్వరూపుడిగా నిలిచాడు.

## 13. పాదసూచికలు:

1.రంగనాథరామాయణం, గోనబుద్దారెడ్డి,బాలకాండకథాప్రారంభము, పుట 5

2.రంగనాథరామాయణము - పుట 30.

3.రంగనాథరామాయణము - పుట 30.

4.రంగనాథరామాయణము - పుట 57 .

5.రామాయణకల్పవృక్షము – పుట 147

6.రంగనాథరామాయణము - పుట174.

7.రంగనాథరామాయణము- పుట 248.

8.రంగనాథరామాయణము - పుట249.

9.రంగనాథరామాయణము - పుట249.

10.శ్రీమద్రామాయణకల్పవృక్షము - పద్యం165, పుట 109 .

11.శ్రీమద్రామాయణకల్పవృక్షము - పద్యం 195, పుట112.

## 14. ఉపయుక్తగ్రంథసూచి:


1. కృష్ణమాచార్యులు, యం. మరియు వెంకటరామయ్య, గోలి. శ్రీమద్రామాయణం, గీతాప్రెస్ ప్రచురణ, హైదరాబాదు, 2004.
2. నాగయ్య, జి, తెలుగు సాహిత్య సమీక్ష, నవ్యపరిశోధక ప్రచురణలు, తిరుపతి, 2004
3. ప్రభాకర శాస్త్రి, వేటూరి, రంగనాథ రామాయణం, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్, 2016
4. విశ్వనాథ సత్యనారాయణ, శ్రీమద్రామాయణ కల్పవృక్షం, శ్రీ విశ్వనాథ పబ్లికేషన్స్, విజయవాడ, 2008
5. విశ్వనాథ సత్యనారాయణ - కల్పవృక్ష రహస్యాలు-పిఎస్ &కొ.గుంటూర్ 1976
6. శ్రీహరి, రవ్వా, భాస్కర రామాయణము విమర్శాత్మక పరిశీలనము, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాద్ ప్రచురణ 1988
7. సుజాతా రెడ్డి, ముదిగంటి, సంస్కృత సాహిత్య చరిత్ర, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్, 2021
8. సుబ్బారావు, వావిలికొలను, శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము ‘మందరము’ (మూలము), శ్రీ కోదండరామసేవక ధర్మసమాజం, దాసకుటి-అంగలకుదురు, (1982)


***


AUCHITHYAM
ISSN: 2583-4797
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_43.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 43. కళాపూర్ణోదయం: రామకథ

**డా. అక్కెనపల్లి వెంకట్రాంరెడ్డి**
తెలుగు సహాయ ఆచార్యులు,
తెలంగాణ మహిళా విశ్వవిద్యాలయం, కోఠి, హైదరాబాద్.
హైదరాబాద్, తెలంగాణ.
సెల్: +91 9700206444. Email: ramuavr@gmail.com

**వ్యాససంగ్రహం:**

*పింగళి సూరన రచించిన కళాపూర్ణోదయ కావ్యం రెండవ ఆశ్వాసంలో రామాయణ కథ ఉన్నది. చిత్రకథలతో, విచిత్ర కథాగమనంతో కూడిన కళాపూర్ణోదయంలో కావ్య నాయకుడు మణికంధరుడు నారదుని బోధతో తీర్థయాత్రలకు ఉపక్రమిస్తాడు. అనేక క్షేత్రాలను దర్శిస్తూ అందులో భాగంగా అయోధ్య చూసినపుడు, ఏమీ పలకని, ఇతడు దర్భశయనం చేరగానే రామాయణ గాధను మననం చేస్తాడు. ఈ స్మరణ శ్రీరాముని కీర్తించే స్తోత్రంవలె కాక, రామాయణ గాధను, అద్దంలోచూపించే ప్రతిబింబంవలె, పూర్తి కథను అక్షరబద్ధం చేయడం విశేషం. కావ్యంలో ఉన్న వస్తువువేరు, సందర్భోచిత గాధలువేరు. కానీ తీర్థయాత్ర నెపంతో కావ్యకర్త రామాయణ గాధను తన కావ్యంలో జతపరుచుకున్నాడు. కథను నిర్మించడంలో సూరన వైచిత్రి ప్రియత్వం, ద్వైతాద్వైత సంబధితనాటి సమాజ స్థితిగతులను స్మరించడం, సూరన రచనా చమత్కారం, ప్రతిభ ఔచిత్యాలను వివరించడం ఈ వ్యాసంలోని ప్రధాన అంశాలు.*

**Keywords:** కళాపూర్ణోదయం, నారదుడు, మణికంధరుడు, తీర్థయాత్ర ,దర్భశయనం, రామాయణకథ.

## 1. ఉపోద్ఘాతం:

కళాపూర్ణోదయం రాసిన 'కతరాజు'గా పేరున్న పింగళి సూరన సంప్రదాయ తెలుగు సాహితీకారులలో కీర్తి గడించినవాడు. ఇతను రాసిన 'కళాపూర్ణోదయం', 'ప్రభావతి ప్రద్యుమ్నం' తెలుగు సాహిత్యంలో అపూర్వ కథారచనలు. కథాకల్పనలలో అతనికున్న ప్రతిభ ఇంకెవరిలోను కనిపించదు. పురాణపాత్రల్ని వాడుకుంటూ పూర్తిగా స్వయంకల్పిత కథల్ని అల్లడంతోపాటు ఉత్కంఠత పెంచుకుంటూ ప్రధానకథను చెప్పటంలో ఇతనికితనే సాటి. రాఘవపాండవీయం అనే రెండర్థాల కావ్యం రాసిన ప్రతిభామూర్తి పింగళి సూరన. అది కూడా రామాయణ

సంబంధితమే. మాట విరుపు వల్ల, ఉచిత శబ్దశ్లేష, ముఖ్య గౌణవృత్తి శ్లేష, అర్థాన్వయ శ్లేష మరియు శబ్దాన్వయ శ్లేషలనే నియమాలతో ఈ ద్వర్థికావ్యంలో సూరన పదాలతో గారడీ చేయగలిగాడు. అంతకన్నా గమ్మత్తు ఈ కళాపూర్ణోదయ కావ్యసృష్టి.

సూరన కాలం దాకా తెలుగు కవులందరూ తమ కావ్యాలను పురాణాల నుంచో, ఇతిహాసాలనుంచో తీసుకున్న వాళ్లే. కానీ స్వయంగా ఒక కథను కల్పించి సజీవ పాత్రలను సృష్టించి స్వతంత్ర రచన చేయలేదు. సూరన మొట్టమొదటగా కళాపూర్ణోదయంలో అటువంటి ప్రయత్నం చేశాడు. అపూర్వకథాసంవిధానవైచిత్రి, శృంగారప్రాయత, పుణ్యవస్తువర్ణన అనే విశేషాలతో కూడిన ఈ కావ్యం ఎనిమిది ఆశ్వాసాల ప్రబంధం.

నవలలాగా, నాటకంలాగా ఈ కావ్యం అంత తొందరగా అర్థం కాదు. మదాశయుడు, రూపానుభూతి, సత్యదాత్ముడు, దత్తాత్రేయుడు, యజ్ఞశర్మ మొదలైన మానవపాత్రలు, మాయారంభ, మాయానలకూబరులనే సందిగ్ధ పాత్రలు, ఇంద్రలోకపు చిలుక, స్వభావుడనే సిద్ధుడు, అభినవ కౌముది అనే గంధర్వ స్త్రీ తదితర చిత్ర పాత్రలను కలిపి, మణికంధర హారం బీజంగా 'దేవవిమానంలో' పాఠకుడిని ఆహ్లాదపరిచి రససంద్రంలో ముంచెత్తివేస్తుంది ఈ కావ్యం. ఈ కావ్యము గొప్పదనాన్ని ఆధునిక సాహిత్య విమర్శకుడు కట్టమంచి "**ఇందులో నవరసాలున్నవి అష్టాదశ వర్ణాలున్నవి సర్వ రసముల వర్ణనలు చేర్చి ఒక కథ రాయడం అసాధ్యం కాకపోయిన, సామాన్య సాధ్యం కాదు**" అని వేనోళ్ళ కీర్తించాడు.

"**రాఘవ పాండవీయం రాసిన తర్వాత సూరనలో చాలా మార్పులు వచ్చాయి. ఆయన పూర్వం లలాటేక్షణ భక్తిశీలుడు. ఇప్పుడు విశిష్టాద్వైతిగా మారారు**" (స.ఆ.సా, పుట. 203) అంటూ ఆరుద్ర రాసిన మాటలకు తగినట్లు కళాపూర్ణోదయంలో రెండు ఘట్టాలు మనకు కనిపిస్తాయి.

ఒకటి ప్రథమాశ్వాసంలో కలభాషిణిచే చెప్పబడిన విష్ణు దండకం. రెండవది ద్వితీయ ఆశ్వాసంలో మణిస్తంభునిచే దర్భశయనమున రామభద్రుని 'వీణావాదనానువాద మేదురగాన' కౌశలంతో చేసిన స్తుతి. ఆరుద్ర మాటను బలోపేతం చేస్తూ కళాపూర్ణోదయాన్ని అకాడెమి వారు ప్రచురించే సమయంలో సంపాదకీయం వహించిన శ్రీ మరుపూరు కోదండ రామరెడ్డి గారి మాటలు కూడా ఇక్కడ స్మరణీయం.

"**సూరన లలాటేక్షణ భక్తి శీలుడు, కానీ యీ కృతి భర్త నంద్యాల కృష్ణంరాజు శ్రీ విష్ణుధజనైకశీలుడును వైదికమత రక్షణాదరుడును అగుటచే మణికంధరునిచే విష్ణుతీర్థములనే దర్శింప జేయుచున్నాడు. తెలుగువారిలో చాల మంది శివకవులిద్దరిని సేవించు స్మార్తులగుటచే, కవి తన శివభక్తిని అమ్ముకొన ఆగత్యంలేదు. దక్షిణాదిన శివాలయములే మెండైనను సూరన వైష్ణవక్షేత్రములనే పేర్కొనుచున్నాడు**" (కళాపూర్ణోదయం, పింగళి సూరన, ద్వితీయ ఆశ్వాసం, పుట. 124)

## 2. కళాపూర్ణోదయం- రామకథ:

తెలుగు సాహిత్య స్వర్ణయుగంగా పేరొందిన పదహారవ శతాబ్దపు ప్రబంధకాలంలో వచ్చిన విశిష్ట కల్పిత ప్రబంధం "కళాపూర్ణోదయం" మూడు లోకాలతో ముడిపడిన కథాంశంతో అల్లిబిల్లిగా అల్లుకున్న అందమైన ఉద్యానవనం వంటి ఇతివృత్త సంబంధ వర్ణనలతో ఉన్న ఈ ప్రబంధంలో ప్రధాన కథకు అనుబంధంగా రామకథ ఉంది. సామాజిక భోగలాలసత, భక్తి కన్నా శృంగారరస ప్రాధాన్యతకె పెద్దపీట వేసిన ప్రబంధరచనలో కావ్యాంతర్గతంగానైనా నిండైన భక్తిభావంతో రామకథను సంక్షిప్తంగా స్తుతించడం మరియు మార్గ సంప్రదాయంలో వచ్చిన ఈ ప్రబంధ రచనలో దేశీయ ప్రక్రియ అయిన రగడలో రామకథను చెప్పడం విశేషం. ఇందులో "అ**హిత విదళనాతి రౌద్ర/ యార్త పాలన వినిద్ర/ మహిత నిఖిల గుణ సముద్ర/ మమ్ము బ్రోవు రామభద్ర**" అని మొదలై (కళాపూర్ణోదయం, పింగళి సూరన, ద్వితీయ ఆశ్వాసం, పుట. 159) అని మొదలై 28 పాదాల రగడ అనంతరం ఒక అందమైన కందంతో రామాయణకథ సంక్షిప్తరూపం పూర్తి అవుతుంది.

## 3. రచన వైశిష్ట్యం:

కావ్య రచనకు కావాల్సిందేమిటో సూరన కావ్యంలోని పాత్రలచేత చెప్పించారు. కలభాషిణి రామాయణ గాథను గానం చేసిన మణికంధరుని కవిత్వాన్ని ప్రస్తుతించే ఘట్టంలో ఉన్న ఈ పద్యం, సూరనతన కవిత్వానికి ఇచ్చిన కవిత్వ నిర్వచనం అనుకోవచ్చు.

"**పొసగముత్తెపుసరుల్పోహళించినలీల,**

**ధమలోనదొరయుశబ్దములుగూర్చి.**" (కళాపూర్ణోదయం, ప్ర.ఆ, పుట. 47)

సుమారు 192 గద్య పద్యాలతో కూర్చబడిన ద్వితీయ ఆశ్వాసంలో ఉత్సాహం, లయగ్రాహి, మానిని అక్కడక్కడా ఉపయోగించబడ్డాయి. తురగవల్లభరగడ ఒక్కసారి మాత్రమే ఉండడంలో సంపూర్ణ రామాయణ కథాస్మరణను ఒక్క ధారలోచేయాలన్న కవి సంకల్పం ఇందుకు ఆధారం.

నారదునిచే భగవత్ సన్నిధానం నిరంతరం లభించే వివిధ పద్ధతులను మణికంధరుడువిన్నాడు. ఆ తర్వాత శ్రీకృష్ణుని అనుగ్రహంతో లభ్యమైన అనన్య అసాధారణ సంగీత చాతుర్యంతో పుణ్యక్షేత్రాల్లో సంచారం చేస్తూ, గోవింద నామస్మరణ సంకీర్తనతో ఆసేతుహిమాచలం వివిధ క్షేత్రాలు సందర్శిస్తూ అనంతశయనంలో కొంతకాలం నివాసం చేశాడు. దర్భశయనంలో అతడు చేసిన విష్ణునామ సంకీర్తనమే మన రామాయణ కథాస్మరణం. వెన్నెలకు కమ్మదనం, చల్లదనం ఉన్న కర్పూరపు పలుకులకు నున్నదనం వస్తే ఆ పలుకులకు కమ్మదనం అలదినట్లు అవుతుంది. అలాగే వెన్నెలకు తోడైన, కమ్మగా చల్లగా ఉండే గాలికి తీయదనంకూడా అబ్బితే- "**చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము/కలిగినను సౌరభవము జలువయుదలిర్పం**"(కళాపూర్ణోదయం,ప్రథమ ఆశ్వాసం, పుట. 83)

అప్పుడు సుకవిత్వం చెప్పగలగడం అటువంటి లక్షణం అవుతుంది. అటువంటి శక్తి మణికంధరుడికి కలదని కలబాషిణి చెప్తుంది. కానీ పరోక్షంగా సూరన తన కవిత్వం గురించి తానే చెప్పుకున్నట్టు మనం గ్రహించవచ్చు. మణికంధరుడు ప్రధానంగా 'వీణా వాదనానువాదమేదరుగాన కౌశలుడు'. "**సతతసితయశోభిరామ సర్వలోకపూర్ణధామ**" (కళాపూర్ణోదయం, ద్వితీయ ఆశ్వాసం, పుట. 91) పై పద్య పాదాన్ని గమనిస్తే మణికంధరుని రూపంలో సూరన వెలువరించిన 'జాతిరత్న' స్వభావం మనకు అర్థమవుతుంది. జాతిరత్నం తనను ధరించమని ఎవరినీ ఆశ్రయించదు. సూరన వర్ణించిన రామాయణ కథా సంక్షిప్తరూప కథానాయకుడైన రాముడు, అహిత నిఖిల గుణ సముద్రుడు, జాతిరత్నం.

## 4. సామాజిక అంశాలు:

మణికంధరుడు ఎన్ని క్షేత్రాలు తిరిగినప్పటికీ ఆయా క్షేత్రాల వైభవాన్ని వర్ణించాడే కాని, ఆయా తీర్థ క్షేత్రాలలో వెలసిన దైవ మూర్తుల, పురాణగాథలను ఇంత విపులంగా వివరించలేదు. తపస్సు వల్ల రాముడు పుట్టినప్పటికీ 'గురువచోను పాలనాతి కుతక విధుత రాజ్యభోగము'లు కలవాడు. గురువు అనగా తండ్రి. అమిత బాహుబల సంపన్నుడు కాబట్టే అతి ఘనమైన శంభుచాపాన్ని ఇక్షుఖండంగా భంగపరచాడు. సహృదయం కలవాడు కాబట్టే భరతునికి పాదుకలను ఇచ్చి ఆనందపరిచాడు పింగళిసూరన, ఇలా ఒక కుటుంబంలోని సంబంధానుబంధాలను దృఢతరం చేసే సన్నివేశాలను స్వీకరించి, కథానాయకుని అపార బలపరాక్రమాలను ఎత్తి చూపుతూ, నాటి కాలపు సమాజానికి ధర్మబోధ చేశాడు. ఈ క్షేత్ర సందర్శనలో మణికంధరుడు వర్ణించిన రాముడు సాక్షాత్తు విష్ణువే. కేవలం భక్తి ప్రధానంగా సాగిన ఈ స్తుతిలో రాముని నామం, తారకమంత్రం.

"**పరమంబగు నీనామం/ కరమామ్నాయములు తారకబ్రహ్మముగా**

**నిరతిన్వినుతింపగ నా/ తరమే నిను నభినుతింప దశరథరామా**" (కళా,ద్వితీయ ఆశ్వాసం, పుట. 93)

అంటూ వర్ణిస్తాడు మనణికంధరుడు.

శబరి ఇచ్చిన ఫలాదుల స్వీకరించి అనుగ్రహించడం, గుహుడు భజన చేసిన కారణంగా సమస్త పుణ్యాలు సాధించిన వానిగా చేయడం, సమాజంలో నిమ్నవర్గాలుగా గుర్తింపబడిన వారిని ఆదరించే ఘట్టాలుగా కవి స్వీకరించాడు. పరిపాలనాపరమైన రామరాజ్య ప్రస్తావన కన్నా రామనామ ప్రస్తుతి ఎక్కువగా ఈ రామాయణ కథలో ఉన్నది. 'యతిజపార్థ పుణ్య నామ, యతివితీర్ణ భక్తకామ' అని వర్ణించడంలో రామనామ బలంఎంత గొప్పదో పఠిత దృష్టికి తేవడం కవి లక్ష్యం కావచ్చు. ఒక విధంగా రాముని కన్నా రాముని నామం మిన్న అని, ఈ కళాపూర్ణోదయంలోని రామకథ తెలియజేస్తుంది.

## 5. ఔచిత్యం, ప్రయోజనం:

మణికంధరుడు నారద శిష్యుడు. నారదుడు విష్ణు నామస్మరణ ప్రియుడు, నిరంతర నారాయణ శబ్ద ఉచ్చారణ పుణ్యవ్రత నియమం కలవాడు. కాలస్వభావానికిలోనై ఎంత కలభాషిణిని వర్ణించినా, రంభాది అప్సరస స్త్రీలను పోల్చి సాధారణునిలాగా కవిత్వం చెప్పినా, "**శ్రీకామినీకామితాకార, సాకారకారుణ్యధారా ....**" (కళాపూర్ణోదయం, పింగళి సూరన, ప్రథమ ఆశ్వాసం, పుట. 45) అంటూ నిర్మలమైన భక్తితో కృష్ణుని స్తుతించి అతనిచే రత్నహారాన్ని బహుమానంగా పొందినవాడు."**....దైత్యారాతి యీ దండకంబునకు మెచ్చునునిచ్చినట్టిది గదాభూరి ద్యుతిన్... విమల రత్నోదారహారంబు....**" (కళాపూర్ణోదయం, ప్రథమ ఆశ్వాసం, పుట. 84) అంటూ కలభాషిణిచే గుర్తింపబడి ఆ దండకంలోని సొగసు, శబ్దసౌకుమార్యం సంగీత సాహిత్యాలకు నిజమైన అలంకారాలు అని నిరూపించే ప్రయత్నం ఇది. నారదుడు శ్రీకృష్ణుని ఆజ్ఞ మేరకు రుక్మిణి సత్యభామల వద్ద ఒక సంవత్సరకాలం శిష్యరికం, గానవిద్యా రహస్యాలను నేర్చి పరిపూర్ణ పాండిత్యం సంపాదిస్తే, ఆ నారదుని శిష్యరికంతో మణికంధరుడు శీఘ్రంగా సంగీతాన్ని సాధించి 'వీణా వాదనానువాద మేదరుగాన' కుశలత్వం కలవాడైనాడు.

ఇక పుణ్యతీర్థక్షేత్ర సందర్శనల కారణంగా ఏర్పడిన ఈ సందర్భమే భక్తి ప్రపూరితం. తుంబురుని పిలిచి మహావిష్ణువు పాట వినడమే గొప్ప. మరి శాశ్వతంగా వైకుంఠంలో నివాసం ఉండగలగడం ఎంతో పుణ్యాత్ములకు గాని లభించని అన్న మణికంధరుని మాటలకు, నారదుడు విష్ణు సంకీర్తనమే నిరంతర భగవత్ సన్నిధానానికి అనువైన పద్ధతిగా చెప్తాడు. శ్రీకృష్ణుని అనుగ్రహంతో లభించిన అనన్య అసాధారణ సంగీత చాతుర్యాన్ని వృధా చేయక పుణ్యక్షేత్రాల్లో తిరిగి ముకుందుని నామాన్ని స్మరించమని నారదుడు మణికంధరుడికి చేసిన ఉపదేశం భక్తి భావాన్వితం. ఈ తీర్థయాత్రా సందర్శనంలో మణికంధరుడు:

"**పదపద్మములజిక్కిపాయదునాదృష్టి తనకాంబరమునకేకరణిదెత్తు.....**" (కళాపూర్ణోదయం,ద్వి.ఆశ్వాసం, పుట.93) అంటూ పరమానందంలో ఇతర ప్రపంచాన్ని మర్చిపోతాడు మణికంధరుడు. శ్రీ రంగేశున్ని చూసిన, కంచి ఏకామ్రనాథుని, కామాక్షిని, వరదరాజదేవుని.... ఎవరిని చూసినా అనంత భక్తితో ఆనంద పరవశుడై గానం చేసిన మణికంధరుడు, రామచంద్రుని దర్భశయనంలో దర్శించి అనంత రామాయణ గాథ జ్ఞప్తికి వచ్చేటట్లు స్మరించడంలో చిత్రమేమీ లేదు. కానీ అయోధ్యలో చేయని రామాయణ కథా స్మరణం దర్భశయనంలో చేయడం చిత్రమే. కాశి, అయోధ్య, గంగా సాగర సంగమంబు అంటూ వేగంగా దాటేసిన మణికంధరుడు దర్భశయన రాముని చూసి మాత్రం సంపూర్ణ రామాయణ కథను స్మరిస్తాడు. "**కళాపూర్ణోదయంలోని మణికంధరుని భక్తియాత్ర మధురతో ఆరంభించబడి తిరుపతిక్షేత్రంలో మూడురోజులు గడిపి అనేకక్షేత్రాల్లో స్థలదేవతలను స్తుతిస్తూ సాగినప్పటికీ కథమాత్రం రామునిదే చెప్పబడింది**" (కళాపూర్ణోదయం, ద్వితీయ ఆశ్వాసం, పుట. 84)

## 6. ముగింపు:

మణికంధరుడు తన తీర్థయాత్ర క్రమంలో చివరగా రామనామ స్మరణ చేసి, ఆపైన ఇంకా ఏ దేవతా స్తోత్రం చేయక తపశ్చర్యకు దిగుతాడు. రామనామజపం యోగమార్గమంటూ, 'ఆ రాముని వినుతింపగ నా తరమా' అంటూ భక్తి మార్గంలో మునిగిపోతాడు. సంపూర్ణ యాత్ర ఫలంగా రామాయణగాథను స్మరించి ఇక రామనామమే జపయోగ్యంగా స్వీకరిస్తాడు మణికంధరుడు.'యతి జపార్హ పుణ్యానాముడు రాముడు' అని నారదోపదేశమైన భక్తిని, భగవత్సాన్నిధ్యాన్ని సాధించడానికి మణికంధరుడు చేసిన యత్నంలో, రామనామమే అతడికిసహాయం చేసిందని చెప్పవచ్చు. ఎందుకంటే రామనామం తారక మంత్రం. రామనామ తారకం-భక్తిముక్తి దాయకం. ఇది పరోక్షంగా సూరన మనకు చేసిన మంత్రోపదేశం.'సకల దివిజ నుత చరిత్రుడు సాధు భవ లతాలవిత్రుడు' రాముడు సర్వలోక పూర్ణధాముడు.

## 7. ఉపయుక్తగ్రంథసూచి:


1. ఆరుద్ర. సమగ్ర ఆంధ్ర సాహిత్యం సంపుటాలు, ఎమెస్కో ముద్రణ, హైదరాబాదు, 1965.
2. తిమ్మకవి, లింగమగుంట. సులక్షణసారము, వావిళ్ళ ప్రతి, హైదరాబాద్,1971.
3. దొరసామి శర్మ, రావూరి. తెలుగు సాహిత్యము - రామకథ, త్రివేణి ప్రచురణలు, హైదరాబాదు, 1972.
4. నాగయ్య, జి. తెలుగు సాహిత్య సమీక్ష, నవ్య పరిశోదక ప్రచురణలు, హైదరాబాదు, 1990.
5. మలయవాసిని, కోలవెన్ను. ఆంధ్ర వాఙ్మయంరామాయణం, అరుణశ్రీ ప్రింటింగ్ అండ్ బైండింగ్ వర్క్స్, అమలాపురం, 1989.
6. రఘునాథాచార్య, యస్. బి. ఆర్ష విజ్ఞాన సర్వస్వసంపుటాలు, టి టి డి, తిరుపతి, 1982.
7. వేంకటసుబ్రహ్మణ్యం, చందూరి. శ్రీ రామాయణం, వ్యాఖ్య, కశ్యప స్వాధ్యాయి కేంద్రం, విజయవాడ, 1992.
8. శమంతకమణి, పండా. తెలుగు సాహిత్యములో రామకథ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి ప్రచురణ,హైదరాబాదు, 1972.
9. శివప్రసాద్, ముదిగొండ. ఉద్యమ దర్శనం, రస గంగోత్రి ప్రచురణలు, హైదరాబాదు, 1990.
10. సూరన, పింగళి. కళాపూర్ణోదయం, ఆం. సా. అ, హైదరాబాద్, 1967.


***



AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
ISSN: 2583-4797
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_44.php

# "కమనీయం తెలుగు రామాయణం"

### జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

## 44. తెలుగు రామాయణాలు: అవాల్మీకాలు

**డా. బాసాని సీతారాములు**

సహాయ ఆచార్యులు, తెలుగు శాఖ,

ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల,

సిద్దిపేట, తెలంగాణ.

సెల్: +91 9666494466. Email: basani0707@gamil.com

**వ్యాససంగ్రహం:**

*భారతీయ సంస్కృతిలో రామాయణ కథ అత్యంత ప్రధానమైనది. సీతారాముల కథ ప్రజలను మంత్రముగ్ధులను చేసింది. వారి జీవితాల్లో, సుఖదుఃఖాలలో, సంతోషాలలో నిత్యం ప్రతిబింబిస్తుంది. దేశంలోని అనేక ప్రాంతాల అనేక భాషల ప్రజలు వారి సంస్కృతులు, ఆచారాలు, పద్ధతులకు అనుగుణంగా రామాయణ కథను మలుచుకొని తమ సొంతం చేసుకున్నారు. ఈ క్రమంలో వాల్మీకి రామాయణంలో లేని అనేక అంశాలు జనబాహుల్యంలో వినపడే రామాయణాల్లో ఉన్నాయి. రామాయణ అనువాదంలో ప్రాంత ప్రాబల్యాన్ని, అస్తిత్వాన్ని, సంస్కృతులను స్వాభిమానంతో జోడించడం కొన్ని త్యజించడం, మరికొన్ని మూల విస్తరణం చేయడం జరిగింది. కనుక తెలుగు రామాయణాలలో గల అవాల్మీకాంశాలను అధ్యయనం చేసి తెలియ చెప్పవలసిన అవసరం ఏర్పడింది. రంగనాథరామాయణం, నిర్వచనోత్తరరామాయణం, ఆధ్యాత్మికరామాయణం, జానపదరామాయణం, మొల్ల రామాయణం వంటి కొన్ని ప్రామాణిక తెలుగు రామాయణ గ్రంథాలను, తీసుకొని పరిశీలించి వాల్మీకి రామాయణంలో లేని అంశాలు వీటిలోకి ఎందుకు వచ్చాయి కారణమేమిటి అనే దిశగా పరిశోధన చేయడం జరిగింది.*

**Keywords:** అవాల్మీకాలు, మూల సంక్షేపణం, మూల విస్తరణం, ఘన ఖడ్గములు, మందాకిని, తారా శాపము, ధ్యానమాలి, తృణాంగి ముని, తులానాత్మక పరిశీలన, రావణ కాష్టం, పాతాళ హోమం.

## 1. ఉపోద్ఘాతం:

భారత సమాజం సంస్కృతిపై రామాయణ ప్రభావం గణించవీలు కానిది. దేశం లోని అన్ని ప్రాంతాలను, భాషలను అత్యంత ప్రభావితం చేసిన కథ రామాయణ కథ. శ్రీరామచంద్రుణ్ణి ఆదర్శ పురుషునిగా సీతాదేవిని లోకమాతగా ఆరాధిస్తూ రామాయణమందలి పాత్రలలో తాదాత్మ్యం చెంది వారి సుఖదుఃఖములను తమవిగా

భావించి ప్రజలు తమకు నచ్చిన తీరుగా తలపోశారు. సీతారాముల యందు గల భక్తి భావంచే వాల్మీకి రామాయణంలో లేని అనేక అంశాలను తెలుగు రామాయణాలలో చొప్పించారు. దేశం లోనేకాక విదేశి సంస్కృతులలో కూడా రామాయణ కథ ఛాయలు కనిపిస్తాయి.

ఈ క్రమంలో ఆయా ప్రాంతాల ప్రజలు వారి సంస్కృతులను ఆచారాలను రామాయణ కథకు జోడించి వారి ఆచారాలను ఉన్నతీకరించుకున్నారు. ఆ విధంగానే తెలుగు రామాయణాలలోనూ అనేక అవాల్మీకాంశాలు చోటుచేసుకున్నాయి.

## 2. అవాల్మీకాలు పరిచయం :

తెలుగు రామాయణ కవులు అక్కడక్కడ వాల్మీకి రామాయణంలో లేని అంశాలను కొన్ని చొప్పించారు. కల్పితం చేశారు. అనుచితం అనిపించిన చోట్ల తొలగించారు. గౌతముడు అహల్యను శపించుట, దశరధుని పుత్రకామేష్టి యాగంలో రావణుని పూర్వజన్మ వృత్తాంతం, దశరథ కుమారుల జన్మ తిధులు, మందరకు రాముని పై ద్వేషమునకు కారణం, కాకాసురుని వృత్తాంతం, సీత జన్మ వృత్తాంతం, లక్ష్మణుని నిద్ర ప్రతిజ్ఞ, అగస్త్యుడు రామునికి అనేక దివ్యాస్త్రములు ఇచ్చుట, మందాకిని సీత జాడ చెప్పుట, తారా శాపము, సంపాతి రామభక్తి, హనుమంతుడు స్వీయ జన్మ వృత్తాంతమును వానరులకు చెప్పుట, హనుమంతుడు సూర్యబింబం మింగుట, తృణాంగి ముని ఆశ్రమము, లంకా దహన సందర్భంగా హనుమంతుడు, విభీషణుడిని రావణుడు దండించుట, రామసేతు నిర్మాణంలో నలుని విఘ్నేశ్వర పూజ, సేతు బంధనమున రామునికి సముద్రుడు ప్రత్యక్షం, రావణుడి మరణం గురించి కుంభకర్ణుడుముందే చెప్పడం, మండోదరి రామునితో సంధికై రావణునికి సలహా ఇచ్చుట, ధ్యానమాలి వృత్తాంతం,హనుమంతుడు ద్రోణాద్రిని పెకిలించిన సందర్భం, రావణుని పాతాళ హోమం, విభీషణుడు రాముని తో రావణుని ప్రాణ రహస్యం చెప్పుట, చాకలి వృత్తాంతం, రావణ కాష్టం, లక్ష్మణ రేఖ, అహల్య రాయిగా మారుట, శబరి వృత్తాంతం మొదలగు అనేక అంశాలు గలవు.

## 3. బాలకాండము- అవాల్మీకాలు విశ్లేషణ:

### 1. గౌతముడు అహల్యను శపించుట :

భాస్కర రామాయణంలో అహల్యను గౌతముడు "**వాయుబక్షణవు నిరాహారవు, దస్మశాయినివై, ఎవరికి కనపడకుండా, పాషానం బై ఉండుము".**[1] అని ఒక గద్యంలో గౌతమముని అహల్యను శిల కమ్మని శపించినట్లు వర్ణించబడింది. ఇది రంగనాథ రామాయణం, ఆధ్యాత్మిక రామాయణం, పద్మ పురాణంలోనూ గలదు. కానీ వాల్మీకి రామాయణంలో పాషాణం కమ్మని మాత్రం లేదు.

## 2. దశరథుని పుత్రకామేష్టి యాగంలో రావణుని పూర్వజన్మ వృత్తాంతం:

దశరథుడు తలపెట్టిన పుత్రకామేష్టి యాగానికి దేవతలు మహర్షులు వచ్చి ఉంటారు. యాగ సమయంలో దేవతలు బ్రహ్మతో రావణుడు తమకు కలిగించు బాధలను గురించి చెప్పుకుంటారు. ఈ సందర్భంగా రావణుడు పూర్వజన్మలో హిరణ్యకశిపుడని అతన్ని విష్ణుమూర్తి నరసింహావతారమై వధించెనని' బ్రహ్మ దేవతలతో చెప్పినట్లు భాస్కర రామాయణంలోని క్రింది పద్యంలో చెప్పబడింది." **నరసింహ కృతి భూమి భీకరగతిన్ నారాయ నుండుద్ధతో........................ ద్ధర జన్మించెను రావణుండన బులస్త్య బ్రహ్మకుం బుత్రుడై**"[2] (I ,142)

అదేవిధంగా ఈ అంశము రంగనాథ రామాయణంలోని క్రింది పద్యంలో కలదు.

"**విశదంబుగా నింక వినుడు లోకముల్ గారించునాడు నారాయణుండు............ వాడే వీడై విశ్రవసునకు పుట్టినాడు**"[3]. కానీ, రావణుని పూర్వజన్మ వృత్తాంతం వాల్మీకి రామాయణంలో కానరాదు.

## 3. దశరథ కుమారుల జన్మ తిథులు :

వాల్మీకి రామాయణంలో కేవలం శ్రీరాముని జన్మతిథి మాత్రమే పేర్కొనగా భరతుడు దశమినాడు లక్ష్మణుడు ఏకాదశి నాడు జన్మించినట్లు చెప్పబడింది.[4] మొల్ల తన రామాయణంలో శ్రీరామాదులందరును నవమి భాను వారమున జన్మించినట్లు వర్ణించింది.[5] శ్రీ రామాదులు భానువారం జన్మించారని చెప్పుటకు వారు భాను(సూర్య)వంశీయులు కావడం వల్ల కావచ్చు.

## అయోధ్యకాండము:

## 4. మందరకు రాముని పై ద్వేషమునకు కారణం :

మందరకు రాముని పై ద్వేషం కలుగుటకు వాల్మీకి రామాయణంలో కారణమేమి కానరాదు. అందులో మందర 'పాప దర్శిని 'అని మాత్రమే చెప్పబడింది. కానీ రంగనాథ రామాయణంలో రాముడు బాల్యంలో " **తన కాలు విరిచిన తప్పు సాధింప నిది నాకు దరి**" అని మందర తన కాలు విరగొట్టిన రాముని పై కక్ష పెంచుకొని ఆద్వేషంతోనే రామున్ని అడవులకు పంపేందుకు పురిగొల్పిందని తెలుపబడింది.[6]

## 5. కాకాసురుని వృత్తాంతము :

వాల్మీకి రామాయణంలో సుందరకాండలో గల ఈ కథ భాస్కరరామాయణంలో "**సీతారాములు చిత్రకూట పర్వతంపై విహరించే సందర్భంలో అయోధ్యకాండలో కనబడుతుంది**"[7]. ఆధ్యాత్మిక ఆనంద రామాయణాలలోనూ ఈ కథ అయోధ్యకాండలోనే వర్ణించబడింది.[8]

### 6. సీత జన్మవృత్తాంతం :

అనసూయతో సీత తన వివాహం గురించి చెప్పే సందర్భంలో తన జన్మ వృత్తాంతం కూడా చెప్పినట్లు భాస్కర రామాయణంలో కనిపిస్తుంది.[9] కానీ వాల్మీకి రామాయణంలో ఈ విషయం లేదు. సీతాదేవి జన్మమునకు మేనకకు సంబంధం కల్పించుట సీతను ఆమె మానస పుత్రికగా పేర్కొనుట వాల్మీకి రామాయణంలో లేదు.

### 7. లక్ష్మణుని నిద్ర ప్రతిజ్ఞ:

సీతారాములు గంగా నది తీరాన గుహని ఆశ్రమమున సేదతీరుతున్నప్పుడు లక్ష్మణుడు 14 ఏళ్ల నిద్ర వదిలి అహర్నిశలు రాముని సేవ చేస్తానని ప్రతిజ్ఞ చేశాడని భాస్కర రామాయణంలోని ఈ పద్యంలో తెలుపబడింది."**ఆ పదునాలుగేడులు నహర్నిశ ముందన నిద్ర తప్పియా................ నా శరనాధున కడ్డెప జూపి వెండి యున్.**"[10] ఈ ప్రతిజ్ఞ అంశము వాల్మీకి రామాయణంలో కానరాదు.

### అరణ్యకాండము :

### 8. అగస్త్యుడు రామునికి అనేక దివ్య అస్త్రములు ఇచ్చుట :

రాముడు అగస్త్య ఆశ్రమం దర్శించినప్పుడు అగస్త్యుడు రామున్ని తగు రీతిన ఆదరించాడు ఆ సమయంలో రామునికి దివ్యమైన రెండు ఘన ఖడ్గములను, విష్ణు ధనుస్సు,అమోఘములకు బాణములు ప్రసాదించినట్లు భాస్కర రామాయణంలో కలదు.[11] కానీ అగస్త్యుడు రామునికి ఒకే ఖడ్గము ప్రసాదించినట్లు వాల్మీకి రామాయణం నందుగలదు.[12]

### 9. శబరి వృత్తాంతం:

రామున్నిభక్తితో ధ్యానిస్తూ దండకారణ్యంలో జీవిస్తున్న శబరి ఆశ్రమానికి రాముడు వచ్చినట్లు ఆమె చేత పండ్లు భుజించి నట్లు తెలుగు రామాయణాలలో గలదు. ఇది జానపదుల నుండి గ్రహించి తెలుగు కవులు తమ రామాయణాలలో పొందుపరిచినట్లు చెప్పవచ్చు. వాల్మీకి రామాయణంలో శబరి ప్రస్తావన లేదు.

### 10. మందాకిని సీత జాడ చెప్పుట :

శ్రీరాముడు సీత జాడ వెతుకుతూ లక్ష్మణునితో సీతజాడకై మందాకిని సహాయం తీసుకోమని చెబుతాడు. మందాకిని పంచభూతముల ద్వారా సీత జాడ కనుగొని రాముని వద్దకు పోయి సీతాదేవిని రావణుడు అపహరించి తీసుకుని పోయినని తెలుపుతుంది. ఈ విషయాన్ని తెలిపే క్రింది వచనము భాస్కర రామాయణంలో గలదు. **"రామునితో దశకంఠుడు భూమిజ నెత్తుకుని వేగ పోయెను లంకా ధామంబునకని చెప్పు నా మందాకిని**

**నిజాలయంబున కరిగెన్**"[13]. ఇట్టి విషయం వాల్మీకి రామాయణంలో లేదు.

## కిష్కింద కాండము :

### 11. తారా శాపము :

ఈ కాండంలో ప్రధానంగా కనిపించే అవాల్మీక అంశము "తారా శాపము ". రాముడు వాలిని వధించినందుకు దుఃఖంలో మునిగిన వాలి భార్య తార రావణ వధ అనంతరం రామునికి సీత లభించినను అనతి కాలంలోనే సీత భూ ప్రవేశం గావించి రామున్ని దుఃఖితుణ్ణి చేయునని ' భాస్కర రామాయణంలో క్రింది పద్యంలో వర్ణించడమైనది. "**అచి రేణతు కాలేన త్వయా బా బానై రూపార్జితా న సీతా మమ శాపేన చిరం త్వయి భవిష్యతి ఆత్మన: శౌచమాధార్య పతి వ్రత గుణ సతీ యాచ్యమాన సీత పునర్వాస్యతి భూతలమ్**" (గౌడియ ప్రతి -IV -20,16) భాస్కర రామాయణంలో వర్ణించబడిన ఈ తారా శాపము వాల్మీకి రామాయణంలో లేదు. పట్టాభిషేకానంతరం సీత పరిత్యాగ ఘట్టము నకు ఈ శాపము ప్రధాన భూమిక గా భాస్కర రామాయణ కర్త కల్పించి ఉండవచ్చును.

### 12.లక్ష్మణ రేఖ :

రాముడు మాయా లేడిని బంధించుటకై అడవిలోకి వెళ్ళగా చాలాసేపటి తర్వాత 'లక్ష్మణ లక్ష్మణ' అనే అరుపులు విని, రాముడికి ప్రమాదం పొంచి ఉన్నదని భావించి, సీత లక్ష్మణుని రామున్ని రక్షించుటకై పంపుతుంది. ఆ సమయంలో లక్ష్మణుడు సీతాదేవి రక్షణార్థం వనదేవతలను ధ్యానించి సీతకు రక్షణగా ఉండమని కోరుతాడు. ఈ విధంగా వాల్మీకి రామాయణంలో గలదు. కానీ తెలుగు రామాయణ కర్తలు సీతారక్షణకై లక్ష్మణుడు ఒక రక్షణ రేఖను పర్ణశాల చుట్టూ గీసెనని రాశారు.

### 13. సంపాతి రామ భక్తి :

లంక నగరానికి వెళ్లి సీత జాడను కనుగొని రమ్మని సంపాతి తన కుమారుడైన సుపార్శ్వునికి చెప్పి పంపించినట్లు భాస్కర రామాయణంలో గలదు. కానీ సంపాతి రామభక్తిని చాటుకునే ఈ అంశం వాల్మీకి రామాయణంలో కనబడదు.

### 14. హనుమంతుడు సూర్య బింబమును మింగుట:

హనుమంతుడు బాల్యంలో ఒకసారి ఉదయిస్తున్న సూర్య బింబంను చూసి ఫలమని భావించి దానికోసం ఆకాశానికి ఎగురుతాడు. అది చూసిన ఇంద్రుడు వజ్రాయుధంతో హనుమంతుని కొట్టగా అతని మూతి దవడ(హనువు) పగిలిపోయినట్లుగా వాల్మీకి రామాయణంలో చెప్పబడింది.[14] కానీ భాస్కర రామాయణంలో

హనుమంతుడు సూర్యకిరణాల వేడికి తట్టుకోలేక ఆకాశం నుండి కిందపడుతూ ఒక కొండపై పడగా అతని దవడ(హనువు)పగిలి పోయిందనిచెప్పబడింది. ఇందులో ఇంద్రుని వజ్రాయుధ ప్రసక్తి లేదు.[15]

### 15. తృణాంగిముని ఆశ్రమము :

సీత జాడ కోసం దక్షిణ దిశగా వెతక వలసిందిగా సుగ్రీవుడు హనుమంతునితో చెప్పుతూ తృణంగి అనే ముని ఆశ్రమమును పేర్కొన్నాడు. భాస్కర రామాయణంలోగల ఈ తృణంగి మునిప్రసక్తి[16] వాల్మీకి రామాయణంలో కానరాదు.

## యుద్ధకాండము :

### 16. రామసేతు నిర్మాణ సమయంలో విఘ్నేశ్వర ప్రార్థన :

వానరులు లంకా ప్రవేశం కొరకు రామసేతు నిర్మాణం తలపెట్టినప్పుడు ముందు విఘ్నేశ్వర ప్రార్థన చేసినట్లు భాస్కర రామాయణం నందు గలదు.[17] ఈ విఘ్నేశ్వర ప్రార్థన వాల్మీకి రామాయణంలో లేదు.

### 17. రావణుడు విభీషణుని తన్నుట, కైకసి విభీషణుని దీవించుట:

సీతను అపహరించడం తప్పు ఇప్పుడైనా సీతను రామునికి అప్పగించి అతనితో సంధి చేసుకోవడం మంచిదని విభీషణుడు తన సోదరుడైన రావణునికి హితబోధ చేస్తాడు. అందుకు రావణుడు కోపోద్రిక్తుడై విభీషణుని అతన్ని తన్ని రాజ్యం నుండి తరిమివేశాడని రంగనాథ రామాయణంలో గలదు[18]. అదేవిధంగా విభీషణుడు రావణుని కొలువులో బంగపడి తల్లి కైకసి వద్దకు వెళ్లి జరిగిన విషయం చెప్పి, తాను శ్రీరాముని శరణ కోరి వెళుతున్నట్లు చెబుతాడు. అప్పుడు కైకసి శ్రీరాముని వద్ద శరణాగతుడవై ఉండమని ఆశీర్వదిస్తుంది.[19] అవాల్మీకమైన ఈ అంశము ఆధ్యాత్మిక రామాయణంలో గలదు.

### 18. మండోదరి సలహా:

రావణ సైన్యంలోని వీరాధి వీరులు వానర సైన్యంతో పోరాడి మరణించగా మండోదరి రావణుని వద్దకు వెళ్లి శ్రీరామునితో క్షమించమని అడిగి సంధి చేసుకోవడం మేలని సలహా ఇచ్చినట్లు భాస్కర రామాయణంలో కనిపిస్తుంది[20]. కానీ ఈ అంశము వాల్మీకి రామాయణంలో కనబడదు. మండోదరి రావణుల సంభాషణ దేశీయంగా లభిస్తున్న రామాయణాలలో ఉన్నట్లు మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు రంగనాథ రామాయణం పీఠికలో తెలిపారు [21].

## 19. కాలనేమి వృత్తాంతం:

భాస్కరరామాయణంలో యుద్ధకాండలో వర్ణించబడిన అవాల్మీక అంశాలలో కాలనేమి వృత్తాంతం ప్రధానమైనది. ఈ ఘట్టం భాస్కరరామాయణంలో సుమారు106 గద్య పద్యాలలో వర్ణించబడింది. ఇది ఒక మనోహరమైన లఘుకావ్యంగా భాసిల్లుతున్నది.[22] ఆధ్యాత్మిక ఆనందరామాయణాలలోనూ ఈవృత్తాంతం గలదు[23].

## 20. భరత-హనుమతులు:

భాస్కర రామాయణంలో హనుమంతుడు ఆకాశమార్గాన వెళ్తున్నప్పుడు హనుమంతుని చూసిన భరతుడు భూతమని భావించి విల్లు ఎక్కు పెట్టడం[24] అవాల్మీకమైన అంశమే.

## 21. రావణుడి ప్రాణ రహస్యం:

ఎన్ని బాణాలు వేసినా రావణుడు మరణించక అతని తలలు ఎన్నిసార్లు ఖండించినా మళ్లీ రావడంతో విసిగిపోయి ఉన్న రాముని వద్దకు విభీషణుడు వచ్చి, రావణుని ప్రాణ రహస్యం అతని నాభియందు గల అమృత కుండలంలో గలదని, దానిని పగలగొట్టిన రావణుడు మరణించునని విభీషణుడు చెప్పుతాడు. అంతట రాముడు నాభిని ఛేదించినట్లు భాస్కర రామాయణంలో మరియు ఆధ్యాత్మిక రామాయణం నందు గలదు[25]. ఇది వాల్మీకి రామాయణంలో లేని అంశము.

## 22. రావణ కాష్టము :

యుద్ధంలో రావణుడు మరణించిన తర్వాత రావణుని పార్థివ దేహం వద్ద మండోదరి విలపిస్తూ, భర్తను కోల్పోయిన స్థితికి దుఃఖిస్తుంది. ఈ పరిస్థితిని చూసిన రాముడు మండోదరితో నీ ముత్తయిదువ తనం పోకుండా నేను కాపాడుతాను అని రావణుని రావణుని అంతిమ క్రియలలో అతని కాష్టము చల్లారకుండా కాలుతూనే ఉండే విధంగా రాముడు అభయమిచ్చాడు. తద్వారా అంత్యక్రియల తంతు ముగిసిన తర్వాత విధవరాలుని చేసే అవకాశం ఉంటుంది. అలా కాకుండా రావణుని కాష్టం నిత్యం కాలుతూనే ఉండే విధంగా చేశాడు రాముడు. కనుక మండోదరి విధవరాలు అయ్యే అవకాశం లేదు. భాస్కర రామాయణంలోనూ, రంగనాథ రామాయణంలోనూ ఈ విషయం కనిపిస్తుంది.ఇది జానపద కథల నుండి తెలుగు రామాయణ కర్తలు గ్రహించి ఉంటారు. కానీ రావణ కష్టం నిత్యం కాలుతూ ఉండడం అనే అంశం వాల్మీకి రామాయణంలో లేదు. శత్రువు అయినను రాముడు తగిన రీతిలో రావణుని దేహానికి గౌరవంగా అంత్యక్రియలు జరిపించాడు. రావణుని దేహానికి అంత్యక్రియలు జరిపిన తీరు వాల్మీకి రామాయణంలో గలదు.

## ఉత్తరకాండము:

### 23. చాకలి వృత్తాంతము:

వాల్మీకి రామాయణం ఉత్తరకాండము 43వ సర్గ శ్లోకం 3-6 వరకు గల ఈ అంశాన్ని పరిశీలించినట్లయితే రాముడు తన గూఢచారి అయిన భద్రుని పిలిచి "**భద్ర నగరంలో జరుగుతున్న విశేషములు ఏమిటి? పౌరులు నా గురించి, నా పాలన గురించి ఏమనుకుంటున్నారు. సువిశాల రాజ్యంలో రాజుల గుణదోషాల గురించి ప్రజలు చర్చించుకోవడం సహజమే కదా. యదార్థ విషయాలన్నీ పూర్తిగా తెలుసుకొనుము**" అని ఆదేశిస్తాడు. ఆ విధంగా రాజ్యంలో తిరిగి సమాచారం సేకరించిన భద్రుడు చెప్పిన సమాధానం ఈ శ్లోకంలో గలదు. వాల్మీకి రామాయణం ఉత్తరకాండ 43వ సర్గ శ్లోకం12-16: "**కీ దృశ్యం హృద్యమే తస్య సీతా సంభోగజమ్ సుఖమ్ అంక మారోప్యతు పురా రావణ న బలాదృతామ్**." సీతతో సుఖించుటకై శ్రీరాముని మనసు ఇలా ఇష్టపడుతుంది లోగడ రావణునిచే అపహరించబడి అతని అశోకవనంలో చాలా కాలం రావణుని ఆధీనంలో ఉన్న సీతను రాముడు ఎందుకు ఏవగించుకోవడం లేదు. ఇక మీదట మన భార్యల పట్ల కూడా మనం ఇలాంటి సహనమే చూపాల్సి రావచ్చు. రాజు మార్గమునే ప్రజలు అనుసరింతురు కదా. రాజా.. నగరం అందున అన్ని జనపదాలలో ప్రజలు ఇలా అనేక రీతులలో నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నారు. అని భద్రుడు రాముని తో చెప్పాడు. ఇందులో ఎక్కడ కూడా చాకలివాడు రామున్ని దూసించినట్టు తప్పు పట్టినట్లు లేదు. ఇది ఒక కాల్పనిక కథ, జానపదుల సృష్టి, ఈ అవాల్మీకమైన కథను అనేకమంది తెలుగు కవులు తమ రామాయణాలలో పొందుపరిచారు.

## 4. ముగింపు:

పైన పేర్కొన్న అనేక అంశాలు వాల్మీకి రామాయణంలో లేవు. కొన్నింటిని ఔచిత్యం కొరకు, మరికొన్ని చమత్కారం కొరకు, ఆయా ప్రాంత ప్రజలు దేశీయంగా చెప్పుకునే కథలను కవులు తమ రామాయణాలలో చోప్పించి ఉండవచ్చు. కొన్ని సందర్భాలలో చమత్కారం కొరకు ఇతర రామాయణాల నుండి, పురాణాల నుండి, జానపద వ్యాపితమైన అనేక రామకథల నుండి, జైన బౌద్ధ రామకథల నుండి, ఇతర భారతీయ భాషల రామాయణ కథల నుండి తెలుగు రామాయణ కర్తలు గ్రహించి కొన్నిచోట్ల విస్తరించడం కొన్నిచోట్ల విస్మరించడం మరికొన్నిచోట్ల లేనివి జోడించడం చేశారు తమ ప్రాంతీయ అస్తిత్వాన్ని చాటుకునే ప్రయత్నం చేశారు. రామాయణ గాధ భారతీయుల జీవితంతో అనునిత్యం పెనవేసుకొని ఉంటుంది. రామకథప్రభావం లేని తెలుగు ప్రజలు, రామాలయం లేని తెలుగు గ్రామం లేదు అని చెప్పడంలో అతిశయోక్తి లేదు. రామ కథలో ఎన్ని అంశాలు కొత్తగా చేరినను ఆ కథా మాధుర్యం తరతరాలు దేశ ప్రజలను నిత్యం అలరిస్తూ కమనీయంగానే ఉంటుంది.

## 5. పాదసూచికలు:

1. వాల్మీకి రామాయణము I -48-31.
2. ఆధ్యాత్మిక రామాయణము I-6,14; రంగనాథ రామాయణము పుట.50.
3.రంగనాథ రామాయణము పుట.16
4. రంగనాథ రామాయణము పుట.167.
5. రంగనాథ రామాయణము పుట.19.
6. రంగనాథ రామాయణము పుట.89.
7. భాస్కర రామాయణము II-292-293.
8. ఆనంద రామాయణము ,సారకాండము IV, 86-90.
9. భాస్కర రామాయణము II-433-440.
10. భాస్కర రామాయణము II-266.
11. వాల్మీకి రామాయణము, III - పుట.1,98.
12. వాల్మీకి రామాయణము, III - పుట.1,32-34.
13. భాస్కర రామాయణము II- పుట.2,3,11.
14. వాల్మీకి రామాయణము, IV- పుట.60,22-23.
15. భాస్కర రామాయణము IV- పుట.809.
16. భాస్కర రామాయణము IV- పుట.561.
17. భాస్కర రామాయణము VI- పుట.148.
18. రంగనాథ రామాయణము పుట.301-302.
19. భాస్కర రామాయణము VI- పుట.11-12.
20. భాస్కర రామాయణము VI- పుట.19,36-38.
21. రంగనాథ రామాయణము (రాయల్ &కో 1957) పీటిక పుట.25.
22. భాస్కర రామాయణము VI- పుట.1617-1723.
23. ఆనంద రామాయణం VI 6, 36 to 7,33.
24. భాస్కర రామాయణము VI- పుట.1738-1765.
25. రంగనాథ రామాయణము (రాయల్ &కో 1957) పీటిక పుట.25-26.

## 6. ఉపయుక్తగ్రంథసూచి:


1. నరసింహారెడ్డి. డి,(2000), వాల్మీకి రామాయణం -సంబంధాలు, సుదర్శన్ పబ్లికేషన్స్, తిరుపతి.
2. రంగస్వామి అయ్యంగారు, వంగిపురం,(2013), రామాయణరహస్యరత్నావళి, తి.తి.దే, తిరుపతి.
3. శ్రీరామచంద్రుడు, పుల్లెల,(1993), శ్రీమద్రామాయణము- అరణ్యకాండము, అర్ష విజ్ఞాన ట్రస్ట్, హైదరాబాద్.
4. శ్రీహరి,రవ్వా.(1988),భాస్కరరామాయణము-విమర్శనాత్మకపరిశీలనము,మొదటిసం,పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు.
5. సంగమేశం, ముట్నూరి, (1996), వాల్మీకి రామాయణము శాపములు -వరములు, శ్రీ జయలక్ష్మి పబ్లికేషన్స్, హైదరాబాద్.


***



AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies
ISSN: 2583-4797
UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_45.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 45. 'మసన చెన్నప్ప' శ్రీరామకథాగేయం: రచనాశిల్పం

**పోలపల్లి శ్రీకాంత్**

సహాయ ఆచార్యులు (సి) & పరిశోధక విద్యార్థి,
విశ్వవిద్యాలయ విద్యాకళాశాల, తెలంగాణ విశ్వవిద్యాలయం,
సారంగాపూర్, నిజామాబాద్, తెలంగాణ
సెల్: +919704757570, Email: srikanth.polapally@gmail.com

**ప్రొఫెసర్ వంగరి త్రివేణి**

డీన్, ఫాకల్టీ ఆఫ్ ఆర్ట్స్, తెలంగాణ విశ్వవిద్యాలయం,
డిచ్పల్లి, నిజామాబాద్, తెలంగాణ.
సెల్: +91 9951444803, Email: telugutriveni@gmail.com

**వ్యాససంగ్రహం:**

*రామాయణం కంటే రమణీయమైనది లేదు, రామకథ కంటే కమనీయమైనది లేదు. శ్రీరాముడు కర్మయోగి, అట్టి మహాపురుషుని చరిత్రను గానం చేయాలనిపించి ఆచార్య మసన చెన్నప్ప శ్రీరామ కథాగేయం రచించారు. శ్రీరాముడు ధర్మానికి కట్టుబడి ఉండే మహాయోగి. ఈ రఘుకుల తిలకుడి యొక్క విశిష్టమైన వ్యక్తిత్వాన్ని లోకానికి యదార్థంగా అందించాలనే ఉద్దేశంతో రచించారు. ఈ పుస్తకాన్ని సమీక్ష చేయాలనిపించి నేను "శ్రీ రామ కథాగేయం-రచనాశిల్పం" పేరుతో పరిశోధన వ్యాసంగా మీ ముందుకు తీసుకురావడం జరిగింది. ఇందులో ఎటువంటి సంస్కృతపదాలు గానీ, వ్యాకరణాంశాలు గానీ, గ్రాంథికపదాలు గానీ లేకుండా అందరికీ అర్థమయ్యే విధానంలో అతి సామాన్య శైలిలో చాలా సంక్షిప్తంగా, అద్భుతంగా రచించారు. రామాయణం యొక్క వైశిష్ట్యాన్ని సామాన్య జనులకు అందించాలన్న సంకల్పంతో వారి రచనాశైలి కొనసాగుతుంది. ఆచార్య మసన చెన్నప్ప ఎవరిని అవతార పురుషులుగా చెప్పలేదు కనుక శ్రీరాముడు కూడా అవతారపురుషుడు కాదు అని ఇతన్ని చారిత్రకపురుషుడిగా కొనియాడారు. ఈయనని నిష్కామకర్మయోగిగా, అందరికీ ఆదర్శప్రాయుడిగా, యుగపురుషుడిగా పేర్కొన్నారు. ఎం.ఎస్. రామారావు సుందరకాండను గానం చేసిన పద్ధతిలోనే ఆచార్యుల వారు ఈ కథను గానం చేయడం జరిగింది. ఈ కథాగేయంలో బాలకాండ నుండి యుద్ధకాండ వరకు రాముడి చరిత్రను నిక్షిప్తంచేసి, శ్రీరామ పట్టాభిషేకం, సీతను స్వీకరించే వరకే తీసుకున్నారు. ఉత్తరకాండను మాత్రం చెన్నప్ప పరిగణలోకి తీసుకోలేదు. కారణం అష్టకష్టాలు పడ్డ సీతను ఎవరో ఏదో అన్నారని తిరిగి అడవులకు పంపడం అనుచితం అని భావించి గ్రహించలేదు. ఆచార్యులవారు ఓ పద్మశాలి కుటుంబంలో జన్మించినప్పటికీ స్వశక్తిచే రాముని యొక్క యధార్థమైన చరిత్రను వేద శాస్త్రాలు చదివిన అనుభవంతో రచించారు. రామాయణం యొక్క*

*వైశిష్ట్యాన్ని సామాన్య జనులకు అందించాలన్న సంకల్పంతో వారి రచనాశైలి కొనసాగుతుంది. ఆచార్య మసన చెన్నప్ప ఈ కథా గేయాన్ని పండితుల కోసం కాకుండా బాలలకోసం జనరంజకంగా సులభమైన శైలిని అనుసరిస్తూ రచించారు. నిష్కామ కర్మయోగి అయినటువంటి శ్రీరాముని దివ్య చరిత్రను సనాతన ధర్మాన్ని లోకానికి తెలియజేయడం. రామాయణ జ్ఞానం ప్రతి ఒక్కరికీ చేరువయ్యేలా నేటి సమాజం కూడా వారి అడుగుజాడల్లో ఉండి సుఖశాంతులతో నడుచుకునేలా చేయడం. మంచిచెడు విచక్షణ చేసుకొని సత్యవచనములు పలుకుతూ శ్రమనే దైవంగా భావించి స్నేహభావంతో రామరాజ్య పరిపాలన నేటి కాలంలో చూడాలనేది చెన్నప్ప గారి ఆకాంక్ష. తులనాత్మక, అనుభావిక, చారిత్రక పద్ధతులు.*

**Keywords:** రామాయణం, జానపద రామాయణం, శ్రీరామ కథాగేయం, రచనా శిల్పం, అవాల్మీకాలు.

## 1. ఉపోద్ఘాతం:

ఆచార్య మసన చెన్నప్ప రామాయణ ప్రాశస్త్యాన్ని వివరిస్తూ తెలుగులో శ్రీ రామకథాగేయాన్ని అందరికీ అర్థమయ్యేవిధంగా సామాన్యప్రజానీకాన్ని ముఖ్యంగా బాలలను దృష్టిలో పెట్టుకొని చాలా సంక్షిప్తంగా 408 గేయచరణాల్లో మొత్తం రామాయణాన్ని వ్రాయడం జరిగింది. రామాయణంలో రాముడి పరిపాలనాదక్షత, పితృవాక్య ధర్మాన్ని కాపాడటం, సీతమ్మ పాతివ్రత్యాన్ని నిరూపించడం, సుగ్రీవునితో స్నేహ సంబంధాల కొనసాగింపు, హనుమంతుడి సేవా దృక్పథం, రాముని ధర్మానికి కట్టుబడి తోడుగా నీడగా నిలిచిన లక్ష్మణుడు ఇలా ఏ పాత్ర చూసినా రాముని ధర్మమార్గంలో ఉన్నవారే మనకి కనబడతారు. దీనిని బట్టి రాముని సన్మార్గం, తాత్త్విక దృక్కోణం, ఆధ్యాత్మిక పరంపర, సన్మార్గ ధర్మం మనకి కనబడుతుంది.

ఓ వ్యక్తి ఏ ప్రాంతంలో అయితే ధర్మ మార్గంను ప్రయాణించే అనుభవం ఉంటుందో ఆ ప్రాంతానికి ఆదర్శప్రాయుడుగా వెలుగొందుతారు. మిగిలిన అన్ని ప్రాంతాలవారు కూడా అతనిని ఆదర్శంగా తీసుకోవడం జరుగుతుంది. అలాంటి కర్తవ్య దీక్ష కలిగిన మూర్తి శ్రీరాముడిగా రామాయణంలో మనం చెప్పుకుంటాం. అయోధ్యలో సకల సౌకర్యాలుండి జీవనం సాగిస్తున్న శ్రీరాముడు తండ్రి మాటజవదాటలేక అడవులకువెళ్లడం, గురువైన విశ్వామిత్రుడు దగ్గర అస్త్రశాస్త్రాలను పొందినప్పటికీ వాటిని తన సొంత ప్రయోజనాలకు వాడుకోకుండా కేవలం ధర్మం కోసం అవసరం వచ్చినప్పుడు మాత్రమే వాటిని ఉపయోగించడం రాముని సన్మార్గ ఆలోచన విధానం ఈ లోకానికి ఆదర్శప్రాయమై నిలుస్తుంది. సకలవిద్యలను, శక్తిని పొందినప్పటికీ గురువు దగ్గర చూపిన వినయ విధేయతలు ఆ నడవడిక శ్రీరాముడికే సాధ్యం. ఆ సీతాపతిలా శ్రద్ధ ఉంటే అసాధారణ విషయాలు కూడా సులువుగా సాధించవచ్చు. యోధానుయోధులు, రాక్షసులు మొదలైన ఇతరులకు సాధ్యంకాని శివ ధనువు ఎత్తడం ఆ శ్రీరామచంద్రుడికే సాధ్యమైనట్టు ఏ పనైనా శ్రద్ధతో నేర్చుకుంటే సునాయాసంగా సాధించగలమని బోధపడుతుంది. కళ్ళతో చూడకుండా ఒకరు చెప్తే విని అవమానాలకు గురవడం, సమాజంలో దోషులుగా నిలబడడం కైకేయి పాత్రను చూస్తే మనకు అర్థమవుతుంది. ధర్మక్షేత్ర పాలకుడైన శ్రీ రాముడు తండ్రి మాటకు కట్టుబడి 14 సంవత్సరాలు వనవాసం చేయడం, తండ్రి మాటకు ఇచ్చేవిలువ, తండ్రికి తగ్గ తనయుడు ఎలా ఉండాలో అన్న

సందేశం సమాజానికి ఒక దిక్సూచిలా పనిచేస్తుంది. అన్నీ తెలిసి కూడా చెప్పిన మాటలు వినకుండా ఇతరులకు ఉపకారం చేయకుండా అపాయానికి ఒడిగడితే ఎలాంటి అనర్థాలు జరుగుతాయో రావణబ్రహ్మ పాత్ర మనకు కళ్ళకు కట్టినట్టు కనబడుతుంది. ఎన్నికష్టాలువచ్చినా సీతమ్మతల్లి పాతివ్రత్యపరీక్ష సమాజంలోని నేటి మహిళలందరికీ ఆదర్శంగా నిలుస్తుంది. చివరగా నేటి సమాజం సన్మార్గంలో నడిచే విధంగా కుటుంబ విలువలను కాపాడే విధంగా మంచి చెడులను విచక్షణ చేసి దయార్ధహృదయులై ఉండేలా శ్రీరాముడు జీవిత చరిత్ర అందరికీ ఓ మార్గదర్శి కావాలని చెన్నప్ప గారి ఆకాంక్ష.

## 2. బాలకాండ:

**"శ్రీరాముని చరిత వినుడి! శ్రేయోమార్గమేము వేగమె గనుడి!"**1

రాముని మించిన మహాయోధుడు! ఈ భూమిమీదనే లేడనే" గేయచరణంతో బాలకాండ మొదలవుతుంది. శ్రీరాముని పుట్టుక గురించి చెబుతూ దశరథ క్షితిపతి పుత్రులు లేరని పుత్రకామేష్టి యాగం జరిపించగా పుట్టిన నలుగురుపుత్రులను నాలుగువేదాలతో, నాలుగుదిక్కులతో పోల్చి అన్నదమ్ములు ఎట్లుండాలో అవనికిమార్గం చూపినట్టుగా చెప్పారు. జ్యేష్టుడైన శ్రీరామచంద్రుడు శ్రేష్టుడై ఈ భువిలో వెలిగి ఈయనకు సాటిరారెవరని వర్ణించబడింది. విద్యాబుద్ధులు నేర్పించుటకు, విద్యాబుద్ధులుగావించుటకు, దశరధుడు గురువుకోసం వెతుకుతూ వశిష్ట ఋషియే ఆదర్శగురువని తలచి పుత్రులను గురుకులంలో చేర్పించడం. గురువు చెప్పిన రీతిగ నడిచి విద్యలన్నీ నేర్చి లోకాలన్నీ మెచ్చుకునేలా రఘువంశానికి కీర్తి తెచ్చిరి. వీరిలో శ్రీరామచంద్రుడే ధర్మమానుష రూపందాల్చి, క్షమాగుణంలో, దయాగుణంలో ధీరత్వంలో, వీరత్వంలో శమదమాదులను పాటించుటలో మేటిగా నిలిచారు. సత్యమందునిలిచి పరోపకారముతప్పక, ఈర్ష్యద్వేషాలెరుగక, కష్టసుఖాలను సమానంగా చూస్తూ తనని ఆశ్రయించిన వారిని అక్కున చేర్చుకునే దయాసముద్రుడుగా వర్ణించబడింది. తదనంతరం అనుజులతోపాటు అయోధ్య వాసులకూ ప్రేమను పంచుతూ స్వప్నాలందు కూడా అబద్ధమాడక సత్యసంధుడై వెలుగుతున్నాడు రామచంద్రుడు. ఆవిధంగా రఘురాముని పేరు తలుస్తూ అయోధ్యవాసుల మదిలో నిలిచిపోయాడు. పాలునీళ్లలా కలిసి ఉన్న రామలక్ష్మణుల ప్రేమను చూసి దశరథుడు ఎంతో సంతోషిస్తున్న తరుణంలో విశ్వామిత్రుడు విచ్చేసినంతలోనే వారిని దశరథుడు ఆహ్వానించి అతిథి సేవలు ఘనంగా జరిపించారు. అప్పుడు విశ్వామిత్రుడు శాస్త్రవిద్యలలో రాటుదేలిన రామలక్ష్మణులను తనతో పాటు తీసుకెళ్తానని, నేనో యాగం తలపెట్టాను.

**"తానొకయాగం తలపెట్టానని దానిని అసురులు పాడుసేతురని రక్షించుటకై రామలక్ష్మణులు రావెలెనన్నడు విశ్వామిత్రుడు"**[2]

తలపెట్టిన ఆ యాగానికి భంగంకలగకుండా, అసురులు పాడుచేయకుండా, రక్షించడానికి పంపమని

దశరథున్ని కోరాడు. అప్పుడు ఆదశరథ మహారాజు తనయులిద్దరూ చిన్నవారని సంకోచించినప్పటికీ వశిష్టుని ఆదేశంతో ఒప్పుకుంటాడు. అప్పుడు రామలక్ష్మణులను వెంటతీసుకొని విశ్వామిత్రుడు యాగస్థలికి బయలుదేరడం. ఆ దారిలో శిల రామునిపాదాలను తాకి అహల్యగా మారిపోవడంవంటి ఎన్నో విషయాలు రాతిని నాతిగ చేసిన ఘనత, యాగభంగం కలిగించడానికి వచ్చిన తాటకిని, మరీచబాహులను తరిమేయడం, దీనికి సంతోషించి విశ్వామిత్రుడు అతిబల, మహాబల విద్యలను ఉపదేశించడం. ఇలాంటి అంశాలను చాలా సరళంగా వర్ణించడం జరిగింది. ఈ విధంగా యాగాన్ని పూర్తి చేసిన విశ్వామిత్రుని అమ్మునివర్యుడు అని సంబోధించడం ఇక్కడ విశేషం. తదుపరి మునితో కలిసి రామలక్ష్మణులు అయోధ్యపురానికి విచ్చేయడం, అంతలోనే మిథిలాధీశుడైన జనకుడు స్వయంవరానికి ఆహ్వానించడం, ఇతడు మిథిలానగరానికి రాజైనప్పటికీ స్వయంగా పొలంలోదున్నుతూ పండించిన ధాన్యాన్ని భుజిస్తూ ఇతరులకు పంచిపెట్టేగుణం కల్గిఉండడం అలా పొలం దున్నుతుండగా దొరికినది ఓ పొలతి ఆమెయే సీత, అలా జనకుని దగ్గర పెరిగినందున జానకి అని పేరు వచ్చింది. ఎదిగిన కూతురికి పెళ్లి చేయుటకు నరపతి అయిన పరశురాముని శివధనస్సును విరిచిన వారికి సీతనిత్తునని జనకుడు ప్రకటించగా, విశ్వామిత్రుని కోరిక మేరకు అయోధ్య నుండి మిథిలా నగరానికి విచ్చేశారు రామలక్ష్మణులు. ఈ శివధనస్సును విరిచే సత్తువ ఈ భువిలో ఒక్క శ్రీరాముడికే కలదని అందుకే తోడుగా వచ్చానని వెన్నుతట్టి ప్రోత్సహించాడు విశ్వామిత్రుడు. ఆ స్వయంవరానికి పదితలల లంకేశ్వరుడే కాకుండా రాజులేందరో వారి పరివారంతో వచ్చినప్పటికీ శ్రీరాముడే సభాజనులందరూ చూస్తుండగా శివధనస్సును ఎత్తిన వెంటనే పెళపెళ ధ్వనులతో విరిగిపడినది. ఆ విధంగా స్వయంవరాన్ని జయించిన శ్రీరాముడి వివాహం రంగరంగవైభవంగా జరిగింది. వారితోపాటు లక్ష్మణుడు-ఊర్మిళను, భరతుడు-మాండవిని, శత్రజ్ఞుడు-శ్రుతకీర్తిని వరించారు. ఇక్కడ పరుశురాముడు నాధనస్సును విరిచింది ఎవరని శివమెత్తడం, దానికి శ్రీరాముడు నీ దాసుడు నేనేనని నిర్మలంగా చెప్పడం, అతను సంతసించడం ఆవిధంగా నలుగురు పుత్రుల వివాహ వేడుక అనంతరం అద్భుతంగా అలంకరించిన అయోధ్య నగరానికి విచ్చేసిన నవదంపతులను చూసి అయోధ్యవాసులు మురిసిపోయినట్టుగా వర్ణించి చాలా సరళంగా బాలకాండను పూర్తిచేసెను ఆచార్య మసన చెన్నప్ప.

### 3. అయోధ్యకాండ:

దశరథభూపతి వృద్ధుడగుటచే శ్రద్ధావంతుడైన రామున్ని రాజుగా చేయ సంకల్పించి పట్టాభిషేక ప్రకటనతో ఈ అయోధ్యకాండ ప్రారంభమవుతుంది. ఈ రాముని పట్టాభిషేక విషయమై అయోధ్యవాసులు సంతోషించి వేడుకలు జరుపుకోవడం, అలానే కైకేయికి కూడా భరతునికంటే రాముని మీదనే వాత్సల్యము చూపడం అంతలోనే ఒకచిత్రం జరగడం రామున్ని రాజుగా చేస్తే కౌసల్య రాజమాత అవుతుందనీ, నీ స్థానం బలహీన పడుతుందని నీవే

ఆలోచించి భరతున్ని రాజుగా చేసి రామున్ని ఇక్కడ లేకుండా చేయమని మంధర చెప్పి కైకేయి మనసు మార్చడం, అప్పుడే దశరథుడు ఇచ్చిన వరములు తలపుకు రాగా మంచి చెడ్డలు ఆలోచించకుండా కోరి భరతున్నే రాజుగా చేసి రామున్ని 14 ఏళ్ళు వనమునకు పంపమని ఆజ్ఞాపించడం, తన సతి కోరిన రెండు వరములు దశరథున్ని ఎంతగానో కృంగదీసి చైతన్యం కోల్పోయేలా చేయడం. అలా కైకేయి తండ్రి మాట జవదాటని రామున్ని తన దగ్గరికి పిలిపించుకొని తండ్రి ఇచ్చిన వరములు పూర్తి చేయమని కోరడం, "**అయ్య నాకును చెప్పకపోయిన అమ్మవు నీవు చెప్పిన మాటను కాదననంచు ఆ రఘురాముడు కానానమునకె పోవగనెంచెను**"[3] తండ్రి చెప్పకపోయినా అమ్మవు నువ్వు చెప్పిన మాటకు కట్టుబడి ఉంటానని చెప్పి రాముడు కానానము అనగా అడవికి వెళ్ళుటకు సిద్ధపడటం. అలా రాముడు వెంట సీత తోడుగా, లక్ష్మణుడు నిలిచి అందరి దగ్గర సెలవు తీసుకుని పురజనులు ఏడుస్తుండగా రామునికి సీత ఆత్మగా, లక్ష్మణుడు నీడగా ఉండి అయోధ్యను విడిచి వనవాసం చేయడం మొదలైన ఘట్టాలు ఇందులో ప్రస్తావించబడ్డాయి.

14 ఏళ్లు అరణ్యవాసం చేస్తున్న రాముడు మందాకిని తీరాన సుందరమగు చిత్రకూటమున పర్ణశాల ఏర్పాటుచేసుకుని నివాసం చేస్తూ, జపతపాలను నిర్వహిస్తూ, సమ్మునివర్యులను సందర్శిస్తూ, కష్టానికిభీతినొందక కాలంగడపడం, "**మునుముందుగ వారొకనాడు మునిపుంగవుడగు అత్రిని జూడగాశ్రమంబునకు కదిలివచ్చిరి అనసూయమ్మకు భక్తితో మ్రొక్కిరి**"[4] మునిపుంగవుడైన అత్రి, అనసూయమ్మల ఆశ్రమానికి వచ్చి భక్తితో మొక్కి ముచ్చటించగా వారికి దాంపత్యధర్మాలెన్నో అనసూయమ్మ చెప్పడంతో ఈ కాండ ముగుస్తుంది. ఈ విధంగా గేయచరణాల్లో చాలా సరళంగా రచించారు ఆచార్యులవారు.

### 4. అరణ్యకాండ:

ఈ మూడవకాండలో సీతారాములు అరణ్యమందున ఆశ్రమవాసుల కష్టసుఖాలే వారివిగా భావించి అన్యోన్యంగాఉంటూ ద్వేషానికి తావులేకుండా జీవనంసాగిస్తున్న సందర్భంతో ఈ మూడవకాండ మొదలవుతుంది. అందరూ ఈశ్వరప్రార్థన చేయడం, కలిసి భోజనంచేయడం, అసురులు వస్తే అలవోకగా జయమునొందడం, అసూయద్వేషాలు లేకుండా ఆశ్రమవాసులు సోదరభావంతో మెలిగేవారని చాలాచక్కగా అర్థవంతంగా వివరించారు ఆచార్య మసన చెన్నప్ప.

అంతేకాకుండా యజ్ఞశాలలకు, గోశాలలకు, పాఠశాలలకు ఎక్కువ ప్రాధాన్యతనిచ్చారని, ఆశ్రమమంటే జ్ఞానకేంద్రాలుగా విలసిల్లినట్టు చెప్పుకొచ్చారు. ఆశ్రమవాసుల సంరక్షణకొరకు నారచీరలు ధరించి, రాముడు వింటిని దాల్చగా జానకి 'మనము మునుల వలే ఉందామంటూ' చెప్పిచూడగా, అప్పుడు రాముడు జ్ఞానానికి తోడు జ్ఞానముండును, వీరునికి తోడు క్షాత్రం ఉండునని వృత్తినైపుణ్యం విడవరాదని శాస్త్రం చెప్పినట్టు, క్షత్రియుడెప్పుడు

క్షాత్రధర్మమును అవలంబించాలని చెప్పే సందర్భం నైపుణ్యంతో ఎవరి పనివారు కచ్చితంగా చేసుకోవాలని సూచించడం జరిగింది.

తదుపరి శాపంవల్ల రాక్షసరూపంసంప్రాప్తించిన విరాధునికి రామలక్ష్మణులు శాపవిమోచనం గావించడం. ఆశ్రమాలన్నీ సందర్శించడం. సందర్శించిన ఆశ్రమాలలో అద్భుతమైన ప్రశాంతనిలయం అగస్త్యలోపాముద్ర, సీతారాములు లక్ష్మణులతో కలిసి చనెగోదావరి తీరం పంచవటిలో పర్ణశాలని నిర్మాణం చేసుకొని ఉండసాగిరి. అలా నివసిస్తున్న సమయంలో కామంతో సుందరరూపం ధరించి కాలుమోపినది దశకంఠుని సోదరి శూర్పనఖ, "**రావణుడంపెనో?ఈమెనేవచ్చెనో?రాక్షసమాయలుచెప్పజాలని**"[5]వంటూ సందేహం వెలిబుచ్చారు ఆచార్యులవారు.

సీతమ్మతల్లి కోరిక తీర్చడానికి దశరథ పుత్రుడు లేడి కోసం పరుగుతీయగా 'హా సీత..!' అన్నమాట వినపడగా లక్ష్మణున్నికూడా సీత పంపడం, రావణుడు మునివేషంలో భిక్షకోసం వచ్చి పర్ణశాలలోవున్న ఒంటరి సీతను గీత దాటించి పరిగ్రహించడం, దశరథుని ప్రాణమిత్రులు జటాయువు ఆ రావణున్ని ఎదిరించి రెక్కలను కోల్పోవడం. పర్ణశాలలో సీత కనపడక "**గతజన్మమ్మున చేసిన పాపము గ్రమ్మర ఈ గతి వచ్చినదేమో ఎన్నో పాపములట్లు చేసితినో ఇంత దుఃఖము కల్గినదేమో**"[6] అంటూ అడవినంత గాలిస్తుండగ రెక్కలులేని జటాయువు కనబడి అసురుడు సీతనపహరించిన వార్తచెప్పి రామునిచేతిలో ప్రాణాలు విడవడం లాంటి ఘట్టాలు ఈ కాండలో ఉన్నాయి.

జానకిజాడకై శబరి చెప్పిన ధైర్యవచనాలు విని మాతాంగుని ఆశ్రమం వీడి ఋష్యమూకమునకు బయలుదేరడంతో వారి దుఃఖసాగరాన్ని చాలా చక్కగా వర్ణిస్తూ ముగుస్తుందీ కాండం.

## 5. కిష్కింధకాండ:

వాలి కిష్కింధరాజ్యానికి ప్రభువుగా వెలుగొందుతున్నారన్న గేయచరణంతో ఈ నాలుగవకాండ మొదలవుతుంది. అతని తమ్ముడైన సుగ్రీవుడు సద్గుణములు కలిగినవాడు, మొదట వీరు సంతోషముతో మెలిగినప్పటికీ, వీరిమధ్య వచ్చిన ద్వేషంవల్ల తమ్ముడైన సుగ్రీవున్ని తరిమివెయ్యగా ఋష్యమూకమునవచ్చి స్థిరపడడం. ప్రాణమిత్రుడిగా హనుమంతుడు తోడునీడగా, సగముబలమై, అండగా ఉండడం. ఆచార్యుల వారు ఇతనిని అనిలసుతుడు అని సంబోధిస్తూ సకలగుణ సంపన్నుడిగా, ధీరుడుగా, స్వాధ్యాయంతశీలుడిగా, వీరుడిగా వర్ణించారు. ఉగ్రటావిలో ఉన్న రామలక్ష్మణుల చెంతకు సుగ్రీవుడు పంపగా స్నేహం కొరకై వచ్చానని హనుమచెప్పగా రాముడు సంతోషం వ్యక్తంచేయడం. "**నాలుగువేదాలు చదివినవారే ఇలా సంశయంలేకుండా సంక్షిప్తంగా మాట్లాడుతారు. నీ మాటలలో ఆధరభావం కనిపిస్తున్నదని**" పలికెను. ఆ విధంగా రామలక్ష్మణులను తోడుకొని సుగ్రీవుని సమీపించెను హనుమ. ఆ విధంగా సకల దేవతలు సంతోషింపగా, అగ్నిసాక్షిగా

రామచంద్రనికి, సుగ్రీవునికి స్నేహం కుదుర్చాడు ఆ హనుమ. ఇక్కడ చెన్నప్ప హనుమను అనిలతనూజుడిగా పేర్కొన్నారు. సీతాన్వేషణకు సహాయంచేస్తే సుగ్రీవుని కిష్కిందకు రాజుగా చేస్తానని మాటిచ్చాడు రాముడు. ఆ విధంగా ఇంద్రపుత్రుడైన వాలిని చంపి సుగ్రీవుని కిష్కిందకు పట్టంకట్టడం, సీతకోసమై సుగ్రీవుడు నాలుగు దిక్కులకు నలుగురు కపివీరులను పంపడం,

"**అటుల దక్షిణమునకేగిన వారిలో అంగదుని నాయకత్వమ్మున హనుమజ్జాంబవంతులు, నీలుడు, మైందద్వివిధసుషేనులుండిరి.**"[7]

దక్షిణాన అంగదుని నాయకత్వాన హనుమజ్జాంబవంతులు మొదలగువారు బాధ్యత తీసుకొని స్వయంప్రభ అనే యోగి సహాయంచే దక్షిణతీరాన్ని చేరుకోవడం, సీతజాడ దొరకక చింతిస్తున్న సమయంలో జటాయువు సహోదరుడైన సద్గుణములు కలిగిన సంపాతియు అనేడి గద్ద రావణుడెత్తుకుపోయిన సీతను శ్రీలంకలో దాచాడనే వార్త హనుమదాదులకు చెప్పడం, భారతానికి దక్షిణాన పారావారము దాటితే లంకకు చేరడానికి సాధ్యమవుతుందని వానరవీరులు సంకల్పించడం. నూరు యోజనాల పొడవున్న జలనిధి దాటుటకు అనంత బలుడు కావాలని ఆలోచించడం. జాంబవంతుడు, అంగదుల కన్నా హనుమంతుడే ఆ జలనిధి దాటి సీత జాడ తెలుసుకొని రాగలడనే జాంబవంతుడి ఆలోచనతో ఈ కాండ ముగుస్తుంది.

## 6. సుందరకాండ:

ఏకాంతంగా ఎవరితో మాట్లాడకుండా కూర్చున్న అంజనిపుత్రున్ని ఉద్దేశించి జాంబవంతుడు చెప్పే విషయాలతో ఈ అయిదవకాండ ప్రారంభమవుతుంది. "**సకల శాస్త్రములు తెలిసినవాడవు. జ్ఞానములో, పరాక్రమంలో సుగ్రీవ, రామలక్ష్మణులతో సమానుడవు. ప్రాణకోటిలో బలబుద్ధి కలిగిన ఘనుడవు. నీవు తలుచుకుంటే వాయువేగమున నింగిని కూడా ముట్టగలిగే వాయుపుత్రుడవు. జానకిజాడ తెలుసుకొనుటకు నువ్వుతప్ప మరి ఎవరున్నారని**" హనుమ సామర్థ్యాన్ని చాలా చక్కగా సామాన్య వాక్యాల్లో వివరించారు ఆచార్య మసన చెన్నప్ప. జాంబవంతుడు ఎన్ని పలికిన సమాధానం ఇవ్వని మారుతి ఒక్కసారిగా దేహము పెంచి అబ్బురపరిచాడు. వానరులను ఆ విధంగా ఆనందంతో గంతులు వేయుచు అగ్రేసరుడైన జాంబవంతునికి నమస్కరించి అవలీలగా నూరు యోజనములు అనగా సుమారు 800 కిలోమీటర్లు అంబుధిని దాటుటకు సిద్ధమై మహేంద్ర పర్వతాన్ని అధిరోహించి చప్పట్లను గట్టిగా చరిచెను. ఆధ్వనికి పక్షి సమూహం బెదరడం, తడి బట్టలను పిండినట్లుగా నదులు తటముల నుండి జారడం, మొదలైన వర్ణనలు ఉన్నాయి. మరోచోట "**మహేంద్రపర్వతం నుండి నింగికి మారుతి ఎగిరినప్పుడు తరువుల నుండి పూలు రాలి పూలకొండవలె కనబడినది ఆ పర్వతం మరియు పైకి లేచిన తోకను చూసి పక్షిరాజు తన నోట కరిచిన పామా! అన్న భ్రమ కలిగెనని**" అతిశయోక్తి అలంకారంతో వర్ణించారు ఆచార్యులవారు. అలా మొదలైన ప్రయాణం మధ్యలో"**స్వర్గపతి వజ్రాయుధమునకును భయపడిపోయిన మైనాకుణ్ణి అంబుధిలోపడునట్లు చేసిన అనిలుడు మారుతి జనకుండె కద**"[8]

అని పలికి మైనాకున్ని చేతితో తాకడం, సురసా రాక్షసిని ఎదిరించి మిణుగురు పురుగుగా బయటకి రావడం. ఆ రక్కసి నిజరూపం దాల్చి జానకిజాడకై ఆశీర్వదించడం, మొదలైన ఘట్టాలతో సాగుతూ... వానర వీరులతో కలిసి రాముని సన్నిధికి చేరుకొని సీత కనబడిన శుభవార్తని వినిపించడం, ఆ వాక్కు విన్న రాముడు అనుజుడు లక్ష్మణుడితో ఆనందాన్ని పంచుకోవడం, మాట ఇచ్చి నిలబెట్టుకున్న సుగ్రీవునికి రామలక్ష్మణులు అభినందించడం, లవణ వారధి దాటు విషయం చెప్పి సీత ఇచ్చిన చూడామణి రాముని చేతికి గౌరవంగా హనుమ ఇవ్వడం ఆ సందర్భంలోనే అరణ్యవాసం పూర్తగుటచే అయోధ్యలో పట్టాభిషేకం పొంది ధర్మ ప్రభువుగా ప్రజలను ఏలుతూ కాలం గడపడంతో ఈ కాండ పూర్తవుతుంది.

## 7. యుద్ధకాండ:

"**ఎందమానందమున నిలువగ సుందరుందగు రామచంద్రుడు ఆంజనేయునికొక్క బహుమతి అందజేసెను ప్రేమ మీరగ**"[9] అంటూసుందరుడగు రామచంద్రుడు ఆంజనేయునికి క్లిష్టకార్యము సాధించినందుకుగాను బహుమతిగా కౌగిలింత ఇవ్వగా ఆ మారుతిపడ్డ శ్రమ మాయమవడంతో ఈ ఆరవకాండ ప్రారంభమవుతుంది. ఇప్పుడు సీతజాడ తెలిసెను. శత్రువుడెవడో తెలిసిపోయెను. రాముడు భల్లూక వానర సమేతంగా యుద్ధానికి సిద్ధంగా ఉన్నాడని సీత సమేతంగా రావణుడిని హతమార్చి తీసుకెళ్లే సమయం వచ్చిందని సరమ వివరించడం. మాల్యవంతుడు ఎంత చెప్పినా దనూజుడు వినకపోగా అతనిని దూషించడం వల్ల మరణం ఆసన్నమైన వేళలో మంచి మాటలు చెవికెక్కున? అనే లోకోక్తిని చాలా చక్కగా చెప్పాడు మసన చెన్నప్ప. అలా సిద్ధమైన సైన్యంతో సముద్రాన్ని దాటి సుకేలపర్వతం అధిరోహించి లంక సుందర దృశ్యాన్ని కనులారా చూస్తూ "**ఇంత చక్కని లంక నేలెడి! అంత మహాబలశాలి ధనుజుడు! ఎంత పని గావించెననుచు! కొంత రాముడు చింతబూనెను**."10 అని రాముడు అనుకుంటున్న విషయాన్ని గేయ చరణంలో చాలా చక్కగా వివరించడం జరిగింది.

రావణవధ తరువాత రాముడు విభీషణునికి రాజ్య సింహాసనం ఇవ్వడం, సీతకు వార్త తెలిపి రాముని చెంతకు రావడం, రాముడి కోరిక మేరకు రాక్షసింద్రుడైన విభీషణుడు సీతను రాముని ముందు నిలపడం, తనకాంత ఇంతకాలం లంక లోపల ఉన్న కారణంగా లోకమేమనుకుంటుందో అని శోకమగ్నుడవడం, ధైర్యం తెచ్చుకొని నీకునాకు ఇక బంధమేమిటని పరుల గృహమున నిన్నునేను పరిగ్రహించుట దోషమగును కావున నీవెంచటికైనా వెళ్ళుటే సముచితమని చెప్పడం, కలలో కూడా అనుకోలేదు. ఇంత కఠిన పలుకులు పలుకగలడని సాధ్వి సీతామాత ఆశ్చర్యానికి గురయి దుఃఖంతో శోకించడం, జ్ఞానహీనులు మాట్లాడినట్టు మాట్లాడుట తగునా? నా హృదయం నీమీదే లగ్నమైనా, నామనసు నీగురించే పరితపించినా నన్ను విశ్వసించలేకపోతున్నావు. ఈ మిథ్యాపవాదం చే బ్రతుకుట కంటే చచ్చుట శ్రేష్ఠము కనుక నేను పాతివ్రత్యశపథం చేస్తున్నానని అనుచు,

లక్ష్మణుడితో అగ్నిచితిని ప్రజ్వలింప చేయమని జానకి కోరడం, లక్ష్మణుడు చెప్పినట్టు చేసి రాముడికి నమస్కరించడం, అపుడు సీత సర్వభక్షనుడవైనఅగ్ని తప్పుచేయని నన్ను పుణీతురాలినిచెయ్యి అని అగ్నిలోకి దూకడానికి సిద్దమయ్యే సీతను గమనించి ఆపి, రాముడు దోషిగా నిలబడి ఈ ముల్లోకాల్లో జానకికి కీడులేదని, సీత దోషము లేదని నా అంతరాత్మ తెలుపుతున్నదని, అశోకవనమున కాలుమోపిన కారణంగా పరీక్ష పెట్టదలచానే తప్ప మరొకటి కాదని, ఇలా పరీక్ష పెట్టక సీతను స్వీకరిస్తే లోకం మూర్ఖుడని దుర్భషలాడుతుందని చెప్పడం మొదలైన ఘట్టాలు రసవత్తరంగా సాగాయి.

ఇక్కడ మసన చెన్నప్ప సూర్యునినుండి కాంతి వేరుచేయనట్టే జానకిని రాముని నుండి వేరుచేయలేరన్నట్టు ప్రస్థావించాడు. ఆ విధంగా లంకావిజయుడైన రాముడు, దేవతలు కొనియాడుచుండగా అవనిజాతను స్వీకరించడం, ఆ విధంగా సీతాసమేతంగా పుష్పకవిమానంలో అయోధ్యకు చేరుకోవడం, భరతుడు ప్రేమతో స్వాగతంపలకడం ఋషివశిష్టుడు చెప్పినట్టుగా రాముని పట్టాభిషేకం రమణీయంగా జరిగినంతనే మునీంద్రులు, మంత్రులు, అయోధ్యవాసులు ఆనందంలో మునిగిపోయిరి. ఆ కోసలేంద్రుడైన రాముడు సుగ్రీవునికి స్వర్ణహారాన్ని, మణులుపొదిగిన హారాన్ని తన మహిజకు ఇవ్వడం, హనుమను ఆనందభాష్పలతో రాముడు కౌగిలించుకోవడం,ఆపదలు దరిచేరినప్పుడు ఆదుకొనగలిగే నీలాంటివాడు ఈలోకానికి ఆదర్శమని, మానవత్వానికి మించింది లేదని రాముడు చెప్పినట్టు చాలా చక్కగా వివరించాడు ఆచార్య మసన చెన్నప్ప.

చివరగా రాముడు లక్ష్మణునితో క్షేమంగా రాజ్యమేలుతూ ప్రజల సుఖాలే ధ్యేయంగా పరులధనము, పాడుబుద్దులు, చోరభయాలు లేకుండా, వైధికధర్మమే మార్గంగా, యజ్ఞయాగదుల పరంపరగా రామరాజ్యం సాగిపోవడం, ఈ విధంగా పదివేలయేండ్లు చక్కగా రాజ్యాన్ని పాలించడం చివరగా-

"**రామ నామమే నిండెనంతట! రామరాజ్యమే వెలిగేనంతట!! రామకథలే సాగేనంతట! రామమయమై పోయెనంతట!!**"11 అంటూ గేయ చరణంతో శ్రీరామ-కథాగేయాన్ని పూర్తిచేసాడు ఆచార్య మసన చెన్నప్ప.

## 8. ముగింపు:

శ్రీరాముని చరిత్ర భారతీయ సంస్కృతితో ముడిపడి ఉంది. రామునియొక్క యదార్థమైన చరిత్రను కళ్ళకు కట్టినట్లు చాలా సరళంగా అతిసామాన్యశైలిలో శ్రీరామ కథాగేయం ద్వారా ఆచార్య మసన చెన్నప్ప వివరించడం జరిగింది. ఆచార్యుల వారు రచించిన ఈ కథాగేయం బాలబాలికలకోసం వారి మనోవికాసపరంగా, వ్యక్తిత్వవికాసపరంగా, ప్రవర్తనలో మార్పు తీసుకురావడానికి ఉపయోగపడుతుందని చెప్పవచ్చు. రామాయణ కథాగేయం ద్వారా హిందూధర్మచరిత్ర, సంస్కృతీసాంప్రదాయాలు, నడవడిక, నమ్మకాలు, ఆచారవ్యవహారాలు వంటివి తరతరాలకు ప్రభావం చూపి సన్మార్గంలో నడవడానికి దోహదపడతాయి అని చెప్పవచ్చు. ఈ

కథాగేయంలో కొన్ని పాదాలు చతురస్రగతిలో, మరికొన్నిపాదాలు మిశ్రగతిలో నడిచినట్టు తెలుస్తుంది, ముఖ్యంగా గానంచేయడానికి అనువుగా రచించారు ఆచార్యులవారు. అంతేగాకుండా వీరి కథాగేయంలో మొత్తం నలుగువందల గేయచరణాలుండగా వాటిలో మూడువందల వరకు ముత్యాలసరాలు వాడడం విశేషంగా చెప్పుకోవచ్చు. ఈ గేయకృతిలో అతిశయోక్తి అలంకారాలు, అంత్యప్రాసలు విశేషణాలు, వాటంతటవే చోటుచేసుకునేలా రచించారు. వారి హృదయక్షేత్రాల్లో భక్తి, జ్ఞాన, వైరాగ్య బీజాలు పడటానికి అవకాశం కలుగుతుందని ఈ రచన ద్వారా తెలుస్తుంది. ఆచార్య మసన చెన్నప్ప ప్రకారం శ్రీరాముడు అవతారపురుషుడు కాదు చారిత్రక యుగపురుషుడుగా చెప్పడం విశేషం. రామనామస్మరణ అంటే ఆ మహానీయుని గుణగణాలను స్మరిస్తూ వాటిని పాటిస్తూ జీవించడం. రామాయణగాథలో శ్రీ సీతారాముల పవిత్రబంధం,దంపత్యజీవితం ఎలా ఉండాలో మార్గంచూపిస్తూ, లోకానికే ఆదర్శమై, ప్రపంచానికే మార్గదర్శియైనట్టు పవిత్రచరిత్రగా వర్ణించబడింది. ఇంతేకాకుండా అన్నదమ్ములమధ్య ఎటువంటి భేదాభిప్రాయాలు లేకుండా కడవరకు కలిసుండే విధానం, అలాగే ఒక యజమాని సేవకులతో ఉండే పరంపర, ఒకరాజు సుపరిపాలనా దక్షత ప్రజలసంక్షేమం కోరుతూ కలిసిమెలిసి ఉండే పద్ధతి, ఒకభగవంతుడికి భక్తుడికి మధ్యవుండే సంబంధబాంధవ్యాలు మరియు ప్రవర్తనావిధానం, ఆలోచించేతీరు, మనోవిజ్ఞానపరంగా కానీ, తత్త్వశాస్త్ర అంశాలపరంగా, శారీరకంగా, మానసికంగా, నైతికంగా, ఆధ్యాత్మికంగా, సామజికపరంగా ఇలా ఏ కోణంలో చూసినా,ఎన్నిరకాలుగా చూసినా, మహోన్నతమైన వ్యక్తిత్వంతోపాటు రామాయణపాత్రలన్నీ ఆదర్శజీవనానికి ప్రమాణంగానే మనకు అవగతమవుతాయి.

రామనామము సకల పాపహరణము కనుక రామ శబ్దం చాలా పవిత్రమైనదని, రామనామంలో పంచాంక్షారీ మంత్రం ఉందని 'ఓం నమశ్శివాయ' నుండి 'మ' బీజాక్షరం వరకు, అష్టాక్షరి మంత్రం-'ఓం నమో నారాయణ నుండి' 'ర ' బీజాక్షరం వరకు పొందుపర్చడం జరిగింది కనుక రామ శబ్దం చాలా పవిత్రమైనదని, ఈ నామము స్మరించినంతనే శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము చేసిన ఫలము లభిస్తుందని విష్ణుసహస్రనామ ఉత్తరపీఠికలో చెప్పబడినది. చివరగా ఎవరు రాముని గూర్చి విందురో! ఎవరు వాల్మీకిని స్మరింతురో!! వారికి ఆయుర్వృద్ధి కల్గునని, విజయతీరాలకు చేరుకుంటాడని తెలుస్తుంది.

## 9. పాదసూచికలు:

1.ఆచార్య మసన చెన్నప్ప- శ్రీరామ కథాగేయం, బాలకాండ, గేయచరణం 1, పుట: 9

2.ఆచార్య మసన చెన్నప్ప- శ్రీరామ కథాగేయం, బాలకాండ, గేయచరణం 26, పుట: 11

3.ఆచార్య మసన చెన్నప్ప- శ్రీరామ కథాగేయం, అయోధ్యకాండ, గేయచరణం 65, పుట: 15

4.ఆచార్య మసన చెన్నప్ప- శ్రీరామ కథాగేయం, అయోధ్యకాండ, గేయచరణం 780, పుట: 16

5.ఆచార్య మసన చెన్నప్ప- శ్రీరామ కథాగేయం, అరణ్యకాండ, గేయచరణం 96 పుట: 17

6.ఆచార్య మసన చెన్నప్ప- శ్రీరామ కథాగేయం, అరణ్యకాండ, గేయచరణం 123 పుట: 20

7.ఆచార్య మసన చెన్నప్ప- శ్రీరామ కథాగేయం, కిష్కింద కాండ, గేయచరణం 147 పుట: 22

8.ఆచార్య మసన చెన్నప్ప- శ్రీరామ కథాగేయం, సుందరకాండ, గేయచరణం 185, పుట: 26

9.ఆచార్య మసన చెన్నప్ప- శ్రీరామ కథాగేయం, యుద్ధకాండ, గేయచరణం 256, పుట: 32

10.ఆచార్య మసన చెన్నప్ప- శ్రీరామ కథాగేయం, యుద్ధకాండ, గేయచరణం 291, పుట: 35

11. ఆచార్య మసన చెన్నప్ప- శ్రీరామ కథాగేయం, యుద్ధకాండ, గేయచరణం 408, పుట: 46

## 10. ఉపయుక్తగ్రంథసూచి:


1. చెన్నప్ప, మసన శ్రీరామ కథాగేయం, ప్రమీల ప్రచురణలు, తిలక్ రోడ్, హైదరాబాద్, 2021
2. రామరాజు, బిరుదురాజు, తెలుగు జానపద గేయ సాహిత్యం, హైదరాబాదు, 1990
3. వెంకటరెడ్డి, కసిరెడ్డి, జానపద సాహిత్యం అధ్యయనం అనుశీలనం, జాతీయ సాహిత్య పరిషత్ , భాగ్యనగర్ 1994
4. శ్రీలక్ష్మి, కురుగంటి, జానపద రామాయణం మనోవిశ్లేషణ, తెలుగు పరిశోధన ప్రచురణలు, హైదరాబాద్, 1988
5. సుందరం, ఆర్వీయస్, ఆంధ్రుల జానపద విజ్ఞానం, పొట్టి శ్రీరాములు, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 2004
6. సుందరం, ఆర్వీయస్, సుందర జానపదం, ప్రొఫెసర్ ఆర్వీయస్. సుందరం, మైసూర్, 2017


***



AUCHITHYAM
ISSN: 2583-4797
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_46.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)

# 46. తెలుగు రామాయణాలు: మొల్ల రామాయణస్థానం

**ఎమ్. ప్రదీప్**

పరిశోధక విద్యార్థి, తెలుగు శాఖ,

విక్రమ సింహపురి విశ్వవిద్యాలయం,

శ్రీ పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.

సెల్: +91 9100388510. Email: pradeepvsu@gmail.com

**వ్యాససంగ్రహం:**

*తెలుగుసాహిత్యంలో రామకథ వివిధ రకాల ప్రక్రియా భేదాలతో ఇప్పటికీ కొనసాగుతున్న రసరమ్య కథ. తెలుగునాట తొలినాళ్ళలో వచ్చినరామాయణాలు ఏకకవి కర్తృత్వంగా బహుకవి కర్తృత్వంగా రచించబడ్డాయి. మొల్ల రామాయణ కాలం నాటికి వచ్చిన రామాయణాలతో మొల్ల రామాయణాన్నిపోల్చి చూసినప్పుడు వాల్మీకి రామాయణ ఫక్కీలో ఆరు కాండలతో ఏకకవికృతంగా వచ్చిన రామాయణముగా మొల్ల రామాయణమే కనిపిస్తుంది. సంగ్రహంగా రాసినప్పటికీ ఒంటి చేత్తో రాయబడిన రామాయణముగా మొల్ల రామాయణం దర్శనమిస్తుంది. మొల్ల రామాయణానికన్నా ముందున్న రామాయణాలను పరిచయం చేస్తూ.. తెలుగు రామాయణాలలో మొల్ల రామాయణానికి గల స్థానాన్ని గురించి విశ్లేషణాత్మకంగా ఈ వ్యాసం చర్చిస్తుంది. తెలుగులో మొల్ల రామాయణ కాలం వరకు వచ్చిన రామాయణాలు, రామాయణాల మీద జరిగిన పరిశోధన సిద్ధాంత వ్యాస గ్రంథాలు, సాహిత్య చరిత్రలు, సూచనలు (రెఫరెన్సు పుస్తకాలు), మోనోగ్రాఫులు, లక్షణ గ్రంథాలు, ఇతర కావ్యాలు ఈ పరిశోధనా వ్యాసానికి ఆకరాలు.*

**Keywords:** మొల్ల, మొల్ల రామాయణము, అలభ్య రామాయణాలు, సంక్షిప్తీకరణ, పద్య శిల్పం.

## 1. ఉపోద్ఘాతం:

**"మొల్లపువ్వంత పరిమాణము - మల్లెపువ్వంత పరీమళము"** అని ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి[1] మొల్ల రామాయణాన్ని కొనియాడారు.ఈ ఉల్లేఖనం వలన మొల్ల రామాయణ ప్రాశస్త్యం మనకు అర్థమవుతుంది. తెలుగు రామాయణాలకే కాదు తెలుగేతరభాషా రామాయణాలకు కూడా మాతృక వాల్మీకి రామాయణమనేచెప్పవచ్చు. విశ్వ

వాఙ్మయంలోనే తొలి కావ్యం వాల్మీకి రామాయణం. సంస్కృత భాషలో రాయబడిన ఈ రామాయణం తర్వాత కాలంలో ప్రాచ్య పాశ్చాత్య భాషలన్నింటిలోకి అనువాద రూపంలోఅనుసృజింపబడింది. ఉత్తర భారతదేశం వారికి రామాయణము అంటే వాల్మీకి రామాయణం ఉన్నప్పటికీ తులసీ రామాయణమే వారికి పరమప్రామాణికం. అయితే దక్షిణ భారతదేశంలో రామాయణం అంటే తమిళులకు కంబ రామాయణం, మలయాళీలకు ఎత్తచ్చి రామాయణాలే రామాయణాలు. కానీ తెలుగు వారికి రామాయణం అంటే ఏ రామాయణం అనే ప్రశ్న ఎదురవుతుంది. ఇందుకు కారణం లేకపోలేదు గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణంతో ప్రారంభమైన రామాయణ రచన ఇంచుమించు అన్ని ప్రాచీన సాహిత్య ప్రక్రియలలో రావడమే కావొచ్చు. ఈ ప్రక్రియలలో వచ్చిన ఒక్కొక్క రామాయణం ఒక్కొక్క విశేషాన్ని కలిగిఉండటమే అని కూడా చెప్పవచ్చు. ఇప్పటికీ ఏదో ఒక ప్రక్రియలో రామాయణాలు వస్తూనే ఉన్నాయి. ప్రతి సాహిత్య యుగములోనూ రామాయణం ఆయా సాహిత్య యుగాలలో వెల్లివిరిసిన ప్రక్రియలలో ప్రతిఫలిస్తూనే ఉంది. రామాయణం రాసిన కవులు తామెందుకు రామాయణం రాస్తున్నారో, రామకథ రాయవలసిన అవసరం ఏమిటో తెలియజేస్తూ వచ్చారు.

తిక్కన తన నిర్వచనోత్తరరామాయణంలో-

**ఎత్తఱినైనను ధీరో**
**దాత్త నృపోత్తముడు, రామ ధరణీపతి స**
**ద్వృత్తము సంభావ్య మగుట**
**నుత్తర రామాయణోక్తి యుక్తుడనైతిన్. (నిర్వ. రామాయణము, ప్రథమాశ్వాసము, 11వ పద్యము)**

అనే పద్యంలో రామాయణం రాయవలసిన అవసరాన్నీ ధీరోద్ధాత్తుడైన రామున్ని కీర్తించాడు. ఒక్కతిక్కనే కాదు రామ కథను కవిత్వీకరించిన ప్రతి కవి కూడా రామాయణం ఎందుకు రాయాలి? అని తమకు తామే ప్రశ్నించుకొని మనకు సమాధానాలు తెలియజేశారు.

మొల్ల కూడా తన రామాయణఅవతారికలో ఐదు పద్యాలలో (చూడుము: మొల్ల రామాయణ అవతారిక20, 21,22,23,24 పద్యాలు) రామాయణం రాయాల్సిన ఆవశ్యకతను, ఇందువలన కలిగే ప్రయోజనాన్ని తెలియజేస్తుంది. ఈ ఐదు పద్యాలను రామకథామృత మహిమకు మధుర మిఠాయిలుగా చెప్పుకోవచ్చు.

తెలుగువారి పద్య విద్యకు, సాహిత్యపు అక్షరాకృతికి ఆద్యుడైన నన్నయ చూపిన కావ్య రచనా పద్ధతి చంపూ పద్ధతి. తదనంతర కాలాలలో వచన కావ్యాలు, ద్విపద కావ్యాలు, నిర్వచన కావ్యాలు ఇలా ఎన్నో రకాల కావ్యాలు వచ్చాయి. అయితే చంపూకావ్యాలు పొందిన ఆదరణ మనకు తెలియనిది కాదు. మొల్ల రామాయణ కాలం వరకు ఇలా చంపూపద్ధతిలోమరియు ఇతర కావ్య పద్ధతుల్లో వచ్చిన రామాయణాలు కలవు.తొలి తెలుగు రామాయణమైన రంగనాథ రామాయణం నుండి మొల్ల రామాయణం వరకు గల రామాయణాలను పరిచయం చేయడం, చంపూ పద్ధతిలో ఏకకవి కృతంగా రాయబడిన రామాయణం ఏమిటనేది చర్చిస్తూ, మొల్ల రామాయణ విశేషాలను

కొన్నింటినివిశ్లేషిస్తూ,వీటిలో మొల్ల రామాయణానికి గల స్థానాన్ని చెప్పడమే ఈ వ్యాస ముఖ్య ఉద్దేశం.

## 2. మొల్ల రామాయణానికి పూర్వరామాయణాలు:

మొల్ల రామాయణ కాలం వరకు వచ్చిన రామాయణాలను పరిచయం చేసి, వీటిలో మొల్ల రామాయణ స్థానం ఏమిటనేది చెప్పడం కొరకుమొల్ల రామాయణ కాలం వరకు వచ్చిన రామాయణాలను రెండు రకాలుగా విభజించుకొని విషయ వివరణ చేయదలుచుకుంటున్నాను.

1. **లభ్య రామాయణాలు**
2. **అలభ్య రామాయణాలు**

### 2.1. లభ్య రామాయణాలు:

తెలుగు సాహిత్యములో రామాయణ రచన ప్రారంభమైన కాలం నుంచి మొల్ల రామాయణ కాలం వరకు మూడు లభ్య రామాయణాలను గుర్తించాను.

1. **రంగనాథ రామాయణము**
2. **నిర్వచనోత్తర రామాయణము**
3. **భాస్కర రామాయణము**

### 2.1.1.రంగనాథ రామాయణము :

తెలుగులో తొలి రామాయణం రంగనాథ రామాయణం. దీనిని రచించింది గోనబుద్ధారెడ్డి. తన తండ్రి విఠల రంగనాథుని కోరిక మేరకు రామాయణాన్ని ఆరుకాండలతో రచించాడు. తర్వాత గోనబుద్ధారెడ్డి కుమారులైన కాచవిభుడు, విఠలనాథుడు ఏడవ కాండగా ఉత్తర రామకథను రచించారు. ఈ రామాయణం దేశి ఛందమైన ద్విపద ఛందస్సులో రాయబడటం విశేషం.

**అ.** తెలుగు సాహిత్యానికి నన్నయ పెట్టిన కావ్యా రచనా పద్ధతి చంపూ పద్ధతి అని ఇంతకుముందే చెప్పుకున్నాము. నాటి కాలంలో చంపూ పద్ధతిలో రాసిన రచనలే కావ్యాలుగా పరిగనింపబడేవి. అయితే ద్విపద రచనలు, వచన రచనలు కావ్య గౌరవం పొందినప్పటికీ చంపూ రచనయే కావ్యమనిపించుకునేది. కేవలం ద్విపదలో రాసిన రచనలు ఉన్నాయి కానీ చంపూ కావ్యాలలో ద్విపదకు స్థానం లేదనేది అందరెరిగినదే.

**ఆ.** గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణం ఏడు కాండలతో ఉంటుంది. వాల్మీకి రామాయణం ఆరుకాండలతోనే ఉంటుంది.

**ఇ.** రంగనాథ రామాయణం ఏకకవి కృతం కాదు. తండ్రి కొడుకులైన గోనబుద్ధారెడ్డి, కాచవిభుడు, విఠలనాథుడు ఇలా ముగ్గురు చేత రాయబడిన బహుకర్తృత్వ రామాయణం.

### 2.1.2.నిర్వచనోత్తరరామాయణము:

తెలుగు సాహిత్యంలో ఏకకవి కర్తృత్వంగా వచ్చిన తొలి రామాయణం నిర్వచనోత్తరరామాయణం.ఇది తిక్కన తొలి రచన. అయితే ఈ రామాయణం నిర్వచనంగా రాయబడటంతో పాటుగా, ఉత్తర రామకథనుమాత్రమే చెప్పింది.

**అ.** పూర్వ రామకథను చెప్పకుండా ఉత్తర రామకథను మాత్రమే చెప్పడం ఈ రామాయణం యొక్క విశేషం.

### 2.1.3. భాస్కర రామాయణము:

తెలుగులో తొలి చంపూ రామాయణం భాస్కర రామాయణం. వాల్మీకి రామాయణ ఫక్కీలో ఆరుకాండలతో రచించబడినరామాయణం భాస్కర రామాయణం.

**అ.** ఈ రామాయణం కూడా ఏకకవికృతం కాదు. ఈ రామాయణాన్ని నలుగురు కవులు రాశారు. నలుగురు కవులు రాసినప్పటికీ హుళక్కి భాస్కరుని పేరు మీదనే ఈరామాయణంప్రసిద్ధి చెందింది.

**ఆ.** భాస్కర రామాయణం రాసిన కవులు - వారు రాసిన కాండలు,

| | |
|---|---|
| **హుళక్కి భాస్కరుడు** | **అరణ్యకాండ, యుద్ధకాండ పూర్వ భాగం.** |
| **మల్లికార్జున భట్టు** | **బాల, కిష్కింధ, సుందరకాండలు.** |
| **కుమార రుద్రదేవుడు** | **అయోధ్యకాండ.** |
| **అయ్యలార్యుడు** | **యుద్ధకాండ ఉత్తరభాగం.** |

**ఇ.** హుళక్కిభాస్కరుని కుమారుడు మల్లికార్జున భట్టు.భాస్కరుని శిష్యుడు కుమార రుద్రదేవుడు.భాస్కరుని మిత్రుడు అయ్యలార్యుడు. వాల్మీకి రామాయణాన్ని అనుసరిస్తూ ఆరుకాండలతో రాసినప్పటికీ ఈ రామాయణం బహుకర్తృత్వ రామాయణం.

### 2.2.అలభ్య రామాయణాలు:

మొల్ల రామాయణానికన్నా ముందుకొన్ని అలభ్య రామాయణాలు ఉన్నట్లు ఇతర కవుల రాసిన కావ్యాల వలన, కవుల జీవితచరిత్రల వలన, సంకలన గ్రంథాల వలన, సాహిత్య చరిత్ర వలన మనకు తెలుస్తుంది.మొల్ల రామాయణ కాలం వరకు ఐదుఅలభ్య రామాయణాలు గుర్తించాను.

1. **శతకంధర రామాయణము**
2. **రాఘవ పాండవీయము**
3. **ఎఱ్ఱన రామాయణము**
4. **కొఱవి సత్యనారాయణ రామాయణము**
5. **అన్నమయ్య రామాయణము**

### 2.2.1. శతకంధర రామాయణము:

ఈ రామాయణాన్ని వేములవాడ భీమకవి రచించినట్లు సాహిత్య చరిత్రల[2]వల్లతెలుస్తుంది. కానీఈకవిరాసినఏరచనకూడా నేడు లభ్యం కావడం లేదు.

### 2.2.2. రాఘువ పాండవీయము:

వేములవాడ భీమకవి రాఘవ పాండవీయం అనే పేరుతో రామకథను, భారతకథను కలిపి రెండు అర్థాలు వచ్చే విధంగా ద్వర్థి కావ్యాన్ని రచించినట్లు సాహిత్య చరిత్ర వలన, పింగళి సూరన రాసిన రాఘవ పాండవీయం అవతారిక వలన తెలుస్తుంది.

**భీమన తొల్లి చెప్పెనను పెద్దల మాటయె కాని యందునొం**
**డేమియు నేయెడన్నిలుచు టెవ్వరుఁగాన రటుండ**
**నామహిత ప్రబంధ రచనా ఘనవిశ్రుతి నీకుఁ గల్గుటన్**
**నామదిఁ దద్వ్యయార్థకృతి నైపుణియుంగల దంచు నెంచెదన్.**

(రాఘవ పాండవీయము,11వ పద్యము)

ఈ పద్యం వలన వేములవాడ భీమకవి రాఘవ పాండవీయం అనే కావ్యం రాసినట్లు తెలుస్తుంది కానీ పింగళి సూరన కాలానికే ఈ కావ్యం అలభ్యమైనట్లుంది.

### 2.2.3.ఎఱ్ఱనరామాయణము:

ఎఱ్ఱన కూడా రామాయణం రాసినట్లు హరివంశ అవతారిక వలన, చదలవాడ మల్లన విప్రనారాయణ చరిత్ర వలన, కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహం అనే లక్షణ గ్రంథంలో ఉదహరించిన పద్యాలవలన తెలుస్తుంది.

**అ.** ఎఱ్ఱన తన హరివంశ అవతారికలో చెప్పిన ఈ క్రిందిపద్యం వలనతాను రామాయణం రాసి, ప్రోలయ వేమారెడ్డికి అంకితం ఇచ్చినట్లు తెలుస్తుంది.

**నా తమ్ముండు ఘనుండు మల్లరథినీ నాథుండు నిన్నాతత**
**శ్రీ తొడన్ సమువేతుఁ జేసి యెలమింజేపట్టి మాకిచ్చుటం**
**జేతో మోద మెలర్ప రామకథమున్ జెప్పించి యత్యుత్తమ**
**ఖ్యాతింబొందితి నింక నేనుదనియన్ గావ్యామృతస్వాదనన్.**

(హరివంశము, పూర్వ భాగము, పీఠిక 39వ పద్యము)

**ఆ.** ఎఱ్ఱన వంశీయుడైన చదలవాడ మల్లన విప్రనారాయణ చరిత్ర పీఠికలోని ఈ క్రింది పద్యం వలనకూడాఎఱ్ఱన రామాయణం రచించినట్ల తెలుస్తుంది.

**ప్రతిభతో నారణ్యపర్వ శేషముఁ జెప్పెఁ**
**గవులకుఁ జెవుల పండువులుగాఁగ**

**వల్మీకభవుచో వైఖరిరామాయ**
**ణంబునాంధ్ర ప్రబంధంబుఁ జేసె**
**నారసింహుని పురాణమొనర్చె హరి మెచ్చి**
**నిన్ను నెన్నడు చూచినాఁడ వనఁగఁ**
**బ్రౌడిమై హరివంశ...భాగముల్**
**రచించె సభలందుఁ బ్రాజ్ఞులెన్న**
**దురతహరుఁ బ్రబంధపరమేశ్వరుని జెద**
**ల్వాడ నిలయు నాదు వంశకర్త**
**ధన్య మూర్తి శంభుదాసునెఱ్ఱాప్రెగ**
**గడను నుతింప బ్రహ్మకునుదరంబె!** (విప్రనారాయణ చరిత్రము, పీఠిక 13వ పద్యము)

పైన పేర్కొన్న కావ్య అవతారికలలోని పద్యాల వలన ఎఱ్ఱన రామాయణం రాసినట్లు తెలుస్తుంది.

**ఇ.** పై కావ్య అవతారికలలోని పద్యాల వల్లనే కాకుండా కూచిమంచి తిమ్మకవి రాసిన సర్వలక్షణ సారసంగ్రహం అనే లక్షణ గ్రంథంలోని ప్రథమాశ్వాసం-సంధిప్రకరణములో ఒక పద్యం(56వ పద్యం) వలన, ద్వితీయాశ్వాసం శబ్ద ప్రకరణములో రెండు పద్యాల(11,23పద్యాలు) వలన, తృతీయాశ్వాసంలో - శకట రేఫ ప్రకారణములో ఆరు పద్యాల(58,181,188,211,244,230 పద్యాలు) ఇలా ఈ లక్షణ గ్రంథంలోని మొత్తం తొమ్మిది పద్యాల వలన ఎఱ్ఱన రామాయణం రాసినట్లు తెలుస్తుంది. కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహం రాసేంత వరకు ఈ రామాయణం లభిస్తున్నట్లు మనకు అర్థమవుతుంది.

### 2.2.4. కొఱవి సత్యనారనరామాయణము:

కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశిక అనే కథాకావ్యం వలన కొఱవి సత్యనారన అనే కవి ఉన్నట్లు తెలుస్తుంది.ఈ కవి గోపరాజుకు పినతాత అయినట్లు, ఇతను రామాయణం రాసినట్లు, ఈయనకు ఆంధ్ర కవి పితామహుడు అనే బిరుదు ఉన్నట్లు సింహాసనాద్వాత్రింశికకావ్యఅవతారిక వలన తెలుస్తుంది.

**రామాయణ కృతికృతియై**
**తామెఱయుచు నంధ్రకవి పితామహుఁ డనఁ గా**
**భూమిని మించిన భీమన**
**నామనంబునఁ బరంగె సత్యనారన ఘనుఁడై.**
**(సింహాసనద్వాత్రింశిక, ప్రథమాశ్వాసము, 49వ పద్యము)**

ఈ పద్యం వలన కొఱవి సత్యనారన రామాయణం రాసినట్లు తెలుస్తుంది కానీ, ఇతర ఏ కవి కావ్యఅవతారికలవల్ల గానీ, మరే ఇతర రచన వల్ల గానీ తెలియడంలేదు.

### 2.2.5.అన్నమయ్య రామాయణము:

తాళ్ళపాక అన్నమయ్య కూడా ద్విపదలో ఒక రామాయణాన్ని రచించినట్లు తాళ్ళపాక చిన్నన్న అని పిలవబడే తాళ్ళపాక చిన తిరువేంగళనాథుడనే అన్నమయ్య మనుమడు (అన్నమయ్య రెండో భార్య అక్కలమ్మ

కుమారుడైన పెద్ద తిరుమలయ్య నాల్గవ కుమారుడు)[3]రాసినఅన్నమాచార్య చరిత్రముఅనే రచన వలన తెలుస్తుంది.

**ప్రవిమల ద్విపద ప్రబంధ రూపమున**
**నవముగా రామాయణము, దివ్యభాష**
**నా వేంకటాద్రి మహత్త్వ మంతయు**
**గావించి రుచుల శృంగార మంజరియు,** (అన్నమాచార్య చరిత్రము, 4,5 ద్విపదలు)

ఈ ద్విపదల వలన అన్నమయ్య కూడా ద్విపదలో నవముగా ఒక రామాయణం రాసినట్లు తెలుస్తుంది.

## 3. మొల్ల పరిచయం:

మొల్ల తానెవరనే విషయాన్ని తన రామాయణఅవతారికలోని

**గురులింగజంగమార్చన**
**పరుఁడును శివభక్తిరతుఁడు బాంధవహితుఁడున్**
**గురుఁ డాతుకూరి కేసయ**
**వరపుత్రుని మొల్ల యనఁగ వఱలినదానన్.** (మొల్ల రామాయణము, అవతారిక,11వ పద్యము)

అనే పద్యంలోనూ, ప్రతి ఆశ్వాసాంత గద్యలోనూ చెప్పుకుంది. తాను గౌరీశ్వర వరప్రసాదలబ్ద గురుజంగమార్చిన వినోద సూరి జన వినుత కవితా చమత్కారుడైన ఆతుకూరి కేసన సెట్టి కూతురునని చెప్పుకుంది.పై పద్యం వలన, ఆశ్వాసాంత గద్య వలన మొల్ల తండ్రి పేరు కేసన సెట్టి అనీ, అతను శివ భక్తుడు అని అర్థమవుతుంది. అంతేకాదు మొల్ల తండ్రి పండితుల చేత కూడా పొగడబడే కవితా చమత్కారం కలవాడని మనకు అర్థమవుతుంది.

## 4. మొల్ల కవిత్వ విద్య:

ఇంతకుముందు చెప్పుకున్నట్టు పండితుల చేత కూడా పొగడబడే కవితా చమత్కార విద్య గల తండ్రి నుంచి మొల్ల కవిత్వం నేర్చుకొని ఉండవచ్చు. కానీ ఈ మాట తన రామాయణంలో ఎక్కడా ప్రస్తావన చేయలేదు. కానీ తను ఏమీ చదువుకోలేదని, తనకు ఎటువంటి కవితా విద్య రాదని ఎంతో వినయంగా చెప్పుకున్న వినయశీలిగా మనం మొల్లను చూడవచ్చు.

**దేశీయ పదములు దెనుఁగులు సాంస్కృతుల్**
**సంధులు ప్రాజ్ఞుల శబ్ద వితతి**
**శయ్యలు రీతులుఁ జాటు ప్రబంధంబు**
**లాయా సమాసంబు లర్థ దృష్టి**
**భావార్థములుఁ గావ్య పరిపాకములు రస**
**భావ చమత్కృతుల్ పలుకు సరవి**
**బహు వర్ణములును విభక్తులు ధాతు ల**
**లంకృతి చ్ఛందో విలక్షణములుఁ**

**గావ్య సంపద క్రియలు నిఘంటువులును**
**గ్రమము లేవియు నెఱుఁగ, విఖ్యాత గోప**
**వరపు శ్రీకంఠమల్లేశు వరముచేత**
**నెఱిఁ గవిత్వంబుఁ జెప్పఁగా నేర్చుదాన.** (మొల్ల రామాయణము, అవతారిక,12వ పద్యము)

ఈ పద్యంలో పేర్కొన్న కవిత్వ విద్యకు సంబంధించిన అంశాలు తనకు తెలియవంటూనే రసరమ్యంగా రామకథను అందించింది. తనకు కవిత్వ విద్య గోపవరం గ్రామంలో వెలసిన ఈశ్వరుని వలన వచ్చిందని, రాముడు రాయమని చెప్తే రామాయణం రాస్తున్నానని చెప్పుకుంది. ఈ భావన హరిహరాద్వైత సిద్ధాంతాన్ని ధ్వనింపజేస్తుంది.

తాను చదువుకోలేదని, రాస్తున్న రామాయణం కూడా రాముడే రాయించుకుంటున్నాడని చెప్తూనే కవిత్వం ఎలా ఉండాలో, ఎలా ఉండకూడదో స్పష్టం చేస్తూ తన కవిత్వ విద్యా విశేషాలను తన రామాయణంలో చూపించింది.

## 5. మొల్ల సంక్షిప్తీకరణ సామర్థ్యం:

మొల్ల తాను చెప్పుకున్న కవితా విశేషాలు, కవిత్వ విద్యా విషయాలు తన రామాయణంలో అక్కడక్కడ కనిపిస్తూనే ఉంటాయి. మొల్ల రామాయణం అనగానే అందరికీ గుర్తొచ్చేది మొల్ల సంక్షిప్తీకరణ విధానం. చెప్పాలనుకున్న విషయాన్ని వర్ణనతో పాటుగా సూటిగా, స్పష్టంగా చెప్పగల నేర్పరి మొల్ల.

**కదలకుమీ ధరాతలమ, కాశ్యపిఁ బట్టు, ఫణీంద్ర భూ విషా**
**స్పదులను బట్టు, కూర్మమ రసాతల భోగి ధులీ కులీశులన్**
**వదలక పట్టు, ఘృష్టి ధరణీ కచ్ఛప పోత్రి వర్గమున్**
**బొదువుచుఁ బట్టుఁడీ కరులు, భూవరుఁ డీశుచాప మెక్కిడున్.**

(మొల్ల రామాయణము, బాలకాండము,78వ పద్యము)

మొల్ల ఈ పద్యంలో భూమిని హెచ్చరిక చేస్తూ తన కవితా ప్రావీణ్యం మొత్తం కుప్ప పోసిందా అని అనిపిస్తుంది. తనకు కవిత్వం రాదని చెప్తూనే ఈ పద్యంలో భూమికి, తాబేలుకి, పాముకి, వరాహానికి గల పర్యాయపదాలను అవలీలగా ప్రయోగించింది. అంతేకాదు దీని తర్వాత పద్యంలో తన సంక్షిప్తీకరణ సౌందర్యాన్ని స్పష్టం చేస్తుంది.

**ఉర్వీనందనకై రా**
**మోర్వీపతి యెత్తి నిప్పు దుగ్రుని చాపం**
**బుర్వం బట్టుఁడు దిగ్గం**
**త్యుర్వీధర కిటి ఫణీంద్రు లూఁతఁగఁ గడిమిన్.** (మొల్ల రామా, బాలకాండము, 79వ పద్యము)

ఈరెండు పద్యాలను పరిశీలిస్తే మొల్లసంక్షిప్తీకరణలో ఎంత సిద్ధహస్తురాలో, విస్తృతిలోనూ అంతే విస్పష్టమైన అవగాహన గల కవయిత్రి అని అర్థమవుతుంది.ఇటువంటి కవితా చమత్కారాలెన్నో మొల్ల రామాయణం నిండా పరుచుకొని ఉంటాయి. ఈ విధానమే మొల్ల రామాయణానికి ఒక ప్రత్యేకతను తెచ్చిపెట్టిందేమో అనిపిస్తుంది.

మొల్ల రామాయణాన్ని పరిశీలించినట్లయితే మొల్ల తనకు నచ్చినట్లు, ఇష్టం వచ్చినట్లు సంక్షిప్తీకరణ చేసినట్లు కనిపించదు. సంక్షిప్తీకరణలోనూ పాత్రకు, సన్నివేశానికి తగిన ఔచిత్యాన్ని పాటించినట్లు కనిపిస్తుంది.

**నీల మేఘ చ్ఛాయ బోలు దేహమువాఁడు**
**ధవ లాబ్జ పత్ర నేత్రములవాఁడు**
**కంబు సన్నిభమైన కంఠంబు గలవాఁడు**
**చక్కని పీన వక్షంబు వాఁడు**
**తిన్ననై కనుపట్టు దీర్ఘబాహులవాఁడు**
**ఘనమైన దుందుభీ స్వనము వాఁడు**
**పద్మ రేఖలు గల్గు పద యుగంబులవాఁడు**
**బాగైన యట్టి గుల్ఫములు గలవాఁడు**
**కపట మెఱుఁగని సత్య వాక్యములవాఁడు**
**రమణి! రాముండు శుభలక్షణములవాఁడు**
**ఇన్ని గుణముల రూపింప నెసగువాఁడు**
**వరుస సౌమిత్రి బంగారు వన్నె వాఁడు.** (మొల్ల రామా, సుందరకాండము, 102వ పద్యము)

మొల్ల సంక్షిప్తీకరణ శిల్పానికి ఈ పద్యమొక చక్కని నిదర్శనం. అశోక వనంలో సీత - హనుమల సంభాషణ సమయంలో ఈ పద్యం చెప్తుంది మొల్ల.

**అ.** సీత హనుమతో హనుమా! నువ్వు రాముని దూతవు అంటున్నావు. రాముడు ఎలా ఉంటాడో చెప్పు అనే సందర్భంలో చెప్పబడిన ఈ పద్యం మొల్ల రచనా రీతిని, హనుమ వ్యాకరణ పాండిత్యాన్ని తెలియజేస్తుంది. సీస పద్యంలోని నాలుగు పాదాలు, ఎత్తుగీతిలోనిమొదటి రెండు పాదాలు రాముని గురించి చెప్తాయి. అయితే ఇక్కడ చూడవలసింది ఎత్తుగీతిలోని చివరి రెండు పాదాలు. ఈ రెండు పాదాలు లక్ష్మణుని గురించి చెప్తాయి. సీస పద్య పాదాలలోనూ, ఎత్తుగీతిమొదటిరెండు పాదాలలోనూ చెప్పినట్లు రాముడు ఎలా ఉన్నాడో, లక్ష్మణుడు కూడా అలాగే ఉంటాడు. కానీ రాముడు నీల మేఘంలాగా ఉంటాడు. లక్ష్మణుడు మాత్రం బంగారు రంగులో ఉంటాడని ఒకే పద్యంలో రామలక్ష్మణులిద్దరినీ చెప్తుంది.

**ఆ.** ఈ పద్యం హనుమ పాత్రకు తగిన విధంగా చిత్రించింది మొల్ల. హనుమంతునికి నవ వ్యాకరణ పండితుడు అనే పేరు ఉన్నట్లు హనుమంతుని అష్టోత్తర శతనామాలలో చెప్పబడి ఉంది. నవ (తొమ్మిది) రకాల వ్యాకరణాలలో పండితుడైన హనుమ పాత్ర చేత రామలక్ష్మణులిద్దరికీ చెరొక పద్యం చెప్పించకుండా ఎంతో ఔచిత్యాన్ని పాటించినట్లు కనిపిస్తుంది. అంతే కాదు ఈ పద్యం రామలక్ష్మణులిద్దరినీ మన కంటి ముందు నిలప గల రూపుకట్టించే కవితా శిల్పం.

ఇటువంటి రూపుకట్టించే పద్య కవితా శిల్పాలు మొల్ల రామాయణంలో మెండుగా ఉన్నాయి. వాటిలో కొన్నింటిని పరిశీలిద్దాం...

## 6. రూపు కట్టించే పద్య శిల్పం:

మొల్ల రామాయణ పద్యాలు చదువుతుంటే సదరు సన్నివేశాలు, పాత్రలు కంటికి కనిపించేటట్లు ఉంటాయి. ఈ పద్యాలను ఏ చిత్రకారుడైనా చిత్రాలు గీయవచ్చు, శిల్పి శిల్పాలను చెక్కవచ్చు. అంతటి పద్య కవితా శిల్పం మొల్ల సొంతం.

మొల్ల రామాయణ అవతారికలో ఇష్టదేవతా స్తుతిలో చెప్పిన లక్ష్మీదేవి స్తుతిని పరిశీలిస్తే..

**సామజయుగ్మ మింపలరఁ జల్లని నీరు పసిండి కుండలన్**
**వేమఱు వంచివంచి కడువేడుకతో నభిషిక్తఁ జేయఁగాఁ**
**దామరపువ్వుగద్దియ ముదంబున నుండెడి లోకమాత మా**
**కామునితల్లి లోకములఁ గాచుఁ గృపా మతి నెల్లకాలమున్.**

ఈ పద్యం చదువుతుంటే ప్రస్తుతం ఇళ్లలో ఉండే లక్ష్మీదేవి చిత్రపటం తప్పక గుర్తుకు వస్తుంది. ఈ పద్యం చదివిన ఏదైనా చిత్రకారుడు చిత్రపటాన్ని చిత్రించాడా అనే అనుమానం కలుగుతుంది.

అదేవిధంగా సుందరకాండలోని ఈ పద్యం హనుమంతుడు లంకకు వెళ్లే సందర్భంలో నింగికెగిసిన విధానాన్ని, ఆ సమయంలో హనుమ శరీర చేష్టలను రూపు కట్టించింది మొల్ల.

**మొగము బిగించి, పాదములు మొత్తముగా వడినూఁది త్రొక్కి, నీ**
**టుగ మొగ మెత్తి, భీకర కఠోర రవంబున నార్చి, బాహు ల**
**త్యగణిత లీల నూఁచి, వలయంబుగ వాలముఁద్రిప్పి, వ్రేఁగునన్**
**నగము సగమ్ము గ్రుంగఁ గపి నాథుఁడు నింగికి దాఁటె ఠీవృనన్.**

**(మొల్ల రామాయణము, సుందరకాండము, 19వ పద్యము)**

ఈ పద్యంలోని సన్నివేశాన్ని చక్కని చిత్రాన్ని గీయవచ్చు అన్నట్లు చెప్పిన మొల్ల పద్య కవితా శిల్పం అనన్య సామాన్యం.

## 7. మొల్ల తీర్చి దిద్దిన సీతమ్మ :

మొల్ల చిత్రించిన రామాయణ పాత్రలన్నింటిలో స్త్రీ పాత్రలు చెప్పుకోదగ్గవి. ఈ స్త్రీ పాత్రలన్నింటిలో కూడా సీత పాత్రను మొల్ల చిత్రించిన విధానం స్త్రీవాదానికి ఒక వాహికగా చెప్పుకోవచ్చు. స్త్రీవాదానికన్నా ముందున్న ఇలాంటి ప్రాచీన కవితా స్త్రీవాద నేపథ్యాలలో మొల్ల రామాయణంలోని సీత పాత్ర విశేషమైనది. మొల్ల తన కవితా వాడిలో, స్త్రీవాద వేడిని పొరిగొల్పిన ఘట్టాలు సుందరకాండలో సాక్షాత్కరింపజేసింది. సీతా - రావణ సంవాదంలో రావణుని తూలనాడుతూ సీత చూపించిన ధైర్యం, రావణునితో అన్న మాటలు మొల్ల రామాయణ కాలం నాటికి గల స్త్రీవాదానికి పునాదులుగా చెప్పుకోవచ్చు.

రావణాసురుడు అశోకవనంలో ఉన్న సీతతో నువ్వు ఇంకా నీ రాముడు వస్తాడని నిన్ను ఇక్కడి నుంచి తీసుకొని వెళ్తాడని ఏదేదో కలలు కంటున్నావేమో లంకకు సామాన్య మానవుడైన రాముడు రాలేడు. అనే

సందర్భంలో సీతమ్మ పలికిన పద్యపు పలుకులు..

**సంగర రంగమందు నతి శౌర్యమునన్ రఘురాము తోడ మా**
**తంగ తురంగ సద్భట శతాంగ బలంబులఁ గూడి నీవు పో**
**రంగను నోప, కిప్పుడు విరాధ ఖరాదుల పాటుఁ జూచియున్**
**దొంగిలి నన్నుఁ దెచ్చితివి, తుచ్ఛపుఁ బల్కులు పల్కఁ బాడియే?**
**(మొల్ల రామాయణము, సుందరకాండము, 63వ పద్యము)**

అంటూ సీత రావణునితో పలికిన మాటల పదును సీతను దృఢచిత్తగా చిత్రిస్తాయి. ఇంకా...

**కూకటి ముడికినై కురులు గూడని నాఁడె**
**బెదరక తాటకఁ బీఁచ మణఁచె,**
**గాధేయు డొనరించు క్రతు రక్షణము సేయఁ**
**బెక్కండ్రు దైత్యుల నుక్కణంచె,**
**నవనిపై వెలసిల్లు నఖిల రాజన్యులు**
**వ్రేలఁ జూపఁగఁ లేని విల్లు విఱచె,**
**ఘోరాటవులలోనఁ గ్రుమ్మరు నప్పుడు**
**ఖర దూషణాది రాక్షసులఁ జంపెఁ,**
**బాదరజమున నొక ఱాయిఁ బడఁతిఁ జేసె**
**లీల మాయ మృగంబును గూలనేసె**
**రాజ మాత్రుండె మేదినీ రక్షకుండు**
**రామ భూపాలుఁ డాది నారాయణుండు.**

(మొల్ల రామాయణము, సుందరకాండము, 64వ పద్యము)

అంటూ రాముని గుణగణాలు, శక్తి సామర్థ్యాలు, విలువిద్యా ప్రావీణ్యాన్ని శత్రువైన రావణుని ఎదుట వెఱువక వెల్లడి చేసిన ఈ ఘట్టంలో సీత చూపిన గడుసుతనం, స్త్రీవాదం సీత మాటల్లో మొల్ల మాటలు ఎన్నదగినవి. రాముని గురించి చెప్పడమే కాదు నువ్వేదో నా లంకా పట్టణం గొప్పది, ఇక్కడికి ఎవరూ రాలేరు అని చెప్తున్నావ్? చూసుకో రావణా అంటూ తర్వాత పద్యంలో..

**అట్టి రాముని కీ యబ్ధి యనఁగ నెంత?**
**లంక యన నెంత? దనుజుల పొంక మెంత?**
**నీ వనఁగ నెంత? నీ లావు చేవ యెంత?**
**చెప్ప నేటికి నీవె చూచెదవు గాక!**

(మొల్ల రామాయణము, సుందరకాండము, 65వ పద్యము)

రావణుని కేవలంగా చూసిన సీత పాత్ర మాటల్లో మొల్ల మాటలు ఈనాటి కొందరి మాటలలో వినిపిస్తున్న నువ్వెంత? ఏం చేస్తావ్? ఏం చేయలేవ్? అనే భావం స్పష్టంగా వినిపిస్తుంది.

సీతారావణ సంవాదంలోనే కాదు సీతా - హనుమల సంభాషణ సందర్భంలోనూ సీత దృఢ చిత్తాన్ని మొల్ల అక్షరీకరించిన విధానం అమోఘం. హనుమంతుడు సీతమ్మతో అమ్మా సూర్యోదయం కాకముందే మనం ఇక్కడ నుండి వెళ్ళిపోదాం అంటూ హనుమ..

**ఇనుడుఁ దయింపక మున్నే**
**వననిధి లంఘించి, మనుజ వల్లభుకడుకున్**
**నినుఁ గొనిపోయెద, వీఁపున**
**జననీ విచ్చేయు మనిన, సంతోషమునన్.** (మొల్ల రా, సుం.కాం., 118వ పద్యము)

అన్నప్పుడు సీత పలికిన పలుకులు మొత్తం స్త్రీ జాతికే ఆదర్శప్రాయంగా ఉంటాయి.

**నీ వంతవాఁడ వగుదువు, / నీ వెంటనే వత్తునేని నెగడవు కీర్తుల్**

**రావణుకంటెను మిక్కిలి / భూ వరుఁడే దొంగ యండ్రు బుధ నుత చరితా!**

(మొల్ల రా., సుం.కాం., 119వ పద్యము)

**దొంగిలి తెచ్చిన దైత్యుని / సంగడు లగు వారి వారి సాహస మొప్పన్**
**సంగర ముఖమునఁ జంపక / దొంగిలి కొనిపోవఁ దగునె దొరలకు నెందున్?**

(మొల్ల రా., సుం.కాం., 121వ పద్యము)

అంటూ సీత నోట మొల్ల పలికించిన పద్యాలు సీత దృఢ చిత్రాన్ని, ఔన్నత్యాన్ని పెంచేవిగానే కాకుండా, దొంగతనంగా నన్ను తెచ్చిన రావణునిలాగే మనం కూడా దొంగలు కాకూడదంటూ పలికిన పలుకుల్లో మొల్ల సీత పాత్రను చిత్రించిన విధానం ఆదర్శప్రాయం.

## 8. తేట తెలుగు పదాల తోట:

తెలుగుతో ఏ కొద్ది పరిచయం ఉన్నవారైనా తేలికగా చదువుకునేటంతటి సౌలభ్యంగా మొల్ల రామాయణం ఉంటుంది. అక్కడక్కడ అప్పటి సంస్కృత పండితులకు ధీటుగా కొన్ని పద్యాలను చెప్పినా అధికభాగం తేటైన తెలుగు మాటలనే ప్రయోగించింది మొల్ల.

**జడలు ధరియించి తపసుల చందమునను / దమ్ముఁడును తాను ఘోర దుర్గమ్ములందుఁ**
**గూరగాయలు కూడుగాఁ గుడుచునట్టి / రాముఁ డే రీతి లంకకు రాఁగలండు?**
**ఇంకఁ జేయఁ నేర, రీఁదంగ నోపరు, / కట్టలేరు చుట్టి పట్ట లేరు,**
**జలధి దాఁట లావు చాలదు నరులకు, / వచ్చు త్రోవ చెపుమ వారిజాక్షి?**

(మొల్ల రా., సుం.కాం., 50, 51వ పద్యాలు)

ఇలా మొల్ల చిన్న చిన్న తెలుగు మాటలతో తన రామాయణాన్ని రక్తి కట్టించింది. చిన్న చిన్న తెలుగు మాటలే కాదు చిన్న చిన్న దేశీయ పద్యాలైన ఆటవెలది, తేటగీతుల్లోనే పెద్ద పెద్ద భావాలను పలికించింది. **అలఁతి అలఁతి తునియలఁ గాహల సంధించిన విధంబు** అన్న తిక్కన[4] మాటలను మొల్ల గట్టిగా పట్టుకుందేమో అనిపిస్తుంది. అందుకు మొల్ల రామాయణంలోని ఈ పద్యం తిక్కన భారత పద్యాన్ని తలపింపజేస్తుంది.

**ఎవ్వాని వీటికి నేడు వారాసులు/ పెట్టని కోటలై పెచ్చు పెరుగు**
**నెవ్వాని సేవింతు రింద్రాది దేవత/ లనుచర బలు లయి యనుదినంబు,**
**నెవ్వాని చెఱసాల నే ప్రొద్దు నుందురు /గంధర్వ సుర యక్ష గరుడ కాంత,**
**లెవ్వాని భండార మిరవొంద విలసిల్ల / నవ నిధానంబుల వివిధ భంగి,**
**సకల లోకంబులును మహోత్సవ వృత్తి / నెవ్వరికిc జెల్లుc బుష్పక మ్మెక్కి తిరుగ,**
**నాకె తక్కంగc గలదె యే నాట నైన?/ మద్భుజా శక్తి ప్రతి పోల్ప నాద్భుతంబు.**

(మొల్ల రా., సుం.కాం., 47వ పద్యము)

## 9. ముగింపు:

అలభ్య రామాయణాలు ఉన్నట్లు ఇతర కావ్య అవతారికల వలన, సంకలన గ్రంథాల వలన మరియు లక్షణ గ్రంథాల వలన తెలుస్తుంది. ఇక లభ్య రామాయణాల విషయాలకు వస్తే తెలుగులో తొలి రామాయణమైన రంగనాథ రామాయణం ద్విపద ప్రక్రియలో రాసినప్పటికీ ఏకకవి కృతం కాదు. ఇది తండ్రీ కొడుకులైన గోనబుద్ధారెడ్డి, కాచవిభుడు, విఠల రంగనాథుడు కలిపి రాశారు. తర్వాత లభిస్తున్న నిర్వచనోత్తర రామాయణము పూర్వ రామ కథను చర్చించకుడా ఉత్తర రామ కథను వివరిస్తుంది. భాస్కర రామాయణం ఆరు కాండలతో చంపూ పద్ధతిలో రాసినప్పటికీ నలుగురు కవులు రాయడం జరిగింది. దీనిని బట్టి చూస్తే మొల్ల రామాయణ కాలం వరకు లభిస్తున్న రామాయణాలు రంగనాథ రామాయణం, నిర్వచనోత్తర రామాయణం, భాస్కర రామాయణం. కానీ ఈ రామాయణాలలో రంగనాథ భాస్కర రామాయణాలు బహుకవికృతాలు. నిర్వచనోత్తర రామాయణము ఏకకవి రాసినా ఉత్తర రామ కథను చర్చించింది. దీనిని బట్టి చూస్తే మొల్ల రామాయణ కాలం వరకు చంపూ పద్ధతిలోనూ, వాల్మీకి రామాయణ అనుసరణగా ఆరు కాండలతోనూ ఏక కవి కృతంగానూ కనిపిస్తున్నటువంటి రామాయణం మొల్ల రామాయణమే. అంతేకాకుండా తెలుగులో రామాయణ రచన చేసిన మొట్టమొదటి కవయిత్రి మొల్ల. తన రామాయణాన్ని సంగ్రహంగా రాసినప్పటికీ రామకథను నడపడంలో ఎక్కడా కూడా రామాయణ జిగిని, బిగిని సడలనీయకుండా సార్థకతను సాధించింది మొల్ల. భాషలోనూ, భావ వ్యక్తీకరణలోనూ, పాత్ర చిత్రణలోనూ, సన్నివేశ కల్పనలోనూ, వ్యాకరణ విజ్ఞానంలోనూ, ఛందశాస్త్ర సరణిలోనూ, అలంకార వైచిత్రిలోనూ, కవితా చమత్కృతిలోనూ తెలుగు రామాయణాలలో సుస్థిరమైనది మొల్ల రామాయణం స్థానం.

## 10. పాదసూచికలు:

1. తెలుగు సాహిత్య చరిత్ర, పుట 352.
2. తెలుగు సాహిత్య సమీక్ష, మొదటి సంపుటం, పుట 112.
3. సమగ్ర ఆంధ్ర సాహిత్యం, రెండవ సంపుటం, పుటలు 148,149.
4. నిర్వచనోత్తర రామాయణము, 16వ పద్యపాదము, పుట 10.

## 11. ఉపయుక్తగ్రంథసూచి:


1. ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం. ఒకటి రెండు సంపుటాలు, పునర్ముద్రణ, తెలుగు అకాడమీ, హైదరాబాద్, 2017.
2. ఎఱ్ఱాప్రగడ, హరివంశము. పరిష్కర్త: శివరామశాస్త్రి, వేలూరి. వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి.
3. గోపరాజు, కొఱవి. సింహాసనద్వాత్రింశిక. పరిష్కర్త; శేషశాస్త్రి, గడియారం. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్, 1982.
4. చిన తిరువేంగళనాథుడు, తాళ్ళపాక. అన్నమాచార్యచరిత్రము. రామానుజస్వామి పి.వి. [సంపా.], పరిష్కరణ: ప్రభాకర శాస్త్రి, వేటూరి.తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రాశాల, తిరుపతి, 1949.
5. తిక్కన. నిర్వచనోత్తర రామాయణము. జనహిత వ్యాఖ్యాసహితము, వ్యాఖ్యాతలు: రామకృష్ణమూర్తి తిప్పాభట్ల, శ్రీనివాసులు సూరం, స్వీయ ప్రచురణ, గుంటూరు, 2005.
6. తిమ్మకవి, కూచిమంచి. సర్వలక్షణ సారసంగ్రహం.ప్రకటితం: చలపతిరావు నందిరాజు, స్వకీయ మంజువాణీ ముద్రాక్షరశాల, ఏలూరు, 1927.
7. నాగయ్య, జి. తెలుగు సాహిత్య సమీక్ష. మొదటి సంపుటం, నవ్య పరిశోధక ప్రచరణలు, ఆరవ ప్రచురణ, తిరుపతి, (2009).
8. నిర్మలాదేవి, నిడమర్తి. భారతీయ సాహిత్య నిర్మాతలు మధురాంధ్ర కవయిత్రీమణి మొల్లమాంబ, మోనోగ్రాఫు, సాహిత్య అకాడెమీ, మొదటిముద్రణ, న్యూఢిల్లీ, 2021.
9. మల్లన కవి, చదలవాడ. విప్రనారాయణ చరిత్రము. ప్రకటితం: ఆంధ్ర సాహిత్య పరిషత్తు, రెండవ కూర్పు, శ్రీపతి ముద్రణాలయము, కాకినాడ, 1938.
10. మలయవాసిని, కోలవెన్ను. ఆంధ్ర వాఙ్మయము – రామాయణము. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారిచే డాక్టరేట్పట్టం పొందిన సిద్ధాంత వ్యాస గ్రంథం, స్వీయ ప్రచురణ, మొదటి ముద్రణ, విశాఖపట్టణము, 1989.
11. మొల్ల, ఆతుకూరి. మొల్ల రామాయణము. శ్రీనివాసాచార్యులు, బొమ్మకంటి వారి సరళ పీఠికతో, ఎమ్మెస్కో బుక్స్ ప్రై.లి.,పునర్ ముద్రణ, హైదరాబాద్, 2005.
12. వేదవతి, సి. తెలుగు వైతాళికులు: మొల్ల, నాగ భైరవ కోటేశ్వరరావు, డి. [సంపా.], పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ, చతుర్థ ముద్రణ, హైదరాబాద్, 2006.
13. శ్రీరామమూర్తి, కొర్లపాటి. తెలుగు సాహిత్య చరిత్ర, రెండవ భాగం, రమణశ్రీ ప్రచరణ, ప్రథమ ముద్రణ,విశాఖపట్టణము, 1992.
14. సూరన, పింగళి. రాఘవ పాండవీయము, టీకా తాత్పర్య సహితము, వ్యాఖ్యాత: అనంత పద్మనాభరావు రేవూరి, అక్షయ గ్రాఫిక్స్, మలి ముద్రణ, హైదరాబాద్, 2018.


***




AUCHITHYAM
ISSN: 2583-4797
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_47.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 47. "బులుసు వేంకటేశ్వర్లు" శ్రీ వాసిష్ఠరామాయణం: అధ్యాత్మతత్త్వం

**డా. మోగంటి సుధామయి**

తెలుగు అధ్యాపకురాలు, రీసెర్చ్ గైడ్,
ప్రభుత్వ డిగ్రీ కళాశాల,
సీతానగరం, ఆంధ్రప్రదేశ్.
సెల్: +91 9492149532. Email: msudhamayitelugu@gmail.com

**వ్యాససంగ్రహం:**

*తరతరాల భారతీయ సాహితీ ప్రవాహంలో నిత్యనూతనమైన దివ్య ద్వీపం రామాయణం. దేశ విదేశాల్లో ప్రజలందరి నోట తారక మంత్రమై విలసిల్లుతూ, నేటికీ నాయకత్వ లక్షణాలకు, నైతిక విలువలకు, మూర్తిమత్వ వికాసానికి, మానవీయ విలువలకు చిరునామాగా నిలవడం వెనుక ఆ మహాకావ్యంలోని సంఘటనాత్మక, ధ్వనిపూర్వక పాత్రోచిత సంభాషణలు, ఔచితీమంతమైన పాత్రలే ఆధారభూతాలు ఐతే వాసిష్ఠ రామాయణం మాత్రం మహర్షి వశిష్ఠులకు, శ్రీరామునికి మధ్య జరిగిన సంభాషణ రూపంగా అత్యంత నిగూఢమైన ఆధ్యాత్మిక రహస్యాలను వెల్లడించే పరమ ఉత్కృష్టమైన గ్రంథం. దీనిని రచించింది వాల్మీకే! భారతీయులు ఎంతగానో గౌరవించే భగవద్గీత రాజస వైరగ్యాన్ని పొందిన అర్జునునికి భగవంతుడైన శ్రీకృష్ణుడు చేసే బోధ అయితే, సాత్త్విక వైరగ్యాన్ని పొందిన రామచంద్రునికి, అతని గురువైన బ్రహ్మర్షి వశిష్ఠుడు చేసే తాత్త్విక బోధయే యోగవాశిష్ఠరామాయణం. అంతటి మహత్తరమైన తాత్త్విక బోధనలో ఆధ్యాత్మిక అంశాలను నేను నా వ్యాసంలో విశ్లేషించి తెలపదలచాను.*

**Keywords:** యోగవాశిష్ఠరామాయణం, జ్ఞానవాశిష్ఠరామాయణం, ఆధ్యాత్మతత్త్వం, వశిష్ఠుడు.

## 1. ఉపోద్ఘాతం:

ప్రపంచభాషా సాహిత్యంలో గద్యంకన్నా ముందే పద్యం అభివృద్ధి చెందిందని భాషాశాస్త్రజ్ఞానుల అభిప్రాయం[1]. "**All most all in the written languages, poetry seemes to be earlier than prose**".[2] T. S. ఇలియట్ మాటల్లో "**few things that can happpen to a nation are more important than the invension of a new form of verse**".[3]

శోక నిమిత్తమైన వాల్మీకి వాక్కు అప్రయత్నంగా చంధోమయంగా వెలువడడం దీన్ని రుజువుచేస్తుంది. మానవ సమాజానికి ఒక సక్రమమైన, నియమబద్ధమైన గతిని నిర్దేశించేదే ధర్మం.మానవుని నైతిక, ఆధ్యాత్మిక జీవితాన్ని తీర్చిదిద్ది, మంచి మార్గంలో నడిపించేటట్లు చేసి, చెడు నుండి నిరోధింపజేసేదే ధర్మం.[4] అలాంటి ధర్మాలనన్నిటిని వాశిష్ఠ రామాయణం వివరించింది.[5] భారతీయ సాహిత్య సుందరోద్యా నంలో వికసించిన రెండు ప్రసూనాలు రామాయణ, భారతాలు, అని సునీత్ కుమార్ చటర్జీ అభిప్రాయం. అందులో రామాయణ తుల్యమైనది యోగావాశిష్టరామాయణం. దీనినే జ్ఞానవాశిష్ట రామాయణం, శ్రీవాశిష్టరామాయణము అనే పేరున కూడా పిలుస్తారు.

శ్రీ వాల్మీకి మహర్షి రచించిన సంస్కృత యోగ వాసిష్ఠ కావ్యానికి ప్రస్తుత శ్రీ వాసిష్ఠ రామాయణం అనువాదం శతాధిక గ్రంథకర్త, ఆర్ష కవి శిరోమణి విద్వాన్ బులుసు వేంకటేశ్వర్లు ఈ మహాకావ్యాన్ని తెలుగు చేశారు. ఉత్పత్తి ప్రకరణం అనే మూడవ సంపుటంలో 41 నుండి 122 సంఖ్యలతో అనేక విషయాలిందులో చర్చించబడ్డాయి. శ్రీరాముడు తమ కులగురువైన వశిష్ఠ మహామునిని అనేక ఆధ్యాత్మిక ప్రశ్నలడిగి మన సందేహాలు తీర్చిన అత్యుత్తమ జ్ఞానసాధనమిది. ముముక్షువులకిది దారి దీపం.

## 2. జగత్తు - స్వరూపం :

రాముడు వశిష్ఠునితో **నేను జగత్తు**[7] ఈ రెంటినిగూర్చి అడిగినపుడు వసిష్ఠుడిలా చెప్తాడు. మద్‌దృశ్యం తన్నశ్యం అనే ఉపనిషద్వాక్యాన్ని మన మిక్కడ గుర్తు చేసుకోవాలి. **ఏదైతే మన కంటికి కనబడుతూ ఉందో అది తప్పక నశించిపోతుంది.**[8] పంచభూతాల కంటే వేరైన పరమాత్మ తనలో తానే కల్పించిన జగత్తు తనలోనే లయమవుతుంది. జగత్తు అనేది బుద్ధి వికారాలవల్ల పుట్టింది కనుక ఇది బుద్ధి నుంచి పుట్టిన జీవులలోనే ఉంది. సత్యమైన పరబ్రహ్మలో లేదు. ఈ వృధాభ్రాంతికి సత్తకాని, వాసన గాని లేదు. ఈ జగత్తు స్థిరత, నియతి, ఆవశ్యకత లేనిది ఇది అనంత మాయాకార్యం అని చెప్పాడు.

## 3. మనసు-మాయాజాలం :

ఎవరికేవిధంగా ఎలాంటి జ్ఞానం కలుగుతుందో వారికప్పుడావిధంగా అలాంటి అనుభవాలే కలుగుతాయి. విషాన్ని అమృతంగా విడవకుండా భావిస్తే అది అమృతమే అవుతుంది. మన మనస్సులో నిరంతరం మిత్రభావముంటే శత్రువు కూడా మిత్రుడవుతాడు. విచారంగా ఉంటే ఒక్క నిమిషం కొన్ని యుగాలుగాను, సంతోషంగా ఉంటే యుగాలు కూడా నిమిషాల్లాగా గడిచిపోతాయి. మనసును మధురభావనతో నింపుకుంటే చేదు పదార్థాలు కూడా తినదగినవే అవుతాయి. ఈ లోకం కేవలం భావనామయం. నౌకలో ఉన్నవారికి తీరం, తీరంలో

ఉన్నవారికి నౌక వెళ్తునట్లు కన్పిస్తాయి. ఏదో ఎలా గట్టిగా భావిస్తామో అది అలాగే అవుతుంది. ఆకాశం లాగా జగత్తు శూన్యం కాని మనస్సు స్పందించడం వల్ల ఆత్మలో విశ్వరూపాన్ని పొందుతూ ఉంది. బంగారంలో ద్రవత్వం ఉన్నట్లు సూక్ష్మ పరమ చైతన్యంలో జగత్తు ఇమిడి ఉంది. అవయవాలు మానవుడు వేరు కానట్లు జగత్తు బ్రహ్మము కంటే వేరుగాదు. జీవాత్మ పరమాత్మ నుండి వేరుగాదు. సత్యమైన జ్ఞానమే నిత్యం పళ్ళు పూలతో కూడిన చెట్టులా నానాకారాలతో కన్పించే బ్రహ్మ మొక్కటే. అది అనంతశక్తి సంపన్నం. నేను, నీవు లాంటి మనో వికారాలతో కూడిన జగత్తు ఉన్నట్లు కన్పిస్తుంది గాని నిజానికిది లేనే లేదు.

బంగారం నుండి నగలు, సముద్రం నుండి అలలు వేరు కానట్లే జగత్తు బ్రహ్మము నుండి వేరు కాదు. బ్రహ్మమే జగత్తులా కనిపిస్తుంది గాని జగత్తు బ్రహ్మములో లేదు. వాయువు కదులుతున్నప్పుడు ఉందని, కదలనప్పుడు లేదని అన్పిస్తున్నట్లే అజ్ఞానమున్నంతవరకు జగత్తు ఉంది. ఎప్పుడైతే అజ్ఞానం నశిస్తుందో అప్పుడే జగత్తు మిథ్య అని తెలుస్తుంది. విత్తనంలో ఉన్న మొలక పైకి వచ్చినట్లు, బ్రహ్మం కూడా భ్రాంతితో జీవరూపం గ్రహించి సృష్టిగతికి దోహదపడుతుంది. వాసన, చిత్తం జీవం మొదలగునవి జీవుని వేదనవల్ల పుడుతున్నాయి. జ్ఞానం వల్ల దృఢమైన అభ్యాసం వల్ల, పురుషప్రయత్నం వల్ల మనస్సును నాశనం చేస్తే ఇక జన్మ ఉండదు. భోగాలపట్ల జీవునికి విముఖత కల్గితే అతనికి ఉత్తమగతులు వస్తాయి. అద్వితీయమైన చైతన్య స్వరూపం నుండి జీవచైతన్యం పుడుతుంది. అది అహంకారం వల్ల జగత్తుగా మారుతుందని వశిష్ఠుడు వివరించాడు.

## 4. దైవశబ్దం- నిర్వచనం :

రాముడు ఇంకొక ప్రశ్న వేశాడు పరమాత్మ జ్ఞానాన్ని పొందిన వారి శరీరాలెలా నిలుస్తాయి? దైవం వారినెలా కాపాడుతుంది అని దానికి వశిష్ఠుడు బదులిస్తూ రామా! చిచ్ఛక్తి అనే ఒక మహానియతిశక్తి ఉంది. సృష్ట్యాదిలో ఈ శక్తి వల్ల "**ఇది అగ్ని అనే జ్ఞానం బ్రహ్మం సంకల్పంలో కలిగి అది అగ్నిగా మారుతుంది. ఈ మహానియతినే మహాచిత్తు, మహాశక్తి, మహాదృష్టి, మహాక్రియ, మహాస్పందం అనే పేర్లతో పిలుస్తారు**"[9] . ఈ పరమనియతినే దైవమంటారు.

## 5. పురుష ప్రయత్నం :

పురుషుడు ఏ పని చేయకుండా ఉంటే ఇలా జరగాలి అన్న బుద్ధి, దాని ననుసరించి కర్మ, తద్వారా కొన్ని పరిణామాలు జరగవు కనుక జరిగేవన్నీ నియతి వల్లే జరుగుతున్నాయి. నియతి పురుష ప్రయత్నంతో కర్మ ఫలాలను అందిస్తోంది. పురుష ప్రయత్నంతో పని లేకుండా దైవ సంకల్పంతో జరిగేది నియతి. కనుక శాస్త్రోక్తమైన పురుష ప్రయత్నం వల్ల పూర్ణసిద్ధి కలుగుతుంది. అంటే ప్రయత్నరూపమైన నియతి బ్రహ్మంగా విరాజిల్లుతుంది. ఇలాంటి

బ్రహ్మతత్వమే కొన్ని చోట్ల శాంతంగా, కొన్నిచోట్ల జడంగా, కొన్నిచోట్ల రాగద్వేషాలతో విధంగా ఉంది. సముద్రం నుండి అలలు, బంగారు నుండి ఆభరణాలు పుట్టినట్లు ఒకే బ్రహ్మం నుండి సమస్త జగత్తు పుడుతుంది.

## 6. జీవుని పుట్టుక :

రాముడు వశిష్ఠుని మళ్ళీ అడిగాడు "**ఐతే స్వయం ప్రకాశమైన బ్రహ్మం నుండి అతనికంటే వేరైన జీవుడెలా పుడుతున్నాడు? అని వశిష్ఠుడు చెబుతున్నాడు**"[10] రామా! బ్రహ్మం రెండు విధాలుగా ఉంది. మొదటిది అంతా వ్యాపించియున్న శాంతమైన పరమాత్మ తత్త్వం, రెండవది ప్రాణంలోనున్న శరీరం దాల్చిన జీవుడనే తత్త్వం. నిర్మలమైన బ్రహ్మంలో ప్రాణ స్పందన వల్ల స్ఫురించే అహంభావమే జీవుడు. చిద్రుపమైన ఆత్మ తత్త్వంలో స్వయంభావననే జీవుడంటారు. ఎండు కట్టెలు వేసిన కొలది అగ్ని ప్రజ్వరిల్లునట్లు బ్రహ్మం యొక్క జీవత్వం వాసనాబలంతో నేను అనే భావనగా పరిణమించి, సంకల్పాన్ని పొంది జీవుడు, మనస్సు, మాయ, ప్రకృతి, చేతనం అనే పేర్లతో పిలువబడుతూ ఉంది. సృష్టికి పూర్వమే సంకల్పం నుండి జనించిన జీవ దేహమే బ్రహ్మగా మారి జగత్తును సృష్టిస్తూ ఉంది. ఆ బ్రహ్మ ఏది సంకల్పిస్తాడో అది ప్రాణులుగా మారుతోంది. విత్తనంలోన అంకురమే పత్ర పుష్ప ఫలాదులుగా మారినట్లు, పరబ్రహ్మంలోని సంకల్పం రూపంలోని జీవులు ప్రాణం పోసుకొంటున్నారు. చిత్ స్పందనమే కర్మ. జన్మ జరామరణకారకులైన వారి స్వీయ కర్మల వల్లనే జీవులు దేహాన్ని పొందుతున్నారు. ఈ కర్మలు చిత్తాన్ని బంధించి తిరిగి చెట్టు నుండి పూలు పూసినట్లు జగత్తులు మళ్ళీ మళ్ళీ పడుతున్నాయి.

## 7. జీవ విచారం:

పరబ్రహ్మం నుండి మనసు పుట్టింది. ఇది తరంగ చంచలం. ఇదే అన్ని భేదాలకు హేతువు. ఆత్మజ్ఞానాన్ని పొందితే ఒక్క బ్రహ్మమే నిత్యమని గ్రహిస్తే ఈ జీవుడు, మాయ, కర్మ, కర్మ జగత్తు అనే భేదాలన్నీ నశిస్తాయి. అజ్ఞానంతో ఉన్న మనసులేని జగత్తునే నిజమనుకొంటుంది. పరబ్రహ్మం యొక్క సంకల్పం వల్ల చిత్తం, దానినుండి జీవత్వం, అహంభావం, పంచ తన్మాత్రలు, ఇంద్రియాలు, దేహాలు, శోక మోహాలు, నరకాలు, బాధమోక్షాలు, విత్తనం నుండి అంకురాల్లాగా పుడుతూనే ఉంటాయి. చిదాత్మ బ్రహ్మం, జీవుడు ఒక్కటే. కర్మసముదాయమైన చిత్తమే అహంకారయుతడైన జీవుడు. జీవుడే బ్రహ్మం అని వశిష్ఠుడు స్పష్టం చేశాడు.

## 8. పరమయోగం :

వశిష్ఠుడు ఇంకా ఇలా అన్నాడు రామా! ఒక దీపం ఎన్నో దీపాలను వెలిగించినట్లు బ్రహ్మ సంకల్పం వల్ల జీవుడుదయిస్తున్నాడు. ఈ లోకం నిజం అని భావించేవారికే జననమరణాలు బాల్యయౌవన వార్ధక్యాలు స్వర్గనరకాదులు కలుగుతాయి. కల్లు తాగిన వానికి భ్రమ కలిగినట్లు, భ్రమించిన జీవునికి ఈ లోకం

నిజమనిపిస్తుంది. అభ్యాసయోగం వల్ల చిత్తం, దానితోపాటు దృశ్యం కూడ నశించి జీవి ముక్తుడగుతాడు. సంసారమనే మహా వ్యాధికి బ్రహ్మమే తగిన మందు, సర్వవాసనలను వదులుకుంటే ముక్తి లభిస్తుంది. తాడును తాడుగానే తెలుసుకుంటే పాముభయం పోయినట్లు విషయ వాసనలను వదులుకుంటేనే బ్రహ్మపదం చేరుకుంటారు. కొందరు ఇష్టమైన వస్తువులను తలుచుకుంటూ మరణసమయంలో విషయవాసనల్లో కూరుకుపోయి ముక్తిని కూడా పదులుకొని మళ్ళీ ఈ మాయా ప్రపంచంలో పడతారు. కనుక విషయముల పట్ల విరక్తి కల్గి నిర్వికార చిత్తుడవైతేనే ముక్తిని పొందుతావని[11] పలికాడు.

## 9. సత్యోపదేశం :

శ్రీరాముడు వశిష్ఠుని అడుగుతున్నాడు. దేవా! జీవునకు పరమాత్మ సంబంధమెలాంటిది? అని దానికి వశిష్ఠుడు సమాధానమిస్తూ "**రామా! అనంతమైన పరబ్రహ్మ తత్వమే జీవాత్మగా పరిణమిస్తూ ఉంది. చిచ్ఛక్తి తనంతతానే రెండుగా మారి జననమరణాదులనందుతోంది. రాముడు అడుగుతున్నాడు దేవా! చిచ్ఛక్తి స్వయం సంకల్పంతో జనన మరణాదులను పొందితే మరి దైవమంటే ఏమిటీ, కర్మ, కారణాలేవి అనడానికి వశిష్ఠుడు బదులిస్తూ చైతన్యమే రజోమయమై సృష్టిగా పరిణమిస్తుంది. అజ్ఞానంతో చైతన్యం తన తత్వాన్ని మరచి చిత్తమునుకొనుటే చిత్పందం అదే జగత్తు, చిత్స్పందం యొక్క వేర్వేరు భావాలే జీవుడు, అతని కర్మలు, చిత్స్పందనం అంటే ప్రాణుల్లో ఉన్న చైతన్యమే అజ్ఞానం వల్ల నానా రూపాల్లో, నానా జన్మలు ధరించి, నరకాన్ని గాని, ముక్తిని గాని పొందుతూ ఉంది. అనంతమైన చితవస్తువొకటే ఐనా నేను జన్మించాను. నేను మరణించాను అనే భ్రమల్లో పడి మిధ్యలైన జనన మరణాలను పొందుతూ ఉంది. కనుక రామా! సర్వం మనో మాత్రం. అజ్ఞానం వల్ల చిత్తం జగత్తు ఉందనే భ్రమను పొందతూ ఉంది. బ్రహ్మంలోని మాయ విజృంభమే జీవం, మనసు, బుద్ధి, చిత్తం, జీవుడు, అహంకారం, మాయ అన్న చిత్తుకు మారు పేర్లు. ఈ చిత్తే లేని లోకాన్ని ఉన్నట్లుగా భ్రమింపచేస్తూ ఉంది. ఆత్మ ఇంద్రియాలతో కూడి ఉంటే జాగ్రదావస్థ అంటారు. అహంకారంతో కంఠ, హృదయ మధ్యంలో ఉంటే స్వప్నం అంటారు. వాసనాయుతమై హృదయంలో ఉంటే సుషుప్తి అవస్థ అంటారు. ఈ మూడింటిని దాటి చిత్ స్వరూపంలో ఉంటే తురీయావస్థ అంటారు**."[12] చిత్తం తురీయావస్థలో ఉంటే సకల దుఃఖాలు పరమశాంతిని పొంది బ్రహ్మలో లీనమవుతుంది. ఇక దానికి జన్మ కలగదు. విత్తనం నుండి మొలక, పూలు, పళ్ళు కలుగునట్లు చిత్తమునుండి జీవులు, మనసు పుడుతూ ఉన్నారు.

## 10. జగద్వవర్ణనం :

వశిష్ఠుడు రామునితో మనోవైఖరులను గూర్చి ఇలా చెప్పాడు. ఈ జగత్తు కర్త మనస్సు, మనసే పరమ పురుషుడు. జీవుని దేహధారణ మనోభావమే. దేహభావన లేనిచో దేహధర్మములగు జనన మరణాదులు లేనేలేవు. నేనే శరీరం అనుకొనేవానికే సుఖదుఃఖాదులు కల్గుతాయి. నేనే బ్రహ్మమును అనుకొనేవానికి ఏమీ ఉండవు. ఈ జగత్తు యొక్క వివిధ భ్రమలకు మనస్సే హేతువు, మనసునకు దేహం కారణం కాదు. దేహానికి మనసే కారణం. జీవునకు మొదటి శరీరము మనసు అదే భోగానుభవ హేతువు. ప్రపంచంలో ప్రాణుల దేహాలన్నీ మనసు వల్లే కలిగాయి. మనసులో కలిగిన నేను అనే అభిమానమే జీవులకు వివిధ శరీరాలేర్పడడానికి కారణమవుతుంది"[13].

ఒక శరీరం నశిస్తే మనస్సు అనేక శరీరాలను పొందుతూ ఉంటుంది. కాని మనసు నశిస్తే ఇక దేహం కలగదు. కనుక బ్రహ్మమునందే చిత్తాన్ని లగ్నం చేసి లోక వాసనలను తలచక, తిరిగి దేహాన్ని పొందకు ముక్తిని పొందాలి.

జీవుడంటే సూక్ష్మ వాసనాయుతమైన చిత్తం. అది స్థూల భ్రాంతిచేత దేహంగా పరిణమిస్తుంది. సత్యానికి జీవుడే బ్రహ్మం. బ్రహ్మానికి స్థూల సూక్ష్మ కారణ శరీరాలు లేనేలేవు. నిర్మల చిత్తమే పరమాత్మ, భావనచే అది జీవుడు; చిత్తముగా మారి దేహాన్ని ధరిస్తూ ఉంది. సంకల్పం లోంచి పుట్టే మనస్సు జడంగా ఉంటూ, బ్రహ్మస్థితికి, వచ్చేసరికి అజడంగా మారుతుంది. మన కళ్ళకు కన్పించే దంతా సత్యంగా అన్పిస్తుంది. కాని బ్రహ్మానుభవ కాలంలో ఇది అసత్యం. చైతన్యం పరిపూర్ణ సముద్రం. చేతనత్వమే అహంకార రూపాన్ని పొంది మనసుగా పరిణమించి తనకు నచ్చిన దేహాన్ని పొందుతూ ఉంది. దేహాదులు అసత్యాలు వాటిని గురించిన విచారణ శుద్ధ దండుగ అని వశిష్ఠుడన్నాడు.

## 11. మనోమాహాత్మ్యం :

వశిష్ఠుడు బ్రహ్మదేవుని ఇలా ప్రశ్నించాడు. నువ్వు శాప మంత్రాదులు చాలా గొప్పవన్నావు. కదా! మరి అవి దేహాన్ని మాత్రమే నాశనం చేసి మనస్సును మాత్రం ఏమీ చేయలేకపోతున్నాయి గదా? అంటే దానికి బదులిస్తూ బ్రహ్మ ఇలా అన్నాడు. పౌరుషం చేత, శుభకర్మచేత జీవులకు ఈ లోకంలో పొందలేనివి ఏమీ లేవు. సర్వ ప్రాణులకు రెండు శరీరాలుంటాయి. ఒకటి మనస్సు ఇది స్థిరం. నశించదు. రెండవది పాంచభౌతికదేహం. ఇది శాపాదులచేత, రోగాలచేత, కాలక్రమేణ నశిస్తుంది. కాని పురుష ప్రయత్నం వల్ల ధైర్యంగా ఉండడం. వల్ల శాశ్వతమైన బ్రహ్మపదం లభిస్తుంది. "**మనస్సు చేసే ప్రయత్నాన్ని బట్టే ఫలముంటుంది. శరీరం, పరమాత్మను ధ్యానం చేస్తున్నంత సేపు రాతిని బాణం ఏమీ చేయలేనట్లుగా శాపాదులు ఏమీ చేయలేవు. తీవ్రమైన పురుష ప్రయత్నం వల్ల దేహం ఫలాన్ని పొందుతుంది. పురుషయత్నమంటే మనస్సు చేసే ప్రయత్నం కుమ్మరి కుండ చేసిన తర్వాత కుండ మట్టిస్థితిని విడిచినట్లు పరబ్రహ్మను మనసులో ధ్యానించడం వల్ల మనసు తన విషయవాసనలను విడిచిపెడుతుంది**"[14] అని చెప్పాడు.

## 12. మనో సంజ్ఞలు :

శ్రీరాముడు మనస్సు దాని స్వభావాన్ని చెప్పమని అడుగగా వశిష్ఠుడు ఇలా చెప్పాడు, పరబ్రహ్మం సంకల్పాత్మకంగా సృష్టించిన తొలిరూపమే మనస్సు. ఎవరైనా ఎక్కడైనా రూపంలో తానున్నట్లు సంకల్పించు-కుంటారో దాని ఫలితంగా వారు ఆ రూపాన్ని పొందుతారు. కర్మ బీజం, మనస్సు అనుసరించునది, పనులు కొమ్మలు, వాసన చెట్టు, తద్వారా వచ్చిన క్రియాఫలాలే పండ్లు, మనస్సు దేనిని ఆలోచిస్తుందో దానినే కర్మేంద్రియాలు సమకూరుస్తాయి. మనసు, బుద్ధి, అహంకారం, ప్రకృతి, మాయ,క్రియ, ఇవన్నీ తన రూపాన్ని మరచిన మనసుకు పర్యాయపదాలు.[15]

## 13. జీవుల ఉత్పత్తి వికాసం :

మానవులు 3 విధాలు మొదటివారు ఉత్తములు, ఇదే మొదలు 16 అని పూర్వపుణ్యాన్ని అనుసరించి ఈ జన్మలోనే శమదమాదులతో ముక్తికోసం ప్రయత్నించేవారు. రెండవవారు మధ్యములు వీరు మంచివారు కానీ సంసార వాసనతో వేలజన్మలైనా ముక్తి పొందలేరు. మూడవవారు అధములు కోటి జన్మలకు కూడా వారికి ముక్తి లభించదు. నిండు జాబిల్లి నుండి పండు వెన్నెల వచ్చినట్లు సమస్త జీవులు బ్రహ్మము నుండి పుట్టి చివరకు అందే లయమవుతున్నాయి.

## 14. ముగింపు:

వశిష్ఠునికి రామునికి జరిగిన సంభాషణ రూపంగా ఈ జగత్తు పరబ్రహ్మంలోని చైతన్యాన్ని తీసుకొని జీవునిగా పుట్టి వివిధ ఇంద్రియభ్రమల వల్ల వివిధ జన్మలు పొంది చివరకు బ్రహ్మం లోనే లీనమవుతుందని తెలుస్తుంది. **మనసు ఏది సంకల్పిస్తే అది కర్మరూపంలో ప్రయోజనాన్ని అందిస్తుందని** ది మిస్టరీ 17 నవలారచయిత్రి రోండా బైర్నీ చెప్పిన మాటలు అక్షర సత్యాలని తెలుస్తుంది. ఈ సందర్భంలో మన భారతీయ దేవతామూర్తులను పూజించే క్రమంలోని రహస్యం మనకు అర్థమవుతుంది. పృధ్వీ తత్వానికి అధిపతి గణపతి, శుద్ధ పరబ్రహ్మం శివుడు, అతనికి శక్తినిస్తూ సృష్టిని నియమించే పరాశక్తి జగన్మాత, షటకాలు, భగవద్గీతలోని కర్మయోగం ఇవన్నీ పై విషయాలను బలపరుస్తూ అర్ధనారీశ్వరతత్త్వమే సృష్టికి మూలమని, సంకల్పానికి అసాధ్యమైనదేదీ లేదని, మన మానసిక శక్తితో మన జన్మలను కూడా మనం ఎంచుకోవచ్చని తార్కికంగా నిరూపితమవుతుంది. "**లలితా సహస్రనామంలోని**" 18 మిథ్యా జగదధిష్ఠానా అనే మాటను పరిశీలిస్తే అసత్యమైన లోకానికి అది దేవతయైన నియతిశక్తి ఉందని అఖడంతోనే సాధ్యమవుతుందని, అది సవ్యమార్గంలోను, అపసవ్య మార్గంలోను ఉడగలదని, దాని ప్రభావం నుంచి ఎవ్వరు తప్పించుకోలేరని కేవలం జ్ఞానమార్గం ద్వారానే ఆ శక్తిని అర్థం చేసుకోగలమని అది ఇచ్ఛాశక్తిగా, జ్ఞానశక్తిగా, క్రియాశక్తిగా మనస్సుచేత కర్మలు చేయిస్తుందని స్పష్టమవుతుంది. ఈ విషయాన్నే వశిష్ఠుడు రామునితో ప్రస్తావించడం జరిగింది.

## 15. పాదసూచికలు:

1. తెలుగు సాహిత్యచరిత్ర పుట 4
2. The commonness in the metre of dravidian languages -pg 6
3. దాక్షిణాత్యసాహిత్య సమీక్ష పుట 5
4. తెలుగులో ఛందోరీతులు -పుట 2
5. శ్రీమద్రామాయణ. పుట 26
6. తులసీ రామాయణం -పుట 8

7. శ్రీ వాసిష్టరామాయణం, పుట 77
8. శ్రీ వాసిష్టరామాయణం, పుట 78
9. శ్రీ వాసిష్టరామాయణం, పుట 82
10. శ్రీ వాసిష్టరామాయణం, పుట 88
11. శ్రీ వాసిష్టరామాయణం, పుట 90
12. శ్రీ వాసిష్టరామాయణం, పుట 93
13. శ్రీ వాసిష్టరామాయణం, పుట 98
14. శ్రీ వాసిష్టరామాయణం, పుట 173
15. శ్రీ వాసిష్టరామాయణం, పుట 174
16. శ్రీ వాసిష్టరామాయణం, పుట 178
17. ది సీక్రేట్ - నవలారచయిత్రి రోండా బైర్నీ
18. లలితా సహస్రనామాలు - వాగ్దేవతలు

## 16. ఉపయుక్తగ్రంథసూచి:


1. కృష్ణమాచార్య, ఎం,తులసీ రామాయణం, ఠాగూర్ పబ్లిషింగ్ హౌస్, కాచిగూడ చౌరస్తా, హైదరాబాద్, 1999.
2. జ్యోతిర్మయి, కావూరి. పాపయ్యశాస్త్రి రచనలు-పరిశీలన, యోగ్యత, అంతర్రాష్ట్రీయత్రైమాసికశోధ్-పత్రిక vol-6-2019-పుట 26.
3. నాగయ్య. జి, దాక్షిణాత్యసాహిత్య సమీక్ష, నవ్య పరిశోధక ప్రచురణలు, హైదరాబాద్, 1976.
4. వెంకటేశ్వర్లు బులుసు, శ్రీ వాశిష్ఠ రామాయణం, తెలుగు వచనం, మూడవ సంపుటి, శ్రీ గాయత్రి పవర్ ప్రెస్, కాకినాడ 1987 .
5. శాస్త్రి, ద్వానా, తెలుగు సాహిత్యచరిత్ర, ప్రగతి పబ్లిషర్స్, హైదరాబాద్, 2013.
6. శ్రీనివాస్, పురాణపండ, శ్రీలలితా విష్ణు సహస్ర నామములు, మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి, 1990.
7. సీతాపతి, గిడుగు, తెలుగులో ఛందోరీతులు, విశాల పబ్లికేషన్స్, హైదరాబాద్, 1961.
8. Rhonda byrne, The secreat, Atria books beyond words publishing, 2006.


***


AUCHITHYAM
ISSN: 2583-4797
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_48.php

## "కమనీయం తెలుగు రామాయణం"

### జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్దిపేట, సిద్దిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 48. ఆధునికకాలంలో రామయణసంబంధరచనలు: భిన్నదృక్పథాలు

**రాగుల నర్సింలు**

తెలుగు ఉపన్యాసకులు,

ప్రభుత్వ డిగ్రీ మరియు పీజీ కళాశాల స్వయంప్రతిపత్తి ,

సిద్దిపేట, తెలంగాణ.

సెల్: +91 9704986803. Email: narsimluragula03@gmail.com

**వ్యాససంగ్రహం:**

*భారతదేశంలో రామాయణ భారతాలు ఇతిహాసాలుగా వెలగొందుతున్నాయి. రామాయణములో శ్రీరామచంద్రుడు మర్యాద పురుషోత్తమునిగా, మూర్తిభవించిన ధర్మ స్వరూపంగా దర్శనమిస్తారు. ఆయన నడవడిని ఆదర్శంగా తీసుకొని మానవులందరూ ఆ బాటలో నడవవలసి ఉంది. అట్లే రావణాదుల పాత్రల నుండి దుర్గుణాలను త్యజించాలనేటువంటి నీతిని తెలుసుకోవలసి ఉంది. ఇలా రామాయణ సంబంధమైన ఒక్కొక్క పాత్ర ఒక్కొక్క నీతిని మనకు బోధిస్తుంది. అనాదిగా రామాయణము అనేక భాషల్లోకి నేటికీ అనువాదం అవుతూనే ఉంది. ఆ క్రమంలోనే ఆధునిక కాలంలో కొందరు రామాయణలను అనుసృజన చేస్తూ, అధునాతనమైన భావాలను అలవరచుకుని, వినూత్నమైన దృక్పథాలతో రామాయణలకు నూతన భాష్యం చెబుతున్నారు. నేను నా వ్యాసంలో భాగంగా ఆధునిక కాలంలో భిన్న దృక్పథాలను ఆలంబనగా చేసుకుని తెలుగులో వెలువడిన రామాయణ సంబంధ రచనలను ఈ వ్యాసంలో పరిచయం చేయదలచాను. ఇట్టి వ్యాసరచనకు వాల్మీకి రామాయణాన్ని ప్రధాన వనరుగా స్వీకరించి, ఆధునిక కాలంలో వెలువడిన రామాయణ సంబంధ రచనలను గౌణ వనరులుగా స్వీకరించి తలనాత్మక పద్ధతిని అనుసరించి విశ్లేషణాత్మకంగా వ్యాసాన్ని రాయదలిచాను. ఈ విధంగా భిన్న దృక్పథాలలో రామాయణాన్ని ఆవిష్కరించడం వల్ల కలిగే ఇక్కట్లను గురించి కూడా ఈ వ్యాసంలో గమనించవచ్చు.*

**Keywords:** రామాయణ విషవృక్షం, విముక్త, రామాయణ రహస్యాలు, సీతజోస్యం, వ్యవస్థను కాపాడిన రాముడు

## 1. ఉపోద్ఘాతం:

ప్రాచీన కవులు తమ పాండిత్యం ఉట్టిపడేలా, సృజనాత్మకంగా రామయణంలో  కొన్ని మార్పులు చేర్పులు చేసి వివిధ ప్రక్రియలలో రామాయణలను వెలువరించారు. ఇక ఆధునిక కాలంలో పాశ్చాత్య ప్రభావం చేత నూతన

ప్రక్రియలు భారతీయ సాహిత్యములో చేరాయి. ఇందులో భాగంగానే తెలుగునాట కూడా వివిధ నూతన సాహిత్య ప్రక్రియలు, అధునాతన భావజాలాలు ప్రవేశించాయి. అట్టి అధునాతన భావజాలాలను పునికిపుచ్చుకున్న కవులు, రచయితలు, పరిశోధకులు, విమర్శకులు తమ భావజాలానికి అనుగుణంగా, సమకాలీన పరిస్థితులకు అద్దం పట్టే విధంగా రామాయణలను మార్చి, హేతు వాదం, నాస్తిక వాదం, దళిత వాదం, స్త్రీ వాదం, మానవతావాదం, చారిత్రక దృక్పథం, మార్క్సిస్ట్ దృక్పథం, మనస్తత్వ విశ్లేషణ, అనే అధునాతన భావజాలాలతో రామాయణాన్ని దర్శించి తమ రచనలను వెలువరించారు. అట్టి రచనల వలన ఇతిహాస గౌరవము దెబ్బతినడమే గాక ఆ మార్పులే వాస్తవములనుకునే దుర్గతిపట్టినది. ఇతిహాస పాత్రల ఔన్నత్యము దెబ్బతిన్నది. అట్టి రచనలను పరిశీలిద్దాం.

## 2. భిన్నదృక్పథాలతో వచ్చిన రామాయణ సంబంధరచనల నేపథ్యం:

ఇతిహాసమునకు ఇతిహ ఆస్తినే అస్తేతి ఇతిహాసః అనే వ్యుత్పత్తి కలదు. దీనిని అనుసరించి ఇతిహాసము అనగా పూర్వమిట్లు జరిగినదని పరంపరాగతంగా చెప్పబడినదని అర్థము. భారతీయ సాహిత్యమున ఇతిహాసములుగా రామాయణ భారతాలు విరాజిల్లుతున్నాయి. రామాయణము ప్రథమేతిహాసం. దీనిని వాల్మీకి రచించారు. ఇందులో సూర్యవంశజుల చరిత్ర చెప్పబడింది. ప్రత్యేకించి ఇది శ్రీరామచంద్రుని ప్రాశస్త్యాన్ని, గాథను తెలుపునది కావున రామాయణమనే సార్థకనామధేయముతో జగత్ప్రసిద్ధమైనది. ఇతిహాసములు ఉపదేశ ప్రధానములు. పైగా యథార్థముగా జరిగిన గాథలు. మానవుని సదాచారునిగా, ధార్మికునిగా తీర్చిదిద్ది మనిషిని మనీషి గా చేయగలిగిన ఉత్తమ గ్రంథములు. వివిధ శాస్త్రములకు ఆలవాలములు. మోక్ష ప్రదములు. ఇందులో గల ఒక్కోపాత్ర ఒక్కోపాఠాన్ని నేర్పిస్తుంది. ఒక్కో సంఘటన మానవ జీవితాన్ని ప్రతిబింబిస్తూ విలువైన సందేశాలనిస్తుంది. కానీ ఆధునిక యుగంలో పాశ్చాత్య ప్రభావము చేత, సంస్కరణోద్యమ ప్రభావము చేత విభిన్నరకములైనటువంటి ధోరణులు సాహిత్యమును కూడా ప్రవేశించాయి. అట్టి ధోరణులను ఆలంబనగా చేసుకుని ఎందరో కవులు, రచయితలు, నాటకకర్తలు, పరిశోధకులు, విమర్శకులు రామయణంలోని కొన్ని పాత్రలను ఘట్టాలను మార్చి రచించడం జరిగింది. అట్టి భిన్న దృక్పథాలతో వచ్చిన రామాయణ సంబంధ రచనలను పరిశీలిద్దాం.

### 2.1 రామాయణ రహస్యాలు (1968):

త్రిపురనేని రామస్వామిచౌదరిసాంగత్యంలో హేతువాదభావజాలాన్ని అలవరచుకున్న కొత్త సత్యనారాయణ చౌదరి వివిధరామాయణాలలో ఉన్న వైవిధ్యాన్ని ఆలంబనగా చేసుకుని ఈ గ్రంథాన్ని వెలువరించారు. రామాయణ ప్రక్షిప్తాలను గమనించి మూలరామాయణంలోని శ్లోకాలకు కొత్త అర్థాలను చెబుతూ రామరాజ్యాన్ని, రామాయణపాత్రలను విమర్శిస్తూ అందులో లోటుపాట్లున్నవని చూపుతూ ఈ సమీక్షా గ్రంథాన్ని రచించారు.

## 2.2. రామాయణ విషవృక్షం (1974) :

మార్క్సిస్ట్ భావజాలంతో రామాయణాన్ని వినూత్న కోణంలో ఆవిష్కరించిన వారు రంగనాయకమ్మ గారు. అట్టి కోవకు చెందినదే రామాయణ విషవృక్షం. రామాయణము భూస్వామ్య విధానాలకు పెద్దపీట వేసిందనే అభిప్రాయాన్ని వెలిబుచ్చుతూ ఫ్యూడలిస్టు భావజాలాన్ని, అణగారిన వర్గాల వారికి జరుగుతున్న అన్యాయాలను రామాయణ పాత్రలకు ఆపాదించారు. మార్క్సిస్ట్ దృక్పథంలో ఈ రచన గొప్పదైనను రామాయణముపై విషము చిమ్మినదనుటలో సంశయము లేదు.

## 2.3 సీత జోస్యం (1979) :

రామాయణ భారతాల ముఖ్య ధ్యేయము వర్ణధర్మ పరిరక్షణ, రాచరిక వ్యవస్థ రక్షణ మాత్రమేనని విశ్వసించే నార్ల వెంకటేశ్వరరావు రామాయణలన్నీ కల్పితగాథలేనని, చారిత్రక ప్రాధాన్యం లేనివని హేతుబద్ధమైన వివరణలతో రచనలు చేసిన వారు నార్ల వెంకటేశ్వరరావు గారు. వీరి రచనల్లో పేరెన్నిక గలది సీత జోస్యం. ఈ గ్రంథ పూర్వభాగములో పీఠిక, ఉత్తర భాగములో నాటకములు గలవు. ఇందున రామాయణ గాథ చారిత్రకత, రాముడు వనవాసం చేసిన ప్రాంతము, రాక్షసులు ప్రస్తావన - వారి స్థితిగతులు, ఋషులు ప్రసక్తి - వారు యజ్ఞయాగాది క్రతువులు చేయడానికి జనస్థానాన్ని ఎన్నుకోవడానికి కారణం, రామాయణ కాలమున ఎవరి ఆయుధములెట్టివనే ప్రధానమైన ప్రశ్నలను లేవదీస్తూ రామాయణంలోని పాత్రలను విమర్శించే ప్రయత్నంచేసారు ఇందులో భాగంగా దశరథునికి భార్యలెందరు? శ్రీరామచంద్రుడు ఏకపత్నీవ్రతుడేన? లక్ష్మణుడు వివాహితుడా, అవివాహితుడా? సీతాపహరణం ఏ పరిస్థితుల్లో జరిగింది, లంకా దహన వృత్తాంతం విశ్వసించదగినదా ? రామాయణకాలీన సాంఘికాచారములేమిటి ? నాటి కాలములో ఆహార నియమాలేమిటి ? సీతారామ లక్ష్మణులు మధ్యమాంసములు ముట్టనివారా? అని ప్రశ్నిస్తూ సంస్కృత రామాయణము నుండే వాటికి సమాధానాలను రాబడుతూ ఈ గ్రంథాన్ని కూర్చారు. ఈ ప్రశ్నలన్నీ సామాన్య పాఠకుల మదిలో మెదులునవే కావున ఈ గ్రంథము పాఠకులలో మిక్కిలి పఠనాభిలాషను కలిగించి జనాదరణను చూరగొన్నది. కానీ నార్లవారు ఆ ప్రశ్నలకు సహేతుకమైన వివరణలివ్వక నాస్తిక దృక్పథంతో, ఆధునిక సమాజపు దృష్టితో నాటి కాలాన్ని అంచనావేసి రామాయణ మహత్వాన్ని దెబ్బతీసారు.

## 2.4 వ్యవస్థను కాపాడిన రాముడు (2005) :

భారత పురాణ సాహిత్యమంతా అధికారం కోసం, భూమికోసం, చదువు కోసం జరిగిన పోరాటాల చరిత్రేనంటూ డా. విజయభారతి గారు చేసిన రచనిది. సమాజాన్ని వర్గాలుగా విభజించి అందున కొన్ని వర్గాలను ఆధిపత్య వర్గాలుగా కొన్ని వర్గాలను సేవక వర్గాలుగా స్థిరపరిచే ప్రయత్నంలో భాగంగా మను ధర్మశాస్త్రాన్ని

లక్ష్యంగా చేసుకుని రామాయణ రచన జరిగిందనే సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ అట్టి ధర్మాన్ని నిలబెట్టడానికే రాముడు కట్టుబడ్డాడని ఈ రచనలో చూపారు. ఇట్టి వర్గవైషమ్యాలను దృష్టిలో ఉంచుకుని చేసిన రచనిది.

## 2.5 పౌలస్త్య హృదయం దాశరథి విజయం (2011) :

ఆచార్య చతుర్ సేన్ శాస్త్రి గారు రచించిన వయం రక్షామః అనే హిందీ నవలను శోభిరాల బాల త్రిపుర సుందరి గారు తెలుగున పౌలస్త్య హృదయం దాశరథి విజయం పేరిట అనువదించారు. ఇందున రామాయణకాలీన భౌగోళిక స్వరూపమును చక్కగా వర్ణించారు. అట్లే భరతఖండమున నరజాతిలోనే దేవదానవ యక్షరాక్షస కిన్నెరనాగ గంధర్వాది జాతులున్నాయని ప్రతిపాదించి రావణుడు రక్షా సంస్కృతికి చెందినవాడని సిద్ధాంతీకరించారు. అట్టి జాతుల మధ్య వైరాన్ని, సఖ్యాన్ని , నాటి రాజకీయ, సామాజిక పరిస్థితులను, సంస్కృతి సాంప్రదాయాలను ప్రతిబింబించే విధముగా ఈ నవల రచించబడింది. ఇందున జాతుల మధ్య వైరమేర్పడి ఒక జాతి కనుమరుగైన తీరును సప్రమాణికంగా ఆవిష్కరించిన తీరును గమనించవచ్చు. ఈ రచనలో రావణౌన్నత్యము ప్రద్యోతమగును.

## 2.6 విముక్త (2015 ):

ప్రముఖ స్త్రీవాద రచయిత్రి ఓల్గా గారి కథా సంకలనమే విముక్త. ఇందులో సీత, ఊర్మిళ, అహల్య, రేణుక, శూర్పణఖ పాత్రలను వినూత్నమైన రీతిలో తీర్చదిద్దుతూ స్త్రీ సాధికారతను ఋజువు చేసే విధంగా స్త్రీవాద ధోరణిలో ఈ రచన సాగింది. ఇందున పెక్కు కల్పితములు గలవు. స్త్రీవాద ధోరణిలో ఈ రచన పరమోత్కృష్టమైనదైనను రామాయణ ఇతిహాసముతో విభేదించినదనుట సత్యము.

ఇవిగాక కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి గారు రచించిన శంబుక వధ, బోయి భీమన్న గారు రచించిన రాగ వాశిష్టము, నార్ల వెంకటేశ్వరరావు గారు రచించిన జాబాలి, నరకంలో హరిశ్చంద్రుడు, ముద్దు కృష్ణ గారి అశోకం, చలం గారి సీత అగ్నిప్రవేశం మొదలైన రచనలెన్నో వారి వారి భావజాలాలపరంగా ఆయా రచనలు ఉత్తమోత్తమమైనవే అయినా రామాయణ ఔన్నత్యాన్ని దెబ్బతీసాయి. సురవరం ప్రతాపరెడ్డి గారి రామాయణ విశేషములు, ఆరుద్ర గారి రాముడికి సీత ఏమవుతుంది అనే రచనలు రామాయణము పైన వచ్చిన పరిశోధనా గ్రంథములుగా అగుపిస్తాయి. ఈ రచనలు పరిశోధకులకు రుచించినను సామాన్య పాఠకులకు ఇతిహాసములు కల్పితములని భావన కలిగేలా ఉన్నాయనుట వాస్తవం. అట్లే భిన్న భాషల నుండి తెలుగులోకి అనువదించబడ్డ ఏకే రామానుజన్ రాసిన మూడు వందల రామాయణాలు ఐదు ఉదాహరణలు అనే విప్లవాత్మక వ్యాసం, ఆనంద్ నీలకంఠన్ రచించిన అసుర అనే నవల తెలుగులో అనువాదమైనవి. ఇందులో రావణుని పరాజితునిగా చూపి అతని పట్ల మిక్కిలి కారుణ్యమేర్పడునట్లు రచన చేసిరి.

## 3. ముగింపు:

ఇలా హేతువాదం, నాస్తికవాదం, దళితవాదం, స్త్రీవాదం, మానవతావాదం, చారిత్రకదృక్పథం, మార్క్సిస్ట్ దృక్పథం, మనస్తత్వ విశ్లేషణ, అనే అధునాతన భావజాలాలతో ఇట్టి రచయితలందరూ సాహిత్యరంగంలో తమదైన స్థానాన్ని పదిల పరుచుకున్నారు. తమ ప్రజ్ఞను చాటారు. కానీ అట్టి రచనల వల్ల పాఠకులలో భిన్నమైన ఆలోచన విధానము పెంపొందుతుంది కానీ నైతిక విలువలు, ధార్మిక భావజాలం అనే అంశాలు కొరవడతాయి. స్త్రీలను చెరబట్టిన రావణుని రాజతంత్రమెరిగిన వాడని చూపి ఏ సుగుణాలను నేర్చుకోమని యువతకు చెప్పవచ్చు. ఆర్యా ద్రవిడ బేధాన్ని రగిల్చి ఏమి సాధించవచ్చు. ఇట్టి అంశములను బేరీజు వేసుకొని ఇటువంటి అధునాతన భావజాలాలను విజ్ఞాన మాత్రంగా స్వీకరించి మూలానికి ప్రాధాన్యం ఇవ్వవలసి ఉంది. తొలినాళ్లలో మూల గ్రంథాలను అధ్యయనం చేసిన పిమ్మటనే కవుల లౌకిక రచనలను చదివి వాటిని అంచనా వేసేవారు పాఠకులు. కానీ కార్యక్రమంలో పుస్తక పఠనము కావిస్తున్న వారి సంఖ్య తగ్గడం. చదవాలనుకున్న వారికి ఇలాంటి భిన్న దృక్పథాలలో రచించబడిన గ్రంథాలే ఆకర్షణీయంగా కనబడడం వలన ఈ గ్రంథాలనే చదివి పెడద్రోవ పట్టే అవకాశం ఉంది. అందువల్ల కాలానుగుణంగా రామాయణము వంటి గ్రంథాలను యువతకు అర్థమయ్యే రీతిలో సప్రమాణికంగా అందించాల్సిన బాధ్యత సాహితీవేత్తలపైన ఉన్నది.

## 4. ఉపయుక్తగ్రంథసూచి:


1.ఓల్గా, విముక్త, స్వేచ్ఛ ప్రచురణలు, హైదరాబాద్, 2010

2.బాల త్రిపుర సుందరి, శోభిరాల, పౌలస్త్య హృదయం దాశరథి విజయం, విశ్వకర్మ విజ్ఞాన కేంద్రం, విజయవాడ, 2011

3.రంగనాయకమ్మ, ముప్పాళ్ళ, రామాయణ విషవృక్షము, స్వీట్ హోమ్ పబ్లికేషన్స్, 2016

4.విజయభారతి, బోయి, వ్యవస్థను కాపాడిన రాముడు, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హైదరాబాద్, 2005

5.వెంకటేశ్వరరావు, నార్ల, సీత జోస్యం, విశాలాంధ్ర పబ్లికేషన్స్, హైదరాబాద్, 2016

6.సత్యనారాయణ చౌదరి, కొత్త, రామాయణ రహస్యాలు, విశాలాంధ్ర పబ్లికేషన్స్, 2016

7.సూర్య ప్రకాశ దీక్షితులు, పురాణపండ ,ఉషశ్రీ రామాయణం, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి, 2012


***



AUCHITHYAM
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
ISSN: 2583-4797
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
Article Link: https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_49.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 49. రామకథ: తెలంగాణ జనజీవనతాత్త్వికత

**డా. మట్ట సంపత్కుమార్ రెడ్డి**
తెలుగు అసోసియేట్ ప్రొఫెసర్,
ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల, కరీంనగర్,
కరీంనగర్, కరీంనగర్, తెలంగాణ.
సెల్: +91 9849470792. Email: sampathkmatta@gmail.com

**వ్యాససంగ్రహం:**

*"అంతారామమయం ఈ జగమంతా రామమయం" అని భక్తరామదాసు తన్మయత్వంతో కీర్తించిన విధంగానే రామాయణం వేలయేండ్లుగా దేశదేశాల సాహితీ సృజనలో పరివ్యాప్తమయింది. రామాయణంతో ప్రత్యక్ష, పరోక్షపరిచయం లేని మానవ సమూహం లేదు. మన ఇరుగుపొరుగుదేశాలవారు తమ దేశపు మౌలికలక్షణాలతో రామకథను వారసత్వపు ఇతిహాసంగా ప్రకటించుకుంటారు. మనదేశంలోని వివిధప్రాంతాలూ రామకథతో తమ సంబంధాలను ఎల్లెడలా మమనం చేసుకుంటారు. దేశపు నడిగడ్డ అయిన తెలంగాణకు కూడా రామకథతో ఒక ఆత్మీయమైన చుట్టరికం ఉన్నది. తెలంగాణ జనభావనలో, భాషలో, తాదాత్మ్యంలో, సంస్కృతిలో రామాయణం ఏకరంగా అంతర్లీనమై ఉన్నదో అన్వేషించుట ఆసక్తిదాయకమైన విషయం. ప్రజాసాహిత్యాన్ని అనుశీలించుట, ప్రజలభాషను విశ్లేషించుట, దేశీసాహిత్యపోకడలను గమనించుట, సాంస్కృతిక జీవనాన్ని అధ్యయనం చేయుట ఇందుకు ప్రాథమికంగా అవసరమైన విషయాలు. తెలంగాణ ప్రజలు ఏవిధంగా రామాయణాన్ని అక్కున చేర్చుకున్నారు, దాని ద్వారా ఏమి నేర్చుకున్నారు, తర్వాతి తరాలకు ఏ విధమైన జీవనతాత్త్వికతను మూటగట్టి ఇచ్చారనేది ఈ పరిశ్రమ ద్వారా తెలుసుకునే వీలుకలుగుతుంది. సమాజం నుండి స్వీకరించిన అంశాలను చర్చించి సారాన్ని రాబట్టుల ద్వారా సంపన్నమైన పూర్వీకుల సంస్కృతిని అర్థం చేసుకుని, ఆచరించేందుకు ఇదొక పునాదిగా పనికివస్తుంది.*

**Keywords:** రామాయణం, తెలంగాణము, పలుకుబడి, భౌగోళికత, ఐతిహ్యాలు, దేశి-మార్గసాహిత్యాలు, స్థానికసంస్కృతి.

## 1. రామకథతో తెలంగాణ బంధం :

**"రామరామ ఉయ్యాలో రామనే శ్రీరామ ఉయ్యాలో !**
**శ్రీరామ జయరామ ఉయ్యాలో శ్రీ సీతరామ ఉయ్యాలో !**
**రామరామనంది ఉయ్యాలో రాగమెత్తరాదు ఉయ్యాలో !"** (బతుకమ్మ పాట)

రామరామ అనందే రాగమే ఎత్తలేము, రామనామ స్మరణనే సర్వశుభాలకు శ్రీకారం అనేది తెలంగాణ ప్రజాసాహిత్యం ప్రకటించిన తాత్త్వికత ఇది. వేలయేండ్లుగా తెలంగాణ ప్రాంతం సుసంపన్నమైన సుభిక్షమైన ప్రాంతం. పీఠభూమి నాగరికత మొత్తంగ అడవులతో, కొండలతో, నీటివూట జాడలతో, పారే సెలయేర్లతో, పశుపక్ష్యాదుల తోడునీడతో, ఆహారసమృద్ధితో పరిఢవిల్లుతున్న నేల. అందుకే త్రేతాయుగంలో రాముడు, ద్వాపరయుగంలో పాండవులు వనవాసం కోసం ఈ నడిగడ్డ తొవ్వ తొక్కినారని ఇక్కడి పెద్దలు రోజూ నుడివేమాట. తన ఆశ్రమం చేరిన రామునికి వనవాసం కోసం అత్యంత అనువైన ప్రదేశం దండకారణ్యమని ఆగస్త్యమహాముని సూచిస్తాడు. మునీశ్వరుడు చూపినదారిలోనే రాముడు విశ్వాసంతో పయనిస్తాడు. రామ వనవాసానికి ప్రధానక్షేత్రం దండకారణ్యం. రాముడయినా మరొకరయినా దుర్భేద్యమైన వింధ్యగిరులూ, కర్కశమైన నదులూ, కాలూనలేని అరణ్యాలు దాటుకుని ఎందుకు ఇటువైపే తొవ్వదీసారనుటకు వారికి ఇక్కడ లభించిన ఆదరణ, ఆత్మీయత, స్నేహహస్తం, సేవాభావం, సేనాదళం, అన్నిటికిమించి నమ్మినవారికోసం ఎంతటి శ్రమకైనా సిద్ధపడేగుణం మొదలైనవన్నీ తెలంగాణ ప్రజాసాహిత్యంలో అడుగడుగునా కనబడుతాయి. రామాయణంలోని అరణ్య, కిష్కింద కాండలు తెలంగాణప్రాంతంతో ముడిబెట్టి చెప్పబడుతాయి. రామునికి నమ్మినబంటుగా నిలిచిన హనుమంతుడు తమ ప్రాంతపువాడేనని జనవిశ్వాసం. కనుక రామాయణంతో తెలంగాణ బంధాన్ని తెలుసుకునుటానికి ఇక్కడి భౌగోళికత, సాహిత్యం, భాషను, సంస్కృతిని అధ్యయనం చేస్తే ఎన్నో సంగతులు వెల్లడవుతాయి.

## 2. భౌగోళికత తాత్త్వికత :

రాముడి వనవాస ప్రయాణమార్గం గురించి అనేక అన్వేషణలూ, చర్చోపచర్చలూ జరిగాయి, జరుగుతూనే ఉన్నాయి. మధ్య దక్కనులోని ఆదిలాబాదు సమీపంలోని ఉన్కేశ్వరం మొదలుకొని తూర్పుకనుముల పడమటిహద్దునున్న భద్రాచలం వరకూ ప్రయాణరేఖ ఒకటి. ఇక్కడ ప్రముఖంగా గుర్తించదగిన అంశం. ఆ రేఖపొడవూతా రాముడితొవ్వను గుర్తింపజేసే సాంస్కృతిక ఆధారాలు బాగానే కనబడుతాయి. ఇక్కడ గుట్టగుట్టకూ రాముడు సంచరించినట్టు బోలెడు ఐతిహ్యాలు ఉంటాయి. గుట్టలమీదనే కాక గుండుగుండుకూ హనుమంతుని విగ్రహాలూ చెక్కివుంటాయి. గోదావరికి దక్షిణదిశలో ఇరువైకిపయిగా రాములపల్లెలు ఉన్నాయి. కరీంనగరు పరిసరాలలోనే పదికి పైగా రాములపల్లెలు, ప్రతి రాములపల్లెలో రాముడి వనవాసపు ఆనవాళ్లు, పక్కన రామకోవెల, అందులో ఏటా సీతారాముల పెండ్లిసంబురం ఇక్కడ అనాదివిషయం. రామగుండం, రామంచ, ఇల్లంతకుంట, ఇల్లందకుంట, ఇల్లెంద, ఇల్లెందు, హనుమంతుని పేట, శ్రీరామగిరి, సీతానగరం, రఘురాముల కోట మొదలైన గ్రామాల విశేషాలన్నీ రాముడి వనవాసాన్ని ఇక్కడి భౌగోళికతతో మడిపెట్టిచెప్పే పురాకథనాలు.

రామగిరి ఖిల్లా చరిత్ర ప్రాధాన్యత కలిగిన దుర్గం. సువిస్తారమైన ఈ పర్వతమేఖలలో సీతారాములకు, వాలిసుగ్రీవులకు సంబంధించిన అవశేషాలు, ఐతిహ్యాలు, ఆలయాలు ఉన్నాయి. గుట్టలమీద సీతమ్మ కోనేరని, పసుపుకుంకుమల శిలలని, రాముని పాదాలని, ఇల్లందగింజలని, బాణం వేసిన గురుతులని, రాముడు కూల్చిన ఏడుతాడిచెట్లని, వాలిసుగ్రీవుల గుహలని, సీతవాగని, పర్ణశాలని, జటాయువు కొండ అని పలు అంశాలతో, ప్రతి సందర్భంతో లెక్కలేనన్ని ఆనవాళ్లను చరిత్రపొడవునా సామాన్యజనం తమ ఊరిలో భద్రపరుచుకున్నారు. బొంతల దగ్గర మొదలైన ఆనవాళ్లు నిర్మల, మల్లాపురం, ఇల్లంతకుంట, రామంచ, ఇల్లందకుంట, ములుగు, పర్ణశాల, భద్రాచలం వరకూ విశేషంగా కనబడుట రాముడి ప్రయాణమార్గాన్ని తేటపరిచే జనవ్యవహారిక ఆధారం. గోదావరికి ఇరువైపులున్న ఉత్తరతెలంగాణ ప్రాంతం మొత్తం రాముడు నడచిన తొవ్వ అనేది ఒక ప్రగాఢమైన విశ్వాసం.

## 3. సాహిత్య తాత్త్వికత :

తెలంగాణలో వందలయేండ్లుగ వచ్చిన జానపద సాహిత్యం, దేశీసాహిత్యం, మార్గసాహిత్యం ఈ మూడింటిలోనూ రామకథకు, రామతాత్త్వికతగకూ విశిష్టమైన స్థానం ఉన్నది. తెలంగాణ జానపదసాహిత్యంలో రామకథాంశాలు కోకొల్లలు. వారిదృష్టిలో సీతారాములు వనవాస సమయంలో వ్యవసాయం చేసుకునే కాపుదనపు బిడ్డలు. అంతేకాదు ఊర్మిళ, శాంత వంటి పాత్రల ఉదాత్తతపట్ల తెలంగాణీయులకు మమకారం మెండు. బొడ్డెమ్మ, బతుకమ్మ, కోలాటం, జోల, లాలి పాటలలో, దంపుడు, విసురుడు, కలుపుకోతల శ్రామికగేయాలలో రామాయణపరమైన స్థానిక కథాగానాలు వందల సంఖ్యలో ఉన్నాయి. చిరుతల రామాయణం అనే కథాగాన ప్రదర్శనాత్మక ప్రక్రియకు ఇక్కడ తరతరాలనుండి విశేషమైన జనాదరణ ఉన్నది. పంటకాలం ముగిసిన తర్వాత ప్రతియేడూ గ్రామగ్రామాన చిరుతలరామాయణ ప్రదర్శనను సాంస్కృతికోత్సవంగా జరుపుకుంటారు. ఇందులోని దరువులు, ఏలలు పూర్తిగ స్థానిక ఛందోరీతులను, భాషాత్మక ప్రకటనలను కలిగివుంటాయి. కనుకనే ప్రజలు ఇప్పటికీ వీటికోసం ప్రాణం పెడుతారు.

యక్షగానాలకు తెలంగాణ కేంద్రస్థానము. ప్రతి పదివూర్ల అవతల ఒక కొత్త స్థానిక యక్షగానం, దాని ప్రదర్శన మొన్నమొన్నటిదాకా విస్తృతంగా ఉండేవి. ఏ ఊరిలో రాసుకున్న రాయణానికి ఆ ఊరిపేరే విశేషణంగా ఉండేది. మంథెన రామాయణం, ధర్మపురి రామాయణం, జీడికంటి రామాయణం, కూచికొండ రామాయణం వంటివన్నీ ఈ కోవలోనివే. ఇవేగాక మైరావణ చరిత్ర మరో ప్రముఖమైన విశిష్టమైన యక్షగానం. ఇది బహుళ ప్రచారంలో ఉన్న అవాల్మీకపు రామాయణకథ. ఒక్కొక్కటి తరాల పర్యంతం వందల సార్లు ప్రదర్శించబడిన యక్షగానాలివి. రూపం మార్చుకుని ఈ సరళి ఇప్పటికీ నడుస్తున్నది, దేశీయమైన ప్రజాగానసరళిలోని ఈ రామాయణాలను గానంచేసి ఆడియోలుగా రూపొంచుకునుడూ ప్రముఖంగా కనబడుతుంది. తందనాన

రామాయణం, మంథెన రామాయణం పారాయణంచేసి మధురమైన ఆడియోలు రూపొంచారు. తేలువిజయ పాడిన గేయరామాయణం, అంతడుపుల రమాదేవి పాడిన అంజన్న చరిత్ర మొదలైనవి ఈకాలంలో విస్తృతమైన ప్రజాదరణ పొందిన కథాగానాలు. భజనలు, కీర్తనలు, భక్తిగేయాలకు కొదవలేదు, రామదాసుకీర్తనలు మొదలు మిత్తిల అయ్యవార్ల కడీవాద్య గేయాలదాకా ఎంతో జానపద సాహిత్యం కనబడుతుంది. ఇప్పటికీ మంచి ప్రాచుర్యంలోనూ ఉంది.

తెలుగులో తొలిరామాయణం రంగనాథరామాయణం. ఇది భావనలో, ఛందస్సులో, కథాగమనంలో తెలంగాణ ప్రజల అభిరుచిని అనుసరించి సృజించబడిన రచన. వాల్మీకి రామాయణంలో లేని కథనాలెన్నో రంగనాథరామాయణంలో ఉన్నాయి. అవన్నీ ఆనాటి జనవ్యవహారంనుండి తీసుకుని లిఖితసాహిత్య గౌరవం కల్పింపబడినవే. భాస్కర రామాయణం, మొల్ల రామాయణం, పలు ద్విపద రామాయణాలు, సీత పరంగా రాయబడిన సీతాచరితాలు, అచ్చతెలుగు రామాయణాలు, వచన రామాయణాలు, నిరోష్ఠ్య రామాయణాలు, నిర్వచన రామాయణాలు, రగడరామాయణం పదులకొలది శతకాలు, గేయరామాయణాలు మొదలైనవి శతాధికంగా రచింపబడ్డాయి. ఆధునిక జీవనస్పృహను రామాయణంతో ముడిపెట్టి వానమామలై జగన్నాథాచార్యులు రాసిన రైతురామాయణం ఇటీవలికాలపు ఒక అభ్యదయ దృక్పథ బృహత్ పద్యకావ్యం. రామకథా పరంపరలోని నూతన చలనాలకు ఇదొక చక్కని తార్కాణం.

## 4. భాషాత్మక తాత్త్వికత :

ఒక సమాజపు ఆత్మను అద్దంలో చూపించగల సాధనం అక్కడి స్థానిక భాష. తెలంగాణపు తెలుగు నిరంతర రామనామ స్మరణతో కూడిన భాష. రాముని తలువకుండా ఇక్కడ దినచర్యే లేదు.అరె రామా, అయ్యోరామా, అయ్యో రామా, రామరామ, రామా భగవంతా మొదలైనవన్నీ ఆయారకాల వ్యక్తీకరణలకోసం అనూచానంగా రోజుకు వేలసార్లు వినబడే పలుకుబడులు. ఒక్కొక్కదాన్ని ఎన్నిరకాల ఊనికలతో పలికి ఎన్నెన్నిభావాలు పలికిస్తాలో ఇక్కడ పుట్టిపెరిగినవారికే తెలుసు. తెలంగాణ తెలుగులోని సామెతలు, జాతీయాలు, నానుడులు, లోకోక్తులలో రామనామజపం బహు బహుళంగా కనబడుతది. రామచక్కని, రామచక్కదనం అనేపలుకులు రూపంకోసం మాత్రమేగాక గుణప్రధానతకు ప్రధానసూచికలు.

మిక్కిలి ఎక్కువ ఘోష రామగోస, మిక్కిలి ఎక్కువ కష్టం సీతకష్టం, నిస్సహాయ స్థితికి సంకేతం సీతమ్మచెర, న్యాయం పక్షాన నిలిచిన జటాయువు నరకయాతన పక్షిగోస, చేతనైనంత సేవజేసుకునుడు ఉడుతసాయం, ఆరిండ్లకు మూడిండ్లుజేసే మాటలు మంథరమాటలు, ఎగతెగని పోరుపేరు కోతులకొట్లాట, ఎంతకూ అంతంలేనిది అంజన్నతోక, కొట్లాటకు దారిదీసేది రపరప రామాయణం,రామరావణ యుద్ధమంతటి కొట్లాటే లంకాపుడి, రాముడి

ఆదర్శపాలనలోని ప్రశాంతతే రామరాజ్యం, రాముడు లేని అయోధ్యలో ఎవరికిష్టమైన రీతిలో వారు అధికారం చెలాయించుడే ఇష్టారాజ్యం, అంతులేని ఆపదలకు గురై అడవిలో పొద్దుగ్రుంకినట్లు తల్లడిల్లడమే వనవాసం ఎల్లబోసుడు, పరమ మొద్దుబద్ధకస్తుడు కుంభకర్ణుడు, మాయలమరాఠీ సాక్షాత్తుగ ఇంద్రజిత్తు. చెప్పినపని కాదనకచేసుకపోయేవాడు రామబంటు. రామాయణపరమైన తాత్త్వికతను వ్యక్తీకరించే జాతీయాలలో ఇవి మచ్చుకు కొన్నిమాత్రమే.

కట్టె-కొట్టె-తెచ్చె, చూసిరమ్మంటె- కాల్చివచ్చినట్టు, చెట్టుదెమ్మంటె- గుట్టదెచ్చినట్టు, రాముడేందో-రాకాసేందో, రామకోతులల్ల-బోడకోతి, సీతవుట్టె-లంకజెడె, ఇచ్చారాజ్యం- భరతపట్టం, రాముడున్నకాడ అయోధ్య మొదలైనవన్నీ రామాయణపరమైన మూలాలు కలిగిన సామెతలు. వీటిని లౌకిక జీవనానికి అనుసంధానించుకుని ఒకటికి పదిసార్లు వాడుకునుడు తెలంగాణలో నిత్యకృత్యం. భాషలోని నర్మగర్భపు సొగసంతా ఇటువంటి వ్యక్తీకరణలలోనే ప్రస్ఫుటమై జనరంజకంగా నిలుస్తుంది. పదబంధాలు, భావార్థక స్ఫురణలు తెలంగాణభాషకు సహజలక్షణాలు. రామాయణపరంగా అన్వేషిస్తే ఇవి మరింత తేటగా, మధురంగా కనబడుతాయి.

## 5. సాంస్కృతిక తాత్త్వికత :

నిత్యజీవితంపైన పురాణాల ఇతిహాసాలు, అందులోని ఆదర్శాలు ధర్మమార్గాల ప్రభావం మన శరీరంలో అంతర్గతంగా ప్రవహించే రక్తం వంటిది. పరమనాస్తికుడినని చెప్పుకునేవ్యక్తి కూడా ఆస్తికతను దాటి అందనంత ముందుకు అసలువెళ్లడు. రామాయణమే లోకాభిరామాయణం. ఇది ఇంటింటికథ-ఊరూరి చరిత్ర. కనుక రామకథతో ముడివడ్డ తెలంగాణసంస్కృతి అరుదైన విశేషాలను తనలో నిక్షిప్తం చేసుకున్నది.

అత్యంత కష్టసమయంలో తమ ప్రాంతానికి వనవాసం వచ్చి, అడవులు పట్టుకతిరిగి, ఆకులలములు తిని, పడరానిపాట్లకు గురైన సీతారాములంటే ఇక్కడివారికి మాటలలో చెప్పరానంత ఆత్మీయత. పారమార్థికతలో లౌకికజీవనం మమేకమైన అదొక అద్వైతస్థితి. రాముడన్నా, రాముడి తల్లిదండ్రులన్నా, తను పుట్టిన ఊరన్నా వీరికి అలవికాని ప్రీతి. రాముడి పేరుతో పెట్టబడే పేర్లతో ఏకంగా రామకోటి రాయచ్చు. దశరథం, కౌసల్య అనేపేర్లు కూడా ఇక్కడ విస్తృతంగా వినబడుతాయి.

సీత అనేపేరు తెలంగాణల మొత్తానికే మృగ్యము. తమ ఇంటి ఆడబిడ్డకు సీతపేరు పెట్టరాదు - సీతకష్టం పడరాదు అనేది ఇక్కడి జీవన తాత్త్వికత. అందుకే తెలంగాణల దుర్భిణి వేసుకుని చూసినా సీత పేరు కనబడదు. జానమ్మ అనే పేరు ఉన్నా దాని మూలం జానకికి సంబంధించినది కాదు.కేవలం సీత పేరుపెట్టుకునుడే కాదు, నాటకాలు, యక్షగానాలలో సీతవేషం కట్టుటానికి కూడా చాలామంది ముందడుగు వేయరు. సీతవేషం వేస్తే సీతకష్టాలు వస్తాయని ప్రగాఢమైన విశ్వాసం. ఇవన్నీ స్థానికసంస్కృతిని వెల్లడిచేసే అత్యంత సున్నితమైన సంగతులు.

అయోధ్య రామజన్మస్థలం కనుక తెలంగాణల అయోధ్యపేరుతో పలుగ్రామాలు ముగ్గువోసుకున్నయి. మనిషి పేరుగాకూడా అయోధ్య ఇక్కడ బాగా వినబడేదే. రామలక్ష్మణులు అమడాల పిల్లలు కారు. కనీసం ఒక్కతల్లి పిల్లలు కూడాకారు. కానీ ఆ సహోదరత్వంలోని సమున్నతత్వం. తెలంగాణీయులకు బాగా నచ్చినవిషయం. కనుక ఇంట్లో కవలపిల్లలకు, కొట్టంలో ఒకేసారి పుట్టిన లేగదూడలకు రామన్న-లక్ష్మన్న అని పేర్లు పెట్టుకునుడు అన్నదమ్ముల అన్యోన్యతకు ఒక అజరామరత్వం.

కాకతీయుల కాలంలో కట్టిన గుళ్లలో రామప్పగుడిది ప్రపంచప్రసిద్ధిగాంచిన శిల్పం. ఇంతటిగుడి కట్టినవాడి పేరే రామప్ప అని ఒక ఐతిహ్యం. ఆ గుడి ప్రధానశల్పి రామప్ప అవునో కాదో ఆధారాలు దొరుకలేదుకానీ, ఆ గుడిలో లింగం పేరు రామప్ప. శివలింగాలలో ఒక లింగభేదానికి రామలింగం అని పేరు. రాముడు నెలకొల్పిన లింగమే రామప్ప. ఇటువంటి రామప్ప గుడులు ఉత్తరతెలంగాణలో పదిపన్నెండు ఇంకా నిలిచివున్నాయి. వేరువేరు కాలాలలో, వేరువేరు వాస్తులక్షణాలతో కట్టిన గుళ్లన్నీ రామప్ప కట్టినవికావు. రామప్పదేవునివన్నది లోకసత్యం. రాముడు నడచినదనిచెప్పే తొవ్వలోనే పలు రామలింగేశ్వర ఆలయాలు ఉన్నాయి. ఇవన్నీ రాముడి ప్రతిష్టలేనని ప్రతీతి.

ఇక సిద్ధులు అంటే రససిద్ధులు. అంటే వనమూలికలతో రకరకాల మందులు తయారుజేసేవారు. జానపదుల సాహిత్యం ప్రకారం మైరావణుడు గొప్పసిద్ధుడు. తనకు తెలియని మందులు లేవు. బహుశా ఈ మైరావణుని వైద్యపరంపరను అందిపుచ్చుకున్నవాళ్లు సిద్ధులు కావచ్చు. ఆ సిద్ధులకు తర్వాత తరాలవారే రామజోగులు కావచ్చు. తెలంగాణల రామజోగులనే కులం ఉంది. "**రామజోగి మందుగొనరే**"( 48వ కీర్తన, భద్రారామదాసు కీర్తనలు- సం. నేదునూరి కృష్ణమూర్తి) అనే రామదాసు కీర్తన ఈ రామజోగుల సిద్ధవృత్తిని వెల్లడించేదే. ఈ సిద్ధులూ శివలింగాలను ప్రతిష్ఠించి ఉండవచ్చు. అటువంటి సిద్ధిరామేశ్వర ఆలయాలు కూడా ఇక్కడ ఎక్కువగానే కనబడుతాయి. రామలింగేశ్వర ఆలయాలు, సిద్ధిరామేశ్వర ఆలయాలు ఇప్పటి సిద్ధిపేట-మెదక్-కామారెడ్డి త్రిభుజిలో ఎక్కువ కనబడుతాయి. అందుకే రామలింగారెడ్డి, సిద్ధిరాములు వంటి పేర్లు ఈ ప్రాంతంలో బహుళంగా పెట్టుకోబడుతాయి.

## 6. ముగింపు:

సమాజాన్ని సునిశితంగా గమనిస్తూ ఈ రకంగా వెతుక్కుంటే తెలంగాణ సంస్కృతిలో రామకథకు చెందిన సంగుతులింకెన్నో దొరుకుతాయి. చిన్నపిల్లలు ఆడుకునే ఆటలలో రాముడుసీత ఆట ఒకటి. మామిడిపండుతో పెద్దవాళ్లు వండుకతినే వంటలలో రామరసం ఒకటి. ఒగ్గుకథ, ఉయ్యాలపాట వంటి ప్రజాసాహిత్య గేయాల వంతలలో రామరామ ఒకటి. కనుక తెలంగాణ సంస్కృతిలో రామాయణం ఒక అవిభాజ్యమైన అంశం.

తమప్రాంతంతో ప్రత్యక్ష సంబంధం ఉందనుకునే అరణ్య, కిష్కింద కాండలకు చెందిన కరుణరసాత్మకమైన ఘట్టాలపట్ల తెలంగాణకు తాదాత్మ్యం ఎక్కువ. ఆదర్శనీయమైన విలువల పట్ల ఆరాటం ఎక్కువ. మంచిచెడుల మధ్య జరిగిన సంఘర్షణపట్ల అవగాహన ఎక్కువ అనే విషయానికి పైన చెప్పుకున్న అన్ని విషయాలు ప్రాథమికాధారంగా నిలుస్తున్నాయి. మాటలో, మన్ననలో, ఆలోచనలో, ఆచరణలో ఈ సున్నితత్వాన్ని కాపాడుకునుడు మన భాద్యత. వర్తమాన కాలానికి ఈ అవసరం మరింతగ పెరిగింది.

## 7. ఉపయుక్తగ్రంథసూచి:


1. జగన్నాథాచార్యులు, వానమామలై, రైతు రామాయణం, స్వీయప్రచురణ, కరీంనగర్. (1960)
2. దాచేపల్లి మాదురి, మనోజ్ పబ్లికేషన్స్ & సాంస్కృతిక సాహితీ సమాఖ్య, దేవరకొండ. (2005)
3. నాగేశ్వరరావు బెల్లంకొండ, రామగిరి ఖిల్లా (వ్యాసం), మొలక బాలలమాసపత్రిక. (జూలై, 2022)
4. నారాయణ రెడ్డి, మాదాడి, ఆదిలాబాదు జిల్లా జానపదగేయాలు, స్వీయప్రచురణ, కరీంనగర్. (2007)
5. పెరుమాండ్లు వేముల, తెలంగాణ జాతీయాలు, విరాట్ పబ్లికేషన్స్, వెస్ట్ మారేడుపల్లి, సికింద్రాబాదు. (1998)
6. మలయశ్రీ, కరీంనగర్ జిల్లా సాహిత్య చరిత్ర, సత్యార్థి పబ్లికేషన్స్, కరీంనగర్. (1997)
7. సుజాతారెడ్డి ముదిగంటి, తొలి రామాయణం మనదే (వ్యాసం), నమస్తే తెలంగాణ దినపత్రిక (24,ఏప్రిల్, 2021)
8. సుజాతాశేఖర్, బండారు, తెలంగాణ బతుకమ్మ పాటలు, పౌరాణిక,సామాజిక, సాంస్కృతిక, భాషా పరిశీలన.


***




AUCHITHYAM

ISSN: 2583-4797

International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal

Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797

**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_50.php

# "కమనీయం తెలుగు రామాయణం"

### జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

## 50. ఉమ్మడి కరీంనగర్ జిల్లా రామాయణాలు: విశేషాలు

**డా. యస్. మహేందర్**

తెలుగు సహాయాచార్యులు,

ప్రభుత్వ డిగ్రీ కళాశాల సిద్ధిపేట (స్వయంప్రతిపత్తి),

సిద్దిపేట, తెలంగాణ.

సెల్: +91 9642865013. Email: sheelammahender96@gmail.com

**వ్యాససంగ్రహం:**

*రామాయణం జగత్ ప్రసిద్ధ ఇతిహాసం. వాల్మీకి విరచిత రామాయణం భారతీయ భాషలతో పాటు ప్రపంచ ప్రధాన భాషలోకి అనువాదమైన రసవత్తర కావ్యం. ఆ విధంగా రామాయణాన్ని తెలుగులో కూడా ఎంతోమంది కవులు, రచయితలు అనువాదం, అనుసృజన కావించారు. అనుసృజనలో ప్రక్రియ పరంగా మార్పులు ఉన్నాయి. భాషాంతరీకరణలో మార్పులు, చేర్పులు ఎన్నో జరిగాయి. అట్ల రెండు తెలుగు రాష్ట్రాలలోనే ఎన్నో రామాయణాలు తెలుగులో వెలసినాయి. తెలంగాణలో ఉమ్మడి కరీంనగర్ జిల్లాకు సాహిత్య పరంగా ప్రత్యేక స్థానం కలదు. జిన వల్లభుడు వేయించిన కురిక్యాల శాసనం నుండి జ్ఞానపీఠ పురస్కార గ్రహీత సింగిరెడ్డి నారాయణరెడ్డి వరకు ఘనమైన సాహిత్య చరిత్ర కలదు. అంతటి ఘనమైన సాహిత్యచరిత్ర కలిగిన కరీంనగర్ జిల్లా నుండి రామాయణానికి సంబంధించిన సాహిత్యం ఎంతగానో వచ్చింది. ఆ విధంగా ఉమ్మడి కరీంనగర్ జిల్లా నుండి వచ్చిన రామాయణాలను విశ్లేషించి, విశేషాలు తెలియజేయడమే ఈ వ్యాసం ముఖ్య ఉద్దేశం.*

**Keywords:** ధర్మపురి రామాయణం, మంతెన రామాయణం, ఇల్లంతకుంట రామాయణం, సాకేత రామాయణం, గేయ రామాయణం, ద్విపద రామాయణం, రైతు రామాయణం, యక్షగానం.

### 1. ఉపోద్ఘాతం:

తెలుగు సాహిత్యానికి వెయ్యేల్లసాహిత్య చరిత్ర ఉన్నట్లే ఉమ్మడి కరీంనగర్ జిల్లాకు కూడా వెయ్యేల్ల సాహిత్య చరిత్ర కలదు. బొమ్మలమ్మ గుట్ట పైన జినవల్లభుడు వేయించిన కురిక్యాల శాసనమే ప్రత్యక్ష ఆధారం. చారిత్రకంగా ఇంకా లోతుగా విశ్లేషించినట్లయితే శాతవాహన రాజు హాలుడు కోటిలింగాలను రాజధానిగా చేసుకుని పరిపాలన

కావించి స్వయంగా తనే గాథాసప్తశతిని పేరుతో క్రోడీకరించినారు హాలుడు. కవిజనాశ్రయం రాసిన మల్లియరేచన, వేములవాడ భీమకవి, భాగవతం లోని 11 ,12 స్కందాలను అనువదించిన వెలగందుల నారయ్య, పద్మపురాణం రాసిన మడికి సింగన, ధర్మపురి శేషప్ప కవి లాంటి ఎంతోమంది ప్రాచీన కవుల నుండి సినారె, పి.వి నరసింహారావు, అల్లం రాజయ్య, కాలువ మల్లయ్య, అలిశెట్టి ప్రభాకర్ లాంటి ఎంతోమంది ఆధునిక కవులు రచయితలకు పుట్టినిల్లు కరీంనగర్.

అంతటి ఘనమైన సాహిత్య చరిత్ర కలిగిన కరీంనగర్ జిల్లా నుండి రామాయణానికి సంబంధించిన సాహిత్యం కొన్ని ప్రత్యేకతలు, విశేషాలు సంతరించుకున్నాయి. శాతవాహన ప్రభువైన హాలుడు క్రోడీకరించిన గాథాసప్తశతిలో రామాయణానికి సంబంధించిన ప్రస్తావన మనకు కనిపిస్తుంది. అదేవిధంగా ఇది ఈ జిల్లా నుండి రామాయణ ప్రస్తావన కనిపించిన తొలి కావ్యంగా చెప్పొచ్చు. అదేవిధంగా వేములవాడ భీమకవి రాసినట్లుగా చెబుతున్న శతకందర రామాయణం ఇక్కడిదే అని విమర్శకుల అభిప్రాయం. కానీ అది ఇప్పుడు అలభ్యం. అదే విధంగా తొలి తెలుగు సంకలనమైన సకలనీతిసమ్మతంలో మడికి సింగన సేకరించిన పద్యాలలో చివరగా ఒక పద్యం శ్రీరామాయణం నుండి తీసుకున్నట్లు మనకు ఆధారాలు లభిస్తున్నాయి. దీనిని బట్టి శ్రీరామాయణం కూడా ఇక్కడి ప్రాంతానికి దగ్గరగా ఎవరో ఒక అవి రాసి ఉండొచ్చని, అది మడికి సింగన కంటే ముందటిదే అయి ఉంటదని మనకు తెలుస్తుంది. కానీ శ్రీరామాయణం అలభ్యం.

## 2. పూర్వ పరిశోధన :

కరీంనగర్ జిల్లా సాహిత్య చరిత్ర అనే అంశంతో ఎస్. మల్లయ్య (మలయ శ్రీ) గారు పరిశోధన కావించినప్పుడు కొంతవరకు కరీంనగర్ జిల్లాకు సంబంధించిన కవులు రాసిన రామాయణాలు ప్రస్తావన సందర్భోచితంగా విశ్లేషించారు. అదేవిధంగా ఈ జిల్లా నుండి వచ్చిన **రైతు రామాయణం** పైన డింగరి రామాచార్యులు పరిశోధన చేశారు. **యక్షగానాలలో రామాయణాలు** అనే అంశం పైన ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పరిశోధన కావించిన విశ్రాంత అధ్యాపకులు **డాక్టర్ దాశరధుల బాలయ్య** కొంతవరకు ఈ అంశం పైన పరిశోధన చేశారు. **గేయ రామాయణం** పైన పరిశోధన కావించినప్పుడు కరీంనగర్ జిల్లాకు సంబంధించిన గేయ రామాయణ ప్రస్తావన కూడా కొంతవరకు చర్చించడం జరిగింది. వేములవాడకు చెందిన మామిడిపల్లి సాంబశివ కవి మరియు ధర్మపురికి చెందిన శేషప్ప కవి మంథనికి చెందిన ముద్దుం బాలబట్టు పైన పరిశోధన కావించిన కేవలం వారి వ్యక్తిగత సాహిత్య పరిశోధన జరిగింది కానీ, ప్రత్యేకంగా కరీంనగర్ జిల్లా రామాయణ విశేషాలు పైన పరిశోధన కావించడం జరగలేదు. కావున వీటన్నింటిని సమన్వయ పరుస్తూ ఈ జిల్లా నుండి వచ్చిన రామాయణాలల్లో ప్రత్యేకతలను విశేషాలను వెలికి తీయడమే ఈ వ్యాసం ముఖ్య ఉద్దేశం.

### 3. వాశిష్ఠ రామాయణం:

ఇప్పటివరకు లభిస్తున్న రామాయణంలో కరీంనగర్ జిల్లాకు సంబంధించిన మొదటి రామాయణంగా చెప్పుకోదగ్గది మడికి సింగన రాసిన వాశిష్ఠ రామాయణం. 14వ శతాబ్దికి చెందిన మడికి సింగన సంస్కృత యోగ వాశిష్టం ఆధారంగా వాశిష్ఠ రామాయణాన్ని రచించారు. ఇందులో వశిష్ఠ మహర్షి శ్రీరామునికి బోధించిన ధర్మబోధ ప్రధానంగా ఉండి మధ్య, మధ్యలో అనేక ఉపకథలు, పరికథలు సందర్భోచితంగా చర్చకు వస్తాయి. పద్మ పురాణంతో ప్రఖ్యాతిగాంచిన మడికి సింగన చివరి కావ్యంగా వాశిష్ఠ రామాయణాన్ని రాసినారని చెబుతారు. ఇందులో కవి యొక్క పరిణతి విస్తృతంగా కనిపిస్తుంది.

### 4. మంథెన రామాయణం:

గోదావరి నది ఒడ్డున కొలువై ఉన్న పుణ్య క్షేత్రం మంథని ఓంకారేశ్వరాలయం. ఈ ప్రాంతానికి చెందిన ముద్దం బాలభట్టు గారు మంథెన పేరుతో ఒక యక్షగానం రాసినారు. ఇదీ దాదాపుగా రెండు శతాబ్దాలకు ముందు రాయబడ్డ యక్షగానం. ఇప్పటికి ఈ రామాయణ యక్షగానాలు సంప్రదాయ కుటుంబ సభ్యులు నోములు, వ్రతలల్లో పాడుకుంటారు. **నవమాసాలు నిండి నారాయణుండు నవతరించే- నయోధ్యయందు రాముండు 1** రాముని పుట్టుకను గూర్చి కేవలం రెండు చరణాల ద్వారనె విష్ణువు రామావతరమెత్తినాడని జానపదులకు సులభంగా పాడుకోవడానికి వుండే విధంగా జానపద శైలిలో రాసినాడు.

### 5. ద్విపద రామాయణం:

తెలుగులో తొలి తెలుగు రామాయణం గోనబుద్ధారెడ్డి రాసిన రంగనాథ రామాయణం. ఇది ద్విపదలో రాయబడింది. అట్లా కరీంనగర్ జిల్లా నుండి వేములవాడ ప్రాంతానికి చెందిన అష్టావధాని మామిడిపల్లి సాంబశివశర్మ గారు ద్విపద రామాయణం పేరుతో ఒక రామాయణాన్ని రాసినారు. దీనికి మూలం హిందీలో రాదే శ్యామ్ రాసిన గేయ రామాయణం. ఇది స్వేచ్ఛానువాదం. సాధారణంగా రామాయణాలన్నీ వ్యక్తిగత పేరుతో రాయబడి ఉంటాయి కానీ ఈ రామాయణం ద్విపద పేరుతోనే ప్రచురించబడింది. (పుట సంఖ్య 217 కరీంనగర్ జిల్లా సాహిత్య చరిత్ర)

### 6. ధర్మపురి రామాయణం:

కరీంనగర్ జిల్లాలో ప్రసిద్ధ నరసింహ క్షేత్రం ధర్మపురి. ఈ ప్రాంతానికి చెందిన కవి శేషప్ప. వీరు నారసింహ శతకం, నృకేసరి శతకం ఇక్కడి జన బాహుల్యములో ఎంతో ప్రఖ్యాతాలు. వీరు శతకాలతో పాటు రామాయణ కథను యక్షగానంలో రాస్తూ దానికి ధర్మపురి రామాయణం అని పేరు పెట్టడం జరిగింది. వీరు రాసిన రామాయణంలోని పద్యాలు, దరువులు, కరీంనగర్ జిల్లా అంతట ఎంతో ప్రఖ్యాతిగాంచినవి అయితే వీరి

రామాయాణానికి ఒక గ్రామం పేరు మీదుగా పేరు పెట్టడం విశేషంగా చెప్పవచ్చు. **ధర్మపురి రామాయణాన్ని అవనీజ చరిత్ర అని కూడా పిలుస్తారని కొందరంటారు.** ధర్మపురి రామాయణం వేరు, అవనీజ చరిత్ర వేరని రెండు వేర్వేరుగా రాసినారని చెబుతారు. **జనకుండు నప్పుడు తన సతి తోడ గూడి 2** అంటూ సీతను అత్తవారింటికి పంపేటప్పుడు తల్లిదండ్రులు ఎంత బాధ పడుతారో చెబుతూనే అత్తవారింటి కాడ ఆడపిల్ల ఏ విధంగా మెదులుకోవాలో చెప్పే అప్పగింతల పాట ఇప్పటికి ఇళ్ళలో ఉండే పెద్దవాళ్ళు వల్లెవేస్తారు.

## 7. ఇల్లంతకుంట రామాయణం:

ఇదే జిల్లా నుండి వచ్చిన మరో ప్రసిద్ధ యక్షగానం ఇల్లంతకుంట రామాయణం ఇల్లంతకుంట కరీంనగర్ జిల్లాలోని జమ్మికుంట ప్రాంతంలో గల ఒక గ్రామం ఇల్లంతకుంట రామాయణం రాసిన బహునూతుల సీతారామానాయుడు ఆంధ్ర ప్రాంతం నుండి ఇక్కడి ప్రాంతానికి వలస వచ్చి స్థిర నివాసం ఏర్పరచుకున్నారు. వీరు హుజురాబాద్ లో స్థిరనివాసం ఏర్పరచుకొని పక్కనే ఉన్న ఇల్లంతకుంట రామలింగేశ్వరస్వామి పేరు మీదుగా రామాయణం రాసినారు. వారు యక్షగానంగా చెప్పుకున్నప్పటికీ వారి గురించి తెలిసిన కొందరి అభిప్రాయం ప్రకారం వారు యక్షగానం రాసి ఉండకపోవచ్చునని అది వచన రూపంలో రాసుంటారని అన్నారు.

## 8. రగడ రామాయణం:

కరీంనగర్ జిల్లాకు చెందిన గంగా రాజేశ్వరరావు మంథని ప్రాంతానికి చెందినవారు. వీరు యక్షగానాలలో కనిపించే రగడ ఛందస్సును ప్రధానంగా తీసుకొని రామాయణమంతా రగడలోని రాసినారు. వీరు రాసిన తమ రామాయణానికి రగడ రామాయణం అని పేరు పెట్టినారు. ఇట్లా దేశి ప్రక్రియకు చెందిన రగడ పేరుతో రామాయణం రావడం విశేషంగా చెప్పవచ్చు.

## 9. గేయ రామాయణం:

కాకర్ల కృష్ణమూర్తి రామాయణ కథను గేయ రామాయణంగా రాసినట్లు అముద్రితంగా ఉన్నట్లు కరీంనగర్ జిల్లా సాహిత్యం ద్వారా తెలుస్తుంది. గేయ రామాయణం గూర్చి ఇంకా సమాచారం సేకరించవలసిన అవసరం ఉంది.

## 10. తందనాన రామాయణం:

కరీంనగర్ జిల్లా ఇల్లంతకుంట మండలం రామోజీపేట ప్రాంతానికి చెందిన విధుమౌళిశాస్త్రి తందనాన రామాయణాన్ని రాసినారు. ఈ రామాయణం కరీంనగర్ జిల్లాకే కాకుండా ఉత్తర తెలంగాణ ప్రాంతమంతా

ప్రసిద్ధమైనది. **బాల నగరాజ నందనాజై రామ రామ – తందనాన రామాయణం జై రామ రామ 3** అంటూ ప్రతి పల్లెలో నలభై రోజులు చెప్పేవారు.

## 11. సాకేత రామాయణం:

కరీంనగర్ జిల్లా మంథనికి చెందిన బహుభాషా పండితుడు గజానన్ తామన్ రాసిన సాకేత రామాయణం కావ్యం. ఇది మరాఠీ కవి గజానంద్ మాడ్గుల్కర్ గీత రామాయణానికి అనుసృజనగా చెప్పవచ్చు .అయితే మంథని సమీపంలో సాకేతపల్లి అనే గ్రామం కలదు. అదే గ్రామం పేరు మీదుగా వీరు సాకేత రామాయణం గేయ కావ్యంగా రాసినారు. ఇది మాత్రా ఛందస్సులో రాయబడ్డది. ఇందులో కథనాత్మకత కంటే పాత్రలపరంగా చెబుతూనే కాండలుగా విభజించినారు. ఇది సాకేత రామాయణ యొక్క ప్రత్యేకతగా చెప్పవచ్చు. నల్లవాడే రామచంద్రుడు **ఉల్లమున తల్లులను నిలుపును / పిన్నయైనా మిన్న గుణమున పెద్దలెంతో నేర్వ వలయును 4**

## 12. భారతం:

విశ్వవిద్యాలయ విశ్రాంత ఆచార్యులు రావి కంటి వసునందన్ రామాయణ కథను భారతం పేరుతో పద్య కావ్యంగా రచించారు. సాధారణంగా రామాయణాలన్నీ రాముడు కథానాయకుడుగానే సాగుతాయి. కానీ ఈ **భారతం భరతుని కథానాయకునిగా చేసి రాయబడ్డ రామాయణం.** అందుకే ఈ కావ్యానికి భరతుని పేరు మీదుగా భారతం అని పేరు పెట్టారు. చూసేవారికి భారతం అనగానే మహాభారతం కథలాగా స్ఫురించినప్పటికీ ఇది రామాయణ కథ. భరతుని కోణంలో చూస్తూ రాయబడ్డ కావ్యం. ఈ విధంగా భరతుడిని కావ్య నాయకుడిగా వచ్చిన కరీంనగర్ జిల్లా నుండి రామాయణ విశేషంగా చెప్పుకోవచ్చు.

## 13. జ్వలిత కౌసల్య:

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ ఉపకులపతి ఆచార్య అనుమాండ్ల భూమయ్య జ్వలిత కౌసల్య పేరుతో రామాయణ కథనం పద్య కావ్యంగా మలిచినారు. ఈ కావ్యంలో దశరథుని పెద భార్య అయిన **కౌసల్య కోణంలో వ్రాయబడ్డ కావ్యం.** ఇది కూడా రామాయణ కథ ఆధారంగానే రాయబడ్డ కావ్యం ఒక తల్లిగా కౌసల్య పడిన మాతృవేదన ఏ విధంగా ఉంటుందో ఈ జ్వలిత కౌసల్య కావ్యంలో గమనించవచ్చు.

## 14. మైరావణచరిత్ర :

కాకుత్సం నరసింహదాసు. మైరావణచరిత్ర పేరుతో యక్షగానాన్ని రచించినారు. వీరు ధర్మపురి ప్రాంతం వారు. మైరావణచరిత్ర కరీంనగర్ జిల్లా అంతట ప్రదర్శించబడిన గొప్ప యక్షగానం. మహిరావణుని చరిత్ర. జన వ్యవహారములో మైరావణచరిత్రగా పేరొందింది. వీరు రావణాసురుని మేనమామ. మహిరావణుడు

రామలక్ష్మణులను మాయోపాయంతో బూడిద చల్లి ఎత్తుకొని పోవడం తరువాత ఆంజనేయుని ద్వారా విముక్తులవడం ప్రధానంగా కథ కొనసాగుతుంది. ఇది రామరావణ యుద్ధానికి పూర్వమే జరిగిన రామాయణానికి చెందిన కథ.

### 15. రైతు రామాయణం:

వానమామలై వంశంలో పుట్టిన కవి పండితులు జగన్నాథచార్యులు. **రామ కథను ఆధారంగా తీసుకొని అందులోని పాత్రలను ప్రతీకలుగా తీసుకుంటూ రైతు రామాయణం రాసినారు.** ప్రధాన పాత్రలైన దశరథుడు, రామలక్ష్మణులు, సీత, ఆంజనేయుడు లాంటి పాత్రను ప్రతీకలుగా తీసుకొని తెలంగాణ సాయుధ పోరాటంలో జరిగిన ఉద్యమాన్ని ఈ రైతు రామాయణంలో చిత్రీకరించినారు. అంటే రామాయణ పాత్రను ప్రతీకలుగా తీసుకోబడి రైతు రామాయణం రాయడం ఇక్కడ విశేషంగా చెప్పుకోవచ్చు. అతని శుభానామమది సాగరయ్య నాటి/ పరగణామోత్తమునకుబెద్ద పలుకుబడియును5 శ్రీరామగ్రామపురములో నివసిస్తున్న సాగరయ్య దశరథమహారాజుకు ప్రతీకగా రైతు రామాయణములో గమనించవచ్చు.

### 16. రామాయణ బుర్రకథ:

సాధారణంగా బుర్రకథలు సామాజిక సందేశంతో అవగాహన కార్యక్రమాలకు ఉపయోగించే ప్రక్రియ లాగా తెలుగునాట ప్రసిద్ధి. కానీ ఎక్కల దేవి లక్ష్మణ భగవతార్ రామాయణ కథను బుర్రకథగా మలిచి రాసినారు.

### 17. శ్రీరామ నామ మహత్యం :

దమ్మయ్య గారి రాజన్న వీరు హిందీలో తులసీదాస్ రాసిన రామచరిత మానస్ ను తెలుగులో అనువదించి శ్రీరామ మహత్యం పేరుతో గేయ కావ్యాన్ని రాసినారు. పాడుకోవడానికి తగినట్లుగా ఉందని అంటారు.

### 18. రామాశ్వమేధం :

దపూరి సత్యనారాయణచారి భవభూతి రాసిన రామ ఉత్తర రామ చరిత్రను పోలి ఉండే విధంగా ఒక వీధి నాటకాన్ని రాసి దానికి రామాశ్వమేధమని పేరు పెట్టినారు. ఇట్ల రామాయణ కథను వీధి నాటకంగా రాయడం విశేషంగా చెప్పవచ్చు.

### 19. వశిష్ట రామాయణం/ఆధ్యాత్మ రామాయణం :

కరీంనగర్జిల్లా నుండి వాల్మీకి, ఇతరత్రా భాషలతోపాటు వాశిష్టరామాయణం, ఆధ్యాత్మరామాయణం పేరుతో రామాయణాలు ఈ జిల్లా నుండి చాలనే వచ్చినాయి. కృష్ణగురు వెంకటరమణయ్య వశిష్ట రామాయణం

మరియు ఆధ్యాత్మ రామాయణం రెండు రాసినారు. ఈ రెండింటికి వశిష్టుని సంస్కృత రామాయణం, వ్యాస మహర్షి రాసిన ఆధ్యాత్మ రామాయణం ఆధారం.

## 20. సీతాచరిత్ర:

విశ్వనాథ సత్యనారాయణ కొంతకాలం కరీంనగర్ జిల్లాలో ఉద్యోగరీత్యా నివసించడం వల్ల వారి ప్రభావంతో వటపురి వెంకట నరసింహచార్యులు రామాయాణాన్ని సీతా చరిత్ర పేరుతో రాసినారు. వీరు సీతా చరిత్ర రాయడానికి ప్రధాన కారణం విశ్వనాథ రాసిన శ్రీమద్రమాయణ కల్పవృక్షం. అయితే సీతాచరిత్ర యొక్క ప్రత్యేకత ఏమిటంటే **ఇందులో ఉన్న భాగాలను కాండలుగా కాకుండా ఆశ్వాసాలుగా విభజించటం.**

ఈ విధంగా కరీంనగర్ జిల్లా నుండి రామాయణ కథలను ఆధారంగా చేసుకొని అనుసృజనగానో, ప్రక్రియని మార్చుకుంటూ ఎన్నో రచనలు వచ్చినాయి. కర్తృత్వంగా ఉన్న యక్షగానాలు, చిరుతల రామాయణాలు, కుశలవకథలు, హనుమత్ నాటకాలు, రామునికి సంబంధించిన శతకాలు, గీతాలుగా కీర్తనలుగా ఎంతో సాహిత్యం కలదు.

## 21. ముగింపు:

సాధారణంగా తెలుగు రామాయణాలన్నీ కర్త పేరుమీదుగానే ఎక్కువగా చలామణిలో ఉన్నాయి. కానీ కరీంనగర్ జిల్లా నుండి వచ్చిన రామాయణాలను గమనించినట్లైతే ఏ ఒక్క రామాయణం కర్త పేరు మీదుగా ఉండకపోవడం విశేషంగా కనబడుతుంది.

ఇక్కడి నుండి వచ్చిన రామయణాలల్లో గ్రామ నామముతో వచ్చిన రామాయణాలు ధర్మపురి , మంథని, ఇల్లంతకుంట, సాకేతరామాయణాలు, ఛందస్సు పేరుమీదుగా వచ్చిన రామాయణాలు ద్విపద, రగడ రామాయణాలు, రామాయణ పాత్రల ఆధారంగా వచ్చిన రామాయణాలు భారతం, సీత చరిత్ర, జ్వలిత కౌసల్య, మైరావణ చరిత్ర రామాయణాలు.

ఇక తెలంగాణ సాయుధపోరాట స్ఫూర్తితో, రామాయణ పాత్రలను ప్రతీకలుగా చూపుతూ వచ్చిన రైతు రామాయణాన్ని ప్రత్యేక రామాయణంగా చెప్పవచ్చు.

విశ్వవిద్యాలయస్థాయిలో ఈ అంశం పైన లోతైన పరిశోధనలు జరిగితే మరికొన్ని విషయాలు వెలుగులోకి వచ్చే అవకాశం కలదు.

## 22. పాదసూచికలు:

1. కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర ,మలయ శ్రీ . పుట సంఖ్య 82
2. కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర ,మలయ శ్రీ . పుట సంఖ్య 85
3. సాహితీ సుధ, గుమ్మనగారి బాలశ్రీనివాస మూర్తి(సం), పుట సంఖ్య: 213
4. సాకేత రామాయనం, గజానన్ తామన్ పుట సంఖ్య 13
5. తెలుగు సాహితీ కిన్నెర,తెలుగు అకాడెమి పుట సంఖ్య 43

## 23. ఉపయుక్తగ్రంథసూచి:


1. గౌతమరావు, జువ్వాడి (సం), కరీంనగర్ మండల చరిత్ర, జిల్లా రచయితసంఘం, శ్రీ త్యాగరాజ లలితకళా పరిషత్, కరీంనగర్, 1981
2. తామన్ గజానన్ , సాకేత రామాయణం, శ్రీ సీతారామ సేవ సదన్, పెద్దపల్లి, 2009
3. బాలశ్రీనివాస మూర్తి , గుమ్మన్నగారి (సం), సాహితీ సుధ, బండ్ల పబ్లికేషన్స్, హైదరాబాద్, 2018
4. మలయ శ్రీ , కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర, విశాలాంధ్ర పబ్లిషర్స్, హైదరాబాద్, 1997
5. విధుమౌళి శర్మ, రుక్మాభట్ల, తందనాన రామయణం, శ్రీ శిద్దేశ్వర పబ్లికేషన్స్, హైదరాబాద్, 2019
6. మహేందర్, ఎస్. కరీంనగర్ జిల్లా సాహిత్యము-చారిత్రక, సాంస్కృతికఅధ్యయనము (అముద్రిత సిద్ధాంత గ్రంథము) ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్, 2023


***




AUCHITHYAM
ISSN: 2583-4797
International Research Journal for Telugu Language & Literary Studies UGC-CARE listed Journal
Publishing by: Dr. Rambhatla Parvatheeswara Sarma, Dr. RVRM Trust, 12-121/17, Flat No. 402, Satyanagar, Chinamusidiwada, Pendurthy, Visakhapatnam-531173. AP, India. +91 9247859580.

AUCHITHYAM UGC-CARE Listed Journal | Volume-4 | Issue-15 | December 2023 Special Issue | ISSN: 2583-4797
**Article Link:** https://www.auchithyam.com/2023/dec_2023_spl/full_papers/december23_spl_51.php

# "కమనీయం తెలుగు రామాయణం"

## జాతీయసదస్సు నవంబర్-2023 ప్రత్యేకసంచిక

**(ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి) సిద్ధిపేట, సిద్ధిపేట జిల్లా, తెలంగాణ రాష్ట్రం.)**

# 51. కవిసార్వభౌముని రామాయణం: రచనాప్రణాళిక

**సంపత్ కుమార్ బానోజి**

తెలుగు ఉపన్యాసకులు,
ప్రభుత్వ డిగ్రీ కళాశాల (స్వయంప్రతిపత్తి),
సిద్ధిపేట, తెలంగాణ.
సెల్: +91 9666085015. Email: sampathskb7@gmail.com

**వ్యాససంగ్రహం:**

*కవి సార్వభౌముడనిన పెక్కురకు శ్రీనాథుడనే స్ఫురించును. కానీ నేటి వరకు లభ్యమవుతున్న ఆంధ్రసాహిత్యేతిహాసమున, పదుగురు కవి సార్వభౌమ బిరుదాన్ని ధరించిరి. వారు కూచిమంచి తిమ్మకవి, గౌరవజ్జల రామకృష్ణకవి, దుర్భాక రాజశేఖర శతావధాని, పుట్టపర్తి నారాయణాచార్యులు, యస్. టి. జ్ఞానానంద కవి, వడ్డాది సీతారామాంజనేయ కవి, వరకూరు వేంకట శాస్త్రి, వావికొలను సుబ్బారాయ కవి, శ్రీనాథుడు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి. ఈ కవి సార్వభౌములందరి సాహిత్య సృష్టిలో రామాయణ స్పర్శ ఉండి యుండవచ్చు. కానీ వీరిలో, ఆధునిక కాలమున హేతువాద ధోరణి పెచ్చుమీరి ఇతిహాసాలకు వక్రభాష్యాలు పుట్టుకొస్తున్న తరుణంలో అట్టి వక్ర భాష్యాలను ఖండించి నిలిచిన ఆర్ష వాఙ్మయోద్ధారకుడు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి. వీరి రామాయణమే శ్రీకృష్ణ రామాయణము. శ్రీకృష్ణ రామాయణము సమన్వయ సిద్ధాంత ప్రాతిపదికన వ్రాయబడిన రామాయణమని నిరూపించుటయే ఈ వ్యాస ముఖ్యోద్దేశ్యం. ఈ ఉద్దేశ్యాన్ని నెరవేర్చుటకు మూల రామాయణాన్ని, ఆధ్యాత్మ రామాయణాన్ని, ఆనంద రామాయణాన్ని, తెలుగులో వెలువడిన రంగనాథాది రామాయణాలను ప్రాథమిక వనరులుగా స్వీకరించి శంబూక వధ మొదలైన గ్రంథాలను ద్వితీయ వనరులుగా స్వీకరించి తులనాత్మక పద్ధతి ఆలంబనగా ఈ వ్యాసాన్ని కూర్చదలచాను. ఈ పద్ధతితో పాటు, ఈ వ్యాస రచన ప్రధానంగా శ్రీకృష్ణ రామాయణ రచనాప్రణాళిక పైన జరుగుచున్నది కావున ఈ వ్యాస నిర్మాణానికి గ్రాంథిక విమర్శ పద్ధతి ఉపయుక్తమని తోచినది. ఇక చారిత్రక విమర్శ పద్ధతినుపయోగించి శ్రీకృష్ణ రామాయణము ప్రకటించు సమయమున తెలుగు నాట నెలకొన్న పరిస్థితులను వివరించి శ్రీకృష్ణ రామాయణ ఆవశ్యకతను తెలియజేయదలచాను. చివరగా కృతిని గూర్చి విచారించు సందర్భమున కృతికర్త వ్యక్తిత్వము, శేముషిని గూర్చి వివేచన చేయుట వివేకమని శ్రీకృష్ణ స్వీయ చరిత్రము, శ్రీకృష్ణ కవి జీవితమును విశ్లేషించి, కవి జీవిత విమర్శ పద్ధతిని కూడా వ్యాస నిర్మాణమున ఉపయోగించాను.*

**Keywords:** కవి సార్వభౌముడు, ప్రసన్న వాల్మీకి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, శ్రీకృష్ణ రామాయణము, సమన్వయ సిద్ధాంతము, శాస్త్రేతిహాసము, వైకుంఠ జీవునివేదన.

## 1. ఉపోద్ఘాతం:

భారతానురక్తుడైన నేను భారత సంబంధ గ్రంథములను అధ్యయనం చేస్తున్న కాలమున మహాభారత చరిత్రమనే గ్రంథాన్ని చదివాను. ఆ గ్రంథ రెండవ ముద్రణ ఉపోద్ఘాతంలో, గ్రంథకర్తయైన పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి, పలుమార్లు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి పేరును ప్రస్తావించగా, అప్పుడే నేను శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి అనే విమర్శకుడున్నాడని తెలుసుకుంటిని. సుమారు పదిహేను పుటలున్న ఆ ఉపోద్ఘాతము చదివిన తరువాత, తన నేత్ర రోగమును సైతము లెక్కచేయక మహాభారత చరిత్రమును రచించిన పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి పైన ఆదరాభిమానాలు ఏర్పడెను. ఆ క్రమంలోనే వీరి గ్రంథాన్ని నానా విధాల విమర్శించి, కోర్టుకు లాగి ఇక్కట్ల పాలు చేసిన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, అహంభావి అని భావించాను. ఆ తరువాత మహాభారత చరిత్రమును పూర్తిగా అధ్యయనము చేసి, భారతాన్ని చారిత్రక దృష్టితో చూడడం విజ్ఞానమే అయినా, అలా చూడడం వలన భారతము పైన అపవాదులు వచ్చే ఆస్కారమున్నదని, అంతేకాక అందులో పెండ్యాల చేసిన కొన్ని విపరీత వ్యాఖ్యల వల్ల భావితరాలకు అందునా హేతువాదులకు, నాస్తికులకు మహాభారత చరిత్రము ఊతముగా నిలుస్తుందని గ్రహించి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి చర్యలు కొంతవరకు సముచితమనే భావించాను. ఆ తరువాత తెలుగునాట హేతువాద దృక్పథానికి ఆద్యుడైన కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి రచించిన కురుక్షేత్ర సంగ్రామమనే నాటకాన్ని చదివి, కేవల హేతువాద దృష్టితో భారతాన్ని చూస్తే ఇన్ని పెడర్థములు తీయవచ్చా? అని అనుకుంటూ ఈ నాటకముపై ఎవరైనా విమర్శలు చేసారా? అని గ్రంథాన్వేషణ చేస్తున్న సమయాన, ఈ నాటకము పై శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి తన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ " నేను ఇంతవరకు నాటక విమర్శలు చేయలేదు. ఇకమీద చేయవలసి వస్తే ఈ నాటకం తోనే ప్రారంభిస్తానని " వారన్నట్లు ఒక గ్రంథమున చదివితిని, కానీ ప్రస్తుతము నాకు ఆ గ్రంథము జ్ఞప్తికి లేనందున ఆ గ్రంథ వివరాలను ఉటంకించలేకున్నాను. ఈ రెండు అంశాలు నేను శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి రచనలు చదవడానికి దోహదం చేశాయి.

### 1.1 శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి (29 అక్టోబర్, 1866 - 29 డిసెంబర్, 1960) :

**పునర్జీవిత శ్రీనాథ**
**అపరాంధ్రీ సరస్వతీ**
**రాశీ భూతాత్మ విశ్వాసః**
**కృష్ణ శాస్త్రిర్మహా కవిః** [1]

అపరశ్రీనాథుడైన శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి రాశీభూతమైన ఆంధ్రసరస్వతీ స్వరూపం. వీరు వెలనాటి వైదిక బ్రాహ్మణులు, కౌశికసగోత్రులు, ఆపస్తంబ సూత్రులు. వీరి తల్లిదండ్రులు వేంకట సుబ్బసోమిదమ్మ, వేంకటసోమయాజి. ఎర్నాగూడెము వద్దనున్న దేవరపల్లి వీరి జన్మస్థానం. రాజమహేంద్రవరము వీరి నివాసము. అష్టావధాన, శతావధాన, సహపఠన మున్నగు ప్రక్రియలతో, సద్గోష్ఠులతో, రాజాస్థానాలలోని సత్కారాలతో, కవిపండిత పీఠముల గౌరవాదరణలతో, వాదోపవాదాలతో, చర్చలతో కళకళలాడిన ఆంధ్ర సాహిత్య వైభవము శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి తోనే అంతరించినదని వారి జీవిత చరిత్ర ద్వారా విశదమవుతుంది.

## 1.2. శేముషి :

ఇతిహాసాదులను ఆంధ్రీకరించుట సులభమైన కార్యముగా కనిపించుటలేదు. భారతాంధ్రీకరణను కవిత్రయముగా పేరు గడించిన శబ్దశాసనుడైన నన్నయ భట్టారకుడు, కవిబ్రహ్మయైన తిక్కన సోమయాజి, ప్రబంధ పరమేశ్వరుడైన ఎఱ్ఱాప్రగడ కలసి మూడు వేరువేరు కాలాలలో నాలుగు శతాబ్దాల వ్యవధిలో రచించారు. ఇక తొలత రామాయణాంధ్రీకరణకు పూనుకున్న రంగనాథ రామాయణ కవులు ముప్వురు, ఆపై భాస్కర రామయణాన్ని రచించిన భాస్కర కవులు నల్వురు. అటుపిమ్మట భాగవతాంధ్రీకరణను పోతనతో పాటు అతని శిష్యులు ముప్వురు చేసిరి. అట్టి **అలఘు గ్రంథాలైన రామాయణ, భారత, భాగవతాలను అలవోకగా ఆంధ్రీకరించిన అసమాన ప్రతిభా సంపన్నులు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.** గీర్వాణాంధ్రములలో ఉద్దండ పండితులైన వీరు తన పదహారవయేటనే కవిత్వ రచన ప్రారంభించుట విశేషము.

వీరు శ్రీకృష్ణ భారతము, శ్రీకృష్ణ రామాయణము, శ్రీకృష్ణ భాగవతము, నైషదీయ చరితము, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిరూష్మ్య నిర్వచనైకాదశాక్షరి, జగద్గురు చరిత్రము, శకుంతల చరిత్రము, తిక్కన చరిత్రము, భద్రాచల రామచరితము, గణేశ పురాణము, స్కంద పురాణము, భవిష్య మహాపురాణము, బౌద్ధచరిత్ర సంగ్రహము, మహమ్మదు చరిత్రము, ఐరోపా మహాసంగ్రామము, ఆంధ్రరాష్ట్రావతరణము, స్వరాజ్యోదయము, అన్నవరక్షేత్రము, శ్రీకృష్ణ స్వీయచరిత్రము మొదలైన **96 కావ్య, ప్రబంధాలను** కూర్చిరి. ఇవి కాక యజ్ఞఫలము, బొబ్బిలియుద్ధం, సావిత్రీ, భోజరాజ విజయం, మోహినీ మనోహర, శ్రీనాథ కవిరాజీయము, మహాభారత యుద్ధము, ఉత్తర రామచరిత్ర, గాంధీ విజయ ధ్వజం, తిలకమహారాజు, పంచవర్ష ప్రణాళిక వంటి **32 నాటకాలను**, శనైశ్చర, అయితే అంతే, చాణక్య, కల్లూరప్ప, చిత్ర అనే శతకాలను తెనాలి రామకృష్ణ చరిత్రము, కాళిదాస విలాసము, శ్రీకృష్ణ కవిరాజీయము, భారత భాగ్యోదయము, మహాభారత చరిత్ర నిరాకరణము, గ్రామ్య వ్యాకరణం మొదలైన 35 వచన కావ్యాలను, మహాభారతాంధ్రీకరణ విమర్శనము, వేణి సంహార విమర్శనము, రావణ విమర్శనము, సుయోధన విజయ విమర్శనము, కురుపాండవ దాయాభాగ విమర్శనము, ఆంధ్రభాషనుశాసన విమర్శనము వంటి **21 విమర్శన గ్రంథములను** మరియు పాదపూజ, కుక్కకాటు వైద్యము వంటి 5 ప్రహసనములు, శ్రీరామాష్టకము, శ్యామలాష్టకము మొదలైన **9 సంస్కృత గ్రంథములను కవితోపదేశము అనే ఛందో గ్రంథమును, ఆంధ్రనామసర్వస్వము అనే నిఘంటువును** నిర్మించారు.

ఇవ్విధముగ ద్విశతకాధిక గ్రంథములను రచించి సుధీర్ఘ సారస్వత సేవ చేసిన సహస్రమాసజీవి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి. ఈ కృతులను పరిశీలించగా వీరు కవి మాత్రమే కాక విమర్శకులని కూడా తెలుస్తుంది. అట్లే వీరు **జాతీయోద్యమ కవిత్వాన్ని** కూడా రచించినట్లు తెలుస్తుంది. వీరు **కృతికర్తలే కాక కృతిభర్తలౌట విశేషము!** అంతేకాక **గౌతమి అనే దినపత్రికను, స్వరాజ్యోదయం, వందేమాతరం వంటి పక్షపత్రికలను కళావతి, మానవసేవ, వజ్రాయుధము అనే మాస పత్రికలను స్థాపించారు.**

ఇక వీరు వేదవేదాంగములను అవపోసన పట్టిన ఘనాపాఠి. **పితరం యాజయే త్పుత్రః పితాపుత్రం న యాజయేత్** అనే శాస్త్ర వచనాన్ని అనుసరించి తన పద్దెనిమిదవ యేట తన తండ్రి యజ్ఞమునవే స్వయంగా అధర్వము చేశారు. వీరి శ్రౌతస్మార్తవిద్యాపాండిత్యము గూర్చి శ్రీకృష్ణ కవి జీవితములోని ద్వితీయ ప్రకరణము తెలియజేస్తుంది. దీనిని అనుసరించి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి శ్రౌత సంబంధమైన అన్ని రహస్యములు తెలిసిన వేద విద్యా విశారదుడు.

శతావధానులైన వీరికి **మహా మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవి సార్వభౌమ, ఆంధ్ర వ్యాస, అభినవ శ్రీనాథ, ప్రసన్న వాల్మీకి, విశ్వకవి, కవిబ్రహ్మ, మహాకవి** అనే బిరుదులున్నాయి. అదేవిధంగా **కనకాభిషేక గౌరవము, కవి గండెపెండేర సత్కారము, గజారోహణము, మణికిరీటము, శిలావిగ్రహ ప్రతిష్ఠ, సువర్ణపూజ మొదలైన సత్కారాలు, ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవి** అనే గౌరవము తనకు దక్కినట్లు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి తన శ్రీకృష్ణ స్వీయ చరిత్రము, చతుర్థోల్లాసములో[2] స్వయంగా చెప్పుకున్నారు. ఇవన్నీ వీరి శేముషి వైభవానికి ప్రత్యక్ష నిదర్శనాలు.

## 1.3. శ్రీనాథునితో సామ్యము :

శ్రీనాథుని తండ్రి మారన సంతానము లేక తపస్సు చేసి శ్రీమహావిష్ణువు అనుగ్రహముచే శ్రీనాథుని పొందెను. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి తండ్రి వేంకట సోమయాజులు సంతానము లేక తపస్సు చేసి గరుడారూఢుడైన శ్రీమహావిష్ణువు అనుగ్రహముతో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిని పొందెను. మారన కొండవీటి అనవేమారెడ్డి అనుగ్రహంతో దేశముఖుడై ప్రఖ్యాతి పొందగా, వేంకట సోమయాజులు కోటా రామభూపతిదేవు అనుగ్రహంతో మంత్రియై పేరు గడించిరి. శ్రీనాథునికి ఆయావిద్యలలో జన్నరాయుడు, ఘోడెరాయ భీమేశ్వరుడు, మృత్యుంజయుడు, భట్టారకుడు అనే నలుగురు గురువుల ఉండగా, కృష్ణమూర్తి శాస్త్రికి కావ్యశాస్త్రమును నాగలింగశాస్త్రి, శ్రౌతమును బాపయ్య సోమయాజి, స్మార్తమును బ్రహ్మ సోమయాజి, ధర్మశాస్త్ర పురాణాలను తండ్రియైన వేంకట సోమయాజులు నేర్పారు. ఈ విధంగా వీరికి కూడా నలుగురు గురువులు ఉండెను. శ్రీనాథుడు పెద కోమటి వేమారెడ్డిని ఆశ్రయించగా, ఇతను శ్రీచంద్రమౌళిప్రసాద భూపాలుని ఆశ్రయించెను. ఇరువురు వేదశాస్త్ర, శ్రౌతాది విద్యలలో నేర్పరులు. బహుగ్రంథకర్తలు. నానాదేశములను తిరిగి, అనేక సంస్థానములను సందర్శించి పెద్దమొత్తంలో ధనాన్ని పొందినవారు. అనేక విద్యావివాదములలో గెలుపొందినవారు. శ్రీనాథుడు ప్రౌఢదేవరాయల ముత్యాలశాలలో కనకాభిషేక గౌరవాన్ని పొందగా, ఈయన క్షీరారామ రామలింగేశ్వర సన్నిధిలో కనకాభిషేక గౌరవాన్ని పొందాడు. ఇరువురి పైన శృంగారాగ్రేసరులనే కింవదంతులున్నాయి. అతడు బొడ్డుపల్లెను గుత్త చేసి నష్టపోగా, ఇతను పేటలంకను గుత్త చేసి నష్టపోయాడు. ధనహీనులై దేశదేశములు తిరిగి నానా విధములైన కష్టాలను చవి చూశారు. వీరిరువురకు పుత్రవియోగము కలిగినది. ఇరువురు సహస్రమాస జీవులే! అతడు బ్రాహ్మీ దత్త వరప్రసాదుడు, ఇతడు బాల త్రిపుర సుందరీ మహామంత్రోపాసకుడు.

ఈ సామ్యముల దృష్ట్యా శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిని అపర శ్రీనాథుడని అనవచ్చు. బాల్యము నుండి వీరికి శ్రీనాథుడనిన అమితమైన భక్తి, గౌరవము. శ్రీనాథుడు స్వయంగా వీరికి సాక్షాత్కరించి భారతాంధ్రీకరణ చేయమని ఆదేశించినట్లు శ్రీకృష్ణ స్వీయ చరిత్రము, శ్రీకృష్ణ కవి జీవితము, శ్రీకృష్ణ భారతావతారికలు తెలుపుతున్నాయి.

## 1.4. ఉపాసన బలిమి :

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, లక్ష్మీనరసింహ సాలగ్రామమును, గరుడ విగ్రహాన్ని నిత్యము ఆరాధించేవారు. ఉపనయన సమయంలో ఉపదేశముగా గ్రహించిన గాయత్రీ మహా మంత్రాన్ని ఉపాసించి, ప్రత్యహము సహస్రగాయత్రీ మంత్ర జపము చేసి ఆ దేవి అనుగ్రహము పొందారు. నివటూరి నాగలింగారాధ్యుల వద్ద షడక్షరీ మంత్రాన్ని ఉపదేశంగా తీసుకున్నారు. (షడక్షరీ అనగా ఓంకార సహిత పంచాక్షరి) పిండిశాస్త్రుల వద్ద తన ఇష్ట దైవమైన శ్రీ బాలత్రిపురసుందరీ మహామంత్రమును ఉపదేశముగా

పొందారు. ఆ తరువాత శ్రీభోదానందభారతీమాంతాచార్యుల వద్ద రాజశ్యామలను ఉపదేశముగా పొందినట్లు తెలుస్తుంది. అంతేగాక వీరు **మంత్రశాస్త్రములో పాదుకాంత దీక్షితులని, మహాసామ్రాజ్యాభిషక్తులని** అనంతపంతుల రామలింగస్వామి శ్రీకృష్ణకవిజీవితములో తెలియజేశారు.[3] పాదుకాంతదీక్ష అనగా గురువు తన శిష్యుడికి షోడశిమంత్రాన్ని ఉపదేశించి ఇచ్చేదీక్ష. దీనిని పాదుకాదీక్ష, మహాపాదుక అని కూడా అంటారు. పూజ నిమిత్తం గురువు పాదుకలను ఇచ్చే సంప్రదాయం ఉంది. శ్రీ శృంగేరి, శ్రీ విరూపాక్ష శ్రీ పీఠాధిపతి, శ్రీ కల్యాణానందభారతీ మాంతాచార్యస్వామి పాటించిన సంప్రదాయం ప్రకారం పాదుకాంత దీక్షలో మొదట బాలను (త్ర్యక్షరి), తరువాత పంచదశిని, చివరి దశలో షోడశిని ఉపదేశించే వారు. దేశంలోని అన్య ప్రాంతాలలో మొదట పంచదశిని, అనంతరం షోడశిని ఉపదేశిస్తారు. (శ్రీం అనే బీజాక్షరాన్ని శ్రీ విద్యాపంచదశాక్షరికి కలిపితే అది శ్రీ విద్యా షోడశాక్షరి అవుతుంది) ఇట్టి మంత్రాలు గురుముఖతః ఉపదేశం పొంది, అనుష్ఠించి వీరు మహోపాసకులైరి. ఈ విధంగా భగవదానుగ్రహానికి పాత్రులైన వీరు తన చేతితో విభూతి మంత్రించి ఇచ్చినా, జపతీర్థమిచ్చినా, పిశాచ బాధలు, గ్రహ బాధలు, సామాన్య జ్వరములు నశిస్తాయని ప్రజలు విశ్వసించేవారని శ్రీకృష్ణ కవి జీవితములోని సప్తమ ప్రకరణము ఋజువు చేస్తుంది.

## 2. పూర్వ పరిశోధనలు :

ఇవ్విధముగ వేదశ్రౌతస్మార్తధర్మశాస్త్రములందు పరిపూర్ణ సాధికారత గలిగి చతుర్విధకవితా ప్రక్రియల్లో ఆరితేరిన కవి విమర్శకులు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి. నేటికి నాకు లభించిన సమాచారము మేరకు వివిధ విశ్వవిద్యాలయాల పరిధిలో వీరి పైన 12 పరిశోధనలు జరిగాయి.[4] అందులో అయిదు ఎం.ఫిల్ పరిశోధనలు కాగా తక్కిన ఏడు పి.హెచ్.డి పరిశోధనలు. నా పరిశోధన వ్యాస నిర్మాణం కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, శ్రీకృష్ణ రామాయణ రచనా ప్రణాళిక పైన జరుగుతున్నది కావున ఆ గ్రంథము పై వెలువడిన పరిశోధనల వివరాలు క్రింద పొందుపరుస్తున్నాను.

1989 వ సంవత్సరం, ఆంధ్ర విశ్వవిద్యాలయం పరిధిలో, జె.సూర్యప్రకాశరావు పర్యవేక్షణలో **శ్రీకృష్ణ రామాయణము-సమగ్ర సమీక్ష** అనే అంశము పై ఎస్. కృష్ణమూర్తి సిద్ధాంత గ్రంథాన్ని రచించి పి.హెచ్.డి పట్టా పొందారు. 1992 వ సంవత్సరం, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం పరిధిలో, జె.వి. సుబ్బారాయుడు పర్యవేక్షణలో **శ్రీకృష్ణ రామాయణము-సాహిత్యానుశీలనము** అనే అంశము పై వి. స్వర్ణలత సిద్ధాంత గ్రంథాన్ని రచించి పి.హెచ్.డి పట్టా పొందారు. ఈ రెండూ అముద్రిత సిద్ధాంత గ్రంథాలే. ఇంతకుమించి వీరి రామాయణము పైన పరిశోధన జరిగినట్లుగా కనిపించుటలేదు. **మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి** తెలుగులో రామాయణాలు అనే లఘు గ్రంథమున శ్రీకృష్ణ రామాయణము గూర్చి పేర్కొంటున్న సమయంలో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి సారస్వతసేవ గూర్చి తెలుపుతూ "***19, 20 శతాబ్దాల నడిమి కాలమున తెలుగులో అనంతమైన రచన చేసిన వారు. వారి గ్రంథములు రెండువందలయేబది వరకు ఉన్నవని అన్నారు.***"[5] ఇంతటి సాహిత్యసృష్టి చేసిన ఈ మహాకవి పైన పరిశోధనలు నేడు జరగకుండుట శోచనీయము. వీరి శ్రీకృష్ణ రామాయణాన్ని గూర్చి తెలుసుకునే ముందు రామాయణం గూర్చి పరిశీలిద్దాం.

## 3. రామాయణ ప్రాచీనత :

చారిత్రకదృష్టితో చూస్తే వేదముల తరువాత కూర్చబడినది రామాయణము. కానీ ఋగ్వేదములో రామాయణ ప్రసక్తి ఉండుట గమనించదగ్గ విషయము.

**ప్రతద్దుశ్శీ మే పృధవానే వే నే ప్రరామేవోచ మసురేమఘవత్సు**
**యేయుక్త్యాయపంచశతాయు స్మపథా విశ్వాద్యేషాం**

పై ఋక్కు ఋగ్వేదం, దశమ మండలం, 93వ సూక్తములోని 14వ ఋక్కు. ఇందున రామ, రావణుల ప్రసక్తి కనబడుతుంది. అట్లే వేదములోని నాలుగవ మండలం, 57వ సూక్తమున 6,7,8 ఋక్కులలో సీతాదేవి ప్రస్తావన కనబడుతుంది. ఇవి కాక మరికొన్ని ఋక్కులు కూడా కలవు. (పరిశోధకులు వేదములో రామాయణ ప్రస్తావన అనే అంశము పైన పరిశోధన వ్యాసాన్ని రచించవచ్చు) దీనిని బట్టి రామాయణము బహుప్రాచీనమని అర్థమవుతుంది.

## 4. వాల్మీకి రామాయణ ప్రాశస్త్యం:

రామాయణాన్ని తొలత కూర్చినది అలంకార శాస్త్రమర్యాదలను పాటించు ప్రాచీనకవి గాని, కవిత్వమును చెప్పు అర్వాచీనకవి గాని కాదు. క్రాంతదర్శియైన వాల్మీకి మహర్షి. వీరి రామాయణము కావ్యమా? ఇతిహాసమా? అనే చర్చ అప్రస్తుతం. వీరి రామాయణము కావ్యేతిహాసము. కావ్య, ఇతిహాస రచనలో వీరు తరువాతి కవులందరికీ మార్గదర్శకులుగా నిలిచిన తీరును, వీరి గురుత్వాన్ని, వీరి ఋషిత్వాన్ని తెలుపుతూ రాజశేఖరుడు తన కావ్యమీమాంసా, తృతీయోధ్యాయము, కావ్యపురుషోత్పత్తిఃలో వాగ్దేవత వాల్మీకికి రహస్యముగా, ఛందోగ్రథితములగు వాక్కులను అనుగ్రహించినదని వ్రాస్తూ- **మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః/ యత్క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితమ్** అనే శ్లోకానికి వ్యాఖ్యానం చేస్తూ, **తతో దివ్యదృష్టిర్దేవీ తస్మా అపి శ్లోకాయ వరమదాత్, యదుతాన్యదన ధీయానో యః ప్రథమమేనమధ్యేష్యతే స సారస్వతః కవిః స పత్స్యే ఇతి. స తు మహామునిః ప్రవృత్తవచనో రామాయణమితిహాసం సమదృభత్, ద్వైపాయనస్తు శ్లోక ప్రథమాధ్యాయీ తత్ప్రభావేన శతసాహస్రీం సంహితాం భారతమ్**[6] అంటారు.

దివ్యదృష్టిచే పై శ్లోక నిర్మాణమును వాల్మీకి చేశాడని తెలుసుకున్న సరస్వతీదేవి అంతవరకు ఏమీయు అధ్యయనము చేయనివాడు మొట్టమొదటగా ఈ శ్లోకమును పఠించినచో సారస్వతకవి (సరస్వతీ ప్రసాదపాత్రమగు కవి) యగునని ఈ శ్లోకమునకు కూడా వరమిచ్చెను. ఈ విధముగా అనాయాసముగా వెడలిన శ్లోకము నాందిగా ఆ వాల్మీకి మహర్షి రామాయణమనెడి ఇతిహాసమును రచించెను. ప్రప్రథముగ ఈ శ్లోకమునే చదివిన ద్వైపాయనుడు, దీని ప్రభావముచే, శతసాహస్రసంహితారూపమైన భారతమును రచించెను. ఇట్టి రామాయణమును **రామాయణమహాకావ్యం సర్వవేదార్థసమ్మతమ్**[7] అని స్కందపురాణము తెలుపుతుంది. దీనిని బట్టి రామాయణము మహాకావ్యమని, సర్వ వేదములసారమని తెలుస్తుంది. రామాయణ వైపుల్యమును రూఢము చేస్తూ ఇలపావులూరి పాండురంగారావు, రామాయణ పరామార్థము అనే లఘు గ్రంథమున- ***"కథగా చూచినా, కావ్యంగా భావించినా, నీతిసంహితగా నిర్వచించుకున్నా, యోగశాస్త్రంగా అన్వయించుకున్నా, రామాయణం సారస్వత పారిజాతంగా గోచరిస్తుంది. సామాన్య జనులకు అది చక్కని కథ. రసజ్ఞులకు అది రమణీయ కావ్యం. నీతి కోవిదులకు నీతి శాస్త్రం. యోగులకు యోగశాస్త్రం. మంత్రసాధుకులకు మంత్ర రాజం. ఇలా ఏ దృష్టితో చూస్తే అలా గోచరించే పలు వన్నెల భవ్య చిత్రాన్ని, ఇంద్రధనస్సు లాంటి ఈ ఉద్గ్రంథం ప్రపంచానికి అందిస్తుందన్నా***రు."[8]

## 5. రామాయణ సాగరం :

వాల్మీకి రామాయణమేర్పడిన తరువాత ఎన్నెన్నో రామాయణాలు, ఎన్నెన్నో భాషలలో, ఎన్నెన్నో విధాల వెలువడ్డాయి. అసలు ఇంతవరకు ఎన్ని రామాయణాలు వెలువడ్డాయని చెప్పుట కష్టము. అందువల్ల ఈ అనేకానేక రామాయణాల గూర్చి వాటి మధ్యనున్న వైవిధ్యాన్ని గూర్చి చెబుతూ ఎ. కె. రామానుజన్ ***"రామాయణ సంప్రదాయాన్ని ఒక సరస్సు లాంటిది అంటాడు. అందులో కథా వస్తువు, పాత్రలు, వాటి పేర్లు, జరిగే ప్రదేశం, సంఘటనలు, వాటి మధ్య సంబంధాలు - అన్నీ వుంటాయి. అందులో నుంచి ప్రతి రామాయణం ఒక రూపాన్ని సంతరించుకుని వస్తుందంటారు."*** [9]

ఇక రామాయణ కథనాలలో వైవిధ్యాన్ని తెలుపుతూ పౌలా రిచ్మన్ ***"ఈ వివిధ రామాయణ రచనలు అంతకు ముందు వాటితో సరిపోలుతూనో, విభేదిస్తూనో ఏదో ఒక సంబంధం కలిగి వుండటమే కాక, అవి ఒకదానితో ఒకటి ఒక సున్నితమైన బంధాన్ని కూడా కలిగివుంటాయి. ప్రతి రచయిత ఇందులో మునిగి, ఒక రూపాన్ని అందుకుని పైకి వస్తాడు. ప్రతి రచన ఒక కొత్త నిర్మాణాన్ని, తాజా సందర్భాన్ని తీసుకువస్తుంది. రామానుజన్ పోలిక ప్రకారం రామాయణ రచనలో కొంత సంయమనము వుంటుంది. కొంత ప్రవాహ శీలత వుంటుంది. ఈ ప్రవాహ శీలత వలననే వైవిధ్య భరితమైన రామాయణాలు ఆవిర్భవించాయి. రొమిల్లా థాపర్ వలనే రామానుజన్ కూడా రామాయణ రచనలన్నీ ఆయా సందర్భాలను బట్టి ఉంటాయంటాడు. అది ఒక్కొక్క మత సమాజాల నమ్మకాలపై ఆధారపడి ఉండొచ్చు. స్థానిక సాహితీ సంస్కృతులపై ఆధారపడి ఉండొచ్చు. సామాజిక సంబంధాల నిర్మాణం పై ఆధారపడి వుండొచ్చు."*** [10]

పైన పేర్కొన్న అభిప్రాయాలు భిన్న రామాయణాలు ఏర్పడడానికి గల కారణాలను, భిన్న రామాయణాలలోని వైవిధ్యాన్ని సుస్పష్టం చేస్తున్నాయి.

## 6. రామాయణ అధ్యయనము :

### 6.1. రామాయణ అధ్యయనమున ఆటంకాలు :

**ప్రక్షిప్తాలు:** రామాయణ అధ్యాయనములో కలిగే ప్రధాన ఆటంకాలు ప్రక్షిప్తాలు. ప్రాచీన కాలమున సృష్టించబడిన గ్రంథములు కాలక్రమమున నశించగా, అందులో కొన్ని భాగములు లుప్తము కాగా, కొన్ని ప్రక్షిప్తములు వచ్చి చేరేవి. ఇలా శాస్త్రవిరుద్ధములైన అంశాలు, కవి ఉద్దేశ్యమునకు భిన్నమైన విషయాలు, గ్రంథానికి తలవంపులు తెచ్చు కల్పనలు గ్రంథములో చేరి భిన్న పాఠాంతరములేర్పడెను. వీటినే ప్రక్షిప్తాలని వ్యవహరిస్తాము.

వాల్మీకి రామాయణమున ప్రక్షిప్తములేర్పడిన విధానాన్ని **పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి** వివరిస్తూ, ***"సంస్కృతవాఙ్మయమునకు వాల్మీకి ప్రథమకవి యనియు, రామాయణమే ప్రథమ కావ్యమనియు బండితుల యభిప్రాయము. అయినను దృశ్యమాన రామాయణమంతయు వాల్మీకి కృతమని చెప్ప వీలులేదు. అందిటీవల బెక్కులు నవీనాంశములు చేర్పబడినవి. బౌద్ధజైనశైవాది మతములు విజృంభించు కాలమున నాయామతోన్మత్తులగు పండితులు తత్పూర్వము నందుండిన నిర్దిష్టములగు గ్రంథములలో దమతమ మతాంశముల జొప్పించి యవి ప్రాచీనతమములె యని లోకము తలుపునట్లు చేసిరన్నారు."*** [11] దీనిని బట్టి కొందరు తమ భావజాలానికి తగినట్లుగా శ్లోకాలను రచించి అవి వాల్మీకి కృతములేనని నమ్మబలికి యుందురు. ఈ ప్రక్షిప్తముల విషయమై **మల్లాది సూర్యనారాయణ శాస్త్రి,**

సంస్కృత వాఙ్మయ చరిత్ర, లౌకిక వాఙ్మయము, ద్వితీయాధ్యాయము, రామాయణ ప్రక్షిప్తభాగ విచారణలో మరికొన్ని అంశాలను పేర్కొన్నారు.[12] వీరితో పాటు **మహామహోపాధ్యాయ పుల్లెల శ్రీరామచంద్రుడు** కూడా రామాయణ ప్రక్షిప్తాల విషయమై చర్చించియున్నారు.

**వాల్మీకి పేరుతో వచ్చిన ఇక్కట్లు :** ఆనంద రామాయణం గూర్చి రామాయణ పరిశోధకులకు బాగుగా తెలిసియుండును. నేటి కాలమున విశ్వవిద్యాలయాలపరిధిలో రామాయణ పరిశోధనలు చేయవలసి వచ్చినప్పుడు వాల్మీకి రామాయణము, ఆధ్యాత్మరామాయణముతో పాటు ఆనంద రామాయణాన్ని కూడా ప్రామాణికంగా స్వీకరిస్తున్నారు. ఇందుకు కారణం **ఆనంద రామాయణములోని ఆశ్వాసాంతాలు వాల్మీకి పేరిట ఉండడమే.** ఈ అంశాన్ని పట్టుకున్న ఆధునికులు ఆనంద రామాయణం కూడా వాల్మీకి కృతమనే భావిస్తున్నారు. వాస్తవానికి ఇందులో వాల్మీకి రామాయణానికి భిన్నమైన, అసంబద్ధమైన అంశాలెన్నో కనిపిస్తాయి. శైలిని బట్టి కూడా ఇది వాల్మీకి కృతము కాదని తెలుస్తుంది. ఈ విషయమై **ఆనంద్ రామాయణ్ కా సాంస్కృతిక్ అధ్యయన్** పేరుతో గ్రంథాన్ని రాసిన **అరుణ్ గుప్తా** ఆనంద రామాయణ రచయిత **రామానందుడని** (1299-1411) నిరూపించారు. 16వ శతాబ్దములో వాల్మీకి అనే పేరు గల కవి రామాయణాన్ని రచించి ప్రకటించాడు. ఆ కవి పేరు మీద అది కూడా వాల్మీకి రామాయణమే!
ఇలా అనేకానేక అంశాలు రామాయణ ప్రక్షిప్తాలు వాల్మీకి రామాయణం యొక్క విశ్వసనీయతను దెబ్బతీసాయి.

## 6.2. రామాయణ అధ్యయనమున లోపాలు :

పాఠకులు కవుల రచనాప్రణాళికలను అర్థం చేసుకోక, వ్యక్తి ఆరాధనలో పడి ఆ కవి కృతమే నిజమని నమ్ముట. లేదా తాము చదివిన రామాయణమునే ప్రామాణికమని భావించుట రామాయణ అధ్యయనమున ప్రధాన లోపము.

**రచనాప్రణాళిక ఆవశ్యకత :** ప్రతి కవి కొన్ని లక్ష్యాలను, మౌలిక సూత్రాలను దృష్టిలో ఉంచుకొని రచనలను చేస్తారు. ఈ అంశాలను గ్రంథాదిలోనే గమనించవచ్చు. ఇట్టి రచనా ప్రణాళికను దృష్టిలో ఉంచుకొని నిష్పాక్షిక బుద్ధితో ఆ గ్రంథాన్ని అధ్యయనం చేస్తే కవి హృదయము అర్థమవుతుంది. రచనలో లోతులు తెలుస్తాయి. కావున గ్రంథాధ్యయనముకు మున్నే రచనాప్రణాళికను ఆకలింపు చేసుకొనుట అత్యావశ్యకం.

**వివిధ రామాయణాల రచనాప్రణాళికలు:** వాల్మీకి తరువాత రామాయణమును అగస్త్యవ్యాసాదులు రచించారు. ఇవన్నీ ఋషి ప్రోక్తములగుటచే వీటిని ఆర్ష రామాయణములుగా వ్యవహరిస్తాము. ఆ తరువాత గీర్వాణ లౌకిక సాహిత్యమున రామాయణ సంబంధమైన కొన్ని గ్రంథములను పరిశీలిస్తే ఆయా గ్రంథకర్తలు కొన్ని విశేష ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని సారస్వతసృజన చేసినట్లు తెలుస్తుంది. అందులో మొదటగా పేర్కొనదగినది భాసుని ప్రతిమానాటకం. పదునాలుగేండ్లైన తరువాత రామునకు రాజ్యార్హత ఉన్నదా? లేదా? అనునది ప్రశ్న. ఆపై వనవాసము చేసిన పిమ్మట రామునకు రాజ్యము వచ్చునన్న ప్రసక్తి కైక వరములో కానీ, దశరథుని మాటలో కానీ లేదు. కావున శ్రీరాముని

రాజ్యార్హత పైన ప్రశ్నలు ఉదయించును. ఇట్టి ప్రశ్నలకు సమాధానంగా భాసుడు రచించిన నాటకమిది. ఇందు ధర్మశాస్త్రానుసారము శ్రీరాముని రాజ్యార్హత ఋజువు చేయబడినది. మురారి అనర్ఘరాఘవము రామాయణమున యుద్ధనీతిని వివరించును. మహాకవి కాళిదాసు, భవభూతి, శక్తిభద్రుడు, రామభద్రదీక్షితులు మొదలైన మహాకవులు కూడా కొన్ని రహస్యాలను, శాస్త్రాలను చెప్పడానికి రామాయణాన్ని నియోగించారు. ఆపై ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత, శ్రీవైష్ణవ, శాక్తేయ సాంప్రదాయాలలో రామాయణానికి భాష్యాలు వెలువడ్డాయి.

ఇలా సంస్కృత సాహిత్యమున పుట్టిన రామాయణం ప్రపంచభాషలలో కూడా విస్తరించినది. ఇక ఆంధ్రసాహిత్యమున రామాయణాంధ్రీకరణ ఆరంభము కాకమున్నే జానపద సాహిత్యమున రామాయణ కథలు విస్తరించాయి. ఇందులో అనేకానేక అసంబద్ధ కల్పనలను గమనించవచ్చు. ఆ తరుణమున గోనబుద్ధారెడ్డి రామాయణాంధ్రీకరణకు పూనుకున్నాడు. తెలుగునాట బలంగా నాటుకున్న జానపద రామాయణ మూలాలను కాదని వాల్మీకి రామాయణాన్ని యథాతథంగా ప్రకటిస్తే తన రామాయణానికి జనాదరణ దక్కదని జానపదుల కల్పనలను కొన్నింటిని స్వీకరించి, మరికొన్నింటిని తన కల్పనా చాతుర్యముతో కల్పించి రంగనాథ రామాయణాన్ని కూర్చాడు. నాడు మొదలు నేటి వరకు కవుల ఆలోచనా విధానానికి అనుగుణంగా ఎన్నో రామాయణాలు రచింపబడ్డాయి. ఇలా కవులు తమ రచనాప్రణాళికలకు తగినవిధంగా రామాయణాన్ని రచిస్తున్నపుడు మూల రామాయణంలో కొన్ని మార్పులు చేర్పులు చేస్తారు.

**అవాల్మీకాలు:** తమ రచనాప్రణాళికలను అనుసరించి వాల్మీకి రామాయణంలో లేని అంశాలను కల్పిస్తే అవి అవాల్మీకాంశాలు అనబడతాయి. పైన పేర్కొన్నట్లు భాసుడు మొదలైన మహాకవులు విశేష లక్ష్యాలను దృష్టిలో ఉంచుకొని మూలంలో మార్పులు చేస్తే కొందరు ప్రాచీనార్వాచీన కవులు లౌకిక దృష్టితో రామాయణాన్ని స్వేచ్ఛానువాదం చేయడం, అనుసృజన చేయడం వలన రామాయణములో కల్పితాలు, అవాల్మీకాలు చేరాయి. ప్రామాణిక రామాయణములను గుర్తించ లేకుండుట, జనశ్రుతిలోనున్న రామాయణ గాథలనే నిజమని నమ్ముట, కవుల రచనాప్రణాళికలను అర్థం చేసుకోక ఆ కవుల రచనలే వాస్తవమని భ్రమపడుట వలన ఏది వాస్తవం? ఏది కల్పితం? అని నిర్ధారించుట కష్టమైనది. పైపెచ్చు భారతావనిన వ్యక్తిపూజ మెండు. కావున తమకు నచ్చిన కవి చెప్పిన రామాయణమే నిజ రామాయణమని వాదించుట వల్ల రామయణం యొక్క ఇతిహాసగౌరవము పైన సందేహాలేర్పడి, ఇది పుక్కిటిపురాణము, అవాస్తవమనే అపవాదులు వచ్చాయి. ఇవన్నీ ఆధునిక భావజాలాలు అలవరచుకున్న వారికి దన్నుగా నిలిచాయి.

## 6.3. రామాయణ అధ్యయనము చేయదగిన విధము :

రామాయణము **పాఠ్యే గేయే చ మధురం.**[13] దీనిని బట్టి రామాయణము చదువుకోవడానికి, మధురముగా గానము చేసుకోవడానికి అనువైనదని తెలుస్తుంది. ఈ అంశాన్నే బలంగా పట్టుకున్న మానవాళి రామాయణం

సులభశైలిలో ఉన్నదని, చదవడానికి అనువైనదని, పుణ్యప్రదమని కేవలము లౌకిక దృష్టితో చూస్తున్నారు. వాస్తవానికి రామాయణాన్ని ఎలా అధ్యాయం చేయాలనే విషయాన్ని **బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖ శర్మ** తెలుపుతూ ***"రామాయణం ప్రథమ దృష్టిలో ఒక అద్భుతమైన కావ్యం. మరి కొంచెం లోతుకి వెళితే ఒక ధర్మబద్ధమైన కావ్యం. ఇంకా కాస్త ఓపికతో సాధన చేస్తే ఇది ఉపాసనా శాస్త్రం. ఆ తరువాత అది వేదాంత శాస్త్రం. ఇలా నాలుగు అంశాలు రామాయణంలో పరిశీలించాలి. మొదటగా ఒక అద్భుతమైన కథా వస్తువు. అందులోని పాత్రలు, ఆ పాత్ర చిత్రణ ఇదంతా సాహిత్య దృష్టి. తరువాతది ధార్మిక దృష్టి. మూడవది ఉపాసనాదృష్టి. నాలుగవది తాత్విక దృష్టి. ఈ నాలుగు దృష్టులతో రామాయణాన్ని పరిశీలిస్తే మన జీవితానికి కావలసిన ధర్మార్థకామమోక్షాలు నాలుగు సిద్ధిస్తాయంటారు."***[14] ఈ పద్ధతి వాల్మీకి రామాయణానికి చెల్లుతుంది. ఆ తరువాత ఇతర ఆర్ష రామాయణాలను కూడా ఇలా పరిశీలించవచ్చు.

అయితే భిన్న రామాయణాలను పరిశీలించ వలసి వచ్చినపుడు ఎలా పరిశీలించాలనే విషయాన్ని **టి. ఎస్. గోపాల్** ***"వాల్మీకి గిరి నుండి జనించిన రామాయణగంగ రామసాగరమును చేరి భువనత్రయమును పవిత్రము చేసినట్లే, అనేక ప్రాంతాలలో, కాలములలో, భాషలలో ప్రభవించిన రామాయణ కావ్య స్రోతస్సులు రామసాగరముచే అత్యంత పవిత్రమైనవి. అందుచే వాల్మీకి మహాకవి కృతము కానీ ఏ ఇతర రామాయణమునైన తులనాత్మక ప్రమాణ కోణము నుండి పరిశీలింపరాదు. ఏ గ్రంథమున కాగ్రంథమే స్వతః ప్రమాణము. ఆ మహాత్మ్యము రామకథ యందే కలదంటారు."***[15] వీరన్నట్లు ఏ రామాయణానికి ఆ రామాయణాన్ని పరిశీలిస్తే రామాయణము పై అపవాదులేర్పడవు.

నా మతమున మూల రామాయణాన్ని నిష్పాక్షిక బుద్ధితో అధ్యయనము చేసి, తరువాత ఇతర రామాయణాలను చదివి, అందలి తారతమ్యాలను గ్రహించి, వాల్మీకి హృదయాన్ని అంటిపెట్టుకొని, ఇతర రామాయణాలలోని సారాన్ని ఆస్వాదిస్తే రామాయణసాగరములో తేలియాడవచ్చు. అసలు గ్రంథపఠనము గావించే వారి సంఖ్య నేడు తగ్గింది. పైగా ఆధునికులకు యుక్తమని తోచే విపరీత భావజాలాలతో కొత్త రామాయణాలు పుట్టుకురావడం, వీటిని ప్రచారం చేసే అంతర్జాల మాధ్యమాల వల్ల రామాయణము పైన అపవాదులు పెరుగుతున్నాయి. పైగా ఉద్వేగ భరితమైనటువంటి భావజాలాలున్న సమాజంలో ఉండటము కూడా ఒక కారణమే!

ఇలా ఉద్వేగాలకు తలొగ్గి, రామాయణాన్ని తగు రీతిన అధ్యయనము చేయక, భిన్న రామాయణాలలోని వైవిధ్యాన్ని అర్థం చేసుకోలేక సతమతమవుతున్న ఆధునిక మానవుల మస్తిష్కాలపై హేతువాదం రాజ్యం చేస్తుంది. వీటన్నింటికీ కారణం ప్రజ్ఞాస్థాయి దిగజారడమే. వాస్తవానికి ముందు తరాల వారితో పోల్చితే మన ప్రజ్ఞాస్థాయి దిగజారింది. యుక్తాయుక్త విచక్షణ చేసే విమర్శనాత్మక దృష్టి కూడా లోపించింది. మనము మన ప్రజ్ఞాస్థాయిని మెరుగుపరచుకొని అధ్యయనశీలురమైనపుడు ఈ అపవాదులకు తప్పక సమాధానం చెప్పగలుగుతాము.

అయితే ఇలాంటి పరిస్థితి నేడు కొత్త కాదు. 20వ శతాబ్దపు పూర్వార్ధములోనే ఈ పరిస్థితి ఏర్పడింది. అప్పుడున్న హేతువాదులు, పరిశోధకులు ఈనాటి వారి వలె కాక సునిశిత విశ్లేషణలతో తమ వాదాలను నెగ్గించుకున్నవారు. అలాంటి పరిస్థితుల్లో రామాయణ ప్రాభవాన్ని కాపాడడానికి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి ప్రకటించిన రామాయణమే శ్రీకృష్ణ రామాయణము.

## 7. శ్రీకృష్ణ రామాయణానికి పూర్వరంగం :

### 7.1. ఇరవయవ శతాబ్ది పూర్వార్ధమున తెలుగునాట ఇతిహాసాల స్థితి :

పాశ్చాత్య విద్యా ప్రభావం, పాశ్చాత్య ప్రక్రియల ప్రభావము భారతావని పైన పడి నెమ్మదిగా తెలుగునాట కూడా వ్యాపించింది. ఆ తరుణంలో హేతువాదం, నాస్తికవాదము, ద్రావిడ భావజాలం అనే అధునాతనమైన భావజాలాలు తెలుగులోకి ప్రవేశించాయి. ఈ భావజాలాల ఉనికిని సుస్థిర పరచడానికి ఆయా భావజాలాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న పెద్దలు ఇతిహాసాలకు వక్రభాష్యాలు చెప్పడం ప్రారంభించారు. వీరు మొదటి వర్గము. ఇక రాజకీయ కారణాలను, సామాజిక కారణాలను, తమ వ్యక్తిగత కారణాలను ఆసరాగా చేసుకుని ప్రాంత, జాతి వైషమ్యాలను రెచ్చగొడుతూ వీటన్నింటి మూలాలు ఆర్ష వాఙ్మయమందే ఉన్నవని ఇతిహాసాలను నిందిస్తూ రచనలు చేయువారు రెండవ వర్గానికి చెందినవారు. ఇక చారిత్రక దృక్పథాన్ని, పరిశోధనా దృక్పథాన్ని అలవరచుకున్న మరొక వర్గము ఇతిహాసాదులు చారిత్రకములా? కల్పితములా? అని పరిశోధిస్తూ తమకు తెలియకుండానే పై రెండు వర్గాలకు ఊతమిచ్చిన మూడవ వర్గమువారు.

తెలుగు నాట హేతువాద దృక్పథానికి ఆద్యుడైన కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరికి ఇతిహాసాలపై సాధారణంగా ప్రతి విమర్శకునకు, పరిశోధకునకు వచ్చు సందేహాలే వచ్చాయి. ఆ సందేహాలను తీర్చుకొనుటకు సరియైన గురువును ఆశ్రయించక లేదా సప్రమాణిక గ్రంథములను అధ్యయనం చేయక తన పంథాలో కురుక్షేత్ర సంగ్రామము (1910) అనే గ్రంథాన్ని రచించెను. ఇందులో సుయోధనుడు ఆదర్శమూర్తి, పాండవాదులు అల్పులు. ఈ నాటకము 1922-23లో ఇంటర్మీడియేటు వారికి పఠనీయ గ్రంథము. హేతువాదాన్ని విద్యార్థులకు నేర్పుట తప్పుకాదు. దీనివల్ల విద్యార్థుల్లో ప్రశ్నించే తత్వము అలబడుతుంది. తద్వారా చైతన్యము వెల్లివిరిసి దేశ ప్రగతిలో వారు భాగస్వాములవుతారు. ఈ విషయాన్ని గుర్తించిన ప్రభుత్వం ప్రామాణిక హేతువాద గ్రంథాన్ని వారికి పఠనీయ గ్రంథముగా ఉంచక కేవల హేతువాద గ్రంథాన్ని వారికి పఠనీయ గ్రంథముగా నుంచుట గర్హ్యము. ఆ తరువాత ఉత్తర భారతీయులనిన ఆర్యులని, దక్షిణ భారతీయులనిన ద్రావిడులని, ఆర్యుడైన రాముడు, ద్రావిడుడైన రావణున్ని చంపాడని, దక్షిణ భారతము పై ఆర్యులు తమ ఆధిపత్యాన్ని సాధించడమే రామాయణమని విశ్లేషిస్తూ, రామాయణంలో శూద్రుడైన శంబుకున్ని రాముడు వధించాడని, బ్రాహ్మణుల ప్రోద్బలము వల్లనే శూద్రులకు అన్యాయము జరిగినదని శంబుక వధ (1920) ప్రకటించి సమాజంలోని కుల వైషమ్యాలను రెచ్చగొడుతూ రామాయణము పైన దాడి చేశారు. వీరి బాటలో తర్వాతి కాలంలో ఎందరెందరో నడిచి ఇతిహాసాలకు వక్రభాష్యాలు చెప్పారు.

మహాభారత గాథను చారిత్రకంగా పరిశీలించే కృషి ఆంధ్రలో 1921లో మొదలైంది. ఆ సంవత్సరం మద్రాసులోని గోఖలే హాలులో కట్టమంచి రామలింగారెడ్డి ప్రసంగం ఇందుకు శ్రీకారం చుట్టింది. జరిగినది చరిత్ర. ఇతిహాసమనిన కూడా చరిత్రే! మరి రెంటికి ప్రధానమైన భేదమేమనగా ఇతిహాసము నుండి విచక్షణను, ధర్మమును

వేరుచేస్తే అది చరిత్ర అవుతుంది. అంటే ధార్మిక దృష్టి, యుక్తాయుక్త విచక్షణను వదిలి, తమకున్న పరిజ్ఞానముతో, అనుభవముతో, నిఘంటువు అర్థాలను పట్టుకుని ఇతిహాసాలను పరిశోధించడమన్నమాట. అట్టి వాటిలో పేర్కొనదగినది పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి 1928లో ప్రకటించిన మహాభారత చరిత్రము. విశేషించి ఈ రచన భారతము పైన అనేక అపవాదులకు కారణమైనది. హేతువాదము కన్నా ఈ పరిశోధనా విధానము మిక్కిలి అనర్థదాయకము. వీటితో పాటు సుయోధన విజయము, రావణ కావ్యం వంటి రచనలు వచ్చి ఇతిహాసాలపై దాడులు అధికమయ్యాయి.

## 7.2. కవిసార్వభౌమ బిరుదు సార్థకత :

ఇట్టి క్లిష్ట పరిస్థితిలో, వజ్రాయుధాన్ని ధరించి ఇంద్రుడు అసురులను దునుమాడుతూ సమరాంగణమున తన సార్వభౌమత్వాన్ని ప్రకటించినట్లు, వజ్రాయుధ పత్రికను స్థాపించి ఆధునిక భావజాలాలను ఖండిస్తూ ఆధునికాంధ్రసాహిత్య సమరాంగణమున కవి సార్వభౌమునిగా నిలిచి ఇతిహాస మర్యాదను కాపాడే ప్రయత్నం చేసిన ఆర్ష వాఙ్మయోద్ధారకుడు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి. ఎన్నో వాదోపవాదాలలో, చర్చలలో వీరిదే పైచేయి. వీరి శేముషి, సునిశిత విమర్శ, ఉపాసనబలిమి ముందు ఎందరో విమర్శకాగ్రేసరులు, కవిరాజులు నిలవలేకపోయారు. ఈ కారణము చేత కవి సార్వభౌములెందరున్నా నా మతమున మాత్రము ఆ శ్రీనాథుడు, ఈ అపర శ్రీనాథుడైన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి మాత్రమే కవి సార్వభౌములు. ఈ బిరుదాన్ని ధరించిన వారికి ఎదురులేదని అర్థం. 20వ శతాబ్దపు పూర్వార్ధాన్ని గమనిస్తే శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రంతటి ప్రభుత్వము, గురుత్వము కలిగిన కవివిమర్శకుడు కానరాడు.

## 7.3. శ్రీకృష్ణ రామాయణ ఆవశ్యకత :

పైన పేర్కొన్న ఘటన క్రమాలను పరిశీలిస్తే తెలుగునాట హేతువాదం, చారిత్రక పరిశోధనలు, నాస్తిక ధోరణులు బలపడుతున్నవని అర్థమవుతుంది. ఆ సమయముననే ద్రావిడ భావజాలం బలపడి ఆర్యవర్తానికి చెందిన రాముడు, ద్రావిడుడైన రావణుని వధించాడని చెబుతూ నూతన వ్యాఖ్యానము మొదలైంది. శూద్రుడైన శంబుకుని వధించిన రామునిలో ధర్మమున్నదా? అంటూ సవాళ్లు మొదలయ్యాయి. ఇలా జాతి, ప్రాంత వైషమ్యాలు బలపడి సమాజంలో ఐక్యత లోపించినది. ఇట్టి అధునాతన భావజాలాలే విద్యా, పరిశోధనా రంగాలలో ప్రోత్సహించ బడుతున్నాయి. అట్టి విషమ పరిస్థితుల్లో ఆయా వాదాలను, గ్రంథాలను విమర్శించుట కంటే రామాయణము పైనున్న అపవాదులను సామరస్యంగా పరిష్కరించడమే మేలని తలచిన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి సమన్వయ ధోరణిని ఎంచుకుని జాతి సమైక్యతను కాపాడడానికి, రామాయణం పైనున్న అపవాదులను తొలగించడానికి, భిన్న రామాయణాలను సమన్వయము చేయడానికి తన 82వ యేట తాను గడించిన పరిపూర్ణమైన అనుభవముతో జాగ్రత్తగా రచించిన రామాయణమే శ్రీకృష్ణ రామాయణం.

## 8. కవి సార్వభౌముని రామాయణ రచనాప్రణాళిక :

చాలామంది కవులు యథానువాదము చేస్తే తమ ప్రతిభ ఏమున్నదని భావించి స్వేచ్ఛానువాదము చేయడానికి ఆసక్తి చూపుతారు. ఆ క్రమంలోని మార్పులు చేర్పులు చేస్తారు. ఇట్టి సరళి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రికి నచ్చినట్లుగా కనిపించదు. అందువల్లనే వీరు కవిత్రయము వారి భారత అనుసృజనను విమర్శిస్తూ మహాభారతాంధ్రీకరణ విమర్శనము చేశారు. ఇక శ్రీనాథుని ఆనతి మేరకు శ్రీకృష్ణ భారతమును రచించారు. ఇది వ్యాసభారతానికి యథానువాదము. ఈ విధంగా ఋషిప్రోక్తాలను గౌరవించే వీరు, సమన్వయ సూత్రాన్ననుసరించి, కాలానుగుణంగా రామాయణాన్ని స్వేచ్ఛానువాదం చేసి శ్రీకృష్ణ రామాయణము పేరిట ప్రకటించారు.

**మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి** శ్రీకృష్ణ రామాయణము గూర్చి తెలుపుతూ " ***ఇది సర్వరామాయణసారమంటారు. ఇది వాల్మీకమునకు యథామూలానువాదము కాదు. కథలో చాలా స్వతంత్రత ఉన్నది. తనకు ముందు ఆధ్యాత్మము, వాసిష్ఠము మొదలగు సంస్కృత రామాయణాలు, భాస్కర రంగనాథాది రామాయణములు ఎన్నో వందల కొలది ఉన్నవి. శాస్త్రులగారు ఆయాకృతులలోని చిత్రములగు కథా ఘట్టములను ఏరుకొని మధువ్రతముగా రామగాథను సంతరించిరి. శ్రీపాదకృష్ణ కృతమైన శ్రీకృష్ణరామాయణము అను నామము పరమోచితముగా ఉన్నది."*** [16] అన్నారు.

శ్రీకృష్ణ రామాయణము గూర్చి **జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి** తెలిపిన పద్యం-

**ఆదికావ్యవిశేషము లరసి తెలుపు**
**వ్యత్యయములందు సామరస్యమును గూర్చు**
**గనగవచ్చుజుగుప్సలగడకు ద్రోయు**
**నార్యహితము శ్రీకృష్ణరామాయణంబు** **( శ్రీకృ. రా, పుట ౧ )**

పై పద్యాన్ని బట్టి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, ఆదికావ్యమైన వాల్మీకి రామాయణ ప్రాశస్త్యాన్ని తెలుసుకొని, భిన్న రామాయణములలోని వ్యత్యాసాల మధ్య సామరస్యమును గూర్చుతూ, అసంబద్ధమైన అంశాలను జనహితము గూర్చి సంస్కరించి శ్రీకృష్ణరామాయణము రచించారని తెలుస్తుంది.

ఇక తన శ్రీకృష్ణ రామాయణము గూర్చి **శ్రీపాద కృష్ణమూర్తి** స్వయంగా వ్రాసుకొన్న సీసం-

**ఆది కవీంద్రరామాయణార్థము గల / దయ్య శ్రీకృష్ణరామాయణంబు**
**సకలార్థముల నెప్డు సమకూర్చుటయకాక/ కొన్ని విశేషములెన్ని తెలుపు**
**రావణాసుర దోషరాహిత్యముం జెప్పం/ గైకతప్పులులేమి వాకొను నొగి**
**సతి యహల్యయటంచు జాటించు ననసూయ/ యంగరాగ మహత్త్వ మనువదించు**
**రజక వాగ్గత రఘురామవృజిన మడచు/ శంబుక వధంబు గానట్టిచక్కి జూపు**
**నెందు నెందును గుణముల నేరి చెప్పు / గృష్ణరామాయణం బిది కీర్తితంబు**[17]

ఆదికవి వాల్మీకి రామాయణమే మాతృకగా గలది శ్రీకృష్ణ రామాయణం. వాల్మీకి రామాయణ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని కొన్ని విశేషాలను తెలుపుతూ రావణుని దోషరాహిత్యమును, కైకేయి నిరపరాధిత్వాన్ని ఋజువు చేయునది. సతి అహల్య పాతివ్రత్య నిర్దోషిత్వాన్ని చాటి చెప్పునది. సీతమ్మ పై నిందవేసిన రజకుడు ఉన్మత్తుడని, శంబుకుని రాముడు వధించలేదని చెప్పునది. ఇలా ప్రతి పాత్రలో గుణములను తెలుపునది శ్రీకృష్ణ రామాయణమని పై పద్య భావము.

**ఆది కవీంద్రరామాయణార్థము గల దయ్య శ్రీకృష్ణరామాయణంబు** అనే ప్రయోగము విస్తృతార్థాన్నిస్తుంది. దీనిని బట్టి కవిసార్వభౌములు వాల్మీకి రామాయణములో లోతుగా చెప్పిన అర్థాలను తన రామాయణములో చెప్పారని గ్రహించాలి. వాల్మీకి చెప్పిన ఆ లోతైన అర్థాలేమిటో తెలియాలంటే వాల్మీకి రామాయణ రచనాప్రణాళిక తెలియాలి.

## 8.1. వాల్మీకి రామాయణ రచనాప్రణాళిక :

వాల్మీకి ఆశ్రమమునకు విచ్చేసిన చతుర్ముఖబ్రహ్మ వాల్మీకితో, నారదునిద్వారా నీవు గ్రహించిన శ్రీరాముని చరిత్రను వర్ణించమంటూ-

**రహస్యం చ ప్రకాశం చ యద్వృత్తం తస్య ధీమతః**
**రామస్య సహ సౌమిత్రే రాక్షసానాం చ సర్వశః**
**వైదేహ్యా శ్చైవ యద్వృత్తం ప్రకాశం యది వా రహః**
**తచ్చాప్యవిదితం సర్వం విదితం తే భవిష్యతి**
**న తే వాగనృతా కావ్యే కాచిదత్ర భవిష్యతి**
**కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమామ్** **(శ్రీ.రా , బాల, 3 స, 33-35 శ్లో)**

ప్రతిభామూర్తియైన శ్రీరాముని యొక్క చరితము, లక్ష్మణుని ఉదంతము, సీతా వృత్తాంతము, భరతాదుల గాథలు, రావణాది రాక్షసులకథలు లోకప్రసిద్ధములైనవి. వీటితో పాటు ***(రహస్యం చ ప్రకాశం)*** రహస్యముగా జ్ఞాన సంబంధమైన అంశాలను అనగా శాస్త్రరహస్యాలను వివరింపుము. నారదుడు నీకు స్పష్టముగా వివరింపని రహస్యములు కూడా సాకల్యముగా నీస్ఫురణకు వచ్చును. నీవు రచింపబోవు రామాయణమునందలి అంశములన్నియు సత్యములేయగును. అందలి పదములలో గాని, వాక్యములలో గాని, వాటి అర్థాదులలో గాని ఎట్టి దోషములు ఉండవు. రామకథ పాపములను రూపుమాపునది, వినిన మాత్రముననే పరమానందమును గూర్చునది. కనుక దానిని శ్లోకములలో రచింపుమనెను.

ఇది వాల్మీకి రామాయణ రచనాప్రణాళిక. బ్రహ్మదేవుని ఆదేశానుగుణంగా రామకథతో పాటు రహస్యముగా వేదశాస్త్ర రహస్యాలను వాల్మీకి మహర్షి తన రామాయణములో నిక్షిప్తము చేసాడనడానికి పై శ్లోకాలే సాక్ష్యము. ఈ వాల్మీకి రామాయణము ఏడుకాండలతో, అయిదువందల సర్గలతో, ఇరవైనాలుగు వేల శ్లోకాలతో రచింపబడిన దివ్య గ్రంథము. లౌకిక దృష్టిలో ఇది రామకథే! అలౌకికమైన ఆర్షదృష్టిలో ఇది వేదశాస్త్ర రహస్యాల రత్నమంజూష.

దీనిని బట్టి శ్రీకృష్ణ రామాయణము వాల్మీకి ప్రతిపాదితమైన శాస్త్రరహస్యాలను ఆలంబనగా చేసుకుని వ్రాయబడినదని గుర్తించాలి.

పై అభిప్రాయాలను బట్టి వాల్మీకి ప్రతిపాదితమైన శాస్త్రరహస్యాలే ఆధారంగా కలిగిన శ్రీకృష్ణ రామాయణము, రామాయణము పైనున్న అపవాదులను, వైషమ్యాలను తొలగించునదని, పాత్రల గుణములను ఎంచునదని తెలుస్తుంది. ఈ అంశాలు వీరి సమన్వయములోని కనబడే మౌళికాంశాలు.

పై పైన చూసినపుడు ప్రతి వ్యక్తిలో గుణ దోషాలు కనిపిస్తాయి. కొంత తాత్వికంగా ఆలోచిస్తే ప్రతి వ్యక్తిలో ఉండే జీవుడు వేరు అతని గతజన్మల వాసనబలము వేరు. ఆధ్యాత్మికంగా ఈ జీవుని సృజించి ఆడించి లయము చేయువాడు ఆ పరమాత్మ. ఇలా చూస్తే ఆ పరమాత్ముని విలాసము మేరకు వర్తించే జీవుడు నిర్దోషి అవుతాడు. ఇలా జీవుని దోషరాహిత్యాన్ని చెప్పాలంటే ఆత్మతత్త్వమును జీర్ణించుకోవాలి. ఇంతటి లోతైన ఆత్మతత్త్వమును గ్రహించిన వాడగుటచే శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి రామాయణ పాత్రలలో నిర్దోషిత్వాన్ని ప్రకటించగలిగాడు.

ఈ ఆత్మతత్త్వాన్ని ఆధారంగా చేసుకుని రచించబడిన రామాయణము ఆధ్యాత్మరామాయణము. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి తన రామాయణానికి మాతృక వాల్మీకి రామాయణమేనని చెప్పుకున్నారు. కానీ శ్రీకృష్ణ రామాయణాన్ని అధ్యయనము చేస్తున్నప్పుడు చాలా సందర్భాలలో ఆధ్యాత్మరామాయణ ప్రభావము వీరి రామాయణము పైన ఉన్నదని అనిపిస్తుంది.

## 8.2 . ఆధ్యాత్మరామాయణ ప్రత్యేకత:

వాల్మీకి రామాయణము తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని సంతరించుకున్న రామాయణం వేదవ్యాసులవారి ఆధ్యాత్మరామాయణము. ఇది పార్వతీ పరమేశ్వరుల సంభాషణ రూపములోనున్నది. గ్రంథాదిలో పార్వతీదేవి, పరమేశ్వరునితో

**వదంతి కేచిత్పరమోపి రామః స్వావిద్యయా సంవృతమాత్మసంజ్ఞమ్**
**జానాతి నాత్మానమతః పరేణ సంబోధితో వేద పరాత్మతత్త్వమ్**
**యది స్మ జానాతి కుతో విలాపః సీతాకృతే నేన కృతః పరేణ**
**జానాతి నైవం యది కేన సేవ్యః సమో హి సర్వైరపి జీవజాతైః**
**అత్రోత్తరం కిం విదితం భవద్భిస్తద్ బ్రూత మే సంశయభేది వాక్యమ్(ఆ.రా, బాల, 1 స, 13-15 శ్లో)**

కొందరు తమ అభిప్రాయము మేరకు రాముడు పరబ్రహ్మమే అయినప్పటికీ తన మాయచేత కప్పబడి ఉండునని ఆ కారణమున తన ఆత్మరూపమును తెలుసుకోలేడని అందువల్ల వశిష్ఠాదుల యొక్క ఉపదేశముతో ఆ ప్రభువు ఆత్మతత్త్వమును తెలుసుకొనగలిగెనని అంటారు. అందువల్ల ఆత్మతత్త్వము తెలుసుకున్నవాడైతే ఆ పరమాత్ముడు సీతాదేవి కొరకు ఇంతగా ఎందుకు విలపిస్తాడని నేనడుగుతున్నాను. ఒకవేళ అతనికి ఆత్మజ్ఞానము లేనియెడల, అతడు ఇతర సాధారణ జీవులతో సరిసమానమగును కదా! అప్పుడు అతనిని ఎందుకు పూజింపవలెను? ఈ విషయమున మీరేమిసమాధానమిచ్చెదరని అడుగుతుంది. ఈ ప్రశ్నలకు పరమేశ్వరుడిచ్చిన సమాధానమే ఆధ్యాత్మ రామాయణము. పార్వతీదేవి అడిగిన ప్రశ్నలను బట్టి ఈ రామాయణము నిండా ఆత్మతత్త్వమే ఉంటుందని అర్థమవుతుంది. ఈ ఆధ్యాత్మ రామాయణ ఔన్నత్యాన్ని తెలుపుతూ, మహామహోపాధ్యాయ **శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు** ***"ఆధ్యాత్మ రామాయణం అనే నామధేయాన్ని సార్థకం చేస్తూ ఈ గ్రంథములోని అనేక ఘట్టాలలో ఆత్మతత్త్వము, దానికి సహకారాలుగా ఉండే భక్తి కర్మ మొదలైన విషయాలు చర్చించబడ్డాయంటారు"*** [18] అట్లే ఇందులో ***"అద్వైత సిద్ధాంతానికి సంబంధించిన అంశాలనేకం ఉన్నాయి. పరమాత్మ, జీవాత్మ, వీటి స్వరూపం, సగుణ-నిర్గుణ బ్రహ్మలు, సగుణోపాసన, జగత్తు,***

***జగజ్జీవేశ్వరుల పరస్పర సంబంధం, సృష్టి ప్రక్రియ, మాయ అనే నామాంతరము గల ప్రకృతి, మాయకున్న ఆవరణ, విక్షేప శక్తులు, తద్వారా జగత్కల్పన, సాంఖ్యుల చతుర్వింశతితత్త్వాలు వాటి స్వరూపం, మోక్షము, సాధనాలలో కర్మ భక్తుల ప్రాధాన్యము. తదితర సాధనాలు ఇంకా ఇలాంటి ఎన్నో విషయాలున్నాయంటారు."*** [19]

ఇన్ని ప్రత్యేకతలున్న రామాయణమగుట చేత, రామాయణంలో కనబడే కొన్ని *ప్రధాన పాత్రలలో నిర్దోషిత్వాన్ని చూపడానికి కావలసిన ఆత్మతత్త్వము ఈ ఆధ్యాత్మ రామాయణమున ఉండుట చేత ఇందలి భావాలను కొన్నింటిని కవిసార్వభౌములు గ్రహించినట్లు అర్థమవుతుంది. (వాల్మీకి రామాయణములో కూడా నిగూఢంగా ఆత్మతత్త్వమున్నది. అసలు వాల్మీకి రామాయణములో లేని తత్వము, శాస్త్రము లేదు. కానీ వాటిని గ్రహించాలంటే లోనారసి ఉండాలి)* ఇక తెలుగు నాట ప్రచారంలో ఉన్న జానపదుల రామాయణ గాథలకు కావ్య గౌరవము కలిగించిన గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణము, భాస్కర రామాయణము మొదలైన తెలుగు రామాయణాలలోని కొన్ని కల్పనలను కూడా ఇందులో జత చేశారు. జాతి వైషమ్యాలను రెచ్చగొట్టే మరికొన్ని అంశాలలో కొంత మార్పు చేసి సమన్వయాన్ని పాటించారు. ఇలా భిన్న రామాయణాల సాగరాన్ని మదించి అమృతతుల్యమైన శ్రీకృష్ణ రామాయణాన్ని మనకందించారు.

## 8.3. శ్రీకృష్ణ రాయామణము కాండల విభజన:

లౌకికాలౌకిక విచక్షణతో కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి తన శ్రీకృష్ణ రామాయణమున కాండలలో చేసిన మార్పులను మొదట పరిశీలించి, ఆ తరువాత వీరు సమన్వయము చేసిన కొన్ని అంశాలను పరిశీలిద్దాం.

### బాలోత్తర కాండలు :

రామాయణమున గల బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధకాండలను పూర్వ రామాయణమని, ఉత్తరకాండను ఉత్తర రామాయణమని వ్యవహరిస్తాము. జనబాహుళ్యమున పూర్వ రామాయణమే బహుళ ప్రచారంలో ఉండడం వల్ల ఉత్తరకాండ ప్రక్షిప్తమనే భావన ఏర్పడింది. చాలామంది నిత్య పారాయణలో కూడా పూర్వ రామాయణాన్నే పారాయణ యోగ్యంగా భావించడం వల్ల ఉత్తరకాండ కొంత మరుగున పడింది.

ఇలా ఉత్తరకాండ అలక్ష్యము చేయబడడానికి గల ప్రధాన కారణం ఇందులో శ్రీరామచంద్రుని నిర్యాణము ఉండడమే! కావ్యాన్ని శుభంతో ముగించాలన్న ఉద్దేశ్యంతో యుద్ధకాండలోని సీతారామ పట్టాభిషేక ఘట్టముతోనే చాలామంది కవులు రామాయణాన్ని ముగిస్తారు. పారాయణ చేసేవారు సైతం ఉత్తరకాండలో సీతారాముల ఎడబాటు, వారి నిర్యాణము అనే అమంగళకరమైనటువంటి అంశాలున్నవని మంగళకరమైన పారాయణలో ఉత్తరకాండను వదిలేస్తారు. ఈ విధంగా అలక్ష్యం చేయబడిన ఉత్తరకాండలో పూర్వ రామాయణములో చెప్పని అనేక విషయాలు, రహస్యాలు చెప్పబడ్డాయి.

ఇక వాల్మీకి బాలకాండలో శ్రీరామచంద్రుని బాల్యానికి సంబంధించిన వర్ణన లేదు. రాముని బాల్యము లేనిది బాలకాండ ఎలా అవుతుంది. అందువల్ల బాలకాండ కూడా ప్రక్షిప్తమేనని అంటారు. వాస్తవానికి వాల్మీకి దృష్టిలో

బాలకాండ అంటే యజ్ఞప్రధానమైన కాండ. ఇందులో బాల శబ్దం గురువును సూచిస్తుంది. జీవుని, పరమాత్మతో కలపడమే గురువు చేసే పని. ఇక్కడ జీవుడనగా సీతమ్మ, పరమాత్మ అనగా శ్రీరామచంద్రుడు. అనగా సీతారాములను కలపడమనే కార్యానికి ఉద్దేశించబడిన బ్రహ్మర్షి విశ్వామిత్రుడు ప్రధానంగా కలిగిన కాండే! బాలకాండ. అందుకు తగినట్లుగానే బాలకాండలోని 77 సర్గలలో సుమారు 56 సర్గలు బ్రహ్మర్షి విశ్వామిత్రునితో ముడిపడి ఉన్నాయి. తాత్విక దృష్టిలో బాలకాండను గమనిస్తే సీతారాముల కళ్యాణమే విశ్వామిత్రుని ధ్యేయంగా కనిపిస్తుంది. తమోగుణ ప్రధానమైన తాటకను సంహరించి, రజోలీనయై అదృశ్యగా ఉన్న అహల్యను ఆవిష్కరించి, నిత్య సత్య సందీప్తమైన సాత్విక తేజస్సుతో అయోనిజయైన జానకిని చేపట్టడమే రామభద్రుడు విశ్వామిత్రుని సాహచర్యంలో సాధించిన సత్త్వసిద్ధి. ఇది విశ్వామిత్రుని గురుత్వానికి నిదర్శనం. ఇక విశ్వామిత్రుడు గాయత్రీ మంత్ర ద్రష్ట. రామాయణం గాయత్రీ బీజ సంహిత. 24 వేల శ్లోకాల్లో వేదమాతను బీజరూపంగా ప్రతిబింబింపజేసిన వాల్మీకి రచనకు మూలమే బ్రహ్మర్షి విశ్వామిత్రుడు. ఇది బాలకాండ విశిష్టత. ఇట్టి అలౌకికమైన బాలకాండను లౌకిక దృష్టితో చూసి ఇందులో రాముని బాల్యము లేదని ఇది ప్రక్షిప్తమని అంటారు. ఈ అంశాలను గ్రహించిన కవి సార్వభౌములు సమన్వయ సూత్రానికి కట్టుబడి అలౌకికాంశాలను విడిచిపెట్టకుండా లౌకిక దృష్టితో బాలకాండను రచించారు.

ఈ క్రమంలో వాల్మీకి రామాయణ శిల్పానికి భిన్నంగా రామాయణంలోని పాత్రలు, సంఘటనలను కాలక్రమానుసారంగా ఒక క్రమ పద్ధతిన పేర్చి బాలకాండకు ఒక కొత్త రూపాన్ని ఇచ్చారు. ఇందుకు గాను ఉత్తరకాండలోని కొన్ని అంశాలను కూడా బాలకాండలో నిక్షిప్తము చేశారు. వాల్మీకుల చరిత్రము, దశరథుని వృత్తాంతము, దేవదానవయుద్ధములో దశరథుడు, కైక పాల్గొనుట, దశరథునకు మునిదంపతుల శాపము, శాంతాదేవి వృత్తాంతము, ఋష్యశంగుని వృత్తాంతము, అశ్వమేధము, పాయస ప్రధానము, జయవిజయుల కథ, రావణాదుల వృత్తాంతము, వాలి రావణున్ని పరాభవించుట, వేదవతి చరిత్రము, విశ్వామిత్రుని రాక, శ్రీరామచంద్రుడు యాగ సంరక్షణకు లక్ష్మణునితో కలిసి వెడలుట, గంగావతరణము, క్షీరసాగర మథనం, అహల్య వృత్తాంతము, గంగాతీరము-గుహుడు, శతానందుడు విశ్వామిత్రుని చరిత్రను చెప్పుట, సీతవృత్తాంతం, సీతారాముల ప్రణయము, శివ ధనుర్భంగము, సీతారామ కళ్యాణము, జనకుడు రామునకు అంగుళీయకమిచ్చుట, భార్గవ రాముని రాక, శ్రీరామచంద్రుని నిత్య కృత్యములు అనే అంశాలు బాలకాండలో గమనించవచ్చు. ఇలా రామాయణములో తారసపడే పాత్రలన్నింటినీ బాలకాండలోనే పరిచయం చేయడం వల్ల విస్తృతి రీత్యా శ్రీకృష్ణ రామాయణంలో బాలకాండ పెద్దదిగా కనిపిస్తుంది. ఇలా చేయడం వల్ల రామాయణంలోని పాత్రల నేపథ్యము, వాటి స్వభావము, ఆయా సంఘటనల కార్యకారణ సంబంధాలు సులభంగా అర్థమవుతాయి.

ఇక ఉత్తరకాండలో ప్రధానంగా కనబడే రావణాదుల చరిత్రను కూడా బాలకాండలో కలపడం వల్ల ఉత్తరకాండ కొన్ని అంశాలకే పరిమితమైంది. శ్రీ ఈదర వేంకట్రావు పంతులు శ్రీకృష్ణ రామాయణ కృతిభర్త. ఈయన సులభశైలిలో,

సర్వజన సమ్మతంగా రామాయణాన్ని రచించమని శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిని అడగగా సుమారు 75 రోజులలో సంగ్రహంగా వీరు రామాయణాన్ని రచించిరి. అయితే కృతి తాంబూలమిచ్చే సందర్భంలో శ్రీ ఈదర వేంకట్రావు పంతులు సీతమ్మ పై అపవాదులు, సీతారాముల ఎడబాటు, సీత భూగర్భ ప్రవేశము, శ్రీరామచంద్రుని నిర్యాణము వంటి అమంగళములున్న ఉత్తరకాండము వదిలివేయమన్నారట. అలా ఉత్తరకాండను పూర్తిగా విడుచుటకు ఇష్టము లేని శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి సీతా భూగర్భప్రవేశము వంటి ఘట్టాలను వదిలివేసి కొన్ని మార్పులు చేర్పులతో ఉత్తరకాండను మంగళప్రదంగా తీర్చిదిద్దారు. ఈ రెండు కాండలు వీరి రామాయణంలో ఒకదానితో ఒకటి ముడిపడి ఉన్నవి. ఇక మిగిలిన కాండలు వాల్మీకిని అనుసరించాయి. అయితే ఔచిత్యవంతమైన కొన్ని అవాల్మీకములు మాత్రం వీరి రామాయణంలో స్వీకరించబడ్డాయి.

ఇప్పుడు వీరు సమన్వయము చేసిన కొన్ని ప్రధాన అంశాలను గమనిద్దాం.

## 8.4. వాల్మీకుల చరిత్రము :

రామాయణాన్ని రచించిన వాల్మీకి అసలు పేరు ప్రాచేతసుడు. ఈయన ప్రచేతసుని కుమారుడు. వాల్మీకి రామాయణాన్ననుసరించి ఈయన బోయవాడు కాదు. అయితే వాల్మీకి దారిదోపిడీలు చేసే దొంగ అని, బోయవాడని జనవ్యవహారంలో ఉంది. ఇలా వాల్మీకి చరిత్రపైనున్న అభిప్రాయాలను గమనించిన కవిసార్వభౌములు బాలకాండ ప్రారంభములో వాల్మీకులచరిత్రమును రచించి ఈ భిన్న కథల మధ్య సామరస్యాన్ని కూర్చారు.

ఒకానొక సమయంలో బ్రహ్మదేవునికి వీర్యస్ఖలనము కాగా దాని నుండి వాలఖిల్యులు పుట్టిరి. ఈ విషయాన్ని గూర్చి బ్రహ్మదేవుని పుత్రుడైన ప్రచేతసుడు నిండు సభలో బ్రహ్మ దేవుని ప్రశ్నించగా-

**నావుడు గ్రుద్ధుడై యజుడు నాదగుదోషము నిండుకొల్వులో**
**గావరుడై వచించితివి గావున నీ వొక పుల్కసుండవై**
**భూవలయంబునం బడుము పొ మ్మనుచు శపియింప నార్తి వా**
**పోవుచు నాతడిట్లనియె మ్రొక్కినకాళ్ళకె వెండి మ్రొక్కుచు** **(శ్రీకృ. రా, బాల, ప్ర, 103 ప)**

నిండుసభలో ఆ విధంగా తన దోషాన్ని ఎత్తిచూపినందుకు బ్రహ్మదేవుడు తన పుత్రుడైన ప్రచేతసునిపై తీవ్రఆగ్రహముతో పుల్కసుడవై/బోయవాడవై భూలోకంలో జన్మించమని శపించెను. ఆ శాప వాక్కులు విని బాధపడిన ప్రచేతసుడు ఆర్తితో బ్రహ్మదేవుని పాదాలను పట్టుకుని

**నీకుం బుట్టిననే నా**
**లోకమునం బుల్కసుడయి లొగ్గడిబడుచు**
**వీకమెయి నెట్లు బ్రదుకుదు**
**లోకేశా! నన్ను బ్రోవ లో గొనుము కృపన్** **(శ్రీకృ. రా, బాల, ప్ర, 104 ప)**

నీకు పుట్టిన నేను భూలోకములో పుల్కసునిగా పుట్టి ఎలా బ్రతకగలను, కృపతో నన్ను అనుగ్రహించమని వేడుకోగా

**అనిన గనికరించి యతడు పుల్కసుడవై**
**పుట్టి రామమంత్రపూతుడ వయి**

**ఘనుడ వై మహత్త్వమున నొప్పి సాయిజ్య**
**మందగల వటంచు నజుడు పలికె** **(శ్రీకృ. రా, బాల, ప్ర, 105 ప)**

కనికరించిన బ్రహ్మదేవుడు ప్రచేతసునితో పుల్కసుడవై జన్మించిన నీవు రామమంత్రాన్ని అనుష్ఠించి రామాయణాన్ని రచించి శాపవిమోచనాన్ని పొందగలవని అనెను.

అంతలో ఆ ప్రచేతసుడు పుల్కసునిగా/బోయవానిగా భూమిపై అవతరించెను. దారిదోపిడీలు చేస్తూ జీవిత పరమార్థాన్ని మరచిన అతనికి ఋషుల ద్వారా కనువిప్పు కలుగుతుంది. అప్పుడా ఋషులు అతడు బోయవాడని రామ మంత్రాన్ని వ్యత్యయంగా ఉపదేశిస్తారు. అనగా రామ అనే మంత్రాన్ని మరా గా ఉపదేశిస్తారు. ఈ మంత్రాన్ని అనునిత్యము జపించమని చెప్పి వెళ్ళిపోతారు. అప్పుడా బోయవాడు వైరాగ్యాన్ని పొంది, నిద్రాహారాలను మాని ఆ మహారణ్యంలో ఒక కొండగుహలో కూర్చుని

**మరా మరా మరా యటంచు మాన కెళ్ళవేళలన్**
**బరాత్పరుం బరాపవాదభంజనున్ నిరంజనున్**
**నిరంతరంబు స్వాంతమందు నిల్పి పొల్పు మీఱగా**
**నిరామయుండు నై జపించె నిత్యనిర్వికారుడై** **(శ్రీకృ. రా, బాల, ప్ర, 133 ప)**

మనసులో నిరంజనుడు, పరాత్పరుడైన పరమాత్మను మనసులో నిలుపుకుని మరా మరా అంటూ నిర్వికారుడై నిరంతరము, నిరాటంకంగా జపము చేస్తూ ఉంటాడు.

**ఇట్లు పరమనిష్ఠాగరిష్ఠుండై కిరాతశ్రేష్ఠుండు తనపై బుట్టలు వాఱ నేండ్లు పూండ్లుగా రామమంత్రానుష్ఠానంబు గావించి తత్ప్రభావంబున మహాభావుండును బ్రహ్మతేజోవిరాజితుండును త్రిభువనైకమాన్యుండును ధన్యుండు నై వల్మీకభవుం డగుటంజేసి వాల్మికి నా మహాకవియునై భరద్వాజాదిశిష్యులం గూర్చుకొని పేర్చినవైరాగ్యం బను భాగ్యంబునందేలి ప్రాజ్ఞుండై పూజ్యంబైనవిష్ణుసాయుజ్యంబునొందె నమ్మహానుభావుండు. (శ్రీకృ. రా, బాల, ప్ర, 134 ప)**

ఇలా పరమనిష్ఠాగరిష్ఠుడైన ఆ బోయవాని చుట్టూ పుట్టలేర్పడతాయి. అయినా వాటిని లెక్క చేయక రామమంత్రాన్ని అనుష్ఠిస్తుండడంతో ఆ ప్రభావము చేత బ్రహ్మతేజస్సు చేకూరి, వల్మీకము నుండి అనగా పుట్ట నుండి బయటపడెను. అందువల్ల వాల్మీకి అయ్యెను.

ఇలా వాల్మీకి చరిత్ర పైనున్న భిన్నవాదాలను సమన్వయించి ఇరుపక్షాల వారికి ఆమోదయోగ్యంగా, మధ్యేమార్గంగా శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి వాల్మీకులచరిత్రమును రచించెను.

## 8.5. అశ్వమేధయాగము :

ఇంతకుముందు చెప్పుకున్నట్లుగానే శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి వేదవేదాంగములను అవపోసన పట్టిన ఘనాపాఠి. అట్లే శ్రౌతస్మార్తములను సాంగోపాంగంగా అధ్యయనము చేసినవారు. వీరి శ్రీకృష్ణరామాయణములోని బాలకాండలో దశరథుడు చేసిన అశ్వమేధయాగానికి సంబంధించిన ఘట్టంలో వీరి శ్రౌత పాండిత్యము ప్రస్ఫుటమవుతుంది. మూలములో వాల్మీకి మహర్షి అశ్వమేధయాగానికి సంబంధించిన వర్ణనలు చేయగా, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

సవివరంగా అశ్వమేధయాగానికి సంబంధించిన అంశాలను వివరిస్తారు. అందులో భాగంగానే అశ్వమేధాశ్వమునకు ఉండ వలసిన లక్షణములు, ఋత్విక్కులను ఎంచుకున్న తీరు, సోమ సంగ్రహణము, హయమేధపశు వివరణము, హయమేధ దక్షిణాప్రధానము వివరించి చివరగా పుత్రకామేష్టి ప్రకరమును తెలియజేశారు.

**హయలక్షణము :**

అశ్వమేధ యాగానికి ఎన్నుకొనదగిన అశ్వమునకు ఉండవలసిన లక్షణాలను తెలిపే పద్యాలు.

**అశ్వమేధీయాశ్వశశ్వదుదంతము/ తల్లక్షణ మెఱుంగ దగును మీకు**
**నశ్వమాతాపిత లగునశ్వరాజముల్/ బ్రహ్మచర్యవ్రతప్రజ్ఞ గలిగి**
**యితరాశ్వసంపర్కమిది యెన్నడును లేక/ సుదినంబునం దది చూలు కొనగ**
**నగ్గర్భమందు బు ట్టంది దశధ్రువల్/ స్వస్థానములయందు జతనుపడగ**

**దేవమణి రోచమానము గ్రీవమణియు/ లోనుసల్లక్షణంబులు పూని బ్రహ్మ**
**చర్యమున నొప్పునశ్వరాజమ్ము చంద్ర/ధవళ మది యెన్న నశ్వమేధమున కొప్పు (శ్రీకృ.రా,బాల, ద్వి, 206 ప)**

**మఱియు మేను తెలుపు ముఖ మెఱుపు చెవులు / నలుపు పుచ్ఛము పచ్చన గలిగి యుండి**
**బ్రహ్మచర్యవ్రతంబున వఱలి మంచి/సుడులు గలగుఱ్ఱ మైన నొప్పెడు నటంచ్రు (శ్రీకృ.రా, బాల, ద్వి, 207 ప)**

అశ్వము యొక్క తల్లితండ్రులు బ్రహ్మచర్యవ్రత ప్రజ్ఞను కలిగి ఉండాలి. బహుశా అశ్వములలో కూడా బ్రహ్మచర్యము, ప్రాజపత్య బ్రహ్మచర్యము వంటి పాలనము ఉన్నదేమో! అందువల్లనే బ్రహ్మచర్యవ్రత ప్రజ్ఞను కలిగి ఉండాలని అన్నారు. అలాగే ఇతర అశ్వములతో ఎన్నడూ సంపర్కము చేయనివై ఉండాలి. ఒక మంచి రోజు స్త్రీ అశ్వము గర్భము ధరించగా ఆ గర్భమందే అనగా అశ్వమేధాశ్వము గర్భమునందుండగానే పది సుడులు ఉండవలసిన చోట ఏర్పడాలి. వీటినే దశ ధృవులంటారు. దశ ధృవులనగా వక్షస్థలమున రెండు, శిరస్సున రెండు, ముఖమున రెండు, ముక్కు రంధ్రముల మీద రెండు, నొసటి భాగమున ఒకటి, గుదభాగమున ఒకటి చొప్పున పది సుడులు. ఈ పది సుడులున్న అశ్వములు ప్రశస్తములు[20] దేవమణి, రోచమానము, గ్రీవమణి అనే అశ్వజాతులకుండే శుభలక్షణాలన్నీ అశ్వమేధ యాగాశ్వములో కనబడాలి.

కంఠాభరణమున సుడికి దిగువ అనగా కంఠము మొదలు నాలుగు అంగుళముల పరిమితాంతరములో సుడి గల అశ్వము దేవమణి. ఇట్టి లక్షణము గల తురగము యజమానిని అపరిమిత సామ్రాజ్యయుక్తునిగావించును.[21] దేవమణికి క్రింద అనగా కంఠము మొదలు నాలుగంగుళముల పరిమితికి దిగువగా నుండెడు సుడి రోచమానము. ఇది యజమానిని అపరిమిత వైభవమును కలిగించునది.[22] గరుడ పురాణము ప్రకారము సర్వశత్రుంజయమును కూర్చునది రోచమానము.[23] పుత్ర పౌత్రాభివృద్ధికి కారణమగును.[24] ఇన్ని శుభలక్షణాలు కలిగి, బ్రహ్మచర్యమును పాటించిన ఆ అశ్వము చంద్ర ధవళము. ఇది అశ్వమేధ యాగానికి సరిపడే అశ్వము.

ఇది కాక తెల్లని శరీరము, ముఖమునందు మెరుపు, నల్లని చెవులు, వెనుక తోక భాగము పచ్చగా ఉండి, బ్రహ్మచర్య

వ్రతాన్ని పాటిస్తూ, శుభ లక్షణాలను సూచించే సుడులు గల అశ్వము కూడా అశ్వమేధానికి పనికొస్తుంది. ఈ లక్షణాలను పట్టి చూస్తే ఇది శ్యామకర్ణాశ్వమని అర్థమవుతుంది.

మూలంలో ఇంత విపులమైన వర్ణన లేదు. కవి సార్వభౌములు శ్రౌతము తెలిసినవారగుట చేత అశ్వమేధ హయ లక్షణాలను ఇంత చక్కగా వర్ణించగలిగారు. ఆ తర్వాత ఋత్విగ్వరణము గూర్చి విపులంగా వర్ణించి సోమసంగ్రహ విధిని కళ్ళకు కట్టినట్లు చూపారు. ఈ ఘట్టములో అశ్వమేధ యాగ విధి విధానాలను సవివరంగా తెలియజేశారు. (వ్యాసకర్తలు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి శ్రౌత పాండిత్యము వివరించడానికి ఈ ఒక్క ఘట్టాన్ని ఎంచుకొని ప్రత్యేకంగా ఒక వ్యాసాన్ని రాయవచ్చు.)

## 8.6. అహల్య నిర్దోషిత్వం :

అహల్య గౌతమ మహర్షి భార్య. ఒకానొక సందర్భంలో గౌతమునిగా తన రూపాన్ని మార్చుకుని ఇంద్రుడు గౌతముడు లేని సమయంలో అహల్యను సమీపిస్తాడు. ఈ విషయాన్ని గ్రహించిన గౌతమ మహర్షి వారిరువురిని శపిస్తాడు. ఈ కథ రామాయణములోని బాలకాండలో కనిపిస్తుంది. ఇందుకు విపరీతంగా కొన్ని గాథలలో ఇంద్రుడు అహల్యను కామించినట్లు, ఇంద్రునికి సూర్యుడు తోడ్పడినట్లు చిలువలుపలువలు చేసి అహల్య పాత్రను దిగజార్చారు.

ఒక విషయాన్ని అర్థము చేసుకోవడానికి పూర్వాపరాలను సునిశితంగా పరిశీలించుట అత్యావశ్యకము. అందువల్ల అపవాదులకు తావిస్తున్న అహల్యవృత్తాంతము మూలమున ఎలా ఉన్నదో పరిశీలించవలసియున్నది.

గౌతముడు ఆశ్రమమున లేని సమయమున దేవేంద్రుడు గౌతముని రూపము ధరించి అహల్య వద్దకు చేరి

**ఋతుకాలం ప్రతీక్షంతే నార్థినస్సుసమాహితే**
**సంగమం త్వహ మిచ్ఛామి త్వయా సహ సమధ్యమే** **(శ్రీ.రా , బాల, 48 స, 18 శ్లో)**

ఓ సుందరీమణి! కామాతురులు ఋతుకాలము వరకు ఆగరు. ఓ తరుణీ! నేను నీతో సంగమింప గోరుతున్నాను. అనగా-

**మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన**
**మతిం చకార దుర్మేధా దేవరాజకుతూహలమ్** **(శ్రీ.రా , బాల, 48 స, 19 శ్లో)**

గౌతముని రూపాన్ని దాల్చి వచ్చినది ఇంద్రుడని అహల్య తన తపఃశక్తితో గుర్తించి దేవతలకు ప్రభువైన ఇంద్రుడు ఈ విధముగా పలుకుతున్నాడేమిటని? అర్థము కాక అనేక విధాలుగా ఆలోచించింది.

**అథాబ్రవీత్ సురశ్రేష్ఠం కృతార్థేనాంతరాత్మనా**
**కృతార్థాస్మి సురశ్రేష్ఠ గచ్ఛ శీఘ్ర మితః ప్రభో** **(శ్రీ.రా , బాల, 48 స, 20 శ్లో)**

తరువాత ఆమె ఆ ఇంద్రునితో ఓ సురశ్రేష్ఠా! నా దాంపత్య జీవనమున నేను సంతుష్టురాలను. నీవు ఇచ్చటి నుండి వెంటనే వెళ్ళుము.

**ఆత్మానాం మాం చ దేవేశ సర్వథా రక్ష మానద** **(శ్రీ.రా , బాల, 48 స, 21 శ్లో)**

ఓ దేవేంద్రా! అన్ని విధముల నీ గౌరవమును నా గౌరవమును రక్షించుము అనగా

**ఇంద్రస్తు ప్రహసన్ వాక్యమ్ అహల్యామ్ ఇదమబ్రవీత్**
**సుశ్రోణి పరితుష్టోస్మి గమిష్యామి యథాగతమ్** **(శ్రీ.రా , బాల, 48 స, 22 శ్లో)**

ఇంద్రుడు నవ్వుతూ, ఓ సుందరీ! నీ విశిష్ట రీతికి సంతసించితిని. వచ్చిన విధముగనే వెళ్లెదనని పలికెను.

ఆ సమయాననే గౌతముడు అక్కడికి చేరి వారికి శాపాన్నిస్తాడు. ఈ వృత్తాంతము ఇంద్రుని విధులను గురించి తెలుపుతుంది. ఇంద్రుడనిన ఇంద్రియములను జయించినవాడు. అట్టి ఇంద్రుడు దేవతలకు అధిపతి. ఇతరుల ఇంద్రియ నిగ్రహమును పరీక్షించుట ఇతని కృత్యము. ఈ కారణము చేతనే ఇంద్రుడు తపమాచరించు వారి ఇంద్రియనిగ్రహాన్ని పరీక్షించడానికి ఉత్పాతాలను సృష్టించడం, అప్సరసలను పంపడం వంటి పనులు చేస్తుంటాడు. అయితే గౌతముడు జితేంద్రియుడు, అరిషడ్వర్గములైన కామక్రోధలోభమోహమదమాత్సర్యాలలో ఇతను కామానికి లొంగడని గ్రహించి ఆ మునిసత్తమునిలో క్రోధాన్ని పురిగొల్పి పరీక్షించాలని ఆతని ధర్మపత్ని యైన అహల్యను సమీపిస్తాడు ఇంద్రుడు. క్రోధవశుడైన గౌతముడు ఇంద్రియనిగ్రహాన్ని కోల్పోయి తన తపఃశక్తిని వృథా చేస్తూ అహల్యకు, ఇంద్రునికి శాపాన్నిచ్చాడు. అదేవిధంగా ఈ ఘట్టములో ఇంద్రుడు గౌతమున్నే కాక అహల్యను కూడా పరీక్షించినట్లు గ్రహించవలసి ఉంది. ఆమె తన పాతివ్రత్యానికి కట్టుబడి దేవేంద్రుని మోహపాశమనే మాయలో చిక్కక ఆ పరీక్షలో నిలిచినది. ఇక్కడ ఇంద్రుడు తన విధిని నిర్వర్తించాడు. గౌతముడు కోపించాడు. కానీ అకారణంగా శపించబడినది పరీక్షలో నిలిచిన అహల్య. ఈమె నిష్కలంక. ఇలా పూర్వాపరాలతో, వాల్మీకి రామాయణాన్ని సునిశితంగా పరిశీలిస్తే అహల్య నిర్దోషిత్వము అర్థమవుతుంది.

అనేకమందికి ఇంద్రుని పై సదభిప్రాయము లేదు. పైగా ఇంద్రత్వాన్ని అర్థం చేసుకోవడం అంత సులభము కాదు. అందువల్ల ప్రస్తుత తన రామాయణ ప్రణాళికలో భాగంగా అహల్య నిష్కలంక అనే విషయాన్ని సూటిగా చెప్పడానికి కృష్ణమూర్తి శాస్త్రి అహల్య వృత్తాంతముపై చలామణిలోనున్న గాథలనే స్వీకరించి అనుసృజన చేస్తూ

బ్రహ్మదేవుడు సర్వాంగసుందరంగా సృష్టించిన లావణ్యమూర్తి అహల్య. ఈమెను ఇంద్రాదులు మోహిస్తారు. కానీ ఈమె వివాహం గౌతమునితో జరుగుతుంది. ఆ అహల్యపై మోహముతో ఇంద్రుడు అతిథివలె గౌతముని ఆశ్రమంలో చేరి అదను గూర్చి వేచి చూస్తుంటాడు. ఒకనాడు పూర్వాహ్నములో అనగా దినము యొక్క మొదటి భాగములో అగ్ని కర్మలను పూర్తిచేసి గౌతముడు శిష్యగణము కొలుచుచుండగా, ఆశ్రమమున నివసించేవారు, ఇతర మునులు చూచుచుండగా ఆశ్రమాన్ని వదిలి వెళ్తాడు. ఇదే అదననుకుని ఇంద్రుడు గౌతముని రూపాన్ని ధరించి అహల్య ఉన్న కుటీరములోకి ప్రవేశించగా, అహల్య వచ్చినవాడు గౌతముడని భ్రమపడి ఎదురేగి నమస్కరించి, అందరూ చూస్తుండగా ఇప్పుడే బయలుదేరి, మరల ఇప్పుడే వచ్చారు ఏమిటని ప్రశ్నించగా, గౌతముని రూపాన్ని ధరించిన ఇంద్రుడు సంసారసాగరములో చిక్కిన నేను మరొక చోటికి వెళ్ళలేక నీ చెంతకు వచ్చానని అంటూ-

**అని పలుకుచు నొక్కింతయుం గొంచ కహల్యహస్తగ్రహణంబొనరించి లోనికిం ద్రోసికొనిపోయె నంత నహల్య వానిం దేఱిపాఱంజూచి వాడు తనభర్తకాడనియు నింద్రాపశదుం డనియు నంత రంగంబున నెఱింగి వాని కి ట్లనియె** **(శ్రీకృ. రా, బాల, తృ, 351 ప)**

అహల్య చేతిని పట్టుకును లోనికి తీసుకునిపోగా, అహల్య తదేకముగా చూసి గౌతమ రూపములోనున్నవాడు ఇంద్రుడని అంతరంగంలో గమనించి, అతనితో

**ఎవ్వడ వోరి నీ విటు లొకింతయు గొంచక మౌనిపత్ని న**
**న్నివ్విధి నంటగా నగునె యియ్యది పాపము నా దలంపవే ...... (శ్రీకృ. రా, బాల, తృ, 352 ప)**

మునిపత్ని నైన నన్ను చెరబట్టడానికి వచ్చిన నీవెవరని ఆగ్రహాన్ని ప్రకటిస్తూ, ఇది పాపమని నీకు తెలియదా! అంటూ ఉండగా గౌతముడు ఆ కుటీరములోకి వచ్చి వారిరువురిని శపిస్తాడు. కవిసార్వభౌములు రామాయణార్థాన్ని జీర్ణించుకున్నవారు. వాల్మీకి రామాయణం ప్రకారం అహల్య నిర్దోషి అని, ఇంద్రుడు తన విధిని నిర్వర్తించాడని వీరికి తెలుసు. కానీ ఈ రెండు విషయాలను యథాతథంగా ప్రతిపాదిస్తే సామాన్యులు అర్థం చేసుకొనలేరని జనబాహుళ్యమున వ్యాపించిన కథనే స్వీకరించిన ఇంద్రుని దోషిగా చూపుతూ, అహల్యను నిర్దోషిగా చూపారు.

## 8.7. కైక నిరపరాధిత్వం:

కైక తన పుట్టింటి నుండి అరణముగా తెచ్చుకున్న దాసి మందర. ఈమె శ్రీరామచంద్రుని పైనున్న మాత్సర్యము చేత కైకకు దుర్బోధ చేసి, శ్రీరామచంద్రుడు అడవుల పాలయ్యేలా చేస్తుందన్న విషయము అందరికీ తెలిసిందే! ఇదే వాల్మీకి రామాయణంలో కూడా ఉంది. అయితే దుష్టశిక్షణ కొరకు అవతరించిన శ్రీరామచంద్రుడు తన అవతార పరమార్థములో భాగంగా అడవులకు వెళ్లవలసివుంది. ఈ దైవకార్యాన్ని నెరవేర్చుటకు కైక ఒక సాధనంగా ఉపకరించిందని తెలుపుతూ

**అవల నయ్యజప్రేరిత యైనవాణి**
**కైకహృదయంబునం జొచ్చి కప్పెదొంటి**
**బుద్ధినంతయు నంతలో బొలతి మదికి**
**జెప్పలేనంతయావేశ మప్పుడొదవె (శ్రీకృ. రా, అయోధ్య, ప్ర, 39 ప)**

బ్రహ్మదేవుని చేత ప్రేరేపించబడిన సరస్వతీదేవి కైక హృదయములోకి చేరి కైక బుద్ధిని మరల్చినదని శ్రీకృష్ణ రామాయణ కర్త వర్ణించి, కైక నిరపరాధని, విధిచే ప్రేరేపించబడినదని, ఆమె మనసులో కల్మషములు లేదని చూపారు. ఈ ఉదంతమంతయూ దాదాపు ఆధ్యాత్మరామాయణాన్ని అనుసరించింది.

## 8.8. రావణుని దోష రాహిత్యము:

రామాయణాన్ని కేవలము కావ్యేతిహాసంగా కాక నిగూఢమైన శాస్త్రాలకు ఆలవాలంగా పరిశీలించినప్పుడు. వాల్మీకి తన రామాయణంలో అతిగోప్యంగా తత్త్వ, యోగ, మంత్ర, జ్యోతిష్య శాస్త్రాలను ఆత్మతత్త్వమును, సాంఖ్యాన్ని, వేదాంతశాస్త్రాన్ని, నిక్షిప్తము చేసినట్లు అర్థమవుతుంది. రావణునిలో దోషరాహిత్యమును చూడవలసి వచ్చినప్పుడు ఈ శాస్త్రాలు సహకరిస్తాయి. ఇక రావణుని పాత్రను గురించి తెలుసుకునే ముందు పైకి కనబడే రావణుడు వేరే, అతనిలోపల ఉండే జీవుడు వేరే అనే అంశాన్ని దృష్టిలో ఉంచుకోవలసి ఉంది. రావణుని లోపల నున్న జీవుని అంశ

వైకుంఠ ద్వారపాలకుని అంశ. రామాయణంలో రావణుని చర్యలను గమనిస్తున్నప్పుడు రావణుని లోపల నున్న ఆ వైకుంఠ జీవుని సంస్కారము కనబడుతుంది. ఆ వైకుంఠ జీవుడు ఈ రాక్షస జన్మము నుండి విముక్తిని పొంది విష్ణు సాయుజ్యమును పొందాలని తపిస్తూ ఉంటాడు. ఇది రావణుని లోపలనున్న వైకుంఠ జీవుని వేదన. అసలు రామాయణమంతా జీవుని వేదన మీదనే నడిచింది. వాల్మీకి వేదనే రామాయణమైతే, దశరథుని వేదన, దేవతల వేదన, రావణుని లోనున్న వైకుంఠ జీవుని వేదనలే శ్రీమహావిష్ణువు శ్రీరామచంద్రునిగా అవతరించడానికి హేతువులయ్యాయి. ఈ జీవుని వేదన ఎప్పటి నుండో ఉన్నప్పటికీ విశ్వనాథ కల్పవృక్షము వల్లనే తెలుగునాట యవనిక పైకి వచ్చింది. ఈ జీవుని వేదనను ధూళిపాళ శ్రీరామమూర్తి, కోవెల సంపత్కుమారాచార్య వ్యాప్తిలోకి తెచ్చారు.

శ్రీకృష్ణ రామాయణమున రావణునిలోనున్న వైకుంఠ జీవుని వేదన, ఆత్మజ్ఞానము రావణుని పాత్ర ప్రారంభము నుండే కనిపిస్తూ ఉంటాయి. శతకోటి ప్రవిస్తరమైన రామాయణము వాల్మీకి మహర్షి చేత రచించబడి అన్ని లోకాలలో వ్యాపిస్తుంది. ఏడుకాండలు గల ఈ రామాయణమును వ్యాఖ్యానిస్తూ, వర్ణిస్తూ, పారాయణ చేస్తూ దేవదానవాదులు కూడా సంతోషిస్తున్న సమయంలో, లంకారాజ్యమున పులస్త్యబ్రహ్మ ఆధ్వర్యంలో రామాయణ పారాయణ జరుగుతుంది. రావణుడు రామాయణాన్నంతటిని వీనుల విందుగా విని

**విని తన రాక్షసజన్మము**
**జిన జేసి జయుం బొనర్ప జాలి నరుండై**
**జనియించు విష్ణుదేవుం**
**డనిమనముయందు మిగులు హర్షము నొందెన్** **(శ్రీకృ. రా, బాల, ప్ర, పుట 151)**

తనకు ఈ రాక్షసజన్మ నుండి విముక్తిని కలిగించడానికి ఆ శ్రీమహావిష్ణువు నరుని రూపంలో అవతరించబోతున్నాడని మిక్కిలి సంతసించెను.

**నలువురు నాలకించునటు నాలినరుం డగురాముడేడ? నన్**
**గలన వధించుటేడ? యిది కల్పితకావ్యము దీని ముజ్జగం**
**బుల నెవరే బఠించుటకు బూనగ రాదటు చేయరేని వా**
**రలతల లుండ బో వనుచు రాజసభన్ బ్రకటించె గించునాన్ (శ్రీకృ. రా, బాల, ప్ర, పుట 151,152)**

ఆ తరువాత అందరూ వినేలా నరుడైన రాముడెక్కడ? నన్ను వధించుటేడ? ఇది కల్పితకావ్యము. దీనిని మూడు లోకాలలో ఎవరైనా పటిస్తే వారి తలలు ఉండబోవని రాజసభలో ప్రకటిస్తాడు.

ధ్వన్యాత్మకమైన ఈ సన్నివేశమున మొదట తనకు ముక్తి లభించబోతుందని రావణుడు ఆనందించడము, మరల తేరుకుని ఇదంతా కల్పితమని గద్దించడము గమనించవచ్చు. ఈ గద్దించడంలో కూడా ధ్వని ఉన్నది. లంకాధిపతి రావణునిగా ఇదంతా కల్పితమని గర్జించడము, ముక్తికై పరితపిస్తున్న వైకుంఠ జీవునిగా మరెన్ని సంవత్సరాలు వేచి ఉండాలో నిజంగానే నన్ను ఆ శ్రీమహావిష్ణువు రామునిగా అవతరించబోతున్నాడా అని ఆక్రోశించడం గమనించవలసిన అంశాలు. ఇలా రావణుని పాత్ర ప్రారంభంలోనే ఎలా ఉండబోతుందని కవిసార్వభౌములు సూచించారు.

**అసలు ఈ రావణుడు ఎవరు?**

ఇంతకుముందు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి సమన్వయ సూత్రాన్ని పాటించి చేసిన మార్పులకు ఆయా జనశ్రుతులే ఆధారం. కానీ ఈ రావణుని పాత్ర నిర్మాణానికి ఆధ్యాత్మ రామాయణమే మూలమని అనిపిస్తున్నా వాల్మీకి రామాయణము కూడా ఆధారమని చూపడానికి రావణుని గూర్చి కొంత విపులంగా ఇక్కడ ప్రస్తావిస్తున్నాను. ఇంతకుముందు చెప్పినట్లు **రావణుడు వేరు, అతని లోనున్న జీవుడు వేరు**. రావణుని యొక్క జీవుని వేదనలో ఆ జీవుని సంస్కార బలము తెలియాలన్న అతని వ్యక్తిత్వములోనున్న పార్శ్వాలన్నింటి పైనా సమగ్రమైన అవగాహన ఉండుట అవసరము. ఈయన అనేకానేక శాస్త్రాల జ్ఞాత అని అంటారు. అట్టి రావణబ్రహ్మ రచించిన రావణసంహిత నేటికీ ఉన్నది. శివపూజా దురంధరుడైన రావణుడు శక్త్యుపాసకుడు, మహామంత్రవేత్త. ఒకానొక సమయంలో క్షణకాలములో సిద్ధించు తంత్ర విద్యను తనకు ఉపదేశించమని రావణుడు పరమశివున్ని ప్రార్థించగా రావణుని పై వాత్సల్య భావనతో పరమేశ్వరుడు షట్కర్మ తంత్రములతో కూడిన ఉడ్డీశ తంత్రమును అనుగ్రహించినట్లు ఉడ్డీశ తంత్రము తెలుపుతుంది. దీనిని బట్టి రావణుడు సాక్షాత్ పరమశివున్నే ప్రసన్నం చేసుకుని తంత్రవిద్యను కైవసం చేసుకున్నాడని తెలుస్తుంది.

**రావణుడు శక్త్యుపాసకుడని** ధృవీకరిస్తూ **యామిజాల పద్మనాభ స్వామి,** సుందరకాండ వైశిష్ట్యము అనే వ్యాసాన్ని రచించారు. ***"ఇందులో రావణుడు మహదేవుని గురించి చేసిన భుజంగ ప్రాయత స్తోత్రము ఇందుకు సప్రమాణమని పేర్కొన్నారు."*** [25] ఇక నాకు తెలిసి ఖడ్గ రావణము అనే మంత్రము రావణునికి చెందినది. మేరు తంత్ర సంగ్రహములో కూడా శివుడు రావణునికిచ్చిన మంత్రముతో పాటు, ఖడ్గరావణము అనే మంత్ర ప్రసక్తి కూడా ఉంది. ఈ విషయాన్ని లోతుగా తెలుపుతూ **విశ్వనాథ సత్యనారాయణ** ***"శ్రీవిద్యలోని పరమ రహస్య మంత్రాలన్నింటిని సంపుటీకరించుకుని కామ కళా విలాసము అనే గ్రంథము కూర్చబడినది. అందులో శ్రీదేవి మహామంత్ర దక్షిణామ్నాయ మంత్ర త్రయములోని రెండవ మంత్రమే ఖడ్గ రావణమని తెలిపారు."*** [26]

**దీనిని గురించి విశ్వనాథ సత్యనారాయణ వివరిస్తూ "ఆ రావణాసురుడంటే ఏమిటో మీకందరకు తెలియదు. వాడు సామాన్యుడు కాడు. శక్త్యుపాసకులుంటారు కొందరు మీలో. దేవి స్తోత్ర రత్నావళి తీసి చదివితే అందులో దేవి ఖడ్గమాల స్తోత్రమని ఉంది. తాదృశం ఖడ్గమాప్నోతి యేన హస్త స్థితేన వై, అష్టాదశ మహాద్వీప సమ్రాడ్భోక్తా భవిష్యతి. ఎవడు ఈ ఖడ్గమాల శక్తిని దేవతయినటువంటి అమ్మవారిని కొలుస్తాడో, వాడు సప్త ద్వీప అయిన వసుంధరకు సామ్రాజ్యం వహించేటటువంటి ఖడ్గమును పొందుతాడని దీని అర్థము. అదే ఖడ్గమాలా స్తోత్రము. ఏమంటుందో జాగ్రత్తగా చూడండి. తాదృశం ఖడ్గమాప్నోతి అని ఉన్నది. అది పొందుతాడు రావణాసురుడమ్మవారి నుండి. అప్పటినుండే రావణాసురునకు ఖడ్గ రావణుడని పేరు. వాడంతే కాదు. రావణాసురుడెటువంటి వాడంటే, వాడొక మంత్రాధి దేవత కూడా. ఇక్కడ ఒక చిన్న రహస్యం. భారత భాగవత రామాయణాలున్నాయి. అనేకమంది మహానుభావులు, ఋషులు ఉన్నారు. వశిష్ఠుని ప్రార్థించేందుకు వశిష్ఠ మంత్రము ఎక్కడన్నా ఉందా? చెప్పండి. విశ్వామిత్ర మంత్రముందా? లేదు. కానీ ఖడ్గ రావణ మంత్రముంది. ఇంత పురాణ జగత్తులోనూ రెండే రెండు మంత్రాలు ఉన్నాయి. ఒకటి ఖడ్గ రావణ మంత్రం. రెండవది కార్తవీర్యార్జున మంత్రం. ఖడ్గ రావణ మంత్రం జపిస్తే రావణాసురుడు ప్రత్యక్షమవుతాడు. ఇట్లా వాడొక మంత్రాధిదేవతన్నమాట. అంతేగాని రావణుడంటే మజాకాదు."**[27]అంటారు.

ఈ విషయాలను పరిశీలిస్తే మనకు తెలిసిన ***రావణుడు శివ భక్తుడు. రావణుని అంతరాలములోనున్నవాడు జీవుడు విష్ణు భక్తుడు.*** పై సాక్ష్యాలననసరించి రావణుడు ***తంత్రవేత్త, మహామంత్రవేత్త, మంత్రాధిదేవత, శక్త్యుపాసకుడు.***

ఈ విషయాలన్నింటినీ దృష్టిలో పెట్టుకుని రావణుని పాత్రను పరిశీలించవలసి ఉంది.

**ముక్తికై చేసిన కృత్యము :**

శ్రీరామజననమునకు మున్ను రావణుడు తన చావు కొరకు సంచరిస్తూ-

**దశకంఠుండు.....యొక్కనా డేకాంతంబున నొక్కరుండ కూరుచుండి తన జన్మంబునకుం జింతించుచు దనలోన (శ్రీకృ. రా, బాల, తృ, పుట 116-117)**

ఏకాంతమున ఒక్కడే కూర్చుని, తన జన్మను గురించి వేదన పడుతూ దీర్ఘాలోచనలో పడి తనలో తాను, బ్రహ్మ మానసపుత్రులైన సనకసనందాది మునుల శాపకారణంగా విష్ణు సాయుజ్యానికి దూరమై ఇన్ని ఇక్కట్లను ఎదుర్కోవలసివస్తుంది. ఆ హరికి శత్రువుగా మూడుజన్మలెత్తి ఆయన చేతిలోనే మరణిస్తే తిరిగి విష్ణు సాయుజ్యాన్ని పొందగలనని ఆ దేవదేవుడే వరాన్నిచ్చాడు కదా! అందువల్ల

**హరికి వేడిపుట్టునట్టి కార్యంబులు**
**చేసి కినుక వెంచి శీఘ్రకాల**
**మంద చావుకొఱకు మందు సంపాదించి**
**విడిచిపెట్టవలయు నొడలు వడిగ (శ్రీకృ. రా, బాల, తృ, పుట 116-117)**

ఆ హరికి క్రోధాన్ని కలిగించే పనులు చేసి, త్వరగా విముక్తిని పొందే ఉపాయాన్ని ఆలోచించి ఈ రాక్షస శరీరాన్ని త్యజించాలని అనుకుంటాడు.

**లోకరక్షకుండు నన్ను జంప రఘువంశంబున నవతరించు (శ్రీకృ. రా, బాల, తృ, పుట 116-117)**

లోకరక్షకుడైన ఆ శ్రీమహావిష్ణువు నన్ను చంపడానికి రఘువంశంలో అవతరించగలడని అనరణ్యుని శాపాన్ని బట్టి ముందుగానే ఊహిస్తాడు. ఆ దేవదేవునికి క్రోధాన్ని కలిగించాలనే వేదవతితో కఠినంగా వ్యవహరించినట్లు శ్రీకృష్ణ రామాయణములో వర్ణించబడింది. వైకుంఠ జీవుని వేదనపరంగా, రావణుడు కైవల్యాన్ని కోరి సీతాపహరణకు సిద్ధపడినట్లు తెలుస్తుంది. ఇలా చేయడం వల్ల రాముడు ఆగ్రహించి తనను వధించి తనకు ముక్తిని కలిగిస్తాడని భావించాడు. ఈ కోణంలో రావణుడు ముక్తిసాధన ప్రయత్నంలో ఉన్నాడని గ్రహించాలి.

ఇక వాల్మీకి రామాయణం ప్రకారం రావణుడు అపహరించిన ఆ **సీత** ఎవరంటే **బాల** శ్రీరాముని ఎడబాటును తట్టుకోలేక విలపిస్తున్న కౌసల్యను సుమంతుడు ఓదారుస్తూ, సీతారాముల వనవాసములో దైన్యము కనబడుటలేదని వారు ఎంతో ఆనందంగా ఉన్నారని తెలుపుతూ-

**బాలేవ రమతే సీతా బాలచంద్రనిభావనా/**
**రామా రామే హృధీనాత్మా విజనేపి వనే సతీ (శ్రీ.రా, అయోధ్య, 60 స,10)**

పూర్ణిమ నాటి చంద్రుని వలె ఆహ్లాదకరమైన ముఖ వికాసముగల సీతా మహాసాధ్వి తన మనసును రామునియందే నిలిపినదై ఆ నిర్జన వనములందున ఒక బాలిక వలె హాయిగా ఆనందించుచున్నది అని అంటాడు.

ఇక్కడ బాలచంద్రుని వంటి ముఖముతో శోభిల్లుతున్న సీతమ్మను బాల అనే శబ్దముతో సంబోధించాడు వాల్మీకి. లౌకికార్థములో ఇక్కడ బాల అనగా సీత. మంత్రార్థములో బాల అనగా బాలా త్రిపుర సుందరి/శక్తి. ఆ బాలా త్రిపుర సుందరి మహారణ్యాన్ని కూడా మధువనంగా భావించి విహరిస్తున్నదని గ్రహించాలి. శాక్తేయ సాంప్రదాయాన్ననుసరించి సీత అనగా శక్తిస్వరూపిణి. అట్టి సీతను అనగా శక్తిని కైవసం చేసుకోవడానికి శక్త్యుపాసకుడైన రావణుడు చేసిన ప్రయత్నమే సీతాపహరణం. ఇలా మంత్రశాస్త్రం ప్రకారం అన్వయించుకుంటే రావణుడనే సాధకుని చర్యలో లోపము లేదు. పైన చెప్పుకున్నట్లు ఆ వైకుంఠజీవుడు ముక్తిసాధనలో భాగంగా సీతాపహరణ చేశాడు కావున అదియును దోషముగా కనిపించదు. కానీ లౌకిక దృష్టితో చూస్తే రావణాసురుడు చేసింది దురాగతము. రావణుని పాత్రను ఆత్మజ్ఞానిగా చిత్రించవలసి ఉన్నది కావున శాస్త్రార్థాల పరంగానే శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి రావణుని పాత్రను తీర్చిదిద్దాడని గమనించాలి.

**రావణుని గుణాలు సీత పట్ల రావణుని మాతృభావం :**

శ్రీకృష్ణ రామాయణం ఉత్తరకాండలో, సీతారామ సంవాదము కనిపిస్తుంది. అందులో రావణుని యొక్క గుణములను సీతాదేవి ద్వారా పలికించిన సందర్భము

**...వీనివంక నాకు**
**బుత్ర భావంబునం జాలిపుట్టు వినుడు** **(శ్రీకృ. రా, ఉత్తర, ప్ర, 172 ప)**

క్రూరముగా, లోకాలను కకావికలము చేయు రావణుడు నన్ను పట్టుకుని లంకలో పెట్టినా అతని పట్ల నాకు పుత్ర భావము కలిగి జాలి కలిగినది.

ఋషివేషములో వచ్చి నన్ను అపహరించినది మొదలు ఏనాడు నాతో అసభ్యంగా ప్రవర్తించలేదు, లంకలో నా రక్షణకు తగిన ఏర్పాట్లు చేసి, నాకు ఏ ఇబ్బంది లేకుండా చూశాడని, బెదిరించడానికి ప్రయత్నించాడే గాని ఎన్నడు దుష్టత్వాన్ని ప్రదర్శించలేదని రావణుని గుణాలను గూర్చి సీత చెబుతూ

**ననుమాతృభావముం గొని**
**కనుగొనెనే కాని తప్పుగతి కేనాడున్**
**మనముం జేసి యెఱుంగడు**
**ఘనుండాతం డందు గాని ఖలుడన నయ్యెన్** **(శ్రీకృ. రా, ఉత్తర, ప్ర, 172 ప)**

నన్ను మాతృభావనతో చూసాడే కానీ, ఎన్నడు తప్పుగా చూడలేదని ఘనుడైన రావణుడు తనకు తానే స్వయంగా మూర్ఖుడయ్యాడని సీతమ్మ అంటుంది. ఘనుండాతం డందు గాని ఖలుడన నయ్యెన్ అనే పాదము విశేషంగా కనిపిస్తుంది. ముక్తిని కోరి నన్ను అపహరించి, తనను తాను రాక్షసునిగా లోకానికి చూపుకున్న వెఱ్ఱివాడు రావణుడని మాతృభావనతో సీత తెలిపినది.

సీతా రావణుల మధ్య మాతాపుత్రుల సంబంధం ఉన్నదనే భావనకు మాతృక వాల్మీకి రామాయణంలో నిగూఢంగా కనిపిస్తుంది.

సీతాపహరణ సమయంలో

**ఇత్యుక్త్వా మైథిలీం వాక్యం ప్రియార్హాం ప్రియవాదినీం**
**అభిగమ్య సుదుష్టాత్మా రాక్షసః కామమోహితః**
**జాగ్రాహ రావణః సీతాం బుధః ఖే రోహిణీమివ (శ్రీ.రా , అరణ్య, 49 స, 16 శ్లో)**

దుష్టాత్ముడైన ఆ రాక్షసుడు కామాతురుడై సముచితముగా, ధర్మబద్ధముగా మాట్లాడుతూ, గౌరవాదరములకు పాత్రురాలైన సీతాదేవిని సమీపించి, ఆకాశమున బుధుడు రోహిణి వలె ఆమెను పట్టుకొనెను.

ఈ అంశాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే, రోహిణి చంద్రుని భార్య. బుధుడు చంద్రుని యొక్క కుమారుడు. కనుక రోహిణి బుధునకు తల్లితో సమానురాలు. బుధుడు రోహిణి పట్ల మాతృభావనతో ఆమెను పూజించడానికి ఎలా సమీపిస్తాడో, అలా తన గృహమునందు నిలుపుకొని, తన ఇష్ట దేవత యనెడి బుద్ధితో పూజించుటకే రావణుడు సీతను పట్టుకొనెనని విశేషార్థములో చెప్పవచ్చు. ఈ అంశాన్ని జ్యోతిష్య శాస్త్ర పరంగా పరిశీలించినప్పుడు రోహిణికి అధిదేవత యైన బ్రహ్మ యుగ పరివర్తన దృష్టితో రావణుని బుద్ధిని/బుధున్ని ప్రేరేపించి సీత వద్దకు కొనివచ్చెనని గ్రహించవలసి ఉంది. విశేషార్థముతో చూసినప్పుడు శక్త్యుపాసకుడైన రావణుడు, శక్తి స్వరూపిణి యైన సీతను లంకకు తీసుకువెళ్ళి ఉపాసించాలని తలచాడు. ఇక జ్యోతిష్య శాస్త్ర పరంగా రావణుడు నిమిత్తమాత్రుడు.

ఆ విశేషార్థాన్ని ధృవీకరించే, వాల్మీకి సుందరకాండలోని శ్లోకాలు

రావణుడు సీతాదేవిని దర్శించే సన్నివేశము అపరరాత్రి యందు షడంగ వేద విద్వాంసుల బ్రహ్మ ఘోష విని మేల్కొని స్నానాదికాలు ముగించుకుని సీత వద్దకు వెళ్తున్న రావణుని వర్ణన

**చలాగ్ర ముకుట ప్రాంశుః చిత్రమాల్యాను లేపనః**
**రక్త మాల్యాంబర ధరం తప్తాంగద విభూషణం (శ్రీ.రా , సుందర, 22 స, 25 శ్లో)**

దృఢమైన కిరీటము చలించుచుండగా, రంగురంగుల మాలలను, మైపూతలను, ఎర్రని దండలను, ఎర్రని వస్త్రములను, మేలిమి బంగారు భుజకీర్తులను, ఆభరణములను రావణుడు ధరించియుండెను.

**సకుంకుమ విలేపనం అలికచుంబి కస్తూరికాం**
**సమందహసి తేక్షణాం సశర చాప పాశాంకుశాం**
**అశేషజన మోహినీం అరుణ మాల్య భూషాంబరాం**
**జపాకుసుమ భాసురం జపవిధౌ స్మరేదంబికామ్ (సౌభాగ్యభాస్కరభాష్యం - పుట 40)**

ఇది లలితాదేవి ధ్యాన శ్లోకం. దీనిని బట్టి ఎర్రని కుంకుమను, ఎర్రని మాలలను, ఎర్రని వస్త్రాలను ధరించి శక్త్యుపాసకులు శక్తిని దర్శించుకుని ఉపాసించేవారని అర్థమవుతుంది.

పై అంశాలను కలిపి చూస్తే అపరాత్రంలో రావణుడు సీతను దర్శించుకోవడానికి వచ్చిన సమయంలో అతని వేషధారణ శక్త్యుపాసకులు శక్తిని దర్శించుకుని, ఉపాసించే విధాన్ని తలపిస్తుంది. పైగా అపరరాత్రం శ్రీ షోడశీ

విద్యోపాసకులకు జప సమయం. ఈ విధంగా పరిశీలిస్తే శక్త్యుపాసకుడైన రావణుడు, సీతలో శక్తిని దర్శించాడని గ్రహించాలి.

ఇక మరొక శ్లోకంలో -

**మమహ్యసిత కేశాంతేత్రైలోక్య ప్రవరస్త్రియః**
**తాస్త్వాం పరిచరిష్యంతి శ్రియ మప్సరసో యథా** **(శ్రీ.రా , సుందర, 20 స, 32 శ్లో)**

లక్ష్మీదేవిని అప్సరసలు సేవించినట్లు, ముల్లోకాలలో ఉత్తమ స్థాయి నుండి వచ్చిన కాంతలు నిన్ను సేవిస్తారని రావణుడు, సీతతో అంటాడు. ఈ మాటలను బట్టి రావణుని లోపల నున్న వైకుంఠ జీవుడు సీతను లక్ష్మిగా గుర్తించినట్లు అర్థమవుతుంది.

ఇలా ఇరుపార్శ్వాలలో చూసినప్పుడు వైకుంఠ జీవుడైన రావణునికి లక్ష్మీదేవి అవతారమైన సీత పట్ల మాతృభావన ఉన్నదని, శక్త్యుపాసకుడైన రావణునికి శక్తి స్వరూపినియైన సీత పై మాతృభావన ఉన్నదని తెలుస్తుంది. ఇలా వాల్మీకిని లోనారసిలో చూస్తే శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి చేసిన ప్రతిపాదనకు వాల్మీకి రామాయణము మూలమని తెలుస్తుంది.

**రావణుని ఆత్మజ్ఞానము :**

రావణుడు అంతిమ యుద్ధము చేయబోయే ముందు మండోదరితో పలికిన పలుకుల్లో రావణుని జీవుని వేదన, ఆతని ఆత్మజ్ఞానము రూఢమవుతాయి.

పదివేల సంవత్సరాలుగా ఈ జన్మకు ఎప్పుడు ముక్తిలభిస్తుందా అని వేచి చూస్తున్నానని తన పూర్వ జన్మ వృత్తాంతమును మండోదరికి తెలిపి జానకిని అపహరించానని లోకము నన్ను నిందించును, మాతృభావనతో నేను జానకిని ఆదరించిన తీరు నాకు తెలుసని అంటూ

**ఎఱిగియె చేసితి నింతయు**
**నెఱుగదు జనకాత్మజాత నిందర యని నే**
**నెఱుగుదు రాముడు హరియని**
**యెఱుగుదు నాచావు నిక్కమే యని గఱితా** **(శ్రీకృ. రా, యుద్ధ, తృ, 286 ప)**

జనకాత్మజ లక్ష్మి అని నాకు తెలుసు, రాముడు హరి అని నాకు తెలుసు, నా చావు కూడా సత్యమని నాకు తెలుసు. ఇవన్నీ తెలిసే చేశానని తన నిశ్చయాన్ని మండోదరికి తెలుపుతాడు. ఇలా రావణుడు ఆత్మజ్ఞానముతో ముక్తిని కోరి ఇలాంటి కళంకాన్ని ఆపాదించుకున్నాడని శ్రీకృష్ణ రామాయణంలో వర్ణించబడింది. మండోదరితోనున్న ఈ సంభాషణకు మాతృక ఆధ్యాత్మరామాయణంలోని క్రింది శ్లోకాలు.

**విదార్యమాణో యాస్వామి తద్విష్ణోః పరమం పదమ్**
**జానామి రాఘవం విష్ణుం లక్ష్మీం జానామి జానకీమ్**
**జ్ఞాత్వేచ జానకీ సీతా మాయానీతా వనాద్బలాత్**
**రామేణ నిధనం ప్రాప్య యాస్యామీతి పరం పదమ్**

**విముచ్య త్వాం తు సంసారార్గమిష్యామి సహ ప్రియే**
**పరానందమయీ శుద్ధా సేవ్యతే యా ముముక్షుభిః**
**తాం గతిం తు గమిష్యామి హతో రామేణ సంయుగే**
**ప్రక్షాల్య కల్మషాణీగ ముక్తిం యాస్యామి దుర్లభామ్** **(అ.రా, యుద్ధ, 11 స, 57-60 శ్లో)**

లౌకికమైన దృష్టితో పరిశీలిస్తే రావణుడు దురాత్ముడు. అలౌకికమైన దృష్టితో పరిశీలిస్తే రావణుడు దురాత్ముడు కాడు. అందువల్ల రావణుని దోషరాహిత్యమును నిరూపించుటకు అలౌకిక దృష్టిలో రావణుని పాత్రను దర్శించి, నాటి కాలములో హెచ్చుచున్న ఆర్యద్రావిడ వైషమ్యాలను తగ్గించే ప్రయత్నము చేశారు కవిసార్వభౌములు. (ఈ విశ్లేషణ రామాయణాన్ని శాస్త్రాలసముచ్చయముగా చూపడానికే కానీ రావణుడు ఆదర్శమూర్తని చూపుటకు కాదు.) నిజానికి లౌకికాలౌకికమైన ఉభయ పార్శ్వాల నుండి రావణుడు ఏ విషయమందైనా ఆదర్శప్రాయుడు కాడు.

### 8.9. రజకుని ఉదంతము :

వాల్మీకి రామాయణం ఉత్తరకాండలో ఒక జానపదుడు శ్రీరామచంద్రుని నిందిస్తూ సీత పాతివ్రత్యాన్ని శంకిస్తాడు. ఈ విషయాన్ని వేగుల ద్వారా విన్న రాజారాముడు సీతను పరిత్యజిస్తాడు. సీతారాముల ఎడబాటునునది అమంగళకరమని ఇదున్న ఉత్తరకాండను తొలగించమన్న కృతిభర్త శ్రీ ఈదర వేంకట్రావు పంతులు అభ్యర్థనను కొంత వరకు మన్నించి సీతాపరిత్యాగము జరగలేదని సార్వభౌములు నూతనంగా సిద్ధాంతం చేయాలి. అలా చేయాలంటే సీతమ్మపై వచ్చిన అపవాదు అసత్యమని చూపవలసి ఉంది. ఈ విషయాలను దృష్టిలో ఉంచుకొని జనబాహుళ్యమున సీతాపరిత్యాగమునకు కారకుడు సీతమ్మపై అపవాదు వేసిన రజకుడు. అతన్ని నిర్దోషి అని నిరూపిస్తే సర్వజనామోదయోగ్యంగా ఉంటుందని రజకుని వృత్తాంతమున కొన్ని కల్పితాలు చేశారు.

భద్రుడనే చారుని ద్వారా శ్రీరామచంద్రుడు రజకుని వృత్తాంతాన్ని గురించి తెలుసుకుంటాడు. అందులో భాగంగా రజకుడు పులిసినకల్లు తాగి తన భార్యతో తగువులాడుతూ పొరుగింటికి వెళ్ళి వచ్చిననిన్ను ఏలుకోవడానికి నేను శ్రీరామచంద్రున్ని అనుకుంటున్నావా! శత్రువు ఇంటనున్న భార్యను తెచ్చి ఆయన ఏలుకుంటున్నాడేమో కానీ పొరుగింటికి వెళ్లి వచ్చిన నిన్ను నేను ఏలుకోనని వీధిలో అరుస్తుండగా నేను విన్నానని భద్రుడు శ్రీరామునితో అంటాడు. ఆగ్రహించిన శ్రీరామచంద్రుడు ఆ రజకుని పిలిచి విచారించగా ఆ రజకుడు కల్లు త్రాగి ఒడలు తెలియక ప్రవర్తిస్తూ, నేలపై పొర్లాడేవాడని, గోచి కూడా కట్టుకోకుండా తిరిగేవాడని, స్మశానంలో సంచరించేవాడని అతని ఆగడాలన్నీ తెలుసుకుంటాడు. అప్పుడు వశిష్ఠవామదేవాదులతో ఏర్పాటు చేసిన ధర్మాసనం

**వీడు వేదురు నిశ్చయం బింక వీని వీడుట పోలు నే**
**నాడు నేని ధరాత్మజామణి వంక వంక సుమంతయే**
**గూడి యుండు నటంచు బల్కగ గూళయై పచరించునో**
**వీడు డిట్టివిచార మింకిట వెళ్లు లీ రని యెంచెదన్** **(శ్రీకృ. రా, ఉత్తర, ప్ర, 84 ప)**

రజకుని చేష్టలను గమనించి, ఇతనిని విచారించి వ్యర్థమని ఈ రజకుడొక వెట్టివాడని తీర్పును ఇస్తారు. తద్వారా వెట్టివాని మాటలు పరిగణించరాదని, అగ్నిపరీక్షను ఎదుర్కొన్న సీతలో దోషము లేదని

**బ్రహ్మదేవుడు శివుడు నప్పట్ల వచ్చి**
**నీదునర్ధాంగి యెన్న నయ్యాదిలక్ష్మి**
**యామెయెడ నావగింజంత యైన దోష**
**ముండు నని చెప్ప డెట్టి మూర్ఖుండు గాని** **(శ్రీకృ. రా, ఉత్తర, ప్ర, 86 ప)**

ఆ సమయంలో బ్రహ్మదేవుడు, శివుడే వచ్చి సాక్ష్యమిచ్చారని. నీ భార్యయైన సీత సాక్షాత్ ఆదిలక్ష్మియని ఆమెలో ఆవగింజంతైనా దోషముండదని చెప్పి. మూర్ఖులే ఇలా వాదిస్తారని రామచంద్రునికి హితవు పలుకుతారు. ఈ మాటలు విన్న రామచంద్రుడు వెట్టివాడిని శిక్షించరాదని తలచి అతనికి తగిన వైద్యము చేయించమని ఆదేశించి, తిరిగి వెళ్తాడు. ఇలా రజకుడు వెట్టితో చేసిన కృత్యము కావున అతను నిర్దోషని ఈ రామాయణంలో నిరూపించారు.

### 8.10. శంబుకుని గాథ:

ఉత్తర రామాయణంలో శంబుకవధ జాతివైరములను కలిగించే ఘట్టము. గ్రంథకర్తయైన వాల్మీకినే గాక వశిష్ఠాదులను చివరకు శ్రీరామచంద్రుని కూడా అపనిందలకు గురిచేసిన ఘట్టమిది. ఇలాంటి కథలు పరస్పర విద్వేషాలను పెంచుతాయి. జనశ్రుతిలో నున్న ఈ శంబుక వధ ప్రక్షిప్తమని కొందరి భావన. ఏది ఏమైనా కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి 1920 లోనే ప్రకటించిన శంబుకవధ శ్రీరామచంద్రుని ధార్మిక నడవడిని ప్రశ్నించింది. ఈ శంబుక వధలోని ధర్మాన్ని చెప్ప ప్రయత్నిస్తే ఉద్వేగములో నున్న సమాజము అర్థము చేసుకునే పరిస్థితిలో లేదు. అందువల్ల కవివిమర్శకులైన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి తన రామాయణములో రాముడు శంబుకుని వధించక అతని తపస్సుకు మాత్రమే విఘ్నము కలిగించినట్లు రచించి వర్గ వైషమ్యాలను తగ్గించే ప్రయత్నం చేశారు.

వాస్తవానికి వాల్మీకి రామాయణంలో ఏమున్నది అని మొదట ఒకసారి పరిశీలిద్దాం. శ్రీరామచంద్రుడు రాజ్యము చేస్తున్న సమయంలో పదునాలుగు సంవత్సరములైన నిండని బ్రాహ్మణ బాలుడు మృత్యువాత పడడంతో, ఆ బాలుని తండ్రైన వృద్ధబ్రాహ్మణుడు తన పుత్రుని కళేబరాన్ని శ్రీరామచంద్రుని కొలువులోకి తెచ్చి నీ రామ రాజ్యములో ఇట్టి ఉత్పాతములు ఎందుకు జరుగుతున్నవో గ్రహించమని, రాజుగా నీయందు ధర్మ లోపమున్నదని శ్రీరామచంద్రుని నిందుసభలో మాటలంటాడు. ఆ సందర్భములో నారదుడు విచ్చేసి చతుర్యుగ ధర్మాలను గూర్చి శ్రీరామునకు బోధిస్తూ తపస్సు ఎవరు చేయాలి, ఎవరు చేయకూడదు అనే విషయాలను చెబుతూ, ఒక శూద్రుడు తపస్సు చేయడం వల్ల రాజ్యపాలనలో ధర్మలోపము జరిగి ఆ బ్రాహ్మణ బాలుడు హతుడైనట్లు తెలుపుతాడు.

తపస్సు విషయంలో నారదుడు చెప్పిన ధర్మము

**త్రేతాయుగే చ వర్తంతే బ్రాహ్మణాః క్షత్రియాశ్చ యే**
**తపో తప్యంత తే సర్వే శుశ్రూషామ్ అపరే జనాః** **(శ్రీ.రా , ఉత్తర, 74 స, 20 శ్లో)**

త్రేతాయుగములో బ్రాహ్మణులు, క్షత్రియులు మాత్రమే తపమాచరించుటకు అర్హులు. ఇతర వర్ణముల వారు అనగా వైశ్యులు, శూద్రులు వారికి సేవలు చేస్తుంటారు.

**స్వధర్మః పరమస్తేషాం వైశ్యశూద్రం సమాగతమ్**
**పూజాం చ సర్వవర్ణానాం శూద్రాశ్చక్రుర్విశేషతఃల్** **(శ్రీ.రా , ఉత్తర, 74 స, 21 శ్లో)**

వైశ్య శూద్రులకు ఈ సేవా ధర్మమే స్వధర్మముగా పరిగణించబడింది. వైశ్యులకు మాత్రము శుశ్రూష కంటే వ్యవసాయము వాణిజ్యము పరమధర్మములు. అలాగే శూద్రులకు పై మూడు వర్ణాల వారిని సేవించుటయే స్వధర్మము. ఈ స్వధర్మాచరణయే వారికి తపస్సు వంటిది.

**భవిష్యచ్ఛూద్రయోన్యాం వై తపశ్చర్యా కలౌ యుగే**
**అధర్మః పరమో రాజన్ ద్వాపరే శూద్రజన్మనః** **(శ్రీ.రా , ఉత్తర, 74 స, 27 శ్లో)**

రాబోయే కలియుగములో మాత్రము శూద్రులకు కూడా తపశ్చర్య ప్రవృత్తి ఏర్పడుతుంది. కానీ ద్వాపర యుగములో మాత్రం శూద్రులు తపస్సు చేయుట ఏమాత్రం ధర్మము కాదు.

పై మాటలను బట్టి త్రేతాయుగ ధర్మాన్ననుసరించి శూద్రుడు తపస్సు చేయకూడదు. కలియుగంలో మాత్రం ఆ ప్రవృత్తి శూద్రులకు అలవడుతుందన్నారు.

శ్రీరాముడు పుష్పక విమానాన్ని అధిరోహించి ధర్మ విరుద్ధంగా తపస్సు చేస్తున్న ఆ శూద్రున్ని అన్వేషించసాగాడు. అప్పుడు శైవళ పర్వతమునకు ఉత్తర భాగంలో ఒక సరస్సు వద్ద అధోముఖుడై కఠోర తపస్సు చేస్తున్న ఒక తాపసిని చూసి అతన్ని సమీపించి నీవెవరవు, ఎందుకు తపస్సు చేస్తున్నావని అడగగా ఆ తాపసి

**శూద్రయోన్యాం ప్రసూతో స్మి శంబూకో నామ నామతః**
**దైవత్వం ప్రార్థయే రామ సశరీరో మహాశయః**
**న మిథ్యాహం వదే రామ దేవలోకజిగీషయా**
**శూద్రం మాం విద్ధి కాకుత్ స్థ తప ఉగ్రం సమాస్థితమ్** **(శ్రీ.రా , ఉత్తర, 76 స, 2,3 శ్లో)**

శ్రీరామా! నేను శూద్రజాతి యందు జన్మించినవాడను. నా పేరు శంబుకుడు. ఈ శరీరము తోడనే దివ్యత్వమును పొంది, నిజానికి దేవలోకమును జయించదలచి ఇట్టి ఉగ్రమైన తపస్సు చేస్తున్నానని పలుకుతాడు. ఆ మాటలను విన్న శ్రీరామచంద్రుడు వెంటనే తన కరవాలముతో ఆ శంబుకుని శిరస్సును ఖండిస్తాడు.

ఇది త్రేతాయుగము నాటి రాజధర్మము. ఆనాటి ధర్మాన్ననుసరించి శ్రీరాముడు చేసిన పని ధర్మమే! ఇక ఆ శంబుకుని తపస్సు యొక్క లక్ష్యము సశరీరముగా స్వర్గానికి వెళ్ళుట. ఇట్టి ప్రయత్నమునే శ్రీరామచంద్రుని పూర్వీకుడైన త్రిశంకుడు చేయదలచి విఫలుడైనాడు. ఇక వాస్తవానికి శంబుకుడు ఆశించిన ప్రయోజనము దేవలోకముపైన ఆధిపత్యం. ఈ ప్రయోజనాన్ని సాధారణంగా రాక్షసులు ఆకాంక్షిస్తారు. దీనిని బట్టి శంబుకునిలో రాక్షస ప్రవృత్తి కూడా ఉన్నదని తెలుస్తుంది. పైగా శ్రీరాముని చేత వధింపబడటము చేత ఈ శంబుకునికి ఉత్తమ గతులే దక్కాయి. ఈ వృత్తాంతాన్ని అర్థం చేసుకోవడానికి నిష్పాక్షిక బుద్ధి అత్యావశ్యకము. అది లేకున్నా శంబుక వధ అధర్మమనే అనిపిస్తుంది. దీనిని అర్థమయ్యేలా చెప్పడం అంత సులభమైన పని కాదు కావున కొందరు ప్రాజ్ఞులు కూడా ఇది కల్పితమని అంటారు. కానీ స్వామి కర్పాత్రీజీ మహరాజ్ రచించిన రామాయణ్ మీమాంస్ లో ఉత్తరకాండ వాల్మీకి రామాయణము లోనిదేనని నిరూపించబడింది.

ఈ శంబుకుని వృత్తాంతాన్ని కవి సార్వభౌములు యథాతథంగా స్వీకరించి చివరలో-

**నా పేరు శంబూకుం డనిన రామచంద్రుండు నీవు శూద్రుండవై మహర్షులలో నగ్రగణ్యులు పొనర్పం దగుదుష్కరతపంబు పొనర్చుచుంటి విది ధర్మవిప్లవంబు నేను దశరథాత్మజుం డగు రామభద్రుండ దీని నిప్పుడ విడనాడి స్వధర్మనిరతుండ వగు మట్లుకాని నాడు నిన్ను శిక్షింతు ననిన శంబూకుం డొండాడ నోడి తన మనోరథం బంతయు నింతటిలోనం జంపికొని నిష్ఠయు నియమంబును విడనాడి శుద్రధర్మం బంగీకరించి రామునిపాదరవిందముల కభివందనం బాచరించి చనియె రాముండు నిట్లు వాని తపోభంగంబు గావించి నిజపురంబునకు నిర్గమించె నప్పుడాశూద్రుండు స్వధర్మనిరతుండయ్యెనంత నావిప్రబాలుండు పునర్జీవితుండయ్యె దాన నయ్యెడ మహోత్సవంబు సాకేతపురంబునం బ్రవర్తిల్లె నక్కాలంబున రామచంద్రుడు. (శ్రీకృ. రా, ఉత్తర, ప్ర, 215 ప)**

శూద్రుడవైన నీవు మహర్షులు చేసే విధంగా ఇంతటి దుష్కరమైన తపస్సును చేయడము ధర్మాతిక్రమునకు తావిస్తుంది. నీవు నీ స్వధర్మాన్ని పాటించకుంటే శిక్షార్హుడవవుతావని రామచంద్రుడు శంబుకున్ని హెచ్చరించగా, తపస్సు చేయాలనే తన కోరికను చంపుకుని శంబుకుడు తన స్వధర్మాన్ని అంగీకరించి, శ్రీరామచంద్రునికి పాదాభివందనం చేస్తాడు. ఇలా శంబుకుని తపస్సును భంగము చేసి శ్రీరాముడు తిరిగి వెళ్ళగా, శూద్రుడైన శంబుకుడు తపస్సును విడనాడి తన స్వధర్మాన్ని ఆచరించడం వల్ల రాజ్యమున ధర్మము పునరుద్ధరించబడి ఆ బ్రాహ్మణ బాలుడు పునర్జీవితుడవుతాడు. ఇలా సర్వజనామోదంగా శంబుకుని ఉదంతాన్ని తీర్చిదిద్దారు.

## 9. ముగింపు:

తెలుగునాట రామాయణము పైనున్న అపవాదులను తొలగించడానికి, జాతి వైషమ్యాలను రూపుమాపడానికి, ప్రజలలో సమైక్యతను పెంపొందించడానికి సమన్వయ సిద్ధాంత ప్రాతిపాదికన కవిసార్వభౌములు రచించిన శ్రీకృష్ణరామాయణము వారి లక్ష్యాలకు అనుగుణంగా నడిచిందని శ్రీకృష్ణ రామాయణాన్ని అధ్యయనం చేయడం వల్ల అర్థమవుతుంది. తెలుగు ప్రజల నాడిని పట్టుకున్న శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రికి ఏ పాత్రను ఏ విధంగా చూపితే సమన్వయము జరుగుతుందని బాగుగా తెలుసు. అందువల్ల తనకున్న అలౌకికమైన ప్రజ్ఞతో లౌకికమైన దృష్టితో కొన్ని సమన్వయాలను, ఆత్మతత్త్వపరంగా మరికొన్ని సమన్వయాలను చేస్తూనే వారికున్న శ్రౌతస్మార్త పాండిత్యాన్ని, శాస్త్ర పరిజ్ఞానాన్ని ఇందులో నిక్షిప్తము చేశారు. అలాగే పాఠకుల సౌలభ్యము కొరకు రామాయణ పాత్రలన్నింటినీ బాలకాండలోనే పరిచయము చేసి కథాగమనాన్ని ఒక క్రమ పద్ధతిలో నడిపించారు. నన్నయాదుల శైలీ గాంభీర్యము వీరి శైలిలో కనబడదు. కానీ పదబంధ నేర్పరులైన వీరి పద్యాలలో చక్కని ధార ఉంది. బహుశా కృతిభర్త అభ్యర్థన మేరకే ఇట్టి సులభశైలిని వీరు అవలంబించి యుండవచ్చు.

ద్విశతాధిక గ్రంథకర్తయై, అనేకానేక బిరుదులను, సత్కారాలను పొందిన కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గూర్చి పెక్కురకు తెలియకుండుట విచారకరము. ఏది ఏమైనా సాహిత్యానురక్తితో కాక భుక్తి కొరకు సాహిత్యాధ్యయనము చేస్తున్న కాలమిది. ఇట్టి అధునాతన కాలంలో విశ్వవిద్యాలయాలు చొరవ తీసుకుని వీరి సాహిత్యాన్ని పాఠ్యాంశాలలో చేరిస్తే తెలుగుతల్లికి ఎనలేని సేవ చేసిన కవిసార్వభౌముని పట్ల కనీసము కృతజ్ఞతను చూపినట్లవుతుంది. చివరగా వీరిచే నానా ఇక్కట్లను ఎదుర్కొన్న పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రే వీరిని పొగుడుతూ

***"బిల్హణీయమున ఛాందసునకు గవితాకన్య సంకోచపడుచు దూరముగా దొలదొలగునని వ్రాసియుండెనేకాని కృష్ణమూర్తిశాస్త్రి గారిని కవితాకన్యక వరించి శోభించినది"*** [28] అనడం కొసమెరుపు. వేదశ్రౌతస్మార్తధర్మశాస్త్రములందు పరిపూర్ణ సాధికారతనార్జించి, ఆర్ష వాఙ్మయానికి పరిపూర్ణ విధేయుడైయుండి తన సునిశిత విమర్శతో కవి విమర్శక లోకాన్ని శాసించిన గంభీరస్వభావిలో కోమల కవితా విలాసిని ఆరాధించే మృదు స్వభావముండుట విశేషము. ఇలా గంభీరమైన విమర్శను చేయడం, మరొప్రక్క అదే స్థాయిలో మధుర సాహిత్య సృజన చేయడం కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రికే చెల్లింది.

## శ్రీకృష్ణరామాయణముపై చేయదగిన పరిశోధనలు:

1. శ్రీకృష్ణరామాయణము, రంగనాథ రామాయణము తులనాత్మక అధ్యయనం
2. శ్రీకృష్ణరామాయణము, భాస్కర రామాయణము తులనాత్మక అధ్యయనం
3. శ్రీకృష్ణరామాయణము, ఆధ్యాత్మ రామాయణము (కాణాదం పెద్దన సోమయాజి) తులనాత్మక అధ్యయనం

## శ్రీకృష్ణ రామాయణము పై రాయదగిన కొన్ని వ్యాసాలు :

1. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి రామాయణ అనువాద పద్ధతి
2. శ్రీకృష్ణ రామాయణ కూర్పు లీనియర్ పద్ధతి
3. శ్రీకృష్ణ రామాయణము పైన ఆధ్యాత్మరామాయణ ప్రభావము
4. శ్రీకృష్ణ రామాయణంలో జనశ్రుతులు
5. శ్రీకృష్ణ రామాయణంలో పురాణ ప్రస్తావనలు
6. శ్రీకృష్ణ రామాయణములో అవాల్మీకాంశాలు
7. శ్రీకృష్ణ రామాయణములో వర్ణనలు
8. శ్రీకృష్ణ రామాయణంలో యుద్ధ పద్ధతులు
9. శ్రీకృష్ణ రామాయణములో శ్రౌత సంబంధ విశేషాలు
10. శ్రీకృష్ణ రామాయణములోని అశ్వమేధము కవి సార్వభౌముని శ్రౌతపాండిత్యము
11. శ్రీకృష్ణ రామాయణము, రంగనాథ రామాయణము లోని అవాల్మీకాలు, సామ్యాలు
12. శ్రీకృష్ణ రామాయణము, రామాయణ కల్పవృక్షములో యజ్ఞ సంబంధ విశేషాలు, తులనాత్మక పరిశీలన

## సంకేత పదాలు :

*శ్రీ.రా - శ్రీమద్రామాయణము, ఆ.రా - ఆధ్యాత్మరామాయణము, శ్రీ.కృ.రా - శ్రీకృష్ణ రామాయణము, బాల - బాలకాండము, ఆయోధ్య - అయోధ్యాకాండము, అరణ్య - అరణ్యాకాండము, సుందర - సుందరకాండము, యుద్ధ - యుద్ధకాండము, ఉత్తర - ఉత్తరకాండము,ప్ర - ప్రథమాశ్వాసము, ద్వి - ద్వితీయాశ్వాసము, తృ - తృతీయా శ్వాసము, స - సర్గ, శ్లో - శ్లోకం, ప - పద్యం.*

## 10. పాదసూచికలు:

1. శ్రీకృష్ణ స్వీయచరిత్రము - పుట 6
2. శ్రీకృష్ణ స్వీయచరిత్రము - పుట 115
3. శ్రీకృష్ణ కవి జీవితము- పుట 115
4. విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన - పుట 149
5. తెలుగులో రామాయణాలు - పుట 16
6. కావ్యమీమాంసా - పుట 18,19
7. స్కంద పురాణాంతర్గత శ్రీమద్రామాయణ మహాత్మ్యమ్ - మొదటి అధ్యాయం - 20వ శ్లోకము
8. రామాయణ పరమార్థము - పుట 51,52
9. అనేక రామాయణాలు, పుట 12
10. అనేక రామాయణాలు, పుట 12,13
11. రామోపాఖ్యానము-తద్విమర్శనము, పుట 3
12. సంస్కృత వాఙ్మయ చరిత్ర, ద్వితీయ సంపుటము - పుట 39-43
13. శ్రీమద్రామాయణము - బాలకాండ, నాలుగవ సర్గ, 8వ శ్లోకము
14. ముగ్గురు సుందరుల కథ, పుట 10,11
15. విచిత్ర రామాయణము, పుట 5
16. తెలుగులో రామాయణాలు - పుట 17
17. తెలుగులో రామాయణాలు - పుట 17-18
18. పుల్లెల వారి ప్రస్తావనలు, పుట 527
19. పుల్లెల వారి ప్రస్తావనలు, పుట 527,28
20. అశ్వ పరీక్ష, పుట 28
21. అశ్వలక్షణసారసంగ్రహము, ప్రథమాశ్వాసము, పుట 31
22. అశ్వలక్షణసారసంగ్రహము, ప్రథమాశ్వాసము, పుట 32
23. అశ్వ పరీక్ష, పుట 30
24. అశ్వ పరీక్ష, పుట 44
25. సంస్కృత వాఙ్మయ సమీక్ష - పుట 120
26. శ్రీ విశ్వనాథ సాహిత్యోపన్యాసాలు - పుట 53
27. శ్రీ విశ్వనాథ సాహిత్యోపన్యాసాలు - పుట 51
28. మహాభారత చరిత్రము, పుట xxxix

